# సంగీత సరస్వతి జీవన పల్లవి

భారతీయ సంగీత వినీలాకాశంలో ఒక ధ్రువతారగా వెలిగిన సంగీత సామ్రాజ్ఞి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి జీవన మాధుర్య కావ్యానికి శ్రావ్యమైన, స్పష్టమైన అక్షరాకృతి కల్పించాలన్న సంకల్పంతో శ్రీమతి పల్లవి గత 8సం॥లుగా సుదీర్ఘంగా ఒక యజ్ఞసమానంగా కృషి చేసింది.

ప్రముఖులైన వ్యక్తుల జీవన చిత్రపటాన్ని ఆవిష్కరించడం వేయేండ్ల తపస్సులాంటిది. శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి గారు సంగీత సామ్రాజ్ఞిగా సాగించిన జీవనగమనాన్ని విశ్లేషించడంలో శ్రీమతి పల్లవి తనదైన శైలిని, ప్రతిభని ఆవిష్కరించారు. ఆ మహా సంగీత సామ్రాజ్ఞి అదృశ్యపార్శ్వాలను గుర్తించి వాటిని సంభాషణల పరంగా కాకుండా సంఘటన, సందర్భాల పరంగా సుబ్బలక్ష్మిగారి కదలికల ద్వారా, ముఖ కవళికల ద్వారా పాఠకుల మనసులో ముద్రవేసే ప్రయత్నం చేసింది. సుబ్బలక్ష్మి సంగీత ప్రపంచంలో అధిరోహించిన శిఖరాలు అనన్య సామాన్యం. ఆమె వ్యక్తిత్వం కూడా అంతటి సమున్నత స్థాయిలో కొనసాగింది. సర్వ సుఖదుఃఖాలలో సమభావం, సహనం, ద్వేష రాహిత్యం, మైత్రి, కరుణ, ప్రాపంచిక ఆకర్షణలపట్ల విముఖత వంటి అనేక సద్గుణాల రాశి ఈ సంగీత సామ్రాజ్ఞి. ఆమెలోని భారతీయ తత్వచింతన, సామాజిక స్పృహ, ఈశ్వరాభిముఖమైన అంతర్దృష్టి వంటి గుణసంపత్తిని శ్రీమతి పల్లవి అద్భుతంగా ఆవిష్కరించారు. ఆ మహాగాయని కంఠంలోని సప్తస్వర రాగాలను సప్తవర్ణశోభితంగా ఆమె ముఖవర్చస్సుపై తీర్చిదిద్దారు.

ఆ మహాగాయని పాడుతుంటే ఆమె వదనంలో చెరగని ప్రశాంతత, మెరిసే ప్రసన్నత లాస్యం చేస్తుంటాయి. రాగాలాపన, కీర్తన, నెరవు, స్వరకల్పన ఏ ప్రక్రియ అయినా సరే నాదసౌందర్యంతో గుబాళిస్తుంది. కర్ణాటక సంగీతంలో తలమానికమైన "పల్లవి"ని పాడటంలో ఆమె తల్లి ప్రత్యేక శిక్షణను ఇప్పించారు. "పల్లవి" పాడటమంటే పాండిత్య ప్రకర్షతో కూడిన పని. నిర్దిష్టమైన లయజ్ఞానం, ధారణశక్తి కలిగి ఉండాలి. "పల్లవి"ని అంతగా సాధన చేసి వశం చేసుకున్న శ్రీమతి సుబ్బలక్ష్మిగారి జీవితాన్ని, దైవికంగా మతి పల్లవి తన రచనతోనే రసావిష్కరణం చేసింది.



సుబ్బలక్ష్మిగారి జీవనయానంలో సంగీత పరంగా ఎన్ని శిఖరాలు అధిరోహించినా, తన వారు, తన ఊరు, తన కుటుంబసభ్యుల పరంగా ఎంతో కోల్పోయింది. ఆ విషాదరసం శ్రీమతి పల్లవి రచనలో అద్భుతంగా ఒలికింది. మనస్వినికి దుఃఖం కూడా వరం; కన్నీరు కావ్యానికి రసద్రవ్యం. ఇవి గుర్తెరిగి శ్రీమతి పల్లవి తన రచనా శైలిని రసప్లావితంగా నడిపించారు. ఈ జీవితచరిత్ర ఆసాంతం చదివిన తర్వాత, శ్రీమతి సుబ్బలక్ష్మి ఒక యోగినిలా తన జీవితాన్ని ఆ సంగీత సరస్వతీ మాతకే సమర్పించిందన్న గొప్ప అనుభూతి కలుగుతుంది.

ఆవిడ మధురంగా గానం చేసిన సుప్రభాతాలు మన యిలవేల్పులైన శివకేశవులకు మేలుకొలుపులయ్యాయి. ఆమె భక్తి శ్రద్ధలతో గానం చేసిన ఆదిశంకరుల భజగోవిందం స్తోత్రాలు మహాశివుని కంఠంలో రుద్రాక్షలుగా భాసిల్లాయి. ఆమె మధురభక్తితో గానం చేసిన మీరా భజనలు, బాలగోపాలునికి వెన్నముద్దలుగా అందాయి. పాడిన ప్రతి పాటలోను, ప్రతి స్తోత్రంలోను, ప్రతి కీర్తనలోను ఆ మహాతల్లి తన ఆత్మను సంపూర్ణంగా ఆవిష్కరించింది.

సుబ్బలక్ష్మి తన గాత్ర సౌరభంతో అనేక సామాజిక కార్యక్రమాలకు ధనం ప్రోగు చేయగలిగి ధన్యురాలైంది. తన కచ్చేరీల ద్వారా పోగైన డబ్బులను 90శాతం సామాజిక అవసరాలకే వితరణచేసింది. అదీ, అప్పటికప్పుడే కచ్చేరి కాగానే దానసమర్పణం చేసింది. ఆమె భక్తి సంగీతం ప్రతి ఇంట భక్తులకు, దైవానికి వారధి అయింది. ఆమె దేవ భావదూతిక, కంఠంలో మాధుర్యం, ముఖంలో నిర్మలత్వం, వెరసి ధీరగంభీర గోదావరిగా మనకు సాక్షాత్కరిస్తుంది. ఇలాంటి గొప్ప చిత్రాన్ని మనోఫలకంపై ముద్రించడానికి శ్రీమతి పల్లవి చేసిన కృషి అనితర సాధ్యం. అనన్యసామాన్యం.

సరస్వతి ప్రతిరూపమైన శ్రీమతి సుబ్బలక్ష్మి దివ్యాత్మ, శ్రీమతి పల్లవిని ఏ దివ్యలోకాలనుంచైనా తప్పక ఆశీర్వదిస్తుంది.

ఇంత గొప్ప పుస్తకాన్ని నా పూజ్య తల్లిదండ్రులకు అంకితం యివ్వడానికి కారణం, తనకు వారిపై ఉన్న అపారమైన వాత్సల్యం, నా యెడల ఉన్న ఔదార్యం. శ్రీమతి పల్లవికి నా కృతజ్ఞతాభివందనాలు.

హైదరాబాద్

11-02-2017

–వరప్రసాద్ రెడ్డి

# రచయిత్రి మాట

పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనం' శంకరాచార్య విరచిత భజగోవిందం స్తోత్రంలోని ఈ పదాలు నాకు ఒకరోజు వున్నట్టుండి స్ఫురణకొచ్చాయి. అదే ఆలాపనైంది. వినే ప్రయత్నం చేయగా అంతర్జాలంలో ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిగారు ఈ పాట పాడుతుంటే వినటం, చూడటం ఒకేసారి జరిగాయి. ఆమెలోని తేజస్సు ఆమె గురించి ఇంకా తెలుసుకునేలా చేసింది. తెలుసుకున్న తర్వాత ఆమె కథ అందరికీ చెప్పదగినదనిపించింది. ఇది 2009లో. అప్పటిదాకా నాకు ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మిగారంటే ఎక్కడో మబ్బుల్లో భగవంతుని ముందు కూర్చుని భక్తితో, పరవశంతో పాడుకునే దివ్యమూర్తి. అప్పటి నుంచి బాగా మచ్చిక చేసుకుని 'సుబ్బమ్మ' అని పిలుచుకునే చనువు సంపాదించుకున్నాను. అప్పటికిగానీ పుస్తకంలో మొదటి అక్షరం కాగితం మీద పడలేదు, ఇది 2013లో. మొత్తంమీద ఏడేళ్లకు, 2016లో పుస్తకం పూర్తి చేయగలిగాను. ఇన్నేళ్లు నావి  నా సుబ్బమ్మవే. మా చెలిమికి పరాకాష్ఠ, నా ఒక కలలో ఈ పుస్తకానికి తన ఆమోదం తెలపటం.

ఈ ఏడేళ్ల సుబ్బలక్ష్మి 88 సంవత్సరాల జీవితంలోని ప్రతి పుటనీ స్పర్శించే ప్రయత్నం చేసుకుంటూ వచ్చాను. కొన్ని పుటలు సమాచార గనులైతే చాలా పుటలు తెల్లకాగితాలే. ఎందుకంటే సుబ్బలక్ష్మి చుట్టూ సదాశివం నిర్మించిన కోట, కోటరీ ఇప్పటికీ అభేద్యమైనవే. ఆ కోటరీ ఆంక్షలకు అనుగుణంగా కాకుండా నేను తెలుసుకున్న సుబ్బలక్ష్మికే ఈ పుస్తకంలో పెద్ద పీట వేశాను. సుబ్బలక్ష్మిది చీకూచింతాలేని బాల్యం, అభద్రతా భావనల కౌమార్యం, నవరసభరితమైన తదుపరి దశ, భక్తి, తృప్తి, సంతోషాల శేషజీవిత రాగమాలిక. ఏ రాగాన్ని నిర్దిష్టంగా కాగితం మీద వ్రాయలేము. అలాగే సుబ్బలక్ష్మి జీవితం కూడా. సుబ్బలక్ష్మి మూడింతల జీవితం సదాశివం నిర్మించిన కోటలోనే గడిచిందిగాన, నా మాటలు ఆ కోటని దాటలేకపోయాయి. ఈ లోపాన్ని సహృదయంతో స్వీకరించమని మనవి.

పుణ్యదంపతులు శ్రీమతి శాంతమ్మ, శ్రీ వేంకటరమణారెడ్డిగార్లలో, నాకు శ్రీమతి శాంతమ్మగారి పరిచయ భాగ్యం లభించింది. వారు సుబ్బలక్ష్మిగారిలానే రెండు ముక్కుపుడకలతో, నుదిటి మీద పెద్ద బొట్టుతో ఎంతో కళగా వుండేవారు. అంతే గొప్ప వ్యక్తిత్వంగలవారు. వారి కుమారులైన శాంతా బయోటెక్నిక్స్ లిమిటెడ్ వ్యవస్థాపకులు శ్రీ వరప్రసాద్ రెడ్డిగారు, "అమ్మా! నేనొక పరిశ్రమ పెట్టదలుచుకుంటున్నానమ్మా" అని చెపితే, "పదిమందికీ మంచి చేసే పరిశ్రమనే మొదలుపెట్టు నాయనా" అని దిశానిర్దేశం చేసిన మాతృమూర్తి. శ్రీమతి శాంతమ్మ గారు 2016 మే 23న భగవంతునిలో ఏకమయ్యారు. వారిని స్మరించుకుంటూ, 'సుస్వరాల లక్ష్మి M.S. సుబ్బలక్ష్మి' రచనను ఈ పుణ్యదంపతులకు అంకితం చేయగలగటం ఒక చిన్న సాంత్వనము.



సుబ్బలక్ష్మిగారి కుటుంబంతో ప్రత్యక్షంగా నలభై ఏళ్ల అనుబంధం వున్న శ్రీ వామనరావుగారు ఈ రచన రూపుదిద్దుకోవటానికి సహాయపడితే, ఈ రచన పుస్తకంగా మీ చేతిలో ఉండటానికి కారణం శ్రీ వరప్రసాద్ రెడ్డి, శ్రీమతి వసంతగార్లు, వీరికి సర్వదా కృతజ్ఞురాలుని.

ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిగారు వారి జీవితాంతం చేసిన కచేరీలకు టిక్కెట్ల రూపంలో వచ్చే ఆదాయాన్ని మంచి పనులకు వితరణ చేసేవారు. వారిని అనుసరిస్తూ, వారి జీవితంపై వచ్చిన ఈ పుస్తకానికి వచ్చే మొత్తంలో సగ భాగం సుబ్బలక్ష్మిగారికి ప్రీతిపాత్రమైన శ్రీ కంచి పరమాచార్య మణిమంటపానికి, వామనరావుగారు పేద విద్యార్థులకోసం నడుపుతున్న రిషి యు.బి.ఆర్. సుశీల మెమోరియల్ పాఠశాలకు ఇవ్వ నిశ్చయించాను.

ఈ రచనను మొదటిసారిగా సమీక్షించి, ప్రోత్సహించిన సి. రవీంద్రకుమార్ (విశ్రాంత వృక్షశాస్త్ర అధ్యాపకులు, చీరాల) మరియు సజ్జ రాధ, చివరిగా ఇంకొక్కసారి సమీక్షించిన సుబ్బలక్ష్మిగారి వీరాభిమాని, శ్రీ మోదుగుల రవికృష్ణలకు (తెలుగు అధ్యాపకులు, ఆర్.వి.ఆర్.బి.ఎడ్. కళాశాల, గుంటూరు) కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. శ్రీ వామనరావుగారు, శ్రీ వరప్రసాద్ రెడ్డిగారు ఈ ఇద్దరి మహానుభావుల మధ్యన నాకు ఎంతోమంది ఈ పుస్తక రచనలో సహాయపడ్డారు. వీరిలో మా అమ్మాయి ప్రణతి, అబ్బాయిలు ఆకాష్, పృథ్వీ కూడా వున్నారు. వీరికి నా ఆశీస్సులు. పృథ్వీ ఈ పుస్తకంలోని 'మధుర మీనాక్షి అమ్మవారు', 'మీనాక్షి సుందరేశ్వరుల కల్యాణ ఘట్టం' రేఖాచిత్రాలు వేసి ఇచ్చాడు. ఇతరులందరికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

అంతర్జాలంలో ఉన్న ఎమ్.ఎస్.గారి ఫోటోలు ఈ పుస్తకంలో ప్రచురించేందుకు అనుమతించిన శ్రీ శ్రీనివాసన్ విశ్వనాథన్ (శ్రీమతి సుబ్బలక్ష్మిగారి మనుమడు, శ్రీమతి రాధ కుమారుడు) శ్రీమతి గౌరి రామ్‌నారాయణ్, శ్రీమతి లక్ష్మి విశ్వనాథన్, శ్రీమతి వాసంతి సుందరం, హైరేంజ్ ఫోటోగ్రఫి.కామ్ శ్రీ ఇయాన్ లాక్‌వుడ్, కల్కి పత్రిక (చెన్నై) యాజమాన్యం మరియు శ్రుతి ఫౌండేషన్‌లకు కూడా నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి అసామాన్యమైన స్త్రీ మూర్తి, ఆమె గొప్ప వ్యక్తిత్వం మానవమాత్రులలో చాలా అరుదైనది. ఈ పుస్తకం ద్వారా పాఠకులు శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిగారి జీవనయానంలోని ఔన్నత్యాన్ని తెలుసుకుంటారని, ఆమె పాటలో సేదతీరుతూ, ఆమె పాటను ముందు తరాలకు పరిచయం చేస్తారని ఆశిస్తూ....

హైదరాబాద్

23-12-2016

– పల్లవి

# The Voice immortal

I am no musician, but I am a lover of good music in whatever language. I like a sweet voice and thus I am an admirer of M.S. Subbalakshmi, a family friend. Her husband Sri T. Sadasivam her mentor who shaped her in every way was a good friend of Khasa Subbarao my father-in-law and Rajaji. In fact Sadasivam built an annex for Khasa in the Kalki Gardens where he spent his last years as editor of Swarajya.

Our relationship was so close sometimes objectivity is apt to color our judgement. When Mrs. Sarojini Naidu was requested to commend the music of Jyothika Roy a great singer, she said, "I have already written in admiration of her music, how could I do it?"

"Who am I? a mere prime minister before you, the queen of song." is the highest tribute that came from Sri Jawaharlal Nehru before vast audience at which MS sang in a mellifluous voice. The entire Nehru family was her admirers and Mrs. Indira Gandhi listened to her with great admiration. Sadasivam was not only her husband but moulder of one of the greatest musicians who shone in any platform in various countries of the world including United Nations. She was applauded by great world musicians.

As freedom fighter who passed through the fire of suffering, Sri Sadasivam came into close contact with leaders particularly like Rajaji as Khadi salesman. Their close friendship was lasting. Sri



Sadasivam did all he could to preserve MS's ethereal voice and physical form, her divinely voice into immortal one. Gandhi listened to her music at her young age but suggested to put some Bhakthi into it. Later MS became soaked in Bhakthi. Her mellifluous voice became immortal.

The President A.P.J Abdul Kalam began his day at Rastrapathi Bhavan with hearing MS's record of Sri Venkateswara Suprabhatham. In fact he led the funeral procession of MS coming all the way to Chennai.

Admirers of MS was a legion. She had a large following. Her sweet voice became immortal.

Pallavi came to the public eye by her publication of the fascinating book on Mahanati Savitri, the celebrated film star, the book was sponsored by Sri Vara Prasad Reddy who is also sponsoring this voluminous book on MS, 'Suswaraala Lakshmi MS Subbalakshmi'.

I as an old MS fan wish the book a success.

Hyderabad
06-12-2016

P. Vamana Rao
Editor: New Swatantra Times,
Ex-Chief of the Hindu News Bureau, Hyderabad,
Director of Information, P.R. Films and Tourism,
Joint Secretary A.P. Govt. (*Retd.*)

# రాగం-తానం-పల్లవి

ఇదొక జీవనరాగం. విశ్వవిఖ్యాత కర్ణాటక సంగీత విద్వాంసురాలు శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి జీవితం ఆధారంగా శ్రీమతి పల్లవి రచించిన నవల.

కథ 1922లో షణ్ముగవడివు మధుర మీనాక్షి దేవాలయ దర్శనంతో మొదలౌతుంది. ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి తొలిదశలో చలనచిత్ర నటిగా మీరా వంటి చిత్రాలలో నటించింది. తర్వాత సదాశివంతో వివాహమై జీవితంలో స్థిరపడిన తర్వాత కచ్చేరీలకే పరిమితమైంది. ఆమె కేవలం గాయని మాత్రమే కాదు, మానవీయమైన సుగుణసంపత్తి గల వ్యక్తి - పారగాన్ ఆఫ్ వర్చూస్ అంటారు. ఒక సంగీత సామ్రాజ్ఞి జీవితాన్ని హృద్యంగా వచన కథాకావ్యంగా తీసుకుని రావడం కష్టతరమైన పనియే. ఎందుకంటే ఇందులో కల్పనకు తావులేదు. ఉన్నది ఉన్నట్లు చెప్పాలి. అందులోని సాధక బాధకాలు రచయిత్రికే తెలుసు. పల్లవి లోగడ మహానటి సావిత్రి జీవిత చరిత్రను రచించింది. పుస్తకాలు హాట్‌కేకుల్లా అమ్ముడుపోయాయి. ఆరేడు ముద్రణలకు నోచుకుంది. అందులో కథ 'చిత్ర' విచిత్ర గతులతో నడుస్తుంది. ఇందులో అలా ఉండదు. ఇదొక గంధర్వలోకం. రచయిత్రి ప్రతిభా విశేషముతోనే కథాకథనం రాణించాలి. అందులో ఈమె కృతార్థురాలయింది. అందుకు మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. సుబ్బలక్ష్మి రాగము, సదాశివం తానం, రచయిత్రి పల్లవి. మధ్యలో నా అనుపల్లవి అవసరం లేదు. అయినా ఆమె కోరికను కాదనలేక ఈ నాలుగు మాటలు వ్రాశాను. సుబ్బలక్ష్మి గారిని నేను ప్రత్యక్షంగా చూడకపోయినా ఆమె విష్ణుసహస్రనామం వంటి రికార్డులు విన్నాను. ఆమెలో ఒక పరవశం ఉన్నది. పర-వశం ఉన్నది. సుబ్బలక్ష్మిగారి జీవితంపై వచ్చిన సమగ్ర ప్రామాణిక పరిశోధనా గ్రంథం ఇది.



లోగడ సుబ్బులక్ష్మిగారు ఎన్నో సత్కారాలు పొందారు. మెగసెసే పురస్కారంతో పాటు భారతరత్న కూడా అందుకున్నారు. నిజానికి ఇది వ్యక్తిగతంగా ఆమెకు ఇచ్చిన సత్కారం కన్నా భారతీయ సంగీతానికి దక్కిన గౌరవం అనవచ్చు. అవిచ్ఛిన్నమైన సామగాన పరంపరకు ఈమె ఒక ఆధునిక వాహిక. సంగీతం వలన సకలరోగాలు నయం చేయవచ్చునని భారతీయులు గ్రహించారు. నాదోపాసనచే చిరాయువులైన వారెందరో మహానుభావులున్నారు. ఈ రవం ఒక గౌరవం.

సుబ్బలక్ష్మిని భారతజాతి మరచిపోదు, పల్లవిని పాఠకులు మర్చిపోరు. ఎందుకంటే సుస్వరాల భాసురాల సుబ్బలక్ష్మిని అక్షరాలతో పల్లవింపచేసి, వికసింపచేసి, కుసుమింపచేసి, ఫలింపచేసిన ఘనత పల్లవికే దక్కుతుంది. ఇది ఆమె చేసుకొన్న అదృష్టం. అభీష్టరచనపై ఇంతకన్నా ప్రశంస అక్కరలేదు. తినబోతూ రుచి అడగడం ఎందుకు? సుబ్బలక్ష్మి జీవిత పరిణామం - పరిణాహం తెలుసుకోవాలంటే ఆమె జీవితం ఆద్యంతం చదవాల్సిందే! ఈ పుస్తకం అన్య (అన్ని) భాషలలోకి అనువదించబడాలి.

పల్లవికి శుభాశీస్సులు.

**ముదిగొండ శివప్రసాద్**
(చారిత్రక నవలా చక్రవర్తి)

హైదరాబాద్
08-12-2016





1922 వ సంవత్సరం భాద్రపద మాసాన మధురపురి మీనాక్షి అమ్మవారి కోవెల తూర్పు రాజగోపురంవైపు ఒక చిన్నపాటి సైన్యం చొచ్చుకొస్తోంది. చొరబాటులు ఈ దేవళానికి క్రొత్త కాదు. చివరి చొరబాటుని తట్టుకొని నిలిచినందుకు నలుదిక్కులా నాలుగు ఘనమైన రాజగోపురాలు వెలిశాయి. ఇప్పుడు వడివడిగా వస్తున్న సైన్యం మాత్రం తలపడడానికి రావటంలేదు. తల దించుకొని కోవెలలోని అమ్మవారికి నాలుగు తలపులు విన్నవించుకోవటానికి వస్తోంది. ఈ సైన్యానికి అధిపతి ఒక బక్కపల్చని, ముప్పైమూడేళ్ల షణ్ముగవడివు. ఆమె ఆయుధం చేతిలోని మధురపురి మల్లెలు, కోవెలలోని దైవం మీనాక్షి అమ్మవారిపట్ల అచంచలమైన విశ్వాసం.

షణ్ముగవడివు ముందు నడవగా, ఆమె వెనుక తమ్ముడు షణ్ముగసుందరం, అతని కుటుంబం, తరువాత వరుసకి తమ్ముడైన మణిపిళ్లై, అతని భార్య, ఇంకా షణ్ముగవడివు మేనమామ అత్త వస్తున్నారు. ఇంతమంది వున్నా ఎవ్వరి చేతులు ఖాళీగా లేవు. షణ్ముగసుందరం రెండు చేతులకూ పనిచెప్తూ, అతనితో షణ్ముగవడివు తొమ్మిదేళ్ల కొడుకు శక్తివేల్, షణ్ముగసుందరం భార్య చంకన వారి చంటిపిల్లాడు, మణిపిళ్లై చేతుల్లో కదంబం, అతని భార్య ఒక చేతిలో టెంకాయ, ఇంకో చేతిలో షణ్ముగవడివు చిన్న కూతురు నాలుగేళ్ల వడివాంబ. ఇక ఎవ్వరి అజమాయిషీ లేకుండా చెంగుచెంగున వెళ్తోంది షణ్ముగవడివు పెద్ద కూతురైన ఆరేళ్ల పాప. ఈరోజు కోవెలకి వేకువజామునే వస్తున్నదీ ఈ పాప కోసమే. వీరి ఇల్లు మీనాక్షి సుందరేశ్వర ఆలయానికి చాలా దగ్గరగా, అంటే ఆలయ ధ్వజస్తంభానికున్న గంటల చప్పుళ్లు కూడా వీరి వీనులకు చేరేంత దగ్గరగా వుంటుంది. వీరికి ఈ దేవళం సొంత ఇంటి తర్వాత సొంతిల్లు అంత. వాళ్ల ఇంటి సందులోంచి బయటికి వచ్చి కుడివైపు తిరగ్గానే మీనాక్షి సుందరేశ్వర ఆలయ పడమర రాజగోపురం ఠీవిగా కనిపిస్తూ స్వాగతం పలుకుతుంటుంది. ఈ చిన్నారి ఆ స్వాగతాన్ని అందిపుచ్చుకొని, నిత్యపూజా సమయానికి, ఊరేగింపులకి, తన ఆట పాటలకి ప్రతిరోజూ ఎన్నోసార్లు ఆలయానికి వచ్చి వెళ్తూ వుంటుంది. ఎప్పుడు వచ్చినా, ఎన్నిసార్లు వచ్చినా గర్భగుడిలో అమ్మవారి చల్లని చూపులు పాప సొంతం, పాప హక్కు

మామూలుగా అయితే వారి ఇంటి సందులోంచి బయటికి వచ్చి పడమర రాజగోపురం నుండి ఆలయంలోకి రావచ్చు. కానీ ఈ రోజు ఈ కుటుంబానికి చాలా

ముఖ్యమైన రోజు. తరతరాలుగా వారి కళలే వారికి ప్రాణమైపోయిన ఈ దేవదాసి కుటుంబాలలోనుంచి ఇంకొక అమ్మాయి కళలకు అంకితమవ్వబోతుంది. గురుముఖతా స ప స లు నేర్చుకోబోతోంది. దానికి ముందు ఈ విషయం అమ్మవారికి చెప్పుకొని, దీవెనలు పొందటానికి వస్తున్నారు. అలాంటప్పుడు ఆలయ ఆచారం ప్రకారం తూర్పు దిక్కు నుంచి ప్రవేశించాలి. తూర్పు రాజగోపురం కాకుండా ప్రక్కనే ఇంకొక ద్వారం నుంచి ప్రవేశిస్తే నేరుగా అమ్మవారి సన్నిధికి వెళ్లవచ్చు.

ఆ కోవెలంతా తనదేనన్న ధీమాతో పాప ఉత్సాహంగా ముందు నడుస్తూ తన వారిని నడిపిస్తోంది.

తూర్పు ద్వారం నుంచి అష్టశక్తి మంటపంలోకి ప్రవేశించారు. ఈ మంటపంలో అష్టశక్తులు ఉత్తర, దక్షిణాన చెరి నలుగురై బ్రహ్మాండమైన శిల్ప రూపాలలో కొలువై వున్నారు. పాప మొదట ఉత్తరాన యజ్ఞరూపిణిని పలుకరించి, దక్షిణంవైపు వెళ్లి కౌమారిని తాకి, మళ్లీ ఉత్తరంవైపు వెళ్లి శ్యామలను స్పృశించి ఇలా వంకరటింకరగా తిరుగుతూ అష్టశక్తులను తనలో కలుపుకొని, శతాబ్దాల చరిత్రను, అంతకంటే పురాతనమైన స్థల పురాణాలను నిక్షిప్తం చేసుకొని వున్న మంటపాలను, ద్వారాలను, గోపురాలను పైన చిలుకలు తాకుతూ ఎగురుతుంటే, క్రింద పాప వీటిని ఆనందంగా దాటుకుంటూ ఆలయ పుష్కరిణి స్వర్ణకమల సరోవరంకి చేరుకుంది. అప్పటిదాకా చీకటి వెలుగులతో దోబూచులాడిన ఆలయం మొదటిసారిగా ఆ ఉదయం వెలుగుని అందుకుంది. ఆ విశాలమైన దీర్ఘచతురస్రాకార కొలనులో నాలుగు దిక్కులా వెలుగు జలపాతమై జారగా, ఆ కాంతి నీటికి పాకి, కొలనులోని సువర్ణ కమలం మరింత కాంతులీనింది. పాప క్షణం ఆలస్యం చేయకుండా కొలను మెట్లు దిగి నీటిని నెత్తిమీద జల్లుకొని పైకి వచ్చి, పట్టరాని సంతోషాన్ని వెదజల్లుతూ కోనేరు చుట్టూ ఒక చుట్టు చుట్టి అప్పుడే అక్కడకు వచ్చిన తనవారి ముందు నిలబడింది. ఆ తూర్పు దిక్కు నుండి కనబడే అమ్మవారి గర్భగృహ విమానానికి నమస్కరించుకొని అందరూ కలిసి కోనేటిచుట్టూ నడుస్తున్నప్పుడు, తొలి కిరణాల సాంగత్యంతో శోభ సంతరించుకొని నిన్నటికంటే ఈరోజు అందంగా కనిపిస్తున్న గోపురాలని చూస్తూ, వారి నడక నెమ్మదించింది.

పుష్కరిణి దక్షిణ ప్రాకారం చివరికి చేరేసరికి, అప్పుడే దక్షిణ రాజగోపురం గుండా ప్రవేశించి, అమ్మవారి సన్నిధికి వెళ్తున్న స్త్రీల సమూహాన్ని పాప గుర్తుపట్టింది. గబుక్కున వెళ్లి అమ్మ వెనక దాక్కుంది. వారు అభినయ నైవేద్యం సమర్పించటానికి వస్తున్న ఆలయ దేవదాసీలు.

"షణ్ముగం! పూజకి వచ్చారా? పెద్దపిల్లకేగా సంగీతం? ఏమ్మా! చిన్నదానికైనా అభినయం నేర్పిస్తావా? వేరుగా అమ్మవారి సేవలో వుంటుందిగా మాలాగా" అంది ఒక దేవదాసి.



చిరునవ్వే షణ్ముగవడివు సమాధానం.

"తొందరగా వెళ్లండి. అయ్యంగారు దారిలో కనిపించారు మాకు. ఆయన ఈపాటికి ఇంటికి వెళ్లిపోయుంటారు" అంటూ పాపవైపు వచ్చి, "బాగా నేర్చుకోమ్మా, మీ గురువుగారు మాకూ నేర్పారు. బాగా నేర్పిస్తారు" అంటూ తలా ఒక చెయ్యివేసి, ఒకరిద్దరు రెండు చేతులూ వేసి పాప లేత బుగ్గలను లాగి, గిల్లి, నలిపి, పండిన జామపండులాగా తెల్లగా ఉండే మొహాన్ని ఎర్రని జామపండులా చేసి ఆ స్త్రీలు ముందుకు సాగిపోయారు. వాళ్లని కాస్త దూరం పోనిచ్చిన తర్వాత పాప లేడిపిల్లలా చెంగున ముందుకు గెంతింది అమ్మ వెనుక నుంచి.

ఈ పుష్కరిణి పడమర ప్రాకారంలోని ఉయ్యాల మంటపంలో అంతకు ముందు రోజు సాయంత్రం అమ్మవారు, స్వామివారు ఊగిన ఉయ్యాలను మరోసారి ఊపి, పాప చిలుకల మంటపంలోకి వచ్చింది. మీనాక్షి అమ్మవారు శుకపాణి. అందుకని ఇక్కడ చాలా రకాల మేలు జాతి చిలుకలను పెంచుతారు. ఈ మంటపంలో వున్న చిలుకలకు ఆలయ ఓటువార్లు మీనాక్షి అమ్మవారికున్న నామాలన్నీ పలకటం నేర్పిస్తారు.

షణ్ముగవడివు బృందం చిలుకల మంటపం దాటి అమ్మవారి సన్నిధి తూర్పుగోపురం ముందు నిలబడింది. ఒక్కసారి అందరూ వున్నారో లేరోనని కలియచూసింది షణ్ముగవడివు. అసలు పిల్లే లేదు.

"అమ్మా! నాకు తెలుసు చెల్లి ఎక్కడ వుంటుందో, తీసుకొస్తానుండు" అంటూ శక్తివేల్ వెనక్కి పరిగెత్తాడు.

పాప చిలుకల మంటపం దగ్గర ఆగిపోయింది. చిలుకల చేత అమ్మవారి పేరు చెప్పిస్తోంది. అక్కడికి వచ్చిన శక్తివేల్ వెనుక నుంచి గట్టిగా అరచి, ఏకకాలంలో పాపని, చిలుకలని బెదరగొట్టాడు. చిలుకలు అటువైపు ఎగిరిపోయాయి. పాప ఇటువైపు తిరిగి "అన్నా! ఏంటిది?" అంటూ కోప్పడింది. అన్న ఏమి వినిపించుకోలేదు. "రా! అమ్మ నీకోసం చూస్తుంది" అంటూ చెల్లి చేయి పట్టుకొని చరాచరా అమ్మ దగ్గరకు లాక్కెళ్లాడు.

షణ్ముగవడివు ఇక్కడ నుంచి పాపను పట్టుకొని గోపురం దాటి, అందరితో అమ్మవారి సన్నిధిలోకి ప్రవేశించింది. ఎదురుగా వున్న ధ్వజస్తంభానికి నమస్కరించుకొని, ఆగ్నేయ మూల ఆలయానికి ఇప్పటి రూపునిచ్చిన తిరుమల నాయకుడు సతులసమేతంగా విగ్రహరూపుడై వుండగా తల్లీకూతుళ్లు మెచ్చుకోలుగా చూస్తూ ముందుకు కదిలారు. నైరుతిన గోలు మంటపం నవరాత్రుల కోసం ముస్తాబవుతోంది. అమ్మవారి నామస్మరణతో ప్రదక్షిణ పూర్తిచేసి మహామంటపంలోకి ప్రవేశించారు.

మహామంటపం, ఆలయం మొత్తానికీ అత్యంత ప్రాశస్త్యం కలిగిన ప్రదేశం.

మహామంటపానికి మొదట వున్న ఆరు స్తంభాల వీరం అమ్మవారి నిజ దర్శనానికి వేదిక అని చరిత్ర చెబుతుంది.

దీపాల కాంతితో మహామంటపం స్వర్ణరంజితమై ఉంది. అక్కడ వున్న శిల్పాలు చైతన్యం పొంది అమ్మవారి ముందు వినమ్రతతో నిల్చొని వున్నట్లు గోచరిస్తుంది. మహామంటపంలో అడుగు పెట్టగానే గంధం, కుంకుమ, కర్పూరపు పరిమళాలు గుప్పుమంటున్నాయి. మహామంటపం పడమర భాగాన అర్థమంటపంలోని గర్భగుడిలో మీనాక్షీ అమ్మవారు నయనానందకరంగా అలంకృతులై జగద్రక్షణకై, భక్తపోషణకై కొలువుదీరారు. ఆలయ పట్టారులు అమ్మవారిని స్తోత్రించుతూ పూజాపునస్కారాలలో మమేకమైయున్నారు. మహామంటపం అంతా ఆధ్యాత్మిక సౌందర్యంతో వెల్లివిరిస్తోంది. ఈ సమయాన షణ్ముగవడివు పాపని పొదివి పట్టుకొని తెచ్చి అమ్మవారి ముందు నిలబెట్టింది. ముకుళిత హస్తాలతో వంగి అమ్మవైపు దృష్టిసారించింది. పట్టారు అమ్మవారికి హారతి ఇస్తున్నప్పుడు అమ్మవారి రూపు ఇంకా స్పష్టంగా కనిపిస్తుంది. మీనలోచనాలు దివ్యసౌందర్యంతో అలరారుతున్నాయి. హారతి వెలుగులో అమ్మవారి ముక్కుపుడక తళుక్కుమంటుంది. పాప కళ్లు విప్పార్చి అమ్మవారిని చూస్తుండగా అమ్మవారి ప్రేమభరితమైన చూపు తనమీద ప్రసరిస్తుండటం గమనించింది. అంతే ప్రేమతో అమ్మవారిని చూస్తూ మురిసిపోయింది. షణ్ముగవడివు ఇంకా వేడుకోలులోనే వుంది.

చ. కోరివచ్చిన వారికెల్లను
కోర్కెలొసగే బిరుదుగదా అంబ అతి
భారమా నన్ను బ్రోవ తల్లి
కృపాలవాల నే తాళజాలనే

ప. సరోజ దళనేత్రి
హిమగిరి పుత్రి
నీ పదాంబుజములె సదానమ్మినానమ్మ
శుభమిమ్మ శ్రీమీనాక్షమ్మ

*కర్ణాటక సంగీత రత్నత్రయంలోని శ్రీ శ్యామశాస్త్రి (1762-1827) కృతి,*
*రాగం-శంకరాభరణం, తాళం-ఆది*

అమ్మలను కన్న అమ్మ జగదాంబచే అనుగ్రహింపబడి, పాప సుందరేశ్వరుని దర్శనానికి స్వామి సన్నిధి వైపు పరుగుతీసింది. విశాలమైన స్వామి సన్నిధిలో పిల్లలందరూ పరుగులందుకున్నారు. స్వామి సన్నిధి వెలుపలి ప్రాకారంలోని కమ్బత్తడి మంటపంలో చెక్కివున్న సుందరేశ్వరుని వివిధ రూపాలను చూస్తూ పాప మీనాక్షీ అమ్మవారి కల్యాణ



ఘట్టం చెక్కియున్న చోటుకు చేరింది. విష్ణువు సమక్షంలో, చిరునగవుతో వున్న మీనాక్షి పరమశివుని పరిణయమాడుతున్న ముచ్చట చూస్తూ వుంది. ఇంతలో అన్న మళ్లీ వచ్చాడు. నువ్వు రావల్సిందే అన్నట్లు. అన్న ఉద్దేశం తెలిసి పాప మొహం తిప్పుకుంది. అన్న మాత్రం "అందరూ నీకోసమే చూస్తున్నారు" అంటూ చెల్లి చెయ్యి పట్టుకొని లాక్కెళ్లాడు.

స్వామి సన్నిధి లోపలి ప్రాకారంలోకి అందరితో కలిసి అడుగుపెట్టింది పాప. ప్రాకార ప్రదక్షిణ చేస్తూ అరవైముగ్గురు నాయనార్లకు నమస్కరించుకొని, స్వామి సన్నిధిలోని ఆరుకాళ్ల మంటపం దగ్గరకు చేరారు. ఇంకాస్త ముందుకెళ్లి స్వయంభూలింగాకారంలో ఉన్న సుందరేశ్వరుణ్ణి దర్శించుకున్నారు. అమ్మవారి దగ్గర విన్నవించిన వేడుకోలు మళ్లీ స్వామి దగ్గర మొరపెట్టుకుంది షణ్ముగవడివు.

మీనాక్షీ సుందరేశ్వరుల దర్శన భాగ్యం మినహాయిస్తే పాపకు ఈ కోవెలలో ఎన్నో ఆకర్షణలు వున్నాయి. వాటిలో ఒకదానివైపు పరుగుతీసింది. సుందరేశ్వరుని సన్నిధి బయట, కాస్త ఎత్తుగా వున్న రాతిఫలకం ఒకటుంది. పాప త్వరగా వచ్చి దానిమీద నుంచుంది. అక్కడ నుంచి పై కప్పుకు వున్న ఒక చిన్న రంధ్రం నుంచి చూస్తే సుందరేశ్వరుని గర్భగుడి విమానం కనిపిస్తుంది. కానీ పాప ఎత్తుకు విమానం కనిపించటంలేదు. మునివేళ్లమీద నించుని ప్రయత్నిస్తుంది. పాప కష్టం చూసి మణిపిళ్లై భార్య పాపను ఎత్తుకుంది. ఆ రంధ్రం నుంచి విమానం మీద పడే సూర్యకిరణాలు పరావర్తనం చెంది, పాపమీద ప్రసరించాయి. మేలిమి బంగరు ఛాయలో వున్న కిరణాలు పాపను పూర్తిగా ముంచెత్తగా, పాప దివ్యతేజస్సుతో వెలిగింది.

కాసేపటికి షణ్ముగవడివు వడివడిగా వస్తూ పాప జబ్బ పట్టుకొని స్వామిసన్నిధి బయటకు కదిలింది. పాపను పట్టుకునేప్పుడే షణ్ముగవడివు కూడా ఒకసారి పైకి రంధ్రంలోకి చూసింది. సూర్యకిరణాల రంగు, తీవ్రత చూసి ఎంత పొద్దెక్కిందో ఒక అంచనాకి వచ్చింది. అందరినీ త్వరగా రమ్మని తొందరపెట్టింది. కమ్బత్తడి మంటపానికి తూర్పున గోపురం దాటి వసంతరాయ మంటపంలోకి వచ్చి అందరూ చతికిలబడ్డారు.

షణ్ముగవడివు అప్పుడు గమనించింది, అక్కడ కొడుకు శక్తివేల్ లేడు. "వీడు స్వామి దర్శనానికి కూడా వచ్చినట్లు లేదు. వెళ్లి దర్శనం చేయించి తీసుకురా తమ్ముడూ, తొందరగా" అంటూ షణ్ముగసుందరాన్ని పురమాయించింది.

తన కుటుంబసభ్యులను ఒకరి తర్వాత ఒకరిని చూసుకుంటూ వుంది. చివరిగా పాపమీద చూపువాల్చింది. 'నా బాధ్యతలూ దీనివే, నా సంగీతమూ దీనిదే', అని అనుకుంటూ కూతురిని పిలిచి ఒళ్లో కూర్చోబెట్టుకుని ముద్దుపెట్టుకుంది. ఇంతలో షణ్ముగసుందరం శక్తివేల్‌ని తీసుకొచ్చాడు. మరొక్కసారి మీనాక్షీ సుందరేశ్వరులకు



మీనాక్షీ అమ్మవారు



మీనాక్షీ సుందరేశ్వరుల కళ్యాణం



మధుర మీనాక్షి అమ్మవారి ఆలయంలో నాలుగు వైపుల ప్రాకారాలతో సర్వకళల సన్నిధి

©Ian Lockwood



నమస్కరించుకొని అందరూ కలసి పడమర రాజగోపురం ద్వారా ఆలయం బయటికి వచ్చి, ఇంకాస్త దూరం నడిచి వారి ఇంటి సందు మొదలున ఆగి పాపను, శక్తివేల్‌ని మినహా అందరినీ ఇంటికి వెళ్లమంది షణ్ముగవడివు. "అందరికీ నీరన్నం పోసిపెట్టు" అని ముటిపిళ్లై భార్యకి చెప్పింది. ఈ ముగ్గురికి గుడిలో ప్రసాదాలే ఈ పూట తిండి. "గురువుగారి దగ్గర బాగా నేర్చుకోమ్మా" అంటూ పెద్దవాళ్లందరూ పాప భుజం తట్టారు. ఇక ముగ్గురూ శ్రీనివాస అయ్యంగార్ ఇంటికి బయలుదేరారు. ఆయన ఇల్లు ఉత్తర వెలి వీథిలో వున్న సేతుపతి బడిదగ్గర. మరీ దగ్గర కాదు, మరీ దూరం కాదు. కానీ ఇప్పటి పరిస్థితుల్లో దూరమే మరి.

ఆలయం లోపలన్నా షణ్ముగవడివు కాస్త తలెత్తుతుంది కాని బయట వీథిలోకి వస్తే ఇక తల లేవదు. ఆమె గొప్ప వైణికురాలే కానీ మదురై వీథుల్లో ఆమెకు ఇంకో అస్తిత్వం వుంది, దాని పర్యవసానంగా వీలైనంతవరకూ తలెత్తకుండానే సాగిపోతుంది. ఇక పాప బిడియస్తురాలు. వాళ్ల ఇంటిలో, గుడిలోనే రెక్కలు విప్పుకున్న విహంగం. బయట, మనుషుల మధ్య ముడుచుకుపోతుంది. ఇప్పుడు పడమర రాజగోపురం వీథిలో షణ్ముగవడివు నిండుగా కొంగు కప్పుకుని నడవగా, పాప అమ్మ చేయి గట్టిగా పట్టుకోగా ఇద్దరూ ఒక్కటై నడుస్తున్నారు.

'ఇప్పటికే చాలా ఆలస్యమయింది. అయ్యంగార్ ముందే చెప్పారు. తొందరగా రండి, వూళ్లోకి పేరున్న సంగీతజ్ఞులు వచ్చారు. వారిని కలవటానికి వెళ్లాలి అని.' అది తలుచుకుంటూ షణ్ముగవడివు గాబరా పడిపోతోంది. 'ఇప్పటిదాకా అంతా బాగానే జరిగింది, స్వామి, అమ్మవార్ల దర్శనం పూలు, పండ్లు, టెంకాయల నైవేద్యంతో చక్కగా జరిగింది. గురువు గారి దగ్గర పూజకు కూడా పూలు, అరటిపండ్లు, ఒక టెంకాయ కొన్నాం... తీరా అక్కడికి వెళ్లాక ఆయన లేకపోతే...' అలా తలచబోయి మానుకుంది షణ్ముగవడివు. 'ఇప్పుడు తొందరగా వెళ్లాలి అంతే' అనుకుంది. పరుగులాంటి నడకందుకుంది. పిల్లలు పరుగెత్తాల్సొస్తుంది. "అమ్మా! గుర్రబ్బండి ఎక్కుదాం. తొందరగా వెళ్లొచ్చమ్మా" అన్నాడు శక్తివేల్.

"నా దగ్గర ఇప్పుడు డబ్బులు లేవురా, నడిచి వెళ్లాల్సిందే" అంది షణ్ముగవడివు తలెత్తకుండా. చేతిలోనే కాదు ఇంటిలో కూడా చిల్లిగవ్వ లేదు. షణ్ముగవడివుకి వాళ్లమ్మ అక్కమ్మ పోయిన దగ్గర నుంచి గడ్డుకాలం నడుస్తోంది. ఇంట్లో వున్న డబ్బంతా ఈ రోజు చేసిన పూజ ఖర్చుకు అయిపోయింది.

శక్తివేల్ విసుక్కుంటూ అమ్మను, గుర్రబ్బండ్లను చిరాగ్గా చూసుకుంటూ నడక వేగం పెంచాడు. హఠాత్తుగా పాప, "అమ్మా.... నాన్న గుర్రబ్బండి!" అంటూ అందరినీ ఆపింది. వెంటనే శక్తివేల్ బండికి అడ్డంగా వెళ్లి ఆపాడు. క్షణంలో పిల్లలిద్దరూ బండి ఎక్కేశారు.

భుజాల చుట్టూ వున్న చీరని మరింత బిగించి బండిలో 'ఆయన' వున్నారేమోనని చూసింది. ఆయన లేరు. వెంటనే పిల్లలను కిందకి దించే ప్రయత్నం చేసింది.

"అలా ఎక్కకూడదు, దిగండమ్మా" అంటూ కోప్పడుతుంది. వాళ్లు దిగేటట్లు లేరు. ఇంతలో బండివాడు, "పోనీలేండి, ఎక్కడికో వెళుతున్నారుగా, దింపుతాను రండి" అన్నాడు.

"రామ్మా! ఆలస్యం అవుతుందన్నావుగా, రా తొందరగా వెళ్లొచ్చు" అంటూ అరుస్తున్నారు పిల్లలు.

'నిజమే, తొందరగా వెళ్లొచ్చు. సమయానికి అమ్మవారే పంపినట్లు వుంది' అనుకుంటూ షణ్ముగవడివు గుర్రబ్బండి ఎక్కింది. పిల్లలు కేరింతలు కొట్టారు.

"సేతుపతి బడి ముందు వీధిలో శ్రీనివాస అయ్యంగార్ ఇంటికి పోనియ్యి బాబూ త్వరగా" అంది.

బండి మలుపుకొని అయిదు నిమిషాల్లో అయ్యంగార్ ఇంటి ముందు ఆపాడు. అందరూ బండి దిగారు. షణ్ముగవడువు బండివానికి రెండు అరటి పండ్లు ఇచ్చి ఏమి మాట్లాడకుండా ఇంట్లోకి వెళ్లింది. శ్రీనివాస అయ్యంగార్, ఆయన అన్న శేష అయ్యంగార్ మదురైలో పేరున్న గాత్ర సంగీత విద్వాంసులు. వారు శ్రీరంగం సోదరులుగా ప్రసిద్ధులు. అలాంటి వారి దగ్గర తన కూతురికి సంగీతాభ్యాసం మొదలు పెట్టడం షణ్ముగవడివుకు చాలా సంతోషంగా వుంది. ఇంటి లోపలకు రాగానే అయ్యంగార్ తంబూరను శ్రుతి చేస్తూ కనిపించారు.

"రండి, రండి, సరిగ్గా సమయానికి వచ్చారు" అంటూ తంబూర జాగ్రత్తగా పక్కనబెట్టి లేచారు.

"ఈ అమ్మాయికేగా సంగీతం?" అమ్మ కొంగు చాటున తొంగిచూస్తున్న పాపను చూస్తూ అన్నారు.

"సరే! పూజ చేసి ఈ రోజు అభ్యాసం మొదలుపెడదాం" అని విఘ్నేశ్వరుడు, సరస్వతి, త్యాగరాజస్వామిలను ధూప, దీప, పుష్ప, నైవేద్యాలతో పూజించారు. షణ్ముగవడివు పాపచేత గురువుగారికి తాంబూలం ఇప్పించి, పాదనమస్కారం చేయించింది. "అమ్మకు కూడా నమస్కారం చేయి తల్లీ" అని చెప్పారు అయ్యంగార్. పాప అమ్మకు నమస్కారం చేసింది. నిండుగా దీవించింది షణ్ముగవడివు.

అందరూ చాపమీద కూర్చున్నారు. అయ్యంగార్ తంబూరని శ్రుతి చేసుకుంటూ మాటలందుకున్నారు. "ఇంకాసేపు చూసి వెళ్లిపోయేవాడిని, మేస్త్రి వీధి శెట్టిగారి షష్టిపూర్తికి కచేరి చేయటానికి పెద్ద పెద్ద విద్వాంసులు వచ్చారు. వారి దగ్గరకు వెళదామనుకుంటున్నాను."





మదురై అక్కమ్మ షణ్ముగవడివు

అయ్యంగార్ పాపవైపు చూశారు, [illegible] నెట్టింటే ఏ పనీ చేసేలాగా లేదు. ఏం పాడుతుందో అనుకుంటూ సా పా సా లు మొదలుపెట్టారు. "గొంతు సవరించుకోమ్మా, నేను పలికినట్లు పలుకు" అంటూ కళ్లు మూసుకొని సా అన్నారు. శ్రోత్రేమీతానట్లు, విశ్వాసంతో పలికిన సా వినిపించింది. కళ్లు తెరిచి ఒక్కసారి తల్లివైపు పిల్లవైపు చూశారు. 'పాడిందెవరు? తల్లా? పిల్లా?' అనుకుంటూ ఈ సారి కళ్లు తెరిచి మళ్లీ సా పలికారు. పాప ఎలాంటి తొణుకు బెణుకు లేకుండా గొంతు మీద పట్టుతో శ్రావ్యంగా పలికింది. ఆశ్చర్యంతో, మొచ్చుకోలుతో చూశారు గురువు. సా పా సా లు పూర్తి చేశారు.

"మీరేమైనా నేర్పిస్తుంటారా ఇంట్లో" షణ్ముగవడివును అడిగారు.

"అవును, నా శిష్యురాలే. నా సాధనంతసేపు నా దగ్గరే వుంటుంది, నేను బయటి పిల్లలకు నేర్పేటప్పుడు కూడా పక్కనే వుండి వింటుంది, వాళ్లతో చేరి నేర్చుకుంటుంది" చెప్పింది షణ్ముగవడివు.

"అలాగా..చాలా గ్రహించేసింది, చాలా...." మళ్లీ ఆయనే, "స రి గ మ ప ద ని... ఈ సప్తస్వరాలు మన సంగీతానికి మూలాలు. అయ్యవారు సప్తస్వరాలు ఓంకార నాదం నుంచి వచ్చాయన్నారు. ఇవి బాగా సాధన చేయాలి" అంటూ సరళీ వరసలు మొదలు పెట్టారు.

"స రి గ మ ప ద ని... "

పాపకు ఇవి బాగా పరిచయమే కాబట్టి చక్కగా పాడింది. పాప పాట ఆపినా స్వరం ఇంకా వినవస్తోంది. ఆ నాదం గాలిలో తేలియాడుతున్నట్లుంది. కళ్లు మూసుకొని ఆ నాదాన్ని ఆస్వాదిస్తున్నారు గురువుగారు. కళ్లు తెరవకుండానే, తల ఆడిస్తూ తాళం మొదలుపెట్టారు. పాప మళ్లీ స రి గ మ లు అందుకుంది. ఆరోహణ అవరోహణ ఒకటి తర్వాత ఒకటి పాడుతూ ఉంది. గురువుగారు కళ్లు తెరిచేవరకు పాడుతూనే వుండాలి. గురువుగారి పద్ధతిని పట్టేసింది పాప.

అయ్యంగార్ తాళం యొక్క కాలం పెంచారు. ఆ తాళానికి అనుగుణంగా సరళీస్వరాలు అందుకుంది. పై కాలంలో కూడా ఆరోహణ అవరోహణాలు అవుతున్నాయి.తప్పులు దిద్దటానికి లేకపోగా, పైగా వయసుకి మించిన సంగీతాన్ని పలుకుతున్న పాప పాటను అయ్యంగార్, 'పెట్టి పుట్టినట్లున్నావు తల్లీ' అని అనుకుంటూ కళ్లు తెరిచారు. పాప పాట ఆపింది. నిన్న రాత్రి కచేరిలో చూసిన పెద్ద పెద్ద విద్వాంసులని మెచ్చుకున్నంతగా పాపను కూడా మెచ్చుకోలుగా చూస్తూ,



కుంజమ్మ"

"కుంజమ్మవా... భేష్ భేష్".

కుంజమ్మకు సంగీతం నేర్పటానికి పెద్దగా కష్టపడనవసరం లేదనుకొని, మళ్లీ షణ్ముగవడివుతో మాట కలిపారు, "నిన్న రాత్రి కచేరికి వరదాచారిగారు, చెంబై వైద్యనాథ భాగవతార్, ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్, మహారాజపురం విశ్వనాథ అయ్యర్ వచ్చారు. వరదాచారిగారి కచేరి అయితే, అయిపోయే సరికి అర్ధరాత్రి రెండు దాటింది."

"కుంజమ్మకు పాఠం చెప్పటం అయిన తర్వాత నేను వాళ్ల దగ్గరకు వెళ్తాను. మీరిద్దరు కూడా వస్తారా? కుంజమ్మను వాళ్లు ఆశీర్వదిస్తారు....." అడిగారు అయ్యంగార్.

"వాళ్లు నిన్న మధ్యాహ్నమే మా ఇంటికి వచ్చి వెళ్లారు. నాచేత కల్యాణి రాగం వినిపించుకున్నారు, తర్వాత వాళ్లందరూ పాడారు. వాళ్ల ముందు కుంజమ్మ కూడా ఒక పాట పాడింది."

ఆశ్చర్యపోయారు అయ్యంగార్.

"మీ ఇంటికి వచ్చారా! ఎప్పుడు?" మీ ఇల్లు అనేదాన్ని నొక్కి పలుకుతూ అడిగారు.

"నిన్న మధ్యాహ్నమే వరదాచారిగారు, చెంబై భాగవతార్, ముసిరి, మహారాజపురం వీరందరూ వచ్చారు."

ఇలా వాళ్లిద్దరూ మాటల్లో వుండగా...

కుంజమ్మ తలెత్తి గోడకున్న పటాలను చూస్తుంది. కింద వరసలో అయ్యంగార్ సోదరుల పటం వుంది, పై వరసల్లో దేవుడి పటాలున్నాయి. వాటిలో శ్రీవేంకటేశ్వరుడి పటంపై కుంజమ్మ చూపు ఆగింది. 'పెరుమాళ్' అనుకుంది మనసులో. 'తిరుపతి దేవుడు, తిరుపతిలో ఉంటారంట, ఎప్పుడూ వెళ్లలేదు' అనుకుంది. కానీ కుంజమ్మ నాదం ఏడుకొండలకు ఎగసింది, తిరుమలకు వెళ్లింది.

ఆనందనిలయం బంగారు ఛాయతో మెరిసిపోతోంది. శ్రీవేంకటేశ్వరుడు అర్చకుల సేవలందుకుంటున్నాడు, భక్తుల గోవిందనామస్మరణలతో ఆనందనిలయం మారుమ్రోగుతోంది. ఆలయ ఉద్యోగి ఒకరు తాను ఎప్పుడూ ఆగి చూసే ఒక గూటి ముందు ఆగి ఈ రోజు కూడా చూస్తున్నాడు. అది ఒక చిన్నగూడు, ఆనందనిలయానికి పక్కనే వుంది. చెక్క తలుపుకి అడ్డచెక్కలు పెట్టి లోపల వేటినో భద్ర పరిచినట్లువుంది. ఆ ఉద్యోగి ఈ రోజు ఆరాటం ఆపుకోలేక ఆ చెక్క తలుపు వూడే దాకా బలంగా లాగాడు. లోపల నుంచి రాగి రేకులు కిందకు దొర్లి అపూర్వమైన నాదం చేస్తూ కుప్ప లాగా

అమరాయి. ఈ నాదం పాప నాదంతో కలిసి, తిరిగి వెళ్లి మదురైలో పాప స్వరంలో ఏకమవుతున్నాయి.

నిశితంగా పరిశీలించగా ఆ రాగి రేకుల మీద వున్నవి, శ్రీవేంకటేశ్వరుడుని కీర్తిస్తూ అచ్చ తెలుగు పదాలు. 500 ఏళ్ల క్రితం అన్నమయ్య వ్రాసిన కీర్తనలు. శ్రీవేంకటేశ్వరుడు చెవిలోనే చెప్పాడు, "అప్పుడెప్పుడో అన్నమయ్య నన్ను కీర్తించగా విన్నాను. ఇప్పుడు నీ నోట వినటానికి ఈ నిధి సంసిద్ధమై వుంటుంది" అని.

ఇలా హరిహరాదులు కుంజమ్మ సంగీతానికి అభయహస్తమిచ్చారు. కేవలం సంగీతానికే ఇచ్చారు. తక్కిన విషయాలన్నింటిలోనూ సగటు మనిషికిచ్చే సంఘర్షణామయమైన జీవితాన్నే ఇచ్చారు.

ప. శోభిల్లు సప్త స్వర సుందరుల భజింపవే మనసా!
అ. నాభీ హృత్కంఠ రసన నాసాదులయందు
చ. ధర ఋక్సామాదులలో వరగాయత్రి హృదయమున
సుర భూసుర మానసమున శుభత్యాగరాజుని యెడ
శోభిల్లు సప్తస్వరసుందరుల భజింపవే మనసా!

*కర్ణాటక సంగీత రత్నత్రయంలోని శ్రీ త్యాగరాజు (1767–1847) కృతి,*
*రాగం– జగన్మోహిని, తాళం–రూపకం*

ఆ రోజు పాఠం ముగించుకొని మళ్లీ అంతే వడివడిగా ఇంటిదారి పట్టారు. ఇంటికి చేరి షణ్ముగవడివు పిల్లలతో సహా పెరట్లోకి వెళ్లి వాళ్ల కాళ్లూ చేతులు కడిగించి, తనూ కడుక్కొని ఇంట్లోకి వచ్చింది. వీళ్లందరూ మంచినీళ్లు తాగుతూ కూర్చున్నారు.

"అక్కా! ఎట్లా జరిగింది పాఠం?" అడిగాడు షణ్ముగసుందరం, షణ్ముగవడివు చెప్పేలోపల, "మామా! ఈ గురువుగారికి మాటలెక్కువ పాటలు తక్కువ. ఘడియ ఘడియకు మాట్లాడుతుంటారు" అన్నాడు శక్తివేల్.

"బాగా జరిగింది సుందరం" అంతే ఆ రెండు ముక్కలే చెప్పింది షణ్ముగవడివు.

"భేష్! బాగా నేర్చుకోమ్మా, సంవత్సరం తిరిగే లోపల నువ్వు మీ అమ్మతో కచేరీకి వెళ్లావంటే నీకూ నాలుగు కాణీలు ఇస్తారు" అన్నాడు సుందరం.

"కాణీలు బోణీలు ఎవరికి కావాలిరా? ఈ ఇంటి ఆడపిల్లలకు సంగీతం రావాలంతే. అదే వరస" అంటూ వరసగా దగ్గుతున్నాడు షణ్ముగవడివు మేనమామ.

"ప్రతి ఆడపిల్లా కాదు, ఎవరికి సరస్వతి కటాక్షం ఉందో వాళ్లకే, మొన్న నీ మనమరాలు పాడింది చూడు ఆ తెల్లదొర ముందు. అతనిక మదరాసు ప్రెసిడెన్సీలో కొలువు చేయనని వెళ్లాడంట."

"ఆయనకు ఉత్తరాదిన హిందుస్థానీ సంగీతం వినీ వినీ కర్ణాటక సంగీతం రుచించలా. అది దాని తప్పుకాదు."

"మరి ఇక్కడ వున్న నల్లదొరలకు కూడా రుచించలేదు కదా."

"సుందరం!" మందలిస్తున్న ధోరణిలో కాస్త బిగ్గరగా పిలిచింది షణ్ముగవడివు. ఇక ఎటువాళ్లు అటు సర్దుకున్నారు. "నువ్వు రేపు కుంజమ్మను అయ్యంగారి దగ్గరకు తీసుకెళ్లి అక్కడనుంచి బడిలో దింపి రా." ఆదేశం జారీ చేసింది షణ్ముగవడివు. షణ్ముగసుందరం ఇక జవదాటటానికి లేదు. "సరేనక్కా తీసుకెళ్లి, తీసుకొస్తా" అన్నాడు.

షణ్ముగవడివు లేచి బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టింది. ఒక పెద్ద తపాలలో సగందాకా నీళ్లతో నింపింది. ఒక చిన్న గిన్నెలో వున్న పెరుగును దానిలో వేసి మజ్జిగ చిలకటం ప్రారంభించింది. చిలుకుతున్నంతసేపు ఎదురుగా బల్లమీద వున్న తన వీణనే చూసుకుంటోంది. ఎప్పుడెప్పుడు పట్టుకుంటానా అన్నట్లు. చిలుకగా చిలుకగా పలచని మజ్జిగ తయారయింది. మజ్జిగ తపాల మీద మూత పెట్టి ఒక పక్కనబెట్టి షణ్ముగవడివు ఆత్రంగా వచ్చి ప్రేమగా వీణను తీసుకొని చాపమీద కూర్చుంది. తంత్రులను మీటి సరిచూసుకుంటోంది. మొదట మీటిన శబ్దం వినీవినగానే కుంజమ్మ తల్లివద్దకు వచ్చి కూర్చుంది. తల్లి చేతి వ్రేళ్ల కదలికలు గమనిస్తోంది కుంజమ్మ. ప్రతిరోజూ ప్రొద్దునే సాధన చేసుకునే షణ్ముగవడివుకి ఈ రోజు ఆలస్యమయింది. అయినా సరే, వీణ వాయించకపోతే ఆమెకు కాళ్లూ చేతులూ ఆడవు. ఏ పనిమీద దృష్టిపెట్టలేదు. ఇప్పుడు నిరాటంకంగా గంట వీణ సాధన చేసింది. తృప్తిగా వీణను బల్లమీద పెట్టింది. ఇంతసేపు కుంజమ్మ తల్లితోనే ఉంది. మధ్యాహ్న వేళ అయింది. ముసలి ముతకా అందరూ భోజనం కోసం ఎదురుచూస్తున్నారు. వున్న అన్నాన్ని, పల్చని మజ్జిగనూ అందరికీ సర్దిపెట్టింది. భోజనాలయ్యి అందరూ వెళ్లి ఎవరి స్థానాలు వారు ఆక్రమించుకున్నారు.మదురైలో భాద్రపద మాసంలో కూడా ఎండలు బాగా వున్నాయి. ఉక్కపోతకి విసనకర్రలు తాళయుక్తంగా ఆడుతున్నాయి. ఒకరిద్దరు కూనిరాగాలు తీస్తున్నారు.

మెల్లగా అందరూ నిద్రలోకి జారుకున్నారు. ఇప్పటిదాకా షణ్ముగవడివు ఇంట్లో అవీ ఇవీ సర్దుకుంది. అందరూ నిద్రపోయిన నిశ్శబ్దంలో తన సంగీత పుస్తకాలను తీసింది. చదువుతూ కూర్చుంది. అప్పుడప్పుడూ వీధి తలుపువైపు చూస్తుంది. తన స్నేహితురాండ్రు వచ్చే సమయమిది. ముందుగా కనకాంబుజం వచ్చింది. ఆ తర్వాత తర్వాత రాజం, మరకతం, మీనాక్షి, రంగనాయకి వీళ్లంతా వచ్చారు.

"షణ్ముగం! నీకు తెలుసా? సరస్వతి బాయి హరికథలు చెప్పటానికి వస్తుందట" అంది ఆలయ దేవదాసి రంగనాయకి, తను తెచ్చిన తమలపాకుల దబ్బానుంచి రెండు ఆకులు, వక్క నోట్లో నెట్టుకుంటూ.

"అయితే ఇక ఆ రోజుల్లో మా కచేరీలు వుండవన్నమాట" నిట్టూర్చింది షణ్ముగవడివు.

"షణ్ముగం! నువ్వు రికార్డుల్లో వాయించరాదా? మదరాసులో చాలామంది విద్వాంసులు ఇప్పుడు ఇదేగా చేస్తున్నారు. వాళ్లలో ఆడవాళ్లే ఎక్కువ" అడిగింది గాత్రకచేరీలిచ్చే మీనాక్షి.

"శ్రీనివాసరావుగారికి చెప్పిపెట్టాను."

"ఈ విషయం తెలిసిందా మీకు? మీనాక్షి గుడి పట్టారు, ఇంకా చూడామణి రాజాయిని బాగా తిట్టిపోశారు" అభినయిస్తూ అడిగింది ఆలయ నర్తకి మరకతం.

"ఎందుకు?"

"ఆ మదరాసు చెట్టీతోనే సరిపెడుతుందాయె, అమ్మవారి సేవకి ఎక్కడుంటుంది? అందుకని బాగా తిట్టారు అందరిముందు."

"ఇప్పుడు సరిగ్గా వస్తుందా?"

"ఇంకేంటి వచ్చేది? ఎప్పుడో వెళ్లిపోయింది మదరాసు, ఆ చెట్టితో."

"ఈ చెట్టి అంతకు ముందు అమ్మోళ్లకి వజ్రాలహారం చేయించాడు. అమ్మవారిని వదిలి హారం కోసం పోయింది" ముక్తాయింపు ఇచ్చింది కనకాంబుజం.

ఇలా వాళ్ల వ్యవహారాలన్నీ మాట్లాడుకొని షణ్ముగవడివు స్నేహితురాండ్రు వెళ్లిపోయారు.

ఇక సాయంత్రం అయ్యేసరికి షణ్ముగవడివు ఇంట్లో ఒక్కొక్కరు లేస్తున్నారు. ప్రొద్దున్న తీసుకువచ్చిన టెంకాయచెక్క, అరటిపండ్లు ముక్కలు చేసి తలాకాస్త పెట్టి, తను తిని తన దగ్గర నేర్చుకోవటానికి వచ్చే పిల్లలకోసం ఎదురుచూస్తుంది షణ్ముగవడివు. కాస్త అటుఇటుగా నలుగురు ఆడపిల్లలు వచ్చారు. వారికి నేర్పేటప్పుడు కుంజమ్మ సూదెంటే దారంలా వచ్చి చేరింది. పాఠాలు అయ్యాయి. పిల్లలు వెళుతూ వెళుతూ, వారిలో ఒక పిల్ల సంచిలోంచి కూర అరటికాయలు తీసి, "మా అమ్మ ఇవ్వమంది" అంటూ షణ్ముగవడివు చేతిలో పెట్టింది. 'హమ్మయ్య! ఈ పూటకి కూరకి సర్దుబాటవుతాయి' అని మనసులో అనుకొని "సంతోషమమ్మా" అని పిల్లతో అంది.

పిల్లలు వెళ్లిన తర్వాత రాత్రికి వంట మొదలుపెట్టింది. పొద్దున వేసిన బియ్యం కంటే ఇంకో గిద్ద ఎక్కువే వండుతుంది. ఎందుకంటే పొద్దున్నే నీరన్నం కావాలి కాబట్టి.



అరటికాయకూర వండింది. మళ్లీ కుంజమ్మను సాధనకు కూర్చోబెట్టింది. తంబూర శ్రుతి చేసి సప్తస్వరాలను శ్రుతికి అనుగుణంగా పాడిస్తుంది.

"కుంజా! శ్రుతి మీరకు. తంబూర ఏ శ్రుతి లో వుందో అదే శ్రుతిలో పాడు."

ఆ పూట అంతా శ్రుతి మీదే ధ్యాస. కుంజమ్మ సాధన అయిన తర్వాత శక్తివేల్‌ని పిలిచింది.

"నువ్వు మృదంగం తీసుకొని రారా." వెంటనే వచ్చాడు శక్తివేల్. "ఆదితాళం మొదలుపెట్టు" అంది. శక్తివేల్ మృదంగంకి నమస్కారం చేసుకొని సాధన మొదలుపెట్టాడు. మణిపిళ్లైని జతచేసి తను లేచి మిగతావారికి అన్నంపెట్టింది. శక్తివేల్ అలసిపోయేవరకూ మృదంగం వాయించి, ఇక మెటికలు విరుచుకుంటూ వున్నాడు.

"నువ్వు కూడా అన్నానికి రారా" అంది షణ్ముగవడివు. అందరి భోజనాలు అయిన తర్వాత అంతా సర్దుకొని, మిగిలిన అన్నంలో సరిపడా నీళ్లుపోసి మూతపెట్టి పక్కన జాగ్రత్తగా వుంచింది షణ్ముగవడివు.

పక్కలు పరచుకొని అందరూ నిద్రకు ఉపక్రమించారు. షణ్ముగవడివు నిద్రపోవడానికి వచ్చేసరికి శక్తివేల్ కుంజమ్మతో మాట్లాడుతున్నాడు. "కుంజా! నేను మీతోపాటు స్వామి దర్శనానికి ఎందుకు రాలేదనుకుంటున్నావ్?"

"ఎందుకు?"

"అక్కడ స్వామి గుడిలో బావి వుంది కదా... అది బావి అనుకుంటున్నావా? అది బావి కాదు. దాంట్లోకి కొంచము కిందకు దిగగానే సొరంగం వస్తుంది. ఇంక అది సరాసరి తిరుమల నాయకుడి రాజమహల్‌కి తీసుకువెళ్తుంది. అప్పుడు రాజు ఇలాగే గుడికి వచ్చేవాడంట. నాకూ ఆ సొరంగంలో వెళ్లాలని ఉంది."

"వద్దు, దాంట్లో కప్పలు వుంటాయి. పాములు వుంటాయి, బల్లులు కూడా వుంటాయి, వద్దన్నా."

"దివిటీ తీసుకెళ్లానంటే, అవన్నీ పారిపోతాయి, దోవ కనిపిస్తుంది."

"దివిటీ మధ్యలో ఆరిపోతే...?"

ఇంతలో షణ్ముగవడివు పక్కకు రావడం చూసి, ఎప్పట్నుంచో నిద్రపోతున్నట్లు భంగిమపెట్టారు.

పిల్లలని ఒకసారి చూసుకొని, కుంజమ్మ తల నిమురుతూ నిద్రలోకి జారుకుంది షణ్ముగవడివు.



అమ్మవారి గుడి తలుపులు తెరుచుకోకముందే, ఆలయ గంటలు మ్రోగ...
ముందే షణ్ముగవడివు లేచి కుంజమ్మను లేపింది. కుంజమ్మ "ఎందుకమ్మా ఇంత పొద్దున" అని అనకుండా వెళ్లి మొహం కడుక్కొచ్చింది. ఇంతలో షణ్ముగవడివు రాత్రి అన్నంలో పోసిన నీటిని, ఇంకో తపాలమీద గుడ్డ అడ్డుకట్టి వడకట్టింది. తల్లీకూతురు ఆ నీళ్లు చెరొక గ్లాసెడు తాగారు. వడివాంబను పక్కకు జరిపి, సంగీత సాధన మొదలుపెట్టారు. తల్లి షడ్జమంలో శ్రుతి చేసి పెట్టింది తంబూరని, పిల్ల అదే శ్రుతితో సాధన మొదలుపెట్టింది. అకార సాధన కొనసాగింది.

తెలతెలవారుతుండగా మణిపిళ్లై లేచి పాలకోసం బయటకు వెళ్లాడు. అరగంటలో ఒక లోటాలో పాలు తీసుకొని వచ్చాడు. పొయ్యి రాజేసి పాలు కాచి, ఆ తర్వాత ఒక తపాలలో కావలసినన్ని నీళ్లు పోసి, మరిగిన తర్వాత వాటిలో వేయించిన ధనియాలు, కాస్త బెల్లం, కొన్ని పాలు పోసి ఇంకో పొంగు రానిచ్చింది. పొయ్యి ఆర్పి కుంజమ్మ దగ్గరకు వచ్చి 'సా పా సా'లు చెప్పించి ఈపూట సాధన పూర్తి చేశారు. చిన్నచిన్న గ్లాసులు తీసి అందరికీ కాఫీ పోసింది షణ్ముగవడివు. ఇందాక పొయ్యి మీద కాచిందే ఈ 'కాఫీ'. ఏ రోజన్నా షణ్ముగవడివు పోపుడబ్బా ఘల్లుఘల్లుమంటే ఆ రోజుల్లో కాఫీలో కాస్త శొంఠి పడుతుంది. అప్పుడది శొంఠి కాఫీ అవుతుంది. లేకపోతే వేడి బెల్లం నీళ్లకు కాస్త అటు ఇటుగా వుంటుంది. ఈ కాఫీనీ ఇంటిల్లిపాది పొద్దునే ఆకలి పొట్టన ఆత్రంగా తాగుతారు. దాదాపు రెండు గంటల సాధన తర్వాత అమ్మ ఇచ్చే ఈ కాఫీ కుంజమ్మకు పరమాన్నమే.

కుంజమ్మ స్నానం చేసి తయారయిన తర్వాత షణ్ముగసుందరం అయ్యంగార్ ఇంటికి తీసుకెళ్లాడు.

షణ్ముగవడివు వెంటనే తన వీణ సాధన మొదలుపెట్టింది. కొన్ని రోజుల క్రితం దాకా, సూర్యోదయానికి ముందే ఎవ్వరూ నిద్ర లేవని ప్రశాంత సమయంలో వీణ సాధన చేసేది. ఆ శ్రావ్య నాదం వీణాపాణి సరస్వతినే మదురైకు రప్పించి తన ముందు అదృశ్య రూపంలో కూర్చొని వినేలా వుంటుంది. ఇప్పుడైనా అంతే. దేవతలు అదృశ్య రూపంలో వింటుంటే హనుమంతరాయ వీధిలో తచ్చాడే జనం షణ్ముగవడివు వీణానాదం ఆగి మరీ విని వెళ్తారు. షణ్ముగవడివు తల్లి షణ్ముగవడివుకి బ్రతుకుతెరువు కోసం వీణ నేర్పించింది. కానీ ఇప్పుడు వీణ షణ్ముగవడివు పంచప్రాణాలు. తన అణువణువు ండిపోయి ఉంది. వీణ సాధన చేయకుండా ఒక్క రోజుకూడా వుండలేదు. తన అంతరాత్మ ది. సాధన చేస్తుండగా వీధి తలుపు తట్టుతున్న చప్పుడు వినిపించింది.

"ఇంట్లో ఎవరమ్మా? షణ్ముగవడివు వుందా?" అంటూ బయటినుంచి గట్టిగా పిస్తున్నాయి మాటలు. మణిపిళ్లై ముందుగా వెళ్లి తలుపు తీశాడు.



శ్రీనివాసరావుగారు పంపించారు. సాయంత్రం తెల్ల దొర ఒకాయన, రామ్నాడ్ జమిందారు వస్తారంట, టౌనుహాలులో నువ్వు కచేరి ఇవ్వాలన్నారు. ఐదుగంటలకే రమ్మన్నారు" అని చెప్పేసి వెళ్లిపోయాడు.

"ఆహా! ఏమి మర్యాద, ఏమి మర్యాద..." అందుకున్నాడు ముసలాయన. "కచేరి ఇచ్చి వెళ్లాలా... వెళ్లడం, రావడం అంతా మనమేనా? మా అమ్మ చెప్పేది, ఆమె అమ్మమ్మ తంజావూరు రాజ నర్తకి అయితే తంజావూరు రాజు అంబారీ పంపేవాడట. మరి వాళ్ల అమ్మకి ఆర్కాట్ నవాబ్ పల్లకి పంపేవాడు. మా అమ్మకు శివగంగ జమీందారు గుర్రబ్బండి పంపించేవారు. రాచమర్యాదలతో తీసుకువెళ్లి, ఘనంగా కానుకలు పెట్టి ఇంటిదాకా వచ్చి దిగబెట్టి వెళ్లేవారు. రానురాను కళావంతులంటే లోకువ అవుతోంది."

దానికి షణ్ముగవడివు, "మామా! నాకు అంబారీలు వద్దు, ఐరావతాలూ వద్దు. ఇలా కచేరీలు వుండి నాలుగు రూకలు ఇస్తే చాలు, ఈ సంసారం ఈదటానికి" అంది.

ఇంక ఏమీ మాట్లాడలేకపోయాడు ముసలాయన.

"మణీ! మధ్యాహ్నమే కుంజాని తీసుకురా బడి నుండి" ఈసారి మణికి ఆదేశం జారీ అయ్యింది షణ్ముగవడివు నుంచి.

మధ్యాహ్నం భోజనాలు తర్వాత, తలకు నిండుగా నూనెపెట్టి జడవేసి, ఇస్త్రీ వున్న చీరను కట్టుకొని, తనకున్న పూసల దండలు మూడు వేసుకొని, మద్రాసు ప్రెసిడెన్సి గవర్నర్ పెంట్‌లాండ్ తనకు బహుకరించిన పతకం, ఇంకా ఇతర పతకాలు చీరకు తగిలించుకొని, షణ్ముగవడివు తయారయ్యేలోపల మణిపిళ్లై కుంజమ్మని తీసుకువచ్చాడు. కుంజమ్మని కూడా తయారు చేసి, మణిపిళ్లై మృదంగం మోసుకువస్తూ, షణ్ముఖసుందరం వీణను మోస్తూ, కుంజమ్మ, షణ్ముగవడివు వారి వెనుక టౌను హాలుకు బయలుదేరారు.

పడమర వెలి వీధిలో రైలుస్టేషన్ పక్కనేవున్న టౌన్‌హాలుకు చేరుకున్నారు. శ్రీనివాసరావు అతిథులను ఆహ్వానిస్తూ ముందే కనిపించారు. మళ్లీ ఆయన వైపు చూడకుండా షణ్ముగవడివు లోపలికి వెళ్లిపోయింది. వేదిక మీద సర్దుకొని కూర్చుంది. టౌన్ హాల్‌కి అప్పటికే పుష్పవనమ్ అయ్యర్, హరికేశవల్లూర్ భాగవతార్ వచ్చిఉన్నారు. వీరంతా మద్రాసులో గొప్ప గాత్రసంగీత కళాకారులైతే, షణ్ముగవడివు మదురై, ఆ చుట్టుపక్కల జమీందారీలలో పేరున్న వైణికురాలు. సంగీతజ్ఞులకి, రసజ్ఞులైన శ్రోతలకు మాత్రమే ఆమె విలువ తెలుసు, మామూలు జనానికి ఆమె దేవదాసి.

కూతురుని పక్కనే కూర్చోబెట్టుకొని రెండు గంటలు వీణానాదం వినిపించింది. అమృతధార కురిపించింది. వీనులవిందు చేసింది. 'భేష్ భేష్'ల మధ్య, చప్పట్ల మధ్య

కచేరి ముగించింది. తను నర్సుకుంటూ వుండగా షణ్ముఖసుందరం శ్రీనివాసరావు నుంచి కచేరి డబ్బులు తెచ్చి అక్కకు ఇచ్చాడు. అందరూ ఇంటికి చేరారు. షణ్ముగవడివు చీరకున్న పతకాలు తీస్తూ వుండగా పక్కనే వున్న కుంజమ్మ ఒక రాగం తీస్తోంది.

'ఈ రాగం ఎప్పుడు వింది? ఇందాక కచేరిలోనే విందా? అంతకు ముందు ఏమైనా విందా?' ఆలోచనలో పడింది షణ్ముగవడివు.

'రాగ లక్షణం పొల్లుపోకుండా రాగం తీస్తూవుంది' అనుకుంటూ కుంజమ్మ అక్కడనుంచి వెళ్లేదాకా తాను అటువైపు తిరిగి ఏవో పనులు చేస్తున్నట్లు నిలబడి వింది.

"భలే పట్టేసింది. నేర్పకుండానే పట్టేసింది. దీనికి సంగీతం నా పొట్టలో వున్నప్పుడే అబ్బింది. ఇప్పుడంతా సానపట్టడమే" అని అనుకుంటూ చాలా సంతోషపడింది షణ్ముగవడివు.

𝄞𝄞

మీనాక్షి ఆలయంలో నవరాత్రి ఉత్సవాలు ప్రారంభమయ్యాయి.

ఆ పూటకి కుంజమ్మ గాత్ర సాధన అయ్యి అందరూ 'కాఫీ' తాగి కూర్చున్నారు. ఇంతలో నాదస్వర మల్లరి ధ్వనులు వినిపిస్తున్నాయి. అమ్మవారిని ఊరేగింపుగా తీసుకొస్తున్నారని అర్థం. శక్తివేల్ ఇంటికి పరిగెత్తుకుంటూ వచ్చి అమ్మవారి ఊరేగింపు వస్తుందని చెప్పి మళ్లీ వెళ్లాడు. పెద్దమేళం సరిగ్గా షణ్ముగవడివు ఇంటి సందు మొదట్లో ఆగి, నాదస్వరం వూదుతున్నారు. ముందు చిన్నమేళం వుంది. అమ్మవారి ఊరేగింపు మేళంలో ఆడేవాళ్లంతా సాటి దేవదాసీలు, నాదస్వరం వూదేవాళ్లంతా తోటి దేవదాసి కుటుంబాలలోని మగవారే. వారికి వాళ్ల పేరు వెనుక విధిగా 'పిళ్లై' అని వుంటుంది. అమ్మవారి కొలువులో వుండే ఈ పిళ్లైలందరూ వారివారి విద్యలలో ఆరితేరినవారే. కాస్త వూహ తెలిసినప్పటినుంచీ సంగీత నాట్య కళలలోకి ప్రవేశపెట్టబడి ఇంట్లోవాళ్లే పద్ధతిప్రకారం నేర్పిస్తారు. ఊహ తెలియనప్పటి నుంచీ కూడా ఆ ప్రపంచంలోనే మసలి, వారికి తెలియకుండానే శాస్త్రాన్ని గ్రహిస్తారు. ఇప్పుడు నాదస్వరం వూదుతున్న పిళ్లైలే కాదు, దేవదాసి కుటుంబంలోని ప్రతి చంటిబిడ్డ మనసు, తనువు, చుట్టూ వున్న కళను తనకు తెలియకుండానే గ్రహించేస్తుంది. 900 ఏళ్ల నుంచి, పాతిక తరాల నుంచి వస్తున్న సంస్కృతి ఇది. 9 శతాబ్దాల నుంచి దక్షిణ భారతంలో వేళ్లూనుకున్న వృక్షం. ఇదే వృక్షం యొక్క బీజాలు కుంజమ్మ, శక్తివేల్, వడివాంబ.

షణ్ముగవడివు వీధి తలుపు వాకిలిదాకా వచ్చి అమ్మవారికి నమస్కారం చేసి నిలబడింది. నాదస్వర వాద్యకారులు రెట్టించిన ఉత్సాహంతో కొత్త కీర్తన అందుకున్నారు. కీర్తన



అంతా అయ్యేవరకూ షణ్ముగవడివు తాళం వేస్తూ విన్నది. అమ్మ వెనకే కుంజమ్మ వింటూ వుంది. శక్తివేల్ ఎప్పుడో ఊరేగింపులో కలిసిపోయాడు. కీర్తన పూర్తయింది. చిన్న మేళం కూడా ఆగింది. వాద్యకారులందరూ షణ్ముగవడివువైపు తిరిగారు, 'పర్వాలేదా మా పాట' అన్నట్లు... షణ్ముగవడివు చిరునవ్వుతో తలాడిస్తూ తాళం కొనసాగిస్తూ లోపలికి వెళ్లిపోయింది. వాద్యకారులకు షణ్ముగవడివు రాజముద్ర వేసింది. కొత్త వుత్సాహంతో ఊరేగింపు ముందుకు సాగిపోయింది.

కుంజమ్మ లోపలికి వచ్చీరాగానే అంది, "అమ్మా! నాదస్వరంకంటే నీ వీణానాదమే బాగుంటుంది."

"ఆ... ఒట్టి మొరటు శబ్దాలు కదూ..." అన్నాడు పెద్దాయన.

కానీ కుంజమ్మ వీణకి నాదస్వరానికి వున్న సున్నితమైన తేడా గుర్తించింది. స్వరాలని వీణ పలికినంత స్పష్టంగా నాదస్వరం పలకదు. వీణ వంచినట్లు గమకాలను, రాగాలను వంచదు. సంగీతంలో కుంజమ్మకున్న నిశిత పరిశీలన గమనించి అబ్బురపడింది షణ్ముగవడివు.

ఈ నవరాత్రుల పుణ్యమాని షణ్ముగవడివుకు ఈ తొమ్మిది రోజులు చేతి నిండా పని. అమ్మవారి గుడి, మదురైలోని ఇతర ఆలయాలలో, పక్క వూళ్లలో నవరాత్రులకు సంబంధించిన పందిళ్ల కచేరీలలో వీణ మీటుతూనే వుంటుంది.

𝄞𝄞

భాద్రపద మాసం చివరిలో మొదలయిన శరవన్నవరాత్రుల హడావుడి ఆశ్వయుజ శుద్ధనవమికి ముగిసింది. మదురై వీధులు కాస్త పలచబడ్డాయి. అలాగే షణ్ముగవడివు కచేరి అవకాశాలు కూడా. అయినా షణ్ముగవడివు అధైర్యపడదు. శాంతి కాఫీలో శాంతి లేకపోవడం, మజ్జిగ ఇంకాస్త పలచనవటం తప్పించి, అంతకంటే విపత్తులేమీ వుండవు. షణ్ముగవడివు తల్లి అక్కమ్మ వయోలిన్ విద్వాంసురాలు. ఆమె పోవడంతో ఒక పెద్ద ఆదాయపు వనరు కూడా పోయింది, అప్పట్నుంచి షణ్ముగవడివు ఒంటిచేత్తో ఈ తంజావూరు సత్రం లాంటి ఇంటిని నెట్టుకొస్తుంది.

దేవదాసీ కుటుంబాలు స్త్రీ ఆధీనంలో ఉంటాయి. మంచికైనా చెడుకైనా, మాటకైనా చేతకైనా స్త్రీయే ఆధారం. ఆమెకు ఈ అధికారం ఆమె సంపాదన నుంచి వచ్చింది. ఆమె సంపాదన ఆమెకు తన కళల నుంచీ, తన సహచరుల నుండి వచ్చింది. తనని సహచరుల దగ్గరకు తీసుకెళ్లటానికి తన కళ ఒక మార్గం. షణ్ముగవడివుకు ఇద్దరు ఆడపిల్లలు పుట్టినప్పుడు ఇంటిల్లిపాదీ సంతోషించారు. ఇక ఆ ఇంటికేమీ ఢోకా లేదనుకున్నారు. కానీ ఈ ఆడపిల్లలు సంపాదించగలిగేది వారికి నేర్పుతున్న కళలో వారు రాణించగలిగినపుడే. షణ్ముగవడివు ఇప్పటినుంచే తన కూతుళ్లమీద దృష్టి సారించింది.

ముఖ్యంగా వైణికులు కుంజమ్మమీద కుంజమ్మ అంత చిన్న వయస్సు నుండి సంగీతం నేర్చుకోవటానికి ఉత్సుకత చూపిస్తుంది. నేర్పింది వెంటనే గ్రహిస్తుంది కూడా. తనకు ఏమాత్రం తీరిక దొరికినా షణ్ముగవడివు పెద్దకూతురి సంగీతానికే ఉపయోగిస్తుంది.

అయ్యంగారి దగ్గర లాంఛనంగా అభ్యాసం మొదలుపెట్టిన దగ్గర్నుంచి షణ్ముగవడివు కుంజమ్మను ఉదయం నాలుగున్నరకల్లా లేపి సాధన చేయిస్తుంది. ప్రత్యేకంగా ఏ పనులు లేని ఈ రోజు కూడా అలానే పొద్దునే లేపింది. ఇద్దరూ నీరన్నం తాగి సాధనకు కూర్చున్నారు.

"గురువుగారు ఇప్పటిదాకా ఏమి నేర్పారో అవి పాడమ్మా" అడిగింది తల్లి. కుంజమ్మ సరళీ స్వరాలు, జంటస్వరాలు పాడి వినిపించింది. అయ్యంగారు ఎలా చెపుతున్నదీ, ఏం చెపుతున్నదీ బేరీజు వేసుకొంది షణ్ముగవడివు. ఒక గంట పైన తల్లీ కూతుళ్లు సాధనలో మునిగిపోయారు. వీధిలో చీపుళ్ల వూడుపులు శ్రుతి మీరుతున్నాయి. లయ లేనే లేదు. ఇంట్లో ఒక్కొక్కళ్లు లేస్తున్నారు. గాత్ర సాధనకు అనువైన ప్రశాంతత లోపించినప్పుడు షణ్ముగవడివు కూడా లేచి కాఫీ తయారుచేసి అందరితోపాటు కుంజమ్మకు కూడా ఇచ్చి శక్తివేల్‌ను సాధనకు కూర్చోబెట్టింది.

"కుంజా! ముగ్గులేద్దాం రా" అంటూ అత్త కుంజమ్మను పిలిచింది.

కుంజమ్మ ముగ్గు గిన్నె పట్టుకొని అత్త వెనకాలే వెళ్లి ఇంటి ముందు మెట్టుమీద కూర్చుంది. ఆ సందులోని ఇళ్లలోంచి ఆడవాళ్లు ఒకరి తర్వాత ఒకరు వచ్చి వాళ్లవాళ్ల ఇంటిముందు కళ్లాపి జల్లి తీరిగ్గా ముగ్గులు వేసి, గొబ్బెమ్మల దీపాలు పెట్టి వెళుతున్నారు. కుంజమ్మ ముగ్గులని, వచ్చేపోయేవాళ్లని చూస్తూ కూర్చుంది. ఆ వచ్చేపోయే వాళ్లలో అమ్మవారి కోవెలకి వెళ్లే సాధుసంతులు, బైరాగులు, విరాగులు కూడా వున్నారు. పురాణాలలో, ఇతిహాసాలలో, అమ్మవారి వాసి విని ఎక్కడెక్కడి నుంచో తీర్థయాత్రికులు ఇక్కడికి చేరుకుంటుంటారు. చుట్టుపక్కల వుండే సత్రాలలో బస చేస్తూ వైగై నదిలో స్నానం చేసి ఈ పశ్చిమ హనుమంతరాయ వీధిలోనుంచి కూడా అమ్మవారి కోవెలకు వెళుతూ వుంటారు. కొంతమంది చిరతలు, కొంతమంది తంబూర చేతబుచ్చుకొని పాడుతూ అమ్మవారిని స్తుతిస్తూ వెళుతూ వుంటారు. కుంజమ్మ రోజూ అందరినీ గమనిస్తూ వుంటుంది. కొంతమంది పెద్దపెద్ద గడ్డాలతో జటాజూటాలతో భయంగొలుపుతూ వుంటారు. కానీ కుంజమ్మ వారి భక్తిపారవశ్యమైన పాటలు వింటూ అక్కడే వుంటుంది. ఆ రోజుకి శక్తివేల్ సాధన ముగించుకొని కుంజమ్మ పక్కకు చేరాడు.

"కుంజా! వీళ్లు హిమాలయాల నుంచి వస్తారు, తెలుసా నీకు?" అని అడిగాడు. కుంజమ్మ విందికానీ జవాబు చెప్పలేదు. మళ్లీ శక్తివేల్ మొదలుపెట్టాడు, "వీళ్లందరూ



అక్కడి నుంచే రారు. కొంతమంది వేషాలు వేసుకొని పిల్లల్ని ఎత్తుకెళ్లేవాళ్లుంటారు. నువ్వు లోపలికి పో" అంటూ భయపెట్టే ప్రయత్నం చేశాడు.

ఆ సాధువుల భక్తిశ్రద్ధలతో కూడిన నిష్కపటమైన పాటలు రోజూ వినే కుంజమ్మకు అన్న మాటలు నమ్మశక్యం కాలేదు.

ఇంతలో అమ్మ వీణ మీటడం వినిపించింది. చెంగున లేచివెళ్లి అమ్మ ముందు కూర్చుంది. షణ్ముగవడివు చివరగా తన సాధన మొదలుపెట్టింది. తదేకంగా సాధన చేస్తూ వుండి, పిల్లగాలులకి వీధి తలుపు తెరుచుకున్నప్పుడు పొద్దు నడినెత్తిన వుందని గ్రహించి సాధన ముగించింది.

"పద కుంజా అమ్మవారి దగ్గరకు వెళ్దాం" అంటూ వీణ సర్ది బయలుదేరింది కూతురుతో. అమ్మవారు, తన వీణ, తన పిల్లల సంగీత భవిష్యత్తు, ఇవీ షణ్ముగవడివు లోకం.

§§

ఆ తరువాత రోజులు కూడా సాధనతో మొదలయ్యి సాధనతోనే ముగుస్తున్నాయి.

ఒకరోజు ప్రొద్దున మాత్రం కాస్త మార్పు జరిగింది. రోజూ తన సాధన తర్వాత అత్త వెనకాలే ముగ్గు డబ్బా తీసుకొని బయలుదేరుతూంది. తన చుట్టూవున్న సంగీతాన్ని గ్రహిస్తున్నట్లు, ముగ్గులు వేసే తీరుని కూడా గ్రహిస్తూ కూర్చుంటోంది. ఈ రోజు ప్రొద్దున కూడా వచ్చి అత్త వేసే ముగ్గుని చూస్తోంది. సాధువుల పాటలు వింటోంది. ఇంతలో ఒక సాధువు ఇంటి ముందు వచ్చి ఆగాడు. కుంజమ్మ తల ఎత్తి చూసింది. అతను భిక్షను ఆశించి వచ్చిన సాధువులాగా లేదు. వేరొకరయితే వెంటనే వెళ్లి దోసిలిలో బియ్యం తెచ్చి జోలెలో పోసేది. ఏమి చెయ్యాలో తోచక చూస్తూ వుంది. ఆ సాధువు, "పాపా! నీకు చదువు చెప్పనా?" అని అడిగాడు.

కుంజమ్మ అత్త వైపు చూసింది. అత్త, 'ఫరవాలేదు నేర్చుకో' అన్నట్టు నవ్వుతూ చూసింది.

"నీ పలకా బలపం తెచ్చుకో" అన్నాడు సాధువు.

కుంజమ్మ వచ్చేసరికి సాధువు మెట్లమీద కూర్చున్నాడు. కుంజమ్మ నుంచి పలకా బలపం తీసుకొని, ముందుగా ఒక శ్లోకం చెప్పటం మొదలుపెట్టాడు.

"ఘృత గుడ పాయసం..."

కుంజమ్మ శ్లోకం చెప్పింది. సాధువు పలకమీద అక్షరాలు వ్రాస్తున్నాడు. ఆ అక్షరాలన్నీ చెప్పి దిద్దమన్నాడు. కుంజమ్మ అక్షరాలను చదువుతూ అలానే చేసింది. ఆ తరువాత

నాలుగు అక్షరాలు పలక రెండోవైపు రాసిచ్చి, "ఇవి కూడా నేర్చుకోమ్మా, మళ్లీ రేపొద్దున
వస్తాను" అని చెప్పి వెళ్లాడు. కుంజమ్మ అక్కడే దిద్దుతూ కూర్చుంది. "కుంజా ఇంక రా
లోపలికి" పిలిచాడు శక్తివేల్, వెనకే వుండి అన్నీ గమనిస్తున్నాడు.
కుంజమ్మ పలక తీసుకొని చూశాడు. "నాకు తెలిసి ఇది తమిళం కాదు. తెల్లవాళ్ల
భాష కూడా కాదు. ఇంకే భాష అయి వుంటుందీ" అంటూ తెగ ఆలోచిస్తున్నాడు.
"నువ్వేదో బహుభాషా కోవిదుడివైనట్లు, ఆ పలక యిటియ్యి నేను చూస్తా" అంటూ
మణిపిళ్లై శక్తివేల్ నుంచి పలుక తీసుకొని చూశాడు. "తమిళంలానే వుంది కదరా...
కానీ కొన్ని అక్షరాలు తమిళ అక్షరాలు కావు. ఏమో నాకు తెలియటంలేదు మరి."

"నన్ను చూడనీ" అంటూ షణ్ముఖసుందరం పలక తీసుకున్నాడు.

"ఇది తెనుంగు కాదు.."

"ఏదండీ! నాకు ఇవ్వండి, సందు చివర అమ్మాయి నాకు కన్నడం నేర్పించింది"
అంటూ షణ్ముఖసుందరం భార్య వాసంతి పలక తీసుకుంది. చూసింది పలకను తిరగేసి
బోర్లేసి, "ఇది నేను నేర్చుకున్న కన్నడంలాగా లేదే" అంది.

"అక్కా! ఏది నాకివ్వు, మన ఇంటి ముందు మరాఠీ డాక్టరు దగ్గర నేను మరాఠీ
పుస్తకాలు చూశాను" అంటూ మణిపిళ్లై భార్య చిత్ర పలక తీసుకుంది, కానీ అందరిలాగే
ఏ భాషో చెప్పలేకపోయింది.

చివరికి పలక షణ్ముగవడివు తీసుకుంది, రెండు వైపులా చూసింది, "అవును నిజమే,
మీరందరూ చెప్పినట్లు ఇది తమిళం కాదు, తెనుంగు కాదు, కన్నడం కాదు, మరాఠీ
భాష కాదు, ఇంగ్లీషు కానే కాదు. కాస్త తమిళంకే దగ్గరగా వుంది, మామా! నువ్వు చూసి
చెప్పు ఇదేంటో" అని పలకని షణ్ముగవడివు మేనమామ వద్దకు చేర్చింది.

ఆయన కళ్లజోడు పెట్టుకొని, దానికి దగ్గరగా పలక పెట్టుకొని చూసి "ఇది గుడి
గోడలమీద రాసే భాష, దేవుడి భాష, గ్రంథ భాష" అని తేల్చేశాడు.

అందరూ కుంజమ్మవైపు తిరిగారు. కుంజమ్మను చూసుకుంటూ పలక చేతిలో
పెట్టి తలోదిక్కూ వెళ్లిపోయారు.

"కుంజా! బాగా నేర్చుకో ఈ దేవుడి భాష, నీకు అమ్మవారి గుడిలో ఒక గోడ ఇస్తా.
దాని మీదంతా నీ కథ రాసేద్దువు" అంటూ ఎక్కిరిస్తూ వెళ్లాడు చివరిగా శక్తివేల్.
తరువాతి రోజు ప్రొద్దున కుంజమ్మ ముగ్గుడబ్బాతోపాటు పలక కూడా తీసుకెళ్లి
కూర్చుంది. లోపల శక్తివేల్ సాధన చేస్తూండగా, కుంజమ్మ ' ఘృత గుడ పాయసం'



చెప్పడం విని, మృదంగం ఆపి మరీ పగలబడి నవ్వుకుంటూ, "అమ్మా! పాత పాయసం
మళ్లీ తీసుకొచ్చాడు కుంజాకి, ఒకసారి వెళ్లి చూసొస్తానాగు" అంటూ బయటికి వెళ్లాడు.
చాలాసేపటివరకూ రాకపోయేసరికి, "ఎంతసేపురా? రారా" అంటూ శక్తివేల్‌ని
మళ్లీ సాధనలోకి తీసుకువచ్చింది షణ్ముగవడివు.

కార్తిక మాసంలో మదురై ప్రాంతంలో వర్షాలు ఊపందుకున్నాయి. ఆలయంలో
కార్తిక ఉత్సవాలు మొదలయ్యాయి. షణ్ముగవడివు ఇంటిల్లిపాదీ ఆలయానికి వచ్చారు.
ఆలయంలోపల భక్తుల సందడి ఎంతవుందో భక్తేతరుల సందడి కూడా అంతేవుంది. మీనాక్షి
సుందరేశ్వర ఆలయ సంప్రోక్షణ పనులు మొదలయ్యాయి. తరువాతి సంవత్సరం జ్యేష్ఠ
మాసంలో కుంభాభిషేకం చేయటానికి నిర్ణయించబడింది. ఆలయానికి మరమ్మత్తులు
చేసి అణువణువు శుభ్రపరుస్తారు. మూలవిరాట్టులతో సహా ప్రతి విగ్రహాన్ని శుభ్రపరచి,
కుంభాభిషేకం రోజున ప్రత్యేకమైన అభిషేకం కావిస్తారు. వీటన్నిటికీ చాలా డబ్బు ఖర్చు
అవుతుంది. చాలా సమయం పడుతుంది. అటు కూలీలు ఇటు నిపుణుల సంగతి సరేసరి.
అవసరమైన డబ్బంతా పెట్టటానికి వైనాగరం చెట్టిగార్లు ముందుకొచ్చారు.

దర్శనానంతరం ఇంటి సందు ముందు చిత్ర, వాసంతి, వడివాంబ, శక్తిలను ఇంటికి
పంపి షణ్ముగవడివు, కుంజమ్మ అయ్యంగారి వద్దకు బయలుదేరారు. కుంజమ్మ సాధన,
పురోగతి ఎలా వుందో ఒకసారి గురువుగారిని అడిగి తెలుసుకునే మిష మీద
బయలుదేరింది. అయ్యంగార్ వీళ్లని చూడగానే నవ్వుతూ ఆహ్వానించారు.

"ఈ రోజు ఇద్దరూ వచ్చారు, మీకు కూడా పాఠం చెప్పాలనా ఏంటి?" షణ్ముగవడివును
ఉద్దేశించి అన్నారు. షణ్ముగవడివుకు చెప్పే అదును కూడా ఇవ్వకుండా, "ఈ రోజు
మీరు నాకొక పదం నేర్పించాలి. మీ 'శివదీక్షాపరురాలరా' నేర్పించరా?" అడిగారు
అయ్యంగార్.

'శ్రీవైష్ణవులు బాగానే ఎంచుకున్నారు పాటని' అని మనసులో అనుకుంటూ పైకి
మాత్రం, "అది పదం కదా మీకు ఎందుకు?" అంది షణ్ముగవడివు.

"మీదాకా వచ్చినట్లు లేదుకానీ ఇప్పుడు పట్నంలో కచేరీలలో కీర్తనలతోపాటు పదాలు,
జావళీలు కూడా వినిపిస్తున్నారు."

'పదం! జావళి! అన్నీ మావే. ఇప్పుడు ఇవి శాస్త్రీయ సంగీత కచేరీలకు వచ్చేశాయా...'
ఒక్కసారి షణ్ముగవడివు మనసు మద్రాసు వెళ్లిపోయింది. తను, తన కూతురు పదం
మీద పదం, జావళి మీద జావళి పాడేస్తుంటే రసజ్ఞులైన శ్రోతలు తమ గానంలో
పరవశించిపోతున్నట్లు ఊహించుకుంటోంది.

పదం!! జావళీ!!! దేవదాసీల గాత్ర [illegible] అవి వారికి.

"షణ్ముగంగారూ! షణ్ముగంగారూ!" మద్రాసునుంచి ఆయన ఇంటికి మళ్లీ తీసుకొచ్చారు అయ్యంగార్.

"నేర్పిస్తారా...?"

"ఆ... తప్పకుండా.. కుంజమ్మ ఎలా పాడుతుందీ?"

"మీ కడుపున పుట్టిన బిడ్డ, మరేమీ ఢోకాలేదు. మీరు నాకు పదం రాసిస్తారా ముందు?"

"ఆ రాస్తాను.. కుంజమ్మ శ్రుతి ఎలా వుంది?"

"భేషుగ్గా వుంది. ఇప్పుడు చెప్పండి... ఏం మొదలుపెట్టను?"

"కుంజమ్మ పాఠాలు ఎంత......"

అయ్యంగార్ పుస్తకం మూసి పక్కన పెట్టారు. తారాస్థాయిలో కుంజమ్మను కేకవేశారు. ఎక్కడో ఆడుతున్న కుంజమ్మ ఒక్క పరుగున వచ్చి గురువుగారి ముందు కూర్చుంది. గురువుగారి కంటిచూపుతో **'సా పా సా'** లు పూర్తిచేసి మొదలుపెట్టమంటారా అన్నట్లు ఎదురుచూస్తుంది.

గురువుగారి సైగ, తాళం ఒకేసారి మొదలయ్యాయి.

సరళీ స్వరాలు అందుకుంది. మూడు కాలాల్లో పాడింది. ఆ తర్వాత జంటస్వరాలు, ధాతువరసలు, పైస్థాయి వరసలు అలానే పాడింది. అయ్యంగారు కళ్లు మూసుకుని వింటున్నారు, ఇంకా కళ్లు తెరవలేదు, కుంజమ్మకు దాని అర్థం తెలుసు. అలంకారాల్లోకి వెళ్లిపోయింది. కుంజమ్మతోపాటు అయ్యంగార్ కూడా తాళం వేస్తున్నారు. షణ్ముగవడివు తాళంవేస్తూ కుంజమ్మ ఎక్కడయినా తాళం తప్పుతుందేమో అని చూస్తుంది. తాళం తప్పకుండా సప్తతాళాల్లో అలంకారాలు పూర్తిచేసింది కుంజమ్మ.

కుంజమ్మకు సంగీతంలో వున్న పట్టు షణ్ముగవడివుకు తెలియంది కాదు, గురువుగారి ముందు తన పేరు నిలబెట్టినందుకు సంతోషపడిపోయింది. కుంజమ్మను మెచ్చుకోబోతుండగా.....

"కుంజమ్మా! అలంకారంతో ఒక సాహిత్యం పాడు" ఆదేశించారు గురువు. షణ్ముగవడివు ఆగిపోయింది. కుంజమ్మ శ్రుతి లయానుగుణంగా పాడింది. ఇప్పుడు అయ్యంగార్ కళ్లు తెరిచి షణ్ముగవడివువైపు గర్వంగా చూశారు, 'ఎలా నేర్పాను మీ అమ్మాయికి?' అన్నట్లు.



షణ్ముగవడివు ఎంతో సంతోషిస్తూ, అయ్యంగారి చేతిలో ఆయన పుస్తకం తెరచిపెట్టింది. అందులో చూస్తే ఆయనక్కావాల్సిన పదం సొక్కులతో సహా రాసి వుంది.

"ఇదెప్పుడు రాశారు...?" 'తల్లి తల్లే పిల్ల పిల్లే' అని మనసులో అనుకొని, "కుంజమ్మ నువ్వు కాసేపు వెళ్లి ఆడుకోమ్మా" అని కుంజమ్మని పంపి షణ్ముగవడివు దగ్గర శిష్యరికం మొదలుపెట్టారు. ఒక గంటకు పదం నేర్చుకోవటం పూర్తయింది.

"ఆగండి. కాస్త ఫలహారం తెస్తాను" అంటూ అరటిపళ్లు, మంచి తీర్థం తీసుకొచ్చాడు. అవి తీసుకొని బయలుదేరుతుండగా, "రేపట్నుంచి కుంజమ్మకు గీతాలు మొదలుపెడతాను, కాస్త తాంబూలం వ్యవహారం చూడండి" అని సెలవిచ్చారు అయ్యంగార్. "తప్పకుండా" అంటూ తల్లీ కూతురూ సెలవు తీసుకొని ఇంటి దారి పట్టారు.

పడమర రాజగోపురం వీధి చాలా హడావుడిగా వుంది. మహాత్మాగాంధీ సారధ్యంలో కొనసాగుతున్న ఉద్యమానికి మదురై ప్రజలు తమ శక్తినంతా ఒడ్డి, స్వాతంత్రోద్యమంలో ఆ ప్రాంతానికి ఉదాహరణగా నిలుస్తున్నారు. తల్లీ కూతుళ్లు వీధికొక పక్కన నడుస్తున్నారు. వీరికి ఎదురుగా ఒక ఊరేగింపు టౌన్‌హాల్ వైపు వెళ్తోంది.

'మహాత్మాగాంధీకి జై,' 'మహాత్మాగాంధీకీ జై' 'తెల్లదొరలు డౌన్‌డౌన్' 'చౌరీచౌర మార్టియర్స్ అమర్‌రహే' అని నినాదాలు చేస్తూ సాగిపోతున్నారు.

కుంజమ్మ అందరినీ కలియచూస్తుంది. ఖద్దర్ బట్టలు వేసుకొని తెల్ల టోపీలు పెట్టుకొని వున్నారు. ఎటో చూస్తున్న కుంజమ్మ, వాళ్లమ్మ చేతిలో కరపత్రాలు అదిమిపెట్టి, "మహాత్మాకీ జై" అని అరుచుకుంటూ ఊరేగింపులో కలిసిపోయాడు ఒక యువకుడు.

ఇంటికి చేరేసరికి భోజనం వేళ అయ్యింది. అందరూ భోజనాలు కానిచ్చారు.

"మణి ఏడి?" అడిగింది షణ్ముగవడివు.

'లేడొదినా, చెట్టి దగ్గరకు వెళ్లాడు."

"సరే, సుందరం! నువ్వెళ్లి కుంజాని బడిలో దించిరా" షణ్ముఖసుందరంకి చెప్పింది.

కుంజమ్మ బడికి వెళ్లగానే తను వీణ సాధనకు దిగింది.



కార్తిక మాసంలో స్వామిభక్తులు ఉపవాస దీక్షలు చేస్తూ కాస్త నీరసించినా, రోజులు మాత్రం అలుపు లేకుండా పరుగు పరుగున వస్తున్నాయి. ఈ రోజుల్లో షణ్ముగవడివు, కుంజమ్మ సూర్యోదయం ముందే సాధన ముగించి, చన్నీళ్ల స్నానం చేసి ఇంటిలో దీపం వెలిగించి, ఇంటి బయట గూటిలో కూడా ఒక ప్రమిద పెడుతున్నారు. ఈ రోజు కూడా సాధన పూర్తయి, దీపం పెట్టి, కుంజమ్మ తనకు గ్రంథపాఠాలు నేర్పే సాధువు కోసం

చూస్తూ కూర్చుంది. పాటలు అయ్యాయి, కుటుంబమంతా గుడికి చేరింది. కార్తీక మాస ప్రత్యేక పూజలు మొదలుపెడుతున్నందుకు సంకేతంగా ధ్వజారోహణ జరగనుంది. కమ్బత్తడి మంటపంలోకి పట్టారులు చేరుకున్నారు. అర్చకులు వేదపఠనం చేస్తున్నారు. కమ్బత్తడి మంటపం వున్న ప్రాకారం చాలా విశాలమైనది. మంటపానికి కాస్త అటుపక్కగా పెద్ద మేళం కూర్చొని వుంది, వారికి ఎదురుగా ఆలయ నర్తకీమణులు వున్నారు. షణ్ముగవడివు కుటుంబం వీరి పక్కన చేరి శాస్త్రోక్తంగా జరుగుతున్న ధ్వజారోహణ కార్యక్రమం చూసి, స్వామివారిని అమ్మవారిని దర్శించుకొని మరలా కమ్బత్తడి మంటపం నుంచి వసంతరాయ మంటపంలోకి వెళుతుండగా, మణిపిళ్లై, రాజం వాదులాడుకొంటూ కనిపించారు. 'ఏందీ ఇక్కడే గట్టిగ అరుచుకుంటున్నారు, అంతగా ముంచుకొచ్చిన విషయమేముంది?' అనుకుంది మనసులో షణ్ముగవడివు.

ఇంటికి వచ్చినా అదే విషయం ఆలోచిస్తుంది. పిల్లలు బడికి వెళ్లిపోయారు. తనకు కూడల్ అలగర్ గుడిలో కచేరి ఉంది. తయారవుతుంది. "మణి ఏడిరా, ఇంకా రాలేదు?" అడిగింది, అందరినీ ఒకేసారి. ఎవరికి సమాధానం తెలిస్తే వాళ్లు తొందరగా చెప్పేయండీ అన్నట్లు.

"వాడెందుకక్కా? నేను వస్తున్నానుగా నీతో" అన్నాడు సుందరం, మృదంగం శ్రుతి చేసుకుంటూ.

"నువ్వు వస్తున్నావులేరా.. అదికాదు గుడిలో......" అంటూ షణ్ముగవడివు తనలో తాను మథనపడుతుంది.

ఇంతలో తలుపు తెరుచుకున్న శబ్దం వినిపించింది. మణియేమో అని చూసింది. మణి కాదు రాజలక్ష్మి. ఇంకా సంతోషం.

"రా రాజం, నీ గురించే ఆలోచిస్తున్నాను.. ఏంటి గుడిలో మణితో గొడవపడుతున్నావు, ఏమైంది?"

"ఏమైందా? చూడు, నీ తమ్ముడి నిర్వాకం. నాకు జత లేకుండా చేశాడు."

ఇప్పుడు అర్థమైంది షణ్ముగవడివుకి మణిపిళ్లై వేళకు ఇంటికి రాకుండా ఏమిచేస్తున్నాడో. వైనాగరం చెట్టిగార్లకి, వాళ్లతోపాటు వస్తున్న శ్రీమంతులకి దేవదాసీలకు జత కుదురుస్తున్నాడు. ఈ జతగూర్చే తంతు, దేవదాసీల వయస్సు, వారి అందచందాలు, వారు నేర్చిన కళలు, వారి గుణగణాలనుబట్టి వుంటుంది. పైచేయి ఆ చెట్టిగార్లదే అయినా దేవదాసీలూ బెట్టు చేయొచ్చు. రాజం మరీ బెట్టు చేసిందేమో ప్రస్తుతానికి ఎవరితోనూ జత కట్టలేకపోయింది. మణిపిళ్లై తనగురించి చెట్టిగార్లకు సరిగ్గా ప్రస్తావించలేదని రాజం వాదన. "నేను వట్టి దిగదుడుపుననే లెక్కకు వచ్చేశాడు నీ తమ్ముడు" అరిచింది రాజం.



"అదికాదులే రాజం... నేను వాడికి గట్టిగా చెపుతాను చూడమని.."

ఇంతలో మణిపిళ్లై వచ్చాడు. అర్థమయింది అక్కడ ఏం జరుగుతుందో. దాపుమీద అక్క పక్కన కూర్చున్నాడు.

"నాకేదో వయస్సు అయిపోయిందనుకుంటున్నావేమో, మీ అక్క నేను ఒకే వయసువాళ్లం" చెప్పింది మణిపిళ్లైకే, చూసింది మాత్రం షణ్ముగవడివువైపు.

"చూస్తున్నాను... తొందరలోనే కుదురుస్తాను" చెప్పింది రాజంకి, కానీ చూసింది షణ్ముగవడివు వైపు.

"మీకేం షణ్ముగం అయితే మేళం వాళ్లయ్యారూ, లేకపోతే ఏదో ఒక కళ అబ్బింది, నాకు ఏదీ లేదు. మరి నా సంగతేంటి?" అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంది. షణ్ముగవడివుకు చాలా బాధవేసింది. లోపలికి వెళ్లి కాస్త డబ్బులు తీసుకొచ్చి రాజం చేతిలో పెట్టి "పద, నాతో కచేరీకి, తంబూర వేద్దువు" అంది.

"ఆ... ఆ తంబూర పట్టుకోవటంవస్తే నీ వెనకే వుండేదాన్నికదా. అంత అదృష్టం లేదు తల్లీ నాకు." షణ్ముగవడివు ఇచ్చిన డబ్బులు తీసుకొని, "నువ్వు పట్టుపట్టి వాడిచేత పనయ్యేటట్టు చూడు" అంటూ వెళ్లిపోయింది.

షణ్ముగవడివు, సుందరం కచేరీకి బయలుదేరారు. నడుస్తూ ఆలోచిస్తూ ఉంది షణ్ముగవడివు. ఇప్పటికి, దేవదాసీలు మూడు రకాలుగా కనిపిస్తున్నారు. మొదటిది మణిమాన్యాలుండి, సమృద్ధిగా ఆర్థిక వనరులు వున్న ఆలయాల్లో నాట్యగత్తెలుగా వున్న దేవదాసీలు, రెండవరకం లలిత కళల్లో ఆరితేరినవారైయుండి వారి జీవనోపాధికి కళలమీద ఆధారపడేవారు, ఇక మూడోరకం వారు ఏ కళలూ అబ్బని కళావంతులు. దేవదాసీ కుటుంబాలు తరతరాల నుంచీ వారి తనువు, మనస్సులను కళల్లో తడిపి ముద్దచేస్తున్నా ఏ పూర్వజన్మ శాపమో కొంతమంది కళలో నైపుణ్యం సాధించలేకపోతారు.

షణ్ముగవడివుకు తెలిసి మొదటిరకం వాళ్లు చూడామణి వర్గం, రెండవరకం వాళ్లు తనలాంటివాళ్లు, ఇక మూడవ రకం వాళ్లు ఇప్పుడు ఏడ్చి వెళ్లిన రాజం వర్గం వాళ్లు. చూడామణి వర్గాన్ని ఆలయాలు పోషిస్తున్నాయి, తనని రసజ్ఞులు పోషిస్తున్నారు, రాజం లాంటివాళ్లే ఎటూ కాకుండా పోతున్నారు. అప్పటికీ తక్కిన దేవదాసీలు రాజం లాంటివారికి వెన్నంటి వుండి వారికి అండగా వుంటున్నారు.

"చెట్టిగార్లు వున్నప్పుడే రాజం ఇల్లు చక్కదిద్దాలి" అనుకుంది షణ్ముగవడివు. ఈలోపు కూడల్ అలగర్ ఆలయం వచ్చేసింది. ఇరవైమంది దాకా రసజ్ఞులు వీణ కచేరీ కోసం ఎదురు చూస్తున్నారు.



మార్గశిరమాసంలో ఉరుముల మెరుపుల తని అవర్తనాలతో నిద్రలేచింది షణ్ముగవడివు కుటుంబం. సంగీత సాధనలు పూర్తి అయ్యేసరికి కూడా వర్షం తెరిపి ఇవ్వలేదు. కుంజమ్మ కిటికీలోంచి చూస్తుంది, తనకి పాఠం చెప్పే సాధువు వస్తాడేమోనని.

'కుంజా! ఈ రోజు ఇంకేం వస్తాడు? నువ్వు చదువుకో" అంది అత్త.

కుంజమ్మ బడి పుస్తకాలు తీయకుండా తంబూర తీసింది. తంబూరను శ్రుతి చేసి, తంబూర స్వరాలను శోధిస్తూ కూర్చుంది. వర్షం వెలిసేసరికి బారెడు పొద్దెక్కింది. వెంటనే షణ్ముగవడివు కుంజమ్మని, కొడుకుని తీసుకొని ఇంట్లోంచి బయటకు వచ్చేసింది. గుడి దగ్గరలోని ఒక కొట్టులో పూలు, టెంకాయ, కొన్ని పళ్లు, పటికబెల్లం గబగబా కొనేస్తోంది. అమ్మ కొనుగోలు శక్తి చూసి పిల్లలిద్దరూ నోరెళ్లబెట్టారు. ఇద్దరి నోట్లో చెరొక పటికబెల్లంముక్క పెట్టి వాళ్ల నోర్లు మూయించింది. కుంజమ్మ గురువుగారు ఈ రోజునుంచి గీతం మొదలుపెడుతున్నారు. ఆయనే తాంబూలం ఏర్పాటు చూడమన్నారు. తన కూతురికి కళ నేర్పేదగ్గర రాజీపడదు ఈ కళావంతురాలు.

అయ్యంగారి ఇంటికి చేరారు. తాంబూలాలు ఇచ్చుకోవటం దీవెనలు పుచ్చుకోవటం అయ్యాయి. "కూర్చోండి, మీరు మొన్న నాకు నేర్పిన పదం పాడి వినిపిస్తాను చూడండి" అంటూ అయ్యంగార్ హడావుడిగా తంబూర తీశారు. గీతాలు మొదలుపెడితే విని వెళ్దామనుకుంది షణ్ముగవడివు. కుంజమ్మ గురువు కాబట్టి వినక తప్పలేదు.

"మీరు పాడండి, నేను తంబూర వేస్తాను" అని షణ్ముగవడివు తంబూరా తీసుకుంది.

అయ్యంగార్ తీరిగ్గా పాడారు.

"ఎలా పాడాను?"

"బాగుంది."

ఇంకా ఎక్కువ పొగడనందుకు కాస్త నిరాశపడ్డారు అయ్యంగార్. ఇక కుంజమ్మకు గీతాలు మొదలుపెట్టారు. ఇప్పటిదాకా గురుముఖతా స్వరపాఠాలు నేర్చుకుంది. స్వరాలు కుంజమ్మకు ఎప్పుడోవచ్చు. స్వరాలే కాదు, అంతకన్నా ఎక్కువే తెలుసు. కుంజమ్మకు సంగీతమే తెలుసు. గురువు చేస్తుంది కుంజమ్మ సంగీతాన్ని వినడమే, కర్ణాటక పద్ధతిలో అనాహత నాదాన్ని బయటకు వినిపించేలా చేయడమే.

కుంజమ్మ పాఠం అయ్యేదాకా షణ్ముగవడివు కూడా వుండి, కుంజమ్మను బడిలో వదిలి, తర్వాత ముఖ్యమయిన పనిమీద బయలుదేరింది. 'వకీలుగారు వుంటారో లేదో' అనుకుంటూ వడివడిగా నడవటం మొదలుపెట్టింది. ఆయన ఇంటికి వచ్చేసరికి, వకీలు శ్రీనివాసరావు కచేరికి బయలుదేరుతున్నాడు. ఆయన ఇంటి బయటకు వచ్చి గుర్రబ్బండి



ఎక్కేలోపల షణ్ముగవడివు ఎదురుపడింది. షణ్ముగవడివును చూసి, "మంచి శకునం, రామార్! నిత్యసుమంగళి ఎదురయింది, కేసు గెలుస్తాం" అంటూ తన క్రింది ఉద్యోగికి చెప్పాడు. దేవదాసీలు నిత్యసుమంగళులు. అఖండుడిని పెళ్లాడతారు కాబట్టి అఖండ సౌభాగ్యవతులవుతారు. ఇప్పటికీ సమాజంలో కొన్ని వర్గాలనుంచి దేవదాసీలు అఖండమైన మర్యాదలను అందుకుంటున్నారు. అది కొద్దిమందినుంచే. కొన్ని వర్గాలనుంచే. షణ్ముగవడివు ఈ తేడాని గమనించకపోలేదు.

"ఏమిటో కనుక్కో రామార్" అంటూ బండి ఎక్కి కూర్చున్నాడు శ్రీనివాసరావు.

"గ్రామఫోను ప్లేటుల సంగతంట..." వెనక్కివచ్చి చెప్పాడు రామార్.

"ప్రస్తుతం వాళ్లు కలకత్తాలో చేస్తున్నారు, అక్కడయిన తర్వాత ఇటు వస్తారని చెప్పు."

రామార్ వచ్చిచెప్పి శ్రీనివాసరావుతో బండి ఎక్కాడు, బండివాడు పగ్గాలు విదిలించగా గుర్రం సకిలించి ముందుకు వురికింది. షణ్ముగవడివు బండికి ఎదురుగా నడుచుకుంటూ ఇంటికి బయలుదేరింది.

గ్రామఫోన్ల ప్లేటుల గురించి తనకు రెండు పదుల వయస్సున్నప్పుడే విన్నది. ఆ తర్వాత ఇంకో పదేళ్లకు గ్రామఫోన్ను చూసింది. అయినా ఇప్పటికి కూడా ఆ మైనం ప్లేటులోంచి పాటలు, మళ్లీ ఆ పాటలలో హిందుస్థానీ పాటలు, కర్ణాటక పాటలు ఎలా వస్తున్నాయో షణ్ముగవడివుకి అర్థంకాలేదు. కాని అర్థమయ్యిందల్లా కచేరీలలోలాగా ఏ యాభైమంది ముందో, వందమంది ముందో పాడకపోయినా, ఒక మూయబడిన చిన్న గదిలో ఒక్కటే పాడుకున్నా డబ్బులు ఇస్తున్నారు.

గత పదేళ్లనుంచి తనను ఊరిస్తున్న గ్రామఫోను ప్లేట్లగురించి ఆలోచిస్తూ తన ఇంటి వీధి మొదలుదాకా వచ్చింది. ఈ మొదలు పడమర రాజగోపురం వైపు కాకుండా, ఇంకో చివరన. అటువైపు పెద్దవీధిలో జమిందారు బంగళాలు వుంటాయి.

"షణ్ముగం! షణ్ముగం! వస్తున్నా ఆగు" అంటూ రాజం గొంతు వినిపించింది. అటువైపు చూస్తే ఒక జమిందారు బంగళాలోనుంచి వస్తూ రాజం కనిపించింది. ఆకులు నములుకుంటూ చాలా హుషారుగా వస్తుంది.

'హమ్మయ్య, దీనికి జత దొరికింది' అనుకుంది షణ్ముగవడివు.

"షణ్ముగం! మా జమిందారుగారు నన్ను పట్నం రమ్మంటున్నారు..పట్నంలో బాలామణి హరికథ ట్రూప్ పెట్టిందట..నన్ను అందులో చేర్పిస్తానన్నారు...పట్నం వెళ్లనా?" ఉత్సాహంగా అడిగింది రాజం.

"కాళ్లు విరుగుతాయి వూరు వదిలావంటే" తలెత్తకుండానే చెప్పింది షణ్ముగవడివు. రాజం బాగా అర్థం చేసుకున్నట్లువుంది. ఇంక ఆ విషయం గురించి ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ కలిసి ఇంటికి చేరారు.

"ఏంటి రాజం, ఉపవాసాలు మొదలుపెట్టావా ఏంటి, స్నానం చేసి శుభ్రంగా వున్నావు" అడిగింది చిత్ర.

"ఉపవాసాలు మీలాంటి వాళ్లకమ్మా, మాకు జాగారాలేనమ్మా" అంది సుతారంగా ఆకులు నోట్లో పెట్టుకుంటూ. ముసిముసిగా నవ్వుకున్నారు షణ్ముగవడివు, వాసంతి, చిత్ర. "షణ్ముగం! అమ్మాళ్లు కూతురు విషయం గుర్తుందిగా నీకు, పూర్ణిమ రోజున, మీనాక్షీ అమ్మవారి ఆలయంలో, మర్చిపోకు" అనుకుంటూ తమలపాకుల పెట్టె సర్దుకొని బయలుదేరింది.

"ఏముంది వదినా ఆరోజు...?" అడిగారు మరదళ్లు.

"ఏముంది? అమ్మాళ్లు కూతురుని ఆలయానికి ఇస్తుంది" చెప్పింది షణ్ముగవడివు.

𝄞𝄞

పూర్ణిమ ఇంకా పదిరోజులు వుందనగా ఆలయంలో తిరువెంబావై తిరుప్పళ్ళి యెళుచ్చి ఉత్సవాలు మొదలయ్యాయి. ఈ పదిరోజులు ఆలయ పట్టారులు అరవైముగ్గురు నాయనార్లులో ఒకరయిన మానిక సాగర విరచిత తిరువెంబావై శ్లోకాలు పఠిస్తారు. ఆలయ దేవదాసీలు తిరుప్పళ్ళి యెళుచ్చి అనగా మేలుకొలుపులు పాడతారు.

ఉత్సవాలు మొదలైన రోజునుంచే షణ్ముగవడివు, కుంజమ్మ వారి సాధన సమయాన్ని కాస్త కుదించి, తొలి పూజవేళకి ముందే స్వామి సన్నిధికి చేరుకున్నారు. గర్భగుడి బయట చూడామణి, తిలకం, అమ్మాళ్లు, కనకాంబుజం, మరకతం నుంచొని మేలుకొలుపులు పాడుతున్నారు. స్వామి ఇంకా లేవలేదు. తెర మూసి వుంది.

గుడికి వచ్చే దోవలోనే చెప్పింది తల్లి, "కుంజా! ఈ పదిరోజులే పాడతారు మేలుకొలుపులు, తర్వాత పాడరు. మనం ఈ పదిరోజులూ వద్దాము, నువ్వు బాగా విను" అని. ఇంక కుంజమ్మ వొళ్లంతా చెవులే. శ్రద్ధగా మేలుకొలుపు పాటలు వింటుంది.

'ఎలమి తోడతో కోడి కూసెను
ఇందువెన్నెల కాంతి మాసెను
జలజములు వికసించి
పువ్వులు సౌరభమయ్యెన్
దేవా మేలుకొనవయ్యా...'

షోడశోపచారాలలో ఒకటైన పుష్పాంజలిని స్వామికి సమర్పిస్తున్నారు. దేవదాసీలు గర్భగుడి వెలుపలనే నుంచొని స్వామికి పూలు సమర్పిస్తూ తిరువెంబావైలోని శ్లోకాలు పాడుతున్నారు. వీరి వెనుక ఉండి కనకాంబుజం పుష్పాంజలి అభినయిస్తుంది. షోడశోపచారాలు పూర్తయిన తర్వాత పట్టారు చూడామణివైపు తిరిగాడు. తొలి



పూజలందుకొని భక్తకోటికి దర్శన భాగ్యం ఇవ్వటానికి తయారుగావున్న సుందరేశ్వరునికి, కుంభ హారతితో దిష్టితీసింది చూడామణి. ఇప్పుడు సుందరేశ్వరుడు తెర తీసుకొని భక్తులకోసమై కొలువైఉన్నాడు.

షణ్ముగవడివు, కుంజమ్మ స్వామిని దర్శించుకొని, ఇంటి దారి పట్టారు.

దారిలో, "అమ్మా! ఆ మేలుకొలుపు పాట ఏ రాగం?" అడిగింది కుంజమ్మ.

"భైరవిరాగం."

"తాళం నేను చెప్తానమ్మా! ఆదితాళం!" అంది తొందర తొందరగా కుంజమ్మ అమ్మ ఎక్కడ చెప్పేస్తుందోనని. నడుస్తున్న కూతురిని చంకకి ఎత్తుకుంది షణ్ముగవడివు.

"రోజూ అన్న మొదట వాయించేది ఈ తాళమే కదా" అంది కుంజమ్మ.

𝄞𝄞

ఒక వారంరోజులు అమ్మాళ్లు హడావుడి సరిపోయింది షణ్ముగవడివుకి. ఒక రోజు గజ్జె పూజతో, తరువాతి రోజు కత్తి కల్యాణంతో, ఆ తర్వాత ఊయల వేడుకతో, అమ్మాళ్లు కూతురు తొమ్మిదేళ్ల రూపవతి సుందరేశ్వరుని ఆలి అయ్యింది. సంఘ సంస్కరణ వాదుల చప్పుళ్ల మధ్య, చట్టసభల ముసాయిదాల బెదిరింపుల మధ్య, రూపవతి తన కుడిచేతి భుజం మీద త్రిశూలం ముద్ర అద్దించుకొని మీనాక్షీ అమ్మవారి ఆలయానికి దేవదాసీ గావించబడి, మీనాక్షీ సుందరేశ్వరుల సేవకు అంకితమయ్యింది. ఈ వ్యవహారమంతా ఆలయ ముఖ్య దేవదాసీ అయిన చూడామణి కనుసన్నల్లో జరిగింది.

ఈ హడావుడి అంతా అయిన తరువాతి రోజు ప్రొద్దున సాధన, గ్రంథసాధువు పాఠం ముగించుకొన్న కుంజమ్మని తమ్ముడితో అయ్యంగారి ఇంటికి పంపింది. కాని వెంటనే వెనక్కు వచ్చారు.

"అక్కా! అయ్యంగారు ఊరికి వెళ్లారంట, వెళ్లి రెండురోజులయిందంట, రాగానే కబురుపెడతానన్నారు" చెప్పాడు సుందరం.

"నీకు చెప్పారా కుంజా గురువుగారు?" కూతుర్ని అడిగింది షణ్ముగవడివు.

"ఎప్పుడో ఒకసారి చెప్పారమ్మా, ఊరెళ్లివస్తాను, నువ్వు మీ అమ్మతో బాగా సాధన చేసుకో అన్నారు."

"బాగుంది" నిట్టూర్చింది షణ్ముగవడివు. కూతురికి పాఠాలు ఆగిపోవడం ఏమాత్రం నచ్చలేదు. "పాఠాలు ఎక్కడిదాకా అయ్యాయమ్మా?"

"ఒక వర్ణం మొదలుపెట్టారమ్మా."

"తాంబూలం లేకుండానే వర్ణాలు మొదలుపెట్టారా...ఆc... నా పదంకి ఐదువేలన్నమాట."

"ఊరు నుంచి వచ్చిన తర్వాత నిన్ను పిలుస్తానన్నారమ్మా."

"సరే, కాసేపాగి బడికివెళ్లు" అంటూ ఇంటి పనుల్లోకి వెళ్లిపోయింది షణ్ముగవడివు.

❧ ❧

రోజూ ప్రొద్దున సాయంత్రం రెండుపూటలు వెళ్లేది గురువుగారి దగ్గర పాఠాలకి. గురువు లేకపోయేసరికి చాలా తీరికవున్నట్లుంది కుంజమ్మకి. వారం రోజులయ్యింది గురువుగారి ఇంటి నుంచి కబురులేదు. ఆరేళ్ల కుంజమ్మకి ఆటలు, అల్లరి, వేరే ధ్యాసలు ఎక్కువయ్యాయి. రోజూ కిటికీకి వున్న అద్దంలో చూసుకొని బొట్టుపెట్టుకుంటున్నప్పుడు ఎదురింటి పిల్లకూడా తల దువ్వుకొని బొట్టుపెట్టుకునే ముందు మొహానికి ఏదో రాసుకోవడం గమనించేది. నాలుగు రోజులనుంచీ ఆ అమ్మాయి బయటకు రాగానే ఏదో విషమీద బయటకు వెళ్లి దగ్గరగా చూసొస్తుంది. మొహం తెల్లగా వుండి సువాసన వస్తుంది. కుంజమ్మకి ఇక ఆశ మొదలయ్యింది. అత్తని అడిగింది, "అత్తా! ఎదురింటి దేవి ఏమి రాసుకుంటుంది మొహానికి?"

"అదా... గోడకు సున్నంలాగా అది రాసుకుంటే తెల్లగా కనపడతారు."

అవును, అత్త చెప్పింది నిజమే. దేవి తెల్లగా వుంటుంది అది రాసుకుంటే. ఇక ఆలోచన మొదలైంది కుంజమ్మకి. గోడలన్నీ పరికించి చూసింది. ఆ తరువాతి రోజూ ప్రొద్దున్నే అమ్మ తల దువ్వగానే అద్దం ముందుకొచ్చింది. ఎవరూ లేనప్పుడు దువ్వెన తీసుకొని గోడని గీకడం మొదలుపెట్టింది. ఒక గిన్నెలోకి జారుతున్న సున్నం పట్టుతోంది. కాస్త పడగానే అది తీసుకొని మొహానికి రాసుకుంటుంది. చాలాసేపు అలా చేస్తూనేవుంది. వినివిని ఆ శబ్దం, 'ఏంటిదీ..' అనుకుంటూ అమ్మ వచ్చింది. చూసింది, గోడకుండాల్సిన సున్నం అంతా కుంజమ్మ మొహం మీద వుంది. దువ్వెన ఇక పనికి రానంటుంది. షణ్ముగవడివుకి కోపం కట్టలు తెంచుకొంది. ఒక్క లెంపకాయ ఇచ్చింది కుంజమ్మకి.

"పిచ్చివేషాలు, వున్న తెలుపు సరిపోలా నీకు? ఇంటి ఆయన చూస్తే ఏమంటాడు, వెళ్లి మొహం కడుక్కో."

ఈ లెంపకాయ శబ్దానికి అందరూ వచ్చారు ఏంటో అనుకుంటూ. కుంజమ్మ ఏడుస్తూ అన్నదగ్గరికి వెళ్లింది.

"చెల్లీ, ఏడవకమ్మా. నీకెవరు చెప్పారు సున్నం రాసుకోమని?"

"అత్త చెప్పింది. ఎందుకంటే దేవి అదే రాసుకుంటుంది."



"ఛీ, అత్తలకేమీ తెలియదు, అది సున్నం కాదు, అది వేరే, అది కొట్లో వుంటుంది నేను తెస్తాలే నీకు."

"అమ్మ డబ్బులు లేవంటుందిగా."

"నేను మామ దగ్గర తీసుకొని నీకు తెస్తాగా. నువ్వు ఏడవకు" అంటూ చెల్లిని సముదాయించాడు.

"ఒరేయ్ మణీ! వెళ్లి అయ్యంగార్ వచ్చారో లేదో కనుక్కొని రారా. దీన్ని ఇలా వొదిలేస్తే ఇంటికి మళ్లీ సున్నం వేయించేలావుంది" పెరట్లోనుంచి అరిచింది షణ్ముగవడివు.

సాయంత్రం ఇంటికి వస్తూ సరుకులతోపాటు అయ్యంగారినుంచి చప్పటి వార్త పట్టుకొచ్చాడు మణిపిళ్లై, అయ్యంగారి నుంచి ఎలాంటి కబురు లేదని.

కుంజమ్మ పొద్దుట్నుంచి అమ్మను భయంభయంగా చూస్తూ దూరంగా వుంటుంది. రాత్రికి కుంజమ్మ పక్కన పడుకున్నప్పుడు, తల్లి పిలిచింది.

"కుంజా!"

పలకలేదు కుంజమ్మ.

"నా మారాణి, నా చిన్నిమారాణి! కుంజా! నా మారాణి!" అంటూ లాలనగా పిలిచింది.

చెంగున తిరిగింది కుంజమ్మ. వాళ్లమ్మ పిలిచినందుకు కాదు, వాళ్లమ్మ పిలిచిన పిలుపులకి, 'చిన్నిమారాణి' అని కుంజమ్మని వాళ్ల నాన్న పిలుస్తారు. అది షణ్ముగవడివుకు తెలుసు. కాసేపు కుంజమ్మని ముద్దుచేసింది.

"దెబ్బ బాగా తగిలిందా నాన్నా పొద్దున్న... నువ్వు అలా గోడ పాడు చేశావంటే ఇల్లుగల్లాయన మనచేత డబ్బు కట్టించుకుంటాడమ్మా. అలా చేయకు."

"ఊ..."

"నీకు ఏ కాస్త ఖాళీ దొరికినా నువ్వు సంగీతం గురించే ఆలోచించాలి కుంజా, నువ్వు నేను ఎదురింటి దేవి వాళ్లమ్మలాగా కాదమ్మా, దేవి వాళ్ల నాన్న డబ్బులు తీసుకొచ్చి ఇస్తే వండి వారుస్తూ కూర్చోవటానికి, మనమే డబ్బు సంపాదించుకోవాలి, మనం సంగీతం నేర్చుకుంటుంటేనే మనకి డబ్బు ఇస్తారు. సంగీతం లేకపోతే మనల్ని ఎవరూ పట్టించుకోరు. మనం గంధర్వ కాంతలలాంటివాళ్లం."

కుంజమ్మ అమ్మవైపు చూస్తూ వింటూవుంది. రెండు అనుమానాలొచ్చాయి. మొదటిది, "అమ్మా... నాన్న మనకు డబ్బులివ్వటంలేదా?"

"ఎక్కడిస్తున్నారమ్మా? నువ్వు చూస్తూనేవున్నావుగా, ఎప్పుడైనా ఇస్తారా."

"ఎందుకివ్వరు?"

"నీకు అర్థం కాదులే ఇప్పుడే."

కాస్త ఇప్పుడే అర్థమయ్యింది కుంజమ్మకి. ఎప్పుడైనా నాన్నను చూద్దామని బడినుంచి వచ్చేప్పుడైనా, బడికి వెళ్లేప్పుడైనా దోవ మార్చి నాన్న బంగ్లా ముందునుంచి వెళితే, ఆ ఇంటావిడ పిల్లలని చంకనేసుకొని, కుంజమ్మ, శక్తి వైపు కొరాకొరా చూస్తూ వుంటుంది.

కాసేపున్న తర్వాత ఇంకొక అనుమానం బయటపెట్టింది.

"గంధర్వకాంతలెవరు?"

"వాళ్లు ఇంద్రలోకంలో వుంటారు, వాళ్లకి సంగీతమే లోకం, కళల్లో వారికి రానిదంటూ ఏమీలేదు. అందుకే వాళ్ల ముందు ఇంద్రుడు చంద్రుడు మోకరిల్లుతారు, నువ్వు కూడా బాగా సంగీతం నేర్చుకున్నావంటే గొప్పగొప్పవాళ్లందరూ నీకు సలామ్ కొడతారు, నీకు దేనికీ తక్కువ వుండదు. అదృష్టవశాత్తు నీలో సంగీతపు విత్తు వుంది, దానిని చక్కగా వృద్ధి చెయ్యాలమ్మా. నాలా డబ్బులుకి తిప్పలు పడనవసరంలేదు. బాగా నేర్చుకుంటావుకదా కుంజా" బ్రతిమిలాడుతూ అడిగింది తల్లి.

"ఊ" అంది కుంజమ్మ బాగా అర్థం చేసుకున్నదానిలా.

𝄞 𝄞

నాలుగు రోజుల తర్వాత ఒక సాయంత్రం అందరూ ఇంట్లో ఉన్నప్పుడు మణి హడావుడిగా వచ్చి, "అక్కా! కుంజా గురువుగారు అయ్యంగార్ వాళ్ల ఊళ్లోనే జబ్బు వచ్చి చనిపోయాడంట" అని పెద్దగా ప్రకటించాడు.

కుంజమ్మ కూడా వింది.

"అయ్యో పాపం... చిన్నవాడే, భగవంతుడా!" అనుకొంటూ షణ్ముగవడివు కుంజమ్మను చూసింది, కుంజమ్మ నోరుతెరిచి ఏమీ అర్థంకానట్టు నుంచుంది. రాత్రికి అన్నం తినబుద్ధి కావటంలేదంది కుంజమ్మ. వొళ్లు వేడెక్కింది. షణ్ముగవడివుకి అర్థమయ్యింది. అయ్యంగారి వార్తకు కుంజమ్మ దడుచుకుంది. ఆ రాత్రంతా జ్వరం వుంది. శక్తి చాలాసేపటివరకూ మేలుకొని పడుకున్నాడు. పొద్దున్నే మణి లేచాడు, "అక్కా నువ్వు పడుకో, నేను చూస్తా, నేను దీనిముందు చెప్పకుండా వుండాల్సింది" అని మెల్లగా అన్నాడు. తెల్లవారింది. ఎవరో తలుపుకొట్టారు. షణ్ముగవడివు తలుపు తీయగా గ్రంథ సాధువు కనిపించాడు.

"పాప ఏదీ?"



"దానికి జ్వరం, ఈ రోజు చదువుకోలేదు" అని చెప్పి, 'తలుపేసుకోనా ఇక' అన్నట్లు చూసింది.

"నేను కాశీకి వెళ్లిపోతున్నాను."

"మీరూ వెళ్లిపోతున్నారూ..?" అని, కాసేపు సందిగ్ధంలో పడింది షణ్ముగవడివు. 'ఈయన పోయిన తర్వాత కుంజా తప్పకుండా అడుగుతుంది, వెళ్లిపోయారు, ఇక రారు అంటే, మళ్లీ ఇదే కథ అవుతుందేమో, ఎందుకైనా మంచిది, ఒకసారి కుంజాని చూడమంటే మేలు' అనుకొని,

"ఒకసారి కుంజాకి చెప్పి వెళ్లండి" అని లోపలికి పిలిచింది సాధువుని. కష్టంమీద కుంజమ్మ గోడకు ఆనుకొని కూర్చొంది. సాధువుని చూసి ఆనందపడుతూ నవ్వింది, నమస్కారం చేసింది.

"దీర్ఘాయుష్మాన్ భవ" అని కుంజమ్మ నుదిటిమీద విభూతి రాశాడు. "తగ్గిపోతుంది కుంజమ్మా, రేపటికల్లా తగ్గిపోతుంది, నువ్వు బాగా సంగీత సాధన చేసుకో, పైకొస్తావు. నువ్వు గంధర్వ కాంతవు, కళలకు కాణాచివవుతావు."

ఆ చివరిమాటకు కుంజమ్మ, షణ్ముగవడివు ఒకళ్లనొకళ్లు చూసుకున్నారు.

యాదృచ్ఛికమో, దైవసంకల్పమో, సాధువు దగ్గర నుంచి ఆ మాట వినేసరికి షణ్ముగవడివు సాధువు కాళ్లకు నమస్కరించుకుంది. "నేను మా ఊరు వెళుతున్నాను తల్లీ ఇంకెప్పుడు వస్తానో చెప్పలేను." సాధువు సెలవు తీసుకుంటుండగా, "స్వామీ ఆ విభూతి ఇవ్వండి, రేపు పెడతాను చెల్లికి" అంటూ, సాధువు నుంచి విభూతి తీసుకున్నాడు శక్తి.

ఆ తరువాతి రోజుకల్లా కుంజమ్మకి జ్వరం తగ్గింది. కానీ ఈలోపలే షణ్ముగవడివు చాలా మొక్కులు మొక్కుకుంది.

"మణీ! పొన్నుసామిని కనుక్కొనిరా. కుంజాకి తొందరగా ఒక గురువు కావాలని" పురమాయించింది షణ్ముగవడివు. సాయంత్రంకల్లా పొన్నుసామి, సుందరేశ భట్టర్ అనే విద్వాంసుడుని తీసుకొచ్చాడు.

"అక్కా! చూడు, కుంజమ్మ కోసం ఎవరిని తెచ్చానో చూడు, నీకు తెలుసుకదా వీరెవరో..."

"ఆయన తెలియనివారెవరురా? మహావిద్వాన్ సేతూర్ జమీన్ ఆస్థాన విద్వాంసుడు ఫిడేల్ సుందరేశ భట్టర్‌గారు" అదేదో 'రాజాధిరాజ మహారాజ తిరుమల నాయక శౌరి' అన్న లెక్కలో చెప్పింది.

పూర్తి అధికార లాంఛనాలతో పిలిచేసరికి, సుందరేశ భట్టర్ ఉబ్బితబ్బిబ్బైపోయాడు.

"పిల్ల ఏదీ? ఎంత వయస్సు పిల్లకి?"

"తెప్పోత్సవం చూడటానికి వెళ్లింది మామతో, పిలిపిస్తాను, ఆరేళ్లు."

"సరైన వయస్సు, నా దగ్గర పెట్టండి, గానగంధర్వురాలని చేస్తా."

'గాన గంధర్వురాలు' ఈసారి ఉక్కిరిబిక్కిరైపోవటం షణ్ముగవడివు వంతయింది.

"ఉండండి ఫలహారం తీసుకొస్తా" అంటూ వంటగదిలోకి వెళ్లి ఫలహారం తెచ్చిపెట్టింది.

"పిల్ల చిన్నదేగదా, మా ఇంటికి పంపండి, తర్వాత నేనే మీ ఇంటికి వస్తాను, మంచి రోజు చూసి నేను కబురు పెడతాను" సెలవు తీసుకుంటూ చెప్పాడు సుందరేశ భట్టర్.

కాస్త దూరం వీధి లోకి వెళ్లిన తర్వాత పొన్నుస్వామి ఒక్కడే వెనక్కి వచ్చాడు, "అక్కా! నువ్వు దక్షిణ గురించి ఏమీ మాట్లాడలేదు..." అడిగాడు షణ్ముగవడివుని.

"ఆయనెంత విద్వాంసుడో, అంత బోళారా. మంచతన్ని తెచ్చావు, నేను చూసుకుంటాలే ఆ విషయం" అంది షణ్ముగవడివు.

క్రొత్త గురువుగారి దగ్గర సంగీతాభ్యాసంతో కుంజమ్మ రోజువారీ కార్యక్రమాలు గాడిలో పడ్డాయి. మళ్లీ స్వరాల నుంచీ మొదలుపెట్టి త్వరత్వరగా వర్ణాల్లోకి వచ్చింది.

గురువు సుందరేశ భట్టర్ చెప్తున్నారు, "కుంజమ్మా! వర్ణాలు నిన్ను అభ్యాసగానం నుంచి సభా గానంకు తీసుకువెళ్తాయి. వర్ణాలు చాలా వుంటాయి. అన్నీ నేర్చుకున్నావంటే నువ్వు ఇక కచేరీ సభ చెయ్యొచ్చు, నేను ఫిడేలు వాయిస్తా నీకు." అణుకువతో విన్నది కుంజమ్మ.

రోజులు గడిచేకొద్దీ కూతురు సంగీతం విషయంలో కుదుటపడింది షణ్ముగవడివు.

**ప : విరిబోణి నిన్నే కోరి మరులుకున్నదిరా**

**అప : సరసుడౌ దక్షిణ ద్వారక సామి శ్రీ రాజగోపాల దేవ**

**చ : చిరునవ్వు మోమున**

*పచ్చిమిరియం ఆదియప్పయ్య (18వ శతాబ్దపు తొలి దశకాలు) వర్ణం,*
*రాగము - భైరవి, తాళము - అట*

𝄞𝄞

1923 వ సంవత్సరంలో సంప్రోక్షణ పనులు ఊపందుకుంటున్నాయి. మదురై కొచ్చే చెట్టిగార్ల పుణ్యమాని, మదురై దాసీలకెలాంటి లోటు లేదు. మణిపిళ్లైకి ఇంకస్సలు లేదు, జతలు కూర్చి కూర్చి జేబులు ఘల్లుఘల్లుమంటున్నాయి. రెండు రోజులకొకసారైనా



నాగపట్నం హల్వా పొట్లాలు ఇంటికి తెస్తూ పిల్లలకు పెద్దలకు ఇష్టుడైపోయాడు. ఈ ఇరవైయవ శతాబ్దం మొదలులో చెట్టి కులంలోగాని, బ్రాహ్మణ కులంలోగాని, ఇంకా ఇతర 'ఉన్నత' కులాలకు చెందిన పురుషులు పెళ్లి చేసుకున్న భార్య కాకుండా ఇంకొక స్త్రీని చేరదీయటం పరిపాటి. ఈ స్త్రీలను దేవదాసీ కుటుంబాలే అందిస్తాయి సమాజానికి. ఈ వ్యవస్థలో అటు ఆ పురుషుడుకికాని, ఈ దేవదాసీ స్త్రీకి కాని వారివారి గౌరవానికి ఎలాంటి భంగం కలగదు. ఎన్నో వందల ఏండ్ల క్రితం మొదలయ్యి ఇప్పటికీ అందరికీ ఆమోదదాయకంగా స్థిరపడింది ఈ వ్యవస్థ. బెంగుళూరు నాగరత్నమ్మ ఒక గొప్ప దేవదాసి, దక్షిణ భారతదేశంలో మొట్టమొదట రికార్డులు ఇచ్చిన సంగీతజ్ఞులలో ఒకరు, సంగీతపు ఆదాయము మీద ఆదాయపు పన్ను కట్టిన దేవదాసి. త్యాగరాజు స్వామికి తన డబ్బంతా ధారబోసి సమాధి మందిరం కట్టించిన త్యాగమూర్తి. ఈమె ప్లీడరు నరహరిరావుకు అభిమాన స్త్రీ. అయినా నరహరిరావు భార్య, ఈమె ఎంతో సఖ్యంగా వుండేవారు. కాని వీణ ధనమ్మ విషయంలో మాత్రం, అంతే గొప్ప దేవదాసి అయిన వీణ ధనమ్మ, సుబ్బరాయ అయ్యర్ అనే గొప్ప వాగ్గేయకారుడికి అభిమానస్త్రీ. ఆయన భార్యమాత్రం తన కొడుకులు తండ్రి బాట పట్టకూడదని కులదైవానికి మ్రొక్కుకునేది.

ఇప్పుడు ఎవరూకూడా ఈ బాట పట్టకూడదు అనే వాదన మెల్లగా బలం పుంజుకోబోతోంది. దేవదాసీ జీవన శైలిలోని ప్రతి ఒక్క అంశాన్ని ఆక్షేపించబోతున్నారు. షణ్ముగవడివు ఆ చప్పుళ్లను వినకపోలేదు. కాని వాటిని తన ఆలోచనలకు అడ్డు పడకుండా ఆమడ దూరంలో ఉంచగలిగిన ప్రజ్ఞ కలిగిన మనిషి. ఇప్పుడు తన ఆలోచనలంతా ఈ సంసారాన్ని కనీసం అన్నోదకాలకు లోటు లేకుండా చేస్తూ ఇప్పుడు వుంటున్న ఇల్లు కొనుక్కోవడం, తన కూతుళ్లని సంగీత శాస్త్రంలో వీణ ధనమ్మలాగా, ఆర్జనలో బెంగుళూరు నాగరత్నమ్మలాగా, ఇంకా చెప్పాలంటే ఒక్క పాట రికార్డుకి పాడటానికి మూడు వేలు తీసుకుంటున్న కలకత్తా గోహర్ జాన్‌లాగా చెయ్యాలి. ఆ తర్వాత బాగా డబ్బు ఉన్న యే చెట్టి చేతిలోనో, జమిందారు లేదా యువరాజు చేతుల్లోనో తన కూతుళ్లను పెట్టటం.

తనవరకు ఈ ఆలోచనలన్నీ ఆచరణలో పెట్టుకుంటూ అయితే వస్తుంది. ఒక పూటే కూరకావొచ్చు, ఒక పూట పల్చని మజ్జిగ కావచ్చు, కాని ఎప్పుడూ కడుపు కాలుతుంది అనే దాఖలాలు ఏవీ తన హయాంలో లేవు. తను సంగీత శాస్త్రంలో వీణధనమ్మ అంత పేరుపొందింది. కానీ బెంగుళూరు నాగరత్నం అంత ఆర్జించలేకపోతుంది. తన అవసరాలు తీర్చగల శక్తివున్న వారి చెంతనే వుంటుంది. తనకు వున్నదాంట్లో బ్రతుకు హుందాగా వెళ్లదీసుకుంటుంది. ఇప్పటికి తనకు తీరని కోరిక ఏమిటంటే గ్రామఫోను రికార్డులో పాడటం. తను ఒక సంవత్సరంగా ఎదురుచూస్తున్న రోజు ఈ కుంభాభిషేకం సంవత్సరంలో వచ్చింది.

శ్రీనివాసరావునుంచి కబురు వచ్చింది. తమ్ముళ్లతో ఆయనింటికి బయలుదేరింది. పశ్చిమచిత్రవీధిలో కాంగ్రెస్ ఆఫీసు మీదకుండా వెళ్తున్నారు. మహాత్మాగాంధి సహాయ నిరాకరణ ఉద్యమాన్ని నిలిపివేయడంతో కాంగ్రెస్ ఆఫీసులో హడావుడి కాస్త తగ్గినట్లు ఉంది. షీదరు శ్రీనివాసరావు ఇంటికి చేరారు.

"గ్రామఫోన్ కంపెనీవాళ్లు ఇప్పుడు మద్రాస్‌లో రికార్డింగులు చేస్తున్నారు. ఎప్పుడు మద్రాస్ రమ్మంటారో త్వరలో నీకు కబురుపెడతాను. ఏమి పాటలు పాడాలో నీకు అక్కడ వాళ్లు చెప్తారు. బహుశా టౌన్ హాల్‌లో వాయించిన పాటలే అడగొచ్చు" అని చెప్పి పంపారు.

సంతోషంగా ఇంటికి బయలుదేరింది. తన ఇంటి సందులో రంగనాయకి ఇంటికి వెళ్లి జరిగిన ఆనందకరమైన విషయం చెప్పుకుని ఇంటికి వచ్చింది. సాయంత్రానికల్లా నేస్తులల్లా వచ్చి, విషయం వివరంగా షణ్ముగవడివు నోటినుంచి చెప్పించుకున్నారు.

"మీనాక్షీ, నువ్వు రా నాతో పట్నంకి, నువ్వు చూసినట్లుంటుంది. ఆ తర్వాత నువ్వు కూడా రికార్డులకి పాడొచ్చు" అంది షణ్ముగవడివు. సరేనంది మీనాక్షి.

ఎంతోకాలం ఎదురుచూపులు లేకుండా తొందరగానే మద్రాస్ రమ్మని కబురువచ్చింది. సుందరం, మణి, శక్తి, కుంజమ్మ, మీనాక్షి ఇంతమందితో బయలుదేరింది షణ్ముగవడివు. వీణ ఎంత ముఖ్యమో ఈ ప్రయాణానికి, కుంజమ్మని తీసుకువెళ్లడం కూడా అంత ముఖ్యం. స్నేహితులు, బంధువులు వీడ్కోలు ఇవ్వటానికి వచ్చారు. మదురై నుంచి రికార్డింగ్‌కి వెళ్తున్న తమ మనిషిని చూసి గర్వపడుతున్నారు. రైలు కదిలింది. కుంజమ్మకి మొదటి రైలు ప్రయాణం, బాగా సంబరపడిపోతోంది. శక్తి, కుంజమ్మ కిటికీలోంచి చూస్తున్నారు.

"అమ్మా! సుబ్బక్క పరుగెత్తుకొస్తుంది" కిటికీలోనుంచి బయటకు చూస్తూ చెప్పారు పిల్లలు.

"సుబ్బక్క ఏంటీ? పరిగెత్తుకురావడం ఏంటీ?" అంటూ కిటికీలోంచి చూసింది షణ్ముగవడివు. నిజమే... సుబ్బులక్ష్మే కాదు, వాళ్లమ్మ జానకమ్మ, నాన్న దురైసామికూడా నెత్తిన సామాను పెట్టుకొని రైలు ఎక్కటానికి పరుగెత్తుతున్నారు.

"మణీ! వెళ్లి అందుకోరా" మణి సాయంతో బండెక్కింది సుబ్బులక్ష్మి కుటుంబం.

"జానకమ్మ ఏంటిది? రేపటి బండి ఎక్కొచ్చుకదా?" అడిగింది షణ్ముగవడివు.

"రేపే పట్నంలో దీని నాటకం. ఇదిగో గంటముందే ఉత్తరం వచ్చింది, గబగబా సర్దుకొని బయలుదేరాం" రొప్పుతూ చెప్పింది జానకమ్మ.



"పోనీలే బండి అందింది."

"ఈ నెలలో ఇది రెండోసారి పట్నం వెళ్లడం, అలా వస్తున్నాయి పట్నంనుంచి పిలుపులు."

"మరే, నువ్వు ఒక పని చెయ్యాల్సింది, శ్రీవైకుంఠం నుంచి మదురై రాకుండా పట్నం వెళ్లాల్సింది" అంది షణ్ముగవడివు.

"ఇప్పుడు కదా పట్నం తంజావూరులాగా తయారైయింది, నువ్వైనా, నేనైనా, ఇవ్వాళ్లో రేపో ఈ ఇద్దరు సుబ్బలక్ష్మిల కోసం అక్కడకు మకాం మార్చాల్సిందే. అప్పట్లో మాకు పట్నంలో ఏం తెలుసు, మదురైలో సంగీత జ్ఞానం దొరుకుతుందని ఇక్కడకు చేరాం."

తెల్లవారగానే మద్రాసు ఎగ్మోరు స్టేషను చేరుకున్నారు. అక్కడికి శ్రీనివాసరావుగారి మనిషి వచ్చి పట్నంలోని గ్రామఫోను కంపెనీవారి విడిదికి చేర్చాడు. రైలు ప్రయాణంలో వీళ్లకి అంటిన బొగ్గుమసి వదిలించుకొని తయారయ్యేసరికి మధ్యాహ్నం అయింది. వెంటనే రెండు ఇండ్ల అవల వున్న ఇంటికి తీసుకెళ్లారు రికార్డింగుకి. ఆ ఇంట్లో ఒక పెద్ద గది మధ్యలో చెక్కతో చేసిన ఒక చిన్న గది వుంది. మద్రాసుకు చెందిన ఒక సంగీతజ్ఞుడితో పాటు గ్రామఫోను కంపెనీ ఉద్యోగులు ఉన్నారు. మద్రాసు సంగీతజ్ఞుడు వచ్చి చెప్పాడు షణ్ముగవడివు ఏమి పాడాలో. "సరిగ్గా మూడు నిమిషాలలో తానం అయిపోవాలి. ఆ తరువాత 'శివదీక్షాపరురాలరా' వాయించాలి."

ముందుగా సుందరం ఆ గదిలోకి వెళ్లాడు. మణి మృదంగం అందించాడు. తర్వాత జాగ్రత్తగా వీణని అందుకున్నాడు. షణ్ముగవడివు లోపలికి వెళ్లి కూర్చుంది. తలుపులేశారు. ఇక అందరినీ పూర్తిగా ఆ ఇంటినుంచే బయటకు పంపారు.

వారి సరంజామా అన్నీ సరిచేసుకుని షణ్ముగవడివు, సుందరం కూర్చున్నారు. ఆ చిన్న కొట్టులాంటి గదిలో ఊపిరాడనంత పనైంది షణ్ముగవడివుకు. చేయెత్తి సైగ చేసేసరికి తానం మొదలుపెట్టింది. మూడు నిమిషాల తానం పూర్తయ్యేసరికి తడిసి ముద్దయ్యారు అక్కాతమ్ముడు. ఆ కొట్టు తలుపు తీయగానే పంజరం విప్పితే ఎగిరిపోయే పక్షుల్లా బయటికి పరుగెత్తారు. బయటికి వచ్చి, వంటికి గాలి, గొంతుకు నీరు పోసుకున్నారు. కాసేపటికి మళ్లీ లోపలికి వెళ్లి, "నే శివదీక్షాపరురాలనురా" అనే పదం పాడుతూ వీణ వాయించింది షణ్ముగవడివు.

షణ్ముగవడివు జంటగాత్రకురాలు, వీణ వాయిస్తున్నప్పుడు ఆ పాట పాడుతుంది కూడా. ఆమె నైపుణ్యం ఏమిటంటే వీణ, గాత్రం రెండూ మేటిగా వుంటాయి. తానం మూడు నిమిషాలు, పదం మూడు నిమిషాలతో షణ్ముగవడివు రికార్డింగు పూర్తయింది.

నూట ముప్పై రూపాయలు ఇచ్చారు.

రూపాయలు సుందరంకి. సంతోషపడింది షణ్ముగవడివు.

ఇంతలో కొడిమూడి బాలాంబ ఆమె కూతురు కొడిమూడి బాలాంబ సుందరాంబ రికార్డింగుకు వచ్చారు. బాలాంబ కూతురుకి పదహారేళ్లు వుండవచ్చు. ఆ వయసుకే ఆ అమ్మాయికి మంచి పేరుంది. ఆ అమ్మాయిలో తన కూతురిని చూసుకుంది. 'వీళ్లు ఆ కొట్లో దూరేముందు పిల్లలకి లోపల ఒకసారి చూపించాలి' అనుకొని, పిల్లల్ని ఆ కొట్టు లోపలికి తీసుకువెళ్లి చూపించింది.

ఆ తరువాతి రోజు పట్నంలో ఒక కచేరి ఏర్పాటు చేశారు పట్నంలోనే ఉన్న శ్రీనివాసరావు. మీనాక్షి, కుంజమ్మ పక్క గాయనీమణులు. ఆ తరువాత రోజు, పట్నం వస్తే విధిగా చేసేపనికి పూనుకుంది. అందరితో కలసి తంజావూరు ధనమ్మ దగ్గరకు వెళ్లింది. ధనమ్మ అమ్మమ్మ కామాక్షి, తంజావూరు రాజనర్తకి, అమ్మ సుందరం తంజావూరు రాజసభలోనే సంగీతజ్ఞురాలు. తంజావూరు రాజ్యం ఆంగ్లేయుల పాలనలోకి వెళ్లినప్పుడు ఆ కాలంలో ఎంతోమంది కళాకారులు పోషకులని వెతుక్కుంటూ పట్నం వచ్చినట్లు ధనమ్మ కుటుంబం కూడా వచ్చేసింది. ఇప్పుడు పట్నంలోనే కాదు దేశం మొత్తంలో వీణ ధనమ్మ అంటే అపర సరస్వతి అంటారు. ధనమ్మకి ఇప్పుడు 55 ఏళ్లు. నలుగురు కూతుళ్లు. తరతరాలనుంచి ఈ కుటుంబం పుట్టు కళావంతుల కుటుంబం. ధనమ్మ నలుగురు కూతుళ్లకీ దగ్గరదగ్గరగా షణ్ముగవడివు వయసు. వీళ్ల పిల్లలకు కాస్త అటుఇటుగా కుంజమ్మ వయసు. దేవదాసీ కుటుంబాల్లో ఏ ప్రకారంగా చూసినా పేరున్న వంశం ధనమ్మ వంశం. షణ్ముగవడివు ఎప్పుడు పట్నం వచ్చినా వీరిని కలవకుండా వెళ్లదు. ఆనాడు పిల్లలు పుట్టకముందే ఒకసారి ధనమ్మ దగ్గరికి వచ్చినప్పుడు, 'సంగీత జ్ఞానం వున్న పిల్లలు కలుగుగాక' అని దీవించింది. అలాంటి పిల్లల్ని తీసుకువచ్చింది ఈ రోజుకి.

"రా షణ్ముగం, ఇప్పటికి పిల్లలతో వచ్చావా...?" అంటూ ఆహ్వానించింది ధనమ్మ.

షణ్ముగవడివు పిల్లల్ని చూపించింది. "వీడు మృదంగం నేర్చుకుంటున్నాడు. కుంజమ్మ సంగీతం నేర్చుకుంటుంది" అని చెప్పింది.

వీణ ధనమ్మ కుంజమ్మవైపు తదేకంగా చూస్తోంది. "ఎంత శాంతం వుంది అమ్మాయి మొహంలో, ఏదమ్మా ఒకసారి పాడు" అంది.

కుంజమ్మ అప్పుడే నేర్చుకున్న ఒక వర్ణం పాడి వినిపించింది. "పైకొస్తుంది, ఈ అమ్మాయిని కనిపెట్టుకుండు షణ్ముగం, నీకు గొప్ప పేరు తెస్తుంది" దీవించింది సంగీతజ్ఞులకే సంగీతజ్ఞురాలయిన వీణ ధనమ్మ.



పట్నం యాత్ర దిగ్విజయంగా పూర్తిచేసుకుని ఐదవరోజు మదురై చేరింది షణ్ముగవడివు బృందం. చేరిన గంటకే నేస్తులూ, బంధువులు, సంగీతకారులు వచ్చారు, రికార్డింగు విశేషాలు చెప్పించుకోవటానికి.

"నీకు నీ పాటని కట్టిపెట్టిన ప్లేటు ఇచ్చారా షణ్ముగం?" అడిగింది రంగనాయకి.

"ఇప్పుడు నా పాట ఉన్న పెట్టెను కలకత్తాకి తీసుకువెళ్లి, నా పాటని చాలాచాలా ప్లేటుల్లోకి ఎక్కించి, వాటిమీద పేరు రాసి అప్పుడు అమ్మకానికి పంపుతారంట. ఆరునెలల పైమాటే అంట, అప్పుడు కొనుక్కోమన్నారు."

"ఎంతంట?"

"రెండు రూపాయలు."

"ఆ... మన పాట మనం వినటానికి రెండు రూపాయలా..." ఆశ్చర్యపోయింది కనకాంబుజం.

"వద్దులే కావాలంటే ఇంకో కచేరీ చేసుకుందాం."

"అలా కాదులే, ఆ ప్లేటుల్లో మన పాట ఎలా ఉంటుందో ఒకసారి చూడాలి, ఒకసారి కొందాం" అంది మరకతం. అందరూ ఇలా మాట్లాడుతుండగా షణ్ముగవడివు కుంజమ్మని గమనిస్తోంది. ఒక దినపత్రికలోని పెద్ద కాగితం తీసుకొని దాన్ని రికార్డింగు గదిలో వున్న మైకులాగా చుట్టి రికార్డింగు చేసుకుంటున్నట్లు ఆ గొట్టంలోకి పాడుతుంది.

"షణ్ముగం! ఈసారి నీ రికార్డింగప్పుడు నేను వస్తా నీతో పట్నానికి" ముందే చెప్పేసుకుంది రాజం.



షణ్ముగవడివు తన కూతురి సంగీత పాఠాల విషయంలో చేసిన యోచన ప్రకారం శాస్త్రీయ సంగీతాన్ని పూర్తిగా గురువులకు వదిలేసింది. ఇంట్లో వాటిని సాధన చేయిస్తుంది. ఆపైన తుక్కడాలని తను నేర్పుతుంది. ఈ తుక్కడాలల్లో థిల్లానాలు, జావళీలు, పదాలు, భజనలు, శ్లోకాలు, స్తోత్రాలు వుంటాయి. ఇవన్నీ తమిళ, తెలుగు, మరాఠీ భాషలలో నుంచి ఎంచుకోవాలి. ఎందుకంటే మదురై ప్రాంతమంతా ఈ భాషల మాతృకలతో నిండి వుంది. తమిళం ఆ ప్రాంతపు మాతృభాష. తిరుచురాపల్లి, మదురై కేంద్రాలుగా 200 సంవత్సరాలు రాజ్యం ఏలిన నాయక రాజులు తెలుగువారు. వారి హయాంలో తెలుగువారు ఎంతోమంది మదురై ప్రాంతానికి చేరి, స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. మదురై నాయకుల సమకాలంలోనే మరాఠా రాజులు తంజావూరు కేంద్రంగా 175 ఏండ్లు రాజ్యం ఏలారు. వీరి హయాంలో మరాఠీలు ఈ ప్రాంతానికి వచ్చి కలిసిపోయారు.

మధురై ప్రజలందరికీ వారి మాతృభాష కాకుండా మిగతా రెండు భాషల్లో కాస్తోకూస్తో పరిచయం వుంటుంది.

కచేరికి విచ్చేసే శ్రోతల్లో ఈ మూడు భాషల వాళ్లు వచ్చి చేరతారు. వాళ్లు అడుగుతారు కూడా వారివారి భాషల్లో ఒక పాట పాడమని. ఇవన్నీ షణ్ముగవడివు పడినవే, తనకు తెలిసినవే. అందుకని తుక్కడాలు ఆయా భాషల్లో నేర్పిస్తుంది.

ఈ రోజు ఒక మరాఠీ భజన నేర్పుతోంది తల్లి కూతురికి. "కుంజా! ఏదీ పాడూ... 'ఆనందజ'." కుంజమ్మ నేర్చుకొని పక్కకు వచ్చిన తర్వాత కొడుకుని కూర్చోబెట్టుకుంది. కుంజమ్మ ముగ్గు డబ్బా తీసుకొని మెట్టుమీద కూర్చుంది. ఈ శిశిరంలో చుట్టూ వున్న చెట్ల ఆకులన్నీ రాలి వున్నాయి. అత్త చీపురు తీసుకువచ్చి వూడుస్తూవుంది.

"ఊ... కానివ్వు కానివ్వు, తొందరగా కానిచ్చి, ఊరేగింపు వేళకు వచ్చేయ్" అంటూ ఆలయ దేవదాసి రంగనాయకి, ఆకుల కుప్పని దాటుకుంటూ వెళ్లింది.

ఆలయంలో మాఘమాస మండలోత్సవంలో భాగంగా ఈ రోజు చిత్రవీధులలో పంచమూర్తులను ఊరేగించనున్నారు.

"కుంజా! మర్చేపోయాను పద తొందరగా" అంటూ అత్త లోపలికి పరిగెత్తింది. కుంజమ్మ గురవుగారి దగ్గర పాఠం పూర్తిచేసుకొని మళ్లీ వచ్చేసరికి అంతా గుడికి వెళ్లడానికి తయారైయున్నారు కాని బాగా ఆలస్యమయింది. వీరందరు పడమర చిత్ర వీధికి చేరగానే, ఉత్తర చిత్ర వీధినుంచి వస్తున్న ఊరేగింపు కనిపించింది. త్వరగా గుడి లోపలికి వెళ్లి దర్శనంకోసం వేచియుండవచ్చు అన్న నెపంతో అందరూ పడమర ఆదివీథిలోకి చేరారు. అక్కడ ఒక సాధువు కుంజమ్మను చూసి, "ఆగు ఆగక్కడ" అని దండం అడ్డంగా పెట్టి ఆపాడు. కుంజమ్మ భయంతో స్తంభంలా నిలబడిపోయింది. ఆ సాధువు కుంజమ్మ దగ్గరకి వచ్చాడు. మొహంలో మొహం పెట్టి చూస్తున్నాడు. కుంజమ్మకు భయంతో నోరుకూడా పెగలటంలేదు అత్తని పిలుద్దామంటే. ఇంటినుంచి ఇక్కడిదాకా చేయిపట్టుకొని లాక్కొచ్చింది, ఇప్పుడే ఇక్కడ వదిలేసి వెళ్లింది. ఈ సాధువు బారిన పడింది కుంజమ్మ. సాధువు చూస్తూనే వున్నాడు, ఒక్కసారిగా గట్టిగా అరవటం మొదలుపెట్టాడు. ఒక గొప్ప విషయం కనిపెట్టినట్లు. "ఆ.. కనిపిస్తుంది నాకు... నీ మొహంలో గొప్పతనం కనిపిస్తుంది! గొప్పదానవు అవుతావు!" కాసేపు కళ్లు మూసుకున్నాడు. ఈలోపల అత్త కుంజమ్మ వెనక్కి చేరింది. కళ్లు తెరచి మళ్లీ అరుస్తున్నాడు సాధువు. "మధ్యలో కొన్ని అడ్డంకులు వస్తాయి. అయినాసరే నిన్ను ఎవరూ ఆపలేరు, నువ్వు చాలా గొప్పదానివవుతావు".

అత్తను చూస్తూ, "మీ అమ్మాయేనా..?" అడిగాడు సాధువు.

"నీకు ఎవరమ్మాయోకూడా తెలియదు... ఓ పెద్ద చెప్పొచ్చావు గొప్ప భవిష్యత్తు.



ప్రతివాడూ చెప్పేదే ఇది. నా దగ్గరనుంచి నీకు దమ్మిడి కూడా ముట్టదు నాయనా" అంటూ కుంజమ్మను లాక్కెళ్లింది.

ఇంతలో పంచమూర్తుల ఊరేగింపు గుడి లోపలికి వచ్చింది. ఊరంతా ఊరేగి, ఊరివారందరి దృష్టిలో పడినందుకు చూడామణి కుంభ హారతితో పంచమూర్తులకు దిష్టితీసింది. ఆ తర్వాతే గుడి లోపలికి వెళ్లారు.

దర్శనానంతరం కుంజమ్మ బడికి వెళ్లింది. దోవలో అన్నా చెల్లి సాధువు విషయం ఈసారి నాన్న కనిపించినప్పుడు ఆయనకు చెప్పాలనుకున్నారు.

ప్రధాన కళాకారిణిగా మూడు కచేరీలు, పక్క వాద్య కళాకారిణిగా ఆరు కచేరీలుగా సాగిపోతున్న షణ్ముగవడివు కచేరి జీవితంలో ఒక ప్రధాన కళాకారిణిగా కచేరి పిలుపు వచ్చింది. సేతుపతి పాఠశాల, రైలుస్టేషను మీదుగా ఉత్తర వెలివీధిలో వుంది ఈ బడి. సేతుపతి అని పిలవబడే రామనాడు జమీందారులు ఈ పాఠశాలకు ధర్మకర్తలు. కుంజమ్మను గత రెండు సంవత్సరాలనుంచీ తన కచేరీలకు వెంటబెట్టుకొస్తున్న షణ్ముగవడివు ఈసారి కుంజమ్మను తనతోపాటే తీసుకురాలేకపోయింది. తన కచేరి ఇంకో నాలుగు పాటల తర్వాత ముగిస్తుందనగా, సుందరంకు చెప్పింది, "కుంజాని తొందరగా తీసుకురా, దానిచేత ఒక పాట పాడిస్తానిప్పుడు."

సుందరం వెంటనే బయలుదేరాడు. ఇంటికి చేరాడు. "కుంజా! కుంజా! ఎక్కడ? మీ అమ్మ తొందరగా రమ్మంటుంది. ఎక్కడ నువ్వు?" కేకలేశాడు సుందరం. ఇంట్లో లేదు. వెనక్కి పెరట్లోకి వచ్చి చూస్తే, మొక్కల మొదట్లో మట్టి తీసి బొమ్మలు చేసుకుంటుంది. సుందరం త్వరత్వరగా చేతులు కడిగించి, చొక్కా మట్టి దులిపి, సేతుపతి బడివైపు పరుగులు తీయించాడు. బడి చేరి తల్లిపక్కన పిల్లను చేర్చాడు. షణ్ముగవడివు కచేరి అయిన తర్వాత, కుంజమ్మని మధ్యలోకి జరిపింది. శ్రోతల్లో మరాఠీ టోపీలు ఎక్కువ కనిపించాయి షణ్ముగవడివుకి. అందుకని కూతురుని ఈ మధ్యే నేర్పిన మరాఠీ భజన పాడమంది. కుంజమ్మ 'ఆనందజ' అనే మరాఠీ భజన పాడింది. కుంజమ్మకు ఎనిమిదేళ్లు. ఎలాంటి బెరుకూ లేకుండా చక్కగా పాడింది, అమ్మ నేర్పించింది నేర్పించినట్లు పాడింది. అక్కడున్న మరాఠీవాళ్లే కాదు, అందరూ గట్టిగా చప్పట్లు కొట్టి కుంజమ్మను మెచ్చుకున్నారు. అమ్మ ఇంకో పాట పాడమంది. కుంజమ్మ బుంగమూతి పెట్టి, ఇంటికి వెళతానంది. అక్కడ తన స్నేహితురాండ్రు తనకంటే ఎక్కడ ఎక్కువ మట్టిబొమ్మలు చేస్తున్నారోనని బెంగ. కుంజమ్మ పాడే ఇదిలో లేదనుకొని షణ్ముగవడివు మంగళం పాడేసి కచేరి ముగించింది. కచేరీ అయిన తర్వాత శ్రోతలు ఒకరి తర్వాత ఒకరు వచ్చి షణ్ముగవడివు దగ్గర కుంజమ్మని పొగిడి, "పాపా! బ్రహ్మాండంగా పాడావు. ఇంకా బాగా నేర్చుకుంటూ వుండు" అంటూ

చెప్పి వెళ్తున్నారు. షణ్ముగవడివు మురిసిపోతోంది. తన కూతురు మొదటి కచేరీ ఇచ్చినట్లే. సొంతంగా అందరిముందు ఒక పాట బ్రహ్మాండంగా పాడేసింది. కాని కుంజమ్మకు మాత్రం ఇవేమీ పట్టటంలేదు. ఎప్పుడెప్పుడు వెళ్లి పెరట్లో స్నేహితురాండ్రతో ఆడదామా అనే ఆలోచనలోనేవుంది.

రాత్రికి తల్లి మళ్లీ హితబోధ చేసింది. "కుంజా! కచేరీలో అలా చేయకూడదమ్మా. మనం పాడితే వాళ్లు చాలా సంతోషిస్తారు. మన పాటలకోసమే వస్తారు. మనల్ని బాగా మెచ్చుకుంటారు. సరేనా... ఈసారి ఎన్ని పాటలు పాడమంటే అన్ని పాడాలి."

"ఊ..." తల ఊపింది కుంజమ్మ.

ఈ ఒక్కసారికి కుంజమ్మ ఒక పాట పాడినా, అరపాట పాడినా, అసలు పాడనని మొరాయించినా ఏమి పర్వాలేదు, కుంజమ్మలో సంగీతం నరనరానా ఇంకివుంది.

"అమ్మా! ఈ రోజు గుడిలో ఏమైందో తెలుసా...?" అంటూ శక్తి ఒక్క ఉదుటున లేచాడు.

"ఏమైంది చెప్పు" అంది తల్లి. దమ్మిడి సాధువు కథ చెప్పాడు.

"అలాగా... చూశావా నిజమే చెప్పాడు. ఆయన పొద్దున చెప్పాడు, నా చిన్నిరాణి సాయంత్రంకల్లా కచేరీ చేసింది" అంటూ కూతురుని ముద్దుచేసుకుంది.

పిల్లలు పడుకున్నారనుకున్న తర్వాత షణ్ముగవడివు, ఆమె తమ్ముడు బయటికి వెళ్లటానికి తయారవుతున్నారు. శక్తి మెల్లగా తల ఎత్తి కుంజమ్మని లేపాడు. "కుంజా, లే, చూడు, అమ్మ నాన్న దగ్గరకు వెళుతుంది."

కుంజమ్మ నిద్రలో వుండి తలుపువైపు చూసింది... వీధిలోకి వచ్చేసింది షణ్ముగవడివు.

తమ్ముడు సుందరం తోడు రాగా దూరాన వకీలు సుబ్రహ్మణ్యం అయ్యరు కచేరి బంగ్లా దారిపట్టింది షణ్ముగవడివు.

* *

ఒక మంగళవారం కూతుళ్లకి పెరట్లో తలస్నానం చేయిస్తుంది. బట్టలు ఉతికే బండ పక్కన కుంజమ్మని కూర్చోబెట్టి, ఆ బండమీద కుంజమ్మ పొడవాటి జుట్టువేసి కుంకుడు కాయల రసంతో రుద్దుతుంది.

"వదినా, నీకోసం శ్రీనివాసరావుగారి ఇంటినుంచి మనిషొచ్చాడు" అంటూ మరదలు పిలిచింది. తలస్నానం పని మరదలికి అప్పచెప్పి వీధి తలుపు దగ్గరకి వచ్చింది.

"శ్రీనివాసరావుగారు మీకు ఈ ఉత్తరం ఇవ్వమన్నారు" ఉత్తరం చేతిలో పెట్టాడు. "ఇది ఇంగ్లాండు నుంచి తెల్లదొర ఒకాయిన పంపించారు" అని ఇంకో మాట జతచేశాడు.



"ఎక్కడనుంచీ?" షణ్ముగవడివు ఆశ్చర్యంగా అడిగింది. "ఇంగ్లాండు అమ్మా! తెల్లదొరల దేశం, ఓడలో వెళ్లాలి, ఒక నెలపడుతుంది. అక్కడ నుంచి పంపించాడు ఒక తెల్లదొర."

"నాకెందుకు? ఆయనెవ్వరసలు?"

"చెప్తా..చెప్తా."

ఇంటిల్లిపాది వచ్చి నుంచున్నారు, ఆడపిల్లలు జుట్టునుండి నీళ్లు కార్చుకుంటూ.

"మీ గ్రామఫోను రికార్డుని ఒక తెల్లదొర కలకత్తానుండి ఆయన దేశం తీసుకెళ్లాడు. అక్కడ ఆయనా విన్నాడు, ఇంకా చాలా మందికి వినిపించాడు. తెల్లవాళ్లందరికీ మీ వీణ, పాట చాలా బాగా నచ్చి, మిమ్మల్ని మెచ్చుకుంటూ ఈ ఉత్తరం మన దేశానికి పంపాడు మీకు ఇవ్వమని."

"ఏమి రాసివుంది దీనిలో?" ఉత్తరం ఆంగ్లంలో రాసివుంది. షణ్ముగవడివుకి ఏమాత్రం రాని భాష ఆంగ్లం.

"మీ పాటని మెచ్చుకుంటూ" అని చెప్పి వెళ్లిపోయాడామనిషి.

ఉత్తరంతో కూతురువైపు తిరిగింది. నువ్వుకూడా ఇలాంటివి సంపాదించాలి అనే కోరికతో.

𝄞𝄞

గురువుగారి ఇంటికి వెళ్లేముందు షణ్ముగవడివు, కుంజమ్మ గుడికి చేరుకున్నారు. ఫాల్గుణ మాసంలో వసంతోత్సవాలు జరుగుతున్నాయి. దర్శనానంతరం కుంజమ్మతో బాటు గురువుగారి ఇంటిదారి పట్టింది.

"చూశావా కుంజా! మనం పాడకున్నా ఈ ప్లేటుల్లోంచి ఎంతమంది మన పాట వింటున్నారో! సప్తసముద్రాల అవతలకూడా మన పాట వింటున్నారు. చూశావా ఈ ప్లేటుల మహిమ" ఇలా మాట్లాడుకుంటూ గురువుగారి ఇంటికి చేరారు.

సుందరేశ భట్టర్ పిల్లలకి సంగీతం నేర్పుతున్నారు, కుంజమ్మ త్వరత్వరగా వచ్చి చాప పరచుకొని గురువుకు నమస్కరించి కూర్చుంది. కాసేపటికి ఆ పిల్లలు పాఠాలు పూర్తిచేసుకొని వెళ్లారు. కుంజమ్మ వెంటనే 'సా పా సా' లు అందుకుంది.

"అమ్మ వింటుంది కుంజమ్మా, శంకరాభరణంలో వర్ణం పాడు." షణ్ముగవడివు చెవులు రిక్కించి వింది. శాస్త్రీయ సంగీతంలో వర్ణాలు చాలా ముఖ్యమైనవి. రాగాలు, గమకాలు పట్టేది ఇక్కడే.

పెద్ద గొంతేసుకుని పాడింది కుంజమ్మ.

"అమ్మాయి స్థాయి పెంచారు.."

"అదేస్థాయిలో పాడాలి. ఈ వయసులో గొంతెత్తకపోతే ఎలా? ముందుముందు ముడుచుకుపోతుంది."

"చాలా వర్ణాలు చెప్పినట్టున్నారు."

"రెండురోజుల్లో కృతులు మొదలుపెడతాను."

ఆయన అలా అన్నాడోలేదో వెనక గదిలోంచి "ఏవండీ! ఒకసారి ఇటు రండీ" అంటూ భట్టర్‌గారి ఇంటావిడ పిలిచింది.

"వస్తున్నా" "ఇప్పుడే వస్తాను ఉండండి" అంటూ లోపలికి వెళ్లాడు.

కాసేపట్లో బయటకు వచ్చి "ఇంకా చాలా వర్ణాలు వున్నాయి. ఈ వయసుకి నేను చెప్పినవి చాలు, యాభైదాకా నేర్పాను. వెంటనే గ్రహించేస్తుంది. అందుకే ఇక కృతులలోకి వెళతాం."

"అలాగే, చాలా సంతోషం."

"కృతులు కూడా కొన్ని అయిన తర్వాత మంచి కచేరీ ఏర్పాటు చేస్తాను, నేనే ఫిడేలు వాయిస్తాను"

"తప్పకుండా, అంతకన్నా ఏమికావాలి?"

ఇంతలో లోపలనుంచి మళ్లీ పిలుపు వచ్చింది "ఏవండీ! ఒకసారి..."

లోపలికి వెళ్లొచ్చిన గురువుగారు, షణ్ముగవడివు ముందు ఏదో చెప్పాలనుకొని చెప్పలేకపోతున్నాడు. షణ్ముగవడివు గ్రహించింది.

"రేపు ఏర్పాటు చేస్తాను తాంబూలం."

"తాంబూలాలదేమి భాగ్యమండీ, అమ్మాయి వృద్ధిలోకి రావాలి. మొన్న అమ్మాయిచేత కచేరి ఇప్పించారట... నన్ను పిలవకపోయారా?"

"అబ్బే అది నా కచేరి. ఏదో ఒక భజన పాడించాను. అందరిముందు పాడటం అలవాటు చేయాలి కదా."

"అవునవును, చేయాలి చేయాలి."

❦❦

కుంజమ్మ సాధన చివరిలో వుండగా షణ్ముగవడివు శొంఠి కాఫీ పెట్టడానికి లేచింది. వెంటనే కుంజమ్మ సంగీతం పుస్తకంలో నుంచి ఒక కాగితం చించి గ్రామఫోను మైకు గొట్టంలాగా చుట్టి దానిలోకి పాడటం మొదలుపెట్టింది. అమ్మలాగా తనకూ ఆ ప్లేటుల్లో



పాడాలనేమో, తల్లి ప్లేటుకి పాడటం చూసిన దాదాపు మూడేళ్లనుంచి కుంజమ్మ రోజుకొక్క పాటయినా ఆ కాగితం మైకులో పాడుకొంటుంది. కుంజమ్మ కోరిక త్వరలో తీరబోతోంది. కాఫీ తాగి ముగ్గుడబ్బా తీసికొని మెట్లమీద కూర్చుంది. అత్త ముగ్గులు వేస్తోంది. ఎదురింటి మామిడిచెట్టుపై కోకిల కుహుకుహూలు వినిపిస్తున్నాయి. అటువైపు చూసింది కుంజమ్మ. ఏపుగా పెరిగిన ఆకులు, పెద్దపెద్ద ఆకులు, 'ఆ.. ఇవేఇవే! ఇంత పెద్ద ఆకులే! నాన్న రథానికి తోరణం కడతాడు, నాన్న పండుగ వచ్చేసింది' అనుకుంటూ అమ్మదగ్గరకు పరుగెత్తింది, "అమ్మా! నాన్న రాముడిని ఊరేగించే పండగ ఎప్పుడు?"

"శ్రీరామనవమా.. చైత్రం వస్తోందిగా, ఇంకో పక్షంరోజులు ఉంది" చెప్పింది షణ్ముగవడివు. ఈ పక్షంరోజులు ఎప్పుడెప్పుడు గడుస్తాయా అని ఎదురుచూస్తుంది కుంజమ్మ, కుంజమ్మే కాదు, శక్తి, ఇప్పుడు చెల్లెలు వడివాంబ కూడా. చైత్రంలో మీనాక్షి అమ్మవారి కల్యాణోత్సవం కూడా వుంది. కచేరీలు కుదుర్చుకోవడంలో, ఇంటిల్లిపాది కొత్త బట్టలు కుట్టించుకోవటంలో పక్షంరోజులు ఇట్టే గడిచిపోయాయి.

పిల్లలందరూ ఎదురు చూస్తున్నరోజు రానేవచ్చింది. శ్రీరామనవమి రోజున సాయంత్రం సుబ్రహ్మణ్యం అయ్యరు ఇంటినుంచి సీతారాములను ఊరేగింపుగా తీసుకువస్తారు, పశ్చిమ రాజగోపురం వీధి పొడుగునా ఊరేగించిన తర్వాత, ఆయన ఇంటిదగ్గర ఊరేగింపు ఆగుతుంది. సాయంత్రానికల్లా కొత్త లంగా జాకెట్టు తొడుక్కొని, మల్లెపూలు పెట్టుకుని కుంజమ్మ తన ఇంటి సందు మొదట్లో, నాన్న ఊరేగింపుకోసం ఎదురు చూస్తోంది. సీతారాముల బండి అవని మూలవీధి మలుపు తిరుగుతుంది. పిల్లలు ఆత్రుతగా ఎదురు చూస్తున్నారు. మెల్లగా వస్తూ రథం సరిగ్గా పిల్లలముందు ఆగింది. సుబ్రహ్మణ్యం అయ్యరు రథం దిగి, "నా చిన్నిమారాణీ" అంటూ కుంజమ్మను ఎత్తుకొని ముద్దాడాడు. కుంజమ్మ నాన్న భుజాలపై వాలిపోయింది. ముగ్గురు పిల్లల్లో సుబ్రహ్మణ్యం అయ్యరు కుంజమ్మనే ముద్దుచేశాడు. కుంజమ్మను రథం ముందు తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు. కుంజమ్మకు ఊహ తెలిసినప్పటినుంచి ఈ ఆత్మీయతను చవిచూస్తోంది. సంవత్సరం మొత్తంలో నాన్న ఎక్కువసేపు కనిపించేది ఈ రోజే.

రథం పడమర రాజగోపురం వీధిలో సాగిపోతుంది. ఇళ్లముందు ఆగినప్పుడు, ఇంటివారు వచ్చి నమస్కరించి నైవేద్యం సమర్పించి వెళుతున్నారు. మధ్యమధ్యలో కూతురుతో కబుర్లాడుతున్నాడు సుబ్రహ్మణ్యం అయ్యరు. "నా చిన్నిమారాణీ, చెప్పరా ఏంటి సంగతులు?"

"నాన్నా! నేను కచేరిలో పాట పాడా" ఉత్సాహంగా చెప్పింది కుంజమ్మ.

"శభాష్, నాకు తెలుసురా, నువ్వు బాగా పాడతావని."

"అమ్మ పట్నం వెళ్లి ప్లేటుల్లోకి పాడింది, ఈసారి నాచేత కూడా పాడిస్తానంది."

"అలాగా... గొప్పే.. అయితే రాణమ్మ, ఒక పనిచేద్దాం. నీలాగే పాటలుపాడే అబ్బాయిని చూసి నీకు పెళ్లి చేసేద్దాం. పాటలు రానివాడికి ఇచ్చి చేస్తే, నువ్వు ఏం పాడుతున్నావో ఎలా పాడుతున్నావో కూడా తెలియదు వాడికి. సరేనా... నీలాగా సంగీతం వచ్చిన అబ్బాయిని వెతికి తీసుకొద్దాం."

వెనకనుంచి శక్తి, వడివాంబ వెక్కిరిస్తూ నవ్వుతుంటే నాన్న వడిలో దాక్కుంది కుంజమ్మ.

"నాన్నా! నాకు అమ్మ గురువుని పెట్టింది మృదంగం నేర్పటానికి" శక్తి కబుర్లు మొదలుపెట్టాడు.

గడిపాడు సుబ్రహ్మణ్యం రథం మళ్లీ వాళ్ల ఇంటికి చేరేదాకా ఈ పిల్లలే లోకంగా అయ్యారు. ఇంటిలోకి సీతారాముల పటాలు తీసుకువెళ్లారు. అందరూ భజన కార్యక్రమానికి కూర్చున్నారు. ఇకనుంచి ఆయనెవరో పిల్లలెవరో. ఆ ఇంటి లోపలికి వెళితే పిల్లలు 'నాన్నా' అని పిలవరు, ఇది వాళ్లకు ఒకరు చెప్పింది కాదు. తండ్రి కాస్త చనువు తీసుకొని పిల్లలను దగ్గరికి తీయవచ్చు, కాని తీయడు. ఇద్దరికీ ఎవరూ ప్రత్యేకంగా చెప్పింది కాదు కాని, ఆనాటి సంఘం చెప్పకనే చెప్పిన నియమం ఈ విషయం. భజన అయిన తర్వాత గుంపులో గోవింద కొట్టి, ప్రసాదంతో ఇంటికి చేరారు పిల్లలు. ఇక ఆ రాత్రంతా అమ్మకు నాన్న కబుర్లే.



మదురై ప్రజలు ఎప్పుడు కొత్తబట్టలు కొనుక్కున్నా కొనుక్కోకపోయినా, చైత్రంలో మాత్రం కొనుక్కుంటారు. మదురైకు మీనాక్షి ఆలయం పట్టుగొమ్మ, మీనాక్షి ఆలయానికి చైత్రమాసం అతి ముఖ్యమైన మాసం. ప్రతి చైత్రంలో పాండ్యరాజు కాంచనమాల యొక్క యజ్ఞ ఫలం అయిన మీనాక్షిని మధుర రాజ్యానికి మహారాణిగా పట్టాభిషేకం గావిస్తారు. అప్పటినుంచి మీనాక్షి రాజ్యాన్ని పరిరక్షిస్తూ అష్టదిక్కులూ శమదమాదులతో పాలిస్తుందని మదురై వాసుల ప్రగాఢ విశ్వాసం. ఈ పట్టాభిషేక ఉత్సవం మీనాక్షీ ఆలయానికి బ్రహ్మోత్సవం.

"అందరూ తయారవ్వండి. మహారాణిని దర్శించుకుందాం" అంది షణ్ముగవడివు. క్రొత్త లంగా జాకెట్టు తొడుక్కొని, మట్టిగాజులు, పిచ్చిపూసల గొలుసు, పోగులు, పెద్ద బొట్టు పెట్టుకుంది కుంజమ్మ. పడమర రాజగోపురం వీధిలోకి తిరగ్గానే అంగళ్లు వెలసి తిరునాళ్ల అయిందా వీధి. పూలు అమ్ముతున్న అంగళ్లు చాలానే వున్నాయి. కుంజమ్మ వాటినే చూస్తూ నడుస్తోంది. ఇంక వుండబట్టలేక, "అమ్మా! మల్లెపూలు కొనమ్మా" అంది అమ్మతో.



షణ్ముగవడివు నవ్వుకుంది. 'కుంజా ఎప్పుడూ దేనినీ అడగదు. అదికావాలి ఇదికావాలి అని మారాం చెయ్యదు. ఒక్క మల్లెపూలే దానికి మహా ఇష్టం. తనకు కాస్త ఖర్చే అయినా కొనటానికి పర్వాలేదు కాని శక్తి చూడకుండా కొనాలి. లేకపోతే వాడికి ఏదైనా కొనేదాకా వూరుకోడు' అనుకుంటూ, కొడుకు లేకుండా చూసి ఒక అంగడిలో గీచి గీచి బేరమాడి మల్లెపూలు ఒక మూర కొని కుంజమ్మ జడలో తురిమింది. ఇప్పుడు కుంజమ్మకు పండగ ముస్తాబు పూర్తయినట్లు. వెనక మల్లెపూలను ఆస్వాదిస్తూ రెట్టించిన ఆనందంతో కుంజమ్మ దర్శనానికి వెళ్లింది.

ఆలయం లోపల మీనాక్షీ అమ్మవారికి అర్ధజాము పూజలు జరుగుతున్నాయి. దేవదాసీలు పూర్తి ఆలయ లాంఛనాలతో, ఆలయ పరివస్త్రాన్ని తలకు కట్టుకొని కార్యోన్ముఖులై వున్నారు. అర్ధజాము పూజ పూర్తయింది. పట్టారులు పంచ హారతులు ఇచ్చారు. చివరిగా చూడామణి కుంభ హారతి ఇచ్చింది. దాసీలు నృత్యనైవేద్యం, పుష్పాంజలి సమర్పించారు. ఇక అమ్మవారి ఉత్సవ విగ్రహం దగ్గర పూజతంతు మొదలయింది. ఉత్సవ విగ్రహానికి పూర్తి అలంకరణ అయిన తర్వాత అమ్మవారి వజ్ర కిరీటానికి అభిషేకం గావించబడింది. అమ్మవారికి ఆ కిరీటాన్ని అలంకరించగానే పెద్దమేళం దిక్కులు పిక్కటిల్లేలా వాయించింది. అమ్మవారిని వాహనం మీద అధిరోహింపచేశారు. మీనాక్షి సామ్రాజ్ఞి మాసీ వీధులలో తన ఏలుబడిలో వున్న జనులకు దర్శనభాగ్యం కలుగచేయటానికి సాగిపోయింది.

ఊరేగింపు శబ్దాలు దూరమయిపోయాక షణ్ముగవడివు పడమర ఆది వీధిలో తన కచేరి మొదలుపెట్టింది. కుంజమ్మ అమ్మ పక్కనేవుండి ఎక్కువ సేపు కచేరీలో వుండటానికి అలవాటుపడుతుంది. ఊరేగింపు వెనక్కు వచ్చేసరికి రాత్రి పదకొండు అయ్యింది. మీనాక్షీ అమ్మవారు ఆది వీధిలోకి ప్రవేశించగానే ఊరిలో అందరి దృష్టీ అమ్మమీద పడినందుకు చూడామణి మొదట అమ్మవారికి కుంభ హారతితో దృష్టి పరిహారం చేసింది. ఆ తరువాత అమ్మవారు లోనికి వెళ్లారు. ఇక పవళింపుసేవకు వేళైంది. అమ్మవారిని స్వామిని పవళింప గదికి పల్లకిలో తోడ్కొని వెళ్లి, ఊయల్లో కూర్చుండబెట్టి లాలిపాటలు, ఊయల పాటలతో దేవదాసీలు ఆదిదంపతులను సుఖనిద్రకు దింపారు. కుంజమ్మ ఈ పాటలు, దేవదాసీల నృత్య నైవేద్యాలు ఆకళింపు చేసుకుంటుంది. ఆదిదంపతులు పవళించిన తర్వాత దాసీలందరితో కలసి షణ్ముగవడివు, కుంజమ్మ అర్ధరాత్రి ఇంటిదోవపట్టారు. ఇంటిలో కుంజమ్మ పడుకునేముందు మల్లెచెండుని కాగితంలో చుట్టి, నీళ్లు చల్లి గూట్లో పెట్టుకుంది రేపు మళ్లీ పెట్టుకోవటానికి.

ఈ చైత్ర మాసంలో ఆలయంలో పెద్ద యెత్తున [illegible] పూర్తిగా పాల్గొంటూ గడిచాయి షణ్ముగవడివుకు. హడావుడి అంతా సద్దుమణిగాక శ్రీనివాసరావు నుంచి కబురు వచ్చింది. వెంటనే కూతురుతో ఆయన ఇంటికి వెళ్లింది.

"వచ్చేనెలలో రికార్డింగ్‌కి రమ్మంటున్నారు. తప్పకుండా వెళ్లు."

"అలాగేనండీ, అంతా మీ చలవ" అంటూ సెలవు తీసుకుంది షణ్ముగవడివు.

అంతకుముందే అనుకున్నట్టు రాజం బయలుదేరింది షణ్ముగవడివుతో. సుందరం, షణ్ముగవడివు, శక్తి, కుంజమ్మ పట్నం బయలుదేరారు. రైలుస్టేషను దగ్గరికి, కుంజమ్మ గురువు, షణ్ముగవడివు నేస్తులు వచ్చారు సాగనపంటానికి.

"రాజం జాగ్రత్త! రైలు సాగినప్పుడు కిటికీలోంచి తల బయటపెట్టకు, తల బయట పెట్టావంటే తల గాలిలో ఎగిరిపోతుంది, నువ్వు తల లేకుండా పట్నం వెళ్తావు" అంది మరకతం.

"చాల్లే వేళాకోళం! పిల్లలు తల, చేతులు బయటపెట్టకుండా, నేను పిల్లల్ని జాగ్రత్తగా తీసుకెళ్లటానికి వెళ్తున్నా" అంది రాజం.

"వాళ్లు ఇప్పటికే ఒకసారి వెళ్లి వచ్చారులే, నువ్వే జాగ్రత్త" అన్నారు నేస్తులు. బండి మెల్లగా కదలటం మొదలుపెట్టింది.

"రాజం, నువ్వు ఎక్కువయినట్లున్నావే బండి కదల్లేక కదులుతుంది. దిగరాదా..." చెయ్యి లాగుతూ అంది మరకతం. చెయ్యి వదిలించుకొని దూరంగా వెళ్లింది రాజం.

బండి మెల్లగా కదులుతుంది రాజం ఎక్కువవటంవల్లకాదు. షణ్ముగవడివు గంపెడంత ఆశను మోసుకు వెళుతోంది మద్రాసుకు.

పిల్లల కేరింతలతోపాటు రాజం కేరింతలు తోడయి సరదాగా పట్నంలో దిగారు. స్టేషనుకు గ్రామఫోను రికార్డు కంపెనీ మనిషి వచ్చి, విడిదికి తీసుకువెళ్లాడు. స్నానాలు అయి రికార్డింగు ఇంటికి చేరుకున్నారు. ఈసారి షణ్ముగవడివుచేత నాలుగు పాటలు పాడించుకున్నారు. కుంజమ్మ అంతా గమనిస్తూవుంది. షణ్ముగవడివు పాటలు అయిన తర్వాత అక్కడి అధికారుల ముందుకు వెళ్లింది. డబ్బుల కోసమేమోననుకుని, వెంటనే షణ్ముగవడివు లెక్క తేల్చి చేతిలోపెట్టారు. డబ్బులు తీసుకొని పక్కకు వెళ్లి సంచిలో పెట్టుకొని కుంజమ్మతో మళ్లీ వచ్చి వాళ్లముందు నిలబడింది. 'ఏంటీ ఏమైందీ' అన్నట్లు చూశారు. షణ్ముగవడివు తన గంపెడంత ఆశను బయటపెట్టింది.

మెల్లగా, "ఈ అమ్మాయి నా కూతురు, చాలా బాగా పాడుతుంది, ఈ పాపచేత కూడా ఒక పాట పాడించండి దయచేసి."



అక్కడ వున్నవారంత అసహనంగా చూశారు. "ఏమనుకుంటుంది ఈవిడ... గ్రామఫోను రికార్డులు కోసం పాటలు పాడటం జరుగుతుందా లేక కచేరీకోసం పాడటం జరుగుతుందా.. ఒకళ్ల తర్వాత ఒకళ్లు వరుసకట్టి పాడేయటానికి?" అని అనుకున్నారు.

వాళ్ల చూపులలోని భావం పూర్తిగా గ్రహించి, "ఒకసారి మీరు తన పాట వినండి, బాగుంటేనే పాడించుకోండి" అని ప్రాధేయపడింది.

దక్షిణ భారతంలో ఇప్పటిదాకా గ్రామఫోను ప్లేటుల్లో వుంటే శాస్త్రీయ సంగీతం లేదంటే లలిత సంగీతం. ఏదైనా పెద్ద విద్వాంసులు పాడిన సంగీతమే. కాస్త ఉత్తర భారత ప్లేటుల్లోనే వైవిధ్యం వుంది. స్వాతంత్ర్య సమరయోధుల భాషణలు వున్నాయి. ఈ అమ్మాయితో ఏమన్నా వైవిధ్యం చూపించవచ్చు అనుకుని, ఏ 'టింకిల్, టింకిల్ లిటిల్ స్టార్' లేదా 'మేరి హ్యాడ్ ఎ లిటిల్ లాంబ్' పాడుతుందేమోనని, "పాపా, పాడమ్మా" అన్నారు.

మూలనున్న చాప పరిచింది రాజం. కుంజమ్మ అమ్మదగ్గరకు వెళ్లింది. ఏమి పాడాలో తెలుసుకుంది. వచ్చి చాప మీద కూర్చొని అమ్మ చెప్పిన పాట పాడింది. "మరకత వడివం..." అంటూ మీనాక్షి అమ్మవారి తమిళ భక్తి పాట పాడింది. చాలా శ్రైశ్రుతిలో గుక్కతిప్పుకోకుండా అలవోకగా పాడింది కుంజమ్మ. సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు అక్కడివారు.

"మా అమ్మాయి ఇప్పుడే వర్ణాలు పూర్తిచేసి కృతుల్లోకి వెళ్లబోతుంది" అంది షణ్ముగవడివు.

"తెలుస్తూనేవుంది" అన్నాడు అసలు అధికారి కుంజమ్మనే చూస్తూ.

"మరి రికార్డింగు తీసుకుంటారా పాపది" మెల్లగా అడిగింది షణ్ముగవడివు.

అక్కడివాళ్లందరూ సంప్రదించుకొని, "ఇప్పుడు పాడిన పాట, ఇంకా ఒక్క పాట పాడమనండి, ఒక్కొక్కటి మూడు నిమిషాలు దాటకూడదు" అని చెప్పాడు రికార్డింగు అధికారి. షణ్ముగవడివు అన్నీ సిద్ధం చేసుకునే వచ్చింది. కాబట్టి తర్వాత పాడాల్సిన పాట కూడా చెప్పింది.

"కుంజా! ముందు 'మరకత వడివం' పాడి మళ్లీ వాళ్లు పాడమన్నప్పుడు తిరుప్పుగళ్ పాడు" అని చెప్పింది.

కుంజమ్మ అవలీలగా, బ్రహ్మాండంగా పాడింది. రికార్డింగు పూర్తయిన తర్వాత ఆ కొట్టునుంచి బయటకు వచ్చింది. తల్లి ఆనందానికి అవధులు లేవు. రాజం మెటికలు విరుస్తూ ఆనందాన్ని వ్యక్తపరచింది. కంపెనీ ఉద్యోగి ఒకరు కుంజమ్మ దగ్గరకు కలం

కాగితంతో వచ్చి, "కుంజమ్మా! నీ పేరేంటమ్మా? రికార్డు మీద పాట ఎవరు పాడారో వ్రాయాలి. నీ పేరేంటో చెప్పు."

"మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి."

అప్పటిదాకా కుంజమ్మను మెచ్చుకోలుగా చూసిన ఆ ఉద్యోగి చూపు మారింది. దేవదాసీ వ్యవస్థలో పిల్లల పేర్లలో తండ్రి పేరు కానీ, అతని ఇంటిపేరు కానీ అప్రస్తుతం. బిడ్డను మోసిన తల్లే నికరం, వారికి ఆమె పేరే సత్యం, సంఘం ఇప్పటికీ పట్టించుకోదు. శాశ్వతం. దానికి కారణమైన తండ్రిపేరు అస్సలు లెక్కలోకి తీసుకోవాల్సిన విషయమే కాదు. సంఘం తెలివిగా తనకు అవసరమైనట్లు ఏర్పాటు చేసుకున్న నామకరణ వ్యవస్థ.

కుంజమ్మకు ఆ మౌనం ఏదోలా వుండి అమ్మ వెనక దాక్కుంది.

"ఈ అమ్మాయికి ఒక ఎనిమిదేళ్లు వుంటాయమ్మా?" షణ్ముగవడివుని అడిగాడు.

"పదేళ్లు" చెప్పింది తల్లి.

𝄞𝄞

ఆ తరువాతి రోజు శుక్రవారం. ప్రతి శుక్రవారం వీణ ధనమ్మ తన ఇంట్లో కచేరీ చేస్తుంది. అతి కొద్దిమందికే ఆహ్వానం. వాళ్లలో గొప్ప సంగీతజ్ఞులు, ధనికులు, పెద్ద ఉద్యోగస్తులు వుంటారు. ధనమ్మ నేస్తులు కూడా ఆహ్వానితులే. ఎలాగూ పట్నంలో వుంది కాబట్టి షణ్ముగవడివు బృందం కూడా కచేరీకి వచ్చింది. ధనమ్మ డాబా మెట్లు ఎక్కేముందు అందరికీ చెప్పింది షణ్ముగవడివు. "అందరూ చాలా నిశ్శబ్దంగా వుండాలి, దగ్గినా కూడా ధనమ్మ వీణ పక్కనపెట్టి, ఈ రోజుకిక చాలు, వెళ్లండందరూ" అంటుందని.

అరగంటసేపు బ్రహ్మాండమైన కచేరీ చేసింది ధనమ్మ. అక్కడకు వచ్చిన పట్నంలోని పెద్దమనుషులందరూ ఒకరి తర్వాత ఒకరు వచ్చి అభినందించి వెళ్తున్నారు. ఓపిగ్గా ఒకపక్క కూర్చొంది షణ్ముగవడివు. ఆఖరిగా ధనమ్మ ముందుకు వచ్చి నిల్చుంది.

"షణ్ముగం! నువ్వూ వచ్చావా? ఇప్పటిదాకా వున్నావు.. ఈ రోజు పట్నంలోనే వుంటావా?"

అవునంది షణ్ముగవడివు.

"ఇప్పుడే వస్తానాగు" అని లోపలికి వెళ్లింది. ఆమె లోపలికి వెళ్లగానే ధనమ్మ ...తుళ్లు నలుగురు, కూతుళ్ల సంతానం పదమూడుమంది పిల్లలు, పుట్టలోంచి చీమలు ...రచరా వచ్చినట్లు గదుల్లోంచి బయటికివచ్చారు. వచ్చినవారికి ఫలహారాలు పెట్టి కబుర్లలోకి ...ారు. షణ్ముగవడివు కుటుంబంలాంటిదే ధనమ్మ కుటుంబం. ఈ పదమూడుమంది ...లూ కుంజమ్మలానే సంగీతం నేర్చుకుంటున్నారు. ఈ మధ్యదాకా గురుకులవాసం





మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి

కూడా చేశారు. శక్తి అబ్బాయిలతో స్నేహం మొదలుపెట్టాడు. కాసేపటికి ధనమ్మ వచ్చింది. కంటిచూపు మందగించింది. కుంజమ్మ ధనమ్మ దగ్గరకు వెళ్లింది. కుంజమ్మ సరిగ్గా కనిపించలేదు. లాంతరు దగ్గరకు రమ్మని కుంజమ్మకు సైగచేసింది. కుంజమ్మ లాంతరు వెలుగులోకి వచ్చింది. "శాంతం! శాంతం! మొహంలో ఎంత శాంతం కనిపిస్తుంది పిల్లలో" అంది ధనమ్మ. పోయినసారి కలిసినప్పుడు చెప్పినట్లే.

"రికార్డింగుకు వచ్చావా, కచేరీకి వచ్చావా?"

"రెండికీ. ఈసారి కుంజమ్మచేతకూడా ప్లేటులో పాడించాను."

"నిజంగానా? గొప్ప పనిచేశావు. ఇంకా నేనే ఆ పనిచేయలేదు."

"మెల్లగా అమ్మాయికి వీణ నేర్పిద్దామనుకుంటున్నాను.. ఏమంటారు?"

"ఎందుకు? చేతివేళ్లు పొడుగ్గా వున్నాయనా... వద్దు, పాడించు, పాటలోనే పైకొస్తుంది, వీణకూడా నేర్పు, తప్పులేదు."

షణ్ముగవడివు నిజంగానే మనసు మార్చుకుంది, అక్కడికక్కడే.

ధనమ్మ రాజంవైపు చూసింది. ఇదే అదనుగా రాజం, "ఏమి వాయించారు వీణ, ఏమి పాడారు, మీ అమ్మాయిలు తక్కువా? మీ పిల్లలు పిడుగులు సంగీతంలో, అసలు మీ ఇంట్లో మనుషులతోపాటు ప్రతి వస్తువుకి సంగీతం తెలుసు. ఆ తులసికోట పాడుతుంది, ఆ గుమ్మం పాడుతుంది, ఆ తలుపు పాడుతుంది, ఈ స్తంభం పాడుతుంది..." అంటూ ఇంకా చెప్పబోతుంది రాజం. కాని, "రేపు ఆ స్తంభం పాడుతుంది. వచ్చి విను" అంది ధనమ్మ. దెబ్బతో నోరుమూసుకుంది రాజం.

"ఎవరీ కోణంగి?" అడిగింది షణ్ముగవడివుని.

"మన ఊరే, మన అమ్మాయే, రాజం అని."

ధనమ్మతో తనివితీరా మాట్లాడి, సెలవుతీసుకొని వీధిలోకి వచ్చారు.

"షణ్ముగం! 'కోణంగి' అంటే ఏంటి?" అడిగింది రాజం.

"కోణంగి అంటేనా.. కోణంగి అంటే.. అదే రాజం.. బాగా సంగీతాన్ని అర్థం చేసుకొని సంగీతాన్ని మెచ్చుకునేవాళ్లని కోణంగి అంటారు" తలెత్తకుండా చెప్పింది షణ్ముగవడివు.

"ఓహో... అలానా... షణ్ముగం! నీకొక మాట చెప్తా ఏమి అనుకోవుగా.."

"చెప్పు పర్వాలేదు."

"నీకన్నా, నీ వీణకన్నా, నీ పాటకన్నా ధనమ్మే బాగా పాడుతుంది, వాయిస్తుంది."



తలెత్తి రాజంని చూసింది షణ్ముగవడివు. "నువ్వు నిజంగా కోణంగివే రాజం" అంది.

పట్నంలో రెండు కచేరీలు చేసి, తిరిగ్గా ఇంటి దారి పట్టింది షణ్ముగవడివు బృందం.

మదురైలో రైలుస్టేషను నుంచి ఇంటిదాకా షణ్ముగవడివు, రాజం కుంజమ్మ ప్లేటు పాట గురించి దండోరా వేసుకుంటూ వచ్చారు. మధ్యాహ్నంకల్లా చాలామంది వచ్చి కుంజమ్మను మెచ్చుకొని వెళ్తున్నారు. రెండు సంవత్సరాల క్రితం సేతుపతి బడిలో పాడినప్పుడు, తనను మెచ్చుకుంటూ కొట్టిన చప్పట్ల అర్థం గ్రహించలేకపోయింది కాని, ఇప్పుడు ఈ మెచ్చుకోలుల్ని బాగా ఆస్వాదిస్తుంది. తండ్రికి తను ప్లేటుల్లో పాడానని ఎప్పుడెప్పుడు చెప్పుదామా అని తహతహలాడుతుంది.

మదురైలో మళ్లీ సాధన మొదలయ్యింది,పదేళ్ల కుంజమ్మకి, పదమూడేళ్ల శక్తికి, ఆరేళ్ల వడివాంబకి కూడా.

శక్తి మృదంగం నేర్చుకోవటానికి బయటికి గురువు దగ్గరకు వెళ్తున్నాడు. కుంజమ్మకు గురువు భట్టర్ దగ్గర కృతులు మొదలయ్యాయి. వడివాంబకు తల్లి వయోలిన్, వీణ నేర్పిస్తుంది. పిల్లలకు బడి క్రమం తప్పినా సాధన మాత్రం క్రమం తప్పదు. లేచిన దగ్గరనుంచి పడుకోబోయేదాకా ఆ ఇల్లు సంగీత సాధనతో మారుమ్రోగుతుంటుంది.

కుంజమ్మకు నాన్న కనిపించక రెండు నెలలవుతుంది. ఆరోజు రాత్రి అమ్మ పక్కన పడుకున్నప్పుడు కుంజమ్మ అడిగింది. "అమ్మా! నాన్న కనిపించటంలేదు, లేరా..?"

"పట్నం వెళ్లారేమో అమ్మా... నాకు తెలియదు" అంది షణ్ముగవడివు. "రేపు కనుక్కుంటాలే, నువ్వు పడుకో.."

ఆ తరువాత రాత్రులు కూడా అమ్మ సమాధానాలు దాటవేస్తూ వచ్చింది. ఆ రాత్రి మళ్లీ అడిగింది, "అమ్మా! నాన్నను చూడాలి. ఎప్పుడు వెళ్లను?" తల్లి ఏమీ మాట్లాడటంలేదు. పక్కన పడుకున్న శక్తి ఇక ఆగలేక చెప్పేశాడు చెల్లికి, "కుంజా! నాన్న చనిపోయారు, చాలారోజులవుతుంది."

కుంజమ్మ అమ్మని గట్టిగా హత్తుకుంది. షణ్ముగవడివు వెంటనే లేచి బుడ్డి వెలిగించింది. కుంజమ్మ తల్లిని చూసి వెక్కివెక్కి ఏడ్చింది. సపర్యలుచేసి, కుంజమ్మను మళ్లీ పడుకోబెట్టింది. ఇంత బాధ ఆ ఇంటి ఇల్లాలు కూడా పడివుండదే అనుకుంది షణ్ముగవడివు.

"అమ్మా!" మెల్లగా పిలిచింది కుంజమ్మ.

"చెప్పమ్మా..."

"ఎప్పుడు చనిపోయారు..?"

"మనం పట్నం నుంచి వచ్చాక, ఒక పదిరోజులకి."

"నువ్వు వెళ్లావా...?"

"నన్ను ఎవరు పిలుస్తారమ్మా, నన్ను రానివ్వరుకూడా..."

"ఎందుకు?"

"నేను ఆయన భార్యను కాదుకదా, ఆయనకు అభిమాన స్త్రీని, అంతే."

"అభిమాన స్త్రీ అంటే...?"

"అంటే... మొదటి భార్యను కాదు... రెండోభార్యలాగా..."

"మమ్మల్ని కూడా రానివ్వరా..?"

"ఇంకవన్నీ ఇప్పుడెందుకు? అంతా అయిపోయింది. నువ్వు బొజ్జో."

పొద్దున్నే కుంజమ్మ బడలికతో లేచింది. ఆ రోజంతా నాన్నను పోగొట్టుకున్న దుఃఖం కనిపిస్తూనేవుంది. 'భగవంతుడా! ఇది మళ్లీ మంచం పట్టదుకదా..' అనుకుంది షణ్ముగవడివు. భగవన్నామస్మరణతోనే అప్పుడు తను మొక్కిన మొక్కు కూడా గుర్తొచ్చింది. కుంజమ్మకు త్వరగా జ్వరం తగ్గి, సంగీతసాధనకు దిగితే తిరుచెందూరు సుబ్రహ్మణ్యస్వామి గుడికి వస్తానని మొక్కుకుంది. కుంజమ్మకు బాగై సాధనచేసుకుంటూ ప్లేటులకు కూడా పాడింది కాని, షణ్ముగవడివు మొక్కు సంగతి పూర్తిగా మర్చిపోయింది. ఇప్పుడు మళ్లీ కుంజమ్మకు జ్వరం వచ్చే సూచనలు కనిపించేసరికి, ఇంటిల్లిపాదీ అంతా తిరుచెందూరు ప్రయాణమైంది. తమిళులకి సుబ్రహ్మణ్యస్వామి ఇలవేల్పు. చాలా ఖర్చుతో కూడుకున్న పని షణ్ముగవడివుకి, అయినా వెనకాడలేదు ఈ పరిస్థితిలో. ముసలివాళ్లని మాత్రమే ఇంట్లో వదలి, ఏడుగురు కలసి, తిరుచెందూరు చేరుకున్నారు. అక్కడ గర్భగుడిముందు దేవుని దర్శనం చేసుకుంటుండగా కుంజమ్మ ఒక్కసారిగా కిందకు జారి పడిపోయింది. అత్యంత ఆత్రంతో పిల్లను సత్రంలోకి తీసుకువచ్చారు. కాసేపటికి కుంజమ్మ స్పృహలోకి వచ్చింది. బాగానే వుంది.

"అమ్మా!" పిలిచింది అమ్మని. "అమ్మా! ఇందాక గుడిలో నాకు దేవుడు కనిపించాడు.."

"అందరికీ కనిపించాడు కుంజా" ఠక్కున అన్నాడు శక్తి.

"మీకు కనిపించింది రాయి. నాకు నిజంగా కనిపించాడు. చేయి ఎత్తి దీవించాడు నన్ను, నిజంగా కనిపించాడు."



"మంచిదమ్మా, దేవుడు స్వయంగా నిన్ను దీవిస్తే చాలా మంచిదన్నట్లు. నువ్వు కాసేపు పడుకో" అంటూ షణ్ముగవడివు పడుకోబెట్టింది.

ఎవరూ నమ్ముతున్నట్లు లేదు కుంజమ్మ చెప్పినదాన్ని. ఇప్పుడు అన్నవైపు తిరిగింది. కుంజమ్మ చెప్పేలోపలే, "కుంజా, దేవుడు చివరిసారిగా తిరుమల నాయకుడికి కలలో కనిపించి గుడి బాగా కట్టమన్నాడు. ఆ తర్వాత ఎవరికీ ఇంకా కనిపించలా. నువ్వు పడుకో" అని బయటికి పరిగెత్తాడు.

"సాధువులు కళ్లు తెరచి దీన్ని చూస్తే గొప్పది అవుతుందంటారు, ఇది కళ్లు తెరచి చూస్తే దేవుడే కనిపించాడంటుంది. ఏంటో దీని వరస" అంటూ అత్తలు నసుక్కున్నారు.

ఎవరేమనుకున్నా కుంజమ్మకు తనకు కనిపించింది ఆ భగవంతుడేనని నమ్మకం. భగవంతుడి నిజ దర్శన భాగ్యం కలిగి, పారవశ్యం చెందిన భక్తురాలిగా, ఆ ఆత్రత, ఆ సంతోషం, ఆ తృప్తి తన పాటలో వ్యక్తపరచటం మొదలుపెట్టింది.

❦

వైశాఖ మాసపు వసంతంలో మీనాక్షీ సుందరేశ్వరులు మదురై ఎండలనుంచి సేదతీరటానికి, తిరుమల నాయకుడు నిర్మించిన వేసవి విడిది అయిన పుదుమంటపంలోకి ఊరేగింపుగా దాసీల నృత్యగానాలతో వేంచేశారు. పుదుమంటపంలో ఆసీనులైయున్న ఆదిదంపతులకు దాసీలు చామరములు వీచగా, మరికొంతమంది దాసీలు నృత్యగానాలతో అలరిస్తున్నారు. దాసీలు వారి వృత్తి ధర్మాన్ని భక్తిశ్రద్ధలతో పాటిస్తున్నారు. నట్టువు తాళం వేయగా, ఒక దాసీ పాట పాడగా, పిళ్లైలు నాదస్వరం, వయోలిన్, హార్మోనియం వాయిస్తున్నారు. పుదుమంటపం కిటకిటలాడిపోతుంది. ఈ జనంలో మదురై వాసులకంటే బయటనుంచి వచ్చినవారే ఎక్కువున్నారు. మదురైలో కాంగ్రెస్ నేత గాంధీ మకాంవేసి వున్నారు. ఆయనకోసం చాలామంది వచ్చారు మదురైకు. కాంగ్రెస్ సభలు జరిగేరోజున కచేరీలు చేయటానికి సంగీత విద్వాంసులుకూడా వచ్చారు. వీరందరితో పుదుమంటపం నిండిపోయింది. దాసీల అభినయం ఇంకా జరుగుతుండగానే షణ్ముగవడివు ఒకపక్కగా బయటికి వచ్చి ఇంటిదారి పట్టింది. తూర్పు చిత్ర వీథిలో నడుస్తుండగా.. వెనకనుంచి పిలుపు వినిపించింది.

"షణ్ముఖంగారూ! వస్తున్నాను, ఆగండి."

వెనక్కు చూసింది షణ్ముగవడివు. అరియక్కుడి కనిపించగా ఆగింది.

"ఆగండాగండి, ఇంకా మనవాళ్లు వస్తున్నారు."

సెమ్మంగుడి, చెంబై తోడయ్యారు.

"మీరెప్పుడొచ్చారు?" అడిగింది షణ్ముగవడివు.

"గాంధీగారి వెనకాలే, కాంగ్రెస్‌వాళ్లు పిలిచారు కచేరీలకి, మీకు వున్నాయా ఈ మారు?"

"కాంగ్రెస్ కచేరీలు లేవుకానీ, వసంతోత్సవం కచేరీలు వున్నాయి" అందరూ షణ్ముగవడివు ఇంటికి చేరారు.

కుంజమ్మ గ్రామఫోను ప్లేట్లల్లో పాడిందని తెలుసుకొని ఆశ్చర్యపోయారు.

"ఏమండీ! సెమ్మంగుడిగారు! ఈ పిల్లకూడ రికార్డులకి పాడేసిందండీ" అన్నాడు అరియక్కుడి రామానుజ అయ్యంగార్.

"ఏం చేద్దాం. మగవాళ్లంటే చిన్నచూపయింది ఆ గ్రామఫోను కంపెనీవాళ్లకి, కర్ణాటక సంగీతపు మగవాళ్లంటే మరీను. ఒక్కళ్లు అడగలేదుకదా నన్ను పాడమనీ" తన గోడు వెళ్లబోసుకున్నాడు సెమ్మంగుడి.

"ఈ విషయం రేపు గాంధీగారికి చెప్పు, మన దేశ ఆడవాళ్ల ప్రగతిని తెలుసుకొని ఆనందిస్తారు" అన్నాడు చెంబై.

"కుంజమ్మా! ఏదీ ఒక వర్ణం పాడమ్మా" అడిగాడు అరియక్కుడి. కుంజమ్మ పాట విని, "భేష్, బాగా పాడావు. నేను నీకొక వర్ణం నేర్పుతాను,నేర్చుకో" అని తోడిరాగంలో ఒక వర్ణం నేర్పాడు.

"నేను ఈసారి వచ్చేసరికి బాగా సాధన చేసుకో" అని అన్నాడు. షణ్ముగవడివు సంతోషించింది. ఫలహారాలు తీసుకుంటుండగా వీధి తలుపు దగ్గర ఒక మనిషి నిలబడ్డాడు.

"ఎవరు బాబూ?" అని అడిగింది షణ్ముగవడివు.

"నేను సుందరం అయ్యంగారు దగ్గర నుండి వస్తున్నానండీ."

"సుందరం అయ్యంగారా? ఎవరు ఆ పెద్ద వ్యాపారేగదా, టి.వి.ఎస్. బస్సులు నడుపుతున్నారు, మనకోసమే మనిషిని పంపినట్టున్నారు" అని వారిలో వారు అనుకుంటున్నారు సంగీత విద్వాంసులు.

"ఇక్కడ ఒక చిన్నపిల్ల రికార్డింగులో పాటలు పాడిందటకదా, ఆ పిల్లను రేపు సైకిల్‌కొట్టు ప్రారంభోత్సవం వుంది, అక్కడ పాటలు పాడటానికి రమ్మన్నారు, వాళ్లమ్మతోపాటు పిల్లను కూడా తప్పకుండా తీసుకురమ్మన్నారు" అని చెప్పాడు ఆ మనిషి.

సంగీత విద్వాంసులు ఆశ్చర్యపోయారు. "అప్పుడే ఊరంతా పాకిపోయిందే నీ ఘనత" అనుకుంటూ మెచ్చుకున్నారు కుంజమ్మని.



ఆ తరువాతరోజు టి.వి.ఎస్. సైకిల్ కొట్టు ప్రారంభోత్సవానికి తల్లి, కూతురు తయారవుతున్నారు. ఇంతలో రంగనాయకి పరుగుపరుగున వచ్చింది. "షణ్ముగం! మనవాళ్లందరినీ కాంగ్రెస్ పెద్దాయన దగ్గరకు రమ్మన్నారంట, అందరం వెళుతున్నాం, నువ్వు కూడా రావాలి" అంది.

"గాంధీగారి దగ్గరకా? మనమెందుకు?" అడిగింది షణ్ముగవడివు.

"ఏమో, ఆయన మనతో మాట్లాడతారంట."

"నేను రాలేను రంగా, ఇదిగో చూడు కచేరీకి బయలుదేరుతున్నా, కుంజాని గుర్తుపెట్టుకొనిమరీ వారే పిలిచారు. వెళ్లితీరాలి. నేను కచేరీ అయ్యాక అటువస్తా."

"సరే, తప్పకుండా రా" అంటూ రంగనాయకి మళ్లీ పరుగుపెట్టింది.

షణ్ముగవడివు, శక్తి, కుంజమ్మ, సుందరం, మణి అందరూ పశ్చిమ వెలివీధిలోని సైకిల్ కొట్టుకు చేరుకున్నారు. టి.వి. సుందరం అయ్యంగార్ పది సంవత్సరాలక్రితం మదురైలో బస్సుల వ్యాపారం మొదలుపెట్టాడు. అందులో బాగా లాభాలు గడించి, ఇప్పుడు ఏకంగా సైకిళ్లు ఉత్పత్తి చేసే కర్మాగారం నెలకొల్పాడు. మొదటి దఫా సైకిళ్లు తయారయ్యాయి. ఆ కొట్టుకి ఈ రోజు ప్రారంభోత్సవం. ఆ ప్రారంభోత్సవంలో కుంజమ్మ, షణ్ముగవడివు కచేరి. ప్రార్థన గీతాలు కుంజమ్మతోనే మొదలుపెట్టించింది షణ్ముగవడివు. ఆ తర్వాత తను వీణమీద పాడింది. చివరికి తుక్కడాలు మళ్లీ కూతురుచేతే పాడించింది. రికార్డుల్లో పాడిన చిన్నపిల్లలాగా, కుంజమ్మని అందరూ ప్రత్యేకంగా చూస్తున్నారు. అందరూ ఆశించినట్లుగా కుంజమ్మ గానం అందరికీ చాలా నచ్చింది. కచేరీ అనంతరం, కుంజమ్మకు పళ్లు, పూలతోపాటు, లంగా, జాకెట్టు కుట్టించుకోమని బట్టలుపెట్టారు. షణ్ముగవడివుకి తాంబూలంతోపాటు, ఐదురూపాయలు ఇచ్చారు. సంతోషంగా ఇంటిదోవపట్టారు.

"అమ్మా, ఆ సైకిళ్లు ఎంత బాగున్నాయ్, మనకి ఒక సైకిలు ఇవ్వొచ్చుగా వాళ్లు, ఈ పూలు, పళ్లు బదులు" అన్నాడు శక్తి.

"ఇస్తారురా, మనం ఐదు కచేరీలు చేస్తే" చెప్పాడు మణి.

"ఐదు ఎందుకు మామా?"

"ఆ సైకిళ్లు ఒక్కోటీ పాతికరూపాయలు కాబట్టి."

మిట్టమధ్యాహ్నానికి ఇంటి సందులోకి అడుగుపెట్టారు. ఇళ్లలోంచి కూరలు, నేతుల వాసన ఘుమాయించి కొడుతుంది. కుంజమ్మకు నోరూరుతుంది. ఇంటికి వెళ్లి కాళ్లూ చేతులూ కడుక్కొని, షణ్ముగవడివు అందరికీ అన్నాలు పెట్టబోయింది. పచ్చడి, పలచటి మజ్జిగచూసి, కుంజమ్మ అన్నం తిననని మారాం చేసింది.

"అమ్మా! పక్క యింట్లో ఎంత మంచి కూరలో, నాకూ కూర కావాలమ్మా" అంటూ ఒకపక్క ఆకలితో దీనంగా అడుగుతుంది. పక్కింటివాసనలు షణ్ముగవడివుకు కూడా తగిలాయ్. అవి అంతగా ఊరించేలా వున్నాయి. ఇప్పుడు ఎంత బతిమిలాడినా పిల్ల తినదు. ఏమి చేయాలో తెలియక కూర్చుండిపోయింది. ఇంతలో గాంధీ మీటింగుకు వెళ్లిన నేస్తులు వచ్చారు. దిగాలుగా కూర్చున్న షణ్ముగవడివును చూసి, "ఏంటి నువ్వు ఆ పనికిమాలిన మీటింగుకు రాకుండానే దిగులుపడుతున్నావ్, ఆ వెధవ మీటింగు గురించి ఎవరైనా వచ్చి చెప్పారా...?"

"లేదు, నేను కుంజమ్మ తిననంటే బాధపడుతున్నాను" అంది షణ్ముగవడివు.

"కుంజమ్మకి కూర కావాలా? నేను మా యింటికి తీసుకెళ్లి తినిపించి తీసుకొస్తా" అంటూ రంగనాయకి పిల్లలను వాళ్ల ఇంటికి తీసుకువెళ్లింది.

అన్నం తింటూ షణ్ముగవడివు అడిగింది, "మీ దిగులేంటీ?"

"మీ దిగులు కాదు, మనందరికీ దిగులే" మొదలుపెట్టింది కనకాంబుజం.

"మనకిక రోజులు దగ్గరపడ్డాయంట! యాంటి నాచ్‌లట!"

"అవి నేను పుట్టినప్పటినుంచి వింటున్నా" అంది తాపీగా షణ్ముగవడివు.

"అదొక్కటే కాదు, అసెంబ్లీలో బిల్లు తెస్తారంట మనమీద."

"అసలేమైంది మీటింగులో?"

"మేము వెళ్లగానే మొదలుపెట్టారు, మీరు మీ వృత్తి వదిలేయాలి అంటూ. అప్పటికింకా ఆ పెద్దాయన రాలేదు."

"ఏం వృత్తి అని అడిగాం."

"వేశ్యలవృత్తి అని చెప్పాడు. అది మా వృత్తికాదు, వాళ్లు వేరేవుంటారు, వాళ్లను పిలిచి మీటింగు పెట్టుకో అని చెప్పి వచ్చేస్తుంటే గాంధీగారు వచ్చారని కూర్చోబెట్టారు. ఆయన మళ్లీ ఇదే మొదలుపెట్టాడు. మీరంతా ఆ వృత్తి వదిలివేయాలి అని. మంచి బ్రతుకు బ్రతకాలి అని. మాకు చిర్రెత్తుకొచ్చింది. మెల్లగా లేచి వచ్చేశాం."

"ఇంకా అన్నాడు, మనమంతా నూలు నేయాలంట" అంది మీనాక్షి.

"రంగ వెంటనే అడిగింది, నూలు నేస్తే ఎంత డబ్బులు వస్తాయండీ అని, గాంధీగారు నెలకు రూపాయి వస్తుందన్నారు."

"నెలకు ఒక కుటుంబానికి ఒక రూపాయి సరిపోతుందండీ? అస్సలు సరిపోవని వెంటనే అంది రంగ, గాంధీ ఇంకేమీ మాట్లాడలేదు. మేము వచ్చేశాము."



"వస్తూవస్తూ ఆయన చూస్తుండగానే కాంగ్రెస్ చందా డబ్బాలో రూపాయి వేసి వచ్చాం."

"పద షణ్ముగం, చూడామణి దగ్గరకెళ్లి చెప్పాలి, ఏంటో మనకి రోజులు దగ్గరపడుతున్నాయంట. దాని అర్థమేమిటో అడగాలి" అంటూ తొందరపెట్టింది మరకతం.

𝄞𝄞𝄞𝄞

ఒక సౌరాష్ట్రుల కుటుంబం మదురైలో ఎప్పట్నుంచో స్థిరపడింది. షణ్ముగవడివు తల్లి దగ్గరనుంచి రెండు కుటుంబాలకి స్నేహం వుంది. వాళ్లింట పెళ్లికి పిలవటానికి షణ్ముగవడివు ఇంటికి వచ్చారు.

"షణ్ముగం! నీకు రెండు ఆహ్వానాలు, ఒకటి ఇంటిల్లిపాదీ పెళ్లికి రావాలి, రెండు, నువ్వూ, కుంజమ్మ పెళ్లిలో మంచి కచేరీ చేయాలి, మా చుట్టాలందరూ వస్తారు. వాళ్లు మీ పాటలు వినాలి."

అయిపోయాయి, ఆ రోజులు అయిపోయాయి, షణ్ముగవడివు కచేరీలో కూతురుచేత ఒక పాట చివర్లో పాడించే రోజులు అయిపోయాయి, ఇప్పుడందరూ గుర్తుపెట్టుకొని మరీ కూతురుని పాడటానికి తీసుకురమ్మంటున్నారు. తల్లికి కావలసిందీ అదే, తన కూతురుకి గుర్తింపు రావాలని.

పెళ్లిరోజున క్రొత్త లంగా, జాకెట్టు వేసుకొని, చక్కగా ముస్తాబయ్యి, ఒక పిచ్చి గొలుసు, చెవులకి చిన్ని పోగులు, ఒక్కచోట కాదు రెండుచోట్ల, కింద ఒక జత, చెవుకి పైన ఇంకో జత, రెండువైపులా ముక్కు కుట్టినా ప్రస్తుతానికి ఎడమవైపే ముక్కుపుడక, మల్లెపూలు పెట్టుకుని, పెళ్లికీ, కచేరీకీ ముస్తాబయింది. పెళ్లి దగ్గరకు చేరుకున్నారు. కుతూహలంగా పెళ్లిచూసింది. తృప్తిగా పెళ్లి భోజనం చేసింది కుంజమ్మ. ఇక కచేరీ చేయవలసినచోటుకి తీసుకెళ్లారు. ఒక గది తలుపుతీసి, అందులోకి వెళ్లమన్నారు. కుంజమ్మ ముందుగా లోపలికి వెళ్లింది. గదిలోకి వెళ్లిందోలేదో ఉన్నచోటనే శిలగా నుంచుండిపోయింది. ఆ గది అద్దాల గది. నాలుగు చెరుగులా అద్దాలు బిగించారు. కుంజమ్మ వెళ్లి మధ్యలో నుంచోగానే ఒక కుంజమ్మకాదు, తన చుట్టూతా వందమంది కుంజమ్మలు కనిపిస్తూ కదులుతున్నారు. అమ్మదగ్గరకి వచ్చేదాకా కదలకుండా నిలబడిపోయింది.

"కుంజా! భయపడకు" అంటూ శక్తి వచ్చాడు. అమ్మని గట్టిగా పట్టుకొని కుంజమ్మ చుట్టూతా చూసింది. అమ్మ, శక్తి, మామలు, తను, అందరూ వందలువందలుగా కనిపిస్తున్నారు. ఆ సంభ్రమాశ్చర్యంలోంచి బయటపడలేకపోతుంది కుంజమ్మ. ఆ గది మధ్యలో కచేరీకి ఏర్పాటు చేశారు. కుంజమ్మతోనే కచేరీ మొదలయింది. మధ్యలో తల్లి

వీణ వాయించగా, కుంజమ్మతోనే కచేరీ ముగిసింది. పెళ్లివారు అందరికీ చెబుతున్నారు "ఈ చిన్నపిల్ల రికార్డుల్లోకూడా పాడింది" అని. అందరూ తన పాటను మెచ్చుకుంటుంటే కుంజమ్మ సంతోషపడిపోతోంది. చివరకు అమ్మను గట్టిగా పట్టుకొని ఆ అద్దాల గదిలోంచి బయటపడింది.

ఆ అద్దాల గదిలో ప్రతిబింబాలు కాదు, కుంజమ్మ పాటే ఆకర్షణ అయింది. ఎటొచ్చీ కుంజమ్మనే కాస్త ఆ ప్రతిబింబాలు అవస్థపెట్టాయి.

జ్యేష్ఠమాసంలో ఒకరోజు సంగీత సాధనలయ్యి షణ్ముగవడివు పూజ చేసుకుంటుండగా శ్రీనివాసరావు దగ్గరనుంచి ఒక మనిషి వచ్చి గ్రామఫోను ప్లేటు ఒకటి ఇచ్చాడు. షణ్ముగవడివుకు తెలుసు, అది కుంజమ్మదని. నేరుగా ఆ ప్లేటుని దేవుడి ముందుపెట్టి దేవుడుతోపాటు ప్లేటుకీ హారతి ఇచ్చింది.

"అది ప్లేటుల్లో పాడిన వేళావిశేషం. చూడండి అప్పటినుంచి ఎంతమంది పిలుస్తున్నారో దానిని." "కుంజా ప్లేటు" అంటూ అందరికీ చూపించింది.

ప్లేటుని షణ్ముగవడివు మామ చూస్తున్నాడు, "మిస్ సుబ్బలక్ష్మి , ఏజ్‌డ్ టెన్ ఇయర్స్" ప్లేటుమీద అలా రాసి ఉన్నదాన్ని చాలాసేపు చూశాడు.. "దాని పేరు ముందు నీ పేరు లేనిదీ, దాని ఊరు పేరు లేనిదీ అది పేరే కాదు" అంటూ ప్లేటు షణ్ముగవడివుకి ఇచ్చేశాడు. ఆ పేరు రాసిన పద్ధతి చూసేసరికి ఆయనకు కుంజమ్మ ప్లేటనే ఆనందం కూడా ఆవిరయిపోయింది.

"ఏమో మామా, చోటు సరిపోలేదేమో. కుంజా పూర్తి పేరే చెప్పింది ఆ రోజు."

"ఆ రాసిన సగం పేరు కూడా సుబ్బలక్ష్మి అని రాశారు, సుబ్బులక్ష్మి అని రాయలేదు."

"వాళ్లకి సుబ్బలక్ష్మి అని వినిపించిందేమో." ప్లేటు చూసుకుంటూ ముందు గదిలోకి వచ్చింది షణ్ముగవడివు. కుంజమ్మకి ప్లేటు చూపించి, జాగ్రత్తగా దాచింది.

ఇక పిల్లలు బడికి వెళ్లగానే, ఇంట్లో ఆడవాళ్లు గుడికి బయలుదేరారు. ఈ జ్యేష్ఠమాసంలో మీనాక్షి సుందరేశ్వరులను ఊయలమీద కూర్చోబెట్టి ఊపుతూ, నృత్యగానాలతో అలరిస్తూ వుంటారు. గుడినుంచి ఇంటికి చేరుకోగానే, ముగ్గురు వ్యక్తులు షణ్ముగవడివు కోసం కాచుకొని వున్నారు. ఒకరు కుంజమ్మ గురువు భట్టర్, రెండవవారు పొన్నుస్వామి పిళ్లై, మూడవవారు షణ్ముగవడివుకు తెలియదు. పిళ్లై మొదలుపెట్టాడు, "ఈయన్ను దేవకోట్టై చెట్టిగారు పంపారు, వాళ్ల ఇంట్లో ఒక శుభకార్యం వుందట, నిన్ను, కుంజమ్మను కచేరీ చేయటానికి పిలవటానికి వచ్చారు.. ఏమంటావు?" అడిగాడు పిళ్లై.






సుబ్బలక్ష్మి పాడిన మొదటి గ్రామఫోన్ రికార్డు

షణ్ముగవడివు చెప్పేలోపలే, "కుంజమ్మ కాదు పిళ్లై. సుబ్బలక్ష్మి. ఈ పాప పేరు. పదేళ్లే. ఆ అమ్మాయి రికార్డు మేము విన్నాం."

మెల్లగా నవ్వుకున్నారు పిళ్లై, షణ్ముగవడివు. "మీ సుబ్బలక్ష్మేలెండి. మేము ఇంట్లో కుంజమ్మ అని పిలుస్తాం."

"నేను దగ్గరుండి మిమ్మల్ని తీసుకువెళ్తాను. ఏమంటారు?" అడిగాడు దేవకోట్టై వ్యక్తి.

"మాకు ఇంతకంటే ఏమికావాలి, తప్పకుండా వస్తాం" అంది షణ్ముగవడివు. ఎప్పుడు బయలుదేరాలో చెప్పి వాళ్లిద్దరూ వెళ్లిపోయారు. ఇక భట్టర్‌గారి దగ్గర కూర్చుంది.

"బాగుందమ్మా, చాలా బాగుంది. సంతోషం, నిజంగానే సంతోషం. కాని నా శిష్యురాలిచేత నేను కచేరీ ఇప్పించేదెప్పుడు...? మొన్నటిదాకా అబ్బే నా కచేరీలో తుక్కడాలు పాడుతుంది అన్నావు. ఇప్పుడు నిన్ను తోడుగా తీసుకెళ్లి పిల్లచేత కచేరీలు చేయించి నీచేత తుక్కడాలు పాడిస్తున్నారు. మరి నేను కచేరీ ఇప్పించేదెప్పుడు? పిల్ల గురువుని నేను అని తెలిసేదెప్పుడు?" ఆవేశంగా అడుగుతున్నాడు గురువు.

"ఇదిగో మీరు కృతులు ఎప్పుడు పాడిస్తానంటే అప్పుడే" చెప్పింది షణ్ముగవడివు. మీదే ఆలస్యం అన్నట్లు.

"సరే, నేను పొన్నుసామితో మాట్లాడి ఖరారు చేస్తాను" అంటూ వెళ్లిపోయాడు భట్టర్. పాపం భట్టర్ భార్య గోల భట్టర్‌దే. షణ్ముగవడివు మీదకు ఉసిగొల్పి పంపింది.

దేవకోట్టై చెట్టిగార్ల ఇంటిలోకూడా బ్రహ్మాండంగా కచేరీ చేసింది సుబ్బలక్ష్మి. మదురై బయట చేసిన తొలి కచేరీ ఇది. ఒక చీర, ఐదు రూపాయలు పారితోషికంగా తీసుకుంది మదురై షణ్ముగవడివు సుబ్బలక్ష్మి.

❁❁❁❁

"అందరూ వచ్చారు. మీరు మొదలుపెట్టండి." దొరైకణ్ణమ్మ, ప్లీడర్ నటేశన్, జీవరత్నంవైపు చూస్తూ చెప్పింది చూడామణి. దొరైకణ్ణమ్మ కుర్చీలోంచి లేచి, చూడామణి ఇంటి పంచలో చేరిన మదురై దేవదాసీలను చూస్తుంది. 'కబురూ కాకరకాయ లేకుండా పట్నంనుంచి వూడిపడ్డారు. ఏం చెప్పటానికి మాకు' అన్నట్లు మదురై దాసీలు ఆమెవైపు చూస్తున్నారు.

"మదురై దేవదాసీల్లారా.. నమస్కారం" మొదలుపెట్టింది దొరైకణ్ణమ్మ. "మమ్మల్ని మీ దగ్గరకు బెంగుళూరు నాగరత్నమ్మ పంపింది. మీకు ఒక విషయం సుస్పష్టంగా చెప్పిరమ్మంది. పట్నంలో మద్రాసు శాసనమండలిలో ముత్తులక్ష్మిరెడ్డి అనే ఆవిడ ఒక



తీర్మానం తీసుకొచ్చింది. ఆ తీర్మానం కనుక అమలయితే..." దొరైకణ్ణమ్మ చెప్పేదల్లా ఆగిపోయి, కొంగుతో కళ్లు తుడుచుకుంటుంది.

"చెప్పేదుపు" అంది రాజం.

అందరూ రాజంవైపు ఒక చూపు చూసి, కళ్లతో హెచ్చరించి, చూడామణివైపు చూశారు. చూడామణి తలపట్టుకొని నేలచూపులు చూస్తుంది. వెంటనే పట్నం నుంచి వచ్చిన వాళ్లవైపు చూసి "ఆ.. ఆ తీర్మానం అమలయితే...?"

"మనకు మన ఆలయాలతో సంబంధాలు తెగిపోతాయి. మనం మన ఆడపిల్లలను దేవుడి సేవకి అంకితం చేయలేము. అలా చేస్తే అది నేరం అవుతుంది. మనకు జైలుశిక్ష పడుతుంది. మన ఆలయాల్లోని మూలవిరాట్టులని, ఉత్సవమూర్తులని నృత్యగానాలతో ఇక సేవించుకోకుండా మనల్ని అడ్డుకుంటారు. ఆఖరికి మనం దృష్టి దోష పరిహారం కూడా చేయలేం. మామూలు భక్తులలాగా గుడిలోకి రావాలి కానీ, మన దేవదాసీ హోదాలో కాదు. ప్రత్యేకమైన హోదా లేదు కాబట్టి, మనకి గుడినుంచి ఎలాంటి భత్యాలు, మర్యాదలు, అలాంటివి ఇంకేమైనా కూడా వుండవు."

దొరైకణ్ణమ్మ చెప్పడం ఆపింది. అంతా నిశ్శబ్దం.

మదురై దేవదాసీలు నిశ్చేష్టులై చూస్తున్నారు. నిజమా అని అడుగుతున్నాయి ఆ చూపులు. చూడామణి వైపు చూశారు. చూడామణి చూపు కిందకు దించుకుంది.

"తరతరాలనుంచి చేసుకుంటూ వస్తున్న పనే ఈ రోజూ చేస్తుంటే జైలులో పెడతారా? ఏం? మనం ఇప్పటికిప్పుడు దెయ్యాలమయ్యామా? పింజారీలమయ్యామా?" ఆవేశంగా పట్నంనుంచి వచ్చినవాళ్లని అడిగింది రంగనాయకి.

"వేశ్యలమయ్యామంట" చెప్పింది చూడామణి, తల దించుకునే.

"వేశ్యలు, వేశ్యలు, వేశ్యలు. ఆ గాంధీ మీటింగులో కూడా ఇదే గోల. వేశ్యలకీ, దేవదాసీలకీ నక్కకీ నాకలోకానికి వున్నంత తేడా వుంది. వకీలుగారు! మీరు వాదించలేదా మా గురించి? మా జీవితాన్నంతా ఆ దేవుడి సేవలోనే పెడుతున్నామే, ఇప్పటికీ ఆ తెల్లదొరలు మా జోలికి రాలేదు. ఇప్పుడు మొదలయ్యారా ఈ రెడ్లు, ముదలియార్లు, పిళ్లైలు మాకు వ్యతిరేకంగా."

"వీళ్లకు తెలియదా శైవాగమశాస్త్రంలో సాక్షాత్తు శివుడే అడిగాడు తన సేవలో రుద్రగణికల నృత్యగీతాలు వుండాలని, ఆ రుద్రగణికలే మేము."

"శైవాలయంలోనేకాదు, వైష్ణవాలయంలో కూడా మేము దేవుడి ప్రీత్యర్థం నృత్యనైవేద్యాలు సమర్పిస్తున్నాం. కనీసం 500 ఏండ్ల నుంచి క్రోడీకరించబడ్డ నృత్య

గాన భాండాగారానికి మేమే దిక్కు. దేవుడి దగ్గర మా నాట్యాలు ఆపితే, ఆయన నేవతీరేదెలా... మాకు కడుపు నిండేదెలా.. ఈ నృత్యగానాలు ఆపితే అవి ఇంకెందుకు పనికొస్తాయి..?"

"మాకు ఏ రోజైతే దేవాలయంతో సంబంధం లేకుండా చేస్తారో అదిగో ఆ రోజు మేము నిజంగా వేశ్యావృత్తిలోకి దిగాల్సొస్తుంది మా పొట్టలు నింపుకోవటానికి." నిప్పులు చెరిగారు మదురై దాసీలు.

వకీలు నటేశన్ విస్తుపోయాడు, మదురై దేవదాసీల విషయ పరిజ్ఞానానికి. పట్నంలో బెంగుళూరు నాగరత్నమ్మ, వీణ ధనమ్మ, జీవరత్నం, దొరైకణ్ణమ్మ వీళ్లంతా కూర్చొని శోధించి, మధించి తయారుచేసిన మహజరు, మదురై దేవదాసీలు ఆశువుగా చెప్పేశారు. వీళ్లని కూడా ఒక మహజరు తయారుచెయ్యమని చెప్పాలనుకున్నాడు.

మళ్లీ దొరైకణ్ణమ్మ అందుకుంది, "మీరంతా చెప్పిందే అసలు నిజం. ప్రస్తుతానికి, ముత్తులక్ష్మిరెడ్డి శాసనమండలిలో తీర్మానం చేసింది. దాని గురించి మండలిలో చర్చ జరుగుతుంది. బహిరంగంగా వార్తాపత్రికల్లో కూడా చర్చ జరుగుతుంది. నటేశన్ లాంటి అతి కొద్దిమందే మనకు మద్దతు పలుకుతున్నారు. అందుచేత మీరంతా ఎప్పుడు పట్నం రమ్మంటే అప్పుడు వచ్చి మన వాదనను గట్టిగా వినిపించాలి."

"తప్పకుండా వస్తాము" ముక్త కంఠంతో చెప్పారు మదురై దాసీలు. "ఇప్పుడు కొత్తగా శాసనమండలిలో ఇంకేమి పనిలేనట్లు దేవదాసీల ప్రస్తావన ఎందుకు వచ్చింది?" అడిగింది మరకతం.

"ఇప్పుడికిప్పుడు వచ్చినదేమీ కాదు, ప్రతి పదేళ్లకొకసారి వస్తూనే వుంది." చెప్పాడు నటేశన్.

"ఎందుకు? మేమేమి పాపం చేశాము?"

"నేను చెప్తాను ఎందుకో" చూడామణి మొదటిసారిగా నోరువిప్పింది. "ప్లీడరుగారూ మీరూ వినండి."

"గత యాభై సంవత్సరాల నుండి తెల్లవారి జనాభా మన దేశంలో ఎక్కువవుతూ వస్తుంది.. ముఖ్యంగా సైనికులు. వీరు, వారి భార్యలు లేకుండా ఈ దేశంలో సంవత్సరాలు గడుపుతున్నారు. వీరు వేశ్యావృత్తికి ఆజ్యం పోస్తున్నారు. రోగాలతో వారి దేశం వెళ్తున్నారు. అక్కడి ప్రజలు, ఇక్కడి క్రైస్తవ మిషనరీలు భారతదేశంలో వేశ్యావృత్తి ప్రబలంగా ఉందని ప్రచారం చేస్తున్నారు.

వారి సైనికుల ఆరోగ్యం కాపాడుకోవటంకోసం భారతదేశంలోని ప్రభుత్వంమీద వేశ్యావృత్తిని నిలువరించటానికి ఒత్తిడి తెస్తూనేవున్నారు. మన దేశంలో వేశ్యావృత్తి



విశృంఖలంగా వుందంటూ మనల్ని గేలిచేయటం మొదలుపెట్టారు. ఇంగ్లాండులోవున్న మన భారతీయులకు. ఇక్కడ పైచదువులు చదువుకున్న భారతీయులకి ఇవి సిగ్గుచేటుగా అనిపించాయి. అందరూ కలసి వ్యభిచారం మీద దండెత్తారు. ఇంతవరకూ బాగానేవుంది. వ్యభిచార నిలుపుదల చట్టంకింద పదేళ్లలోపు ఆడపిల్లలమీద నిఘా మొదలయ్యింది. సరిగ్గా ఇక్కడే దేవదాసీలు వారి చూపుల్లోపడ్డారు. పిల్లలు లేని దేవదాసీలు వారి భద్రతకోసం ఆడపిల్లలను దత్తత తీసుకుంటారు. వారికి కళలు నేర్పి దేవుడితో పెళ్లి చేసి, దేవుడు సేవలో చేర్చుతారు. ఎక్కడో వెయ్యిమందిలో ఒక దాసీ చేసివుండవచ్చు, ఈ చదువుకున్నవాళ్లు భయపడుతున్న పనిని, అందుకని ఏకంగా దాసీలందరినీ దత్తత తీసుకోవద్దనటం, దత్తత తీసుకున్నవారిని, వారితోపాటు దాసీల సొంత బిడ్డలని గుడికి ఇవ్వద్దనటంలో న్యాయం లేదు. ఇంకా దేవదాసీల జీవన విధానాన్ని వేశ్యలతో పోలుస్తున్నారు. ఒక దేవదాసీ వీలయినంత వరకూ ఒక పోషకుడి దగ్గరే వుంటుంది. మాకు గుడి జీతభత్యాలు ఇస్తుంది కూడా. మహాఅయితే ఒక దేవదాసీ తన జీవితకాలంలో నలుగురి పోషకులతో, అదికూడా అవసరమయితేనే, ఒకరి తర్వాత ఒకరి కింద ఉంటుంది. మమ్మల్నీ, వేశ్యల్నీ ఒక గాటని కడితే ఎలా? చూచాయగా ఎక్కడో ఒక పోలిక కనిపిస్తే. నటేశన్ గారూ, మీకు అర్థమయ్యిందా?"

అప్పటిదాకా కాలి మీద కాలు వేసుకున్న నటేశన్ చూడామణి చారిత్రక విశ్లేషణకు గౌరవసూచకంగా కాలు దించాడు.

"మీరు గట్టిగా వాదించాలి మా గురించి. దేవదాసీలు దేవాలయాల్లో లేకపోతే షోడశోపచారాల్లో భాగమయిన నృత్య గానాలు దేవునికి ఎవరు సమర్పిస్తారు? మా కొతాలు ఏమవుతాయి, మా కచేరీలు ఏమవుతాయి, అన్నీ మాతోనే మరుగున పడాలా..?"

"అన్నిటికంటే నీచమైన పని, ఆ చదువుకున్నవారు చేస్తున్నదేమిటంటే దేవదాసి పక్కన వేశ్య అనే పదం చేర్చి అవి రెండూ సమానార్థం కలిగినవాటిగా సమాజానికి చెబుతున్నారు. నేను దేవదాసిని అని చెప్పుకుంటే, ఎదుటివారికి 'నేను వేశ్యను' అని అర్థం అయ్యేటట్లు పరిస్థితిని తీసుకొచ్చారు."

"అవును, ఈ రోజున పరిస్థితి ఇలానే వుంది.కొత్త బిచ్చగాడు పొద్దు ఎరగనట్లు, శాసనమండలిలో మన సభ్యులు ఏదో ఒక చట్టం చేసేయాలి అనే యావ మీద ఉన్నారు. ఆ ముత్తులక్ష్మిరెడ్డి దేవదాసీల గురించి మాట్లాడే మాటలు మీరు వినలేరు, బాధపడతారు" చెప్పాడు నటేశన్.

"ఆమె స్వయంగా ఒక దేవదాసి కూతురు అయివుండి" అంది చూడామణి.

'మీకు ఇది కూడా తెలుసా' అన్నట్లు చూశాడు నటేశన్. మదురై దాసీలు ఒక

దానిని పట్నంలో శాసనమండలి సభ్యులకి
మహజరు తయారుచేసుకొని పట్నం రావాలని. సమర్పించాలని. ఆ రోజు చూడామణి పంచలో తీర్మానం చేశారు. ఈ చర్చలకు, ఈ తీర్మానాలకు పన్నెండేళ్ల సుబ్బలక్ష్మి సాక్షి. సంగీతాన్ని గ్రహించినట్లు ఈ చర్చల్లోని సారాంశాన్ని కూడా గ్రహిస్తుంది. మద్రాసు నుంచి వచ్చినవారిని మదురై దాసీలు చూడామణి ఇంటి లోపల భోజనానికి కూర్చోపెట్టారు. చూడామణి పంచలోనే వుంది, ఆలోచనల్లోనే వుంది. "చప్పుళ్లు చూస్తూ చూస్తూనే పొలికేకలయ్యాయి" అంది బాధగా.

కాసేపటికి, పక్కనేవున్న షణ్ముగవడివు చేయి పట్టుకొని, "షణ్ముగం, నావరకైనా ఇప్పటి వరిస్థితి వుంటుందో లేదో..నువ్వు నాకు ఒక పని చేసి పెట్టాలి" అని బ్రతిమాలదుతున్నట్లుగా అంది.

ఏంటది అన్నట్లు చూస్తోంది షణ్ముగవడివు.

"నాకు ఈ రోజుదాకా ఆలయ మర్యాదలు కొరత లేకుండా జరిగాయి. రేపు నేను పోయిన తర్వాత కూడా నన్ను ఆలయ మర్యాదలతో సాగనంపు షణ్ముగం. నీదే పూచి. నన్ను పూర్తి ఆలయ మర్యాదలతో సాగనంపు" చెప్పింది చూడామణి.

షణ్ముగవడివు చూడామణిని చూస్తూ తన చేతిలోనున్న చూడామణి చేతిని అదిమి పట్టుకుంది.

ఇక మెల్లగా మదురై దాసీలందరూ ఇళ్లదారి పట్టారు. దారిలో రాజం అడిగింది, "షణ్ముగం! ఈ వేశ్యలు, వేశ్యలు, వేశ్యలు అంటే ఏంటి?"

షణ్ముగవడివు చెప్పేలోపల రంగనాయకి నోరు విప్పింది, "వేశ్యలు, వేశ్యలు, వేశ్యలు అంటే నువ్వేనే! ఆ మదరాసులో ముత్తులక్ష్మి మొత్తుకుంటుంది కూడా నీలాంటివాళ్ల గురించేనే."

షణ్ముగవడివు నివ్వెరపోయింది రంగనాయకి సమాధానానికి.

"రాజం! రంగ చెప్పింది తప్పు. మనం ఇటు వెళ్దాం రా. నీకు నేను చెప్తాను." అంటూ రంగనాయకివైపు కోపంగాచూసి రంగనాయకితో నడవటం ఇష్టంలేక, రాజంని తీసుకొని వేరే దారిపట్టింది.

ఆ వేరే దారిలో సుబ్బలక్ష్మి గురువు భట్టర్, పొన్నుస్వామి పిళ్లైతో మాట్లాడుతూ కనిపించాడు.

'అమ్మో! భట్టర్ అన్నంతపనీ చేసుకుంటూ పోతున్నాడే, నాచేత భారీగా తాంబూలం తీసుకోకుండా వదిలేటట్లు లేదు' అనుకుంది మనసులో.

వాళ్లను నవ్వుతో పలకరించుకుంటూ ఇంటికి చేరింది. ఇంటిలో రంగనాయకి వుంది. తప్పయిపోయింది, ఇంకెప్పుడు అలా మాట్లాడను' అన్నట్లు చూస్తుంది.



"రాజం మనకంటే ఏం చేస్తుంది వేరుగా. దాన్ని అంత మాటన్నావు?"

"ఇంకెప్పుడూ అనను."

"ఆ చట్టం నన్నేమీ చేయలేదు, రాజంని అంతకన్నా ఏమి చేయలేదు. మీ సంగతి చూసుకోండి, ఆ చట్టం వస్తే గుడి దాసీలకే చాలా కష్టం."

𝄞𝄞𝄞𝄞

ఈసారి గ్రామఫోను కంపెనీవాళ్లు సుబ్బలక్ష్మిని బెంగుళూరు పిలిచారు రికార్డింగుకి. మద్రాసు వచ్చి అక్కడనుంచి బెంగుళూరుకి రైలు ఎక్కమన్నారు. షణ్ముగవడివు, సుబ్బలక్ష్మి నాలుగు రోజుల ముందే మద్రాసు చేరుకున్నారు. మద్రాసులో బసచేసి, షణ్ముగవడివు కూతురుని తీసుకొని పట్నంలో వెలిసిన సభలన్నిటికీ పరిచయం చేయటానికి వెళ్లింది.

ఎక్కువ సభలు జార్జి టౌనులోనే, ఎందుకంటే జార్జి టౌను నిండా దుబాసీలు, వ్యాపారస్తులు, సంపన్నులు, వీరి వెనకాలే వీరికోసమే దేవదాసీలు వచ్చి చేరారు. వీణ ధనమ్మ కుటుంబం, కోయంబత్తూరు తాయి, మద్రాసు లలితాంగి, సేలం గోదావరి, బెంగళూరు నాగరత్నం ఎక్కడెక్కడినుంచో వచ్చి ఇక్కడకు చేరారు.

ముందుగా తొండై మండలం సభ సెక్రటరీ మునిస్వామినాయుడిని కలిసింది. సుబ్బలక్ష్మి చేత పాడించింది. ఆయన మెచ్చుకున్నాడు.

"ఇంకో రెండురోజుల్లో బెంగుళూరులో గ్రామఫోను రికార్డుల్లో పాడటానికి వెళ్లున్నాము. ఇంతకుముందే మా అమ్మాయి ప్లేటుల్లో పాడింది, దానికి అప్పుడు పదేళ్లు" ఒకింత గర్వంగా, ఒకింత సిఫార్సుగా చెప్పింది. మునిస్వామి నాయుడు ఈసారి సభలు ఏర్పాటు చేస్తున్నప్పుడు కబురుపెడతానన్నాడు. ఆ తరువాత ముత్యాలపేట సభకి వెళ్లి అలానే కూతురుని సిఫార్సు చేసుకుంది.

మధ్యాహ్నం అయింది. మైలాపూరు సంగీత సభకు వస్తే అది సరిగ్గా నడవటంలేదని చెప్పారు. మళ్లీ కాళ్లు ఈడ్చుకుంటూ జార్జిటౌను చేరారు. వీణ ధనమ్మ ఇంట్లో భోజనాలు చేశారు. షణ్ముగవడివు తన ఈడువాళ్లతో మాటల్లో దిగగా, సుబ్బలక్ష్మి తన ఈడువాళ్లతో ఆటల్లో దిగింది.

ఆ తరువాతి రోజుకూడా షణ్ముగవడివు కాళ్లకు పనిచెప్పింది. పార్థసారథి స్వామి సభ ఇంకా మిగిలివుంది. ఆ తరువాత కొంతమంది పెద్దమనుషులను కలిసే పనిపెట్టుకుంది. అందరి దగ్గర కూతురుకి సభల్లో పాడే అవకాశము ఇవ్వమని ప్రాధేయపడింది. ఒక బట్టలకొట్టు దగ్గర ఆగి చిన్న పాపకి బట్టలు, ఆ తరువాత కొన్ని కాయలు కొంది. "ఎవరికమ్మా ఇవి?" సుబ్బలక్ష్మి అడిగింది.

"నా స్నేహితురాలికి పాప పుట్టిందే."

మద్రాసు ఎండకీ మదురై ఎండకీ చాలా తేడా వున్నట్లు వుంది. తల్లీ కూతుళ్లు నీరుకారుకుంటూ మద్రాసు లలితాంగి ఇంటికి చేరారు. ఈరోజు భోజనం అక్కడే.

"పాపకి ఏం పేరుపెట్టావు?" అడిగింది షణ్ముగవడివు.

"వసంత కుమారి" చెప్పింది లలితాంగి.

"వసంతరాగం" అంటూ షణ్ముగవడివు పాపని ఎత్తుకుంది.

మద్రాసు నుంచి బెంగుళూరు చేరారు. మద్రాసులో రికార్డుల పనిలా ఇక్కడ ఒకళ్లో ఇద్దరో కాదు కర్ణాటక సంగీత కళాకారులంతా ఇక్కడే వున్నట్టున్నారు. ఈసారి మగవాళ్లే ఎక్కువ. వీళ్లు, ఇంకా సుందరాంబ తప్ప అందరూ మగవారే, గొప్పగొప్ప విద్వాంసులే. చిత్తూరు నాగయ్య, జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం, చౌడయ్య, మహారాజపురం విశ్వనాథ అయ్యర్, పారుపల్లి సుబ్బారావు, సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్, రామతిలకం మొదలగువారందరూ వచ్చారు, వారందరి బస దగ్గర దగ్గరలోనే. ఎవరు రికార్డుల్లో పాడుతున్నా అందరూ వచ్చి వింటున్నారు. తీరిగ్గా ఏ చెట్టుక్రిందనో పుట్టక్రిందనో మేడమీదో కూర్చొని కచేరీలు చేస్తున్నారు. సంగీతం గురించి చర్చించుకుంటున్నారు. సుబ్బలక్ష్మికి ఈ తరహా అనుభూతులలో ఇది మొదటిది. సంగీత దిగ్గజాలను దగ్గరగా చూసింది కాని, అమ్మ చేతిని గొలుసు కట్టేసుకొని, అమ్మని పక్కనే ఉంచుకొని. సుబ్బలక్ష్మికి ఇంకా బిడియం వీడలేదు. కాని చెవులారా ఏ విద్వాంసుడు ఎలా పాడాడో వింటుంది. అందరికంటే అతి చిన్నదయిన సుబ్బలక్ష్మి పాటని మాత్రం కోరికోరి విన్నారు అందరూ.

పక్షం రోజుల్లో శ్రీరామనవమి ఉత్సవాలు మొదలవుతాయనగా సుబ్బలక్ష్మి, శక్తి, వడివా సాధన ముగించి, శౌంరి కాఫీ తాగుతూ కూర్చున్నారు. కాఫీతాగిన తర్వాత సుబ్బలక్ష్మి ముగ్గులేస్తుంది. ఎదురింటి మామిడిచెట్టు విరగ్గాసిన కాయలతో, ఆకులతో గుబురుగా కనిపించింది. 'అవును, నాన్న పండుగ వస్తుంది కాని నాన్న లేడు.' అనుకుంది సుబ్బలక్ష్మి. అప్పుడే పొన్నుస్వామి, సుబ్బలక్ష్మి గురువు ఇంటికి వచ్చారు.

"షణ్ముఖంగారూ! అంతా ఖరారు చేశాను, కుంజమ్మ పాడే పాటలతో సహా" సంతోషంగా చెప్పాడు సుందరేశ భట్టర్.

"అక్కా! శ్రీరామనవమి ఉత్సవాల్లో మాసి వీధి పందిరిలో కుంజమ్మ కచేరి పెడుతున్నా!" అన్నాడు నాదస్వర విద్వాంసుడు పొన్నుస్వామి పిళ్లై. షణ్ముగవడివుకి అంతకన్నా



ఏమికావాలి, కూతురుకి కచేరీలకన్నా. "శుభం" అంది.

శ్రీరామనవమి ఉత్సవాల్లో భాగంగా జరుగుతున్న కచేరీలలో సుబ్బలక్ష్మి కచేరీ ఇచ్చింది. సుబ్బలక్ష్మికి పన్నెండేళ్లు. తల్లి తంబూరాతో శ్రుతి చేయగా, గురువు వయోలిన్ వాయించగా, ఆయన కనుసన్నల్లో కచేరీ చేసింది. వర్ణం, రాగాలాపన, స్వరప్రస్తారాలతో కీర్తనలు పాడింది. ఆరు పైన శ్రుతిలోనే పాడింది.

ప్రతి పాటకి చప్పట్లతో మారుమ్రోగిపోయింది ఆ పందిరి. గురువు భట్టర్ జోలె తాంబూలంతో, పట్టువస్త్రాలతో నిండిపోయింది.

షణ్ముగవడివు సుబ్బలక్ష్మి పేరు మదురైలో మారుమ్రోగిపోయింది ఆ రోజు నుంచి.

ఆ తర్వాత రోజే పొన్నుస్వామి మళ్లీ ఇంటికి వచ్చాడు.

"బ్రహ్మాండంగా పాడావు కుంజమ్మా! ఇంకా గొప్పదానివవ్వాలి నువ్వు" అన్నాడు. సుబ్బలక్ష్మి సిగ్గుపడుతూ అలాగేనని తలవూపింది.

"అక్కా! త్వరలోనే మదురై అవతల ఒక జాతర జరుగుతుంది. ఆ జాతరలో పాడటానికి తీసుకువెళ్తాను కుంజమ్మని."

ఈ కచేరీలో శంకరాభరణం రాగాలాపన, కృతి పాడింది.

రంగనాయకి, కనకాంబుజం, మీనాక్షి అందరూ షణ్ముగవడివు ఇంటికి చేరారు. వీళ్లకోసమే ఎదురు చూస్తున్నట్లు షణ్ముగవడివు చాప పరిచి ఆకుల దబ్బాపెట్టుకొని కూర్చొనివుంది. అందరికీ ఆకు, వక్క అందించింది షణ్ముగవడివు.

"షణ్ముగం! కుంజమ్మకి ప్రాయోజితం ఎప్పుడు?" అడిగింది మీనాక్షి.

"వద్దు, చేయకు షణ్ముగం. శారదా చట్టం వచ్చింది, పద్నాలుగు ఏళ్లలోపు ఆడపిల్లలకు ప్రాయోజితాలు చేసినా, పెళ్లిళ్లు చేసినా జైల్లో పెడతారంట" అంది రంగనాయకి.

"ఆ... ఏమి చట్టంలే. ఎక్కడ ఆగుతున్నాయి ఏమయినా... మా మేనమామ మనమరాలు మూగాంబిక పెళ్లి ఎల్లుండేకదా... దానికి సరిగ్గా కుంజా వయస్సు, పదమూడేళ్లే."

"మరి చేస్తావా...?" అడిగింది మీనాక్షి.

"నాకెప్పుడూ ఇష్టం లేదు. దీన్ని చూస్తే ఇంకా బక్కగానే వుంది, ఎవరి కంట్లో పడేటట్లు లేదు, అనవసరంగా అందరినీ పిలిచి...... వృథా ఖర్చు కదూ......" అంది షణ్ముగవడివు.

"మన పెద్దోళ్లు ఎలా చేశారో, ఊళ్లో ఉన్నోళ్లందరినీ పిలిచి, భోజనాలు పెట్టి వాళ్లలో ఒకరిని పిల్లని ఎంచుకోమనీ...." అని చెప్తూ వుంటే రంగనాయకి, "వాళ్లని ఎంచుకోనీయటంకాదు. వాళ్లలో ఎవరు ఎక్కువ డబ్బు ఇస్తే వాళ్లని మనమే ఎంచుకొని మనమే పిల్లనిస్తాం" అంది రాజం.

"అదేలేవే, నేను చెప్పొస్తుందీ. షణ్ముగం నువ్వన్నట్లు కొన్ని పద్ధతులు మనముకూడా వదిలేయాలి" అంటూ ముగించింది రంగనాయకి.

"మరి ఏం చేస్తావ్? దానికి పెళ్లి చేస్తావా? పోషకుడిని చూస్తావా?" అడిగింది స్నేహితురాలు కనకాంబుజం.

"ఇంకొన్నాళ్లు చూసి, అది ఈలోపల ఇంకా బాగా సంగీతం నేర్చుకుంటుంది. అప్పుడు పోషకుడిని చూస్తాను" మనసులో మాట చెప్పింది షణ్ముగవడివు.

మధ్యాహ్నం రెండు అయింది. ఇక ఎవరి ఇండ్లకెళ్లి వారు పడుకుందామనుకుంటుంటే వీధి తలుపు తీసుకొని, సుబ్బలక్ష్మి ఏడుస్తూ బడినుంచి వచ్చింది.

"కుంజా! ఏమైంది? ఎందుకు ఏడుస్తున్నావు?" అందరూ ఆదుర్దగా అడిగారు.

"పంతులమ్మ కొట్టింది. బాగా కొట్టింది" అని దగ్గుతూ చెప్పింది సుబ్బలక్ష్మి.

"బాగా కొట్టిందా? దీని దగ్గరసలు కండవుందా...... ఈ దెబ్బలు తట్టుకోవటానికి... ఎలా దగ్గుతుందో చూడు" షణ్ముగవడివు పుస్తకం సంచి తీసి పక్కనవేస్తూ అంది.

"ఎందుకు కొట్టిందో ఇలాగా, మేము బడికి వెళ్లి కనుక్కొస్తాముండు" అంటూ రంగనాయకి, కనకాంబుజం బయలుదేరారు.

రెండు రోజులకి కాని సుబ్బలక్ష్మికి దగ్గు, జ్వరం తగ్గలేదు. ఆ తర్వాత మూగాంబిక పెళ్లి. మూగాంబిక సుబ్బలక్ష్మికి బడిలో స్నేహితురాలు పైగా చుట్టాలపిల్ల. నెలరోజుల ముందే బడి మానేసింది మూగాంబిక. స్నేహితులందరూ దాని పెళ్లని చెవులు కొరుక్కున్నారు. సుబ్బలక్ష్మిని, వాళ్ల అమ్మని ఈ పెళ్లిలో కచేరీ కూడా చెయ్యమన్నారు. పట్నం సంబంధం మరి, ఘనంగా చేయాలని కచేరీ కూడా పెట్టించారు మూగాంబిక తల్లిదండ్రులు.

పడమర రాజగోపురం వీధిలోనే మూగాంబిక ఇల్లు, అక్కడే పెళ్లి. లంగా, జాకెట్టు వేసుకొని, పిచ్చి నగలు పెట్టుకొని, జడకు అరటిమట్ట కట్టి, ఆ పొడుగాటి జడకు పూలుచుట్టి, పెళ్లికి, కచేరీకి తయారయింది సుబ్బలక్ష్మి.

దూరంనుంచే మూగాంబికను చూస్తోంది. మూగాంబిక తన బంగారు గాజులు, గొలుసు తడిమి సుబ్బలక్ష్మివైపు చూసింది, 'ఇవి నీకు లేవుగా' అన్నట్టు. 'నా పెళ్లిలో నీ కచేరీ. హిహిహి' అని నవ్వింది కాసేపు.



కచేరీ అయిన తర్వాత మూగాంబికకి కుట్టించిన పట్టు లంగా జాకెట్టు రెండు జతలు సుబ్బలక్ష్మికి బహుమతిగా ఇస్తుంటే మూగాంబిక ఏడవటం మొదలుపెట్టింది, "నా కొత్తబట్టలు దానికెందుకు ఇస్తున్నారు.....?" అని.

పెళ్లి తంతు ఇంకా జరుగుతుండగా సుబ్బలక్ష్మి అత్తని అడిగింది, "అత్తా! అమ్మ నాక్కూడా పెళ్లి చేస్తుందా.....?" అత్తలు ఒకరిమొహం ఒకరు చూసుకున్నారు, "నువ్వు మీ అమ్మకి బంగారు బాతువే, నీకు పెళ్లెందుకు చేస్తుంది?" వాళ్లిద్దరికి మాత్రమే వినిపించేటట్లనుకున్నారు. పైకిమాత్రం "మీ అమ్మనే అడగవే" అన్నారు.

రాత్రి అమ్మ పక్కన పడుకొని మెల్లగా అడిగింది సుబ్బలక్ష్మి, "అమ్మా! మూగాంబికలాగా నాకూ పెళ్లి చేస్తావా?"

"మూగాంబికకు నీకు పోలికెక్కడ కుంజా... దాని పొట్టకోసినా ఒక్క స్వరం సరిగ్గా పలకలేదు, అలాంటివాళ్లకమ్మా పెళ్లి, నీలాంటిదానికి కాదు."

సుబ్బలక్ష్మి ఇంకేం మాట్లాడకుండా పడుకుంది.

* * *

వడివాంబ, శక్తి, సుబ్బలక్ష్మి ముగ్గురూ ఇంటిముందు మెట్టుమీద కూర్చొని కబుర్లాడుకుంటున్నారు. లోపల నుంచి తల్లి గట్టిగా పిలిచింది.

"కుంజా నువ్వు లోపలికి రా."

వెంటనే సుబ్బలక్ష్మి లోపలికి వచ్చింది, "ఏంటమ్మా?" అంది.

"పెద్దదానివయ్యావు, అలా వీధిలో కూర్చోకు, పద్ధతి కాదు" అంది.

"అన్న కూడా బయటే వున్నాడు, వాడినీ రమ్మను" అంది సుబ్బలక్ష్మి.

"వాడు వుంటే వున్నాడులే. నువ్వు బయట కూర్చోకు" మళ్లీ అరిచింది షణ్ముగవడివు.

సుబ్బలక్ష్మి మూతి ముడుచుకొని లోపలే వుండిపోయింది.

"సరే కుంజా, నేను లోపలికి వచ్చేశాలే" అంటూ శక్తి కూడా లోపలికి వచ్చాడు, చెల్లిని బాధపెట్టటం ఇష్టంలేక.

సుబ్బలక్ష్మి వెంటనే తంబూర తీసుకుంది. స్వరాలు పలికి తన గొంతుకు శ్రుతి చేసుకుంది. ఆ తర్వాత స్వరాలు పలకటం ఆపి, తంబూర మీటుతూ తన స్థాయిలో వుందో లేదో చూసుకుంటుంది. ఇదే సుబ్బలక్ష్మికి ఇష్టమైన వ్యాపకం. ఇంట్లోకి వచ్చి శక్తి గోలీలు ఆడినా, వడివా పెరట్లోకి వెళ్లి మట్టిబొమ్మలు చేసినా సుబ్బలక్ష్మి మాత్రం రోజూ ఈ అభ్యాసం చేసి తన శ్రుతిని మెరుగుపరుచుకుంటుంది.

సుబ్బలక్ష్మికి ఊహ తెలిసినప్పటినుంచీ, సంగీతం నేర్చుకోకమునుపు నుంచే తల్లి తన కచేరీలలో పక్కన కూర్చోబెట్టుకుంటూనేవుంది. సంగీతాభ్యాసం మొదలుపెట్టిన రెండు సంవత్సరాలకి, అంటే సుబ్బలక్ష్మికి ఎనిమిదేళ్లు వున్నప్పుడు సేతుపతి బడిలో అమ్మ కచేరిలో ఒక్కపాట పాడింది. ఆ తర్వాత రెండేళ్లకు ఏకంగా గ్రామఫోను ప్లేట్లలోనే పాడింది. అది మొదలు మదురైలో తల్లి కచేరీలలో పిల్లను కూడా సమంగా పాడమని అడుగుతున్నారు. టీవీఎస్ సైకిల్‌కొట్టు ప్రారంభోత్సవంలోనైనా, సౌరాష్ట్రీయుల పెళ్లిలోనైనా, దేవకోట్టై కచేరీలోనైనా, మూగాంబికా పెళ్లిలోనైనా ఇదే తంతు. ఇవన్నీ సుబ్బలక్ష్మికి పదమూడేళ్ల వయసులోపు. ఒక్క శ్రీరామనవమి కచేరి, ఆ తర్వాత జాతరలో కచేరీ, సుబ్బలక్ష్మి ఒక్కతే చేసిన కచేరీలు. ఇకముందు ఇలాంటి కచేరీలే అన్నీ.

𝄞𝄞𝄞𝄞

తిరుచిరాపల్లి మలైకోట్టై వంద కాళ్ల మంటపం జాతర జాతరగా వుంది. షణ్ముగవడివు వీణతో అసహనంగా కూర్చొని వుంది. కుడివైపు మణి మృదంగంతో కూర్చున్నాడు, శక్తి కూడా మృదంగంతో వున్నాడు, ఎడమవైపు కూతురు తంబూరతో వుంది. ముందు ఒక పదిమందిదాకా రసజ్ఞులు కూర్చొని వున్నారు. కాస్త దూరంగా ఒక గుంపు ఒకతన్ని చుట్టిముట్టి ఆయన్ని జాడించేస్తున్నారు.

"ఎవరీమె వీణ పట్టుకొచ్చిందీ, మేము ఈమె కోసమా వచ్చిందీ...?"

"ఆమె ఎవరనుకుంటున్నారయ్యా మదురై వీణ షణ్ముగవడివు."

"నువ్వు తీసుకొస్తానంది తిరుచెందూరు షణ్ముగవడివుని, ఆమెని తీసుకొచ్చి కచేరీ మొదలుపెట్టు."

"నేను చెప్పింది ఈ షణ్ముగవడివు గురించే, మీరు తప్పు విన్నారు."

"మదురై దగ్గరనా, ఈ షణ్ముగవడివును పట్టుకొచ్చావు."

"నీ పప్పులేం వుడకవ్. మేము అంతంత దూరాలనుంచి వచ్చిందే ఆమె కోసం కదా."

"ఒకసారి వింటేకదా తెలిసేది మీకు."

అంతా గమనిస్తోన్న మణి, "అక్కా! ఇది తెమిలేటట్లులేదు, ఇక పద వెళదాం, మనం వెళ్తే ఏదో ఒకటి చేసుకుంటారు" అన్నాడు సర్దుకోబోతూ.

వాళ్ల గొడవలో తప్పు లేదనుకుంది షణ్ముగవడివు. ఇద్దరూ షణ్ముగవడివులే అయినా తిరుచెందూరు షణ్ముగవడివు గాత్ర కళాకారిణి, తనేమో వీణ కళాకారిణి. శ్రోతలు పాటలు వినటానికి వచ్చివుంటారు. ఆమె తనకంటే పెద్దది, పేరున్నది, ప్లేటుల్లో మొదటినుంచీ



తల్లి షణ్ముగవడివు, చెల్లెలు వడివాంబలతో సుబ్బలక్ష్మి

పాడుతూనే వుంది. దూరంగా మానింది. నిర్వాహకుడు ఇంకా వాళ్లందరిని బ్రతిమిలాడుతున్నాడు. వాళ్లు ఇంకా వెట్టెక్కి కూర్చుంటున్నారు.

షణ్ముగవడివు లేచింది. వీణను బాగా ముందుకు జరిపి కూతురు దగ్గర తంబూర తీసుకొని, కూతురుని తన స్థానంలో కూర్చోబెట్టి, కూతురు వెనుక తంబూరతో కూర్చొని, కూతురుని కచేరీ మొదలుపెట్టమంది.

వర్ణంతో మొదలుపెట్టింది సుబ్బలక్ష్మి. ముందు వున్న శ్రోతలు కబుర్లు ఆపి పాట వినటం మొదలుపెట్టారు. అంతా నిశ్శబ్దం, సుబ్బలక్ష్మి పాట ఒక్కటే వినిపిస్తుంది. ఆ పాట మెల్లగా దూరంగా వాదులాడుతున్న వారి చెవిన పడింది. ఒక్కొక్కరుగా వచ్చి మంటపంలో కూర్చుండిపోయారు. వర్ణం కాగానే, మలైకోట్టై మంటపం చప్పట్లతో మారుమ్రోగిపోయింది. పరీక్షగా పాడిన పిల్లను చూస్తున్నారు, లంగాజాకెట్టు వేసుకొని, తలకు నిండుగా నూనె పెట్టుకొని వుంది. "ఎవరీ అమ్మాయి? ఇంతలో ఎక్కడినుంచి వచ్చింది?"

"మనం గమనించలా, ఈ అమ్మాయి మొదటనుంచి వేదిక పైనే వుంది."

ఎవరీ అమ్మాయి అని అందరూ అనుకుంటుండగా... నిర్వాహకుడు వచ్చి, "ఈ అమ్మాయి మదురై వీణ షణ్ముగవడివుగారి బిడ్డ మదురై షణ్ముగవడివు సుబ్బలక్ష్మి."

"అలానా... ఏం పాడుతుందీ... ఇంత చిన్నపిల్లైనా..."

"ఇంక నువ్వు పక్కకు రా, ఆ అమ్మాయిని పాడనీ" అంటూ సుబ్బలక్ష్మి పాటకోసం తహతహలాడారు. నిర్వాహకుడు బతికించావు తల్లీ అనుకున్నాడు సుబ్బలక్ష్మిని చూసి. సుబ్బలక్ష్మి మళ్లీ కచేరీ మొదలుపెట్టింది. కచేరీ జరుగుతుండగా అక్కడనుంచి ఒక సాయిబు కొండ క్రిందకు దారిపట్టాడు.

కచేరీ ముగిసింది. చప్పట్లు ఆగటంలేదు. ఇంతలో కొండ క్రిందకు వెళ్లిన సాయిబు, మళ్లీ రెండొందలు మెట్లు ఎక్కి, ఒక బంగారు పతకంతో రొప్పుతూ పైకి వచ్చాడు. రొప్పు తగ్గింతర్వాత సుబ్బలక్ష్మిని మెచ్చుకొని బంగారు పతకం చేతిలో పెట్టాడు. ఈ బంగారు పతకంతో సుబ్బలక్ష్మి జైత్రయాత్ర మొదలైంది. పెట్టిపుట్టిన పిల్ల. ఇది మొదలు మాత్రమే.

𝄞𝄞𝄞𝄞

అమ్మవారి గుడిలో ఆషాఢంలో జరిగే పదిరోజుల ఉత్సవాలలో నాదస్వర విద్వాంసులదే పైచేయి. అమ్మవారికి మాత్రమే జరిగే పూజలలో నాదస్వరంతో అమ్మవారిని ఆది వీధులలో ఊరేగిస్తారు. సుబ్బలక్ష్మికి నాదస్వరం విందు. గుడిలో చేరి నాదస్వరాన్ని శ్రద్ధగా వింటుంది. ముఖ్యంగా పొన్నుస్వామి నాదస్వరంలో శ్రావ్యంగా వినిపిస్తున్న రాగాలను తన సంగీత



పాఠాలుగా వింటుంది. తల్లి తిరుచిరాపల్లి కోటగుడిలో కూతురు కచేరీ విజయవంతమైనందుకు అమ్మవారికి మనసారా కృతజ్ఞతలు చెప్పుకుంది.

పెళ్లిళ్లల్లో ముఖ్యంగా వున్నవాళ్ల పెళ్లిళ్లల్లో సంగీత కచేరీలు తప్పనిసరి. అదీ ఒక సంగీతజ్ఞుడి ఇంట్లో పెళ్లయితే, ఐదురోజుల పెళ్లిలో కనీసం పది కచేరీలు వుంటాయి. ఆ సంగీతజ్ఞుడి స్నేహితులయిన ఇతర కళాకారులు వచ్చి కచేరీలు చేస్తారు. అటు పెళ్లికి వచ్చినట్లు వుంటుంది, ఇటు వారి ప్రజ్ఞ ఇతర కళాకారులముందు చూపించినట్లు వుంటుంది. ఇట్లాంటి పెళ్లిపిలుపు షణ్ముగవడివుకి పుదుకోట్టై దక్షిణామూర్తి నుంచి వచ్చింది. ఆయన గొప్ప మృదంగం కళాకారుడు, పైగా గాత్ర విద్వాంసుడు కూడా. షణ్ముగవడివు తన పటాలాన్ని తీసుకొని పుదుకోట్టై చేరింది. ఒకపూట కూతురుచేత పెళ్లివారింట కచేరీ ఇప్పించింది. ఆ తరువాత ఉదయం బయలుదేరటానికి అంతా సిద్ధమై, దక్షిణామూర్తికి చెప్పి వెళ్లటానికి ఆగింది. దక్షిణామూర్తి తన స్నేహితులైన సంగీతజ్ఞులతో మాటల్లో ఉన్నాడు. దక్షిణామూర్తి సుబ్బలక్ష్మిని చూసి, "ఈ అమ్మాయిని చూసి నేర్చుకోండయ్యా! నిన్న ఎంత శ్రావ్యంగా పాడింది. మీరంతా ఈపూట ఈ పాటని ఎలా తారుమారు చేసి పాడదామా అని చూస్తున్నారేగానీ ఆ పాట వినటానికి ఏమన్నా బాగుందా అని ఆలోచించటంలేదు. ఈ అమ్మాయి చక్కగా, శాస్త్రీయంగా పాడింది. ప్రయోగాలు నిలబడవు. శాస్త్రీయత, శ్రావ్యత నిలబడతాయి!"

తల్లి ఈ మాటలు విని చాలా సంతోషించింది, అంత పెద్ద విద్వాంసుడు ఇతర గొప్ప విద్వాంసుల ముందు కూతురిని మెచ్చుకుంటుంటే నిజంగా గర్వపడింది. సుబ్బలక్ష్మికి ఒకపక్క సంతోషమేస్తున్నా సిగ్గుతో అమ్మ వెనక నక్కింది.

పంతులమ్మ కొట్టినప్పటి నుంచి సుబ్బలక్ష్మిని బడి మానిపించింది షణ్ముగవడివు. సుబ్బలక్ష్మి పంతులమ్మ అంటే భయపడిపోతుంది. చదవటం, వ్రాయటం వచ్చింది కదా అని, ఇక బడి వద్దులే అంది తల్లి. సుబ్బలక్ష్మి హమ్మయ్య అనుకుంది. ఇక పూర్తిగా సంగీతమే లోకమయింది సుబ్బలక్ష్మికి. ఇంట్లో పనులు కూడా అందుకుంటుంది. ఏ పనిచేసినా, పూలు కడుతున్నా, అంట్లు తోముతున్నా మనసు మాత్రం సంగీతం మీదే. ఏదో ఒక పాట పాడుతూనో, రాగాలాపన చేస్తూనో వుంటుంది. ఎవరన్నా పిలిస్తే వినిపించదు, ఒకటికి రెండుసార్లు తట్టి పిలిస్తేగాని ఈ లోకంలోకి రాదు.

శక్తికి పదిహేడేళ్లు, మృదంగంలో నిష్ణాతుడవుతున్నాడు. సుబ్బలక్ష్మికి పద్నాలుగేళ్లు ఇప్పటికే మదురైలో, చుట్టుప్రక్కల ప్రాంతాల్లో మంచి గాత్రకళాకారిణిగా పేరు సంపాదించింది, వడివాంబకు పదేళ్లు, వాళ్ల అమ్మమ్మ లాగా వయోలిన్ నేర్చుకుంటుంది. సుందరం, మణితో కలిపి షణ్ముగవడివు ఇల్లు ఒక సంగీత సభే.

ప్రొద్దున్నే ఒకటి తర్వాత ఒకటి సాధన చేస్తుంటే, ఆ సందంతా శ్రావ్యమైన సంగీతంతో నిండిపోతుంది. సుబ్బులక్ష్మికి గురువు ఇంటికి వచ్చి సంగీత అభ్యాసం చేయిస్తాడు. సాయంత్రం అమ్మతో కూర్చొని ప్రత్యేకంగా ఏదో ఒక రాగం నేర్చుకుంటుంది. ఆ తరువాత సుబ్బులక్ష్మి కోసమే అన్నట్టు సరైన సమయంలో రేడియో ప్రసారాలు మొదలయ్యాయి. సాయంత్రం ఐదున్నర నుంచి ఒక గంటవరకూ కర్ణాటక శాస్త్రీయ సంగీతంతోపాటు హిందుస్థానీ శాస్త్రీయ సంగీతం కూడా ప్రసారం చేస్తున్నారు. దీనితో సుబ్బులక్ష్మి హిందుస్థానీ సంగీతానికి అలవాటు పడింది. రోజూ ఐదున్నరకల్లా మేడమీదకు వెళ్లి కూర్చుంటే ఎదురింటి మరాఠీ డాక్టర్ రేడియోలో వింటున్న శాస్త్రీయ సంగీతం వినిపిస్తుంది. ఆయనతో పాటు సుబ్బులక్ష్మి కూడా శ్రద్ధగా వింటుంది.

వెళ్లి ఎదురింటి రేడియో వింటుంటే, "కుంజా, నా మొదటి కచేరి డబ్బులతో నీకు రేడియో కొనిస్తా" అని చెప్పాడు అన్న. కూతురు కోసం రేడియోనేకాదు, షణ్ముగవడివు ఇంకా చాలా కొనుక్కోవాలి ఇంట్లోకి. అసలు ఈ ఇల్లే కొనుక్కోవాలి. ఇంటి బేరం సగంలోనే ఆగిపోయింది. జరుగుబాటు కోసం మళ్లీ ఇంకో పోషకుడిని వెతుక్కోక తప్పలేదు.

"మణీ! వెళదామా....." అంటూ తమ్ముడితో ఈ క్రొత్త పోషకుడి దగ్గరికి బయలుదేరింది. పెరట్లో వున్న పిల్లలు లోపలికి వచ్చేసరికి అత్తలు మాట్లాడుకుంటున్నారు.

"ఈసారి ఎవరు?"

"ఎవరో తెలుగు బ్రాహ్మణుడు."

"ఏమి? ఈ సారి ఏ కోమటి చెట్టినో పడితే బాగుండేదికదా" అత్తల మాటల్లో ఎగతాళితనం పూర్తిగా గమనించింది సుబ్బులక్ష్మి.

❦❦❦❦

మద్రాసు వెళ్లేందుకు షణ్ముగవడివు మనస్సు తహతహలాడుతోంది. మద్రాసు వెళ్లలేకకాదు, అక్కడికి వెళ్లే వీలులేకుండా కచేరీలు వుంటున్నాయి. త్రివేంద్రం అంత దూరం కూడా వెళ్లివచ్చారు తల్లీకూతురు. తిరుచిరాపల్లి, తంజావూరు, రామనాథపురం, కోయంబత్తూరు ఇంకెన్నో ఊళ్లు తిరుగుతున్నారు కచేరీలు చేస్తూ. కాస్త వెనకేసుకుంటున్నారు. కాని మద్రాసు వెళ్లి సంవత్సరంపైనే అవుతుంది. ఎక్కడ కచేరీలు చేసినా అక్కడవారంతా మద్రాసులోని సంగీత సభల గురించే మాట్లాడుకుంటున్నారు. ఇప్పుడొక క్రొత్త సభ వచ్చేసిందని తెలిసింది, మద్రాసు మ్యూజిక్ అకాడమీ. ఇప్పటిదాకా వున్న సభలన్నీ ఒక ఎత్తు, ఈ క్రొత్త సభ ఒక ఎత్తు. ఈ క్రొత్త సభని పెట్టినవారు, నడుపుతున్న వారు కాంగ్రెస్ నేతలు. బాగా పలుకుబడి వున్నవారు. ఏటికిఏడు సంగీత కచేరీలు బ్రహ్మాండంగా జరుపుతున్నారని వినికిడి. కనీసం ఈ సంవత్సరం అయినా



మద్రాసు మ్యూజిక్ అకాడమీ కచేరీలు చూడాలని, వీలైతే కూతురుచేత కచేరీ చేయించాలని షణ్ముగవడివు కోరిక.

రెండు నెలలకు ఒక్కసారయినా మదురై బయట కచేరీలు వుంటున్నాయి. ఈ మధ్యన వూళ్లో కచేరీలు తప్పకుండా వుంటాయి. వీటిలో సుబ్బులక్ష్మి కోసం వచ్చేవే ఎక్కువ. తల్లి సంతోషంగా కూతురుని ముందుకు నెడుతోంది. తన కచేరీల కోసం ఆలోచించటంలేదు. ఇప్పుడు మధ్యాహ్నం భోజనంలోకూడా ఒక కూర వండుతుంది షణ్ముగవడివు. దానికితోడు నెయ్యి కూడా వుంటోంది. ఈ కచేరీలే కాకుండా షణ్ముగవడివుకు ఇంకో ఆదాయ వనరు సంగీత పాఠాలు చెప్పటం.

❦❦

శ్రావణమాసం మదురైకు పెద్ద పండుగ. ఈ నెలలో సుందరేశ్వరుడు పట్టాభిషిక్తుడౌతాడు. మీనాక్షి నుంచి అధికారం సుందరేశ్వరుడి చేతులోకి వస్తుంది. వచ్చే చైత్రానికి బ్రహ్మోత్సవంలో ఆయన పట్టమహిషికి పట్టాభిషేకం చేసినప్పుడు అధికారం తిరిగి మారుతుంది. షణ్ముగవడివు మాత్రం తన కోసం మళ్లీ తిరిగి ఆశించకుండా కూతురికే పట్టాభిషేకం చేయదలుచుకుంది. తన కచేరీకోసం మాట్లాడటానికి వచ్చినా, ముందు వాళ్లకి కూతురు ప్రజ్ఞ గురించి చెప్పి కూతురు కచేరీ ఏర్పాటయ్యేలా చూస్తుంది.

శ్రావణమాసంలో ఏర్పాటయిన కచేరీలకి, నారాయణరావు వ్యాస్ అనే గొప్ప హిందుస్థానీ సంగీత కళాకారుడు కచేరీ చేయడానికి వచ్చాడు. సుబ్బులక్ష్మి ఆయన కచేరీకి వెళ్లలేకపోయింది. వెళ్లనందుకు చాలా బాధపడింది. రేడియోలో వింటున్నా, హిందుస్థానీ సంగీతం నేరుగా వినే అవకాశం పోగొట్టుకున్నందుకు నిరాశపడింది. కానీ ఆశ్చర్యం ఏమిటంటే, ఆ హిందుస్థానీ సంగీత విద్వాంసుడే సుబ్బులక్ష్మిని వెతుక్కుంటూ ఇంటికి వచ్చాడు.

"అందరూ నువ్వు చాలా బాగా పాడుతున్నావంటే, వినటానికి వచ్చాను, ఏదీ ఒక పాట పాడు...." అన్నాడు నారాయణరావు వ్యాస్.

సుబ్బులక్ష్మి పాడి వినిపించింది. అందరినోట విన్నది నిజమేననుకున్నాడు. ఆయనకు సుబ్బులక్ష్మిలో నచ్చింది ఆ అమ్మాయి శ్రుతిశుద్ధత.

సుబ్బులక్ష్మివైపు నవ్వుతూ చూస్తున్నాడు, మధ్యలో గొంతు సవరించుకున్నాడు. ఒక చిన్న ఆలాపన చేశాడు, సుబ్బులక్ష్మి అతన్నే చూస్తుంది. తనకి కావలసింది ఇవ్వబోతున్నాడు అతను.

"శ్యామసుందర మదనమోహన" అంటూ ఒక దేశి తిలంగ్ రాగంలో పాడటం మొదలుపెట్టాడు. ఎక్కడ ఆపితే అక్కడవరకు సుబ్బులక్ష్మి చిలుక పాడినట్లు పాడింది.

ఇది కాస్త తేలికైన పాట అనుకున్నాడు వ్యాస్. హిందుస్థానీ సంగీతానికి ప్రత్యేకమైన తుమ్రీలో ఇంకొక పాట మొదలుపెట్టాడు.

తుమ్రి అయినా తప్పా అయినా ఖయాల్ అయినా.. ఏవైనా సుబ్బులక్ష్మికి ఒకటే. ఒకసారి వినటమే ఆలస్యం, పాటని పట్టేస్తుంది. రాగయుక్తంగా పాడుతుంది.

చాలా ముచ్చటేసింది నారాయణరావు వ్యాస్‌కి, దేశంలోనే పేరొందిన హిందుస్థానీ విద్వాంసుడు, ప్లేటుల్లో ఎన్నోసార్లు పాడాడు.

"శుభలక్ష్మీ! నేను మదురై ఎప్పుడు వచ్చినా మీ ఇంటికి వచ్చి నీకు హిందుస్థానీ సంగీతం నేర్పిస్తాను" అని చెప్పి ఆశీర్వదించి వెళ్లాడు.

షణ్ముగవడివు ఇంట్లోకి లక్ష్మీకటాక్షం మొదలయ్యింది. సరస్వతీ కటాక్షం ఎప్పుడో తిష్టవేసుకుని కూర్చుంది. లక్ష్మికి కాస్త లోటు వున్నప్పుడు కూడా కుటుంబపు ఆప్యాయతల్లో, సంగీతపు విరిజల్లులో ఆ లోటు ఎప్పుడో తప్ప తెలియలేదు. పిల్లలు పెద్దవాళ్లయ్యారు, వాళ్ల అవసరాలకు తగ్గట్టుగా డబ్బు ఏర్పాటవుతోంది. షణ్ముగవడివు మెల్లగా కూతురుకి సొమ్ములు కొంటుంది. ఇప్పటికి వడ్డాణం, మంచి ముత్యాల గొలుసులు చేయించింది. పిల్లలు సీతాకోక చిలుకల్లాగా సందడి చేస్తున్నారు. షణ్ముగవడివు పిల్లల భవిష్యత్తు గురించి, ముఖ్యంగా ఆడపిల్లల గురించి గట్టి ఆలోచనలు చేస్తోంది.

ప్రొద్దున్నే షణ్ముగవడివు పిల్లలచేత సాధన చేయిస్తుంది. సుబ్బులక్ష్మి పాడుతుంటే, శక్తి మృదంగం వాయిస్తున్నాడు, వడివాంబ వయోలిన్ వాయిస్తుంది. త్యాగరాజు కృతి, 'విడజాలదురా నా మనసు' నేర్చుకుంటున్నారు. పల్లవి, అనుపల్లవి సాధన చేయించి కాఫీ పెట్టటానికి లేచింది.

వెంటనే సుబ్బులక్ష్మి కృతుల పుస్తకం శక్తికి ఇచ్చి, తను మృదంగం తీసుకుంది. శక్తి ఆ పుస్తకం వడివాంబకి ఇచ్చి, వడివాంబ వయోలిన్ తీసుకున్నాడు. మారిన పాత్రలతో సాధన మొదలుపెట్టారు.

చెల్లి మృదంగం ఎలా వాయిస్తుందో చూస్తున్నాడు శక్తి. అన్న వయోలిన్ వాయిస్తుంటే చూస్తుంది వడివాంబ. ఒకరికొకరు సరిదిద్దుకుంటున్నారు. అమ్మ రావటం చూసీ చూడగానే చటుక్కున ఎవరి పాత్రల్లోకి వారు వెళ్లిపోయారు.

"అమ్మా! ఇప్పుడు వీళ్లు ఏమి చేశారో చూశావా?" అడిగింది వడివాంబ.

"చూడడం ఎందుకు.. అపశ్రుతులు వినిపిస్తూనే వున్నాయి"

"అన్నా! నాకు సరిగ్గా నేర్పించు అన్నా, మృదంగం" అంది సుబ్బులక్ష్మి.





మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి

"మృదంగం కాదు, వయొలిన్" అంది తల్లి.

శక్తి వడివాంబ వైపు చూస్తూ "దీనికే సరిగ్గా రాదు. ఇంక నాకేమి వస్తుంది?" అన్నాడు. మళ్లీ సాధనలోకి దిగారు. కృతి ఒకసారి పూర్తిచేసి అందరూ కాఫీ తాగుతున్నారు.

"అమ్మా! పట్నంలో సినిమాలంటమ్మా, ఒకసారి తీసుకెళ్లమ్మా..." నసిగాడు శక్తి.

"మన జానకమ్మ కూతురు సినిమాల్లో చేరుతుందట, దాని సినిమా వచ్చినప్పుడు తీసుకెళ్తా" చెప్పింది తల్లి.

ఇంతలో వీధి వాకిలి దగ్గర పెద్ద శబ్దం వినిపించింది. షణ్ముగవడివు దగ్గర వీణపాఠాలు నేర్చుకునే కుర్రవాడు, వీణని అడ్డంగా పట్టుకొని మోసుకొస్తూ గుమ్మానికేసి కొట్టాడు. అందరూ బిత్తరపోయి చూస్తున్నారు, షణ్ముగవడివు విలవిలలాడింది వీణకేమైందోనని.

"నిలువుగా పెట్టి తీసుకొనిరా బాబూ" ఆదుర్దాగా చెప్పింది షణ్ముగవడివు.

నిలువుగా పెట్టి, మళ్లీ వీణని నిలబెట్టే ప్రయత్నంలో అటూఇటూ తిప్పుతూ చివరికి నిలువుగా పెట్టి, మళ్లీ పై గుమ్మాన్ని కొట్టుకొని నేరుగావచ్చి షణ్ముగవడివు కాళ్లమీద పడ్డాడు. మళ్లీ గురువుగారికి నమస్కారం చేసే పని లేకుండా. పిల్లలకు నవ్వు ఆగటంలేదు. షణ్ముగవడివు కళ్లతో ఉరిమి చూసింది. కష్టపడి నవ్వు ఆపుకున్నారు.

"అందరూ వచ్చి కూర్చోండి" అంది తల్లి.

ఆ అబ్బాయి చుట్టూ కూర్చున్నారు, నోరు బిగేసుకొని. శక్తి మృదంగంతో తయారుగా వున్నాడు, వడివాంబ వయొలిన్‌తో.

"కుంజా! 'రఘుపతి రామ రాక్షస భీమ', అయ్యవారి కృతి పాడు."

"ఈ కృతికి నువ్వు వాయించు బాబూ" అని చెప్పింది షణ్ముగవడివు ఆ అబ్బాయికి.

మొదలు బాగానే పెట్టాడు, 'రఘుపతి రామ' సాత్వికంగా, బాగానే వాయించాడు. 'రాక్షస భీమ' పదాలు దగ్గర ఉగ్రరూపం దాల్చాడు సుకుమారి అయిన వీణపైన. వీణ తీగలు తెగి, అపశ్రుతులు పలుకుతూ, 'ఇంక చాలురా నాయనా' అన్నట్లు అతని చేతికే చుట్టుకుపోయాయి. వడివాంబతోసహా పిల్లలెవరికీ నవ్వు ఆగటంలేదు. నోటిమీద చెయ్యి వేసుకొని పెరట్లోకి వెళ్లి పగలబడి నవ్వుతున్నారు.

"కుంజా, ఈ రోజుకి ఈ సినిమా చాలు కుంజా" అని కిందపడి దొర్లుతున్నాడు శక్తి.

ఆనందపు కేరింతలతో రోజులు సాగిపోతున్నాయి.





ఆశ్వయుజంలో నవరాత్రుల ఉత్సవాలు భారీఎత్తున జరుగుతున్నాయి. ఈ తొమ్మిది రోజులు సుబ్బలక్ష్మికి కచేరీలు వున్నాయి. కచేరీలతో, ఇంటికి వచ్చిపోతున్న పొరుగూరి సంగీతజ్ఞులతో ఇల్లు, ఊరు హడావుడిగా వుంది. గుడిలో బొమ్మలకొలువు చూస్తూవున్న సుబ్బలక్ష్మిని అన్న వచ్చి పిలుచుకెళ్లాడు. ఇంటికి వచ్చింది. అమ్మ ఇద్దరు మగవాళ్లతో మాట్లాడుతూ కనిపించింది. వాళ్లు సుబ్బలక్ష్మిని చూస్తూవున్నారు.

"కుంజా! వీళ్లు రామనాథపురం రాజావారు పంపితే వచ్చారు."

నమస్కారం చేసింది. కాసేపు వుండి పక్క గదిలోకి వెళ్లింది.

"మరి అన్నీ ఖాయమే కదా? మేము చెప్పొచ్చా రాజావారికి...?" అడిగాడు ఒకతను.

"ఖాయమే, నేను త్వరలో కబురుపెడతాను" అంది షణ్ముగవడివు.

వాళ్లని సాగనంపి, "కుంజా!" అంటూ సంతోషంగా పిలుస్తూ లోపలికి వచ్చింది.

"ఎవరమ్మా వాళ్లు? కచేరీకోసమా?" అడిగింది సుబ్బలక్ష్మి.

"కాదే! రాజావారు పంపారు, నిన్ను పోషిస్తారంట. నీకు రాజమహల్ ఇస్తారు వుండటానికి, నగలు, బట్టలూ దేనికీ కొరత లేకుండా చూసుకుంటారు" చెప్తూవుంది తల్లి. సుబ్బలక్ష్మి మొహం పాలిపోతుంది. 'ఇందుకా వచ్చింది వాళ్లు' అనుకుంది.

"ఈ నవరాత్రుల తర్వాత మంచి రోజు చూసుకొని పంపుతా కుంజా నిన్ను" అని తల్లి అందో లేదో సుబ్బలక్ష్మి ఏడుపు అందుకుంది. ఇంటిల్లిపాది సుబ్బలక్ష్మి చుట్టూ మూగారు. చూశారు... చూశారు... చూస్తూనే వున్నారు. సుబ్బలక్ష్మి ఏడుపు ఆపట్లేదు.

"శుభమా అంటూ మహారాజు దగ్గరకి పంపిస్తానంటే ఈ ఏడుపు ఏంటీ" అంటూ అత్తలు వెళ్లిపోయారు.

"ఇప్పుడు ఇంకేమీ మాట్లాడకు" అంటూ సైగచేసి వెళ్లారు మామలు.

"అమ్మా! చెల్లిని ఏడిపించకు" అంటూ అమ్మను పక్కకు తీసుకెళ్లాడు శక్తి.

షణ్ముగవడివు కూతురుని చూసుకుంటూ వంటగదిలోకి వెళ్లి కూర్చుండిపోయింది. 'ఇదేంటీ ఇలా ఏడుస్తుంది, ఇది వెళ్లేలాలేదే. ఇప్పుడు నేను వాళ్లకి ఏం చెప్పాలి' అని మధనపడుతుంది, 'రాత్రికి మళ్లీ చెప్తా' అనుకుంది.

రాత్రి పడుకునేటప్పుడు అమ్మ మళ్లీ ఆ మాట లేవనెత్తుతుందని అమ్మపక్కన వడివాంబను నెట్టి, తను ఆ చివరికి వెళ్లింది.

తల్లి గమనిస్తూనే వుంది. ఆ రాత్రికి ఏమీ మాట్లాడలేదు. తర్వాతరోజు గుడికి వెళ్లినప్పుడు, కోనేరు మెట్లమీద కూర్చోబెట్టుకొని చెప్పటం మొదలుపెట్టింది. "కుంజా! మహారాజుగారు నీ గురించి తెలుసుకొని వారే స్వయంగా వచ్చారు, కాదనకు. బాగా చూసుకుంటారు."

"నేను సంగీతం ఇంకా నేర్చుకోవాలమ్మా. అయ్యవారి కృతులే కాలేదు ఇంకా... హిందుస్థానీ సంగీతం కూడా వుంది పైగా..."

"అక్కడికెళ్లినా నువ్వు సంగీత సాధన చేస్తూనే వుంటావు. రాజావారి ఇంట్లో నువ్వు పనిచేయాల్సిన అవసరమేముంది."

"నేను వెళ్లనమ్మా" ఏడుస్తూ చెప్పింది.

"సరె సరే! గుళ్లో ఏడవకు, రా ఇంటికి వెళ్దాం."

"నేను తర్వాత వస్తా, నువ్వెళ్లు."

ఇంటికి వచ్చి మణికి జరిగింది చెప్పింది. "ఈసారికి ఇది వెళ్లదురా. వాళ్లు వూళ్లోనే వున్నారు. వాళ్లకు ఎలాగోలా చెప్పెయ్యరా. చాలా చెప్పాను, అది మొండిపట్టు వదలటంలేదు" అంది బాధతో షణ్ముగవడివు.

ఇప్పటికి సుబ్బులక్ష్మికి నిజంగానే ధ్యాసంతా సంగీతంమీదే ఉంది.

ఈ 1933వ సంవత్సరంలో కుంభకోణంలో మహామహం జరగనుంది. మద్రాసు ప్రెసిడెన్సీలోని అన్ని దారులు కుంభకోణంవైపే. ఆ దారి పట్టటానికి షణ్ముగవడివు ఒక సిఫారసు కోసం ఎదురుచూస్తుంది. ఎదురు చూడగా చూడగా ఒకరోజు ఆ సిఫార్సు ఉత్తరం వచ్చింది. దానిలో ఇలా వ్రాసి ఉంది.

ప్రియమైన షణ్ముగం అక్కకు,

సుబ్బులక్ష్మి నమస్కారములు.

అమ్మ మీ గురించి వ్రాసిన ఉత్తరం నాకు చాలా ఆలస్యంగా చేరింది. మీరు తొందరగా కుంభకోణం వెళ్లండి. మా సినిమా డైరెక్టరుగారు అక్కడే ఉన్నారు. ఆయన పేరు కృష్ణస్వామి సుబ్రహ్మణ్యం. కుంభకోణం మహామహంలో సాంస్కృతిక కార్యక్రమాల సంగతి అంతా ఆయనే చూస్తున్నారు. మీకు తప్పకుండా సహాయపడతారు. ఈ ఉత్తరం చూపించండి. మా పావలక్కోడి సినిమా తీయటం మొదలయింది. మీరు త్వరగా కుంభకోణం వెళ్లండి.

ఇట్లు ప్రేమతో,

సుబ్బులక్ష్మి.

ఇంక ఆలస్యం చేయకుండా పెట్టా బేడా, వీణ, మృదంగం, వయోలిన్ పటాలం మొత్తంతో షణ్ముగవడివు కుంభకోణం దారిపట్టింది.

లక్షలాది జనం కుంభకోణం చేరుకుంటున్నారు. సాంస్కృతిక కార్యక్రమాల కోసం వేసిన పందిళ్ల దగ్గరకొచ్చి, సుబ్రహ్మణ్యంని వెతికి పట్టుకొని, ఉత్తరం ఇచ్చింది షణ్ముగవడివు.



ఉత్తరం చదివాడు సుబ్రహ్మణ్యం. "ఇంత ఆలస్యంగా వచ్చారేంటి? ఎవరెవరు ఎప్పుడెప్పుడు పాడాలో అంతా సిద్ధమయ్యాయే! సరే, కూర్చోండి. నేను చూసి చెప్తాను" అని వెళ్లాడు.

మళ్లీ వచ్చి, "సాయంత్రం అస్సలు ఖాళీ లేదు. వరసబెట్టి అరియక్కుడి, చెంబై, సెమ్మంగుడి, ముసిరి పెద్దపెద్దవాళ్లందరి కచేరీలు వున్నాయి. ఒక్క పని చేయగలను, రేపు మధ్యాహ్నం మూడుగంటలకి కచేరీ ఏర్పాటు చేస్తా, తయారయి రండి."

"సాయంత్రంపూట అందరూ వుండేవేళ ఒక కచేరీ ఏర్పాటు చేయండి" అంది షణ్ముగవడివు.

"మా హీరోయిన్ చెప్పి పంపిన తర్వాత నేను చేయకపోతే ఎలా, తప్పకుండా ప్రయత్నిస్తా" అన్నాడు సుబ్రహ్మణ్యం.

తర్వాత రోజు ఇద్దరూ తయారయ్యారు. సుబ్బులక్ష్మి ముక్కుకి ఇప్పుడు రెండు ముక్కుపుడకలు చేరాయి. గాజులు, గొలుసులు, పొడుగాటి లోలాకులు, పెద్ద బొట్టు పెట్టుకొని జడలో పూలు తురుముకొని, చీరకు పైటపిన్ను పెట్టింది. అమ్మ ఇప్పుడు తనకు కచేరీలలో వచ్చిన పతకాలు తీసుకొచ్చి చీరమీద అమర్చింది. ఇలా చక్కగా తయారయ్యి పందిరి దగ్గరకు చేరుకున్నారు. కానీ అక్కడ పరిస్థితి చూసి నీరుకారిపోయారు. పట్టుమని పదిమంది కూడా లేరు వినటానికి, వాళ్లు కూడా కబుర్లు చెప్పుకుంటున్నారు. వీళ్ల వెనుక చాలామంది, మధ్యాహ్న భోజనాలు చేసి ఎంచక్కా నిద్రపోతున్నారు. సుబ్రహ్మణ్యం వచ్చి "మొదలుపెట్టండి" అన్నాడు. సుబ్బులక్ష్మి కచేరీ మొదలుపెట్టగానే సుబ్రహ్మణ్యం వెళ్లిపోయాడు. ఒక గంట తర్వాత తిరిగి వచ్చాడు, అతను లోపలికి రావటానికి వీలు లేకుండా పందిరిచుట్టూ జనం గుమిగూడి వున్నారు.

"ఏమైంది ఇక్కడ" అనుకుంటూ లోపలికి చొచ్చుకెళ్లాడు సుబ్రహ్మణ్యం. సుబ్బులక్ష్మి కచేరీ చేస్తుంది, పందిరినిండా జనం చెవులు నిక్కపొడుచుకొని వింటున్నారు. కచేరీ ముగియగానే కాసేపు నిశ్శబ్దం. అందరూ సుబ్బులక్ష్మినే చూస్తున్నారు.

"ఏం పాడావమ్మాయ్, నిద్ర పోతే పోయింది" అన్నదో గొంతు గుంపులోనుంచి.

'శభాష్, భేష్, భేష్'లు వినిపిస్తున్నాయి. చప్పట్లు మెల్లగా మొదలయ్యి కుంభకోణం అంతా మారుమ్రోగేలా పెద్దగా వినిపించాయి. సుబ్బులక్ష్మి వేదికమీద కూర్చుని ఆ చప్పట్లను స్వీకరిస్తూ నమస్కారం చేస్తుంది వినయంగా.

ఆ తర్వాత శ్రోతలు సుబ్రహ్మణ్యంని చుట్టుముట్టారు.

"ఇంత బాగా పాడుతున్న అమ్మాయికి మధ్యాహ్నం కేటాయించావేంటి?"

"నేను కచేరీ సగంలో వచ్చాను, మీరు మళ్లీ సాయంత్రం పెట్టాల్సిందే ఈ అమ్మాయిది" అంటూ శ్రోతలందరూ ముక్తకంఠంతో అడిగారు, సుబ్బులక్ష్మిది ఇంకో కచేరీ పెట్టించమని.

సాయంత్రం మళ్లీ సుబ్బలక్ష్మి కచేరీ పెట్టించాడు.
సుబ్రహ్మణ్యం సంతోషంగా ఆ రోజు సాయంత్రం మళ్లీ సుబ్బలక్ష్మి కచేరీ పెట్టించాడు.
మొదటిసారిగా ప్రముఖులు కచేరీ చేస్తున్న వేదికమీద అదే సమయాల్లో పదిహేడేళ్ల
సుబ్బలక్ష్మి కూడా కచేరీ చేసింది. చెయ్యటమేకాదు, అందరి మెప్పు పొందింది. అంతే
కాదు, మహారాజపురం విశ్వనాథ అయ్యర్ అనే గొప్ప విద్వాంసుడు అంతకు ముందు
రోజు తనకి బహూకరించబడిన బంగారు పతకాన్ని సుబ్బలక్ష్మికి బహూకరించాడు.

పుణ్యస్నానం చేసి కుంభకోణం ప్రయాణం దిగ్విజయంగా పూర్తి చేసుకొని ఇంటికి
చేరారు. ఇందిలో, 'ఇక మద్రాసు దండయాత్ర ఒక్కటే మిగిలిపోయింది. అక్కడ కూడా
కుంజా జెండా ఎగురవేస్తే, ఇక కర్ణాటక సంగీత లోకానికి యువరాణి అయినట్లే' తీక్షణంగా
ఆలోచిస్తోంది షణ్ముగవడివు కాఫీ తాగుతూ.

ప్రస్తుతానికి సుబ్బలక్ష్మి కన్నెరికం ఆలోచనలు పక్కనపెట్టింది. జానకమ్మ అంటుండేది
ప్రతిభ వున్నవాళ్లకి పట్నమే సరైనది అని. అలాగే జానకమ్మ కుటుంబం పట్నం వెళ్లింది,
తనముందు సంగీత నృత్యాలు నేర్చుకున్న సుబ్బులక్ష్మి, ఎస్.డి. సుబ్బులక్ష్మి 'సినీనటి'
అయ్యింది. కూతురికి సంగీత అవకాశాలు ఇంకా బాగా రావాలంటే, పేరు డబ్బు
గడించాలంటే పట్నం పోవల్సిందే అని తీర్మానించుకుంది. ఈలోపల మదురైలో
చేసుకోవలసిన పనులు చక్కదిద్దుకోవటం మొదలుపెట్టింది. తన పోషకుల పుణ్యమాని
మదురైలో తను అద్దెకు వుంటున్న ఇంటిని సొంతం చేసుకుంది. చిన్నకూతురు వడివాంబకి
కన్నెరికం చేయటానికి పోషకుడిని వెతకటం మొదలుపెట్టింది.

రెండు మూడు నెలలు పట్నంలో వుండే ఏర్పాటు చేసుకుంది. సంవత్సరం ఆఖరున
పట్నం బయలుదేరింది. వీలైనన్ని సభల్లో, ఊరిస్తున్న మద్రాసు మ్యూజిక్ అకాడమీలో
కూడా కచేరీ చెయ్యాలన్న తలంపుతో మద్రాసు చేరింది షణ్ముగవడివు కుటుంబం.
పురసవాక్కంలో ఒక గది అద్దెకు తీసుకున్నారు. అక్కడ వుంటూ, సాధన చేసుకుంటూ
అవకాశం కోసం వెతుక్కుంటూ వున్నారు. అవకాశాలు ఎక్కడున్నాయో తెలుసుకునే
భాగంగా మద్రాస్ లలితాంగి ఇంటికి, ఎస్.డి. సుబ్బులక్ష్మి ఇంటికి, వీణ ధనమ్మ ఇంటికి
తరుచుగా వెళ్తున్నారు. ధనమ్మ మనమరాళ్లు ఇప్పుడు సుబ్బలక్ష్మికి మంచి స్నేహితులు.
ఒక్కోసారి వాళ్లతోపాటు సంగీత సాధన కూడా చేస్తుంది. బాలసరస్వతి సదిర్ అభ్యాసం
చేస్తుంటే పాడి తాళం వేస్తుంది.

మద్రాసులోని కొన్ని సభల్లో అవకాశాలు వచ్చాయి సుబ్బలక్ష్మికి. కాని తల్లికి తృప్తిలేదు.
మద్రాసు మ్యూజిక్ అకాడమీ గొప్ప సంగీతజ్ఞులకు, సంఘంలో పరపతి వున్నవారి సభ
అని పేరొచ్చింది. అక్కడ కూతురిచేత పాడిస్తే అందరూ గుర్తించే అవకాశం వస్తుందని
తల్లి యోచన. అందుకని అకాడమీకి వెళ్లింది. ఈ దఫా అన్నీ ఖరారు అయ్యాయి,
ఏమాత్రం అవకాశం లేదని చెప్పారు అకాడమీ నిర్వాహకులు.



"మా అమ్మాయి కుంభకోణం మహామహంలో పాడిందండి. ఇప్పటికి రెండుసార్లు
ప్లేటుల్లో పాడింది. మొన్ననే ఆ కొత్త సభ... దాని పేరేంటమ్మా..." అంటూ ఇండియన్
ఫైన్ ఆర్ట్స్ వారి కరపత్రం తీసి చూపిస్తూ... "ఈ సభలో కూడా కచేరీ చేసింది. మా
అమ్మాయి ఎలా పాడుతుందో, దక్షిణామూర్తిగారికి తెలుసు. అరియక్కుడి గారికి తెలుసు.
వాళ్లని అడగండి చెప్తారు. పొద్దున పూటయినా సరే ఒక్క అవకాశమివ్వండి దయచేసి"
బతిమిలాడుకుంది షణ్ముగవడివు. అయినా లాభం లేకపోయింది.

అయినా పట్టువదలకుండా అకాడమీకి సంబంధించిన ప్రతి నిర్వాహకుడి దగ్గరకు
వెళ్లి అర్జీ పెట్టుకుంది. సంఘంలో పలుకుబడి వున్నవారి దగ్గరకి వెళ్లింది. వాళ్లల్లో కల్యాణ
సుందరి అని ఒక మహిళానేత దగ్గరకు వెళ్లింది. చాప పరచుకుని కింద కూర్చున్నారు
తల్లీకూతుళ్లు.

"అమ్మా! నా కూతురికి కచేరీ అవకాశాలు వుంటే ఇప్పించండి. అకాడమీలో ఎవరన్నా
తెలిస్తే సిఫారసు చెయ్యండి" అని చెప్పుకుంది.

కల్యాణ సుందరి ఒంటరిగా సంసారాన్ని ఈదుకొస్తున్న మహిళ కాబట్టి, షణ్ముగవడివు
కష్టాలని అర్థం చేసుకుంది. చేతిలో తాంబూలం పెట్టి అవకాశాలు వుంటే కబురుపెడతానని
చెప్పి పంపింది.

మద్రాసు మ్యూజిక్ అకాడమీలో మార్గశిర మాసం ఆఖరి వారంలో కచేరీలు
మొదలయ్యాయి. సుబ్బలక్ష్మికి కచేరి అవకాశం లేకపోయినా ప్రతిరోజూ వచ్చి విద్వాంసుల
కచేరీలు శ్రద్ధగా వింటుంది. ఆ రోజు ఇంకో గంటలో అరియక్కుడి రామానుజ అయ్యంగారి
కచేరీ మొదలవ్వబోతుంది. తల్లీకూతుళ్లు కచేరీ కోసం ఎదురు చూస్తూ ఆ పందిరిలో
కూర్చోని వున్నారు. ఇంతలో నిర్వాహకులకు కబురు అందింది, అరియక్కుడికి ఆరోగ్యం
సరిగా లేదని, ఈ రోజు కచేరీ చెయ్యలేడని.

"ఇప్పుడు ఏం చేద్దాం...?" అడిగాడు నిర్వాహకుడైన టి.వి. సుబ్బారావు. "చెంబై
వున్నారుగా" చెప్పాడు కస్తూరి శ్రీనివాసన్.

"ఆయన కచేరీ రేపే!"

"పోనీ టైగర్ వరదాచారి వున్నారు, ముత్తయ్య వున్నారు, ముదికొండన్ వున్నారు.
ఎవరని చెయ్యమందాం?"

"వీళ్లెవ్వరూ వద్దు. ఆ తర్వాత ఫలానా వాళ్లకి రెండుసార్లు అవకాశమొచ్చింది. మాకూ
ఇవ్వండీ  అంటారు" అన్నాడొక నిర్వాహకుడు.

నిర్వాహకులంతా తర్జనభర్జన పడి, చివరకు అరియక్కుడి కచేరీ వినడం కోసం
ఎదురు చూస్తున్న సుబ్బలక్ష్మిని అరియక్కుడి స్థానంలో కచేరీ చెయ్యమన్నారు. అరియక్కుడి

కచేరీ అని జనం. జనంతోపాటు తోటి విద్వాంసులుతో రిప్పన్ భవనం వెనకవున్న మైదానంలో వేసిన పందిరి నిండిపోయివుంది. ఇలాంటి అవకాశం కోసమే పట్నం వచ్చింది. పట్నంలో, అడుగు పెట్టీపెట్టగానే ఇలాంటి గొప్ప అవకాశం వస్తుందనుకోలేదు తల్లీ కూతుళ్లు. మీనాక్షమ్మకు దండం పెట్టుకొని, వేదికమీదకొచ్చారు. షణ్ముగవడివు తంబూర వాయిస్తూ కూతురికి సహకారం అందించబోతుంది. సుబ్బలక్ష్మి సర్దుకొని కూర్చుంది. అరియక్కుడి కచేరీ అనుకొని వచ్చినవాళ్లంతా వున్నారు. విద్వాంసులు మాత్రం మెల్లగా వెనక్కువెళ్లి కూర్చొని, ఎలాగూ వచ్చాంకదా.. కాసేపు వుండి వెళదాములే అన్నట్లు వెనక కబుర్లు చెప్పుకుంటున్నారు.

సుబ్బలక్ష్మి పైకి కనిపించటంలేదు కాని లోలోన చాలా భయపడుతుంది. మహామహులంతా ముందున్నారు. కాని వెనుక తల్లిని చూసుకొని ధైర్యం తెచ్చుకొని కచేరీ మొదలుపెట్టింది.

మొదట ఒక రాగాలాపన అందుకుంది. ఎక్కడో వెనుక కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్న విద్వాంసులు, కబుర్లు ఆపి, సుబ్బలక్ష్మివైపు తిరిగారు. ఆలాపన పూర్తికాగానే, అప్పటికే బాగా పేరున్న చెంబై వైద్యనాథ్ భాగవతార్ వెనుకనుంచి ముందుకువచ్చి, "ఏమి గొంతు! ఏమి గొంతు! భలేభలే" అనుకుంటూ ముందుకు వచ్చాడు. ముందున్న రసజ్ఞులు, "ఆ... అరవద్దు... మమ్మల్ని విననివ్వండి" అంటూ కసురుకున్నారు. వర్ణం తర్వాత కృతులు పాడుతూ రెండు గంటలలో కచేరి ముగించింది సుబ్బలక్ష్మి. మహామహులంతా సుబ్బలక్ష్మి చుట్టూ చేరి ప్రశంసల వర్షం కురిపిస్తున్నారు.

"అమ్మా! నీ గొంతులో సాక్షాత్తు వీణే కొలువైవుంది" అన్నాడు వీణ విద్వాంసుడు కారైకుడి సుబ్రహ్మణ్యం అయ్యర్.

"వీణ అంత మధురంగా వుంది నీ గొంతు" అన్నాడు ఇంకొక విద్వాంసుడు. సుబ్బలక్ష్మి నిండుగా పైట కప్పుకొని వినయంగా అందరి ప్రశంసలూ వింటూవుంది.

కూతురికి ఇలాంటి రోజుకోసమే ఆ తల్లి పరితపించింది. తన కూతురు అంతటి ప్రజ్ఞ కలిగిందేనని తెలుసు తల్లికి, కాని ఈ రోజు ఇంత తొందరగా వస్తుందనుకోలేదు. ఇకనేం, మద్రాసులో సుబ్బలక్ష్మి తన జెండా ఎగురవేసింది.

అప్పటికి కచేరీలు తగ్గుముఖం పట్టిన తర్వాత మదురై బయలుదేరారు. మదురైలో సుబ్బలక్ష్మి గురువుతో సహా అందరూ పట్నంలో జరిగినదాన్ని విని సంతోషించారు.



మదురైలో షణ్ముగవడివు వడివాంబకి కన్నెరికం వ్యవహారం వేగవంతం చేసింది.

సుబ్బలక్ష్మి ఒకరోజు వడివాంబని గుడిలోకి తీసుకువెళ్లింది. కోనేరు మెట్లమీద కూర్చోబెట్టింది.



"వడివా! అమ్మ నీకు చెట్టిగార్లను, ప్లీడర్లను చూస్తుంది తెలుసా" అని అడిగింది.

"తెలుసు" తల వంచుకొని చెప్పింది వడివాంబ.

"చెట్టిగార్లు, ప్లీడర్లు అంటే పెళ్లి కాదు వడివా..."

"తెలుసు."

"మరెందుకు వెళుతున్నావు? వెళ్లకు."

"వెళతానక్కా" దృఢంగా చెప్పింది వడివాంబ. "అమ్మ నాకు వయొలిన్, వీణ బాగా నేర్పుదామనుకుంది, నా ఆరోగ్యం సరిలేక సరిగ్గా నేర్చుకోలేకపోతున్నాను. అవి నాకు రావటంలేదు. నువ్వు రాజా దగ్గరకు వెళ్లనన్నావు. నేనూ వెళ్లనంటే అమ్మ చాలా బాధపడుతుంది. నేను అమ్మ చెప్పినట్లే చేస్తాను" అంది వడివాంబ.

అమ్మ మాట వింటున్నందుకు సంతోషించాలో, చెట్టిగార్ల దగ్గరకు వెళ్తున్నందుకు బాధపడాలో అర్థంకాలేదు సుబ్బలక్ష్మికి.

మదురైలోనే ఉంటూ సంగీత సాధన, కచేరీలు చేస్తూ ఉంది సుబ్బలక్ష్మి.

వర్షాకాలంలో ఒకరోజు షణ్ముగవడివు, శక్తి, సుబ్బలక్ష్మి, వడివాంబ నది గట్టున కూర్చొని పరవళ్లు తొక్కుతున్న వైగై నదిని చూస్తున్నారు. వర్షం కాస్త నిన్ననే తెరిపిచ్చింది. ఈసారి బాగా కురిసిన వర్షాలతో వైగై నిండుగా పారుతుంది.

కొత్త నీరు వచ్చి పాత నీరుని పంపేసింది. షణ్ముగవడివు నీటినే తీక్షణంగా చూస్తుంది. 'కొత్త నీరు'... ఆలోచిస్తుంది... తన పెద్దకూతురు కొత్తనీరు. తనని తోసిరాజేసి కచేరీలు చేసేస్తుంది. అయినా సంతోషమే తల్లికి. కూతురు ఇంకా ఎదగాలని కోరుకుంటుంది. 'కొత్త నీరు'..ముత్తులక్ష్మి రెడ్డి, కాంగ్రెసు నాయకులు, ఇంకా ఎంతోమంది అలాంటి వాళ్లు దేవదాసీల గౌరవాన్ని తోసిరాజేసి గుట్టుగా బ్రతుకుతున్నవాళ్లని బజారుకీడుస్తున్నారు. ఇలా ఆలోచిస్తూ వున్న షణ్ముగవడివు పక్కకి ఎప్పుడొచ్చిందో రంగనాయకి వచ్చి కూర్చుంది.

తీరిగ్గా చూసింది షణ్ముగవడివు. రంగనాయకి కూడా పరవళ్లు తొక్కుతున్న నదిని చూస్తుంది. "రంగా! ఎప్పుడొచ్చావు?" ఆశ్చర్యంగా అడిగింది షణ్ముగవడివు. రంగనాయకి ఏమీ మాట్లాడలేదు. "ఏమైంది రంగా ఎందుకలా వున్నావు?" మళ్లీ అడిగింది షణ్ముగవడివు.

"ప్లీడరుగారు ఇక నన్ను పోషించరట."

"ఏం?"

"వయస్సు పైబడిందట నాకు."

"ఊ..." నిట్టూర్చింది షణ్ముగవడివు. "వాడుతున్న ఆకుని చెట్టు వుంచుకుంటుందా! మనకివి కొత్తా... నువ్వు బాధపడకు ఇంకొక పోషకుడిని చూసుకుందాం."

అప్పుడు సుబ్బలక్ష్మి, "విన్నావా?" అన్నట్లు చూసింది వడివాంబ వైపు.

'విన్నాను, అయినా సరే, అమ్మ మాటే వింటాను' అన్నట్లు మెల్లగా నవ్వింది వడివాంబ.

"సరే, వెళ్దాం పద" అంటూ రానన్న రంగనాయకిని తీసుకొని బయలుదేరింది. రంగనాయకి ఈ పరిస్థితిని ఊహించినట్లు లేదు. ఆ ప్లీడరుతో ఇరవై ఏళ్ల పైన బంధం రంగనాయకిది.

నడుస్తూ, నడుస్తూ, "ఇరవై ఏళ్లకి ఏం పాడుబుద్ధి పుట్టిందే మీ ప్లీడరుకి" అంది షణ్ముగవడివు.

𝄞𝄞𝄞𝄞

అమ్మవారికి సాయంత్రంవేళ పూజకి అన్ని ఏర్పాట్లు జరుగుతున్నాయి. కనకాంబుజం షణ్ముగవడివుని పలకరించి అమ్మవారి సేవకి గుడికి బయలుదేరింది. "ఈ రోజు రంగ రానంది, నేనే ఈ రోజు అమ్మవారికి పుష్పాంజలి ఇచ్చేది" అనుకుంటూ వెళ్లింది. కాసేపటికే పరిగెత్తుకొచ్చింది. "షణ్ముగం! నువ్వు రా, తొందరగా, గుడి దగ్గరకు రా."

"ఎందుకు..... ఏమైంది?" ఆదుర్దాగా అడిగింది షణ్ముగవడివు.

"నువ్వు రా ముందు" అంటూ వున్న ఫళాన లాక్కెళ్లింది. వెనకాలే ఇంట్లోవాళ్లందరూ గుడికి బయలుదేరారు.

గుడి పశ్చిమ రాజగోపురం దగ్గర ఆలయ దేవదాసీలందరూ వున్నారు. గుడి తలుపు మూసివేసి ఉంది. దేవదాసీలు ఆలయ తలుపులు తెరవమంటున్నారు. అవతలవైపువారు తీసే ప్రసక్తే లేదంటున్నారు.

"అమ్మవారి పూజకి వేళవుతుంది, తలుపు తీయండి." అరుస్తున్నారు దాసీలు.

"మీరు అవసరం లేదు. మేము తియ్యం" అంటున్నారు అటువైపువాళ్లు.

"ఎందుకు తియ్యరు?"

"గాంధీగారు టౌను హాలులోనే వున్నారు. ఆయన యాంటీనాచ్, యాంటీ దేవదాసీ. ఇప్పుడు గుడికి రావచ్చు. అందుకని దేవదాసీలని రానివ్వం."

"గాంధీగారు ప్రొద్దున మీటింగులో గుడిలోకి హరిజనులు కూడా రావచ్చు అన్నారు తెలుసా మీకు... అలాంటిది మీరు మమ్మల్ని ఆపుతున్నారేంటీ?"

"ఆపుతాం. మిమ్మల్ని ఈరోజే కాదు, రోజూ ఆపుతాం. మీరు మాన్యాలు మేయాల్సిన పనిలేదు ఇంక."

"లోపల ఎవరు?" షణ్ముగవడివు కనకాంబుజంని అడిగింది.

"ఇంకెవరు క్రొత్తగా వచ్చిన పట్టారులు, ధర్మకర్తలు."



"వీళ్లు తెరిచేలాగా లేరు. మర్చిపోయాను, చూడామణి ఏది? లోపలికి వెళ్లి గుడిలో వుందా?" ఆశగా అడిగింది.

"లేదు. చూడామణిని కూడా వెళ్లనివ్వలేదు. అందరికంటే ముందు తలుపుముందు చూడామణే వుంది" చెప్పింది కనకాంబుజం.

"అబ్బా!" బాధపడింది షణ్ముగవడివు. "చూడామణిని కూడా పంపించలేదా లోపలికి."

ఇంతలో గుడి లోపలినుంచి గంటల చప్పుడు వినిపించింది. అమ్మవారికి సాయంత్రపు పూజ ముగిసింది. దేవదాసీలందరూ కాసేపు నిశబ్దంగా వుండి నమస్కారం చేసుకున్నారు. మెల్లగా గుంపులో కదలిక మొదలయ్యింది. దాసీలు పక్కకు పక్కకు జరగగా, చూడామణి కనిపించింది. మెల్లగా ఇంటిదారి పట్టింది, మొహం చూడలేకుండా వుంది, రక్తం చుక్క లేదు. పదేళ్ల వయస్సులో దేవదాసి కావించబడి, అప్పటినుంచి అమ్మవారికి సేవ చేస్తూవచ్చింది. భారంగా, అవమానపు భారంతో, బాధతో కుంగిపోతూ దాసీల సాయంతో ఇంటికి చేరుకుంది.

"బ్రతికేవున్నాను, అమ్మవారి దగ్గరకు రానివ్వలేదు, నేను చచ్చినట్లు లెక్క. షణ్ముగం, గుర్తుందా నువ్వు నెరవేర్చాల్సిన బాధ్యత, నాకు అవయినా జరిగేట్లు చూడు."

"కొత్తనీరు, కొత్త నీరమ్మా, కొత్త పట్టారులు, కొత్త ఆలయ ధర్మకర్తలు. వాళ్లకి ఆచారాలు తెలియవు. కానీ రేపు మామూలుగానే వుంటుంది, మీరు రేపు మొదటి పూజకి రండి."

"బ్రతికివుంటే తప్పకుండా వస్తా. కట్టెలో ప్రాణం వుండగా అమ్మవారి సేవ మానను" అంది చూడామణి అంత బాధలో కూడా.

షణ్ముగవడివు భయంగా చూస్తూ సెలవు తీసుకొని వచ్చింది.

ప్రొద్దున్నే తొలి పూజవేళకి షణ్ముగవడివు, సుబ్బలక్ష్మి అమ్మవారి ముందు నుంచుని పూజించుకుంటున్నారు. ఇంతలో ఒక పట్టారు పరిగెత్తుకుంటూ వచ్చి, పూజ చేస్తున్న ముఖ్యపట్టారు చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే ముఖ్యపట్టారు హారతి కిందపెట్టి, గర్భగుడి నుంచి బయటికి వచ్చి తెర లాగేశాడు. "ఈరోజు అమ్మవారికి పూజలేదు, వెళ్లండందరూ" అంటూ అందరిని పంపించేశాడు. షణ్ముగవడివు మనసు కీడు శకించింది, వడివడిగా నడుస్తూ ఉత్తర ఆది వీధి వైపు నడుస్తుంది.

"అమ్మా! ఎక్కడికి...?" అడిగింది కూతురు.

"చూడామణి ఇంటికి. ఆలయ దేవదాసీలు చనిపోతేనే అమ్మవారికి పూజ ఆపుతారు."

"అవునమ్మా! గుడిలో చెప్పుకుంటున్నారు. చూడామణమ్మే చనిపోయింది."

వెక్కిదల్లా రక్కున ఆగిపోయింది. కార్యోన్ముఖురాలైంది షణ్ముగవడివు.

"ఏంటమ్మా?"

"పద చెప్తా, చూడామణి ఇంటికి వెళ్లామంటే మళ్లీ గుడికి రాలేము" అంటూ మళ్లీ గుడిలోకి వచ్చారు.

"నువ్వు మళ్లీ ఒకసారి కనుక్కో. నేను పట్టారు దగ్గరకు వెళ్తాను."

షణ్ముగవడివుకి ముఖ్యపట్టారు ద్వారా కూడా విషయం తెలిసింది.

"మీరు వస్తారుగా" ముఖ్యపట్టారుని అడిగింది.

"నేను రావాలి, అది ఆచారం. నిన్న ఈ కుర్రవాళ్లు చేసిన పనికి పర్యవసానం ఇది. గొప్ప మనిషిని పొట్టను పెట్టుకున్నారు."

గుడి వంటగదిలోనుంచి పసుపు, గంధం తీసుకుని చూడామణి ఇంటికి చేరుకున్నాడు ముఖ్యపట్టారు. పసుపు, గంధం చూడామణి మీద నిండుగా చల్లి, నమస్కరించుకుని "పట్టారుల తర్వాత అమ్మకి సేవచేసుకున్న భక్తురాలు" అని అనుకుంటూ వెళ్లిపోయాడు.

చూడామణికి ఇప్పుడు స్నానం చేయించారు. చూడామణి అంతిమయాత్ర మొదలయింది. మీనాక్షి ఆలయం తూర్పున అమ్మవారి సన్నిధి వీథిలో అష్టలక్ష్మి మంటపానికి రెండు ఫర్లాంగుల దూరంలో పాడె దించి, క్రింద వుంచారు. చూడామణి మీనాక్షి ఆలయం నుంచి ఆఖరి మర్యాదలు అందుకోవాలి. అమ్మవారి మెడలో వున్న పూలదండని తీసుకువచ్చి చూడామణి మెడలో వెయ్యాలి. పరివస్త్రాన్ని తలకి చుట్టాలి. పసుపు, కుంకుమలతో, తాంబూలంతో అమ్మవారికి కట్టే చీరల్లోంచి ఒక చీర తెచ్చి, చూడామణి మీద కప్పాలి. చివరగా ఆలయ ప్రసాదాలు తీసుకొని, అక్కడనుంచి అంతిమయాత్ర తిరిగి మొదలవుతుంది.

దేవాలయం ఎవ్వరికీ ఇవ్వని మర్యాదలను దేవదాసీకి ఇస్తుంది. దేవాలయానికి దేవదాసీలకు వున్న అనుబంధాన్ని తెలిపే ఆచారాలు ఇవి. ఆలయ మర్యాదలకోసం అష్టలక్ష్మి మండపం ఎదురుగా అందరూ వేచి చూస్తున్నారు. ఇంతలో నిన్న గొడవ చేసిన పట్టారులు చేరారు.

"తీసుకెళ్లండి, తీసుకెళ్లి చేయాల్సిన పనులు చూసుకోండి. ఇక్కడే వుంటే ప్రొద్దు వాలటం తప్ప ఏమీ జరగదు."

చూడామణి చుట్టూ వున్నవాళ్లెవరూ గుడి లోపలికి వెళ్లలేరు. పట్టారులు చూడామణికి ఆలయ మర్యాదలు జరిపేలా లేరు. దేవదాసీలందరూ గుడి దగ్గరకి వెళ్లి గొడవపడుతున్నారు.



"ఇప్పటిదాకా తిన్న మాన్యాలు చాల్లే, ఇక వెళ్లండి" అంటున్నారు ధర్మకర్తలు.

"మీ కుప్పిగంతులు ఇంక అవసరం లేదులే" అంటున్నారు పట్టారులు.

దాసీలు అన్నివిధాలా బ్రతిమాలి చూశారు. పట్టారులు తగ్గటంలేదు. దాసీలు బాధ, కోపం, ఉక్రోషం అన్ని అణగపెట్టి వుంచుకున్నారు. పైకి కన్నీరొక్కటే కనిపిస్తుంది. తూర్పు రాజగోపురం నీడ పెరుగుతూ పుదుమంటపంని కప్పేస్తుంది. ప్రొద్దు వాలుతోంది. ఆఖరి ప్రయత్నంగా షణ్ముగవడివు ముందుకు వచ్చింది.

"ఇప్పటిదాకా దేవదాసీలు వచ్చివెళ్లారు మంతనాలకి, ఇప్పుడు బజారుదాసి వచ్చింది" అన్నాడొక ధర్మకర్త.

ఎలా వచ్చిందో అలా వెనక్కి వెళ్లిపోయింది. ఎప్పుడూ చలించని షణ్ముగవడివు తల దించుకొని మెల్లగా నడుచుకుంటూ చూడామణి పక్కన కూర్చుంది. చూడామణిలో ఊపిరి లేదు, తనలో వుంది.. అంతే తేడా. తన బాధను దిగమింగుకొని, చూడామణి తనపై పెట్టిన బాధ్యతను గుర్తుతెచ్చుకొని ముఖ్యపట్టారు, పెద్దమనుషుల కోసం కబురుపెట్టింది. ముందుగా పెద్దమనుషులు చేరుకున్నారు. వాళ్లు సర్దిచెప్తున్నారు.

"మీరు ఆగండి లీడరుగారు, ఈరోజు మేము చేస్తున్నది వీళ్లకి చెంప పెట్టు కావాలి, ఎవరు ఎన్ని విధాల చెప్తున్నా వాళ్లకి తలకెక్కటం లేదు, గుడికి వాళ్లు అవసరం లేదు. బజారుకి వాళ్లు అవసరంలేదు" అంటూ షణ్ముగవడివు బృందంవైపు చూపించాడు చేయిని. పెద్దమనుషులకు కూడా లొంగలేదు పట్టారులు. అదే విషయం పెద్దమనుషులు దాసీల దగ్గరకు వచ్చి చెప్పారు.

"ఎలా మర్యాదలు పంపరో చూస్తాం! పదండి, ఊరేగింపుని గుడి దగ్గరకు తీసుకెళ్దాం" అంటూ చూడామణిని ఇంకాస్త ముందుకు తీసుకొచ్చి ఆపారు దాసీలు.

"ఇప్పుడు చెప్పమనండి, మర్యాదలు తీసుకొస్తారా? ఇంకా ముందుకు రమ్మంటారా?"

"పట్టారూ! వాళ్లు ముందుకువస్తే అపచారం. మనం జనానికి, పైవాళ్లకి, కలెక్టర్‌కి అందరికీ సమాధానం చెప్పుకోవాలి" అన్నాడు ధర్మకర్త.

"వాళ్లు రారు, వాళ్లకు తెలుసు అపచారమని. భయపెడుతున్నారంతే" అన్నాడు పట్టారు.

"మనకీ తెలుసు ఆలయ మర్యాదలు ఇవ్వాలని, మనం ఇస్తున్నామా? వాళ్లు పట్టుదలమీదున్నారు."

"వాళ్లు రారు, మీరు భయపడకండి."

"అదిగో నగారా మంటపం దగ్గరకి వస్తున్నారు."

"అక్కడే ఆగిపోతారు చూడు."

"ఎక్కడా.. వాళ్లు ఆగటంలేదు... నగారా మంటపంలోకి వచ్చేశారు.. అది దాటితే
ఆలయానికి పెద్దఎత్తున సంప్రోక్షణలు మొదలుపెట్టాలి. ఆలయం మూయాలి.. పట్టారూ!
వాళ్లని ఆగమని చెప్పు."

"ఆపను."
ధర్మకర్త నిలువెల్లా కంపించిపోతూ పట్టారు వైపు, ఊరేగింపు వైపు
చూస్తూ ఉన్నాడు. ఇంకో రెండు అంగల్లో ఊరేగింపు నగారా మంటపం దాటుతుందనంగా
ముఖ్యపట్టారు పరుగుపరుగున వచ్చి ఊరేగింపుని వెనక్కు పంపాడు. ధర్మకర్త స్థిమితపడ్డాడు.
'నీ సంగతి తరువాత చూస్తానన్నట్లు' చిన్నపట్టారువైపు చూసి, "అమ్మవారి
మెడలోవున్న దండ తెప్పించు" అని చెప్పాడు ముఖ్యపట్టారు.

చిన్నపట్టారు గుడి లోపలికి వచ్చి వేరొక పట్టారుకు చెప్పాడు, "నిన్న వేసిన దండలు
అక్కడ ఒక తట్టలో వుంటాయి అందులో ఒకటి తీసుకొని రా" అని పురమాయించాడు.
మళ్లీ వచ్చి గుడి బయట నిలబడ్డాడు. "ఇదిగోండి దండ", అని వినిపిస్తే చెయ్యి వెనక్కి
ఇచ్చాడు. దండ చేతిని తాకగానే ఒళ్లంతా ఝల్లుమంది, ఎండిన దండ అనుకున్నాడు.
చల్లగా, తాజాగా వున్న పూలదండను చూసి ఆశ్చర్యపోయాడు. దండ తెచ్చిన పట్టారువైపు
చూశాడు. తను పురమాయించిన పట్టారు కాకుండా వేరొక పట్టారు వున్నాడు. ముఖ్య
పట్టారు ఆ దండను అందుకొని చూడామణి మెడలో వేశాడు. అప్పటిదాకా సాక్షాత్తు
అమ్మవారి మెడలో విరాజిల్లిన పూదండ, ఇప్పుడు చూడామణికి ఆభరణమయింది. ముఖ్య
పట్టారు, పెద్దమనుషుల కనుసన్నలలో చూడామణి పూర్తి ఆలయ మర్యాదలు అందుకొని
నిత్య సుమంగళిగా చిట్టచివరి మజిలీకి చేరుకుంది.

చివరి సంస్కారాలు పూర్తి చేసి, దాసీలందరూ చూడామణి ఇంట్లోకి చేరారు. దీపం
చుట్టూ అందరూ కూర్చున్నారు. నిన్నటినుంచి జరిగిన సంఘటనలు గుర్తొస్తున్నాయి.
అనరాని మాటలు, వినరాని మాటలు వద్దన్నా మళ్లీమళ్లీ చెవుల్లో మారుమ్రోగుతున్నాయి,
దీపం కొడి కట్టింది. ఆకారాలే కనిపిస్తున్నాయి.

"పట్టారులకు, ధర్మకర్తలకు మాన్యాలపై మమకారం ఆలయ దేవదాసీలను దెబ్బతీసింది. మన మగవాళ్లకు కొత్తగా అరువు తెచ్చిపెట్టుకున్న విలువలు అభిమాన స్త్రీలను దెబ్బతీసింది. ఇక మిగిలింది మన కళలే, వాటిని కాపాడుకోవాలి." ఎవరన్నారో ఈ మాటలు ఆ ఆకారాల్లో నుంచి... ఎవరన్నా ఇక మిగలబోతుంది ఆలోచనలు, ఆకారాలే.



"చూడామణి భయపడినవన్నీ నిజాలవుతూ తేలుతున్నాయి రంగా! ముత్తులక్ష్మిరెడ్డి అన్నంతపనీ చేసింది. చావుతప్పి కన్ను లొట్టపోయినట్లు, ఆమె చట్టసభకి రాజీనామా చేసిందనిగానీ, లేకపోతే ఈపాటికి దేవదాసీలు కట్టుబట్టలతో బజారులో వుండేవారు. ఇప్పుడైనా పరిస్థితి దీనంగానే వుంది. దాసీలకు కాస్తోకూస్తో మర్యాద చిన్న వూళ్లల్లో మిగిలివుంది కానీ పట్నంలో, దాసీలమని చెప్పుకోవటానికి తటపటాయించాల్సి వస్తుంది. పోయినేడు పట్నంలో ఇంటికోసం తిరిగితే ఎవరైనా ఇల్లు ఇచ్చారా వుంటానికి.....? దాసీల కుటుంబం అని తెలియగానే, మొహంమీదే చెప్తున్నారు ఇవ్వమని, చివరికి ఎలాగోలా ఇంటికి దూరంగా వాడకుండా వదిలేసిన కారు షెడ్డు దొరికింది. అది కూడా, ఆడే దాసీలయితే అస్సలు ఇచ్చేవాళ్లు కాదు, నాలుగు భక్తిపాటలు వాళ్లముందు పాడి సంపాదించా" రంగనాయకికి కష్టాలు చెప్పుకుంటుంది షణ్ముగవడివు. రంగనాయకి వింటూవుంది, అసలే కష్టాల్లో వుంది.

"మర్చిపోయా రంగా! నీకో విషయం చెప్పలేదు నేను... పోయినసారి పట్నంలో ఒక పనికిమాలిన పని చేశా."

"ఏంటది?"

"డబ్బులొస్తాయనుకొని, ఎవరో చెపితే సినిమాలో నటించటానికి వెళ్లా, ఏదో చిన్న పాత్ర. అక్కడకి వెళ్తే చూడూ... ఎప్పుడెప్పుడు వచ్చేద్దామా అనిపించింది. అక్కడివాళ్ల చూపులు, చేష్టలు, మనమంటే మరీ చులకనగా వుంది వాళ్లకు. నువ్వెప్పుడూ పట్నం రాకు, సినిమాల జోలికి అస్సలే పోకు" రంగకు ఆకులు అందిస్తూ చెప్పింది. రంగనాయకి ఆకులు తీసుకొని ఒకసారి నమిలి, దవడ పక్కకి అదిమి,

"ఆ రెడ్డమ్మ పుణ్యమాని ఇప్పుడు గుడి నాకిచ్చే మాన్యం, నేను బ్రతికున్నదాకే, నా కూతురుని ఇదిగో దాసిని చేద్దాం... అదిగో చేద్దాం.. అనుకుంటుండగానే ఈ రెడ్డమ్మ రాజ్యం వచ్చేసింది.. మరి దాని బతుకు ఎలా...?"

"దానికి ఇంకా చాలా వయస్సువుంది, అప్పుడేదో ఏర్పాటవుతుంది దానికి, సదిర్ దాసీలు, కచేరీ దాసీలు బతుకెళ్లదీయ్యొచ్చు పట్నంలో, గుడి దాసీలకి అలా కాదు రంగా" కళ్లల్లో కళ్లుపెట్టి చెప్పింది. నవ్వలేక నవ్విన నవ్వొకటి కనిపించింది రంగనాయకి మొహంలో.

"పట్నంలో మైలాపూరు కపాలీశ్వర ఆలయం దాసి గౌరమ్మ వుంది, అక్కడయితే ఆమెకు గుడి ఇచ్చిన ఇల్లు కూడా ఖాళీ చేయించారు, బజారున పడింది."

రంగనాయకికి తన భవిష్యత్తు కనిపిస్తోంది గౌరమ్మ వర్తమానంలో.

"ఇక్కడ తమాషా ఏంటో తెలుసా... గౌరమ్మ ఇల్లు లాక్కున్న ధర్మకర్తలు, మాన్యంలో భాగం ఇవ్వని ధర్మకర్తలు గౌరమ్మ అభినయ నైవేద్యం మాత్రం ఆపటంలేదు, బ్రహ్మాండంగా అభినయ నైవేద్యం ఎప్పటిలానే శివుడికి ఇస్తుంది."

"ఇళ్లు, మాన్యాలతో పోయేవా మనకు ఆలయంతో వున్న బంధాలు? మన పెద్దలు మనకు అలా నేర్పలేదు. మాన్యాలు పోతేనేం, మజ్జిగ ఇంకాస్త పలచనవుతుంది. అంతమాత్రాన మన కర్తవ్యం వదలుతామా..?"

"నువ్వేమీ బెంగ పెట్టుకోకు రంగా... నా ఇల్లు వుంది, నీ ఇల్లే అనుకో. వడివాక్కి మంచి పోషకుడిని చూస్తున్నా. ఇంక కుంజమ్మకు పేరొస్తుంది పట్నంలో, దానికి మంచి స్థితిమంతుడితో కన్నెరికం చేశానంటే, మనకేంటి లోటు..?"

"అలాగే షణ్ముగం, ఎంత ఓర్పుతో లాక్కొచ్చావు కుటుంబాన్నంతా. నా స్థితి బాగోలేనప్పుడు నీ పంచన చేరనూ..."

"నువ్వే కాదు, మనవాళ్లనెవ్వరినీ బజారున పడనివ్వదు."

"సరే చూద్దాం.. ముత్తులక్ష్మి రెడ్డి ఇంకా ఎంత ముంచుతుందో... సరే షణ్ముగం వెళతా ఇంక... నీ ప్రయాణం ఎప్పుడు?"

"సర్దుకొని వెళ్లడమే, ఈ సారి కూడా నాలుగైదు నెలలుండి వస్తా. ఉత్తరం వేయి రంగా" అంటూ స్నేహితులు సెలవుపుచ్చుకున్నారు.

𝄞 𝄞

మళ్లీ మద్రాసులోని పురసవాక్కం అద్దె ఇంటికి చేరుకున్నారు తల్లీకూతుళ్లు. ఆ తర్వాతరోజే మ్యూజిక్ అకాడమీ పనిమీద కాంగ్రెస్ నాయకుడు సాంబమూర్తి ఇంటికి వెళ్లారు.

"గుర్తుపట్టారా మమ్మల్ని? పోయినేడు మ్యూజిక్ అకాడమీలో మా అమ్మాయి అరియక్కుడి గారి బదులు కచేరీ చేసింది" అంది షణ్ముగవడివు, కూతురుని ముందుకు నెడుతూ.

"అంత పెద్ద పరిచయ వాక్యాలెందుకు? మాకు ఈ అమ్మాయి 'ఎవ్వరిమాట సుబ్బలక్ష్మి!' 'నగుమోము మునిరి', 'మారుబల్క సెమ్మంగుడి' లాగా. ఈ మధ్యనే కొన్నాను అమ్మాయి రికార్డు. 'ఎవ్వరిమాట' బాగా పాడింది. చెప్పండి ఏం పనిమీద వచ్చారు..?"

"అమ్మాయికి మ్యూజిక్ అకాడమీలో ఈసారి కూడా అవకాశం ఇప్పిస్తారని.."

"ప్రయత్నం చేద్దాం. ఈసారి అవకాశం ఇవ్వొచ్చు, చాలా బాగా పాడుతుంది కదా... మీరొక పని చెయ్యండి, అమ్మాయి పేరు, పక్క వాద్యకళాకారుల పేర్లు, పాడే పాటలు, వ్రాసి ఇవ్వండి."

షణ్ముగవడివు వ్రాసి ఇచ్చింది. ఆ కాగితం కాంగ్రెసు నాయకుడి చేతిలో పెట్టి సెలవు తీసుకున్నారు.



ఎన్నో సభలున్నా షణ్ముగవడివు మనసు మాత్రం మ్యూజిక్ అకాడమీ మీదే వుంది. ఈసారి వాళ్లు ముద్రించే సభాకార్యక్రమాల కరపత్రంలో కూతురి పేరు ముందే ఊహించుకుంటోంది. శ్రద్ధగా సాధన చేయిస్తోంది. మద్రాసు మ్యూజిక్ అకాడమీనే కాదు మద్రాసులోని పెద్దమనుషులు కూడా కూతురుని గుర్తించాలని తల్లి తపన.

ఓరోజు సాధన అయిన తర్వాత, "పద కుంజా! ఈ రోజు ధనమ్మ ఇంటికి వెళ్లొద్దాం. ఈ రోజు శుక్రవారం కచేరీ, పెద్దపెద్దోళ్లు కూడా వస్తారు. నిన్ను పరిచయం చేస్తాను వాళ్లకి."

"అలాగేనమ్మా తయారవుతా" అంది సంతోషంగా సుబ్బలక్ష్మి.

"అమ్మా! బస్సులెక్కే దగ్గర రిబ్బన్లు అమ్ముతున్నారు, అవి కొందామమ్మా, పట్నంలో అమ్మాయిలంతా అవే కట్టుకుంటున్నారు."

"సరేనమ్మా."

"ఇంకా పౌడరు డబ్బా కూడామ్మా."

"అలాగే" నవ్వుకుంటూ చెప్పింది షణ్ముగవడివు. మదురైలో కూతురు పౌడరు అనుకొని గోడ సున్నం రాసుకున్నది గుర్తొచ్చి. "అమ్మా, అన్నమెక్కడ తిందాం?"

"ధనమ్మ పెడుతుందమ్మా."

పదికల్లా ధనమ్మ ఇంటికి చేరుకున్నారు.

ఇరవై మూడేళ్ల బృందా, ఇరవై ఒక్కేళ్ల ముక్త, శంకరు, పదిహేనేళ్ల బాలసరస్వతి వీరంతా, తంజావూరు ధనమ్మ వారసులు, సంగీత వారసులు. అందరూ కూర్చొని సాధన చేసుకుంటున్నారు. సుబ్బలక్ష్మి వచ్చి చేరింది.

"కుంజా! క్షేత్రయ్య పదాలు వచ్చా నీకు...?"

"కొన్ని వచ్చు."

"రా అయితే పాడు."

"ముందు అర్థం చెప్పు" గదిమినట్లు చెప్పింది ధనమ్మ.

**'పయ్యెద పైమీదే పవళించే నా సామి**

**అమ్మమ్మా వెగటాయనే...'**

తాళం వేస్తూ ధనమ్మ వింటూవుంది. ఆ తరువాత రెండో పాట అందుకున్నారు... ఇప్పుడు జావళి.

**'సఖి ప్రాణ సఖుడు ఇటు జేసేనే...**

'ఇదిగో వచ్చేదా అని హితముగా మాట్లాడి
అలదాని ఇలకు చేసేనే...
మును నను కలసి మర్మము లెరిగిన
ధర్మపురి వాసుడు మరచేనే...'

ఈ రెండు పాటలు అయిన తర్వాత బాలసరస్వతి లేచింది. వెళ్తూవెళ్తూ సుబ్బలక్ష్మిని కూడా పిలుచుకెళ్లింది.

"రేపు వచ్చి మళ్లీ పాడుకుందువులే, నేను రేపు కలకత్తాకెళ్తున్నా, సర్దుకుందాం రా" అంది.

"కలకత్తానా.. ఎక్కడది.. ఎందుకు?"

"కలకత్తా, బెంగాలు, అక్కడ అఖిలభారత నృత్యోత్సవాలు జరుగుతున్నాయి."

"మరి బాగా సాధన చేసుకున్నావా?"

"వో" అంది బాలసరస్వతి సర్దుకుంటూ.

సాయంత్రం ధనమ్మ కచేరీ కూడా చూసుకొని చల్లగా ఇంటికి చేరుకున్నారు తల్లీకూతుళ్లు. స్నానాలు చేసి కాస్త ఎంగిలిపడి, చాప పరచుకొని పడుకున్నారు. లోకాభిరామాయణం మొదలుపెట్టారు.

"కుంజా చూశావా... ధనమ్మ ఇంటికి పట్నంలో వున్న షావుకార్లంతా వచ్చారు."

"వూ.." అంది కూతురు.

"అమ్మా ధనమ్మకు కళ్లు అస్సలు కనిపించటంలేదు" అంది మళ్లీ.

"ఎంత గొప్పవారికైనా ఈ ముసలి వయస్సు, ఆ వయసు అవస్థలు తప్పవుగా."

"అమ్మా!" మళ్లీ ఏదో గుర్తొచ్చినట్లు పెద్దగా అంది సుబ్బలక్ష్మి.

"అమ్మా! ధనమ్మ మేము నేర్చుకుంటున్న మొదటి పదానికి బాగా తాళం వేసింది. రెండోదానికి వచ్చేసరికి, కాసేపు తాళం వేసి ఏదో ఆలోచనలోకి వెళ్లిపోయింది. కాసేపు నవ్వుకుంది, తల ఊపుకుంది."

"ఆ రెండో జావళి ఆమెకోసం రాసిందే."

గబాలున అమ్మవైపు తిరిగింది సుబ్బలక్ష్మి, "సఖి, ప్రాణ సఖి... అనుకుంటూ ముసలమ్మకోసం ఎవరు రాస్తారమ్మా?" చిలిపిగా అడిగింది.

"ఇప్పుడు కాదే, ధనమ్మ వయసులో వున్నప్పుడు ఆమె ధర్మపురి సుబ్బరాయరుకి అభిమాన స్త్రీ. అయితే ధనమ్మ కష్టాల్లో వున్నప్పుడు ఆయన పట్నంలో లేదు, చాన్నాళ్లకి తిరిగి వచ్చాడు. అప్పుడు ధనమ్మ కష్టాలు తెలుసుకొని సందర్భోచితంగా ఆ జావళి రాశాడు. అవన్నీ గుర్తొచ్చి ఆలోచిస్తూ వుండి వుంటుంది ధనమ్మ" ముగించింది తల్లి.

ఇప్పుడు సుబ్బలక్ష్మి ఆలోచనలో పడింది. మెల్లగా అటువైపు తిరిగి పడుకుంది.

షణ్ముగవడివు తట్టుకోలేనిది ఇదే. కూతురు దూరం జరగటం. షణ్ముగవడివు కూడా ఆలోచనలోకి దిగిపోయింది. అభిమాన స్త్రీలు... పోషకులు. రెండవవారు మొదటివారిని వదిలి వెళ్లటాలు, మొదటివారు మళ్లీ ఇంకొకళ్లని వెతుక్కోవటం. కూతురుకి చెప్పకూడనివి ఇవే.

లాంతరు వత్తి బాగా కిందకి దించి, రాత్రి చీకటిలో కలసిపోయారు ఇద్దరూ, విడివిడిగా.

❦

మద్రాసులో శరత్కాలం కాస్త అడుగుపెట్టగానే సంగీతజ్ఞులు పూర్తిగా తిష్టవేశారు. చిన్న సభల వద్ద కానీ పెద్ద సభలవద్ద కానీ అడుగు పెట్టటానికి చోటు లేకుండా సంగీతజ్ఞులు, వారి వాయిద్యాలతో పరిసరాలు నిండిపోయి వున్నాయి. ఎలాగోలా చోటుచేసుకొని తల్లీ కూతుళ్లు నెట్టుకొస్తున్నారు. వీలైనన్ని సభల్లో కచేరీలు చేయిస్తుంది కూతురుచేత తల్లి.

సుబ్బలక్ష్మి పొరుగూరికి చెందినదైనా, చిన్నపిల్లైనా, ఆడపిల్లైనా తన గాత్రం మాత్రం ఎంచటానికి లేదు. పదిహేడేళ్ల వయసుకి, సంగీతంమీద ఉన్న పట్టు, విచక్షణ, లోతైన జ్ఞానం, శాస్త్రీయ సంగీతజ్ఞులందరినీ నివ్వెర పరిచాయి. నాలుగు దఫాలు గ్రామఫోను రికార్డింగ్‌లో పాడింది, మద్రాసు పట్నంలో అప్పటికే సంగీతజ్ఞులు, రసజ్ఞులు గుర్తుపట్టే పేరున్నది మదురై షణ్ముగవడివు సుబ్బలక్ష్మి.

తొందరలోనే మద్రాసు మ్యూజిక్ అకాడమీ కరపత్రం షణ్ముగవడివు చేతిలోకి వచ్చింది. 1935 జనవరి ఒకటిన సాయంత్రం ఐదున్నర నుంచి ఏడున్నర వరకు సుబ్బలక్ష్మికి కేటాయించారు.

"కుంజా సాధించామమ్మా! మీనాక్షమ్మ కరుణించింది" చెప్పింది కూతురితో.

ఆరోజు పొద్దున 'హిందూ' దినపత్రికలో కూడా 'నగరంలో కార్యక్రమాలు' శీర్షికలో కచేరీ సభల పరంపర గురించి అచ్చువేశారు. సుబ్బలక్ష్మి కచేరీ వివరాలు ప్రచురించారు.

1934వ సంవత్సరపు సంగీత సభల పరంపర, 1934 చివరన మొదలయ్యి 1935లోకి కూడా చొచ్చుకొచ్చింది. జనవరి ఒకటిన నాలుగు గంటలకల్లా రిప్పన్ భవనం వెనక వేసిన పందిళ్ల దగ్గరకు సుబ్బలక్ష్మి, షణ్ముగవడివు చేరుకున్నారు.

సుబ్బలక్ష్మి నిండుగా చక్కని చీరకట్టుకుంది. పైటకు పొడవాటి పిన్నీసు పెట్టుకుంది. ఇంట్లోవున్న నగలన్నీ సుబ్బలక్ష్మి మెడలోనే కనిపిస్తున్నాయి. నాలుగు రకాల గొలుసులు కనిపిస్తున్నాయి. రెండు పిచ్చివి, రెండు బంగారంవి. తీరైన ముక్కుకి రెండువైపులా చిన్న వజ్రం ముక్కుపుడకలు పెట్టుకుంది. అలాంటివే పొడుగాటి లోలాకులు చెవులకి పెట్టుకుంది, తెల్లని పిల్ల, నల్లటి కళ్లు, పెద్ద బొట్టు, పక్కపాపటి జుట్టు, పొడవైన జడతో చక్కగా వుంది. మోము మీద శాంతం, ధీమా పోటీ పడుతున్నాయి.

ఇదే వేదికమీద ఇది రెండోసారి కాబట్టి, కాస్త ధైర్యంగా వుంది ఈసారి. తల్లి తంబూరతో, హంసదమయంతి అనే మహిళ మృదంగంతో, వేదికనెక్కారు. వేదికమీద సర్దుకొని కూర్చుంటుండగా ఎదురుగా వున్న ఒక కుటుంబం చేష్టలు సుబ్బలక్ష్మి మనసుని చివుక్కుమనిపించాయి. తల్లి కూడా చూస్తుంది ఆ కుటుంబాన్ని. వెంటనే తంబూర మీటి ప్రస్తుత కర్తవ్యాన్ని గుర్తుచేసింది. రెండు గంటలు బ్రహ్మాండంగా కచేరీ చేసింది సుబ్బలక్ష్మి. దిగ్విజయంగా రెండోసారి కూడా మ్యూజిక్ అకాడమీ పెద్దలను మెప్పించింది.

రాత్రికి విజయానందంతో ఇంటికి చేరారు. "అంతా చక్కగా జరిగిందమ్మా... కాని..." అంటూ ఆగిపోయింది.

కూతురు ఏమిచెప్తుందో తల్లికి తెలుసు.

"నా ముందు కూర్చున్నవాళ్లలో నా అంత అమ్మాయి, అన్న అంత అబ్బాయి వున్నాడమ్మా... నేను వేదిక ఎక్కగానే వాళ్లమ్మ నన్ను చూడొద్దు, కిందకి చూడండీ అని వాళ్లని కొట్టింది, వాళ్లు ఎప్పుడైనా తల పైకెత్తి నావైపు చూస్తే తొడపాశం పెట్టి మరీ వాళ్ల మొహాలని కిందికి దించింది. నన్నెందుకు చూడకూడదమ్మా...?"

"దేవదాసీలం కదమ్మా... అందుకనీ..."

"అయితే చూడటమేమైనా పాపమా? మన ఊళ్లో మరీ ఇలా చెయ్యరుకదమ్మా?"

"ఆ... మన ఊర్లో పర్వాలేదు. కానీ చూశావా, చూడామణిని ఎంత పనిచేశారో! అక్కడా మారిపోతున్నారు, పట్నంలో మరీనూ. ఇప్పుడు విధవలూ మారు పెళ్లిళ్ల చేసుకుంటున్నారు. విడాకులిచ్చి చాలామంది పెళ్లిళ్లమీద పెళ్లిళ్ల చేసుకుంటున్నారు, వీళ్లంతా బాగానే వున్నారు, ఎటొచ్చీ మనమేనమ్మా చెడ్డోళ్లమయ్యాము."

"ఎందుకిలా?"

"వేశ్యలమంట" ఆవేశంగా అనేసింది ఆ చివరి మాట షణ్ముగవడివు. అంతలోనే కూతురిముందు ఆమాట అన్నందుకు నాలుక కరుచుకుని, "అలసిపోయావు పడుకోమ్మా" అని కూతురుని పడుకోబెట్టింది.





ఈ దఫా సంగీత సభలు అయ్యాయి. ఇక మద్రాసులో తర్వాత రానున్న పెళ్లిళ్ల కాలం కోసం ఎదురు చూడటమే. అప్పుడు ధనవంతుల ఇళ్లలో కచేరీలు చేసే అవకాశాలు వస్తాయి. ఆ రోజుల కోసం చూస్తూ కాలం గడుపుతున్న తల్లీకూతుళ్ల ఇంటి ముందు ఒకరోజు కారు వచ్చి ఆగింది. వాళ్లకోసం కాదేమో అనుకున్నారు తల్లీకూతుళ్లు. కారులోంచి ఒక ఆడమనిషి దిగి, నేరుగా వీరి దగ్గరికి వచ్చి "అక్కా! అక్కా! షణ్ముగం అక్కా!" అని పిలుస్తుంది.

ఎవరబ్బా పట్నంలో తనకోసం కారులో వచ్చి అక్కా అని పిలుస్తోంది అనుకుంటూ తలుపు తెరిచి బైటకి వచ్చింది షణ్ముగవడివు. చూస్తే జానకమ్మ కూతురు సుబ్బులక్ష్మి. ఇప్పుడు సినిమా స్టారు ఎస్.డి. సుబ్బులక్ష్మి, ఏకంగా సినిమా డైరెక్టరునే పెళ్లి చేసుకుంది. చిన్నప్పుడు తన దగ్గర సంగీతం నేర్చుకుంది. చాలా సంతోషించింది షణ్ముగవడివు తనను మర్చిపోకుండా తన ఇంటిదాకా వచ్చినందుకు. కుశల ప్రశ్నలు అయిన తర్వాత,

"ఏమంటున్నారే మీ ఆయన...?"

"ఏముందీ మళ్లీ ఇంకో సినిమా తీస్తున్నారుగా, దాంట్లో కూడా నేనే హీరోయిన్!"

"చాలా మంచిదే! మరి మాకేమన్నా పాటలు చూడరాదూ..."

"అలాగే అక్కా! నేను చెపితే మా డైరెక్టర్ కాదనడు. ఆయన చెపితే వేరేవాళ్లు కూడా వింటారు. నేను కబురు పెడతా రండి." అని భరోసా ఇచ్చింది. ఇచ్చినట్లుగానే మాట తొందరలోనే నిలబెట్టుకుంది. ఒక సినిమాలో సుబ్బలక్ష్మికి కోరస్‌లో పాడే అవకాశమిచ్చింది.



నాలుగు నెలల తర్వాత మదురై చేరుకున్నారు. మద్రాసు నుంచి వచ్చేప్పుడు అక్కడ గెల్చుకున్న పతకాలు, ప్రశంసాపత్రాలు బహుమతులతోపాటు ఒక క్యారెమ్‌బోర్డు కూడా కొని తెచ్చుకున్నారు మదురైకి.

మదురైలో తల్లీకూతుళ్లకి బాగా విశ్రాంతి దొరికింది. గత మూడు నెలలు తెరిపి లేకుండా ఒక సభనుంచి ఇంకో సభకు, ఒక పలుకుబడివున్న పెద్దమనిషి ఇంటినుంచి ఇంకో పెద్దమనిషి దగ్గరికో కూతురు అవకాశాల కోసం తిరిగి తిరిగి అలసిపోయింది షణ్ముగవడివు. ఇప్పుడు తీరిగ్గా అమ్మవారి దగ్గరకు వెళుతూ, స్నేహితులతో, బంధువులతో కాలక్షేపం చేస్తూవుంది. సుబ్బలక్ష్మి వడివాంబతో, అన్నతో క్యారెమ్‌బోర్డు ఆడుతూ కాలక్షేపం చేస్తుంది. కాని ఇద్దరూ సాధన మాత్రం మానరు. వీళ్లు ఇట్లా మదురైకి వచ్చి వారం రోజులు గడిచిందో లేదో బ్రాడ్‌కాస్ట్ రికార్డు లేబుల్‌వాళ్లు సుబ్బలక్ష్మి పాటల రికార చేయటానికి మద్రాసు పిలిచారు.

"మణీ! సుందరం! ఇక త్వరలో పట్నం వెళ్లి అక్కడే వుంటానురా కుంజమ్మతో. మీరు పనులను బట్టీ వస్తూ పోతూ ఉండండి. కచేరీలు ఉన్నప్పుడు కబురు పెడతాను."

"అలాగే అక్కా!" అన్నారు తమ్ముళ్లు. "హమ్మయ్య" అనుకుంది సుబ్బలక్ష్మి. తనకు పోషకుల గోల వదులుతుంది అనుకుంది.

ఈ లోపల మదురైలో చక్కపెట్టుకోవలసిన పనులున్నాయి షణ్ముగవడివుకి. సుబ్బలక్ష్మికి సాధన తప్ప వేరొక పనిలేదు. ఒకరోజు తంబూరతో తన శ్రుతి సరిచేసుకుంటుంది. అప్పుడు ఇంటికి ఇద్దరు మగవాళ్లు వచ్చారు. తల్లి వాళ్లని సాదరంగా ఆహ్వానించింది. లేవబోతున్న కూతురుని వారించింది.

"కుంజా! కూర్చో. వాళ్లు నీ పాట వినటానికే వచ్చారు.. ఒక జావళి పాడమ్మా" అంది.

సుబ్బలక్ష్మి కూర్చుండిపోయింది. వచ్చినవాళ్లు సుబ్బలక్ష్మిని తదేకంగా చూస్తున్నారు. విరిసీవిరియని కలువలాగ ఉంది. జావళి పూర్తిచేసింది. అమ్మవైపు చూడటానికి తలెత్తినప్పుడు వచ్చినవాళ్లను చూసింది. వీళ్లు తాళం వేయటంలేదు సరికదా పాటకు తలకూడా ఊపటంలేదు. వెంటనే పక్క గదిలోకి వెళ్లిపోయింది.

"వడివా! నువ్వు రామ్మా ఒకసారి" షణ్ముగవడివు చిన్నకూతురును పిలిచింది. వడివాంబ వచ్చింది.

"వీణ మీద ఒక జావళి వాయించమ్మా"

కాసేపటికి వాళ్లని పంపి, లోపలికి వచ్చింది.

"కుంజా! వాళ్లు పొరుగూరి అయ్యంగార్లు, నిన్నే అడుగుతున్నారు.వెళ్లమ్మా." సుబ్బలక్ష్మి ఆశ్చర్యపోయింది. అమ్మ తనకు ఈ వ్యవహారం మానేసిందనుకుంది. ఏమీ మాట్లాడకుండా కోపంతో తల దించుకుంది.

"బ్రాహ్మలమ్మా, అంతకంటే ఏమి కావాలి, పోయినసారి నువ్వు వద్దన్న రాజావారి సంబంధం కాకపోయినా ఇదైనా పర్వాలేదు ఒప్పుకోమ్మా."

సుబ్బలక్ష్మి ఏమీ మాట్లాడకుండా తన సంగీతపు పుస్తకం తీసుకొని డాబా మెట్లమీదకు వెళ్లి కూర్చుంది. ఇప్పుడు ఎదురింటి రేడియోలోంచి హిందుస్థానీ సంగీతం వస్తుంది. తల్లి కూడా ఇంకేమీ మాట్లాడకుండా తన పనులకి వెళ్లిపోయింది.

రాత్రి పడుకోవటానికి అందరూ పక్కలు పరుచుకున్నారు. తల్లి, సుబ్బలక్ష్మి, వడివాంబ ఎప్పుడూ పడుకునే వరుసలో పడుకున్నారు.

తల్లి, కూతురు చేయి తీసుకొని తన చేతిలోకి పెనవేసుకుంది. మాటలు తరంగాల రూపంలో చేతినుంచి చేతికి మారుతున్నాయి. వాటి భావం, "నువ్వెందుకు వెళ్లనంటున్నావో



నాకు అర్థం కావటం లేదమ్మా" కూతురి చేయి నిమురుతుంది. కూతురు మెల్లగా అమ్మ చేయి విడిపించుకొని అటు తిరిగి పడుకుంది. తల్లి వెంటనే కూతురువైపు తిరిగి తన చేయి కూతురుమీద వేసి పడుకుంది. షణ్ముగవడివుకు కూతురు ప్రాణం. కూతురు ఇంకా తెలుసుకోవటంలేదనుకుంటుంది. చిన్నతనం పోలేదనుకుంటుంది. దగ్గరుండి కూతురికి సంగీతపు పునాది వేసింది. ఎలా నడుచుకోవాలో నేర్పింది. ఆ పునాది ఇప్పుడు ఫలితాలిస్తుంది. ఇంకేముంది సంగీతంలో తప్పకుండా ముందుకు దూసుకుపోతుంది. ఇక కూతురుకి తనలా డబ్బు కష్టాలు లేకుండా ఒక ధనవంతుడి దగ్గరకు చేర్చితే, తన బాధ్యత తీరినట్లే. ధనవంతులు వెతుక్కుంటూ వస్తున్నారు. కాని కూతురికే ఇంకా తెలిసిరావటంలేదు. ఆ రోజు త్వరలో రావాలని అనుకుంటూ కూతురుని హత్తుకుని పడుకుంది.

దేవదాసీ ఇంటికి మగవారు ఎప్పుడూ ఆహ్వానితులే. ఇద్దరు ఎదిగిన కూతుళ్లు వున్న దేవదాసీ ఇల్లు ఇంకా లోకువ. వాళ్లకి పోషకులని చూస్తున్నవేళ ఆ ఇంటికి మగవాళ్ల రాకపోకలకి తెంపువుండదు. ఇప్పుడు ఆ పరిస్థితే కనిపిస్తుంది షణ్ముగవడివు ఇంట్లో. కన్నెరికం పనిమీద వస్తున్న మగవాళ్లని చూడగానే సుబ్బలక్ష్మికి తన మీద తేళ్లు, జెర్రులు పాకినట్లు వుంది. వెంటనే అక్కడినుంచి తప్పించుకుపోతుంది.

"సుందరం! కోయంబత్తూరు అయ్యంగారు కానీ, ఆయన తరుపున ఎవరైనా కానీ ఈరోజు ఏడొక వేళలో వస్తారు. వడివాకి ఆయన ఖాయం అయినట్లే. మర్యాద చేసి కూర్చోబెట్టు. మేము గుడికి వెళ్లి వస్తాం" అంటూ కూతుళ్లతో బయలుదేరింది.

గుడిలో వడివాంబ అక్క కళ్లలోకి చూడకుండా జాగ్రత్త పడింది. ఇంటికి వచ్చేసరికి అయ్యంగారి తరుపున మనిషి వచ్చి వున్నాడు.

"ఇవిగోండి, డబ్బులు ఇవ్వమన్నారు. భాష్యంగారు. వీటితో సొమ్ములు, చీరలు కొని మంచిరోజు చూసి రమ్మన్నారు" అని డబ్బుసంచి షణ్ముగవడివు చేతిలో పెట్టాడు.

ఒక నెలలో వడివాంబని కోయంబత్తూరులో దిగబెట్టి, సుబ్బలక్ష్మితో మద్రాసు చేరుకుంది. పురసవాక్కం గదిలోకే చేరారు. ఈ మధ్యలో మళ్లీ మదురై వెళ్లే ఆలోచనలు లేవు కాబట్టి శక్తి, తమ్ముళ్లను కూడా వెంట తెచ్చుకుని కావలసిన సామాను మోసుకొచ్చుకున్నారు. నాలుగు రోజుల తర్వాత తమ్ముళ్లు లేనప్పుడు శక్తికి చెప్పింది. "ఒరేయ్, నువ్వు కూడా మామలతోపాటు ఇంటికి వెళ్లు, నువ్వు కూడా ఇక్కడే వుంటే ఇల్లు వదిలేసుకున్నాం అనుకుంటారు మీ అత్తలు. నువ్వు ఇల్లు కనిపెట్టుకువుండు, కచేరీలప్పుడు కబురు పెడతాను, కుంజమ్మ గురువుగారిని తీసుకొని నువ్వు రా."

నాలుగు రోజుల తర్వాత మగవాళ్లు మదురైకి బయలుదేరారు.

"అన్నా! వడివా దగ్గరకు వెళ్లి వస్తూ వుండు. కచేరీ లేకపోయినా నువ్వు ఇక్కడకు రా అన్నా" తడికళ్లతో చెప్పింది అన్నతో.

"వస్తా కుంజా, నువ్వు, అమ్మా జాగ్రత్త" అంటూ చెల్లెలికి ధైర్యం చెప్పాడు.

కొన్నాళ్లు బెంగ పెట్టుకుంది, మదురై మీద, మధుర మీనాక్షి మీద, వడివాంబ మీద, శక్తి మీద. మెల్లగా రెక్కలు విప్పుకుంది.

ఈసారి పట్నంలో మొదటి పని బ్రాడ్‌కాస్ట్ లేబుల్ వారి దగ్గర రికార్డింగు. ఆ పనిమీద వెళ్లారు. సుబ్బలక్ష్మికి ఆ కంపెనీవారే ఫోటో తీయించారు. "అడ్వర్టైజింగ్ కోసం, పత్రికల్లో మా రికార్డు గురించి చెప్పేటప్పుడు మీ అమ్మాయి ఫోటో కూడా వేస్తాం" అన్నారు ఆ కంపెనీవాళ్లు.

"చాలా సంతోషం, మరేం, ఇంకేం కావాలి" అంది షణ్ముగవడివు.

వారు చెప్పినట్లే బ్రాడ్‌కాస్ట్ లేబుల్ ప్రకటనలో పంతొమ్మిదేళ్ల సుబ్బలక్ష్మి ఫోటో వేశారు. అది కూడా మహామహులు పక్కన, అందులో ఒకరు యాభైఏళ్ల 'గాన కళావిశారద', 'విద్యాసుందరి' బెంగుళూరు నాగరత్నమ్మ. ఈ రికార్డుల్లో సుబ్బలక్ష్మి అరుణాచల కవి విరచిత రామాయణం కథ అంతా తెలిపే తమిళ పాట పాడింది. సాహిత్యం మీద, సంగీతం మీద, ముప్పై ఏళ్లకు కుదిరే ప్రజ్ఞ కనబరచింది. సంగీతజ్ఞులు ఇంకా నివ్వెరబోయేలా చేసింది.

§§

సంగీత సభల కాలం దగ్గరపడుతుంది, మార్గశిరంలో తెల్లదొరల పండగరోజుల్లో అన్ని కార్యాలయాలకి పదిరోజులపైనే సెలవలు కాబట్టి, షావుకార్లకి, దుబాసీలకీ, ఉద్యోగులకీ కూడా సెలవలే, కాబట్టి ఆయా సభల పోషకులంతా తీరిగ్గా సభాకార్యకలాపాల్లో పాల్గొనటానికి వీలుగా సభలన్నీ ఈ సమయాన్ని ఎంచుకున్నాయి. షణ్ముగవడివు మదురైకి ఉత్తరం రాసింది, శక్తిని, కుంజమ్మ గురువుని పట్నం రమ్మని.

"కుంజా! ఈ రోజు కాంగ్రెసు నాయకుడు సాంబమూర్తిగారింటికి వెళ్దాం, తొందరగా తయారవ్వు" సాధన తర్వాత సుబ్బలక్ష్మితో అంది షణ్ముగవడివు.

దేశవ్యాప్తంగా బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పెద్దగా ఉద్యమాలు లేనందున కాంగ్రెసు నాయకుడు తీరిగ్గా ఇంట్లోనే ఉన్నాడు.

తల్లీ కూతుళ్లు చాపమీద కూర్చున్నారు.

"ఈసారి కూడా మద్రాసు మ్యూజిక్ అకాడమీలో అవకాశం ఇప్పిస్తారని..." అడుగుతుంది షణ్ముగవడివు.



సావధానంగా వింటున్న ఆయన ఒక్కసారిగా లేచి, లోపలికి వెళ్లి ఒక ఫోటో తీసుకొచ్చి షణ్ముగవడివుకి చూడమని ఇచ్చాడు. సుబ్బలక్ష్మి మ్యూజిక్ అకాడమీలో కచేరీ చేసిన క్రితం సంవత్సరం, ముగింపురోజున కచేరీ చేసిన వారందరితో, అకాడమీ సభ్యులతో తీసిన ఫోటో. తల్లీకూతుళ్లు ఫోటోలో వున్న వారిద్దరినీ ఈ కాంగ్రెస్సు నాయకుడిని, అందరినీ చూసుకున్నారు.

"నాక్కూడా ఒక పటం ఇస్తారా?" అడిగింది షణ్ముగవడివు.

"ఇక్కడే వుంటున్నారుగా, ఇంకొకటి తెప్పిస్తాను" అంటూ ఆ ఫోటో తీసేసుకున్నాడు.

"మరి అమ్మాయికి... అవకాశం" గొణిగింది షణ్ముగవడివు.

"ఈ సమయానికి ఎక్కడెక్కడినుంచో విద్వాంసులు పట్నం చేరుకుంటున్నారు. ఎవరికి అవకాశం ఇవ్వాలో, ఎవరికి వద్దో అనుకుంటూ తర్జనభర్జన పడుతున్నారు. నేను సుబ్బలక్ష్మి పేరుని సిఫారసు చేస్తాను" అన్నాడు ఆ పెద్దాయన.

ఆయన దగ్గర సెలవు తీసుకొని బయటికి వచ్చేసరికి, ఎండ నడినెత్తిన వుండి మాడు చుర్రుమంది.

"ముందు ఇంటికి వెళ్లి, చల్లబడిన తర్వాత పార్థసారథి సభకెళ్దాం కుంజా...."

"అదే నయం అమ్మా, ఈ ఎండలో వద్దు" అంది కూతురు పైట తలమీద కప్పుకుంటూ.

ఇంటికి చేరేసరికి రెండు ఉత్తరాలు పడివున్నాయి గుమ్మందగ్గర. ఒకటి శక్తి నుంచి, ఇంకోటి వడివాంబనుంచి. తొందరతొందరగా వడివాంబ ఉత్తరం ముందు చించింది సుబ్బలక్ష్మి. చదివింది. బాధగా ఉత్తరం అమ్మకి ఇచ్చింది. ఏమైందో అనుకుంటూ షణ్ముగవడివు ఉత్తరం చదివింది.

కాస్త ఊపిరి పీల్చుకుని, "వున్నదే కదమ్మా, దానికి ఆరోగ్యం చిన్నప్పట్నుంచీ తక్కువే. ఈసారి సభలు అయిన తర్వాత అక్కడికి వెళ్లినప్పుడు దాన్ని రమ్మని కబురు పెడదాం."

నిన్నటి ఉత్తరంలో వ్రాసినట్టే ప్రొద్దున్నే అన్న, మామ వచ్చారు ఇంటికి. సంబరపడిపోయింది అన్నను చూసుకొని సుబ్బలక్ష్మి.

"అమ్మా! ఈ రోజు అన్నకి నేను వండిపెడతా" అంది సంతోషంగా.

"మామా! పట్నంలో ప్రఖ్యాత గాయనీమణి వండిపెడుతుంది మనకు ఈ రోజు అదృష్టమంటే మనదే మామా" అన్నాడు శక్తి.

భోజనాలయిన తర్వాత "అన్నా! నాకు ఈమధ్య హంసదమయంతి మృదంగ వాయిస్తుంది, నాకు నచ్చలేదు, నువ్వు రూపకం వాయించి చూపించు."

For A Good Music Entertainment
At YOUR DOORS
BUY
Broadcast
MADURA SUBBULAKSHMI
VIDWAN CHEMBAI
VIDWAN SEMMANGUDI
RANGAI ORE NAGARATNAM

బ్రాడ్‌కాస్ట్ లేబుల్ గ్రామఫోన్ రికార్డు ప్రకటనలో పేరున్న సంగీతజ్ఞులతో సుబ్బలక్ష్మి

வெகு நேரம் பாடும்
Broadcast
வெகு அருமையாகப் பாடும்
எங்கள் மகத்தான மார்ச்சு மாத வெளியீடு.

மிஸ் M. S. சுப்புலக்ஷ்மி.

B. T. 2337

ఒక తమిళ పత్రికలో సుబ్బలక్ష్మి బ్రాడ్‌కాస్ట్ లేబుల్ గ్రామఫోన్ రికార్డు ప్రకటన

"నువ్వు మృదంగం తీసుకో కుంజా, నేను [illegible] వాయించాడు, సుబ్బలక్ష్మి అలానే చెల్లికి తన మృదంగం ఇచ్చి తను రేకుడబ్బా మీద వాయించాడు, సుబ్బలక్ష్మి అలానే వాయించింది.

"సరిపోయింది కదా! ఇంకేంటి?"

"కాదన్నా, నేను సరిగ్గా వాయించా ఇప్పుడు, హంసదమయంతి ఇలా వాయించకుండా నన్ను ఇబ్బంది పెట్టింది."

"ఒకసారి ఖండ చాపు వాయించన్నా, నాకు రావడంలేదు.."

"ఇదిగో చూడు" అంటూ అన్న రేకు డబ్బా వాయిస్తూ వుంటే, సుబ్బలక్ష్మి శక్తి మృదంగం మీద వాయిస్తుంది.

"ఇంక కాసేపు పడుకోనివ్వవే వాళ్లని" చెప్పింది షణ్ముగవడివు. మణి, శక్తి నడుము వాల్చారు. షణ్ముగవడివు, సుబ్బలక్ష్మి ఈసారి ఏ సభలు ఎక్కడ నిర్వహిస్తున్నాయి, ఏ ప్రాంగణంలో ఎప్పుడు నిర్వహిస్తున్నాయి అనే చిట్టా రాసుకోవటం మొదలుపెట్టారు, వాళ్ల దగ్గర వున్న కరపత్రాలు, దినపత్రికలు ముందేసుకుని. ఆ తర్వాత రోజు నలుగురూ కాంగ్రెస్ పెద్దాయన ఇంటికి వెళ్లారు.

"అమ్మాయికి ఈసారి అవకాశం ఇచ్చారండీ..." అడిగింది షణ్ముగవడివు.

"లేదు. ఇవ్వలేదు. ఈసారి కుదరలేదు" అన్నాడు సాంబమూర్తి, షణ్ముగవడివు ఎందుకు అని అడిగేలోపలే,

"ఈసారి మీ అమ్మాయి స్థానంలో పట్టమ్మ అనే కొత్త అమ్మాయికి ఇచ్చారు అవకాశం. బ్రాహ్మల పిల్ల. ఇంచుమించు మీ అమ్మాయి వయసే. ఆ అమ్మాయి కూడా బాగా పాడుతుంది" అని చెప్పాడు.

ఇంక చేసేదేమీలేక సెలవు తీసుకొని ఇంటికి చేరారు. అందరూ కాళ్లు చేతులు కడుక్కొని మంచినీళ్లు తాగి కూర్చున్నారు. మణి ఎవరివైపూ చూడకుండా పెద్దగా అన్నాడు. "ఇద్దరూ వంటరివాళ్లు అయ్యారు, ఒక్కరికీ మగతోడు లేకపోయే... ఎవరిని చూసి ఇస్తారు అవకాశాలు?"

అందరూ విన్నారు ఆ మాటలు. అంతా నిశ్శబ్దం. షణ్ముగవడివుకి వొళ్లు మండింది. సుబ్బలక్ష్మికి గుండె మండింది. కాసేపటికి, "దానికి వచ్చే అవకాశాలకేమీ కొదవలేదురా... కుప్పలుతెప్పలుగా వస్తున్నాయి. ఆ మ్యూజిక్ అకాడమీనే కొరకరాని కొయ్య అయ్యింది. మన మదురైలో ఆలయ మర్యాదలకోసం పోటీపడినట్లు, కచేరీలకు పోటీపడతారక్కడ,



ఇప్పుడు ట్రిప్లికేన్‌లో ఇంకో కొత్త సభ వచ్చిందట. పదండి అక్కడకు తీసుకెళ్తా మిమ్మల్ని హారతిపట్టి తీసుకెళ్తారు దీన్ని లోపలకి."

𝄞𝄞𝄞𝄞

1936 మద్రాసు పట్నం.

ఒక చిన్న తీరప్రాంతపు పల్లెటూరు అంచలంచలుగా ఎదిగి, మూడు వందల సంవత్సరాలలో మహాపట్నమై వెలసింది.

మైలాపురం అనే పల్లెటూరి దగ్గరలో బ్రిటీష్‌వాళ్లు వ్యాపార స్థావరం ఏర్పరచుకున్నారు. దానిని వైట్ టౌన్ అనటం మొదలుపెట్టారు.

సముద్ర వ్యాపారం వృద్ధి చేసేకొద్దీ పెద్ద ఓడరేవు తయారయింది. వ్యాపారం ఇంకా వృద్ధిలోకి వచ్చింది. ఆ పరిసరాల్లో పండించే పంటలను, పరిశ్రమల్లో తయారుచేయబడే వస్తువులను ఓడల దగ్గరకు తరలించటానికి రోడ్లు ఏర్పడ్డాయి. వైట్‌టౌన్‌లో వున్న తెల్ల దొరలకి సహాయపడటానికి భారతీయులెందరో వచ్చి వైట్ టౌన్ పక్కన చేరారు, దానిని తెల్లదొరలు బ్లాక్‌టౌన్ అని పిలిచేవారు. 1911లో జార్జి రాజుని భారతదేశానికి చక్రవర్తిని చేసినప్పటినుంచి ఆయన గౌరవార్థం ఈ బ్లాక్ టౌన్‌ని జార్జి టౌన్ అని పిలుస్తూ భారతీయులకి కూడా కాస్త గౌరవం కల్పించారు. ఇక మైలాపురం చిన్న పట్నం అయ్యి, బ్రిటీష్‌వాళ్ల ఆవాసమయిన ఫోర్ట్ సెయింట్ జార్జి, ప్రాంతీయుల ఆవాసమయిన జార్జి టౌను నుంచి పట్నం పెరిగిపోతూ ఉంది. ఈ జార్జిటౌనులోనే వ్యాపారులు వారికి ఇళ్లు, ఓడలకు తరలించే సరుకులకు గోదాములు ఏర్పరచుకున్నారు. ఈ వ్యాపారస్తులలో తమిళ చెట్టిలు, తెలుగు కోమటి శెట్టులు నూటికి తొంభైమంది. మిగతావారు మార్వాడీలు. మైలాపురం పల్లెటూరు, మద్రాసు పట్నం అయిపోయింది. యాభైఏళ్ల క్రితం కూడా అస్సలు లేని, జనం ఎరుగని విషయాలు కూడా నిజమై కూర్చున్నాయి. ఎక్కడో ఒకచోట వుండే పూటకూళ్ల ఇళ్లు హోటళ్లై కూర్చున్నాయి. చేబదులు, తాకట్టు వ్యాపారం చేసే కోమట్లు బ్యాంకులు నెలకొల్పారు. యాభై సంవత్సరాల క్రితమే తెల్ల దొరలు మద్రాసు పట్నానికి కరెంటు తీసుకొచ్చారు, రైళ్లు నడుపుతున్నారు. సాంకేతిక ఆవిష్కరణలన్నింటినీ మద్రాసుకి చేర్చుతున్నారు. రికార్డింగు నుంచి సినిమాదాకా అన్నీ వినియోగంలోకి వచ్చాయి. సుబ్బలక్ష్మి సరిగ్గా సమయానికి ఈ అవకాశాలన్నింటినీ సద్వినియోగం చేసుకుంటుంది.

ఇప్పుడు మద్రాసు పట్నం అందిస్తున్న ఇంకొక అవకాశాన్ని సద్వినియోగపరచుకోవటానికి మద్రాసు కార్పొరేషన్ రేడియో స్టేషన్‌కు జార్జిటౌను నుంచి ట్రామ్‌లో బయలుదేరింది.

మదురైలాంటి ఊరికి మద్రాసులాంటి పట్నానికి అసలు ... ఏమిచూసినా వింతే సుబ్బులక్ష్మికి, గత ఐదు సంవత్సరాల నుంచి ఎక్కువగా వస్తున్నా ఇంకా ఈ పట్నాన్ని నోరుతెరిచే చూస్తుంది. ఇప్పుడూ అంతే, ట్రామ్‌లో కూర్చుని, బయట కనిపిస్తున్న మద్రాసు పట్నాన్ని నోరు తెరిచి, కళ్లార్పకుండా చూస్తుంది.

"అమ్మా భయమేస్తుందే..." గొణిగింది సుబ్బులక్ష్మి.

"భయమా... ఎందుకు? మనిషి ఎక్కి దిగేంత మెల్లగా వెళ్తుంటే."

"ఊగుతుందమ్మా, విరుగుతుందేమో..."

"విరుగుతుంది, నీ బరువుకు నా బరువుకు.. నన్ను పట్టుకు కూర్చో కుంజా" అంది షణ్ముగవడివు.

రిప్పన్ భవనానికి చేరుకున్నారు. అంత పెద్ద భవంతిలో కనిపించినవారినందరినీ అడుగుతూ రేడియో స్టేషన్‌కు చేరుకున్నారు. లోపలకి వెళ్లగానే అరియక్కుడి రామానుజ అయ్యంగార్ కనిపించాడు.

"ఏంటీ మీరు కూడా రికార్డింగుకు వచ్చారా? మీదా.. అమ్మాయిదా...?"

"అమ్మాయిదేనండీ" చెప్పింది షణ్ముగవడివు.

రేడియో అధికారులు వచ్చి, "మీరు కూర్చోండి, ముందు అయ్యంగారిది రికార్డు చేస్తాము" అని చెప్పి అరియక్కుడిని లోపలికి తీసుకెళ్లారు.

ఒక గంట తర్వాత కళాకారులకి ఇచ్చే వారివారి పారితోషికాలు తీసుకోవటానికి ఆ అధికారి గది బయట ఎదురుచూస్తూ పిచ్చాపాటి మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

ముందుగా అరియక్కుడిని లోపలికి పిలిచారు.

"ఇవిగోండి మీకు రావలసిన పారితోషికం డబ్బులు" లోపలినుంచి స్పష్టంగా వినిపిస్తున్నాయి మాటలు.

"ఎంత?" అంటూనే లెక్కపెట్టుకుంటున్నాడు అరియక్కుడి.

"పదిరూపాయలా.. ఇంతేనా..?"

"మీ స్థాయివారందరికీ అలానే ఇస్తున్నాము, మీ తర్వాత పాడిన ఆ అమ్మాయికి కూడా అంతే" అన్నాడు అధికారి.

"ఏంటీ నాకు పదిరూపాయలే, ఆమెక్కూడా పదిరూపాయలా.. ఆ ఆడదాన్ని నన్ను ఒక గాటన కడతారా?"



బయట సుబ్బులక్ష్మి, షణ్ముగవడివు వింటున్నారని తెలిసికూడా అంటున్నాడు. అరియక్కుడి ఊరికే డబ్బు సంగతి ఒక్కటే మాట్లాడినా ఫర్వాలేదుకాని 'ఆమె' 'ఆ ఆడదాన్ని' అన్న మాటల్లో కొట్టొచ్చినట్లు కన్పించిన చీత్కారం, హేళన, వెక్కిరింపు తల్లీకూతుళ్ల మొహాల్లో రక్తం చుక్క లేకుండా చేసింది. "ఛ ఈ లెఖ్ఖన ఇక రేడియోలో పాడకూడదు" అనుకుంటూ నేరుగా చూసుకుంటూ వడివడిగా వెళ్లిపోయాడు.

తల్లీకూతుళ్లు కూడా వారి పారితోషికం తీసుకొని మళ్లీ ట్రామ్ ఎక్కారు. సుబ్బులక్ష్మి అమ్మ చెయ్యి గట్టిగా పట్టుకుంది. ఒకరి కళ్లల్లోకి ఒకరు చూసుకున్నారు. మొహాలు కళ తప్పి, కళ్లలో ఉక్రోషం కనిపిస్తుంది.

"ఎప్పటినుంచి వచ్చేవాడు మన ఇంటికి, షణ్ముగంగారూ, షణ్ముగంగారూ అంటూ, నా దగ్గర సంగీతం నేర్చుకునేవాడు.. నీకు నేర్పేవాడు చక్కగా. ఎంత కుళ్లు పెట్టుకున్నాడు మనస్సులో" అంది తల్లి.

జార్జిటౌన్‌లో దిగి, ధనమ్మ ఇంటికి వచ్చారు. వాళ్లకంటే ముందు అరియక్కుడి కూడా అక్కడికే చేరాడు. అతన్ని చూడబుద్ధి కూడా కాలేదు తల్లీకూతుళ్లకి. అందరూ ధనమ్మ ముందు కూర్చున్నారు. శుక్రవారం ధనమ్మ కచేరీకి ఒక్కొక్కరు మెల్లగా వస్తున్నారు. కృష్ణమూర్తి, 'ఆనంద వికటన్' పత్రిక విలేఖరి, టి.కె. చిదంబరం, రచయిత, తమిళ భాషా పండితుడు, ప్రఖ్యాత వ్యాపారవేత్త షణ్ముఖం ఆర్.కె., మద్రాస్ మ్యూజిక్ అకాడమీ ప్రముఖుడు కృష్ణ అయ్యర్ ఇంకా కొంతమంది పురప్రముఖులు వున్నారు..

అందరూ ధనమ్మ ముందు వినయంగా కూర్చున్నారు, ఆమె ఏమి చూడలేనప్పటికి, ఆమె కళకి ఆ వినయవిధేయతలు వాటంతట అవే వచ్చి చేతులు కట్టుకు నిలబడాల్సిందే.

"ధనమ్మగారు! మన బాల మీ పేరు నిలబెడుతోంది, ఏమి అడవులు, ఏమి అభినయం, దేశంలో బాలను మించిన నాట్యగత్తె లేదని ఉదయశంకర్ కూడా కితాబిచ్చాడు" అని చెప్పాడు కృష్ణ అయ్యర్.

"జయమ్మ, బాల, కందప్ప రాకపోయుంటే ఇక సదిర్ మరుగున పడిపోయి వుండేది, దాంతోపాటే సదిర్ పదాలు, జావళీలు కూడా. ఇప్పుడు కొత్తగా వచ్చేవారికి రుక్మిణీదేవి చేసే నాట్యమే వేదం అయ్యుండేది" అన్నాడు కృష్ణమూర్తి.

దానికి జయమ్మ ఆవేశంగా అందుకుంది, "ఒక్క సంవత్సరం నుంచి కూడా నేర్వలేదు రుక్మిణీదేవి... అప్పుడే నాట్యగత్తె అయిందా? ఏడుతరాల ప్రతీక బాల. కనీసం మూడు తరాలోనైనా నాట్యం లేకపోతే, వాళ్లు నాట్యగత్తెలేకారు, గుర్రాలు, గాడిదలు తప్ప."

“కాని అనుకున్నది సాధించింది. సదిర్ పచ్చి శృంగారపు నాట్యం అనే అభిప్రాయం ప్రజల్లోకి తెచ్చింది. రుక్మిణీదేవి చేస్తున్న పనులతో సదిర్ నాట్యం చేసేవారు కూడా మర్యాదస్తులు కారనే అభిప్రాయం కూడా వచ్చింది.”

ఈ చర్చ అంతా ధనమ్మ వింటుంది. అరియక్కుడి అసహనంగా వింటున్నాడు. మాటల మధ్యలో కాస్త సందు దొరికినప్పుడు మొదలుపెట్టాడు.

“ధనమ్మ గారు! పోయిన నెలలో నన్ను వెల్లూరు సంగీత సభవారు సన్మానించారండి, ‘సంగీత రత్నాకరం’ అనే బిరుదుతో సత్కరించారు” అంటూ గర్వంగా చెప్పుకున్నాడు చుట్టూ చూస్తూ.

ధనమ్మ వెంటనే, “ఆ... సంగీత రత్నాకరమా.. బిరుదా? అది ఒక గొప్ప సంగీత పుస్తకం అనే తెలుసు నాకు” అంటూ మొహమంతా చిట్లించింది.

అక్కడ వున్నవారంతా నవ్వు ఆపుకుంటున్నారు. కొంతమంది నవ్వు ఆపుకోలేక, నోరుతెరిచి అవునవును సారంగదేవుని సంగీత రత్నాకరం, అన్నారు.

షణ్ముగవడివు, సుబ్బలక్ష్మి తనివితీరా నవ్వుకున్నారు. “బాగా పెట్టింది” అని అనుకున్నారు.

ధనమ్మ కచేరీ ముగించింది. అందరూ ఇంకా మంత్రం వేసినట్లు కూర్చునే వుండగా.. సుబ్బలక్ష్మితోపాటు ధనమ్మ మనుమ సంతానం పదమూడుమంది కింది అంతస్తుకు దిగి వచ్చి భోజనాలు కానిస్తున్నారు. “కుంజా! వచ్చేనెల బెనారస్ వెళ్తున్నా” చెప్పింది బాల.

“ఎందుకు? బెనారస్ ఎక్కడ?”

“బెనారస్ ఢిల్లీకి దగ్గర. అక్కడ ఆల్ఇండియా మ్యూజిక్ కాన్ఫరెన్స్ ఈసారి.”

“అంత దూరమా.. ఎన్ని రోజులు పడుతుంది...?”

“ఐదు రోజులు. దీనికే అంత దూరమా అంటావేంటి కుంజా... నన్ను ఉదయశంకర్ ఏకంగా ప్రపంచ యాత్రకే రమ్మని పిలిచాడు. మా అమ్మ, అమ్మమ్మ వద్దన్నారు...”

“నిజంగానా.. ఎప్పుడు...?”

“రెండేళ్ల క్రితమే.”

“నేనెక్కడెక్కడికి వెళ్లానో తెలుసా బాలా? దూరం అంటే, మా మదురైనుంచి పట్నం



రావడమే, మదురైకి దగ్గరలో తిరుచ్చి, తిరుచెందూరు, వెల్లూరు, ఆ .. ఇంకా బెంగుళూరు, తిరువనంతపురం కూడా వెళ్లాను చిన్నప్పుడు. మళ్లీ తొందరలో ఒక పెళ్లి కచేరీకి వెళ్తున్నా తిరువనంతపురం. అంతే ఇక్కడిక్కడే. ఈసారి నన్ను కూడా నీతో తీసుకెళ్లు బాలా.”

“తప్పకుండా...” ఏదో చెప్పబోతుండగా, పైనుంచి జయమ్మ వచ్చి సైగచేసింది. బాలా వెంటనే లోపలికి వెళ్లి బట్టలు మార్చుకొని పైకి వెళ్లింది.

సుబ్బలక్ష్మి ధనమ్మ ఇంటి నుంచి బయలుదేరేప్పుడు బాలా కనిపించలేదు. అదేమాట రాత్రి పడుకున్నప్పుడు అమ్మని అడిగింది.

“బాల షణ్ముఖంగారితో వెళ్లిందమ్మా.”

“షణ్ముఖంగారా ఆయనెవరు?”

“షణ్ముఖంగారు ఎవరేంటి? బాల పోషకుడు, పట్నంలో పెద్ద ధనవంతుడు, వ్యాపారస్తుడు, దేశదేశాలు మబ్బుల్లో తిరుగుతుంటాడు.”

“బాల ఈడువాళ్లు నాకెవ్వరూ కనిపించలేదే... అక్కడ.”

“ఈడుదేముందిలేమ్మా, కాస్త అటూఇటూ.”

సుబ్బలక్ష్మి గుర్తుతెచ్చుకుంది. అక్కడ పెద్ద వయస్సున్నవాళ్లు తప్ప బాల ఈడు జోడూ ఎవరూ లేరు. అమ్మ బాలా పోషకుడైన షణ్ముఖం గుర్తులు చెప్పింది. జావకారిపోయింది సుబ్బలక్ష్మి.

“అమ్మా అతనా? బాల కంటే ఎంత పెద్దగా వున్నాడు. ముసలోడిలాగా ఉన్నాడు. పాపమమ్మా, బాల నాకంటే చిన్నది.”

“మరేమనుకున్నావమ్మా ధనమ్మ కుటుంబం అంటే? దేవదాసీలందరికీ తలమానికం. పట్నంలోనే పుట్టి పెరిగినా ధనమ్మ కుటుంబ ఆచారాలని ఏమాత్రం పల్చబడనివ్వలేదు. కామాక్షి కూతుళ్లకి కూడా కత్తికల్యాణం చేయించింది, వాళ్లకి కూడా పోషకులని చూసింది. నువ్వే ఇంకా ఏమీ తేల్చకుండా తాత్సారం చేస్తున్నావు. ఎప్పుడు తెలుసుకుంటావో ఏమో...” అంటూ షణ్ముగవడివు కూతురువైపు తిరిగింది. నిండుగా ముసుగుతన్నివుంది. “వింటున్నావా?” అంటూ ముసుగు తీసింది తల్లి.

“అమ్మా! అతనికి ఎంత వయస్సుంటుంది?” సుబ్బలక్ష్మి అడిగింది.

“జయమ్మ చెప్పింది, బాల కంటే ఇర్వై ఆరేళ్లు పెద్దంట.” వెంటనే ముసుగు కప్పింది సుబ్బలక్ష్మి. ముసుగు లోపల కళ్లు, నోరు మూతబడటంలేదు.

తెల్లవారింది. స్నానపానాలు చూసుకొని, సాధనకు దిగారు తల్లీకూతుళ్లు. సుబ్బలక్ష్మికి రాత్రి తల్లి చెప్పిన మాటలే గుర్తొస్తున్నాయి. ధనమ్మ మనమరాళ్లందరూ పోషకుల వరమయ్యారు. అలానే అమ్మ తనకి కూడా పోషకులని చూసే పనిలోనే ఉంది. పట్నంలో ఇంటికి కూడా ఏదో ఒక నెపం మీద మగవాళ్లు వస్తూనే ఉన్నారు. అమ్మ మెల్లగా వాళ్ల ఆస్తిపాస్తులను, పరపతిని బేరీజువేసి, వద్దనుకున్నవాళ్లని మళ్లీ గడప తొక్కనివ్వటంలేదు. ఆలోచనలతో నిండి ఉన్న మనస్సుకి పాటమీద మనస్సు పోలేదు. వీణ తీసుకుంది. అప్పుడప్పుడు వీణని ఒకసారి మీటుతుంది. ఆలోచనలలో ఎంత మునిగిపోయిందంటే ముందు తల్లి తనతో సాధన చేయటం కోసం ఎదురు చూస్తూ ఉందని గమనించలేదు. తల్లి చూస్తూ ఉంది, గాఢాలోచనలో మునిగిన కూతురుని ఒక్కసారిగా పిలిస్తే దడుచుకుంటుందని, మెల్లగా పిలిచింది. “కుంజా! కుంజమ్మా! నా చిన్నిమారాణీ!” తలెత్తింది సుబ్బలక్ష్మి. “ఏంటమ్మా అంతగా ఆలోచిస్తున్నావు?” అనునయంగా అడిగింది తల్లి.

కళ్లెత్తి ఒకసారి తల్లిని చూసింది. మళ్లీ వీణవైపు చూస్తూ, “అమ్మా, నేను పెళ్లెందుకు చేసుకోకూడదు?” “అందరూ చేసుకునే పెళ్లి” వెంటనే ఈ మాటలు జోడించింది. తల్లి ఎలాంటి జవాబు ఇవ్వకపోయేసరికి తలెత్తి చూసింది. ఎప్పుడూ చూడని రూపు తల్లిలో చూసింది. కోపంగా, చాలా కోపంగా, ఎదిగిన కూతురిని ఒక దెబ్బ వేసో, తిట్టో దారిన పెట్టలేని అసహాయతతో నిండియున్న కోపం, “ఇప్పటిదాకా మన గడప తొక్కిన మగాళ్లలో ఒక్కళ్లైనా నిన్ను పెళ్లి చేస్కుంటానని వచ్చి ఉంటే, నీ కోరిక ఎప్పుడో తీర్చేదాన్ని కుంజా.” చెప్పింది తల్లి. మళ్లీ తనే, “మా అమ్మమ్మ, మా అమ్మ, నేను మన కుల పద్ధతిలోనే పెరిగాము. మాకు ఎలాంటి ఇబ్బందులు లేకుండా బ్రహ్మాండంగా బ్రతికాము. మమ్మల్ని ఎవరూ వేలెత్తి చూపలేదు.”

“ఇప్పుడు చూపుతున్నారుగా” తల దించుకొని మెల్లగా మాటల తూటా వదిలింది.

తల్లి కాస్తంత ఆశ్చర్యపోయింది. కూతురు తాను అనుకున్నంతకంటే ఎక్కువగానే ఆలోచిస్తుంది. నిర్దిష్టమైన ధోరణికి వచ్చేస్తుంది.



“అయితే ఏదీ.. ఆ వేలెత్తి చూపుతున్నవాళ్లు దేవదాసీలను పెళ్లి చేసుకుంటామని ముందుకు వస్తున్నారా చూపించు? ధనమ్మ ఇక్కడే పుట్టి పెరిగింది. ఎనభై ఏళ్లు ఉంది పట్నంలో, ఎంతోమంది తెలుసు ధనమ్మకి, కూతుళ్లకి పెళ్లి చేసిందా? ఇప్పుడు వేలెత్తుతున్నారని మనమరాండ్లకి చేసిందా.. పెళ్లిళ్లు? మనల్ని ఎవరూ పెళ్లి చేసుకోరు కుంజా! పోషకుడినైనా చూసుకోకపోతే బతకలేం.”

“సుబ్బలక్ష్మక్క చేసుకుందిగా?”

“చేసుకుంది చేసుకుంది, మా బాగా చేసుకుంది. ఆ తర్వాత సినిమాలో హీరోయిన్ను కూడా ఇదే కాబట్టి సరిపోయింది. ఆ తర్వాత సినిమాలో నటించేది దీనికి సవతి కాకపోతే చెప్పు. ఇంకోదాన్ని తీసుకుంటే వేలకు వేలు పోయాలి, అందుకే దీన్ని కట్టుకున్నాడు. కుంజా, పెళ్లీ పేరంటాలు మనకి కాదు. ఇప్పటికే చాలా ఆలస్యం చేశావ్. ఈసారి నేను కుదిర్చిన పోషకుడి దగ్గరకు వెళ్లు” ఈ విషయంలో ఇదే ఆఖరి తీర్పు అన్నట్లు చెప్పి, సంగీతపు పుస్తకాలు తీసుకొని వెళ్లిపోయింది. వెళుతూ వెళుతూ, “దాసీలను పెళ్లి చేసుకొని ఉద్ధరించే ఉద్దండులు ఇంకా వెలయలేదమ్మా” అనుకుంటూ వెళ్లింది.

సుబ్బలక్ష్మి వీణతో అక్కడే కూర్చుండిపోయింది.

‘ఉండరా ఆ ఉద్దండులు, ఉండొచ్చు. ఉంటారు.’ అమ్మ తనను ఇమడ్చాలనుకునే ఆ చట్రం ఎంత మాత్రం ఇష్టం లేక సుబ్బలక్ష్మి మనసు ఆ ఉద్దండుల కోసం ఎదురు చూస్తుంది.

𝄞𝄞𝄞𝄞

మద్రాసు నగరంలో సుబ్బలక్ష్మి ఉంటున్న పురసవాక్కంకి రెండు మైళ్ల దూరంలో ‘ఆనంద వికటన్’ అనే తమిళ పత్రిక కార్యాలయంలో ఒక ఉద్యోగి ఆ పత్రిక ముఖ్య సంపాదకుడయిన కృష్ణమూర్తి పక్కనే కూర్చున్నాడు. కృష్ణమూర్తివైపు తిరిగి “ఏడయ్యా మీ ఉద్దండుడు? వాసన్‌గారు తెగ కలవరిస్తున్నారు. నిన్నటినుంచి కనిపించలేదట. రాగానే కలవమని చెప్పమంటున్నారు.”

“ఉద్దండుడా? ఎవరు?” అన్నాడు తలెత్తకుండానే కృష్ణమూర్తి. “ఎవరంటావేమిటీ, నీ సఖుడు, నీ జైలు సహవాసి, సదాశివం.”

“నీకప్పుడే ఉద్దండుడయిపోయాడా అతను?”

"నాక్కాదయ్యా, ఏకంగా లోపలున్న అయనకే. మన పత్రిక మద్రాస్ ప్రెసిడెన్సీలో అత్యధికంగా అమ్ముడుపోతున్న పత్రిక అని ఏకంగా ఇంగ్లాండులో టైమ్స్ పత్రికలో ప్రకటన ఇప్పించాడు. అది చూసిన ఇంగ్లండ్ కంపెనీలు వాళ్ల రేడియోలు, గ్రామఫోన్‌లు, కార్లు, గడియారాలు, సబ్బులు, పేస్టులు ఇలాంటి ప్రకటనలన్నీ మన పత్రికకే ఇవ్వటం మొదలుపెట్టారు. ఆ దెబ్బతో సంవత్సరానికి ప్రకటనల మీద వచ్చే ఆరువేల ఆదాయం డెబ్భైరెండువేలు అయ్యి కూర్చుంది. ఇక మీవాడు ఉద్దండుడు కాక ఏమవుతాడు? ఏం మెచ్చుకుంటాడు తెలుసా నీ నేస్తాన్ని, అతని ముందు కాదులే" అంటూ ఆ ఉద్యోగి కృష్ణమూర్తివైపు మళ్లాడు. "ఆ... ఇక పొగిడింది చాల్లే" అన్నట్టు మొహం అదోలా పెట్టి తను రాసుకుంటూ పోతున్నాడు కృష్ణమూర్తి.

కాసేపటికి ఆ ఉద్దండుడు రానే వచ్చాడు. వస్తూనే, "కృష్ణమూర్తీ! హెచ్.ఎమ్.వి. వాళ్లు చెప్తే వినరేం" అంటూ వాళ్లని తిట్టిపోస్తున్నాడు. కృష్ణమూర్తి తలెత్తకుండానే వాసన్ గదివైపు చేయి చూపించాడు. అగ్గిమీద గుగ్గిలం అయిపోయాడు. "పెళ్లి సంబంధాల పనిమీద తిరుగుతున్నాననుకుంటాడా, ఒక్క రోజు కనిపించకపోయినా చంపుతాడు" అంటూ వాసన్ దగ్గరకు వెళ్లాడు.

వాసన్ సదాశివంని చూసి 'నా తురుపు ముక్క' అని మనసులో అనుకొని, "ఏమయ్యా సదాశివం, నిన్నటినుంచి ఏమయ్యావ్? మీ రాజగోపాలాచారి వచ్చే ఎన్నికల్లో నిన్ను పోటీ చేయమన్నారా ఏంటి?"

"అదేం లేదు సార్, నిన్న, ఈ రోజు ఆ హెచ్.ఎమ్.వి. వాళ్ల పనిమీద తిరుగుతున్నాను, వాళ్ల ప్రకటనలు మన పత్రికకే ఇవ్వమని అడుగుతున్నాను" ఆ మాటల్లోనే హెచ్.ఎమ్.వి. వాళ్ల మీద ఎంత కోపం ఉందో తెలుస్తుంది.

"అదెలా సాధ్యమయ్యా?"

"నాకు రేపొక్కరోజు ఇవ్వండి తేల్చేస్తాను."

"సరే అలాగే. ఈ రోజు, ఇప్పుడు, ఇంకో పనిచేయి, సుబ్బలక్ష్మి అని ఒక అమ్మాయి, చిన్నమ్మాయే.. కర్ణాటక సంగీతం బ్రహ్మాండంగా పాడుతుందట, మదురై నుంచి వచ్చిందట. ఇప్పటికే చాలా పేరు తెచ్చుకుంది. కానీ మనమింకా మన పత్రికలో ఆ అమ్మాయిని పరిచయం చేయలేదు. నువ్వు గుమస్తా దగ్గర ఆ అమ్మాయి అడ్రసు తీసుకొని ఈ రోజే వెళ్లి, ఫోటోలు తీయించి ఆ అమ్మాయి మీద ఆర్టికల్ తయారుచేయి"



"అలాగే సార్, ఈ రోజే చేస్తాను" అని చెప్పి గుమస్తా దగ్గరకు వచ్చి అడ్రస్ తీసుకుంటుండగా వాసన్ బయటికి వెళ్లిపోతూ కనిపించాడు. గుమస్తా దగ్గర అడ్రసు తీసుకొని, కృష్ణమూర్తి దగ్గర కూర్చున్నాడు. అతన్ని అడిగాడు, "కృష్ణమూర్తి ఏం రాస్తున్నావు?"

"'సతీ లీలావతి' సినిమా గురించి." తలెత్తకుండా చెప్పాడు కృష్ణమూర్తి. "సినిమా మార్చిలో విడుదలయింది. ఈ రోజు జూన్ ముప్పై. ఇన్నాళ్లకి విమర్శనాత్మక వ్యాసం రాస్తున్నావా? అంత తొందరెందుకు ఇంకొన్నాళ్లు ఆగు" వెటకారంగా అన్నాడు.

కృష్ణమూర్తికి ఏమనాలో అర్థంగాక పెన్ను పక్కనపెట్టాడు. "ఇది విమర్శనాత్మక వ్యాసం కాదు. సవరణాత్మక వ్యాసం. ఈ సినిమా నిర్మాత, 'పతిభక్తి' నిర్మాత కోర్టులదాకా వెళ్లారు. మన వాసన్‌గారు కూడా భాగం కావల్సి వచ్చింది అందులో."

"అదా.. ఆ గొడవ నాకు తెలుసులే. సరేకాని కృష్ణమూర్తి, నీకొక మాట చెప్తా విను. సినిమాల మీద రాసేప్పుడు 'విమర్శనాత్మక వ్యాసం' అని పేరు పెట్టుకోకుండా 'సమీక్షాత్మక వ్యాసం' అని పేరుపెట్టి రాయి. నువ్వు పోయిన ఏడు వచ్చిన 'నందనార్' సినిమా గురించి ఏం రాశావో గుర్తుందా? యాక్టర్లకంటే ఎద్దులు బాగా నటించాయి. కళాకారులకంటే కొబ్బరిచెట్లు బాగా ఆడాయి అని రాశావు. ఆ సినిమా దర్శకుడు ఎల్లిస్ డంగన్ ఇప్పటికీ నిన్ను ఇంగ్లీష్‌లో తిట్టుకుంటున్నాడు. సుందరాంబ, మహారాజపురం కర్ణాటక బాణీలో ఆరున్నొక్క శ్రుతి అందుకుంటున్నారు. కొంచెం లౌక్యం ప్రదర్శించు కృష్ణమూర్తి, ఇప్పుడు చూడు నేను ఆ అమ్మాయి దగ్గరికి వెళతాను. ఆ అమ్మాయి ఎలా పాడినా సరే, నిఘంటువులు వెతికిమరీ ఉపమానాలు పేర్చేస్తా."

"నువ్వంత కష్టపడనక్కరలేదు. ఆ అమ్మాయి నిజంగానే చాలా బాగా పాడుతుంది. నేను ఆ అమ్మాయిని చాలాసార్లు బాలసరస్వతి ఇంట్లో చూశాను."

"అలానా? వచ్చిన చిక్కే ఇది కృష్ణమూర్తి, అందరూ బాగా పాడేస్తున్నారు కర్ణాటక సంగీతం, నువ్వు గమనించావా.. ఈ 'బాగా'కంటే ఇంకో ఎత్తు వాళ్లు కావాలి".

"సరే కృష్ణమూర్తి నేను వెళ్తున్నా."

"ఎక్కడికి?"

"ఆ అమ్మాయి దగ్గరికి, వాసన్ వెళ్లమన్నాడుగా."

"ఆయన చెప్పి గంట అయింది, నువ్వు వెళ్లేసరికి ఇంకో గంటవుతుంది. ఇప్పటికే చాలా చీకటిపడింది. ఆ ఇంట్లో తల్లి, కూతురు తప్ప, మగవాళ్లు ఉండరు తలుపు తీయటానికి."

"ఏం ఆ ఆడవాళ్లకి చేతులు చచ్చుపడిపోతాయా రాత్రి ఏడుగంటల తర్వాత?"

కృష్ణమూర్తికి ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియక, ఇందాక తప్పు రాశానని అనుకున్న కాగితాన్ని పర్రున చించి, ముక్కలుముక్కలుచేసి తుక్కుబుట్టలో వేసి, "సరే, పో నేను పని చూసుకుంటా నువ్వెళితే అన్నట్లు చెప్పాడు.

"కృష్ణమూర్తి..." లాలనగా పిలిచాడు సదాశివం. "ఈ రోజు ఈ పని చూసుకున్నానంటే, రేపు మళ్లీ ఆ హెచ్.ఎమ్.వి. వాళ్ల పని చూడాలయ్యా" అంటూ పురసవాక్కంవైపు బయలుదేరాడు. తోడుగా ఫోటోలు తీసే విలేఖరిని కూడా వెంటబెట్టుకున్నాడు. అడ్రసు వాకబు చేసుకుంటూ, చేసుకుంటూ సుబ్బలక్ష్మి ఇంటికి చేరారు. సైకిళ్లు స్టాండు వేసి, ప్రహరీలోంచి లోపలికి వచ్చి పక్కగా ఉన్న గది దగ్గరికి వచ్చి తలుపుతట్టి పిలిచాడు సదాశివం.

అప్పటికే బాగా చీకటిపడింది. బుడ్డిదీపం కాంతిలో తల్లీకూతుళ్లు ఎవరి పనిలో వాళ్లు ఉన్నారు.

'ఈవేళప్పుడు ఎవరూ?' అనుకుంటూ తలుపు దగ్గరకొచ్చి షణ్ముగవడివు "ఎవరూ?" అని కేకపెట్టింది.

"నేను 'ఆనంద వికటన్' విలేఖరిని, ఇక్కడ సుబ్బలక్ష్మి అని పాటలు పాడే అమ్మాయి ఉందటకదా? ఆ అమ్మాయి ఇంటర్వ్యూ తీసుకోవాలని వచ్చాం, తలుపు తీయండి" అరిచి చెప్పాడు సదాశివం.

కాసేపు అటువైపునుంచి సమాధానం లేదు.

"ఏవండీ" అంటూ తలుపుకొట్టాడు సదాశివం.

"ఇంటర్వ్యూ అంటున్నారు కదా.. చక్కగా పొద్దునే వస్తే చాలాసేపు మాట్లాడుకోవచ్చు. పాటలు కూడా వినొచ్చుకదా.." అంది షణ్ముగవడివు.

"లేదండీ, మమ్మల్ని స్వయంగా మా యజమాని వాసన్ పంపారు. నాతోపాటు ఫోటోలు తియ్యటానికి ఫోటోగ్రాఫర్ కూడా వచ్చాడు. ఈరోజు ఇంటర్వ్యూ తీసుకుంటే పైవారం పత్రికలో ఆర్టికల్ వచ్చేస్తుంది. లేకపోతే ఆ పైవారాలకి వెళ్లిపోతుంది."



మళ్లీ ఎలాంటి సమాధానం లేదు లోపలినుంచి. మళ్లీ పిలిచాడు సదాశివం.

"కాసేపు ఆగండి బాబు, అమ్మాయి కాస్త తయారయిన తర్వాత తలుపు తీస్తా" అంది షణ్ముగవడివు.

తీరిగ్గా తలుపులు తెరవబడ్డాయి. పత్రికా విలేఖరులు ఇద్దరూ లోపలికి వచ్చారు.

ఆ మినుకుమినుకు వెలుగులో ఆ ఇద్దరు ఆడవాళ్లను పోల్చుకున్నాడు. ఇప్పటిదాకా తనతో మాట్లాడినామె ఒకరు, ఇంకొకరు ఆమె కూతురు, తను వచ్చింది ఆ అమ్మాయి కోసమే.

చాపమీద కూర్చున్నారు విలేఖరులు. "మీరూ కూర్చోండి" అన్నాడు సదాశివం.

"నువ్వు కూర్చో కుంజా" కూతురితో చెప్పింది షణ్ముగవడివు. చాప అటు చివర కచేరీకి కూర్చున్నట్లు చీర చక్కగా సర్దుకొని కూర్చుంది. ఈ లోపల సదాశివం పుస్తకం పెన్ను తీసుకొని తేదీ సమయం వేస్తూ, "సరిగ్గా కనిపించటంలేదు. కాస్త వొత్తి పెంచండి" అని అన్నాడు.

ఇద్దరిమధ్యనా ఉన్న దబ్బాగిన్నె మీద ఉన్న లాంతరు వత్తిని పైకి పెంచటం ప్రారంభించింది సుబ్బలక్ష్మి. వత్తి పెంచుతున్న చేయిని చూశాడు సదాశివం. ఎర్ర కలువ రేకు మొదలులో ఉండే వర్చస్సు కనిపించింది. వెలుగు పెరిగేకొద్దీ ఆ చేతి మీదుగా వెళ్తూ సుబ్బలక్ష్మిని చూశాడు సదాశివం. లేత యవ్వనవతి. అప్పుడప్పుడే విచ్చుకున్న ఎర్ర కలువలాగుంది. మోము ప్రశాంతంగా, వినమ్రంగా ఉంది. రెప్పలాడిస్తే బేలచూపులు కనిపిస్తున్నాయి. రెప్పార్పకుండా చూస్తున్నాడు సదాశివం సుబ్బలక్ష్మిని.

"సారూ... నన్ను ఫోటోలు తియ్యమంటారా.. మీరు మాట్లాడతారా ముందు?" అడిగాడు కూడా తెచ్చుకున్న విలేఖరి. ఈ లోకంలోకి వచ్చాడు సదాశివం. "నువ్వు తీయి ముందు, అవును... ఈ చీకట్లో సరిగ్గా వస్తాయా?"

"ఫ్లాష్ ఉంది సారూ, వస్తాయి" అంటూ ఫోటోలు తియ్యటం మొదలుపెట్టాడు. సదాశివం పక్కకు జరిగాడు. ఒక్కొక్క ఫోటోకి సుబ్బలక్ష్మి మీద ఫ్లాష్ పడుతుంటే ఒళ్లంతా కళ్లు చేసుకుని చూశాడు.

"సామి, ఇలా కాదుకానీ, ఈ చీకట్లో ఫోటోలు తియ్యొద్దు, ఎలా వస్తాయో ఏమో.. రేపొద్దున వద్దాం పద" అంటూ సామిని పక్కకు జరిపాడు.

షణ్ముగవడివు వైపు తిరిగి "ఏవండీ! పత్రికలో ఫోటోలు బాగుండాలి. రేపు పొద్దున్నే వచ్చేస్తాం. సరేనా.. తయారయి ఉండండి" అంటూ బయటకు బయలుదేరాడు. గబుక్కున వెనక్కి తిరిగి, "మర్చిపోయా, మా యజమానికి అనుమానమొస్తుంది. మీ అమ్మాయి పూర్తి పేరు చెప్పండి."

"మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి" చెప్పింది షణ్ముగవడివు.

'దాసీలే, అనుమానం లేదు' అనుకున్నాడు సదాశివం.

"వయసు?"

"1916లో పుట్టింది, భాద్రపదం 16 న."

'అంటే దగ్గరదగ్గర ఇరవైఏళ్లు' తనలో తాను అనుకున్నాడు. పైకి, "ఇప్పటికివి చాల్లెండి. రేపు త్వరగా వస్తాను" అంటూ సెలవు తీసుకున్నాడు. బయటికి వచ్చి బజారులో నడవడం మొదలుపెట్టాడు.

"సారూ! మన సైకిళ్లు ఇటు ఉన్నాయి మీరు అటు వెళ్లిపోయారు" అంటూ ఆమడ దూరం నుంచి సామి కేకవేస్తే, అటువైపు నడుచుకుంటూ వచ్చాడు. మనసు మనసులో లేదు సదాశివానికి.

సైకిల్ స్టాండు తీసి నడిపిస్తున్నాడు. పక్కనే సామి కూడా నడిపించుకుంటూ వస్తున్నాడు. "సారూ! రేపు మనము ఎలా వస్తాము... ఆఫీస్‌కెళ్లింతర్వాత వాసన్ ఈ పనిమీద మళ్లీ పంపించడు, ఫోటోలు బాగానే వస్తాయండీ."

"సామీ! నువ్వు ఆ అమ్మాయి మొహంలో ఏముందో గమనించావా?"

"గమనించాను సారు. రెండు పెద్ద ముక్కుపుడకలు."

"అబ్బా అవికాదు సామీ.."

"ఆ... సారూ! ఫ్లాషులో చూశా, ఆ అమ్మాయి మొహం మీద ఒక మొటిమ కూడా ఉంది సారూ.. అది రేపటికి పోయిద్దంటారా?"

నిట్టూర్చాడు సదాశివం. సందిగ్ధావస్థలో ఉన్నాడు సదాశివం.

"చూద్దాం సామీ, రేపు నువ్వు ఆరుగంటలకే ఇంటినుంచి బయలుదేరు. తెల్లవారటంతోనే ఇద్దరం ఇక్కడ పని చూసుకుని ఆఫీస్‌కి వెళ్దాం. ఇంద ఈ





మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి

రెండురూపాయలు ఉంచుకో. హోటల్లో టిఫిన్‌చేయి, డబ్బు సరిపోకపోతే చెప్పు. ఇంక వాసన్‌కి తెలిసేదేముంది?"

"అలాగే సారూ. మీరు చెప్పినట్లే చేస్తా" అంటూ నాణ్యాలను చూసి సంబరపడిపోతూ జేబులో వేసుకున్నాడు.

ఇద్దరూ ఇప్పుడు సైకిళ్లు ఎక్కారు. సామి రయ్యంటూ వెళ్లిపోయాడు. సదాశివం తొక్కలేక తొక్కుతున్నాడు. కాస్త దూరం వెళ్లి దిగి నడిపిస్తున్నాడు.

ఆ తెల్లారి తొలి కోడి కూతకే లేచి కూర్చున్నాడు. వెంటనే తయారయి పొద్దుకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. పొద్దు పొడవగానే సైకిలు మీదే అయినా ఆఘమేఘాలమీద వచ్చేశాడు.

షణ్ముగవడివు ఇంటి తలుపు తట్టాడు. షణ్ముగవడివు తలుపు తీసేసరికి తొలి కిరణాలతోపాటు సదాశివం చూపులు కూడా లోపలికి చొచ్చుకువచ్చి సుబ్బలక్ష్మికోసం వెతికాయి.

"అప్పుడే వచ్చేశారా, కాసేపాగండి. అమ్మాయి తయారవుతుంది" అని తలుపు దగ్గరకేసి లోపలికి వెళ్లింది షణ్ముగవడివు.

ఈలోపల సామి కూడా చేరుకున్నాడు. కాసేపు తర్వాత షణ్ముగవడివు తలుపు తీసింది. సదాశివం సుబ్బలక్ష్మివైపు చూశాడు. నమస్కారం చెప్పింది. ప్రతినమస్కారం చెప్పాడు రెప్పవాల్చకుండా. అందరూ కూర్చున్నారు.

సుబ్బలక్ష్మి నిన్నటిలాగా చాపమీద కూర్చుంది. అప్పుడే స్నానం చేసి వచ్చింది. ఇస్త్రీ చీర కట్టుకుంది. తలస్నానం చేసిందిలాగుంది. సదాశివం ఏదో ఒకటి మాట్లాడుతున్నా చూపంతా సుబ్బలక్ష్మివైపే ఉంది. "సామి! ఇక నువ్వు చక్కగా ఫోటోలు తియ్యి, పది తియ్యి. బాగా రావాలి, బయటికెళ్లి కూడా తీసుకుందాం" తను ఇంకా సుబ్బలక్ష్మిని చూసేందుకు వ్యవధి తీసుకుంటున్నాడు. ఫోటోలు తియ్యటం అయ్యింది. ఆడవాళ్లను లోపలికి పంపి, సామిని తీసుకొని బయటికి వచ్చాడు. "సామి, నాకు ఈ ఫోటోలు ఎంత లేదన్నా సాయంత్రంవరకల్లా రావాలి, సరేనా."

"వస్తాయి సారూ.. మీరు కావాలంటే ఎందుకు రావు" అంటూ సదాశివం జేబువైపు చూశాడు. వెంటనే సదాశివం జేబులోంచి రెండురూపాయలకు సరిపడా నాణ్యాలు తీసిచ్చి, "సామి! నువ్వు వెళ్లి ఈ పనిమీద ఉండు. నేను ఇంటర్వ్యూ తీసుకొని వస్తా" అంటూ లోపలికి వెళ్లబోతూ ఆగి, "సామి! ఆ అమ్మాయి మొహంలో నీకేమన్నా కనిపించిందా?"



"సారూ, మీరు చాలా గొప్పవారు. నిన్నటి మొహం ఈ రోజు లేదు సారూ" అన్నాడు సామి. సదాశివం నిన్నటికంటే బాధగా నిట్టూర్చి లోపలికి వెళ్లాడు.

స్వామి కార్యం స్వకార్యం కలిసివచ్చేటట్టు తల్లీకూతుళ్ల వివరాలన్నీ లాక్కొని ఆఫీసుకు చేరాడు. సాయంత్రానికల్లా ఫోటోలు తీసుకొని పురసవాక్కంలో ప్రత్యక్షమయ్యాడు. ఆ తర్వాత వారానికి, సుబ్బలక్ష్మిమీద వచ్చిన కథనం చూపించటానికి 'ఆనంద వికటన్' పత్రికలతో వెళ్లాడు.

"చక్కగా దగ్గరుండి చేయించాను అంతా. కథనం లక్షలమంది చూస్తారు. ఇంక చూడండీ మీ అమ్మాయికి అవకాశాలు ఎలా వస్తాయో" అన్నాడు.

"అవకాశాలు పర్వాలేదు నాయనా, బాగానే వస్తున్నాయి. ఆ మ్యూజిక్ అకాడమీవాళ్లే పోయినసారి అవకాశం ఇవ్వలేదు" అంది షణ్ముగవడివు.

"మీకు మ్యూజిక్ అకాడమీలో అవకాశం కావాలి అంతే కదా? ఇక మీకు వచ్చేసినట్లే. దాని సంగతి నేను చూస్తాను. మీరు మర్చిపోండి" వెంటనే మాట ఇచ్చేశాడు సదాశివం.

"ఎలా.. ఎలా చేయగలుగుతావు.. దాంట్లో అంతా పెద్దపెద్దవాళ్లయితే.." నువ్వు ఒక గుమస్తావే కదా అన్నట్లు మాట్లాడింది షణ్ముగవడివు.

"నేను కాంగ్రెస్‌వాదిని. మద్రాసులో ఉన్న పెద్దపెద్ద నాయకులంతా నాకు తెలుసు. రాజగోపాలాచారిగారు చాలా బాగా తెలుసు. ఎక్కడ తెల్లవాళ్లకు వ్యతిరేకంగా ఉద్యమం చేయాలంటే అక్కడ ముందు నన్ను ఉంచుతారు. ఉప్పు సత్యాగ్రహంలోనైతే తెల్లవాళ్ల గుండెల్లో రైళ్లు పరిగెత్తిచ్చాను" అంటూ అవకాశం వచ్చిందికదాని తన గురించి చెప్పుకుంటూ పోతున్నాడు.

"నేను రెండుసార్లు కఠిన కారాగారశిక్ష అనుభవించాను. దేశభక్తి గీతాలు పాడుతూ ఊరూరా తిరిగి ప్రజల్ని తెల్లవాళ్లకి వ్యతిరేకంగా ఉసిగొల్పాను. అప్పట్లో నేను మీ మదురై కూడా వచ్చాను."

సదాశివం దేశభక్తి మాట అటుంచితే షణ్ముగవడివు అర్థం చేసుకుంది మాత్రం 'వీడు దేశదిమ్మరి' అని.

"మీరు చూస్తూ ఉండండి నేను మీ అమ్మాయికి పాడే అవకాశం తీసుకొస్తాను" అంటూ ఆ రోజుకి కదిలాడు సుబ్బలక్ష్మి ఇంటినుంచి. 'ఆనంద వికటన్'లో కథనం కోసం వచ్చాడు సుబ్బలక్ష్మి దగ్గరికి, ఆ పని పూర్తయింది, ఆ కథనం అచ్చుకూడా అయింది. కానీ సదాశివం పురసవాక్కం పచార్లు మాత్రం ఆగలేదు. 'ఆనంద వికటన్'లో బాగా శ్రద్ధతో కథనం చేశాడు. ఇప్పుడు అవకాశం గురించి భరోసా ఇస్తున్నాడు. అందుకని

ఆ ఇంటి తలుపులు సదాశివానికి ఎప్పుడూ తెరవబడుతున్నాయి. షణ్ముగవడివు ఆప్యాయంగా మాట్లాడటానికైనా, సుబ్బలక్ష్మి ఎప్పుడూ మనసారా నవ్వుతూ ఆహ్వానించినా, ఇప్పటికి ఇవే కారణాలు. కానీ సదాశివం కారణాలు వేరే. ఇద్దరు ఒంటరి ఆడవాళ్లను ఉద్ధరించాలనుకోలేదు. సుబ్బలక్ష్మి అతన్ని వివశుడిని చేసి ఆకర్షిస్తోంది. అప్పటికి సుబ్బలక్ష్మికి ఇరవై ఏళ్లు, అతనికి ముప్పైనాలుగు.

పురసవాక్కం దారిపట్టి దాదాపు నెల కావొస్తుంది. మొదట్లో దరిచేరిన సందిగ్ధావస్థను దాటేసుకొచ్చాడు ఇప్పటికల్లా. ఏమాత్రం తీరిక దొరికినా సుబ్బలక్ష్మి ఇంటికే. కానీ ఎప్పుడూ ఒట్టి మాటలతో వెళ్లడు. సుబ్బలక్ష్మి విషయం అనే కాదు, ఒట్టి మాటలు అతని నైజం కూడా కాదు. సుబ్బలక్ష్మి ఇంట్లో ఇంకాస్త పాతుకుపోవటానికి వెంటనే ఇంకో అవకాశం వచ్చింది సదాశివానికి.

"షణ్ముగంగారూ, మ్యూజిక్ అకాడమీకి మీ అమ్మాయి పనిమీద వెళ్లానా, అక్కడ నాకు తెలిసిందేమిటంటే గాంధీగారు ఉత్తరాదిన మొదలుపెట్టిన ఖాదీ ఎగ్జిబిషన్ మన మద్రాసులో కూడా వారంపాటు జరగబోతుంది. అదికూడా కచేరీలు జరిగే సమయానికే. ఈ ఖాదీ ప్రదర్శనలు జరిగే రోజులన్నీ, సాంస్కృతిక కార్యక్రమాలు జరిపి, జనాన్ని ఆకర్షించాలని తీర్మానించారు, ఈ సాంస్కృతిక కార్యక్రమాలన్నీ నిర్వహించే బాధ్యత మ్యూజిక్ అకాడమీకి ఇచ్చారు."

షణ్ముగవడివుకి అర్థమయిపోయింది, 'ఈసారి కచేరీల కాలంలో మ్యూజిక్ అకాడమీ రెండు కార్యక్రమాలు నిర్వహిస్తుంది. ఒకటి ఖాదీ ప్రదర్శనలో, రెండు మామూలుగానే నిర్వహించే కచేరీలు. మొదటిది సదాశివం చేతిలో పని. రెండోది కూడా చేసేస్తాడేమో, కాంగ్రెస్‌వాళ్లు అకాడమీవాళ్లు ఒకటవుతారు కనుక.'

"చాలా సంతోషం నాయనా, రెండింట్లో అవకాశం వచ్చేటట్లు చూడు" అంది షణ్ముగవడివు.

"మొదటిది ఖాయం. రెండోది కూడా సగం పని అయినట్లే."

"రేపు ఏమి పనులున్నాయి మీకు?" మాటల మధ్యలో అడిగాడు.

"రేపు ధనమ్మ ఇంటికి బెంగుళూరు నాగరత్నమ్మ తిరువయ్యూరు నుంచి వస్తుందట. అందుకని ధనమ్మ ఇంటికి వెళ్తాం" అంది షణ్ముగవడివు.

"జార్జ్ టౌనులోకదా, నేను వచ్చి తీసుకెళ్తాను మిమ్మల్ని. నాకు ఈమధ్య ఆఫీస్‌వాళ్లు కారు ఇచ్చారు" అంటూ ఇంకోరోజు సుబ్బలక్ష్మిని కలిసే అవకాశం అందిపుచ్చుకున్నాడు. తీరిగ్గా ఇద్దరితో మాట్లాడుకొని, ఇద్దరికీ ఇంకా దగ్గరయి తిరుగుముఖం



పట్టాడు. తరువాతి రోజు ఇద్దరినీ ధనమ్మ ఇంటికి తీసుకెళ్లి తీసుకొచ్చాడు. ఇంటికి రాగానే సుబ్బలక్ష్మి ఇంట్లో ఉన్న సంగీత పుస్తకాలు తెగ తిరగేస్తోంది, పేజీపేజీ తిప్పుతూ వెతికేస్తోంది.

"కుంజమ్మా! ఏంటీ వెతుకుతున్నావు?"

ఇలా అంది షణ్ముగవడివు కాదు, వాళ్లతోపాటే లోపలికి వచ్చిన సదాశివం. కుంజమ్మ వినిపించుకోలేదు. షణ్ముగవడివు వింది. తన కూతురుని ఇంట్లోవాళ్లు, బాగా తెలిసినవాళ్లు పిలిచే ముద్దుపేరుతో పిలిచాడు. కాస్త అర్థమయినట్లు ఉంది పరిస్థితి షణ్ముగవడివుకి.

"కుంజా! ఏమి వెతుకుతున్నావమ్మా?" అడిగింది కూతుర్ని.

"అయ్యవారి కీర్తనల పుస్తకం ఏదమ్మా?"

"ఇక్కడ లేకపోతే మన ఊళ్లో ఉంటుంది. ఎందుకది ఇప్పుడు?"

"ధనమ్మ ఇంట్లో బెంగుళూరు నాగరత్నమ్మ నేను తప్పు పాడానంది."

"ఏ పాట" షణ్ముగవడివు, సదాశివం ఇద్దరూ ఒకేసారి అడిగారు.

'ఎవ్వరిమాట' అదే కాదు, చాలా కృతుల్లో తప్పు పాడానని చెప్పింది."

"లేకపోతే చెప్పు కుంజమ్మ, నేను తీసుకువస్తాను" మళ్లీ సుబ్బలక్ష్మితో 'కుంజమ్మ' అని మాట కలిపాడు సదాశివం.

"లేదండీ."

"లేవులే బాబు, మా ఊరిలోనే వదిలేసి వచ్చుంటాము" అంది షణ్ముగవడివు.

"నేను తీసుకువస్తాను రేపు. మరి వెళ్లి రానా కుంజమ్మా" అంటూ సుబ్బలక్ష్మి దగ్గర సెలవు తీసుకొని ఆ రోజుకు వెళ్లాడు.

"కృష్ణమూర్తి! త్యాగరాజస్వామి కృతుల పుస్తకాలు మన దగ్గర ఎన్ని ఉంటే అన్నీ బయటకు తీయించు, అత్యవసరంగా కావాలి" అంటూ ఆనంద వికటన్ ఆఫీసుకి వచ్చీరాగానే కృష్ణమూర్తిని తొందరపెట్టాడు.

"ఎందుకు" నింపాదిగా అడిగాడు కృష్ణమూర్తి.

"ఆ కచేరీలు చేసే అమ్మాయికి ఇవ్వాలి, అదే నువ్వు బాలా ఇంట్లో చూసిన అమ్మాయికి"

"ఆ అమ్మాయితో కథనం చేసింది జూన్‌లో. ఇప్పుడు అక్టోబరు. అంటే నాలుగు నెలలయింది. నువ్వు ఇంకా ఆ అమ్మాయి దగ్గరకి ఎందుకు వెళ్తున్నావు?"

కృష్ణమూర్తి పక్క కుర్చీలో కూర్చొని "చెప్తాగానీ ముందు ఇది చెప్పు కృష్ణమూర్తీ, ఆ అమ్మాయి మొహంలో ఏంటో ఉంది.. ఏమై ఉంటుందది?" అన్నాడు సదాశివం.

"నిజమే, ఉంది" తన పని చేసుకుంటూనే చెప్పాడు కృష్ణమూర్తి.

"ఏంటది?" వెంటనే కృష్ణమూర్తికి ఇంకా దగ్గరిగా జరిగి అడిగాడు.

"నీకు లేనిది"

"ఏంటది" ఇంకా ఆత్రంగా అడిగాడు సదాశివం.

కృష్ణమూర్తి సదాశివం వైపు తిరిగి, సదాశివం మొహంలోకి చూస్తూ చెప్పాడు "శాంతం".

సుబ్బలక్ష్మి మొహం గుర్తుచేసుకుంటూ "కావచ్చు" సాలోచనగా అన్నాడు సదాశివం. వెంటనే మళ్లీ, "మరి కృష్ణమూర్తి ఆ అమ్మాయి కళ్లు..." అంటూండగానే కృష్ణమూర్తి వాసన్ గదిలోకి వెళ్లాడు. అక్కడనుంచి వచ్చేదాకా ఎదురుచూస్తూ కూర్చున్నాడు సదాశివం. రాగానే మళ్లీ అదే విషయం లేవనెత్తాడు "కృష్ణమూర్తి, కుంజమ్మ కళ్లు కూడా ఏదో చెప్తూ ఉంటాయి కృష్ణమూర్తీ" అర్థంకానట్లు చూశాడు కృష్ణమూర్తి. ఇందాక 'ఆ అమ్మాయి' గురించి చెప్తున్నాడు, ఇప్పుడు 'కుంజమ్మ' గురించి చెప్తున్నాడు. అంతలోనే గుర్తొచ్చింది కృష్ణమూర్తికి, 'కుంజమ్మ' 'కుంజా' అని సుబ్బలక్ష్మిని బాలసరస్వతి ఇంట్లోవాళ్లు పిలుస్తారు. బాగా తెలుసున్నవాళ్లు పిలుస్తారలాగా. 'ఇతను కూడా పిలుస్తున్నాడేంటీ.. ఏంటో కథ' అని మనసులో అనుకుంటున్నాడు.

"కృష్ణమూర్తీ చెప్పు, కుంజమ్మ కళ్లు ఏంచెప్తున్నాయి?"

"ఆ అమ్మాయి కళ్లు ఏం చెప్తున్నాయో తెలుసుకునేంతగా నేను ఆ అమ్మాయి కళ్లల్లో కళ్లుపెట్టి చూడలేదులే" అంటూ త్యాగరాజ కృతుల పుస్తకాలు సదాశివం ముందు పెట్టి తన పనిలోకి వెళ్లిపోయాడు.

సాయంత్రం ఆఫీసువేళలు అయ్యీ అవ్వగానే పుస్తకాలు, ఒక సంగీత గురువు గారితో సహా సుబ్బలక్ష్మి ఇంట్లో ప్రత్యక్షమయ్యాడు.

"శాస్త్రిగారూ! బెంగుళూరు నాగరత్నమ్మగారు మా కుంజమ్మ త్యాగరాజ కృతుల్లో తప్పులున్నాయని అన్నారంట. మీరొకసారి విని, చూడండి."

"ఆమె ముందు కచేరీ చేశావామ్మా?" అడిగారు శాస్త్రి.



"లేదండీ, మా అమ్మాయి ప్లేటులు విన్నారంట" చెప్పింది షణ్ముగవడివు.

"అయితే ఆ ప్లేటులో పాడిన పాటలు పాడు."

సుబ్బలక్ష్మి ముందు 'ఎవ్వరిమాట విన్నావో' మొదలుపెట్టింది. పల్లవి, అనుపల్లవి, చరణం బాగానే పాడింది. ఇక అయిపోతుంది కృతి అనగా, చరణం చివరిలోనుండగా, శాస్త్రిగారు కళ్లు, మొహం చిట్లించి, చేతి సైగతోనే తర్వాత పాటకి వెళ్లమన్నారు. 'విడజాలదురా నా మనసు వినరా' పాట ఎత్తుకుంది. ఈ పాటకి అంతే, మొహం చిట్లించి, కళ్లు మూసి, తర్వాత పాటకెళ్లమని సైగ చేశారు. 'పరలోక భయం లేక' పాట పాడింది. ఈ పాట మధ్యలోనే మొహం చిట్లించి, కళ్లతో పాటు చెవులు కూడా మూసుకున్నారు. శాస్త్రిగారు కిందపెట్టిన పైపంచ భుజంపై వేసుకొని, తలపాగా పెట్టుకొని, చేతికర్ర తీసుకొని బయటికి వస్తూ "బెంగుళూరు నాగరత్నమ్మ తప్పు చెప్పినట్లు తీసుకొచ్చావే నన్ను. ఆమె మాతృభాష కన్నడం అయినా, తెలుగంటే మహా ప్రీతి. త్యాగరాజ కృతులు తప్పులు పాడితే ఆమె ఊరుకుంటుందా, నేను ఊరుకుంటానా... రేపు కచేరీలల్లో వినేవాళ్లు ఊరుకుంటారా.. చెవులు మూసుకుంటారు.. బయటేమో అబ్బో! 'ఎవ్వరిమాట సుబ్బలక్ష్మి' వింటేనేమో పాటకి పది దోషాలు, ఎంత ఆర్తితో రాశాడు త్యాగరాజస్వామి. ఇలా ఇష్టమొచ్చినట్టు పాడమనా? ఈ లోకంలో భయం లేకపోయినా, పరలోక భయం ఉంచుకోమను, అక్కడ త్యాగరాజస్వామి చెవులు పిండుతాడు." గట్టిగా తిడుతూ ఇంటి బయటికి వచ్చేశాడు.

తల్లీ కూతుళ్లకు ఏడుపే తక్కువ. సదాశివం శాస్త్రిగారిని ఎందుకు తీసుకొచ్చానురా బాబో అనుకుంటున్నాడు. తల్లీకూతుళ్లు ఎలా ఉన్నారో అనుకుంటూ మళ్లీ ఇంట్లోకి వచ్చాడు. ఇద్దరూ బాధగా ఉన్నారు. 'హమ్మయ్య, శాస్త్రిగారు చెప్పింది వీళ్లు బాగానే గ్రహించారు. కోపం తెచ్చుకోకుండా' అనుకొని, "కుంజా, నువ్వు బాధపడకు. నేను నీకు మంచి గురువుని తీసుకొచ్చి నేర్పిస్తాను" అన్నాడు.

తల్లీకూతుళ్లకు ఈ మాటలు సాంత్వాన్ని ఇచ్చాయి, కాస్త ఊపిరి పీల్చుకున్నారు. కుంజమ్మ ముద్దుపేరుని, 'కుంజా' అని ఇంకా ముద్దు చేశాడు సదాశివం.

"ఏమయ్యా సదాశివం నన్ను ఎక్కడ నుంచి తెచ్చావో అక్కడ దించుతావా" బయట నుంచి కేకేశారు శాస్త్రి. "ఆయన్ను దించి వస్తా కుంజా" అంటూ బయటికి వచ్చి కారెక్కాడు. సదాశివం కారు ఎక్కాడో లేదో ఇవతలి తలుపు తెరుచుకొని శాస్త్రిగారు కారులోంచి బయటకు వచ్చి మళ్లీ సుబ్బలక్ష్మి ఇంటివైపు పరుగెత్తుతున్నారు. "శాస్త్రిగారు, ఏమైంది" అంటూ వెనకాలే పరిగెత్తుకుంటూ వెళ్లి శాస్త్రిగారు తలుపు తీసే లోపల తలుపుకి శాస్త్రిగారికి అడ్డంగా నిలబడి, "శాస్త్రిగారు, ఏంటీ మళ్లీ వచ్చారు?" అని అడిగాడు రొప్పుతూ.

"ఇంకో విషయం చెప్పాలయ్యా వీళ్లకి.. పాటని ఇష్టమొచ్చిన దగ్గర తెంచుతుంది ఆ పిల్ల. ఇష్టం వచ్చినప్పుడు ఆపి, సాహిత్యాన్ని విరగ్గొట్టి, అర్థం పాడుచేసి, పక్క వాద్యగాడిని వాయించుకోమని ఆపుతుంది. పనికిమాలిన పక్కవాద్యగాళ్లను పెట్టుకుంటే ఇలానే ఉంటుంది. వాళ్లయినా చెప్పొద్దా అలా చేయకూడదని..."

"నేను చెప్తాను మీరు చెప్పారని. పద్ధతి మార్చుకొమ్మని రేపు గట్టిగా చెప్తా. మిమ్మల్ని దింపుతాను పదండి" అంటూ అతి కష్టం మీద తీసుకెళ్లాడు శాస్త్రిగారిని. తలుపు వెనకనుంచి తల్లీకూతుళ్లు ఈ పర్యాయం తిట్లు కూడా విన్నారు.

ఆ తరువాత రోజు సాయంత్రం ఠంచనుగా వచ్చాడు సదాశివం సుబ్బలక్ష్మి ఇంటికి.

"మీరేమీ అనుకోకండి శాస్త్రిగారి మాటలకి, పాతకాలం మనిషి" షణ్ముగవడివుతో అన్నాడు.

"ఏముందిలే బాబూ అనుకోవటానికీ, ఆయన చెప్పిన తప్పులు దిద్దుకొంటే సరి."

షణ్ముగవడివు సంగీతంలో సాహిత్యం విలువ తెలిసిన మనిషి కాబట్టి నిన్నటి ఆ తిట్లని విలువైన సూచనల్లాగా తీసుకుంది.

"షణ్ముగంగారూ! ఖాదీ ఎగ్జిబిషన్‌లో దేశభక్తి పాటలు పాడితేనే మంచిది. కీర్తనలు పాడకపోయినా ఫర్వాలేదు. నేను కుంజాకి సుబ్రహ్మణ్య భారతి దేశభక్తి పాటలు, తెలుగులో ఒక మంచి దేశభక్తి పాట నేర్పుతాను."

"అవును, నిజమేబాబూ... నేర్పు" అంది షణ్ముగవడివు. ఇంకో రెండు నెలల వరకూ పురసవాక్కం వాకిలి సదాశివాన్ని సాదరంగా ఆహ్వానిస్తుంది. వెంటనే పాఠాలు మొదలుపెట్టాడు.

పదిరోజుల్నుంచి, రోజూ సాయంత్రాలు వచ్చి నేర్పిస్తున్నాడు. స్వాతంత్ర్య సమరంలో క్రియాశీలక పాత్రపోషిస్తున్నాడు కాబట్టి సదాశివం దేశభక్తి పాటలు వింటుంటే ఒడలు పులకిరిస్తున్నాయి నేర్చుకుంటున్న సుబ్బలక్ష్మికి, వింటున్న షణ్ముగవడివుకి, అంతగా భావంతో మమేకమయి పాడుతాడు సదాశివం.

నాలుగు రోజుల తర్వాత, "కుంజా, ఈరోజునుంచి, మనం తెలుగు పాట మొదలుపెడదాం పద" అని చెప్పి, 'మాకొద్దు ఈ తెల్లదొరతనము' పాట అంతా ముందు రాసి ఇచ్చాడు సదాశివం. "కుంజా, నాకు జైలులో ఉన్నప్పుడు ఈ పాట రాసినతను గరిమెళ్ల సత్యనారాయణగారనే ఆయన నేర్పాడు. ఆ తర్వాత నేను ఈ పాట పాడుతుంటే నేను తెలుగువాడిననే అనుకునేవారు. నువ్వు కూడా అంత చక్కగా నేర్చుకో."

"అలాగేనండీ" అంది ఎప్పటిలా అణకువగా సుబ్బలక్ష్మి.

తరువాతి రోజు సాయంత్రం తెలుగు పాట నేర్పటానికి వచ్చేశాడు సదాశివం.



"రా బాబు, కూర్చో" ఆహ్వానించింది షణ్ముగవడివు. సుబ్బలక్ష్మి కనిపించకపోయేసరికి ఇల్లంతా వెతుకుతున్నాడు సుబ్బలక్ష్మికోసం.

"కుంజా లేదా?"

"లేదు బాబు, బాలా వచ్చి తీసుకెళ్లింది. బొంబాయిలో సంగీత సభలున్నాయంట. దాని తాలూకూ మనిషి బొంబాయి నుంచి వచ్చాడు, కలవటానికి వెళ్లింది."

"నేను మన కారులో తీసుకెళ్లేవాడిని కదా."

"బాలా షణ్ముఖంగారి కారులో వచ్చి తీసుకువెళ్లింది."

"నువ్వు కూర్చో బాబు, వస్తుంది."

సదాశివం కాసేపు ఇంట్లో, తర్వాత ఇంటి బయట, ఆ తర్వాత బజారులో ఇలా చీకటి పడే దాకా ఎదురు చూస్తూనే ఉన్నాడు.

"బాగా చీకటిపడింది. మరి ఇంటికి ఎలా వస్తుంది, కాసేపు నా కోసం ఆగి ఉంటే నేను తీసుకెళ్లి ఇంటికి తీసుకొచ్చి దిగబెట్టేవాడినికదా" చాలా ఆదుర్దా పడుతూ చెప్పాడు సదాశివం.

"అది మధ్యాహ్నమే వెళ్లింది. బాలా మళ్లీ తీసుకొచ్చి దింపుతానంది. కుంజాని ఒక్కదాన్నే వదిలేయదు. కుంజాకి ఏమీ తెలియదని బాలాకి తెలుసు."

మళ్లీ ఇంటి బయట, బజారులో పచార్లు కొడుతూ ఇంకాసేపు ఎదురు చూశాడు. చివరికి ఇంట్లోకి వచ్చి, "నేను వెళతానండీ ఇక, ఈ రోజు ఎంత ఆలస్యమయినా పాఠాలు చెప్పే వెళ్లేవాడిని కాని, ఇంకొకరికి వస్తానని చెప్పాను, వాళ్లు ఎదురుచూస్తూ ఉంటారు నా కోసం."

"అలాగే బాబూ, చాలాసేపు చూశావు. అది వస్తుందో ఈ రాత్రి బాలా ఇంట్లోనే ఉంటుందో.." అంది షణ్ముగవడివు. నిరాశతో వెళ్తున్న సదాశివాన్ని చూస్తూ తలుపు వేసుకొని లోపలికి వెళ్లిన తర్వాత, 'తోటకూర కట్టలాగా అలా వాలిపోయాడేంటి? పాఠాలు కాలేదనా? కచేరీ రోజులు దగ్గరపడుతున్నాయనా? లేకపోతే ఎదురుచూసి ఎదురుచూసి నీరసం వచ్చిందా, లేకపోతే.......' ఒక్కసారి గుండె లయతప్పింది షణ్ముగవడివుకి.

𝄞 𝄞

"అమ్మా! నేను సర్దుకుంటూ ఉంటాను కాని, నువ్వెళ్లి, వయోలిన్ మాస్టారు గురించి కనుక్కొని రామ్మా" చాలా ఆదుర్దాగా చెప్పింది సుబ్బలక్ష్మి.

బొంబాయిలో సంగీత సమారోహాలు జరుగుతున్నాయి. ఆ మధ్య బొంబాయి నుంచి

ఒక నిర్వాహకుడు మద్రాసుకు వచ్చి మరీ కచేరీలు కుదుర్చుకు వెళ్లాడు. వాటిలో బాలా
నృత్యం, బృంద, ముక్త కచేరీతో పాటు సుబ్బలక్ష్మి కచేరీలు కూడా ఉన్నాయి. అన్ని
ప్రదర్శనల తేదీలు. వేళలు తెలుపుతూ కరపత్రం కూడా తయారుచేసి పంపారు.

ఈ రోజు బొంబాయికి బాల, ముక్త, బృంద, జయమ్మ ఇంకా చాలామంది పక్క
వాద్యకళాకారులతో రైలులో ప్రయాణం. సుబ్బలక్ష్మి వయోలిన్ మాస్టారు, బండి
మాట్లాడుకొని, ఇంటికి వచ్చి తనని కూడా తీసుకొని స్టేషన్ వెళ్లేటట్లు మాట్లాడుకున్నారు
అంతకు ముందు రోజు, కాని ఈ రోజు రైలు స్టేషన్‌కు వెళ్లే వేళ మించిపోతుంది. కానీ
మాస్టారు రాలేదు. పక్క వాద్యకళాకారులు లేకుండా వచ్చి అక్కడ నిర్వాహకులని ఇబ్బంది
పెట్టొద్దు అని ముందే గట్టిగా చెప్పాడు బొంబాయి నుంచి వచ్చిన మనిషి.

హడావుడిగా షణ్ముగవడివు వయోలిన్ మాస్టారు ఇంటికి వెళ్లింది. గంట తర్వాత
తిరిగి వచ్చి ఇల్లు తాళం వేసి ఉందని చెప్పింది. ఇక చేసేదేమీ లేక ఎదురుచూస్తూ
కూర్చున్నారు వాకిలిదగ్గర. ఇంక రైలువేళ దాటిన తర్వాత ఈడ్చుకుంటూ లోపలికి
వచ్చారు. బొంబాయిలో లేకలేక వచ్చిన అవకాశం. కాసేపటి తర్వాత, ధనమ్మ కూతురు
కామాక్షమ్మ వచ్చింది.

"ఏంటి కుంజా, నువ్వు రాలేదే బండెక్కటానికి, అందరూ ఎంతగా చూశారు నీకోసం?"

"దీని వయోలిన్ మాస్టారు రాలేదు కామాక్షి" నీరసంగా చెప్పింది షణ్ముగవడివు.

"అయితే ఏమయింది, ముందు కుంజా వెళితే ఎవరినో ఒకళ్లని సర్దుబాటు చేసేవాళ్లం,
లేకపోతే ఆ మాస్టారే రేపటి బండి ఎక్కేవాడు."

"ఆ పనిచేయాల్సింది కామాక్షీ. కానీ నేను మాస్టారు కోసం ఆయన ఇంటికి వెళ్లాను.
ఇక్కడ కుంజా ఒక్కటే ఉండిపోయింది."

"సరే, రేపు ఎట్టి పరిస్థితిలోనైనా, ఆ మాస్టారు వచ్చినా, రాకపోయినా కుంజాని
రేపటి బండి ఎక్కించు. లేకపోతే అక్కడ మాట పోతుంది" అని చెప్పి బృంద, ముక్త తల్లి
అయిన కామాక్షి వెళ్లిపోయింది.

తరువాతి రోజు ప్రొద్దున్నే మళ్లీ వయోలిన్ మాస్టారు ఇంటికి వెళ్లివచ్చారు. ఇంటికి తాళమేసి ఉంది. పక్క ఇంటివాళ్లు ఊరెళ్లారని చెప్పారు. ఇంటికి వచ్చారు. తలపట్టుకు కూర్చున్నారు. 'బొంబాయి ఎలాగయినా సరే వెళ్లాలి. లేకపోతే అక్కడివాళ్లకు బృంద, ముక్తనే మద్రాసులో పాడే అమ్మాయిలు అనుకుంటారు. కుంజా గురించి తెలియకుండా పోతుంది' అనుకుంటూ ఉంది షణ్ముగవడివు.

'ఆనంద వికటన్' ఆఫీసులో సదాశివం రెండు చేతులు, రెండు చెంపలమీద పెట్టుకొని ఉన్నాడు. "ఏంటీ సదాశివం అలా ఉన్నావు?" అడిగాడు కృష్ణమూర్తి. "పంటినొప్పి



కృష్ణమూర్తీ భరించలేకపోతున్నా. చాలా నొప్పి."

"అయితే, పంటి డాక్టర్ దగ్గరికి వెళ్లు."

"వద్దులే, పంటికింద లవంగం పెట్టుకొని చూస్తా."

"పంటి డాక్టరు మంచతను, పురసవాక్కంలో."

పురసవాక్కం పేరు వినగానే, ఒక దవడమీద చెయ్యి తీసేశాడు. "సరే కృష్ణమూర్తి
వెళ్లొస్తాను" అంటూ బయటికి పరిగెత్తాడు. డాక్టరు దగ్గరకు వెళ్లకుండానే ముందు
సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చాడు. తల్లీకూతుళ్లు ఇద్దరూ దిగాలుగా కూర్చుంటే దవడ మీద
ఒక చేయి పెట్టుకుని, కష్టపడి అడిగాడు. "ఏమైంది?" అంతా చెప్పుకొచ్చింది షణ్ముగవడివు.
"ఎట్లాగయినా ఈ సాయంత్రం బండికి బొంబాయి వెళ్లాలి బాబూ. ఆ మాస్టారు అంతులేడు.
ఇప్పుడు దీన్ని ఎవరు తీసుకెళ్తారు? అక్కడంతా ఖరారు అయిపోయింది, ఒక కళాకారిణి
మాట ఇచ్చి తప్పిందంటే, ఎంత తలవంపు?" ముగించింది షణ్ముగవడివు.

సదాశివం వెంటనే దవడమీద చెయ్యి తీసేశాడు. ఇప్పుడు ఏ నొప్పి తెలియటంలేదు. మొహం వెలిగిపోతుంది. వెంటనే అవకాశం దొరకబుచ్చుకున్నాడు. "షణ్ముగంగారూ! నేను తీసుకువెళ్తాను కుంజాని బొంబాయి."

"నువ్వా బాబూ?"

"మీరేమి భయపడకండి, నేను తీసుకెళ్లి బాలా దగ్గర దింపి, ఇంకో వయోలిన్ మాస్టారు దొరికేదాకా అక్కడే ఉండి, కుంజాని జాగ్రత్తగా తీసుకొస్తా" భరోసా ఇచ్చాడు సదాశివం.

తనకి కావలసిన అన్ని భరోసాలూ ఇచ్చాడు సదాశివం. బాలా దగ్గర దించుతానన్నాడు, వయోలిన్ మాస్టారుని వెతికి పట్టుకొస్తానన్నాడు. జాగ్రత్తగా తీసుకొస్తానన్నాడు. ఇంక ఆలోచించటానికి ఏమీ లేవు.

"సరే కుంజా, నువ్వు ఇక సదాశివం మామతో బయలుదేరమ్మా."

'మామా'.. సుబ్బలక్ష్మి, సదాశివం ఇద్దరూ షణ్ముగవడివువైపు చూశారు.

'మామ' అని పిలవమని చెప్పడంలో, 'కర్ర విరక్కూడదు, పాము చావకూడదు' అన్న చందాన ఉభయ తారక మంత్రం జపించింది షణ్ముగవడివు.

'నువ్వు నా తమ్ముడివి, అది నీ అక్క కూతురు. జాగ్రత్తగా తీసుకువెళ్లి, జాగ్రత్తగా తీసుకురా' అని, పైగా నర్మగర్భంగా ఒక తాయిలం వేసింది, 'నా తమ్ముడిగా నీకు నా కూతురిని చేసుకునే అర్హత ఉంది. కానీ ఆ సంగతి తర్వాత చూసుకుందాం' అని.

ఆ నిగూఢ అర్థాన్ని, తక్షణ కర్తవ్యాన్ని వెంటనే గ్రహించాడు సదాశివం. సుబ్బలక్ష్మి వయోలిన్ మాస్టారు ఏ క్షణానైనా ఊడిపడి, చిక్కిన అవకాశాన్ని చేజారుస్తాడోననుకుంటూ

బయలుదేరాడు సదాశివం.

వెంటనే సుబ్బులక్ష్మిని తీసుకొని బయలుదేరాడు సదాశివం.

బొంబాయిలో చాలా దగ్గర సుబ్బులక్ష్మిని వదిలి, ఊరంతా వాకబు చేసి, పరుర్ సుందరం అయ్యర్ అనే ఒక గొప్ప వయోలిన్ విద్వాంసుడి పెద్దకొడుకు అయిన పరుర్ అనంతరామన్ అయ్యరును వయోలిన్ వాయించటానికి ఏర్పాటు చేశాడు. కచేరీ చక్కగా పూర్తిచేయించి, వెనక్కి ప్రయాణమై జాగ్రత్తగా సుబ్బులక్ష్మిని ఇంటికి చేర్చాడు సదాశివం.

ఆరవరోజు కూతురుని చూసుకుంది షణ్ముగవడివు. "కుంజా! నా చిన్నిమారాణి వచ్చావమ్మా" అంటూ కావలించుకుంది. "ఎలా జరిగిందమ్మా కచేరీ? ఇంతకీ వయోలిన్ ఎవరు వాయించారు బాబూ?" అంటూ సదాశివంవైపు తిరిగింది.

"అంతా బాగా జరిగిందండీ. పరుర్ అనంతరామన్ అయ్యర్ అనీ.."

"పరుర్ సుందరంగారి అబ్బాయా?" అని షణ్ముగవడివునే అడిగింది.

"అవును. వాళ్ల అబ్బాయినే కుదిర్చా కుంజాకి."

"చాలా గొప్ప పనిచేశావు నాయనా."

సదాశివం ఇంటిదారి పట్టాడు. సుబ్బులక్ష్మి బొంబాయి ముచ్చట్లన్నీ అయిన తర్వాత సదాశివం ఇంటిదారి పట్టాడు. సుబ్బులక్ష్మి ఇల్లు దాటి బజారులోకి అడుగు పెట్టగానే రెండు చేతులు, "అబ్బా" అంటూ దవడల మీదకి వెళ్లిపోయాయి. ఇప్పుడు ఆరు రోజులు తర్వాత, మళ్లీ ఇప్పుడే పంటి నొప్పి మొదలయింది సదాశివానికి. సుబ్బులక్ష్మి పక్కనున్నంతసేపు ఎలాంటి నొప్పులూ లేవు. వెంటనే పురసవాక్కం పంటి డాక్టరు ఇంటిదోవ పట్టాడు.

❦❦❦❦

మద్రాసులో 1936వ సంవత్సరపు సంగీత సభల కాలం దగ్గరలోకి వచ్చింది. శక్తివేల్, మణి మద్రాసు చేరుకున్నారు. ఇప్పటికి దాదాపు పదిహేను సంగీత సభలున్నాయి మద్రాసులో. ఒక్కొక్క సభలో కచేరీ చేసుకుంటూ వస్తుంది సుబ్బులక్ష్మి. సదాశివం దగ్గరుండి తీసుకువెళ్తున్నాడు అన్ని సభలకీ. అడిగినా, అడగకపోయినా సలహాలిస్తున్నాడు. అవి అతి విలువైనవి, వాటిని పాటించి తీరాల్సిందే. ఎలాంటివంటే, "కుంజా! ఇది ధనుర్మాసం ఆండాళ్ తిరుప్పావై పాడు."

ఎప్పటినుంచో ఎదురు చూస్తున్న కాంగ్రెస్‌వారి సదస్సుల్లో కూడా సుబ్బులక్ష్మి కచేరీ చేసింది. ఈ కచేరీ పూర్తిగా సదాశివం కనుసన్నల్లోనే చేసింది. సదాశివం చెప్పినట్లు దేశభక్తి గీతాలే పాడింది. బాల, జయమ్మ, 'జనగణమన', అప్పటికి భారతదేశ జాతీయగీతంలా ప్రకటింపబడని బెంగాలీ దేశభక్తి గీతానికి అభినయం ఏర్పరచుకొని ప్రదర్శించారు. ఈ సమావేశాల్లో సుబ్బులక్ష్మి కుటుంబమంతా సదాశివానికి కాంగ్రెసువాదులలో ఉన్న పరపతిని కళ్లారా చూశారు. కాలమహిమో, సుబ్బులక్ష్మి పాటమహిమో, సదాశివం మహిమో ఈసారి మద్రాసు మ్యూజిక్ అకాడమీలో కూడా అవకాశం ఇచ్చారు.

సుబ్బులక్ష్మి గాత్ర కళాకారిణిగా ఇంకో అమూల్యమైన సభల పర్వాన్ని తన ఖాతాలో వేసుకుంది. పేరున్న కర్ణాటక సంగీత కళాకారుల పట్టికలో చేరింది. ఈ సమయానికి ఇటు దక్షిణ భారత దేశంలోనైనా, ఉత్తర భారతదేశంలోనైనా ఆడవారిలో గాన, నృత్య ప్రదర్శనలిచ్చే కళాకారిణులు అంటే దేవదాసీ కుటుంబాలకు చెందిన మహిళలే, పదిమందిలో ఎనిమిదిమంది వాళ్లే. ఉన్నత వర్గానికి చెందిన కళాకారిణిలు అతి కొద్దిమంది మాత్రమే. అతి ఉన్నత వర్గానికి చెందినవారు ఇంకా తక్కువ. రుక్మిణీదేవి ఈ కోవకి చెందుతుంది. మధ్యతరగతిలో కాస్త అభిరుచి ఉన్న తల్లిదండ్రులు తమ ఆడపిల్లలకు సంగీతం నేర్పిస్తే, అది కేవలం ఇంట్లో పాడటానికే, బయట పదిమందిముందు పాడటానికి ఏమాత్రం కాదు. ఇంటి ఆడపిల్లలు అలా చేస్తే పరువు పోయినట్లే లెక్క. కానీ పట్టమ్మ అనే బ్రాహ్మలపిల్ల ఈ పరిస్థితులకి మినహాయింపు.

కాంచీపురం నాయనాపిళ్లై కంచిలో త్యాగరాజు ఆరాధనోత్సవం జరుపుతూ త్యాగరాజుకృతుల పాటల పోటీ పెట్టగా ఎనిమిదేళ్ల పట్టమ్మ మొదటి బహుమతి గెలుచుకుంది. ఆ తరువాత రోజు ఒక దినపత్రికలో పట్టమ్మ బొమ్మతో సహా ఆ వార్త ప్రచురించారు. అది చూసి పట్టమ్మ తండ్రి, "పెళ్లి కావలసిన పిల్ల బొమ్మ పత్రికల్లో వేసి ఇంటి పరువు తీస్తారా" అని అరుచుకుంటూ పంచ పైకి ఎగకట్టుకొని దినపత్రిక మీదకి దండయాత్రకి దిగబోతుండగా, పదిమందిదాకా కంచి పురజనులు పూలు, పళ్లు పట్టుకొని ఎదురయ్యి, పట్టమ్మని పొగిడిపొగిడి, అమ్మాయికి ఇంకా బాగా నేర్పి కచేరీలు ఇప్పించాలని చెప్పి వెళ్లారు. వారి స్పందన చూసి పట్టమ్మ తండ్రి తన ఆలోచనలు మాని, పట్టమ్మను పాటలో పైకి తీసుకొచ్చే పనికి పూనుకున్నాడు. పెళ్లి ఆలోచనలు ఒక పదేళ్ల అవతలకి పారేశాడు. ప్రతిభ ఎంత దాద్దామన్నా దాగదు. బయటకు వచ్చి గుబాళిస్తూనే ఉంటుంది. పట్టమ్మ తండ్రి సంఘం కట్టుబాట్లకి లోబడి తన భార్య గొంతు ఇంటికి బయట వినిపించకుండా విజయవంతంగా నొక్కిపెట్టగలిగాడు. కానీ కూతురు విషయానికి వచ్చేసరికి ఎటూ తేల్చుకోలేకపోయాడు కొన్నాళ్లు. తేల్చుకోలేకపోయింది కూతురుకి ప్రతిభ ఉందా లేదా, పాడగలదా లేదా అని కాదు. తన కూతురు అందరి ముందూ, ఇంటి బయట పాడాలి, మగవాళ్ల ముందూ పాడాలి, సంఘం నొసలు చిట్లిస్తుంది, చెవులు కొరుక్కుంటుంది. కాని ఇలాంటి పరిస్థితి సుబ్బులక్ష్మికి లేదు. పుట్టింది మొదలు, నోరు విప్పిందే అదనుగా గానసౌరభాలు వ్యాపింప చేసింది. మగవారి ముందు పాడటం, మగవారి కోసం పాడటం దేవదాసీ ఇండ్లలో వారి ఆడపిల్లలకు నేర్పే మొదటి పాఠాలు. దేవదాసీల వృత్తి ధర్మాన్ని కూతురు చేత పాటింపచేస్తూ ఈ 1937వ సంవత్సరపు

తాలిరోజుల్లో ఏనమంతులు, ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ పోషకులైన చిన్నయలమందయ్య శెట్టి ఇంట్లో కచేరీ ఇప్పిస్తుంది షణ్ముగవడివు. కీల్పాక్‌లో 'లాన్‌స్టిఫాన్' అనే ఇంగ్లీషు పేరుతో, నాలుగెకరాలలో పెద్దపెద్ద పూలతోటల మధ్య ఉన్న బ్రహ్మాండమైన ఈ బంగ్లా ముగ్గురు అన్నదమ్ముల తెలుగు కోమటి శెట్ల ఉమ్మడి కుటుంబంది. ఆ పెద్ద బంగ్లాలో పట్నంలోని ఒక గాన సభంత గదిలో సుబ్బలక్ష్మి కచేరి చేస్తుంది. చుట్టూ అన్నదమ్ములు, వారి చుట్టాలు, స్నేహితులు అంతా మగవారే. ఆడవాళ్లు పక్కనున్న గదుల్లోంచి వింటూ అప్పుడప్పుడు తొంగి చూస్తున్నారు. జార్జిటౌనులోనున్న ధనమ్మ కుటుంబాన్ని, వారి కళలను అమితంగా ఆరాధించి, వారిని పోషిస్తూ ఉండే తెలుగు కోమటి శెట్ల కుటుంబం ఒకటి షణ్ముగవడివుకి ఈ యలమందయ్య శెట్టి కుటుంబాన్ని పరిచయం చేసింది. పట్నం వచ్చింది మొదలు ఈ తల్లీకూతుళ్లకు కచేరీ అవకాశాలు కల్పిస్తున్నారు వీరు. దేవదాసీ జీవిత పరిణామ క్రమంలోని తరువాతి ఘట్టం కోసం, షణ్ముగవడివు ఈ కుటుంబం నుంచి ఆశిస్తున్నది. కూతురి చేత ఇక్కడ కచేరీ ఇప్పిస్తున్నది కూడా ఇందుకే.

చిక్కని ప్రాయం, చక్కని రంగు, కళ్లలోకి చూస్తే ఆ కళ్లు కట్టిపడేస్తాయి. నిర్మలమైన మోము, మన్మథుడు వదిలిన శరం కాదుకానీ, చక్కని కుదురైన ఆడపిల్ల, ఆపైన దేవదాసి. అక్కడ ఉన్నవాళ్లంతా తదేకంగా చూస్తున్నారు సుబ్బలక్ష్మిని. ఎప్పుడు చేరిందో కాని, సుబ్బలక్ష్మి పైట నిండుగా భుజాల చుట్టూ చేరింది. అక్కడున్న మగవారికి దేవదాసీలు కొత్తేమీ కాదు. కానీ ఈ దేవదాసి కొత్తగా కనిపిస్తుంది. అమ్మాళ్లులాగా హారం చూపిస్తే అటువైపు పరిగెత్తే ఆలోచనలు లేవు. రాజంలాగా మగతోడు కోసం ప్రాకులాట లేదు. ఆఖరకి రంగనాయకిలాగా నన్ను మీ పంచన చేర్చుకుంటే చాలు నాకు బ్రతుకుతెరువు దొరుకుతుంది అనేలా కూడా లేదు. మరి ఈ అమ్మాయి ఏంటి? కళ్లతోనే ఆకర్షిస్తుంది. ఆ కళ్లతోనే అడ్డు చెప్తుంది. అలా కూతురిని గమనిస్తున్నవాళ్లని షణ్ముగవడివు గమనిస్తూ ఉంది. కచేరీ పూర్తి చేసుకుని భారీ కానుకలతో ఇంటికి చేరారు.

అక్కడ సదాశివం వీళ్ల కోసం ఎప్పటి నుంచి ఎదురు చూస్తున్నాడో, "ఎక్కడ నుంచి వస్తున్నారు?" అని కోపం, అసహనం అణుచుకుంటూ అడిగాడు.

"యలమందయ్య శెట్టి గారింట్లో కచేరీ" చెప్పింది షణ్ముగవడివు. "వాళ్లింట్లో ఎందుకు?"

"చేతిలో కళ పెట్టుకుని ఖాళీగా ఉంటే మా కడుపులెలా నిండుతాయి బాబూ" అంటూ తలుపుతీసి సదాశివాన్ని లోపలికి ఆహ్వానించింది. ఇంట్లో కాస్త సర్దుకొని కూతురితో అంది, "కుంజా, బజారులో కొట్టుకెళ్లి కాస్త బియ్యం తీసుకురామ్మా. నిండుకున్నాయి. ఇప్పుడు వండటానికి ఏమీ లేవు."



సుబ్బలక్ష్మి బయలుదేరింది. "కుంజా ఉండు నేను తోడొస్తా" అంటూ సదాశివం సుబ్బలక్ష్మితో బయటికి నడిచాడు. వీళ్లు కాస్త దూరం వెళ్లగానే, 'సదాశివం! సదాశివం!' వెనకనుంచి కృష్ణమూర్తి రిక్షా దిగి కేకలు పెడుతున్నాడు "ఏంటి ఇక్కడదాకొచ్చాడు?" అనుకుంటూ, "కుంజా, నువ్వు ఇక్కడే ఉండు ఇప్పుడే వస్తా" అంటూ కృష్ణమూర్తి దగ్గరకు వచ్చాడు.

"ఏంటి ఇటొచ్చావు?" అని అడిగాడు కాస్త చికాకుపడుతూ.

"మీ ఇంటికి వెళ్లడంకంటే ఇటు వస్తేనే ఉంటావని" కవ్విస్తూ చెప్పాడు కృష్ణమూర్తి.

"పనేంటో" అసహనంగా అడిగాడు సదాశివం.

"వాసన్ నిన్ను ఉన్న పళాన వెంటబెట్టుకొని రమ్మన్నాడు. చాలా అర్జెంట్ పనంట."

"ఆఫీసు టైమ్ అయ్యింది కదా, ఇక నేను రాను. నీకు కనిపించలేదని చెప్పు" అరిచాడు సదాశివం.

"కాదు సదాశివం. అది నిజంగా అర్జెంటు పని. అందుకే నేను పరిగెత్తుకుంటూ వచ్చా. నువ్వు రావాలి." మెత్తబడ్డాడు సదాశివం. "సరే, ఆగు. పచారికొట్టుకి వెళ్లి కొనిచ్చి వస్తా."

"అవి వాళ్లు కొనుక్కోలేరా?"

"ఎలా తల్లీకూతుళ్లు ఇద్దరే ఉన్నారు. పైగా చీకటిపడింది."

"ఏం చీకటిపడితే, తల్లీకూతుళ్ల కాళ్లు, చేతులు చచ్చుపడిపోతాయా?" సదాశివం ఒకసారి అన్న మాటలను గుర్తుచేస్తూ మళ్లీ కవ్వించాడు కృష్ణమూర్తి.

కోపం అణచుకొని "ఇప్పుడే వస్తా, ఇక్కడే ఉండు" అని సుబ్బలక్ష్మి దగ్గరికి వెళ్లాడు. సుబ్బలక్ష్మి దగ్గర ఉండగా "సదాశివం, మీ ఆవిడ పుట్టింటినుంచి వచ్చిందా?" కృష్ణమూర్తి కేకపెట్టాడు. ఒక్క ఉదుటున కృష్ణమూర్తి దగ్గరకు వచ్చాడు సదాశివం. చొక్కాకున్న గుండీలు సరిచేస్తూ, "ఏంటీ వీళ్లకింకా ఆ సంగతి తెలియదనుకుంటున్నావా.. దాస్తే దాగే విషయం కాదుకదా.. వాళ్లకి తెలుసు. నువ్వింక నోరు తెరవకేం" అని గట్టిగా చెప్పి సుబ్బలక్ష్మి దగ్గరకి పరుగెత్తి వెళ్లాడు.

꧁꧁꧁꧁

చాలారోజుల నుంచి షణ్ముగవడివు శెట్టి గారి నుంచి తీపికబురు కోసం ఎదురు చూస్తుంది. ఒకరోజు ధనమ్మ ఇంటినుంచి కబురు వచ్చింది. జార్జి టౌను కోమటిశెట్టికి కబురు పంపారేమో యలమందయ్యశెట్టి అనుకుని, కూతురుతోసహా ధనమ్మ ఇంటికి చేరుకుంది. భోజనాలు అయ్యి ఆకులు నములుతూ తీరిగ్గా చాపమీద చతికలపడ్డారు.

ధనమ్మ కుటుంబం తన కూతురు గురించి ఏ... చూస్తుంది షణ్ముగవడివు. ఆ సందర్భం రానే వచ్చింది. జయమ్మ మొదలుపెట్టింది.

"షణ్ముగం! కుంజాకి పోషకుడి సంగతి ఏమన్నా ఆలోచించావా?"

"ఇప్పుడిక అదే పనిమీదున్నా జయమ్మా... మొన్న యలమందయ్యగారింటికి వెళ్లా. అక్కడినుంచి ఏమన్నా కబురు వస్తుందేమోనని ఎదురు చూస్తున్నాను."

"ఏంటీ వచ్చేది?" అందుకుంది కామాక్షి, "మాకూ వచ్చిందొక కబురు. అందుకనే నిన్ను పిలిపించా."

"ఏంటది?" అడిగింది షణ్ముగవడివు.

"కుంజాని అంటిపెట్టుకొని ఒకతను తిరుగుతున్నాడంట, అతనేనా కుంజాకి.." అని అడగబోతుంది జయమ్మ..

"ఎవరూ.. ఆ బికారి వెధవా" తోక తొక్కిన పాములా బుస్సున లేచింది షణ్ముగవడివు.

"బికారో షావుకారో మరి పిల్ల పక్కనే ఉండి తిరుగుతుంటే అందరూ ఏమనుకుంటారు? ఇక నీకు ఎక్కడనుంచి ఏ కబురు వస్తుంది?"

షణ్ముగవడివు కోపంతో ఉడికిపోతుంది. "ఏవో చిన్నచిన్న సాయాలు చేస్తూ పక్కన చేరాడు. ఉన్న సంసారాన్నే మోయలేక చస్తున్నాడు. ఈ ముష్టోడికి బంగారంలాంటి నా కూతురుని ఇస్తానా?"

"నెమ్మదినెమ్మది, పిల్లలంతా పంచలోనే ఉన్నారు" హెచ్చరించింది జయమ్మ.

సదాశివం సుబ్బలక్ష్మి కోసమే వస్తున్నాడని తెలుసు షణ్ముగవడివుకు. కాని కూతురు కోసం తను చూస్తున్న పోషకుల జాబితా కాదు కదా, అస్సలు లెక్కకు కూడా రాడు. అతన్ని మెల్లగా దూరం పెట్టే ఆలోచనైతే ఉంది కాని అంత లోపలే చాపకింద నీళ్లులాగా నష్టం చేసుకొచ్చాడు. తలపట్టుకొని ఆలోచనలో మునిగిపోయింది షణ్ముగవడివు.

ఇంతలో సుబ్బలక్ష్మి గదిలోకి పరిగెత్తుకుంటూ వచ్చి తలుపు వెనక దాక్కుంది. వెంటనే బాలా వచ్చి, "కుంజా, రా బయటికి, వాడంతేలే. ధనమ్మ నోటినుంచి ఊడిపడ్డాడు. అంతే మాట్లాడుతాడు. నువ్వేమీ భయపడకు. రా" అని తలుపు చాటు నుంచి లాగుతుంది. ఏంటా అని ఆడవాళ్లంతా చూస్తున్నారు. శంకరు ఒక ఫోటో పట్టుకొని గదిలోకి వచ్చాడు. "ఏరమ్మా తెల్లదొరసానులు ఏరీ?"

"ఎందుకురా?" జయమ్మ అడిగింది.

"తెల్ల దొరసానులు ఒట్టి సిగరెట్టులు నోట్లో పెట్టుకున్నారు. వెలిగిద్దామని" ఏమీ అర్థంకాక తెల్లమొహాలు వేశారు గదిలో ఉన్నవాళ్లు. "ఇదిగో చూడండీ" అంటూ ఒక



ఫోటో జయమ్మకిచ్చాడు. ధనమ్మ కూతుళ్లందరూ ఫోటో చూశారు. "ఆ.. వీడు లాగుతేసుకొని, బీడీలు తాగుతున్నారంటే" నోరెళ్లబెట్టింది ధనమ్మ పెద్ద కూతురు రాజలక్ష్మి.

"ఏం చపలపు బుద్ధి పుట్టిందే మీకు?" అంది ధనమ్మ రెండో కూతురు లక్ష్మీకాంతం.

"ఇది బాలా పనే.. పాపం కుంజాని ఏమీ అనకు. అది ఇప్పటికే సిగ్గుతో చచ్చిపోతుంది" అంది జయమ్మ. వెంటనే తల్లి దగ్గరకు వచ్చి ఫోటో లాక్కొని "మీక్కూడా కావాలంటే చెప్పండి. ఇలానే ఫోటో తీయిస్తా. వరసగా నిలబెట్టి, ఇక దండకాలు ఆపండి" అంటూ ఫోటోని, సుబ్బలక్ష్మిని తీసుకొని వెళ్లింది బాలా.

బాలసరస్వతి, సుబ్బలక్ష్మి మంచి నేస్తులయిపోయారు. సుబ్బలక్ష్మి బిడియం, బాల గయ్యాళితనం బాగా కుదిరాయి.

షణ్ముగవడివుకి ఈ ముచ్చట్లేమీ పట్టటంలేదు. ఇంకా ఉద్రేకంలోనే ఉంది. ఆ చిరాకుతోనే ధనమ్మ ఇంటినుంచి వచ్చేసింది. దారిలో తల్లిని అడిగింది సుబ్బలక్ష్మి "అమ్మా కోపంగా ఉన్నావేం? నీకా ఫోటో నచ్చలేదా? ఇంక అలా తీయించుకోన్లేమ్మా" అంది. షణ్ముగవడివు ఏమీ మాట్లాడలేదు. ఇంట్లో కూడా పెద్దగా ఏమీ మాట్లాడలేదు తల్లి. ఇక పడుకున్నారు. షణ్ముగవడివు సుబ్బలక్ష్మి వైపు చూసింది. 'బంగారం, రత్నం, కాదు వజ్రం. వజ్రంలాంటి నా కూతురుని వాడి బారిన పడనిస్తానా' అనుకుంది. గట్టి నిర్ణయం ఒకటి తీసుకొని పడుకుంది. సుబ్బలక్ష్మి పొద్దున్నే లేచేసరికి అమ్మ ట్రంకుపెట్టెలో వాళ్ల బట్టలన్నీ పెడుతూ కనిపించింది. కాసేపు చూస్తూనే ఉంది. ఇంకా రెండు సంచుల్లో కూడా సామాను సర్దుతుంది. "అమ్మా ఎక్కడికి? అన్నీ సర్దేస్తున్నావు?"

"లేచావా కుంజా, లే, తొందరగా తయారవ్వు మన ఊరెళ్లిపోదాం."

"ఇప్పటికిప్పుడు ఎందుకమ్మా?"

"ఇంకేం పని ఉందమ్మా ఇక్కడ? సభలు అయ్యాయికదా. మళ్లీ వద్దాంలే."

"నేను బాలాకి చెప్పలేదమ్మా."

"ఎవరికీ చెప్పనవసరం లేదమ్మా. మళ్లీ వస్తాంకదా. పొద్దెక్కుతుంది, తొందరగా బయలుదేరు."

తల్లి అన్నీ సర్దేసి తయారుగా కూర్చుంది. ఇక తనదే ఆలస్యం. పట్నం నుంచి వాళ్ల ఊరికి బయలుదేరారు. సదాశివం మీద ద్వేషంతో షణ్ముగవడివు, తల్లిచాటు బిడ్డగా సుబ్బలక్ష్మి. షణ్ముగవడివుకి మళ్లీ వెనక్కి వచ్చే ఆలోచనేలేదు. ఈ సారి సభల సమయానికైనా తప్పకుండా వెనక్కి వస్తాం అనే ధీమా సుబ్బలక్ష్మిది.

మదురైలో అన్నని చూసుకుని, అన్నతో కాలక్షేపం చేస్తూ హుషారుగా ఉంది

సుబ్బులక్ష్మి కొన్నాళ్లకి వడివాంబ కూడా వచ్చింది. సుబ్బులక్ష్మికి ఆనందం రెట్టింపైంది. తల్లిమాత్రం ఎంతో ముభావంగా ఉంది. ఒకరోజు వడివాంబ వజ్రాల నగలు చూస్తూ, "దీన్ని చూసన్నా తెలుసుకోవే. ఉన్న ఒక్క హారాన్నీ తిరగేసి, బోర్లేసి వేస్తున్నావు" అంది సుబ్బులక్ష్మితో. ఇప్పుడు అర్థమయింది కాస్త. మరి పట్నం నుంచి ఎందుకు తీసుకువచ్చింది? అర్థం కాలేదు. ఆ ప్రశ్నకి సమాధానం వడివాంబ చెప్పనుంది.

తొలి పూజ వేళకే అక్కాచెల్లెళ్లు గుడిలో దర్శనం చేసుకొని ఇద్దరూ కోనేరు మెట్లమీద కూర్చున్నారు. అక్కకు వడివాంబను అడగాలని ఉంది, పోషకుడి దగ్గర చెల్లెలి పరిస్థితి ఎలా ఉందోనని. వడివాంబకు ఆ విషయం కాకుండా అక్కకి చెప్పటానికి ఇంకో ముఖ్యమైన విషయం ఉంది. "వడివా, చెప్పు నువ్వు ఎలా ఉన్నావ్.. ఏం చేస్తున్నావు కోయంబత్తూరులో" అడిగింది సుబ్బులక్ష్మి.

"ఇక నా సంగతి ఏముందిగానీ నీ సంగతి చెప్తా విను."

"నా సంగతా, ఏంటది?" భయంగా అడిగింది సుబ్బులక్ష్మి.

"అమ్మ నీకు ఒక పోషకుడిని ఖాయంచేసింది" సుబ్బులక్ష్మి నివ్వెరపోయింది. "నాకా.. ఎప్పుడూ, ఎలా.. అసలు నాకేమీ తెలియకుండానే.. నాకస్సలు ఇష్టంలేదని తెలిసికూడానా?" ప్రశ్నల వర్షం కురిపించింది.

"ఖాయమయితే అయిపోయింది" రూఢిగా చెప్పింది వడివాంబ.

"నేను ఒప్పుకోకపోతే ఎలా చేస్తుంది?" వడివాంబ ఏమీ మాట్లాడలేదు. ఆ మౌనం సూటిగా, గట్టిగా చెప్తుంది, పెద్ద పన్నాగం పన్నారని. "చెప్పు వడివా, ఏం చేయబోతున్నారు?"

"నేను చెప్పానని తెలియనివ్వకు, అమ్మ బాధపడుతుంది. నీకిష్టం లేదని చెప్తున్నా. ఎప్పుడో ఒకసారి కచేరీ ఉందని నిన్ను తీసుకెళ్తుంది. ఇక నిన్ను అక్కడే వదిలేసి వస్తుంది" సరిగ్గా అప్పుడే తొలి కిరణాలు తటాకంలోని సువర్ణ కమలాన్ని తాకాయి. కాంతి విస్తరిస్తూ సుబ్బులక్ష్మి మోము తాకాయి. ఎర్రగా భగభగలాడుతుంది మోము.

"అన్నకు తెలుసా ఈ విషయం."

"అన్నకు తెలియదు."

ఇంట్లో వాతావరణం హఠాత్తుగా కొత్తగా ఉంది సుబ్బులక్ష్మికి. అమ్మ ఏదో ఆలోచనలో మునిగి తేలుతుంది. పట్నం నుంచి వచ్చిన దగ్గరనుంచి సాధన చేసిందే లేదు. విషయం తెలిసిన అత్తామామల నడవడి, నాటకాలు వేస్తున్నట్లు ఉంది. అన్న ఒక్కడే కల్మషం లేని మనసుతో మాట్లాడుతున్నాడు. "కుంజా! చెల్లీ! ఇదిగో, నీకు హల్వా తీసుకొచ్చాను చూడు. మళ్లీ పట్నం ఎప్పుడు వెళతావో, రా క్యారములు ఆడదాం" అంటూ చెల్లిని చక్కగా చూసుకుంటున్నాడు. అన్న ఒక్కడే ఆత్మీయుడిలాగా కనిపిస్తున్నాడు. 'అమ్మకి ఇంత పంతం ఎందుకు? నాకిష్టం లేదు మొర్రో అంటే వినదెందుకు' సంగీతపు ఆలోచనలతో నిండిపోయే బుర్ర ఈ ప్రశ్నలతో తొలుచుకుపోతుంది.

"కుంజా! రంగమ్మ ఇంటికి వెళదాం రామ్మా" అంటూ పిలిచింది అమ్మ.

సుబ్బులక్ష్మి ఆలోచనలో పడింది. "వడివాను కూడా తీసుకురానా అమ్మా?" "సరే, తొందరగా రండి ఇద్దరూ" అంది అమ్మ వీధి తలుపు దగ్గర నుంచొని. ముగ్గురూ అదే సందులో ఉండే రంగనాయకి ఇంటికి వెళ్లారు. "రండి, కూర్చోండి" అంటూ చాప పరిచింది రంగనాయకి.

"చూడు షణ్ముగం! ఎంత ముచ్చటగా ఉన్నారో నీ కూతుళ్లు" అంది రంగనాయకి. సన్నగా ఒక సైగ చేసింది నేస్తానికి షణ్ముగవడివు. ఇక మొదలుపెట్టింది రంగనాయకి. "కుంజా! అమ్మ నీ మంచికే చెప్తుందమ్మా. అమ్మ కుదిర్చిన చెట్టిగారి దగ్గరకు వెళ్లు. మేమంతా ఇంతేగా బ్రతుకుతుంది. నిన్నేమైనా కొత్తగా చెయ్యమనటంలేదుకదా."

సుబ్బులక్ష్మి వడివాంబ మొహమొహాలు చూసుకున్నారు. రంగనాయకి ఇంకా చెప్తుంది. "మనల్ని ఎవరూ పెళ్లి చేసుకోరమ్మా. ఒకవేళ చేసుకున్నా రెండోపెళ్లివాళ్లే చేసుకుంటారు. మేము నీకు చేస్తుంది అదేకదా. రెండోపెళ్లివాడికి, రెండో పెళ్లాంలాగా.. ఇలా అయితే నువ్వు సంగీత సాధన, కచేరీ బ్రహ్మాండంగా, ఆపకుండా చేసుకుపోవచ్చు. నువ్వనుకున్న పెళ్లితో ఇవి అస్సలు కుదరవమ్మా. సంసారం ఈదటానికే సరిపోతుంది. సంగీతంలో ఇంత ఎత్తు ఎదిగావు, దాన్ని వదిలేయకు."

"నాకు సంగీతం వద్దు. పెళ్లి చేసుకుని పిల్లల్నే చూసుకుంటా" చెప్పేసింది సుబ్బులక్ష్మి. అంతా నిశ్శబ్దం. సుబ్బులక్ష్మి చెప్పిన మాటకి, అందరూ నివ్వెరపోయారు. వడివాంబ, రంగవైపు చూసింది. రంగ షణ్ముగవడివువైపు చూసింది. ఉక్రోషం, బాధ తన్నుకొస్తున్న గొంతుతో, "చెప్పానా రంగా, మొదట అనుకున్న పద్ధతే దీనికి సరైనది. సంగీతం వదిలేస్తుందట. నా రక్తంతో పంచి ఇచ్చిన సంగీతాన్నే వదిలేస్తుందట. ఇక అన్నీ అయిపోయాయి రంగా. ఈ నాలుగు రోజుల తర్వాత మంచి రోజు వస్తుంది. వాళ్లు వచ్చి దీన్ని తీసుకువెళతారంతే. నువ్వు దగ్గరుండి పంపు" అంటూ కోపంగా బయటకు వెళ్లింది. కూతుళ్లిద్దరూ వెనకాలే వెళ్లారు.

అమ్మ చెప్పిన నాలుగు రోజులు మొదలయ్యాయి. మొదటిరోజు, "సంగీతం వదిలేస్తుందట" ఎవరితోనూ ప్రత్యేకంగా అనకుండా కోపంతో, బాధతో నిలువెల్లా కంపించిపోయింది తల్లి.

రెండవరోజునుంచి కూతురుని మంచి చేసుకోవటం మొదలుపెట్టింది. "నీకు ఏది మంచో నాకూ తెలుసుకదమ్మా" రాత్రికి కూతురికి నచ్చచెపుతూ జోకొడుతూ నిద్రపుచ్చింది.

సుబ్బలక్ష్మి సాగరగర్భంలాగా స్తిమితంగా, నిశ్శబ్దంగా ఉంది. ఏమీ మాట్లాడటంలేదు. కానీ, మనసు మాత్రం కల్లోల అలల తీరమే. తన తల్లి చిన్నతనంలో దేవదాసీలంటే గౌరవం ఉండొచ్చుగాక, కానీ ఇప్పుడా పరిస్థితి లేదు. చూడామణి తరం మెల్లగా కనుమరుగవుతుంది. చూడామణికే చూపెట్టారు దేవదాసీల స్థితి ఎలా ఉండబోతుందో. తన స్వానుభవాలు హెచ్చరిస్తున్నాయి, తన వయస్సు పెరిగేకొద్దీ ఇంట్లోకి మగవాళ్ళు యథేచ్ఛగా వచ్చి వెళుతున్నారు. తన ఇంట్లో తనకే భద్రత లేదనిపించేది. ఇంటి బయట, తలెత్తితే తనను తినేసే చూపులు, తల దించుకుంటే, "మీ నాన్న ఎవరో మీ అమ్మకన్నా తెలుసా" అనే హేళన. ఇవన్నీ తన తల్లికి సమస్యగా ఎందుకు తోచటంలేదో ఎంత చెప్పిచూసినా తల్లికి అర్థం కావటంలేదు. ధనమ్మ చేస్తుందనీ, కుటుంబ ఆచారమనీ, అదే పద్ధతిలో వెళ్లానంటుందికానీ, మూగాంబికలాగా పద్ధతి మార్చుకున్నవాళ్ళని, ముత్తులక్ష్మి రెడ్డిలాగా పద్ధతి మార్చుకోమంటున్నవాళ్ళని తల్లి పెడచెవిన పెడుతోంది. ఇరవై ఒకటవ ప్రాయంలోకి అడుగిడిన సుబ్బలక్ష్మికి తనకు ఏమికావాలో ఇంకా నిర్ణయించుకోలేదుకానీ, ఏమి వద్దో గట్టిగా నిర్ణయించుకుంది. తనను ఒక మగవాడి తర్వాత ఇంకొక మగవాడు తాకటం ఇష్టంలేదు. తన పిల్లలకి తనలాగా తండ్రి ఎవరోనని బయటివాళ్ల చర్చ వద్దు. మూడవరోజుకి తల్లి తలపెట్టిన కార్యం, తన నిర్ణయం తూర్పుపడమరలని గుర్తించింది. మౌనంగానే ఇంట్లో తన పనులు తాను చేసుకుపోతుంది. తల్లి ఈ మౌనం అర్ధాంగీకారం అనుకుంటుంది.

మామూలుగానే అక్కచెల్లెళ్లు గుడికి వచ్చారు. దర్శనం అయి కోనేరు మెట్లమీద కూర్చున్నారు. సుబ్బలక్ష్మి గుడినంతా కలయచూసుకుంటుంది. 'నా గుడి' అనుకుంది మనసులో.

"అక్కా! నువ్వెళ్లిన తర్వాత నేను వెళ్లిపోతా" వడివాంబ మాటకి ఇటువైపు తిరిగింది.

"నేనెక్కడికి వెళ్తాను? నువ్వెక్కడికి వెళ్తావు?"

అక్కను అంతే చూస్తూ, "ఇంకా వెళ్లననే దానిమీదే ఉన్నావా? వాళ్లు రేపోమాపో వస్తారుగదా."

"వెళ్లను వడివా."



"మరి?"

"నువ్వు నాకొక సాయం చేస్తావా వడివా?" ఆర్తిగా అడిగింది సుబ్బలక్ష్మి.

❦ ❦

ఆ రోజు రాత్రి కూడా కూతురిని మచ్చిక చేసుకుంటూ తల నిమురుతూ సుబ్బలక్ష్మిని జోకొడుతూ షణ్ముగవడివు నిద్రపోయింది. గత మూడు రోజుల నుంచి సుబ్బలక్ష్మికి సరిగ్గా నిద్రలేదు. అమ్మ చేయి తన మీద నుంచి తీసి పక్కకు జరిగింది.

షణ్ముగవడివు అనుకున్నదాని ప్రకారం నాలుగో రోజున వాళ్లకి కబురు పంపితే వాళ్లు ఎప్పుడు వచ్చేదీ కచ్చితంగా చెప్తారు. నాలుగవ రోజు ప్రొద్దునే లేచి గోడవారుకు కూర్చుని, ఈ విషయం గురించే ఆలోచించుకొని, కూతుళ్లవైపు దృష్టి సారించింది. వడివాంబ గాఢనిద్రలో ఉంది. సుబ్బలక్ష్మి తను పడుకున్న చోటులో లేదు. లేచి పెరట్లోకి వెళ్లిందనుకొని, మెల్లగా తను లేచి దుప్పట్లు మడతేస్తూ వడివాంబని లేపింది. ఇక తను వెనక్కి వెళ్లింది. సుబ్బలక్ష్మి పెరట్లో కాని, స్నానాలగదిలో కానీ లేదు. "ఎక్కడికి వెళ్లుంటుంది, గుడికి వెళ్లుంటుందా?" అనుకుంటూ ఉంది. ఇంట్లోకి వచ్చి కూతురు కోసం చూస్తూ ఉంది. మెల్లగా అనుమానం మొదలైంది. హడావుడిగా డాబా మీదకెళ్లి కొడుకుని, తమ్ముళ్లనీ లేపింది. "ఒరేయ్! కుంజా ఇంట్లో లేదు. తొందరగా స్నానం చేసి గుడికివెళ్లి చూసిరండిరా" అని చెప్పి, కిందకు వచ్చింది. "వడివా, ఒకసారి నువ్వు రంగ ఇంటికి వెళ్లి చూసిరా."

అనుమానం ఇంకా పెద్దదవుతుంది. వడివాంబ ఉండగా కుంజా ఒక్కతే ఎక్కడికీ వెళ్లదు. గుడికి కూడా వెళ్లదు. చెమటలు పడుతున్నాయి షణ్ముగవడివుకి. ఇంతలో తమ్ముళ్లు వచ్చారు. "అక్కా! గుడిలో ఎక్కడా లేదు. ఎవరూ కూడా చూడలేదని చెప్తున్నారు" సరిగ్గా ఇదే సమయానికి వడివాంబ, రంగనాయకి వచ్చారు. రంగనాయకి షణ్ముగవడివు పక్కనే కూర్చొని ఊరడిస్తుంది. అప్పుడే, "వదినా" అంటూ చిత్ర గట్టిగా అరిచింది. ఏంటీ అంటూ అందరూ అటువైపు చూశారు. చిత్ర గూట్లోనుంచి సుబ్బలక్ష్మి వంటిమీద ఉండే నగలన్నీ తీసి చూపించింది, 'బంగారం కూడా తీసిపెట్టి వెళ్లిందా? ఎక్కడికి వెళ్లి ఉంటుందీ?' అందరినీ తొలిచేస్తున్న ప్రశ్న. ఇప్పటికి అందరికీ తెలిసిన విషయం, ఎవరికీ చెప్పకుండా వెళ్లిందని, అందరూ నిద్రపోయిన తర్వాతన్నా, ఎవ్వరూ నిద్ర లేవకముందన్నా, వంటిమీద ఉన్న బంగారు నగలు తీసిపెట్టి ఇంటినుంచి వెళ్లిపోయింది. షణ్ముగవడివు సగం చచ్చిపోయింది. రంగ మెల్లగా మగవాళ్లని దగ్గరకు పిలిచింది. "నది పక్కనా, బావుల్లో చూసిరండిరా" అంటూ మెల్లగా చెప్పింది. "వద్దు" వారించింది

షణ్ముగవడివు. "వద్దు, అటువైపు వెళ్లాల్సిన పనిలేదు రంగా. అది వింటది. అలాంటి పనులు చెయ్యదు"

"మరెక్కడికెళ్లి ఉంటుంది?"

"మరెక్కడికెళ్లి ఉంటుంది?" "ఎక్కడికి వెళ్లిందో" అనే అర్థం స్ఫురింపచేస్తూ

తెలుసు, నాకు బాగా తెలుసు, అది ఎక్కడికి వెళ్లిందో. కన్నీళ్లు ఉబికి వస్తున్నాయి. ఇంతలో స్నేహితురాళ్లంతా తల కిందకీ మీదకీ ఊపుతూ ఉంది. కన్నీళ్లు ఉబికి వస్తున్నాయి. ఇంతలో స్నేహితురాళ్లంతా వచ్చారు విషయం తెలిసి. షణ్ముగవడివుకు తల కొట్టేసినట్లయింది. "షణ్ముగం! అప్పుడెప్పుడో నాకు చెప్పావుకదా... ఊరు వదలి వెళితే కాళ్లు విరగకొడతానని, మరి కుంజాకి చెప్పలేదా?" అమాయకంగా అడిగింది రాజం. ఈ మాట విని షణ్ముగవడివు కళ్లు జలపాతాలయ్యాయి. మీనాక్షి రాజం వీపుమీద చాచి ఒక్కటిచ్చింది. "అబ్బా, ఏంటే కొట్టావు" అంటూ వెనక్కి చూసింది. "కొట్టలేదే, పిలిచా. నువ్వు రా వెళ్లి గుడిలో వెతికొద్దాం" "పిలిచావా.. సరే పదా" అంటూ రాజం వెళ్లిపోయింది.

"నన్ను వదిలి వెళ్లింది" అని అనుకుంటూ కుమిలిపోతుంది షణ్ముగవడివు.

"ఎక్కడికీ వెళ్లదు షణ్ముగం, దానికి నువ్వూ, సంగీతం తప్ప ఏం తెలుసు? ఎక్కడో ఈ ఊరులోనే ఉంటుంది. కాసేపట్లో వస్తుంది. నువ్వు బాధపడకు" అనునయిస్తున్నారు స్నేహితులు.

"ఏమీ తెలియనిదానికి నేర్పడానికి ఒకడు తయారయ్యాడు పట్నంలో."

"ఆ... ఏంటీ.. కుంజా పట్నం వెళ్లిపోయిందంటావా?" భయంగా అడిగారు అందరూ.

"పట్నంకే వెళ్లింది. వాడిదగ్గరికే వెళ్లింది."

అందరూ, స్నేహితురాళ్లు, కొడుకూ, తమ్ముళ్లూ, మరదళ్లు, షణ్ముగవడివువైపు తిరిగారు. 'అంతేనా' అన్నట్లు. వడివాంబ మాత్రం చూరు వైపు చూస్తుంది.

ఇదేవేళకి మద్రాసు రైలుస్టేషన్‌లో, ఒక సంచి బట్టలతో, ముక్కుపుడకల నుంచి గాజులదాకా పిచ్చి నగలతో, బేల చూపులతో సుబ్బలక్ష్మి రైలుబండి దిగి, జట్కా బండివాళ్ల దగ్గరికెళ్లి కాంగ్రెసు నాయకుడైన సాంబమూర్తి ఇంటికి తీసుకువెళ్లమంది. పట్నం వీధులలో జట్కాబండి పరుగు అందుకుంది. ఇప్పటిదాకా భయంతో, ఉత్కంఠతో బిగుసుకుపోయి ఉన్న శరీరాన్ని, మనస్సునీ పట్టువిడిచి, తేలిక చేసుకుని చల్లగా ఊపిరి పీల్చుకుంది. ఈ కాంగ్రెసు పెద్దాయనకి, తన గోడు చెప్పుకుంటే ముత్తులక్ష్మి రెడ్డి దేవదాసీల కోసం పట్నంలో ఏర్పాటు చేసిన 'ఆశ్రయం'లో తనను చేర్పించి, తన తల్లికి ఇలాంటి పనులు మానుకోమని గట్టిగా చెపితే ఇక తన సమస్య తీరిపోయినట్లే అని ఆశపడుతుంది. జట్కా బండి కాంగ్రెసు పెద్దాయన ఇంటిముందు ఆగింది. సుబ్బలక్ష్మి దిగి, డబ్బులు తీస్తుంది.



ఆ ఇంటి మెల్లాలో ఆడుకుంటున్న పిల్లలు వచ్చి సుబ్బలక్ష్మి చుట్టూ మూగారు. ఒక పిల్లవాడు ఇంట్లోకి పరిగెత్తుకుంటూ వెళ్లి ముందు ఎదురొచ్చిన వాళ్ల నాన్నకి చెప్పి, లోపలికి వెళ్లి "అమ్మా! మనింటికి ఒక అమ్మాయొచ్చింది, తెల్లగా ఉంది" అంటూ మళ్లీ బయటికి పరిగెత్తికెళ్లాడు. సాంబమూర్తి భార్య ఎక్కడ పనులు అక్కడ వదిలేసి వీధివాకిలి దగ్గర నుంచొని చూస్తుంది. సాంబమూర్తి జట్కాబండి దగ్గర ఉండి సుబ్బలక్ష్మితో మాట్లాడుతున్నాడు. "మీ అమ్మ ఏదమ్మా?"

"ఇంటినుంచి చెప్పకుండా వచ్చేశానండీ."

"ఎందుకు?"

"మా అమ్మ నన్ను పోషకుల దగ్గరికి పంపుతానంటుంది. నాకది ఇష్టంలేదు" ఇబ్బంది పడుతూ చెప్పింది.

ఇంతలో, "నాన్నా! అమ్మ పిలుస్తుంది నిన్ను" అంటూ పిల్లలు వచ్చారు.

"మరి ఇప్పుడు ఏంచేద్దామనుకుంటున్నావు?" సుబ్బలక్ష్మి నీరసపడిపోయిందా ప్రశ్నకి. కాంగ్రెసు నాయకుడు, దేవదాసీల ప్రక్షాళన, దేవదాసీల ఉన్నతి అని ఎక్కడబడితే భాషణలు ఇచ్చే ఆయన ఇలా తననే ఏమి చేస్తావు అని అడుగుతున్నాడు.

"మీరే నాకు రక్షణ కల్పిస్తారని మీ దగ్గరకు వచ్చాను" అంది సుబ్బలక్ష్మి.

"నాన్నా! అమ్మ పిలుస్తుంది" అంటూ మళ్లీ పిల్లలు వచ్చారు.

"ఇక్కడే ఉండమ్మా" అంటూ సుబ్బలక్ష్మిని జట్కాబండి దగ్గరే నిలబెట్టి భార్య దగ్గరకి వచ్చాడు.

"ఏవండీ, ఎవరా పిల్ల.. మీ దగ్గరకి ఎందుకొచ్చింది?" అంటూ సంకోచించకుండా తన అనుమానం బయటపెట్టింది.

"నీక్కూడా తెలుసే ఆ పిల్ల, వాళ్లమ్మతోపాటు మనింటికి వచ్చేది, దేవదాసీలు, ఇంటినుంచి పారిపోయి వచ్చిందట"

"ఆ....... ఇంటినుంచి పారిపోయి మీ దగ్గరకు వచ్చిందా.. దాసీపిల్ల" అంటూ భర్త మీద అనుమానంతో ఆందోళనపడసాగింది.

"నా దగ్గరకంటే... అలాక్కాదు. పెద్దమనిషిని కదా. ఏదొక దారి చూపిస్తానని వచ్చింది. నువ్వు వెధవ గోల చేయకు వీధిలో. నేను ఏదో ఒకటి చేసి పంపేస్తా ఆ పిల్లను" అని భార్యకు భరోసా ఇచ్చి సుబ్బలక్ష్మి దగ్గరకు వచ్చాడు.

"అవునమ్మా... నేను నిన్ను సదాశివంతో చాలాసార్లు చూశాను. నీకు తెలుసుకదా అతను. ఒకపని చేయమ్మా... అతనింటికి వెళ్లు, నేను చెప్పానని చెప్పు. నీకు తప్పకుండా

"ఏదో ఒక సాయం చేస్తాడు" సుబ్బులక్ష్మి మాట్లాడే అవకాశం కూడా ఇవ్వకుండా బండివాడికి సదాశివం ఇంటి దోవ చెప్పి, సుబ్బులక్ష్మిని బండి ఎక్కమని తొందరపెట్టి. చేతులు దులిపేసుకుని ఇంట్లోకి వెళ్లిపోయాడు ఆ పెద్దమనిషి. నిరాశపడింది సుబ్బులక్ష్మి. ఏడుపొస్తుంది. ఇదేంటి పెద్దమనిషనుకొని వస్తే ఇలా చేశాడు. పేపర్లలో, మీటింగులలో, చట్టసభలలో దేవదాసీలను ఉద్ధరించాలంటూ ఉపన్యాసాలిస్తాడు. సాయం కోరి వస్తే ఇలా చేశాడు? అమ్మ చెప్పింది నిజంలాగుంది. ఇంటినుంచి వచ్చి తప్పు చేశానా అని మధనపడింది. 'ఇప్పుడు సదాశివం మామ ఇంట్లో లేకపోతే ఇంకేమీ చేసేదిలేక, ఇంకెక్కడికి వెళ్లేది లేక బాల ఇంటికి వెళ్లాలి. వాళ్లంతా కలిసి మళ్లీ అమ్మదగ్గరకు చేరుస్తారు. భగవంతుడా, ఇంత తెగించింది అందుకేనా' అనుకుంటూ దేవుడిని ప్రార్థిస్తూ కూర్చుంది. జట్కాబండి ఆగినప్పుడు కళ్లు తెరచి బండి దిగింది. కాసేపట్లో సదాశివం ఇంటినుంచి బయటకు వచ్చాడు. సుబ్బులక్ష్మిని చూసి ఆనందానికి, ఆశ్చర్యానికీ లోనయ్యాడు. "కుంజా, చెప్పాపెట్టకుండా ఎక్కడికి వెళ్లిపోయావు? ఎన్నిసార్లు వెళ్లానో తెలుసా మీ ఇంటికి?" బండివాడికి డబ్బులు ఇచ్చి పంపి, సుబ్బులక్ష్మిని లోపలికి తీసుకొని వెళ్లాడు. ఏమిటీ, ఎందుకు అనే ప్రశ్నలు ఏవీ అడగలేదు.

షణ్ముగవడివు ఎవరిదగ్గరకయితే వెళ్తుందని భయపడిందో అతని దగ్గరికి తన ప్రమేయం ఏమీ లేకుండా వచ్చి చేరింది.

"షణ్ముగం, నువ్వు కాస్త కాఫీ తాగు" అంది రంగ, కాఫీగ్లాసు ఇస్తూ, "ఎలా తాగను రంగా, అది నన్ను గుండెల్లో తన్ని వెళ్లింది" అని క్రుంగిపోతుంది షణ్ముగవడివు.

"అమ్మా, అది చిన్నది, ఏదో తెలియకచేసింది. నేను వెళ్లి తీసుకొస్తానమ్మా" అన్నాడు శక్తి.

**"కుంజా! నువ్వు వెళ్లి స్నానం చేసిరా" అంటూ స్నానాల గది చూపాడు. "అమ్మా నువ్వు తొందరగా వంటచేయి. ముందు కాఫీపెట్టు కుంజాకి" అంటూ అమ్మని తొందర చేశాడు. "అమ్మా! కుంజా కాఫీ మనలాగా చిక్కగా తాగదు. కాస్త పలుచగా చెయ్యి" అని కూడా చెప్పాడు.**

సదాశివం సంతోషం అంతా ఇంతా కాదు. వెతుకుతున్నది కాలికి తగిలినట్లయింది. సుబ్బులక్ష్మిని గుండెల్లోకి ఎప్పుడో తెచ్చుకున్నాడు. ఎలా అయితేనేమి ఇంట్లో వచ్చి చేరింది. ఇక తన ఇంట్లోనే ఉండేటట్లు చూసుకోవాలి.

"అమ్మా! బయలుదేరుతున్నానమ్మా, కుంజా నేను చెప్పినట్లు చేస్తుందమ్మా" అన్నాడు శక్తి.



"అవును షణ్ముగం, దానికి అన్న అంటే చాలా ఇష్టం. నువ్వు బాధపడకు" అంది మరకతం.

"అమ్మా! నేను రేపు మెయిలుకి బయలుదేరి కుంజాతోసహా వస్తానమ్మా నువ్వు జాగ్రత్త.." అంటూ బయలుదేరాడు.

**కాఫీ తాగుతూ సుబ్బులక్ష్మి చెప్పిన విషయాలు విన్నాడు. "కుంజా, మంచి పని చేశావు ఇంక ఎవరు ఏమి చెప్పినా వినకు." సుబ్బులక్ష్మికి తొందరగా భోజనం పెట్టించి "కుంజా, నువ్వు పడుకో. రాత్రి నిద్రపోయి ఉండవు. నేను ఆఫీసుకెళ్లి వస్తా" అంటూ సుబ్బులక్ష్మికి మంచం చూపెట్టి వెళ్లాడు. "అమ్మా ఎవరికీ తలుపు తీయకు. ఈ విషయం ఎవరికీ తెలియనివ్వకు" హెచ్చరించాడు అమ్మని.**

విషయం తెలిసి మదురైలో అందరూ షణ్ముగవడివు ఇంటికి చేరుతున్నారు. సుబ్బులక్ష్మి గురువు వచ్చాడు భార్యతోసహా. "అమ్మా! చెప్పాపెట్టకుండా వెళ్లిందా! అమ్మాయి కచేరీలో ఫిడేల్ వాయిస్తే నాకు కచేరీకి ఏడురూపాయలు వచ్చేవి, నా ఏడురూపాయలకి గండికొట్టిపోయింది" అని ఏడుపు. మరదళ్లు షణ్ముగవడివుని పక్కగదిలోకి తీసుకెళ్లి బలవంతాన తిండిపెట్టి పడుకోబెట్టారు.

**పడుకోబోయేముందు, సుబ్బులక్ష్మి తను వదిలి వచ్చిన తన మదురైను గుర్తుచేసుకుంది. వడివాంబ, తను ముందుగా అనుకున్నట్లుగానే అందరూ నిద్రపోయాక వడివాంబ చేయినొక్కి, సంకేతమిచ్చి, అమ్మను ఒకసారి చూసుకొని, తను లేచి వంటిమీద నగలు తీసిపెట్టి, కొంత డబ్బు, బట్టలు సంచిలో పెట్టుకొని, మెల్లగా తలుపుతీసి వీథిలోకి వచ్చేసింది. అక్కడనుంచి వడివడిగా నడుచుకుంటూ పశ్చిమ రాజగోపురం వీథిలోనుంచి మాసివీథి దాటి, టౌనుహాలు వీథిలోకి వచ్చి బారున నడుచుకుంటూ పశ్చిమ వెలివీథి లోని రైలు స్టేషనుకి చేరుకుంది. అంతా నాలుగు నిమిషాలే. ఆ తర్వాత రైలు ఎక్కి తలనిండా పైట కప్పుకొని ఎవరూ చూడకుండా జాగ్రత్త పడుతూ మద్రాసు చేరుకుంది. ఎవరన్నా తన దగ్గరకొచ్చి తన మొహంమీద పైట తొలగించి గుర్తుపడతారేమోనని భయపడుతూనే ఉంది. ఇప్పుడు నిద్రలోకూడా అప్పుడప్పుడు ఉలిక్కిపడుతుంది.**

షణ్ముగవడివు వెక్కివెక్కి ఏడుస్తోంది.

❦ ❦

తర్వాత రోజు పొద్దున్నే కాఫీ తాగి కూర్చున్నారు. "కుంజా! ఇదిగో నా పెద్దకూతురు రాధ. రెండేళ్లు దీనికి. వారం అవుతుంది దీనికి చెల్లెలు పుట్టి." అని చెప్తుంటే, "ఒరేయ్ దానికి చెల్లికాదురా... నీకు ఇంకో కూతురు పుట్టిందిరా" అంది మంగళం, సదాశివం తల్లి. అసలు ఆ మాటలని పట్టించుకోకుండా, "వాళ్లిద్దరేమో నా అక్క పిల్లలు, వాళ్లమ్మ

చనిపోయింది" అంటూ చెప్పుకొస్తున్నాడు తన గురించి, తన [illegible] గురించి. మంగళం కొరకొరా చూస్తుంది. 'ఎవరీపిల్ల, ఇలా ఇంట్లోకి తీసుకొచ్చాడు. ఎప్పుడు వెక్తుందీ... పైగా మామా అని పిలుస్తుందీ..' అనుకుంటుంది.

"మామా! మీరు ఈ రోజు ఆఫీసుకెళ్లరా..?" అడిగింది సుబ్బలక్ష్మి.

'ఇంత అమాయకమేంటి నువ్వు' అన్నట్లు చూశాడు సుబ్బలక్ష్మివైపు. "కుంజా ఈ రోజు నిన్ను వెతుక్కుంటూ, వెతుక్కుంటూ మీ అన్న, మామలు మనింటికి వస్తారు. నేను లేకపోతే నిన్ను లాక్కెళ్లిపోతారు. నేను ఉన్నాకూడా నిన్ను లాక్కెళ్లే ప్రయత్నం చేస్తారు. నువ్వసలు బయటికి రాకు."

సుబ్బలక్ష్మికి ఇప్పటినుంచే భయం మొదలయింది.

"ఎవర్రా వచ్చేదీ, మనకెందుకురా ఈ గొడవలు.."

"అమ్మా! నువ్వు లోపలికెళ్లి నీ పని చూసుకో" గట్టిగా అరిచాడు తల్లిని.

అనుకున్నట్లుగానే సుబ్బలక్ష్మి కోసం వచ్చారు. కానీ అన్న ఒక్కడే వచ్చాడు. శక్తివేల్‌ని లోపలికి రానిచ్చి కూర్చోబెట్టాడు. సుబ్బలక్ష్మి మంచినీళ్లు తీసుకొచ్చి ఇచ్చింది.

"అన్నా! అమ్మ ఎలా ఉంది?" శక్తి ఏమీ మాట్లాడలేదు. "అన్నా! బాగుంది కదా అమ్మ.."

"నిన్ను తీసుకురమ్మంది కుంజా, పద వెళ్దాం."

ఊపిరి పీల్చుకుంది సుబ్బలక్ష్మి. కానీ ఏమీ మాట్లాడకుండానే ఉంది.

"అమ్మ నీకోసం కలవరిస్తుంది కుంజా, బయలుదేరు వెళ్దాం." సుబ్బలక్ష్మిలో ఎలాంటి కదలికా లేదు. "నీ ఇల్లు నీకుండగా ఇంకొకళ్ల పంచలో ఎందుకు కుంజా.."

"ఇక్కడే ఉండను అన్నా. నా దారి నేను చూసుకుంటాను."

"మేమంతా ఉండగా నువ్వు ఒక్కదానివే చూసుకోవలసిన అవసరం ఏమొచ్చింది" సుబ్బలక్ష్మి తలదించుకొని తీక్షణంగా కిందకి చూస్తుంది. ఆ చూపులు, ఆ నిశ్శబ్దం చాలా చెప్పాయి అన్నకి.

"నేనుంటా కుంజా నీ పక్కన. నీకు ఇష్టం లేనివి ఏవీ జరగనివ్వను. నువ్వు రా నాతో ఇప్పుడు."

"తర్వాత ఎప్పుడైనా వస్తా అన్నా."

"అమ్మ నీకోసం ఎదురుచూస్తుంటుంది. నేను నిన్ను తీసుకువస్తానని మాట ఇచ్చాను. నా మాట పోనియ్యకు కుంజా"

"ఇప్పుడు అమ్మను చూడలేను అన్నా. తర్వాత వస్తా. నువ్వెళ్లు."



"కుంజా! చిన్నపిల్లవు కాదు. చెయ్యిపట్టుకొని ఈడ్చుకెళ్లటానికి, అమ్మకోసం రా."

"రానంటుందిగా, ఎన్నిసార్లు చెప్పాలి?" పక్కగదిలోంచి సదాశివం వచ్చాడు.

"ఆడపిల్ల ఇంటినుంచి వచ్చేస్తే నచ్చచెప్పి ఇంటికి పంపాలి. నువ్వేం మనిషివి? దాన్ని ఇంటికి రాకుండా చేస్తున్నావ్" సదాశివంమీద అరిచాడు శక్తి.

"నువ్వు బలవంతం చెయ్యకుండా వస్తానంటే అలానే తీసుకెళ్లు" పందెం విసిరాడు సదాశివం.

"నా చెల్లిని నేను ఎలాగైనా తీసుకువెళ్తాను. రా కుంజా." అంటూ చెల్లెలి చేయి పట్టుకొని వీధివైపు లాక్కెళుతున్నాడు శక్తి. సదాశివం విడిపించటానికి ప్రయత్నిస్తూ శక్తిని ఒకతోపు తోశాడు. ఆజానుబాహుడైన సదాశివం తోపుకి శక్తి వీధిలోకి వెళ్లిపడ్డాడు. ఇప్పటివరకూ సదాశివం అంటే షణ్ముగవడివుకే ద్వేషం. ఈ క్షణం నుంచి శక్తి కూడా ఇతన్ని ద్వేషించటం మొదలుపెట్టాడు. "ఒరేయ్! పోలీసులతో వచ్చి నీ అంతు చూస్తారా.. నా చెల్లిమీద నీ అధికారమేంట్రా? నా చెల్లిని తీసుకువెళ్తారా" అంటూ అరుస్తున్నాడు.

సుబ్బలక్ష్మిని లోపలికి పంపి తలుపులు వేసి, చాలాసేపు శక్తి మీద అరిచి లోపలికి వచ్చాడు సదాశివం. ఉద్వేగంలో ఉన్నాడు. "ఒరేయ్! ఈ గోల మనకెందుకురా" అంటూ తల్లి మొదలుపెట్టింది.

గుడ్లు ఉరిమి చూసి "అమ్మా!" గట్టిగా కేకవేశాడు. "నువ్వు వెళ్లి భోజనాలు పెట్టు ఎవరొచ్చినా కుంజా ఉండేది ఇక్కడే" తన నిర్ణయం చెప్పాడు.

సుబ్బలక్ష్మి స్థితి వర్ణనాతీతం. మంగళంకి ససేమిరా ఇష్టం లేదు తను వాళ్ల ఇంటి ఉండటం. తనకీ ఇష్టంలేదు. కానీ తప్పటంలేదు. అన్న తనవల్ల తోయబడ్డాడ తల్లడిల్లిపోతుంది. తను రాను అని అన్నందుకు అమ్మ మళ్లీ బాధపడుతుంది. సుబ్బలక్ష్మి ఇది తలుచుకొని కుమిలిపోతుంది.

"కుంజా!" అంటూ అదే ఉద్వేగంతో సుబ్బలక్ష్మిని పిలిచాడు.

"ఏంటి మామా" ఏడుస్తూ వచ్చింది సుబ్బలక్ష్మి.

"ఏడువకు కుంజా, నేనున్నానుగా. రేపు పోలీసులు వచ్చినా నువ్వు రాను అ వాళ్లు ఏమీ చేయలేరు. నేను మేజరుని, నా ఇష్టప్రకారమే ఈ ఇంట్లో ఉంటున్నా చెప్తే వచ్చిన దోవనే వెళ్తారు. అర్థమయిందా కుంజా? ఇంక నేను ఏమి చెప్పినా న సరేనను. అసలు నేనే మాట్లాడతాను. నువ్వేమీ మాట్లాడకు. నిన్ను ఒక్కటే అడుగుత నువ్వు ఇక్కడ నీ ఇష్టపూర్వకంగానే ఉంటున్నావా లేక నిన్ను నేను బలవంతపెడుతున అని. నన్ను ఎవరూ బలవంతపెట్టటంలేదు అని చెప్పు. నేను మా ఇంటికి వెళ్లదలచుక అని చెప్పు. సరేనా కుంజా."

సరైన నిర్ణయం తీసుకొని మదురై నుంచి మద్రాసుకైతే చేరింది కానీ, ఇక్కడ నుంచి బుర్రకు పదునుపెట్టే మనస్సుని. ఆలోచింపచేసే శక్తినీ కోల్పోయింది. మళ్లీ అసలు సుబ్బలక్ష్మి అయింది. అమ్మ ముందుకు నెట్టందే ఏ పనీ చేయలేని తల్లిచాటు సుబ్బలక్ష్మి, వేల సుబ్బలక్ష్మి అయింది. సంగీతంలో తనకి ఇప్పటిదాకా ఇంత పేరొచ్చిందంటే దానికి కారణం తల్లి. తల్లి నేర్పితే వచ్చిన సంగీతమేకాదు, తల్లి గర్భంలో ఉన్నప్పటినుంచీ తల్లి పంచి ఇచ్చిన సంగీతం. షణ్ముగవడివు తన గురువు ఒక్కటే కాదు, సంస్కారం నేర్పిన తల్లి, పద్ధతిగా పెంచిన తల్లి, తోడుగా ఉండి జీవితంలో ఒకొక్క మెట్టూ జాగ్రత్తగా ఎక్కిస్తున్న తన గురువు, నెయ్యం, బాంధవ్యం తన సరస్వం. అలాంటి తల్లిని కాదని, లాగి వెనక్కితోసి తను ముందుకు ఉరికింది. అమ్మ, అన్న, చెల్లి, సంగీతంతో పెనవేసుకుపోయిన కుటుంబం సుబ్బలక్ష్మిది. తల్లి అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్న కూతురు ఒక్కసారిగా వేరుబాట పట్టింది. ఒక్క పోషకుల విషయంలోనే ఇద్దరికీ పొసగలేదు. తల్లి, 'ఇది మన కులపద్ధతి, ఇందులో తప్పే లేదు అంటుంది.' 'తప్పుకాకపోవచ్చు కానీ ఇప్పటి సమాజం వేలెత్తి దెప్పుతుంది. ఈ పద్ధతి కాకుండా మనం ఇంకో మంచి పద్ధతిని ఎన్నుకునే స్వేచ్ఛ ఉండగా సమాజానికి చులకనవ్వటం ఎందుకు?' అని కూతురు భావన. ఈ భావన నరనరాన ఇంకి, ఇంటినుంచి వచ్చేసింది. వచ్చేప్పుడు ఇక వెనక్కి వెళ్లకూడదని నిశ్చయించుకునే వచ్చింది. తను వెనక్కి వెళితే ఏమవుతుందో తెలుసు. ఈసారి మాటలు, నచ్చచెప్పటాలు ఉండవు. ఆ పోషకుడు ఎప్పటినుంచో ఎదురుచూస్తున్నాడు. తనని తీసుకెళ్లి వాడి బారిన పడేయటమే. అన్న అలా ఏమీ కాకుండా చూసుకుంటానని మాట ఇచ్చినా నమ్మలేదు. అన్నమీద నమ్మకం లేక కాదు. అక్కడ అమ్మదే రాజ్యం. అమ్మ కనుసన్నల్లో కదలాడే మామలదే ఏలుబడి. అమ్మని వదలి వచ్చిన వ్యధ, అన్నను కాదన్న బాధ ముందుముందు ఏమవుతుందోనన్న భయంతో ఇప్పటికిక సుబ్బలక్ష్మి శక్తి అడుగంటింది. ఇప్పుడు తనకు కాస్త ధైర్యాన్నిచ్చి, తనకు రక్షణను ఇస్తూ కాపాడే మనిషి కావాలి. సదాశివం ఆ మనిషయ్యాడు, ఈ విషయంలో ఎలాంటి సందిగ్ధత లేకుండా. సుమారు ఆరేడు నెలల క్రితం అప్రయత్నంగా చూసిన సుబ్బలక్ష్మి గుండెల్లో గూడుకట్టుకు కూర్చుంది. తనకు భార్య, ఇద్దరు పిల్లలున్నారనే నిజం కూడా ఆ గూటిని కదిలించలేకపోయింది. ముందుముందు సుబ్బలక్ష్మితో ఎలాంటి బాంధవ్యం నెరుపుదాం అనే దానిమీద ఇప్పటికింకా స్పష్టత లేదు. కానీ సుబ్బలక్ష్మిపట్ల అకర్షణ అణువణువూ ఉంది. అలాంటి సుబ్బలక్ష్మే సాయంకోరి తన వాకిట్లో నిలబడితే నింగీ నేల ఒక్కటి చేసయినా సుబ్బలక్ష్మికి నీడనివ్వటానికి నిశ్చయించుకున్నాడు.

ఈ అనిశ్చిత స్థితిలో,



"అలాగే మామా మీరు చెప్పినట్లే చేస్తా. నేనేమీ మాట్లాడను" అని మాట ఇచ్చింది.

𝄞𝄞

మద్రాసు నుంచి మెయిలు వచ్చేవేళ అవుతుంది. షణ్ముగవడివు కూతురికోసం తహతహలాడుతుంది. "ఒరేయ్ మణీ! కుంజా కోసం హల్వా తీసుకురారా, తొందరగా" అంటూ పురమాయించింది. "దానికి నెయ్యి బాగా వేసి అన్నంపెట్టాలి" చిత్రకి చెప్పింది.

"ఇదిగోండి, దానిని ఎవరూ ఏమీ అనవద్దు సరేనా, అది వస్తుంది అదే పదివేలు."

రైలుబండి కూత వినిపించింది. "అదిగో మెయిలు వచ్చింది. సుందరం, మణీ మీరిద్దరూ కూడా ఎదురువెళ్లి తీసుకురండి దాన్ని" షణ్ముగవడివు ఆనందానికి అవధులు లేకుండా ఉన్నాయి.

తొందరగా చాప పరిచి, తన వీణ తీసుకొని కూతురికి ఇష్టమయిన కల్యాణి రాగం వాయించటం మొదలుపెట్టింది. తల్లి వీణమీద పలికించే అన్ని రాగాల్లోకెల్లా సుబ్బలక్ష్మికి కల్యాణి రాగం చాలాచాలా ఇష్టం. వాకిలివైపు చూసుకుంటూ ఆనంద బాష్పాలు రాలుస్తూ కల్యాణి రాగంతో కూతురుకి స్వాగతం పలుకుతుంది. కాసేపటికి ఎదురుకోళ్లకు వెళ్లిన తమ్ముళ్లు వచ్చారు. కూతురు లేదు. ఇంకాసేపటికి శక్తి వచ్చాడు. కూడా కూతురు లేదు.

"కుంజా ఏదిరా?" వాళ్లవైపు చూస్తూ ఇంకా వెతుక్కుంటూనే అడిగింది. "తర్వాత వస్తానందమ్మా" దాటేయటానికి ప్రయత్నించాడు శక్తి. "రానందా.. ఎందుకట?"

"అది వస్తానన్నా వాడు రానిచ్చేటట్టు లేడు."

"అయితే ఇంకే, పోలీసుల్ని తీసుకెళ్దాం."

"అదీ కనుక్కొని వచ్చానమ్మా. బాగా మందుజల్లాడు దానిమీద. కుంజా రానన్నంతవరకూ పోలీసులు కూడా ఏమీ చేయలేరు. మనం అభాసుపాలవుతాం."

"నేను రమ్మన్నానని చెప్పలా..?" రూఢిపరుచుకుంటుంది షణ్ముగవడివు.

"చాలాసార్లు చెప్పానమ్మా."

"నీకు కుదరలేదురా. ఈసారి మామల్ని పంపిస్తాను..." రెండోసారి కూతురు గుండెల్లో కొట్టిన దెబ్బను దిగమింగటానికి చాలా ప్రయత్నిస్తుంది షణ్ముగవడివు.

ఇంకొకసారి తమ్ముళ్లను పంపింది పట్నంకి. ఈసారికూడా కూతురు వెనక్కి రాలేదు. లోలోన క్రుంగిపోసాగింది షణ్ముగవడివు. సదాశివం ఇప్పుడు ఇంటిల్లిపాదికీ శత్రువై కూర్చున్నాడు.

𝄞𝄞

ఇంకో నాలుగు రోజులు గడిచాయి. సుబ్బులక్ష్మికి వేరే ఆలోచనలు లేకుండా ఉండటానికి వెంటనే ఒక కచేరీ అవకాశం కుదిర్చాడు సదాశివం. “కుంజా! నాకు బాగా తెలిసినవాళ్లది పెళ్లి ఉంది రేపు సాయంత్రం. నువ్వు కచేరీ చేస్తావని చెప్పాను. రేపు సాయంత్రానికి తయారవ్వు.” మంగళం వింది. “ఆ.. పాటలుపాడే పిల్లా? నేరుగా ఇంటికి తీసుకువస్తే మా పిల్లేమోననుకున్నా. ఈ పిల్ల ఒద్దిక, రంగు చూసి అనుమానం కూడా రాలేదు సుమా. దాసీల పిల్లా? శివశివా... ఏం పోయేకాలం వచ్చింది వీడికి, సిగ్గులేని పనులు చేస్తున్నాడు?' అంటూ తిట్ల దండకం అందుకుంది.

సదాశివం ఏమీ వినబడనట్లే ఉన్నాడు. మంగళంకి తెలిసినట్లు ఊళ్లోవాళ్లకి కూడా మెల్లగా తెలుస్తుంది. ఒకరోజు ఆఫీసులో కృష్ణమూర్తి అడగనే అడిగాడు. “సుబ్బులక్ష్మి మీ ఇంట్లో ఉందట?”

“అవును కృష్ణమూర్తి, వాళ్లమ్మ పోషకుల దగ్గరికి పంపుతుంటే ఇష్టంలేక వచ్చేసింది. నేను కూడా సాయం చేయకపోతే ఎటువెళ్తుంది ఆడపిల్ల? మనం కాంగ్రెసువాళ్లం. సమాజంలో కుళ్లుని మనం కడిగేయకపోతే ఇంకెవరు చేస్తారు?” చిన్నపాటి భాషణ ఇచ్చాడు. కృష్ణమూర్తి ఏమీ మాట్లాడలేదుకానీ ఆ నిశబ్దంలో “ఆహా.. అబ్బా” అనే వెటకారపు మాటలు వినిపించాయి సదాశివానికి. మిగతావాళ్లు ఏమీ అడగకుండానే అంతా కనిపిస్తుంటే ఇంకేమి అడగాలి అనుకొని, సదాశివం ‘చిన్న ఇల్లు’ ఏర్పాటు చేసుకున్నాడని చెవులు కొరుక్కుంటున్నారు.

నవ్వుతూ, తుళ్లుతూ, కళగా ఇల్లంతా తిరిగే కూతురు లేక, సంగీత సాధన చేసే మనసు, మనుషులు లేక షణ్ముగవడివు ఇల్లు చిన్నబోయింది.

𝄞𝄞𝄞𝄞

ఒకరోజు ‘ఆనంద వికటన్’ పత్రిక కార్యాలయానికి సినిమా దర్శకుడు సుబ్రహ్మణ్యం వచ్చాడు. వాసన్ లేకపోవటంతో సదాశివంతో మాట్లాడుతూ కూర్చున్నాడు. కుంభకోణం మహామహంలోనే సదాశివం పరిచయం సుబ్రహ్మణ్యంకి. అక్కడ సదాశివం ఖాదీ బట్టలకొట్టుని నిర్వహించాడు కాంగ్రెసు తరుఫున. “ఏంటి సుబ్రహ్మణ్యంగారూ.. ఏంటీ విశేషాలు, ఎలా నడుస్తున్నాయి మీ సినిమాలు. తరువాత సినిమా ఏంటీ?”

“ఆ పనిమీదే వచ్చాను సదాశివం. మీ పత్రికలో ఒక హిందీ నవలని ఆర్.ఎస్. సుబ్బులక్ష్మి తమిళంలో అనువదిస్తుంది. నాకా కథ బాగా నచ్చింది. ఈ నవలను ఈసారి సినిమాగా తీద్దామని. పైగా నాకొక మంచి సాంఘిక కథ అవుతుంది. ఇప్పటిదాకవన్నీ పౌరాణికాలు.”

“ఈ నవల దేనిగురించి? కథేంటి?” అడిగాడు సదాశివం.



వాసన్ ఇంకా రాలేదు. ఇంక చేసేదేమీ లేక సదాశివంకి కథ చెప్పటం మొదలుపెట్టాడు సుబ్రహ్మణ్యం. “విను, ఒక చిన్న పిల్లను ఒక వయసు మళ్లిన చాదస్తుడికి ఇచ్చి చేస్తారు ఆమె తల్లితండ్రులు. అతడు రాచిరంపాన పెడుతుంటాడు ఆ అమ్మాయిని. తట్టుకోలేక ఇంట్లో నుంచి పారిపోతుంది. కానీ, సానివారి చేతిలో పడి అక్కడికి వచ్చే మగవారిని తన పాటలతో ఆహ్లాదపరుస్తూ ఉంటుంది. పాపం ఇక్కడ తన భర్త ఇంట్లోకన్నా ఎక్కువ బాధలు అనుభవిస్తుంది. ఆత్మహత్య చేసుకోవాలనుకుంటుంది. ఇంతలో ఆమెని ఒక మంచి కుటుంబం చేరదీసి, ‘సేవాసదనం’ అనే ఆశ్రమంలో చేర్పిస్తారు. అక్కడ తనలాంటివారికి మంచి కర్తవ్యం బోధిస్తూ, తన భర్తలో కూడా చివరకు మార్పుతెస్తుంది.” ముగించాడు సుబ్రహ్మణ్యం. సదాశివం ఆలోచిస్తూ ఉన్నాడు. చాలాసేపటిదాకా ఏమీ మాట్లాడకుండా కిందకీ, మీదకీ చూస్తూ తెగ ఆలోచిస్తున్నాడు.

“ఏంటి సదాశివం, కథ నచ్చలేదా నీకు?” అడిగాడు సుబ్రహ్మణ్యం.

“సుబ్రహ్మణ్యంగారూ.. మీ కథలో హీరోయిన్ పాటలు పాడాలి కదా?”

“పాటలు పాడాలి. ఏడుపూ ఏడవాలి, పాటలు రాకపోయినా పర్వాలేదు. ఇప్పుడు ప్లేబాక్ వచ్చిందిగా... ఏడవటం మాత్రం హీరోయినే చేయాలి.”

“సుబ్రహ్మణ్యంగారూ! మీకు ఈ రెండు పనులు బ్రహ్మాండగా చేసే ఒక అమ్మాయి పేరు చెప్తాను. మీరు ఆ అమ్మాయినే హీరోయిన్‌గా పెట్టుకుంటానంటే వాసన్‌తో మాట్లాడి మీకు ఆ సినిమాకి హక్కులు ఇప్పించేస్తా.”

“ఎవరా అమ్మాయి? ఎవరు సదాశివం?”

“చెప్తాను. మరి మీరు మాటిస్తారా?”

“లక్షలతో వ్యవహారం. సినిమా అంతా హీరోయిన్ చుట్టూతూనే తిరుగుతుంది. అలాంటి హీరోయిన్ ఎవరో ఏంటో తెలుసుకోకుండా ఎలా?”

“సరే, ఎవరో చెప్తాను, ముందు కాస్త బయటికి వెళ్దాం రండి.” బయటకు వచ్చిన తర్వాత, “ఇది చెప్పండీ.. ఈ కథ హక్కులకు ఎంత పెడదామనుకుంటున్నారు?”

“ఎంతా? ఎంతో పెట్టలేను సదాశివం.. నా గత రెండు సినిమాలు సరిగ్గా పోలేదు. ‘పావలక్కోడి’ ఒక్కటే బాగాడింది. ఇప్పుడు ‘బాలయోగిని’ ఎలా ఆడుతుందో చూడాలి. ప్రస్తుతం నష్టాల్లో ఉన్నా ఊరికే ఇస్తే బాగుండు.”

“అది మా వాసన్ దగ్గర కుదరదు.”

“తెలుసు. అందుకే ఎంత తక్కువకి ఇస్తే అంత నయం.”

“సుబ్రహ్మణ్యంగారూ, నేను మీకు హక్కులు ఎంత తక్కువకి వీలైతే అంత తక్కువకి

ఇప్పిస్తా.. నేను చెప్పిన హీరోయిన్‌ని పెట్టుకోండి. ఆ అమ్మాయి గొప్ప సంగీత
విద్వాంసురాలు. మీకు పాటలకి ఇంకోళ్లని పెట్టుకునే పనికూడా ఉండదు."

"ఎవరు ఆ అమ్మాయి?"

"సుబ్బలక్ష్మి."

"సుబ్బలక్ష్మా.. ఏ సుబ్బలక్ష్మి?"

"ఈ నవల తర్జుమా చేస్తున్న ఆర్.ఎస్. సుబ్బలక్ష్మి కాదు, మీ భార్య ఎస్.డి. సుబ్బలక్ష్మి
అంతకన్నా కాదు, ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి."

"ఎవరూ మదురై సుబ్బలక్ష్మా.. ఇప్పుడు మీ ఇంట్లో ఉంటుందని విన్నాను. ఆ
అమ్మాయా?"

"అవును సుబ్రహ్మణ్యంగారు. ఆ సుబ్బలక్ష్మే."

"ఆ అమ్మాయి పాటలయితే బ్రహ్మాండంగా పాడుతుందికానీ మరి నటించటం.."

"జీవిస్తుంది సుబ్రహ్మణ్యంగారు. ఏడుపులో జీవిస్తుంది."

ఏంటీ ఇంత ధీమాగా చెప్తున్నాడన్నట్లు, ఏమీ అర్థంకాక చూస్తున్నాడు సుబ్రహ్మణ్యం.

"ఇప్పుడు సుబ్బలక్ష్మి పరిస్థితి అదే సుబ్రహ్మణ్యంగారు, వాళ్లమ్మ చేసే పనులు ఇష్టంలేక
ఇంటినుంచి వచ్చేసింది. ఇక అప్పటినుంచి ఏడుపులే, ఏడుపులు. ఓదార్చటం మా
అమ్మవల్ల, నావల్ల కావటంలేదు."

ఆత్రంగా సుబ్రహ్మణ్యం వంక చూస్తున్నాడు సదాశివం, ఒప్పుకుంటాడా లేదా అని.
ఆలోచనలో ఉన్నాడు సుబ్రహ్మణ్యం. "ఆ పిల్ల బాగా నిదానమే.." "సుబ్రహ్మణ్యంగారూ!
మీరు సరేననండి. నేను పక్కనుండి బాగా సాధనచేయించి, నటించేలా చూస్తా. పైగా మీ
ఆవిడ కూడా మంచి స్నేహితురాలు సుబ్బలక్ష్మికి. మనం చేయించగలం."

సుబ్రహ్మణ్యం ఆలోచిస్తున్నాడు. సదాశివం 'మనం, మనం అంటున్నాడు, సినిమాలో
పూర్తిగా లీనమయిపోతాడు సుబ్బలక్ష్మిని తీసుకుంటే. ఈ నెలలోనే రాజగోపాలాచారి
మద్రాసు ప్రెసిడెన్సీకి ప్రధానమంత్రి అయ్యాడు. రాజగోపాలాచారి దగ్గరికి సదాశివం
నేరుగా వెళ్లి మాట్లాడగలడు. ఏ పనైనా ఉంటే చేసిపెడ్తాడు సుబ్బలక్ష్మిని హీరోయిన్‌గా
తీసుకుంటే. వాసన్‌తో మాట్లాడి అతి తక్కువ ధరకి ఇప్పిస్తాడు హక్కులు, సుబ్బలక్ష్మిని
హీరోయిన్‌గా తీసుకుంటేనే, లేకపోతే పూర్తిగా చెడగొట్టే సమర్థుడు కూడా. సుబ్బలక్ష్మి
బ్రహ్మాండంగా పాటలు పాడుతుంది. సినిమాకి కావలసింది అవే. కానీ నటన అనుమానమే.
ఈ విషయంలో సదాశివం భరోసా ఇస్తున్నాడు. బాగా ఆలోచించి, "సరే సదాశివం
సుబ్బలక్ష్మినే తీసుకుందాం హీరోయిన్‌గా, మరి చివరికి నన్ను ఏడిపించవుగా" సదాశివం



మొహంలో వేనవేల సూర్యుల వెలుగు చూశాడు సుబ్రహ్మణ్యం. ఆ వెలుగు అతనికి తన
భవిష్యత్తు తెలిపింది.

సంతోషంతో ఇంటికి చేరాడు సదాశివం. సుబ్బలక్ష్మి పిల్లలని ఆడిస్తూ ఉంది.
"కుంజా! ఇటురా" అంటూ పిలిచాడు. "నీకొక ముఖ్యమైన విషయం చెప్తాను, జాగ్రత్తగా
విను."

"నీకు సినిమా హీరోయిన్ సుబ్బలక్ష్మి తెలుసుకదా."

"మా సుబ్బలక్ష్మి అక్క! తెలుసు" గర్వంగా చెప్పుకుంది సుబ్బలక్ష్మి. "వాళ్లాయన
సుబ్రహ్మణ్యం సినిమా దర్శకుడు. ఒక సినిమా తీస్తున్నాడు. దానిలో నిన్ను హీరోయిన్‌గా
ఒప్పించి వచ్చా. ఇక నువ్వు ఆ సినిమా చేయాలి. కాదనకు." ఇప్పుడే ఏడుపు మొహం
వేసింది సుబ్బలక్ష్మి. "మామా... సినిమానా?" అంతా అయోమయంగా ఉంది సుబ్బలక్ష్మికి.

"అదంతా నేను, మీ సుబ్బలక్ష్మి అక్కా పక్కనుండి చూసుకుంటాం. నువ్వు చెప్పింది
చేయి చాలు, సరేనా? పైగా నువ్వు ఈ సినిమా చేస్తున్నట్లు సంతకాలు పెట్టిన తర్వాత
నిన్నెవరూ ఇక్కడనుంచి తీసుకెళ్లలేరు. సుబ్రహ్మణ్యం కూడా నిన్ను కనిపెట్టుకొని
ఉంటాడు. నిన్ను తీసుకువెళ్తే అతనికి బోలెడంత నష్టం."

సినిమా మాట ఎలా ఉన్నా సుబ్బలక్ష్మికి చివరి మాట నచ్చింది. అమ్మ తనని
తీసుకువెళ్లే ప్రయత్నం ఎన్నటికీ మానదు. ఇప్పుడు ఆ సినిమా ఒప్పుకుంటే తనకు
రెండింతలు రక్షణ. ఖాళీగా కూర్చోకుండా ఒక వ్యాపకం ఉంటుంది. ఆ తర్వాత మెల్లగా
తన దారి తను చూసుకోవచ్చు అనుకుంది. ఇక నటించటమా తనకు వచ్చిందేదో అదే
చేయగలదు. ఆపై ఉంచినా తీసినా తనకు వచ్చే నష్టమేమీ లేదు. ఇలా ఆలోచించి "సరే
మామా, మీ ఇష్టం" అంది.

"హమ్మయ్య" అనుకుంటూ లేచాడు సదాశివం.

మళ్లీ సదాశివం మొహం వెలిగిపోతుంది. సుబ్బలక్ష్మి సినిమా ఒప్పుకుంటూ
సంతకాలు చేస్తుంది కాబట్టి, మద్రాస్ నుంచి ఎవరూ లాక్కెళ్లలేరు. అసలు సుబ్బలక్ష్మే
వెళ్లాలనుకున్నా వెళ్లలేదు. సుబ్బలక్ష్మి తన దగ్గర ఎంత లేదన్నా ఒక సంవత్సరం
ఉండిపోయేటట్లు ఏర్పాటు చేసుకున్నాడు సదాశివం.

𝄞𝄞

సదాశివం వాసన్ దగ్గర చాకచక్యంగా వ్యవహరించి ఆ కథ హక్కులు నాలుగు
వేల రూపాయలకి ఇచ్చేటట్లు చేశాడు. సుబ్రహ్మణ్యం గత ఐదు సంవత్సరాల నుండి
ఐదు సినిమాలు తీశాడు. వీటిలో వరుసగా నాలుగు పౌరాణికాలు. ప్రగతిశీల భావజాలం

ఉన్న సుబ్రహ్మణ్యం తన ఐదవ సినిమా 'బాలయోగిని'లో బాల వితంతువుల వ్యధ తెరకెక్కించి, ఈ ఆచారం ఎంతవరకు సమంజసం అని ప్రశ్నించాడు. ఇప్పుడు సుబ్బలక్ష్మితో అనుకున్న కథ కూడా ఒక సాంఘిక దురాచారాన్ని దుయ్యబడుతుంది. తాతా, తండ్రి వయస్సున్న మగవాళ్లు చిన్న వయసున్న ఆడపిల్లల్ని పెళ్లిళ్లు చేసుకొని వాళ్ల జీవితాలను నాశనం చెయ్యటం గురించి చర్చిస్తుంది. భారతదేశంలో ఈ కాలం సంస్కరణల కాలం. తమ భావాలని ప్రజల్లోకి తీసుకువెళ్లటానికి సుబ్రహ్మణ్యంలాంటి ప్రగతిశీల వాదులు, అత్యంత ప్రభావవంతమైన సినిమాని ఎంచుకుంటున్నారు.

సినిమా పేరు 'సేవాసదనం' అనే ఖరారు చేశారు. 'ఆనంద వికటన్'లో ఈ ధారావాహికం పేరు కూడా అదే. మున్షి ప్రేమ్‌చంద్ ఈ కథ రచయిత. ఆయన హిందీలో 1919లో రాసిన ఈ నవల పేరు కూడా ఇదే. సంగీత దర్శకుడుగా 'తమిళ త్యాగరాజు'గా పిలవబడే వాగ్గేయకారుడు పాపనాశం శివన్‌ని పెట్టుకున్నారు. శివన్ ఇంతకు ముందే సుబ్రహ్మణ్యం రెండు సినిమాలకి సంగీత దర్శకత్వం చేశాడు. శివన్ కర్ణాటక సంగీత ప్రజ్ఞ కలిగిన వ్యక్తి. సుబ్బలక్ష్మి నటించే పాత్ర పేరు సుమతి. ఈ పాత్ర పెళ్లి చేసుకునేది ఒక వృద్ధుడిని. ఆ పాత్రకి నటేశ అయ్యర్ అనే ప్రముఖ నాటకరంగ కళాకారుడుని తీసుకున్నారు.

సుమతి స్నేహితురాలుగా అంతకు ముందు 'బాలయోగిని'లో చేసిన ఎస్. వరలక్ష్మిని తీసుకున్నారు. అన్నీ ఖరారు అయిన తర్వాత పత్రికలకు సమాచారాన్ని ఇచ్చారు. ఈ పత్రికల ద్వారా, ఇతరత్రా సుబ్బలక్ష్మి సినిమాల్లో చేరుతుందని షణ్ముగవడివుకు తెలిసింది.

"ఏరా! ఏమనుకుంటుంది ఇది. సినిమాల్లో చేరటమంటే? ఆ సినిమాలేంటో ఆ కథేంటో నేను కళ్లారా చూశాను. ఒరేయ్! మీరు ఏమైనా చేయండి, దాన్ని అక్కడ నుంచి తీసుకురండి, సినిమాలో చేరి దాని బతుకు నాశనం చేసుకోనివ్వద్దు, దీన్ని సినిమాల్లో చేర్చి సంపాదించాలనుకుంటున్నాడు వాడు." సుబ్బలక్ష్మిని పట్నం నుంచి ఎత్తుకు రమ్మని పురమాయించింది. షణ్ముగవడివు మద్రాసు సినీ ప్రపంచాన్ని దానిలో ఒక భాగమై గమనించింది. అక్కడ పొంచి ఉన్న ఆపద బారిన తన కూతురు పడకూడదని ఆమె తపన.

1937 మార్చిలో సుబ్బలక్ష్మి సదాశివంతోపాటు సుబ్రహ్మణ్యం స్టూడియోలో అడుగుపెట్టింది. పాటల రికార్డింగు స్టూడియోలు సుబ్బలక్ష్మికి కొత్తకాదు. కానీ ఈ సినిమా స్టూడియో పూర్తిగా కొత్తగా ఉంది. సుబ్రహ్మణ్యం అతని భార్య ఎస్.డి. సుబ్బలక్ష్మి వచ్చి స్వాగతం పలికారు. వాళ్లిద్దరినీ చూడగానే సుబ్బలక్ష్మికి మొదట గుర్తొచ్చింది వాళ్ల అమ్మ చెప్పిన మాట... "తరువాత సినిమాకి కూడా హీరోయిన్ అదే అయింది కనుక సరిపోయింది కానీ, ఆ తర్వాత సినిమా హీరోయిన్ దీనికి సవతి కాకపోతే అడుగు."





దర్శకుడు కె.సుబ్రహ్మణ్యం, అతని భార్య ఎస్.డి.సుబ్బులక్ష్మి, బాలనటి బేబి సరోజలతో సుబ్బలక్ష్మి

అని. ఆ తర్వాత సినిమా ఈ సినిమానే... ఆ తర్వాత హీరోయిన్ సుబ్బలక్ష్మే... ఒక్కసారిగా సుబ్బలక్ష్మి వెన్నులో వణుకు పుట్టింది.

"సుబ్బలక్ష్మీ! ఈరోజు ముహూర్తపు పూజ మన సినిమాకి, నువ్వు రోజూ రావాలి ఇకనుంచి. నీ పోర్షన్ ఉన్నా లేకున్నా" చెప్పాడు సుబ్రహ్మణ్యం.

రోజూ సుబ్బలక్ష్మిని సదాశివం స్టూడియోకి తీసుకువెళ్తున్నాడు. ఒకరోజు "కుంజా! నేను ఒకసారి ఆఫీస్‌కి వెళ్లొస్తాను. నువ్వు జాగ్రత్తగా ఉండు. నేను వచ్చిన తర్వాత స్టూడియోకి వెళ్దాం" అని చెప్పి బయటికి వెళ్లాడు.

తిరిగి ఇంటికి వచ్చేసరికి మంగళం బిక్కుబిక్కుమంటూ కూర్చొని ఉంది. సదాశివంని చూడగానే అరుపులు మొదలుపెట్టింది. "నేను ముందే చెప్పానురా.. మనకి ఆ అమ్మాయి వద్దు వాళ్ల గొడవలు వద్దు అనీ.. నువ్వు వింటావా.. ఇంకాస్త ఉంటే నన్ను చితకబాది వెళ్లేవాళ్లు. పిల్లలు భయంతో వణికిపోతున్నారు." సదాశివం మనసు కీడు శంకించింది.

"కుంజా ఏదమ్మా?"

"ఇంకెక్కడ కుంజా... కుంజా లేదు గుంజా లేదు. వాళ్లవాళ్లు ఎత్తుకుపోయారు. మనకెందుకురా ఇవి? ఇప్పటికైనా వదలరా, ఆ అమ్మాయి దోవన ఆ అమ్మాయి వెళ్లిపోయింది."

"అమ్మా! నీకు దండం పెడుతున్నా. నాకొక్క విషయం చెప్పు కుంజానే ఇష్టంగా వెళ్లిందా, వాళ్లు లాక్కెళ్లారా?"

మంగళం నీళ్లు నములుతుంది. అసలు సంగతి చెబితే కథ మళ్లీ మొదలుకొస్తుందని... సదాశివానికి అర్థమయిపోయింది. "సరేనమ్మా, వాళ్లు ఎటువైపు వెళ్లారు? ఎంతమంది వచ్చారు. దేంట్లో వచ్చారు, వెళ్లారు?"

వీటన్నటికీ సమాధానాలు రాబట్టుకొని సుబ్రహ్మణ్యం దగ్గరకు వెళ్లి, విషయం చెప్పి స్టూడియోలో పనిచేసే ఇరవైమందితో బయలుదేరాడు.

"సదాశివం.. ఈ పట్నంలో ఎక్కడెక్కడని వెతుకుతాం.." అడిగాడు సుబ్రహ్మణ్యం దోవలో.

"నాకు తెలిసి వాళ్లు నాలుగుచోట్ల ఉంటారు. పట్నంలో ఈ నాలుగుచోట్లా ఉండకపోతే పట్నం దాటినట్లే. అప్పుడైనా ఎక్కడికీ వెళ్లరు. మదురైకే. మీరేమీ భయపడకండి. నేను తీసుకువస్తా కుంజాని."

సదాశివం అనుకున్న రెండుచోట్లా లేదు సుబ్బలక్ష్మి. మూడోచోట, తేనామ్‌పేట ప్రాంతంలో ఒక ఇంట్లో దాచిపెట్టినట్లు కనిపెట్టాడు సదాశివం. మదురైనుంచి వచ్చిన



పదిమందితో, పట్నం వాళ్లు ఇరవైమంది ముష్టి యుద్ధాలు చేసి, సుబ్బలక్ష్మిని ఇంటికి తిరిగి తీసుకొచ్చాడు సదాశివం. ఇంట్లో చెమటలు తుడుచుకుంటూ, "సదాశివం ఇలా అయితే కష్టంకదా... వాళ్లు మళ్లీమళ్లీ వస్తూనే ఉంటారు కదా.. పోలీసుల దగ్గరికి వెళదాం."

"ఇది పోలీసులతో అయ్యే పని అయితే వాళ్లే పోలీసుల దగ్గరకి ఎప్పుడో వెళ్లేవాళ్లు. మనం వెళ్లి ఈ విషయం పబ్లిక్ చేసుకోవటం ఎందుకు? పోలీసుల అవసరం లేదు సుబ్రహ్మణ్యంగారూ, కాకపోతే మీరొక పని చేసిపెట్టండి..."

"ఏంటదీ?"

"మీ యక్స్‌ట్రాలకి పోలీసు వేషాలేసి మా ఇంటికి కాపలా పెట్టండి ఒక వారం. ఇక వాళ్లు వచ్చిన దోవన వెళ్లిపోతారు."

"సరే, అలాగే చేస్తాను కానీ.. జాగ్రత్త సదాశివం. సినిమా మొదలుపెట్టేశాము కదా.."

"ఇంక ఇలా జరగదు. కుంజాని ఇక నేను ఒంటరిగా వదలను. నేను ఉద్యోగం వదిలేస్తా." నిర్ణయించేసుకున్నాడు సదాశివం.

❖

ఇక సదాశివానికి ఉన్న ఏకైక పని సుబ్బలక్ష్మిచేత సుమతి పాత్ర బాగా సాధన చేయించటం. సదాశివంకే కాదు సుబ్బలక్ష్మి అందరి బాధ్యత అయ్యింది. సుబ్బలక్ష్మి మాత్రం ఒక్కొక్కసారి ఒక్కొక్కళ్లని ఒక్కొక్కరకంగా దుంపతెంచుతుంది. సదాశివం సుబ్బలక్ష్మికి డైలాగులు చెప్పి, చెప్పించి అలసిపోతున్నాడు. సుబ్రహ్మణ్యం నటన నేర్పుతూ రొప్పుతున్నాడు. ఎస్.డి. సుబ్బలక్ష్మి ఎలా తయారవ్వాలో, ఎలా మేకప్ వేసుకోవాలో చెప్పలేక సతమతమవుతుంది. ఏమి చెప్పినా సుబ్బలక్ష్మి బుర్రకి అంత తొందరగా ఎక్కదు. తనకి ఇవ్వాల్సిన సమయం ఇచ్చి ఆ బుర్ర వెలిగేదాక ఓపిక పట్టాల్సిందే. పాటల విషయానికొస్తే మాత్రం బుర్ర పాదరసంలా పనిచేస్తుంది. పాపనాశం శివన్, సుబ్బలక్ష్మి జత బ్రహ్మాండమైన పాటలు రికార్డు చేస్తున్నారు. ఈ సినిమాలో అనుకున్న ఆరుపాటల్లో ఒక పాట 'నీదు చరణ పంకజములే నమ్మినానమ్మ', 'పల్లవి' గోపాల అయ్యర్ కూర్చిన తెలుగు పాట. 'శ్యామసుందర మదన' అనే పాటని సుబ్బలక్ష్మి మదురైలో నారాయణరావు వ్యాస్ అనే హిందుస్థానీ కళాకారుడు తన ఇంటికి వచ్చి నేర్పితే నేర్చుకున్న పాట. ఇలా ఆరుకు ఆరు చాలా మంచి పాటలు. సుబ్బలక్ష్మి నటన మాట ఎలా ఉన్నా పాపనాశం శివన్ దగ్గర శిష్యరికాన్ని ఆస్వాదిస్తుంది. 'సేవాసదనం' సినిమా పనిమీద నెలలు గడిచిపోతున్నాయి. సదాశివం తన భార్య పుట్టింట్లో ప్రసవించి ఉందనీ, మళ్లీ తనదగ్గరకి తెచ్చుకోవాలనే తలంపే మర్చిపోయాడు. మామ ఉత్తరం వేసి గుర్తుచేశాడు ఈ విషయం. సదాశివం జవాబు కూడా ఇవ్వలేదు. మామ ఒక మనిషిని పంపాడు సదాశివం ఇంటికి.

అతను సదాశివం ఇంట్లో సుబ్బులక్ష్మిని చూశాడు. ... అడిగాడు. మంగళం నెత్తీ నోరూ బాదుకొని, కొంగు నోట్లో నెట్టుకుని ఏడ్చింది. వచ్చిన మనిషి వెళ్లి మామగారితో చూసిందల్లా చెప్పాడు. సదాశివం మామ ఆఘమేఘాలమీద కూతురిని, మనవరాలిని తీసుకువచ్చి సదాశివం దగ్గర దించి వెళ్లాడు.

రోజులు గడుస్తున్నాయి. సదాశివం భార్య అంటే అంటీఅంటనట్లుగానే ఉంటున్నాడు. పైగా అరుస్తున్నాడు. "ఇద్దరు ఉన్నారు ఇంట్లో. మళ్లీ కుంజా ఎందుకు పనిచేయడం, కుంజాకి ఏ పనులూ చెప్పొద్దు. స్టూడియోలో చాలా అలసిపోతుంది." "వేళకి భోజనం కూడా వండలేరా? అక్కడ మాకోసం వందమంది ఎదురుచూస్తూ ఉంటారు" అని అరుస్తూ భార్య పార్వతిని, తల్లిని అదరగొడుతున్నాడు. వీళ్లిద్దరూ బయటకు వెళ్లగానే అత్తాకోడళ్లు ఒకరినొకరు ఓదార్చుకుంటున్నారు.

నెలలు గడుస్తున్నాయి. 'సేవాసదనం' పనులు సుబ్రహ్మణ్యం పర్యవేక్షణలో యుద్ధప్రాతిపదికన నడుస్తున్నాయి. ప్రొద్దున లేచింది మొదలు పడుకునేదాకా సుబ్బులక్ష్మితోనే ఉంటున్నాడు. ఎప్పుడైనా తొందరగా ఇంటికొస్తే పిల్లలని చేరదీస్తున్నాడు కానీ పార్వతికి భర్త స్పర్శ కూడా ఎండమావి అయింది.

షణ్ముగవడివుకి కూతురు కబురే కరువైంది. తనకు చెప్పకుండా ఇల్లు వదిలి వెళ్లినందుకు బాధ. ఎన్ని ప్రయత్నాలు చేసినా వెనక్కి రానందుకు ఆక్రందన, కూతురు సినిమాల్లో చేరినందుకు భయం. తన పద్ధతి కాదంది సరే, మరి ఇప్పుడు కూతురు వేరుగా ఏమైనా చేస్తుందా? ఒకరి పంచన ఉంటుంది. అందులోనూ తను ఏమాత్రం ఆమోదించని వ్యక్తితో. అందుకు ఆక్రోశం. ఇంత వ్యథతో షణ్ముగవడివు క్రుంగిపోతుంది. కచేరీలు కాదుకదా వీణ మీదకు చూపు కూడా వెళ్లటంలేదు. పంచప్రాణమైన తన కూతురు లేకపోయేసరికి ఆరోప్రాణమైన తన వీణ పరాయిదైపోయింది. కూతురి కోసం తను వేసిన ప్రణాళికలు మీనాక్షి అమ్మవారి గుడి రాజగోపురాలంత ఎత్తైనవి. కానీ అవి మధ్యలో ఆగిపోయి అచ్చం తిరుమల నాయకుని అసంపూర్ణ రాజగోపురాన్ని తలపిస్తుంది. తిరుమల నాయకుడు అప్పటికే ఉన్న రాజగోపురాలకంటే ఇంకొక పెద్ద రాజగోపురం కట్టిద్దామని, పునాదులు తీసి కొంతవరకు కట్టుకుంటూ వచ్చాడు. కానీ ఒక ఇరవై అడుగుల ఎత్తు తర్వాత ఇక పని జరగలేదు. అచ్చం ఇలానే షణ్ముగవడివు ఇరవై సంవత్సరాలు గట్టి పునాది వేసింది కూతురికి. ఆ పునాది మీద సౌధం కట్టే లోపల ఆ పునాదే తన పరిధి దాటింది, తన మనస్సులో అసంపూర్ణంగా మిగిలిపోయివున్న తన ప్రణాళికలు, అసంపూర్ణ రాజగోపురంగా జ్ఞప్తికి వస్తున్నాయి.





1938 డిసెంబర్, రెండవ తారీఖున 'సేవాసదనం' విడుదలై, బాగా ఆడటం మొదలుపెట్టింది. సుబ్రహ్మణ్యం, సదాశివం గట్టిగా ఊపిరి పీల్చుకున్నారు.

"ఒరేయ్ సదాశివం! ఆ సినిమా పని అయిపోయింది కదా... ఆ అమ్మాయికి వేరే ఏర్పాటు చూడరా" సదాశివం తీరిగ్గా ఉన్నప్పుడు చెప్పింది మంగళం. అగ్గిమీద గుగ్గిలం అయ్యాడు సదాశివం. పార్వతిని కూడా కలిపి, "మీరిద్దరూ నోళ్లు మూసుకుని ఇంటిపని చూసుకోండి" అని తిట్టిపెట్టాడు.

మూడు వారాలు గడిచేసరికి సేవాసదనం మంచి సినిమాగా పేరుతెచ్చుకుంది. కనకవర్షం కురిపించింది సుబ్రహ్మణ్యంకి. సుబ్బులక్ష్మి పాటలు విపరీతంగా ప్రజాదరణ పొందాయి. గాయనిగా మంచి పేరు సంపాదించింది. నటిగా అత్తెసరు మార్కులు పడినా, సినీనటి అనే ఇంకో గుర్తింపు కూడా వచ్చింది.

'సేవాసదనం' విజయం అందరికీ ఊరటనిచ్చింది కానీ పార్వతికి మాత్రం ఇంకా ఎలాంటి ఊరటా లేదు. ఏ మందూ లేని మనోవ్యాధి బారిన పడింది. తండ్రికి ఉత్తరం వేసింది. ఆయన వచ్చాడు. కూతురిని పోల్చుకోలేకపోయాడు. "అల్లుడుగారూ! ఇంకెన్ని రోజులు ఉంచుతారు ఇంట్లో ఆ మనిషిని? ఇక పంపేయండి" గట్టిగా నిలదీశాడు సదాశివాన్ని.

ఆలోచిస్తున్నాడు సదాశివం. "ఆ అమ్మాయి నా సాయం కోరి వచ్చింది నేను చేస్తున్నాను..." కాసేపాగి "మీరేమన్నా మీ అమ్మాయిని తీసుకెళ్లటానికి వచ్చారా?" అని మామని అడిగాడు. ఈ మాట వినేసరికి తెగేదాకా లాక్కూడదనుకొని కూతురుకి జాగ్రత్తలు చెప్పి వెళ్లిపోయాడు.

ఇక సుబ్బులక్ష్మి కచేరీ వ్యవహారాలు మొదలుపెట్టాడు సదాశివం. మద్రాసులో సంగీత సభల కాలం కూడా మొదలవబోతుంది. సదాశివం పరపతి సంఘంలో కాస్త పెరిగింది. మద్రాసు ప్రెసిడెన్సీ ప్రధానమంత్రి రాజగోపాలాచారికి వ్యక్తిగతంగా తెలిసినవాడిగానే కాకుండా ఒక సంవత్సరంపాటు సుబ్రహ్మణ్యంతో తిరిగి సంఘంలో గుర్తింపు తెచ్చుకున్నాడు. ఆనంద వికటన్‌లో పనిచేసినప్పటి పరిచయాలు ఉండనే ఉన్నాయి. 'సేవాసదనం' సినిమాకి ముందే సుబ్బులక్ష్మికి కర్ణాటక సంగీత గాయనిగా పేరుంది. ఇప్పుడు 'సేవాసదనం'లోని పాటలన్నీ కర్ణాటక బాణిలో ఉండి ఇంకా మంచి పేరొచ్చింది. ఈ సంగీత సభల కాలంలో అన్ని సభల్లో కచేరీలు చేసుకుంటూ దూసుకుపోతుంది.

1938 డిసెంబర్ 27వ తేదీన మద్రాసు మ్యూజిక్ అకాడమీ వారి సభలో కచేరీ చేస్తుంది. సదాశివం ఎదురుగా కూర్చున్నాడు. ఈ దఫా సుబ్బులక్ష్మి కచేరీలకి ఇంకా ఎక్కువమంది శ్రోతలు వస్తున్నారు. సినిమాలు మాట్లాడటం మొదలుపెట్టి ఏడు సంవత్సరాలే

అయింది. ఈ తొలినాళ్లలో సినిమా నటి అంటే జనానికి ఆకాశంలో చందమామ చందం. ఆ చందమామని చూడటానికి జనం బాగా వస్తున్నారు. పెద్దింటి ఆడవాళ్లు కూడా వచ్చారు సుబ్బలక్ష్మిని చూడటానికి. మొత్తానికి సుబ్బలక్ష్మి, జీవితంలో అనుకోని మలుపులోకి వచ్చింది. ఒక మెట్టు పైకి కూడా ఎక్కింది. సదాశివం అందరినీ చూస్తున్నాడు. చివరికి సుబ్బలక్ష్మి మీద దృష్టి సారించాడు. ఇరవై రెండేళ్ల చక్కని పిల్ల. ఆలోచిస్తున్నాడు సదాశివం. 'వజ్రం. నా చేతిలో పడింది. వజ్రమే కానీ ఇంకా సానపట్టగలిగిన వజ్రం. నేను చెప్పినట్లు వింటుంది. ప్రతిభాపాటవాలు కలిగింది. సినిమా నటి. ఈ అమ్మాయితోనే ఇంకో సినిమా తీస్తే..?'

తన ఆలోచనకి తనే ఉత్తేజితుడయ్యాడు. సంవత్సరంపైబడి ఇంకొక పని అంటూ లేకుండా సినిమా లోకంలో గడిపాడు. సినిమా నిర్మాణంలోని సాధక బాధకాలు అన్నీ గ్రహించాడు. ముఖ్యంగా ఒక విజయవంతమైన సినిమా తీయటానికి కావలసిన ముడిసరుకులేమిటో గ్రహించాడు. ఆ ముడి సరుకులని కలగలిపి పదార్థంగా చేయగల యుక్తి తన దగ్గర ఉండనే ఉంది. ఇంకేముంది తక్షణ కర్తవ్యం బోధపడింది.

సుబ్బలక్ష్మి కచేరీ ముగించింది. చప్పట్ల చప్పుళ్లు సదాశివం ఆలోచనలకి విరామం ఇచ్చాయి.

"కుంజా, ఇక వెళ్దామా?"

"మామా.. ఒక గంట తర్వాత జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యంగారి కచేరీ ఉంది. విని వెళ్దాం మామా."

"సరే, అలాగే. నువ్వు ఎక్కడికీ వెళ్లకు. నాపక్కనే ఉండు. నిన్ను జనం గుర్తుపట్టారంటే చుట్టుముట్టేస్తారు" హెచ్చరించాడు సదాశివం.

ఆలోచన వచ్చిందే మొదలు సదాశివం కార్యాచరణకు దిగాడు. హీరోయిన్ తన చేతిలో ఉంది కాబట్టి తన కథ హీరోయిన్ మీద ఎక్కువ నడవాలి. అందుకే కాళిదాసు విరచిత నాటకం, 'అభిజ్ఞాన శాకుంతలం'ని ఎంచుకున్నాడు. చంద్రప్రభ సినీటోన్ అనే నిర్మాణ సంస్థను నెలకొల్పాడు. సినిమా పేరు 'శకుంతల' అని నిర్ణయించాడు. కథ కథనం అన్నీ సిద్ధం చేసుకొని, "కుంజా! రా మనం సుబ్రహ్మణ్యంని కలిసొద్దాం" అన్నాడు సుబ్బలక్ష్మితో హఠాత్తుగా ఒకరోజు. "మామా, సినిమా అయిపోయిందిగా" అంది పిల్లల్ని ఆడిస్తున్న సుబ్బలక్ష్మి.

"నువ్వు మళ్లీ ఇంకో సినిమా చేయాలి కుంజా, ఇప్పుడు వచ్చిన పేరుని నిలబెట్టుకోవాలి. ఇది ఇప్పుడు పూర్తిగా మన సినిమా. నేనే నిర్మాతను. బాగా ఆడిందంటే డబ్బులు మనకే" చెప్పాడు సదాశివం.



THE MUSIC ACADEMY, MADRAS—MUSIC FESTIVAL, 1938.

**Tuesday, 27th December 1938; 4-30 to 7-30 p. m.**

MUSIC

BY

SRIMATHI M. S. SUBBA LAKSHMI AND PARTY.

PROGRAMME (D. V.)

| | | | |
|---|---|---|---|
| *Varnam* | | | |
| Viriboni | Bhairavi | Ata | Adippier |
| *Kritis* | | | |
| 1. Sri Mahaganapathi | Gowla | Triputa | Dikshitar |
| 2. Evarunnaru | Malavasri | Adi | Thyagayyar |
| 3. Vaddane varu | Shanmukhapriya | Adi | " |
| 4. Mariyada kadayya | Bhairavam | Adi | " |
| 5. Karuna | Hemavathi | Rupakam | Ramachandra Sastry |
| 6. Sangeetha gnanamu | Dhanyasi | Adi | Thyagayyar |
| 7. Theertha karai | Huseni | Rupakam | Bharathi |
| 8. Nidu Charana | Kalyani | Adi | Pallavi Gopala Iyer |
| 9. Thiruvai mozhi | Thodi | | |
| 10. Ma ramanan | Hindolam | Rupakam | P. Sivan |

*Ragam, Pallavi*—Sankarabharanam

Miscellaneous: Javali, Ragamalika, Thevaram, Thiruppugaz, Padam, Hindustani, National Songs.

MANGALAM

(*Subject to alteration)

సుబ్బలక్ష్మి కచేరీ వివరాలతో మద్రాస్ మ్యూజిక్ అకాడమీ వారి కరపత్రం, 1938

"మళ్లీ సినిమానా" సుబ్బులక్ష్మికి మూర్ఛ వచ్చినంత పనయింది.

"మామా, పోయిన సినిమాలోనే ఎంతో భయంకరంగా నటించాను. నా వల్లకాదు మామా నటించటం."

"నీకు అదే మొదటిసారి కాబట్టి వీలుకాలేదు. కానీ ఇప్పుడా అనుభవం మీద ఇంకాస్త బాగా చేస్తావు. అవన్నీ నేను చూసుకుంటాను. నువ్వు బయలుదేరు" అంటూ తొందరపెట్టాడు.

సుబ్రహ్మణ్యంని స్టూడియోలో కలిశారు. విషయం చెప్పాడు. "సదాశివం! బ్రహ్మాండమైన కథను ఎంచుకున్నావు. నాకు విజయం ఇప్పుడే కనిపిస్తుంది" అని సందేహం లేకుండా చెప్పాడు.

"మరి మీరు దర్శకత్వం చేయాలి."

"నేను చేయాలంటే ఒక సంవత్సరం ఆగాలి నువ్వు. నా సినిమా మొదలుపెట్టాను కదా.. ఒక పనిచేయి, ఎల్లిస్ డంగన్‌ని తీసుకుందాం."

"ఎల్లిస్ డంగనా.. 'నందనార్' అసలు ఆడలేదుకదా.." సదాశివం నిరాశగా అన్నాడు.

"'సతీ లీలావతి' బ్రహ్మాండంగా ఆడింది. 'నందనార్' గురించి పట్టించుకోకు. ఆ కథే వేరు. నీది మంచి కథ. పేరున్న హీరోయిన్. రేపు వెళ్లి డంగన్‌ను కలిసి మాట్లాడదాం." సరేననుకున్నారు.

"మరి డబ్బు సంగతేంటీ? ఎలా పెడతావు?"

"నా దగ్గర యాభైవేలదాకా ఉన్నాయి."

"అస్సలు సరిపోవు."

"ఫైనాన్షియర్లను తయారుగా పెట్టుకున్నాను."

తరువాతి రోజే సదాశివం, సుబ్బులక్ష్మి, సుబ్రహ్మణ్యం ఎల్లిస్ డంగన్‌ను కలిశారు, కథ విన్నాడు డంగన్. "నైస్ స్టోరీ మిస్టర్ షడాషివం" అని అన్నాడు. వచ్చిన ముగ్గురూ నవ్వుకున్నారు. దర్శకత్వం చేయటానికి అతన్ని ఖరారు చేశారు. డంగన్ సినీ నిర్మాణంలో హాలీవుడ్‌లో శిక్షణ పొంది, అక్కడ తన భారతీయ సహవిద్యార్థితోపాటు భారతదేశానికి వచ్చి, అతనితోపాటు దర్శకత్వం చేస్తూ మెల్లగా అతనే స్వతంత్రంగా భారతీయ సినిమాలు దర్శకత్వం చెయ్యటం మొదలుపెట్టాడు.

"మరి హీరో ఎవరు?" అడిగాడు డంగన్.



"సదాశివం, హీరోయిన్ అయిన సుబ్బులక్ష్మి బాగా పాడుతుంది కాబట్టి, హీరోని కూడా సంగీత విద్వాంసులనే తీసుకుందాం" అమూల్యమైన సలహా చెప్పాడు సుబ్రహ్మణ్యం.

"అయితే జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యంని తీసుకుందాం. అతను ఒక సినిమాలో నటించాడు కూడా" ముగించాడు డంగన్. సుబ్బులక్ష్మి కళ్లు విప్పారాయి. తను ఇష్టపడే సంగీత విద్వాంసుల్లో ఒకరు జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం.

డంగన్‌తో కథనం విషయంలో చర్చలు జరుపుతున్నాడు సదాశివం. ఎప్పుడూ సుబ్బులక్ష్మిని తోడు తీసుకువెళ్తున్నాడు. ఇంట్లో ఉంటే సుబ్బులక్ష్మితో చర్చలు. అన్నీ మౌనంగా భరిస్తుంది పార్వతి.

ఒకపక్క కథాచర్చలు జరుగుతుండగానే ఇంకోవైపు పాపనాశం శివన్‌తో సంగీతపు చర్చలు జరుగుతున్నాయి. సుబ్బులక్ష్మి హీరోయిన్, పైగా పాటలు కూడా పాడాలి కాబట్టి అక్కడకు సుబ్బులక్ష్మి కూడా తప్పనిసరి. సుబ్బులక్ష్మితో పని ఉన్నా లేకున్నా సుబ్బులక్ష్మిని ఇంట్లో ఉంచడు సదాశివం. తనతోపాటు తిప్పుతున్నాడు. మంగళం కొడుకు మారుతాడు, మళ్లీ భార్యను ప్రేమగా చూసుకుంటాడు అనే ఆశ వదలుకుంది. పార్వతికి ఇంకా ఆశ.

ఒక మంచిరోజున న్యూటోన్ స్టూడియోలో 'శకుంతల' సినిమా చిత్రీకరణ మొదలైంది. డంగన్ తమిళం మాట్లాడలేడు. సుబ్బులక్ష్మికి ఇంగ్లీషు అర్థంకాదు. కానీ డంగన్ ఏమి చేయమంటున్నాడో సుబ్బులక్ష్మికి చెప్పటానికి 'షడాషివం' ఉండనే ఉన్నాడు.

సుబ్బులక్ష్మికి కాస్త బెరుకుదనం వదిలింది. 'సేవాసదనం' సినిమా చేసినప్పుడు పడిన ఆందోళన, హడలిపోవటాలు ఇప్పుడు లేవు.

ఒకరోజు పాటల రికార్డింగు జరుగుతుంది. జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యంతో పాటు సుబ్బులక్ష్మి కూడా పాడుతుంది. ఇద్దరి యుగళగీతం అయిపోయింది. సదాశివం అప్పుడు, "కుంజా! ఇంక నువ్వు రా. నీ పాట అయిందిగదా" అని పిలిచాడు.

"లేదు మామా. ఇక్కడే ఉందాం. ఆయన పాట కూడా విందాం.. చాలా బాగా పాడతారు" అంది. ఉండిపోయాడు. సుబ్బులక్ష్మి తన్మయత్వంతో వింటుంది అతని పాటని. చివరిదాకా విని, 'ఎంత చక్కగా పాడాడు మామా' అంటూ వచ్చింది. కర్ణాటక సంగీతం నరనరానా ఇంకి ఉన్న సుబ్బులక్ష్మి గొప్ప సంగీతం ఎక్కడ ఉందో అది అయస్కాంతంలాగా పట్టేస్తుంది. జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం పాడే 'బ్రిక'లు బాగా నచ్చాయి సుబ్బులక్ష్మికి. స్టూడియోలో ఖాళీ దొరికినప్పుడల్లా బాలసుబ్రహ్మణ్యంని అతని సంగీతం గురించి అడిగి తెలుసుకుంటుండేది.

చిత్రీకరణ నాలుగు నెలలు పాటు ఏకధాటిగా క్రమశిక్షణతో జరిగిపోయింది. కానీ
సదాశివం ఏర్పాటు చేసుకున్న యాభైవేలు అయిపోయాయి. రాయల్ టాకీస్ డిస్ట్రిబ్యూటర్లు
రంగంలోకి దిగి, డబ్బు అప్పు ఇచ్చారు. వీళ్లు మదురై వ్యాపారస్తులు. ఆ నోటా ఈ నోటా
నాని సుబ్బలక్ష్మి మళ్లీ సినిమాల్లో నటిస్తోందన్న విషయం షణ్ముగవడివుకు చేరింది.
కూతురుమీద ఆశ వదులుకుందిక. పార్వతికి దాదాపుగా భర్తమీద ఆశ ఆవిరయింది.
సుబ్బలక్ష్మికి ఆశ అంబరమయింది. చెట్టిగార్ల బెడద పూర్తిగా పోయినట్లే. అమ్మ తనను
బలవంతంగా ఇక ఎంతమాత్రమూ తీసుకెళ్లలేదు. ఇప్పుడు తను మద్రాసులో పేరున్న
వ్యక్తి. సుబ్బలక్ష్మి మనసు నిండుగా పురివిప్పింది. ఆ మనసుకి పగ్గం వేయటానికి అమ్మ
లేకపోయింది పక్కన. ఆ మనసు మామ మాట విననంది. సుబ్బలక్ష్మి మనసు జి.ఎస్.
బాలసుబ్రహ్మణ్యం మీదికి వెళ్లింది. స్టూడియోలో సుబ్బలక్ష్మి చూపంతా తన హీరోమీదే.
సినిమాకి అవసరమైన దానికంటే ఎక్కువే చూస్తుంది. మొదట అతని సంగీతంపట్ల
ఆకర్షితురాలయింది. తనకంటే ఆరేళ్లుపెద్ద, అందగాడు, బి.ఎ. ఆనర్స్ పట్టా పొందినవాడు.
చాలా హుందాగా నడుచుకుంటాడు. నెలల తరబడి అతనిని దగ్గరగా గమనిస్తూ, దగ్గరగా
మసులుతూ సుబ్బలక్ష్మికి బాలసుబ్రహ్మణ్యం మీద ప్రేమ పెరుగుతూ ఉంది. స్టూడియోకి
వస్తుందే అతని కోసం అన్నట్లు వస్తుంది. సదాశివం గమనిస్తున్నాడు. సుబ్బలక్ష్మి మీద
తన ఆలోచనలు తెలుపుతూ సదాశివం ఇంకొక అడుగు ముందుకువేశాడు. అడయారులోని
చిట్టడివిలో సినిమా చిత్రీకరణ జరుగుతుంది. శకుంతల వనంలో పెరుగుతున్న కన్య.
అందుచేత శకుంతల ఆభరణాలు పూల సరాలే, ప్రతిరోజూ చిత్రీకరణకి తాజా
పూలదండలను తీసుకొస్తారు. ఆ పూలను 'శకుంతల' తలమీద, మెడలో, చేతులకూ
ఆభరణాలుగా వేసుకోవాలి. చిత్రీకరణ మొదలయ్యే ముందు సుబ్బలక్ష్మి మెడలో పూలదండ
వేశాడు సదాశివం. చుట్టూ ఉన్నవాళ్లంతా ఆశ్చర్యంగా చూశారు. 'పెళ్లి కాని పిల్ల మెడలో
అలా వేయొచ్చా' అని కొందరు... 'దండ వేశాడు. వీళ్లకి పెళ్లి అయిందా?' అని
ఇంకొందరు... మొత్తానికి అందరికీ ఈ విషయం ఒకరి చెవులు ఒకరు కొరుక్కునే
విషయం అయ్యింది. ఎంతమంది చెవులు కొరుక్కున్నా, నొసలు చిట్లించినా సుబ్బలక్ష్మికి
మాత్రం ఈ 'దండోపాయం' మర్మం బోధపడలేదు. తన సినీ హీరోని నిజ జీవితంలో
కూడా తనవైపు తిప్పుకునే ప్రయత్నంలో ఉంది. సదాశివం ఒక్కరోజుతో దండ వేయటం
ఆపలేదు. దండ సన్నివేశాలు ఉన్నన్ని రోజులూ ఆ దండ నేరుగా సుబ్బలక్ష్మి మెడలో
వేసింది సదాశివమే.

పార్వతి భర్త ప్రేమకోసం ఆరాటపడుతుంది. ఆ భర్త సుబ్బలక్ష్మి ప్రేమకోసం వెంపర్లాడుతున్నాడు. సుబ్బలక్ష్మి తన హీరో ప్రేమకోసమై తపిస్తుంది. సదాశివం ఇంట్లో ఇదీ పరిస్థితి. సుబ్రహ్మణ్యమే గనుక చూసి ఉంటే ఇప్పుడు చేస్తున్న సినిమా వదిలి ఈ





'శకుంతల' చిత్రంలోని సన్నివేశం

నాలుగు కోణాల ప్రేమకథా చిత్రం తీసేవాడు. ఈ మనసుల ఊసులు ఇలా ఉన్నప్పటికీ చిత్రీకరణ సాఫీగా సాగిపోతోంది. డంగన్ తన హాలీవుడ్ పరిజ్ఞానాన్ని ఉపయోగించి బాగా తీస్తున్నాడు.

𝄞𝄞

సదాశివం తనవైపు తలెత్తి ఒక చూపు కూడా చూడకపోవడంతో పూర్తిగా నిరాశ చెంది, పైగా ఎంతమంది చెప్పినా సుబ్బులక్ష్మిని వేరుగా పెట్టకపోవడంతో పార్వతి పిల్లల్ని తీసుకొని పుట్టింటికెళ్లిపోయింది.

నాలుగు కోణాలలో ప్రస్తుతానికి ఒక కోణం లేదు. త్రికోణ ప్రేమకథ మిగిలింది. సదాశివం ఇంకొక కోణాన్ని వదిలించుకోవటానికి శాయశక్తులా కృషి చేస్తున్నాడు. సుబ్బులక్ష్మి మీద పెత్తనం చేయటం ఎక్కువ చేశాడు. సదాశివం ఎప్పుడూ పెత్తందారే. ఇప్పుడు మరీ ఎక్కువగా ఉంది. ఒకసారి నర్మగర్భంగా చెప్పాడు, "కుంజా! నువ్వు బాలసుబ్రహ్మణ్యం భార్యను చూశావా? చాలా బాగుంటుందట." ఏం చెప్పిచూసినా, ఎలా చెప్పిచూసినా సుబ్బులక్ష్మికి బాలసుబ్రహ్మణ్యంపట్ల ఉన్న ఆకర్షణ తగ్గలేదు. పైగా హెచ్చుతుంది. సుబ్బులక్ష్మి నుంచి రాయబారాలు వెళ్లటం కూడా గమనించాడు సదాశివం. సదాశివానికి కోపం నషాళానికి అంటింది. "దీనికి పిచ్చా? వెర్రా? నేనేమైనా ఈవిడగారి అమ్మ తమ్ముడిని అనుకుంటుందా.. జాగ్రత్తగా చూసి, పెళ్లిచేసి పంపించేయటానికి.." అని తిట్టుకున్నాడు తనలో తాను. సినిమా మధ్యలో ఉంది గనుక ఎవరినీ ఏమీ అనలేని పరిస్థితి.

ఒకరోజు కృష్ణమూర్తి స్టూడియోకి వచ్చాడు. "రా కృష్ణమూర్తి, చాలా రోజులకు వచ్చావు. ఏంటి సంగతులు?" అంటూ ఆహ్వానించాడు సదాశివం. మాటల్లో పడ్డారు. "నాకు వాసన్‌కి పొసగటం లేదు సదాశివం" మాటల మధ్య చెప్పాడు.

"ఏం పరవాలేదు, వదిలేయ్ ఆ ఉద్యోగం. ఎలాగూ కథలు రాస్తున్నావు పూర్తిగా ఇటొచ్చెయ్.." సలహా ఇచ్చాడు సదాశివం.

"ఆలోచిస్తా..." అన్నాడు కృష్ణమూర్తి.

"రాజాజీని కలిశావా ఈ మధ్య ఏమన్నా... నాకసలు కుదురటంలేదు" అడిగాడు సదాశివం.

"ఆ.. కలిశాను, నీకది చెప్పాలని కూడా అనుకున్నా..." అంటూ అటూఇటూ చూసి దగ్గర ఎవ్వరూ లేరని రూఢి చేసుకుని, మెల్లగా సదాశివంకి చెప్పాడు.

"రాజాజీగారు, సుబ్బులక్ష్మి గురించి అడిగారు. ఇంకెన్నాళ్లు ఉంచుతాడు ఆ అమ్మాయిని తన ఇంట్లో అని. ఆయనకు ఈ వ్యవహారం అసలు ఇష్టంలేదు." కృష్ణమూర్తి



మోసుకొచ్చిన ఈ రాయబారం సదాశివంకి పులిమీద పుట్ర అయింది. సదాశివంకి ఈ చికాకుల్లో ఊరట ఏమిటంటే సినిమా చిత్రీకరణ చక్కగా జరిగిపోతోంది. పైగా జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం సుబ్బులక్ష్మి మీద ఏమాత్రం ఆసక్తి చూపటంలేదు. చిత్రీకరణ జరుగుతూ ఉండగా ఒకరోజు పార్వతి ఊరు నుంచి ఒక మనిషి స్టూడియోకి వచ్చాడు. ఉన్నఫళాన సదాశివంని తీసుకుని వెళ్లిపోయాడు.

𝄞𝄞

సదాశివం ఊరు వెళ్లడంతో చిత్రీకరణ తాత్కాలికంగా ఆగింది. సుబ్బులక్ష్మి చాన్నాళ్ల తర్వాత బాలా ఇంటికి వెళ్లింది. బాలా అక్కచెల్లెళ్లు, అన్నదమ్ములు కూడా అక్కడే ఉన్నారు. తన బాల్యస్నేహితులతో కాలం గడుపుదామని వచ్చింది. అందరూ పెద్దవాళ్లయ్యారు. కళాకారులుగా మంచి గుర్తింపు తెచ్చుకుంటున్నారు. "సినీనటి వచ్చింది, స్వాగతం పలకండి" అంటూ హడావుడి చేశారు. "కుంజా! ఈ రోజు సినిమా పని లేదా తీరిగ్గా ఉన్నావు."

"మా మామ భార్య పార్వతి చనిపోయిందని కబురు వచ్చింది, ఆయన వెళ్లారు. అందుకని షూటింగ్ లేదు" చెప్పింది సుబ్బులక్ష్మి.

"అయ్యోపాపం, ఎందుకట, ఏమైంది.." అందరూ అడిగారు.

"ఏమో, మామ వస్తేగానీ తెలియదు మరి."

జయమ్మ అసలు సంగతి మొదలుపెట్టింది. "నువ్వు పెళ్లెప్పుడు చేసుకుంటావు కుంజా?" సిగ్గుల మొగ్గ అయింది సుబ్బులక్ష్మి.

"అప్పుడే ఎలా? ఇప్పుడేగా భార్య చనిపోయింది, ఒక సంవత్సరం ఆగి చేసుకుంటారేమో.." అంది కామాక్షి.

"ఆ.... సంవత్సరం అవసరం లేదులే, ఆర్నెల్లు చాలు. కుంజా! ఆర్నెల్లకి పెళ్లి చేసుకోండి."

సుబ్బులక్ష్మికి తల మూడొందలఅరవై కోణంలో గిర్రున తిరిగిపోయింది. "జయమ్మా! నేను సదాశివం మామని చేసుకోను. ఆయన పెత్తనం భరించలేను జయమ్మా, నేనేదో ఆయన పెళ్లాంనయినట్లు నామీద అధికారం చెలాయిస్తాడు. ఇక పెళ్లి చేసుకుంటేనా.. ఇక అంతే సంగతులు. నాకా ఉద్దేశ్యమే లేదు జయమ్మా. మీరెందుకు అలా అనుకున్నారు?" అడిగింది సుబ్బులక్ష్మి. అందరూ మొహమొహాలు చూసుకుని నిశ్శబ్దంగా ఉన్నారు. అందరి మొహాలు పట్టిపట్టి చూసేవరకు నిశ్శబ్దమే. ఈ నిశ్శబ్దం ఉరమబోతుంది. వాళ్లు గట్టి

విషయం ఏదో చెప్పబోతున్నారు. నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ, జయమ్మ నోరువిప్పింది. "కుంజా, నిన్నెవరు పెళ్లి చేసుకుంటారనుకుంటున్నావు?"

ఈ ప్రశ్నకి సుబ్బులక్ష్మి నివ్వెరపోయింది. అది గమనించిన కామాక్షి, "అక్కా నువ్వాగు పిల్లని అలా బెదరగొడతావేంటి నేను చెప్తాను, "కుంజా! నువ్వు ఎవరినైనా పెళ్లి చేసుకోవాలనుకుంటున్నావా?" అడిగింది కామాక్షి. రెండు ప్రశ్నలకి పెద్ద తేడా కనిపించలేదు సుబ్బులక్ష్మికి. మళ్లీ అదే సమస్య 'పెళ్లి'. సుబ్బులక్ష్మికి రోషం తన్నుకొస్తుంది.

జయమ్మ మళ్లీ అనునయంగా చెప్పింది. "కుంజా, అతని పంచన నిండు రెండు సంవత్సరాలున్నావు. ఇంకా నిన్నెవరు చేసుకుంటారు.. మనము దేవదాసీలమమ్మా.. ఇప్పటిదాకా నిన్ను పెళ్లి చేసుకుంటానని చెప్పాడో లేదోగానీ వచ్చిన తర్వాత పెళ్లి చేసుకుంటానంటే అతన్ని చేసుకో. ఇంత జరిగాక నిన్ను దేవదాసీలాగా చూస్తారుగానీ, ఎవరూ పెళ్లి చేసుకోరు" అని అనుభవంతో చెప్పింది జయమ్మ.

సుబ్బులక్ష్మికి తన కథ మళ్లీ మొదటికొచ్చిందనిపించింది. బాలా ఇంట్లో వారందరూ సుబ్బులక్ష్మిని ఊరడించి, ధైర్యం చెప్పి చివరికి మళ్లీ అదేమాట చెప్పి పంపారు. "అతను వచ్చేలోపల బాగా ఆలోచించుకో. అతను కాస్త ముందో వెనకో అడుగుతాడు నిన్ను, ఆలోచించుకో, గట్టివాడు కాదనకు" అని.

సదాశివం పెద్దకూతురు రాధని తీసుకొని మళ్లీ మద్రాసు వచ్చేశాడు. వెంటనే 'శకుంతల' చిత్రీకరణ మొదలుపెట్టారు.

𝄞 𝄞

ఇంట్లో షణ్ముగవడివు చుట్టూ స్నేహితులు, చుట్టాలు చేరారు. "పోన్లే షణ్ముగం.... దానికి కావలసింది పెళ్లి చేసుకోవటమేకదా.. చల్లగా దీవించు."

"పైగా పెళ్లాం కూడా పోయిందంటున్నావుగా.. ఇంకే గోలా లేదు."

"చూడు సినిమా మీద సినిమాలు తీసి దాన్ని బాగా పైకి తీసుకొస్తాడు" గంభీరంగా ఉన్న షణ్ముగవడివుని మెత్తబరిచే ప్రయత్నం చేస్తున్నారు. కాని షణ్ముగవడివుకి తనకు కాబోయే అల్లుడు ఏమాత్రం ఇష్టంలేకపోగా, పైగా కసి, కోపం. "నా కూతురిని నాకు లేకుండా చేశాడు. నా కూతురు సంపాదన మీద బ్రతుకుదామనుకుంటున్నాడు. కాకి ముక్కుకి దొండపండులాగా వీడికి నా కూతురు. మాయచేసేశాడు దాన్ని" ఏడుస్తుంది షణ్ముగవడివు.

"శుభమా అని పెళ్లి చేసుకుంటుంటే ఏడుపెందుకు, ఏడవకు షణ్ముగం" అంది రంగనాయకి.



"పెళ్లికి వెళ్దామా?" అడిగింది మీనాక్షి.

"వచ్చింది ఉత్తరం. శుభలేఖ కాదు" అంది రాజం.

𝄞 𝄞

'హిందూ' దినపత్రిక యజమాని కస్తూరి శ్రీనివాసన్ తన కార్యాలయపు వ్యాన్ ఒకటి ఏర్పరచగా మొత్తం పదిహేనుమంది సుబ్బులక్ష్మి సదాశివం వివాహానికి బయలుదేరారు. పెళ్లికూతురు పెళ్లికొడుకుని కలుపుకొని పదిహేనుమంది. కృష్ణమూర్తి భార్య రుక్మిణి కొబ్బరికాయ కొట్టి ఎదురు రాగా 'రైట్ రైట్' అంటూ పెళ్లి బండిని తిరునీర్‌మలై వైపు మళ్లించారు. ఒక గంట దూరంలో ఒక చిన్నకొండ మీద వుండే రంగనాథాలయాన్ని సదాశివం తన పెళ్లి వేదికగా ఎంచుకున్నాడు. అక్కడికి వెళ్లేముందే కీల్పాక్‌లోని లాండెన్ వీధిలో ఉన్న రిజిష్టర్ కార్యాలయంలో ముందు పెళ్లిని రిజిష్టర్ చేయించాడు. సాక్షులుగా కస్తూరి శ్రీనివాసన్, కృష్ణమూర్తి సంతకాలు పెట్టారు. ఇప్పుడు అధికారికంగా సుబ్బులక్ష్మి సదాశివం భార్యాభర్తలయ్యారు. శాస్త్రోక్తమైన పెళ్లికి తిరునీర్‌మలై చేరుకున్నారు. ఆ కొండపైకి దారి మెట్లదారే. దాదాపు వంద మెట్లున్న ఆ దోవన సదాశివం పైదాకా ఎక్కి కిందకు చూశాడు. నాజూకైన తన పెళ్లికూతురు, నవ్వుతూ, తుళ్లుతూ మెట్లు ఎక్కుతోంది. ఏ రోజుకోసమైతే నాలుగేళ్ల నుంచి తపనపడ్డాడో, ఆ రోజు రానే వచ్చింది ఈ రోజు. ఏ మనిషైతే గత నాలుగు సంవత్సరాల నుంచి తన లోకమై అతన్ని వివశుడిని చేసిందో ఆ మనిషి ఈ రోజు తన మనిషి కాబోతుంది. సుబ్బులక్ష్మి కూడా పైదాకా వచ్చింది. సుబ్బులక్ష్మి ఒకసారి వెనక్కి తిరిగి కిందకు చూసింది.

తను వదిలి వచ్చిన దోవలో, సమాజంలో అందరికీ లోకువై అవహేళనను భరించాల్సి వచ్చే అస్సహాయ అతివ కనిపిస్తుంది. ఇప్పుడు తను వున్న స్థానం సమాజంలో పై ఎత్తున ఉంది. ఉన్నత వర్గంగా భావించబడే వారి మధ్య నుండి, గొప్ప పలుకుబడి పరిచయాలు ఉన్నవారి మధ్య ఉంది. వీటితో పోలిస్తే సదాశివం రౌద్రం, పెత్తందారీ, పురుషాహంకారం భరించటం చిన్న విషయాలుగా అనిపించాయి.

అమ్మ, అన్న, చెల్లి గుర్తొచ్చారు. వాళ్లంతా తనవాళ్లు. తను ఇప్పుడు చేస్తున్న పని అనైతికమైనది కాదు. తర్వాత ఎప్పుడైనా అమ్మ దగ్గరకు వెళ్లి గడ్డం పట్టుకొని ఒక్క ముద్దు పెట్టిందంటే అమ్మ చేతులు ఆప్యాయంగా తనను చుట్టుముడతాయి.

తన స్థితిగతులను బేరీజు వేసుకొని, అన్నీ ఆలోచించుకునే ఈ మెట్లు ఎక్క నిశ్చయించుకుంది. ఈ ఆఖరి పై మెట్టు మీద సదాశివం చేయి పట్టుకొని ముందుకు వెళ్లింది సుబ్బులక్ష్మి.

1940, జులై 10న అధికారికంగా, శాస్త్రోక్తంగా భార్యాభర్తలయ్యారు సుబ్బులక్ష్మి, సదాశివం.

పెళ్లి హడావుడి తగ్గి, సదాశివం పెళ్లి ఖర్చులు రాసుకుంటూ మొత్తానికి భోజనాలతో సహా నూటయాభై రూపాయలు తేల్చాడు. ఇక సుబ్బలక్ష్మి ఉన్న గదిలోకి సదాశివం అడుగుపెడుతుండగా సుబ్బలక్ష్మి లోపలినుంచి పరుగుపరుగున గది బయటికి వచ్చి సదాశివంని పట్టుకొని గోడవైపు చూపించింది. గోడమీద పెద్ద బల్లి ఉంది. నాలుగు సంవత్సరాల విరహానికి తెరదించుతున్న ఈ వేళ, గాలి కూడా వారిద్దరిమధ్య అడ్డు అనుకుంటున్న సమయంలో ఆ బల్లిని చూసి పళ్లు కొరికి, పైపంచ నడుంకి బిగించి, కోపంగా గోడమీద గట్టిగా చాచి కొట్టాడు సదాశివం. ఆ దెబ్బకి బల్లి సపరివారంగా పక్కింటికి వెళ్లిపోయింది. సుబ్బలక్ష్మి చెయ్యి పట్టుకొని లోపలికి తీసుకొచ్చాడు సదాశివం.

చ : గట్టివాడవని పట్టితి నీచేయి
పట్టి విడువ రాదు కృష్ణా
వట్టిమాటలలో నన్ను తగిలించితే
ఎటుల నే పోదు... గోపాలా..

ప : వాసుదేవ కమలాసన వందిత...

*కృతికర్త-తెలియదు, రాగం-చెంజుర్తి, తాళం-ఆది*

'శకుంతల' సినిమా చిత్రీకరణ చివరి దశకు చేరుకుంది. శకుంతలను దుష్యంతుని దగ్గరకు పంపిన సన్నివేశం చిత్రీకరణ జరుగుతుంది. శాపవశాత్తు దుష్యంతుడు శకుంతలను గుర్తుపట్టక నిరాకరిస్తాడు. ఈ నిండు సభలో శకుంతల దుష్యంతుణ్ణి కోపంగా, గట్టిగా నిలదీయాలి. ఈ సన్నివేశం డంగన్, సదాశివం ఇద్దరూ సుబ్బలక్ష్మికి వివరించారు. చిత్రీకరణ మొదలయింది. "కెమెరా, యాక్షన్!" సుబ్బలక్ష్మి నటించింది కానీ డంగన్‌కి కావలసినంతగా ఆ సన్నివేశం రాలేదు. "ఇంకా కోపంగా తిట్టాలి సుబ్బలక్ష్మి." మళ్లీ, "కెమెరా, యాక్షన్!" అన్నాడు డంగన్. సుబ్బలక్ష్మి మళ్లీ చేసింది, కానీ డంగన్‌కు నచ్చలేదు. "సుబ్బలక్ష్మి, చూడు ఈ సన్నివేశం చాలా ముఖ్యమైనది సినిమాకి. నువ్వు సరిగ్గా చేయాలి. రీలు తిరుగుతుంది. అది వృథా అయిపోతుంది. అంతా బాగా చేస్తున్నావు, ఇంకాస్త కోపం తెచ్చుకో" అని చెప్పి మళ్లీ, "కెమెరా, యాక్షన్!!" అన్నాడు. ఈసారీ అంతే. డంగన్‌కు అస్సలు నచ్చలేదు. వచ్చి చెప్పాడు. ఇంకో రెండుసార్లు చేయించాడు. అయినా ఫలితం రాబట్టలేకపోయాడు. సుబ్బలక్ష్మి కోపంగా నటించలేకపోతుంది. సన్నివేశం పాలిపోతుంది. ఆ గొంతు కోపంగా ఉండాలి. మొహం ఉక్రోషంతో ఊగిపోవాలి. సుబ్బలక్ష్మికి కోపమూ రావటంలేదు. ఉక్రోషమూ లేదు. డంగన్‌కి కోపం వచ్చింది. "ఓకే... సుబ్బలక్ష్మి నువ్వు కాసేపు కూర్చో, ఎలా చేయాలో ఆలోచించుకో. నేను ఇప్పుడే వస్తాను" అని చెప్పి దూరంగా కూర్చొని ఆలోచిస్తున్నాడు. సుబ్బలక్ష్మిని చూస్తున్నాడు. కాస్త అవమాన భారంతో ఉంది. మామూలుగానే అన్నట్లు సదాశివంని పక్కకు పిలిచాడు.




రిజిస్టర్ ఆఫీసులో సుబ్బలక్ష్మి, సదాశివం దంపతులు


తిరునీర్‌మలైలో సుబ్బలక్ష్మి, సదాశివం దంపతులు



శ్రీమతి సుబ్బలక్ష్మి సదాశివం

సుప్రసిద్ధ సినిమా నటి వివాహము



సుప్రసిద్ధ సినిమానటి, గాయకురాలు నగు శ్రీమతి యం. యస్. సుబ్బులక్ష్మి, చంద్రప్రభా సినిటోను మేనేజింగు ప్రొప్రయిటర్ శ్రీ టి. సదాశివంగారిని పెండ్లాడెను.

జులై 19, 1940 'ఆంధ్ర పత్రిక' నుంచి



"సర్, ఇది చాలా ముఖ్యమైన సన్నివేశం. ఇది బాగా రాకపోతే సినిమా నవ్వులపాలవుతుంది. అది నా ఓటమి అవుతుంది. ఇంకొక్కసారి చూస్తాను. బాగా చేయలేకపోతే అందరిముందు తిట్టేస్తాను మీ ఆవిడని, ఆ తర్వాతనన్నా బాగా చేస్తుందేమో చూద్దాం. మీ అనుమతి అడుగుతున్నాను. తిట్టనా.."

"ఆ..." అవాక్కయ్యాడు సదాశివం. చూస్తూనే ఉన్నాడు ఇప్పటికి ఐదుసార్లు చేసింది తన భార్య, కానీ సరిగ్గా చేయలేదు. కాని అందరిముందు తిట్టడమా... ఆలోచిస్తున్నాడు సదాశివం. 'కాస్త దానికే ఏడుపందుకుంటుంది. బాధపడుతుంది. ఇక్కడున్న అందరిముందు తిడితే ఎలా.. పోనీలే ఇది ఊరికే తిట్టడం కదా. నిజం కాదుకదా. తర్వాత చెపితే అయిపోతుంది' అనుకుని సదాశివం తన భార్యని అందరిముందు తిట్టడానికి డంగన్‌కు అనుమతి ఇచ్చాడు. మళ్లీ చిత్రీకరణ మొదలైంది. ఆ సన్నివేశాన్ని చేయించాడు డంగన్. అంతకు ముందు చేసినట్లే చేసింది సుబ్బులక్ష్మి. డంగన్‌కు చిరాకేసింది. సదాశివం వైపు చూశాడు. 'కానివ్వు, నువ్వన్నట్లు ఉత్తినే తిట్టెయ్' అన్నట్లు చూశాడు సదాశివం.

'ఉత్తినే ఏంటి? ఇప్పుడు చూడు ఏం చేస్తానో' అన్నట్టు వచ్చి సుబ్బులక్ష్మి ముందు నిలబడ్డాడు. అందరికి వినిపించేలాగా అరుస్తూ, "బుద్ధుందా నీకేమైనా, ఎన్నిసార్లు చెప్పాలి? ఇప్పటికి అరడజనుసార్లు చేశావు ఆ సీనుని.... అన్నిసార్లు రీలు వృథా అయింది. కరెంటు వృథా అయింది. అందరి సమయం వృథా అయింది. చూడు ఒకొక్కరినీ, ఎలా విసిగిపోయి ఉన్నారో. ఇలా అయితే సినిమా ఎప్పటికి కావాలి. నేను ఎంతోమందితో పనిచేశాను కానీ నీ అంత ఛండాలపు ఆర్టిస్టును నేను ఇంతమట్టుకు చూడలేదు. ఒక్కసారి కాకపోతే ఇంకోసారన్నా బాగాచేయాలి. ఇన్నిసార్లా.. భగవంతుడా" అని తిట్టుకుంటూపోతున్నాడు. ఉత్తిత్తిగా ఇంకా అతని కోపం రెండూ కలిపి. సదాశివం 'డంగన్ ఇక చాలు, ఆపు, ఆపు' అనుకుంటున్నాడు మనసులో. సుబ్బులక్ష్మి ఆ అవమానానికి అగ్నిగుండమైంది, మొహం ఎర్రగా అయింది. త్వరలో విస్ఫోటం అయ్యేలా ఉంది. అందరూ చూస్తున్నారు. కెమెరామెన్ కెమెరా ఆపటం మర్చిపోయి చూస్తున్నాడు. సౌండు ఇంజనీర్ కూడా తన పరికరాన్ని ఆపలేదు. కెమెరా నడుస్తూనే ఉంది. లైట్లు వెలిగే ఉన్నాయి. హీరోయిన్‌ని ఇలా తిడుతున్నాడేంటి అందరిముందు... పైగా ఆమె భర్త ముందే అంటూ నివ్వెరపోయి చూస్తున్నారు. డంగన్ సుబ్బులక్ష్మి పరిస్థితిని గమనించి, ఇంకా రెండు తిట్లు గట్టిగా తిట్టి అలా పక్కకు వచ్చాడోలేదో సుబ్బులక్ష్మి కోపంతో, ఉక్రోషంతో, అవమాన భారంతో, తిరస్కరణకు గురైన పరాభవంతో దుష్యంతునివైపు తిరిగి, గట్టిగా సంభాషణలు చెప్పేసింది. శకుంతల చేయవలసిన పని అది. అవమానానికి గురైన శకుంతల దుష్యంతుణ్ణి దూషించటం. నిజంగా అవమానభారంతో క్రుంగిపోతూ దర్శకుడు కెమెరా, యాక్షన్ అని చెప్పకపోయినా ఆ కోపంతో అద్భుతంగా నటించింది సుబ్బులక్ష్మి. కెమెరాతోసహా

అన్ని పరికరాలు పనిచేస్తూనే ఉన్నాయి. కాబట్టి సుబ్బలక్ష్మి నటన రికార్డ్ అయిపోయింది. డంగన్ సంభ్రమాశ్చర్యాలకు లోనై, ఆనందపడిపోతూ వడివడిగా వచ్చి సుబ్బలక్ష్మిని హత్తుకున్నాడు. వాళ్ళ అమెరికాలోలాగా. స్టూడియోలో ఉన్న అందరూ చూశారు. "హీరోయిన్‌ని తన భర్తముందే..." అంటూ నోరెళ్లబెట్టారు.

సుబ్బలక్ష్మి చాలా ఇబ్బందిపడిపోయింది, మరి సదాశివం "ఒరేయ్ చంపావుకదరా.. పెళ్లి చేసుకుని ఒక గాలి కబురుని వదిలించుకున్నా: మళ్లీ నువ్వు మొదలుపెట్టావా..." స్టూడియోలో జరిగిన ఈ గాలికబురు సన్నివేశం గాలి అంత వేగంగా వెళ్లి సినిమా పత్రికలకి ఎక్కింది. సుబ్బలక్ష్మికి డంగన్‌కి మధ్య ఏదోఏదో జరుగుతుంది అంటూ వార్తలు గుప్పుమన్నాయి.

సదాశివం అనుకున్న మొదటిది మాత్రం గాలి కబురు కాదు, గట్టి కబురే. ఈ కబుర్లని, ఊసులని గుండెలోంచి తీసివేసి గాలిలో వదిలేసింది సుబ్బలక్ష్మి. ఆ గుండెల్లో సదాశివం దర్జాగా సకల మర్యాదలతో తిష్టవేశాడు.

𝄞𝄞

'శకుంతల' సినిమా చిత్రీకరణ పూర్తయింది. సినిమా పోస్టర్లల్లో సుబ్బలక్ష్మే ప్రముఖంగా కనిపించేటట్టు రూపొందించాడు సదాశివం. బాలసుబ్రహ్మణ్యం తనని పెట్టిన ఇబ్బందికి సినిమా పోస్టర్ మీద బాలసుబ్రహ్మణ్యం మెడను వంచేశాడు సదాశివం.

"షదాషివంగారు ఏంటిదీ... కమెడియన్‌ని వంచినట్లు హీరోని వంచారు?" అడిగాడు డంగన్. సదాశివం నిర్మాత. ఎవరిమాట వినాల్సిన పనిలేదు.

డిసెంబర్ 10, 1940లో 'శకుంతల' సినిమా విడుదలయ్యింది. మొదటి ఆట నుంచి బ్రహ్మాండంగా ఆడటం మొదలుపెట్టింది. మద్రాసులో సినిమా హాలుల్లో జనాన్ని అదుపు చేయటానికి పెద్ద సంఖ్యలో పోలీసులు అవసరమయ్యారు. నటిగా, గాయనిగా ఇప్పటికే పేరున్న సుబ్బలక్ష్మి 'శకుంతల' విజయంతో తారాపథానికి దూసుకువెళ్లింది.

సుబ్బలక్ష్మి పేరు ఇటు దినపత్రికలలోను, పత్రికలలోను, సినిమా పత్రికలలోను తరచూ అచ్చు అవుతూ ఉంది. ఒకసారి సంగీత కచేరీల గురించి అయితే ఇంకోసారి సినిమా ప్రసక్తితో. హెచ్.ఎమ్.వి. వారు వాళ్ల గ్రామఫోన్ రికార్డుల ప్రకటనలు ఇస్తూనే ఉన్నారు. తమిళంలో వార్త వ్రాస్తూ ఇంగ్లీషులో M.S. అని వ్రాసి ఆ తరువాత సుబ్బలక్ష్మి అని వ్రాస్తున్నారు. ఇలా సుబ్బలక్ష్మి పేరులో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న M.S. అక్షరాలు సుబ్బలక్ష్మి పేరైపోయింది. ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి అనే పొడవాటి పేరుకంటే M.S. అనే పొట్టి పేరు ఎక్కువగా వాడటం మొదలుపెట్టారు ప్రజలు.

𝄞𝄞






'శకుంతల' సినిమా ప్రకటన

'శకుంతల' సినిమా అనుకున్నదానికంటే బ్రహ్మాండంగా ఆడింది. ఆ సినిమా పాటలు హెచ్.ఎమ్.వి. వాళ్లు రికార్డులు విడుదల చేశారు. ఒక ప్రక్క గ్రామఫోను రికార్డులు బ్రహ్మాండంగా అమ్ముడుపోతున్నాయి. ఈ విజయాలలో తృప్తి పడదలచుకోలేదు సదాశివం. భార్య కచేరీ ఏర్పాటు చేసుకున్నాడు. "కుంజా! రేపే మనం తిరువయ్యూరు ఆరాధనోత్సవాలకి బయలుదేరుతున్నాం సర్దు" అన్నాడు సదాశివం.

బెంగుళూరు నాగరత్నమ్మ గత పది సంవత్సరాలుగా తన ఆస్తులన్నీ ధారపోస్తూ, త్యాగరాజుకి గుడి కట్టించింది. అప్పటినుంచి త్యాగరాజు పుణ్యతిథి అయిన పుష్య బహుళ పంచమినాడు ఈ ఆవరణలో త్యాగరాజస్వామి ఘనపంచ కృతుల ఆలాపనతో త్యాగరాజుని ఆరాధించటం మొదలవుతుంది. ప్రఖ్యాత కర్ణాటక సంగీత విద్వాంసులందరూ కచేరీలు చేస్తారు. ఈసారి ఆరాధనోత్సవాలలో అందరి కచేరీలలో సుబ్బలక్ష్మి కచేరీకి టిక్కెట్లు ఎక్కువ అమ్ముడుపోయాయి. సుబ్బలక్ష్మి కచేరీని ముందు వరసలో కూర్చొని నాగరత్నమ్మ వింది. కచేరీ తర్వాత దగ్గరకు పిలిచింది. "సుబ్బలక్ష్మీ! ఇప్పుడు నీ పాటలో ఉచ్చారణ దోషాలు లేవు. సరిగ్గా పాడావు. అంతా బాగా పాడావు " అని చెప్పింది. ఐదేళ్ల క్రితం తన ఉచ్చారణలో దోషాలు ఉన్నాయని చెప్పి తనను అప్రమత్తం చేసిన ఈ నాగరత్నమ్మకి కృతజ్ఞురాలైంది సుబ్బలక్ష్మి.

సుబ్బలక్ష్మి కచేరీపని అయిన తర్వాత సదాశివం, కృష్ణమూర్తి నడుచుకుంటూ త్యాగరాజు తన రాముడిని వెతుక్కున్న కావేరీ నది ఒడ్డుకు చేరుకున్నారు, అక్కడ తమ భవిష్యత్తును వెదుక్కోవటం మొదలుపెట్టారు. "కృష్ణమూర్తి ఏం చేద్దామనుకుంటున్నావు?" అడిగాడు సదాశివం నదిలో రాయి విసురుతూ.

"అంతే సదాశివం, నాకు వాసన్‌కి ఇక కుదరదు. సత్యాగ్రహంలో చేరొద్దంటున్నాడు. రాజాజీ గారు సత్యాగ్రహంలోకి రమ్మంటుంటే వాసన్‌తో ఎలా ఉండను, కుదరదు 'ఆనంద వికటన్' నుంచి వచ్చేస్తా."

సదాశివం నదిలోకి రాళ్లు వేస్తూ ఆలోచిస్తున్నాడు. చివరి రాయి ఉందనగా కృష్ణమూర్తి వైపు తిరిగి, "కృష్ణమూర్తీ! మంచి ఆలోచన ఒకటి చెప్తా విను, మనిద్దరం కలసి ఒక పత్రిక పెట్టుకుందాం. నీ రచనలు, నా మార్కెటింగ్ కలిస్తే మనం సాధించలేనిది ఏముంటుంది. అయినా మనకీ రంగం కొత్తా ... ఏమంటావ్?" కృష్ణమూర్తి మోము విప్పారింది. భవిష్యత్తు గురించి బెంగ వదిలింది. సదాశివం చేతిలోని రాయి తీసుకుని కసిగా నదిలోకి వేసి కొట్టాడు.

మద్రాసు తిరిగి వచ్చి, ఇద్దరూ రాజగోపాలాచారిని కలిశారు. "ఎందుకు మళ్లీ క్రొత్త పత్రిక? ఇప్పటికే బజారునిండా పత్రికలే" అన్నాడు రాజాజీ.



"ఉన్నాయండీ, కానీ ఆ పత్రికలు కృష్ణమూర్తి వ్యాసాల మీద, సమీక్షల మీద బ్రతుకున్నాయి. వాళ్లిచ్చే జీతానికి మా మేధస్సు ధారపోయటం ఎందుకు?" అడిగాడు సదాశివం.

"అది నిజమే కానీ, పత్రికకి పెట్టుబడి కావాలి. తర్వాత అది బాగా నడవాలి" అంటూ రాజగోపాలాచారి పత్రిక పెట్టకపోతేనే మంచిదనే ఉద్దేశంతో చెప్తున్నాడు. కానీ సదాశివం, కృష్ణమూర్తి పట్టుదలమీద ఉండటంతో, రాజగోపాలాచారి, అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీ ప్రధానమంత్రి అయిష్టంగానే "సరే, ముందుకెళ్లండి" అని ఆశీర్వదించాడు.

"సదాశివం, మరి పెట్టుబడి?" అడిగాడు కృష్ణమూర్తి.

"అది నేను చూస్తాను. నువ్వు మిగతా వ్యవహారాలు వెంటనే చూసుకుంటూ ఉండు." ఆ మిగతా వ్యవహారాలేంటో కృష్ణమూర్తికి చెప్పనక్కర్లేదు. వాళ్లిద్దరికి ఈ క్షణం నుంచి జత కుదిరింది. కృష్ణమూర్తి వాళ్లు తీసుకురాబోయే పత్రిక పేరు, దాని కొలతలు, పేజీలు, నెలవారీనా... వారానికా.. ఇలాంటి వ్యవహారాలు తేల్చే పనిలో నిమగ్నమయ్యాడు.

సదాశివం పెట్టుబడి ఆలోచనలతో తల మునకలైయున్నాడు. సుబ్బలక్ష్మికి మద్రాసు సంగీత సభల కాలం, త్యాగరాజ ఆరాధనోత్సవాలు అయ్యి తీరిగ్గా ఇంట్లో ఉంది, అత్త మంగళంతో వంటపనులు చేసుకుంటోంది. మడి ఆచారాలు అన్నీ క్షుణ్ణంగా నేర్పుతోంది కొత్త కోడలుకి. సుబ్బలక్ష్మికి, వాళ్లమ్మకి మొదటినుంచీ బ్రాహ్మలంటే ఆరాధనాభావం. ఎప్పుడూ వాళ్ల ఆచార వ్యవహారాలని, భోజన అలవాట్లని పాటించేవాళ్లు. అందుచేత మంగళంకి దేవదాసీ కోడలుతో పెద్దగా ఇబ్బందనిపించలేదు. ఆ ఇంట్లో అడుగు పెట్టిన మొదటి రోజునుంచి చాలా జాగ్రత్తగా మసులుకుంది సుబ్బలక్ష్మి. మడి, ఆచారాల వల్ల వంటగదిలోకి రాలేకపోయినా పిల్లలని మాత్రం చక్కగా చూసుకుంది. సదాశివం వైపు మొగ్గుచూపటంలో ఈ పిల్లల మీద ప్రేమ కూడా కొంచెం కారణం అయ్యింది. సదాశివం మేనకోడలు తంగం, మేనల్లుడు అంబి, సదాశివం పెద్ద కూతురు రాధ ఇప్పటినుంచి సుబ్బలక్ష్మికి సొంతపిల్లలు. పిల్లల్ని ఆడిస్తూ ఆడిస్తూ ఏదో గుర్తుకు వచ్చినదానిలాగా సుబ్బలక్ష్మి సదాశివం దగ్గరికి వచ్చింది. "ఊరి నుంచి చిన్నమ్మాయిని తీసుకొద్దాం మామా" అంది. "తీసుకొద్దాం కుంజా. నేను వెళ్లి తీసుకొస్తాను" చెప్పాడు సదాశివం. మళ్లీ తన క్రొత్త పత్రిక ఆలోచనలో మునిగిపోయాడు. ఇంతలో పిల్లలు గోలగోల చేస్తున్నారు. కోపంగా వచ్చి వాళ్లకు తలా నాలుగు తగిలించాడు. పిల్లలు దెబ్బలు తప్పించుకోవటానికి సుబ్బలక్ష్మి వెనక దాక్కున్నారు. "మళ్లీ గోల చేశారంటే తాట తీస్తాను" అనుకుంటూ ఆలోచనలలోకి వెళ్లిపోయాడు. "పిల్లలు గోల చేయకుండా ఎలా ఉంటారు?" మంగళం పాట అందుకుంది. సుబ్బలక్ష్మి "షూ..షూ" అని సైగచేస్తూ మంగళం శ్రుతి తగ్గించింది.



సదాశివం కొత్త పత్రిక పెట్టుబడికి అన్ని దారులు వెతుకుతుండగా సుబ్బలక్ష్మికి ఇంకో సినిమా అవకాశం అక్షరాలా తలుపుతట్టింది. "సదాశివంగారూ! సదాశివంగారూ!" అంటూ తలుపు ఎవరో కొడుతున్నారు. సదాశివం వెళ్లి వీధి తలుపు తీశాడు. "ఎవరు?" వచ్చినవాళ్లని అడిగాడు. "మిమ్మల్ని ఈ కారులోనే ఇప్పుడే డైరెక్టరు సారు వై.వి. రావు గారు తీసుకొని రమ్మన్నారండి." సదాశివం వెంటనే గ్రహించాడు, సుబ్బలక్ష్మి కోసమేనని. వెంటనే బయలుదేరాడు.

వై.వి. రావు ఆఫీసులో "సదాశివంగారూ నేను 'సావిత్రి' అనే సినిమా తియ్యటానికి అంతా సిద్ధమయింది. ఈ సినిమాలో ఎమ్.ఎస్.గారు నారదుడిలాగా నటించాలి." నమ్మలేనట్లుగా చూశాడు సదాశివం. "ఆడవాళ్లు నారదుడిగా వెయ్యటం ఏంటీ.. నారదుడు క్రింద ఒక ధోవతీ, పైన ఒక్క పూలదండ తప్ప ఇంకేమీ వేసుకోడు కదా..." ఇక నేను వెళ్లనా అన్నట్లు లేచాడు.

"సదాశివంగారూ కూర్చోండి, మీరు 'నందనార్' సినిమా చూశారా? దాంట్లో సుందరాంబ వేసింది నందనార్ వేషం, నందనార్ మగవాడు కదా.. ఎమ్.ఎస్. బాగా పాడగలదు. ఎమ్.ఎస్. మగ వేషం వేస్తేనే జనాలకి సంచలనం. ఆలోచించండి. కాదనకండి." ఆలోచిస్తున్నాడు సదాశివం. ఒప్పుకునేటట్లే ఉన్నాడు చూడబోతే. ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు వై.వి. రావు.

సదాశివం మెల్లగా, "సుందరాంబ 'నందనార్'లో మగ వేషం వేయటానికి లక్షరూపాయలు తీసుకుంది మీకు తెలిసే ఉంటుంది" అన్నాడు.

'ఆరి ఘటికుడా' అనుకొని తలపట్టుకున్నాడు రావు.

"సరే, మరి మీరు ఏ సంగతి ఒక వారంలో చెప్పండి. నేనూ ఈ లోపల ఆలోచించుకుంటాను" అని బయలుదేరాడు సదాశివం. ఇంట్లో ధోవతులు దండెంమీద నుంచి తీసి మడతవేస్తుంది సుబ్బలక్ష్మి. తన క్రొత్త పత్రికకు పెట్టుబడి కనిపించేసింది సదాశివానికి. సరిగ్గా వారానికి అనుకున్నట్లు రావు పిలిచాడు. "చెప్పండి ఎమ్.ఎస్. నటిస్తున్నట్లేనా.."

"లక్షరూపాయలు ఖాయమేనా."

"లక్ష ఇవ్వలేనుకానీ, అందులో సగం ఇస్తాను. ఎమ్.ఎస్. నటిస్తే చాలు, నా డబ్బు నాకు రావటం ఎంతసేపు"

సదాశివం ఒప్పుకున్నాడు కానీ..."ఇంకో షరతు" అని అన్నాడు.

"ఏమిటది?"

"సినిమా మద్రాసులో తీయకండి. మన దగ్గర కూడా హాలీవుడ్‌లోలాగా యల్లో





సదాశివం, సదాశివం మేనల్లుడు అంబి రామచంద్రన్, మేనకోడలు తంగం రామచంద్రన్, పెద్ద కూతురు రాధలతో సుబ్బలక్ష్మి



అంబి రామచంద్రన్, రాధ, తంగం రామచంద్రన్, సుబ్బలక్ష్మి

జర్నలిజం మొదలయింది. ఎవరికిష్టమొచ్చినట్లు వా... చిత్ర రాస్తున్నారు. సుబ్బలక్ష్మిని మగ వేషంలో ఇక్కడివాళ్లు చూడటం కూడా నాకిష్టంలేదు."

ఆలోచిస్తున్నాడు రావు. 'సరే, కలకత్తాలో పెట్టుకుందాం..'

ఇంటికొచ్చి విషయమంతా సుబ్బలక్ష్మికి చెప్పాడు సదాశివం. "మామా.." ఆశ్చర్యపోయింది సుబ్బలక్ష్మి. వాళ్లు ఇచ్చే యాభైవేలకి, తను వెయ్యబోయే వేషాన్ని తలచుకొని. "మరేమీ పర్వాలేదు కుంజా. నువ్వు నీ పాటలు బాగా పాడు. మిగతావన్నీ నేను చూసుకుంటాను. ఇంక నీకు యాభైవేలు ఇచ్చాక, నీకు కొత్త ధోవతులు కొనకుండా ఆయనవే తీసుకొస్తాడేమో, ఎందుకైనా మంచిది, నీకు నావి తీసుకొస్తా" అంటూ ఛలోక్తులు వేశాడు సదాశివం.

సుబ్బలక్ష్మిని సదాశివం చూసింది మొదలు అతని మనస్సుకు నిలకడ లేకుండాపోయింది, మనిషికీ నిలకడలేదు. పెళ్లి చేసుకొని మనస్సుకైతే నిలకడ వచ్చిందికానీ మనిషి మాత్రం కాళ్లకు చక్రాలు తొడిగినవాడయ్యాడు. సుబ్బలక్ష్మి జతగాడైనందుకు ధనలక్ష్మి కూడా దరిచేరింది. షణ్ముగవడివు బంగారుబాతు సదాశివం పరమైంది.

❦❦

'సావిత్రి' చిత్రీకరణకు కలకత్తా ప్రయాణమయ్యారు. రాధ ఆరేళ్ల పిల్ల. అమ్మని, నాన్నని వదలనంది. రాధను కూడా తీసుకొని కలకత్తా బయలుదేరారు. సుబ్బలక్ష్మి కుటుంబానికి ఒక విడిది ఇల్లు ఇచ్చారు. చిత్రీకరణ సాఫీగా జరిగిపోతోంది. ఒకరోజు ఇంటికి వెళ్లటానికి సుబ్బలక్ష్మి మెట్లు ఎక్కుతూ వుంటే తమిళంలో మాట్లాడుతూ ఇంచుమించు తన వయస్సున్న గృహిణి కిందకు దిగుతూ కనిపించింది. "ఒకసారి మా ఇంటికి వస్తారా" అని అడిగింది సుబ్బలక్ష్మి. ఆ గృహిణి ముందు ఆ గొంతుని గుర్తుపట్టింది. కాస్త దగ్గరగా పరిశీలించగా సినీనటి, కర్ణాటక సంగీతజ్ఞురాలు ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిగా గుర్తుపట్టింది. ఒక ప్రముఖ వ్యక్తి, జనాలు చూట్టానికి ఎగబడే వ్యక్తి తనను పిలుస్తుంటే ఆనందించింది. తరువాతి రోజు వస్తానంది. రాత్రి ఆ గృహిణి భర్త హెచ్చరించాడు, "నారాయణీ! ఆమె చాలా పేరు, విద్వత్తు ఉన్నామె. జాగ్రత్త, నీ సంగీతజ్ఞానం ఆమె ముందు చూపించకు."



సుబ్బలక్ష్మి, నారాయణి

తరువాతి రోజు నారాయణి సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చింది. సుబ్బలక్ష్మితో చాలాసేపు మాట్లాడిన తర్వాత ఆలోచనలో పడింది. 'మా ఆయన జాగ్రత్తగా ఉండమంది ఈ భోళా మనిషి గురించా' అని. సుబ్బలక్ష్మిలో పసిపిల్ల నవ్వు, కల్మషం లేని మనస్సు కనిపించాయి నారాయణికి. సుబ్బలక్ష్మి కర్ణాటక పాట ఎత్తుకుంటే సభాప్రాంగణం జనంతో పోటెత్తుతుంది.

తన బొమ్మ పోస్టర్‌మీద ఉంటే చాలు, వారి సినిమా ఆడుతుందనుకుంటున్నారు నిర్మాతలు. కాని, ఇవేమీ సుబ్బులక్ష్మిని మార్చలేదు. అదే మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి.

చిత్రీకరణ కొస్త అయిన తర్వాత మద్రాసు చేరుకున్నారు. సదాశివం తన పత్రిక పనులమీద పడిపోయాడు. సుబ్బులక్ష్మికి 'సావిత్రి'కి ఇచ్చిన యాభైవేలతో అన్ని ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. ఎగ్మోర్ రైలుస్టేషన్ ఎదురు పత్రిక కార్యాలయం, ముద్రణ యంత్రాలు ఏర్పరచుకున్నాడు. కొన్నాళ్లు పత్రిక పని చూసుకుని, వై.వి. రావు పిలువగానే మళ్లీ కలకత్తా చేరుకున్నారు. ఈసారి రాధని నారాయణి కనిపెట్టుకుంది. కలకత్తాలో మొత్తంమీద ఆరు నెలలు గడిపి, సుబ్బులక్ష్మి తన పాత్రను పూర్తిచేసుకొని ఆగస్టుకల్లా మద్రాసు చేరుకున్నారు. ఆగస్టులో సుబ్బులక్ష్మి, సదాశివం, కృష్ణమూర్తి మానస పుత్రిక 'కల్కి', తొలి ప్రతి విడుదలకు సిద్ధంగా ఉంది. 'కల్కి' వారపత్రికగా తయారయ్యింది. కృష్ణమూర్తి ముఖ్యసంపాదకుడు, సదాశివం కార్యనిర్వాహకుడు. 1941 ఆగస్టులో ఎగ్మోర్‌లో కల్కి ముద్రణాలయం, కార్యాలయం పూర్తి హడావుడిగా ఉన్నాయి. పంపిణీదారులు వచ్చి పత్రికను అమ్మటానికి ఒక్కొక్కరు వందల సంఖ్యలో తీసుకువెళ్తున్నారు. సదాశివం ఈ వార్త తరువాత రోజు వార్తాపత్రికల్లో రావటానికి విలేఖరులను కూడా ఆహ్వానించాడు.

వాళ్లల్లో ఒక విలేఖరి సదాశివం కుర్చీ వెనక గోడకు ఉన్న సుబ్బులక్ష్మి పెద్ద ఫోటో చూస్తున్నాడు.

"తంబీ, సుబ్బులక్ష్మి సినిమా యాక్టరు అని అంత పెద్ద ఫోటో పెట్టుకున్నాడు ఆఫీసులో, ... ఆమె అందరికీ తెలుసుకదా.. అందుకే..."

"ఇల్లై అణ్ణా! సదాశివం భార్య కదా, అందుకు పెట్టుకున్నాడు."

"ఇల్లై తంబీ!"

"ఆమ అణ్ణా!"

సదాశివం ఈ సంభాషణ విని, "ఆమె సినిమా యాక్టరని, నా భార్యని ఆమె ఫోటో అక్కడ పెట్టుకోలేదు. సుబ్బులక్ష్మి ఈ పత్రికకి పెట్టుబడి పెట్టిన భాగస్వామి, అందుకు పెట్టుకున్నాను ఆమె ఫోటో" అని నిజం చెప్పాడు.

𝄞𝄞

1941 సెప్టెంబర్ 10న 'సావిత్రి' విడుదలయ్యింది. యథాప్రకారం సుబ్బులక్ష్మి పాటలకి జనం జేజేలు పలికారు. సినిమా మాత్రం సరిగ్గా ఆడలేదు. సుబ్బులక్ష్మి నటన కూడా అంతంతమాత్రమే.

సుబ్బులక్ష్మి పుణ్యమాఅంటూ సుబ్బులక్ష్మి తన జీవితంలోకి రాకముందు ఏఉద్యోగంలో స్థిమితంగా ఉండని సదాశివానికి ఇప్పుడు రెండు ఉద్యోగాలు. ఒకటి కల్కి, రెండు



సుబ్బులక్ష్మి. రెండూ పూర్తిస్థాయి ఉద్యోగాలే. కల్కి పత్రిక పుటలు పెంచాలేగానీ కల్కి పత్రికకు అక్షరాలకు ఏమాత్రం లోటులేదు. కృష్ణమూర్తి రచనావ్యాసంగం ఒక ఎత్తు అయితే, 1940లలోని పరిస్థితులు ఒక ఎత్తు. రెండవ ప్రపంచ యుద్ధ కాలమది, భారత స్వాతంత్ర్యోద్యమం కూడా ఒక కొలిక్కి వస్తుంది. రోజుమీద రోజు సంచలన వార్తల కాలం.. ఇక సుబ్బులక్ష్మి అందరికంటే ఎక్కువ గిరాకీ ఉన్న కర్ణాటక సంగీత నిధి, సినీనటి. ఎంతగా ప్రాచుర్యం కల్పిస్తే అంతగా లాభం. ఇక సదాశివం జీవితం ఈ రెండు పూర్తిస్థాయి ఉద్యోగాలతో ముడిపడిపోయింది.

𝄞𝄞

మద్రాసు ప్రెసిడెన్సీలో తమిళ ప్రాంతాలలో ద్రవిడ ఉద్యమం ఊపందుకుంది. ద్రవిడ ఉద్యమంలో ప్రధానమైన అంశం తమిళ భాషోద్యమం. తమిళ భాషోద్యమంలో ఒక భాగం తమిళ సంగీత ఉద్యమం. ముగ్గురు ఉద్దండుల పత్రిక, తొలి సంవత్సరంలోనే పేరుతెచ్చుకొని, ప్రచురణ సంఖ్య వారం వారంకీ పెంచుకుంటూ వస్తున్న పత్రిక, తమిళ సంగీత ఉద్యమంలో ఒక పక్షం వహించాల్సిందే. అందులోనూ ఈ పత్రిక వ్యవస్థాపకుల్లో ఒకరు సంగీతజ్ఞురాలయినప్పుడు.

తమిళ సంగీత ఉద్యమకారులు ఆర్.కె. షణ్ముఖం ఇంట్లో సమావేశమయ్యారు. ఆర్.కె. షణ్ముఖం మాట్లాడుతూ, "నేను ప్రపంచ దేశాలు ఎన్నో చూశాను. భారతదేశం కూడా నలుమూలలా తిరిగాను. కానీ మన తమిళనాట ఉన్న దుస్థితి నేను ఎక్కడా చూడలేదు. మన దుస్థితి ఎలా ఉందంటే ఒక తమిళుడికి ఉద్యోగం కావాలంటే అతను ఇంగ్లీషు నేర్చుకోవాలి, పెళ్లి చేసుకోవాలంటే సంస్కృతంలో చేసుకోవాలి, స్వాతంత్ర్య సమరంలో పాల్గొనాలి అంటే హిందీ రావాలి, సంగీతం వినాలన్నా, నేర్చుకోవాలన్నా, పాడాలన్నా తెలుగు రావాలి. సరే, కనీసం మాట్లాడాలన్నా దానిలో కూడా శుద్ధ తమిళం కరువైంది. మణిప్రవాళమే కాదు, ప్రళయం దొర్లుతుంది మన మాటల్లో. ఇలాంటి భయంకరమైన, ప్రమాదకరమైన స్థితిలో మన గడ్డపైన మన భాష ఈ దుస్థితిలో ఉంది" ముగించాడు షణ్ముఖం.

అందరూ గంభీరంగా వింటున్నారు. టి.కె. చిదంబరనాద ముదలియార్ అనే తమిళ భాషావేత్త మాట్లాడడం మొదలుపెట్టాడు. "హిందీని వ్యతిరేకిస్తూ మన భాషని కాపాడుకుంటున్నాము, స్వామినాథ అయ్యర్ మన తమిళ వాఙ్మయానికి తిరిగి ఊపిరి పోస్తున్నారు. ఇక మిగిలింది తమిళ సంగీతమే. ఈరోజు మన సొంత గడ్డపై జరుగుతున్న కర్ణాటక సంగీత కచేరీలలో తమిళ పాటలు చిట్టచివరన పాడుతున్నారు. తుక్కు కింద లెక్కగట్టి తుక్కడాల్లో పాడుతున్నారు. అదేమంటే తమిళ భాష కర్ణాటక సంగీతానికి అనువైన

భాష కాదంటున్నారు. ఇది మ్యూజిక్ అకాడమీని నడుపుతున్న తెలుగువారి కుట్ర. తెలుగు, తమిళ బ్రాహ్మల పన్నాగం. ఇప్పుడు కర్ణాటక సంగీతంలో ఉన్న రాగాలు మన తమిళ పూర్వీకుల 'పన్'లే. వాటికి సంస్కృత పేర్లు పెట్టి, క్రొత్తవాటిగా చెలామణీ చేస్తున్నారు. త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి వీరందరూ తెలుగు, సంస్కృతంలో రాయక ముందు మనం పాటలు పాడుకోలేదా? కృష్ణ అయ్యర్, గోపాలకృష్ణ భారతి కర్ణాటక బాణీలో వ్రాసిన తమిళ పాటలు మనవాళ్లెందుకు కచేరీలలో పాడటంలేదు? మన సంగీత విద్వాంసులే వాళ్లకి అర్థంకాని తెలుగు భాషలో పాడుతుంటే, ఇక శ్రోతల పరిస్థితి ఏంటి? పాటలోని భావం అర్థం కాకుండా పాడటమేమిటి, అది అర్థమయినట్లు ఈ శ్రోతల భేష్‌భేష్‌లేంటీ... మన తమిళనాట మనకి కావలసింది తమిళ పాటలు.. మన మాతృభాషలో పాటలు" అంటూ ముగించాడు.

సదాశివానికి తన పత్రికకి మంచి కథావస్తువు దొరికింది. తన గురువు రాజగోపాలాచారి మద్రాసు ప్రెసిడెన్సీ ప్రధానమంత్రిగా హిందీ భాషని పాఠశాలల్లో నిర్బంధ విద్యగా చేసినా సంగీతం విషయంలో మాత్రం మాతృభాష వైపే మొగ్గుచూపాడు. సదాశివానికి తమిళ సంగీత ఉద్యమంవైపు మొగ్గుచూపటానికి ఇంకే కారణాలు అవసరమవ్వలేదు. ఈ ఉద్యమంలో తన పత్రికని భాగస్వామిని చేయటమే కాకుండా సుబ్బులక్ష్మిని కూడా భాగస్వామిని చేయటానికి నిర్ణయించుకొని ఇంటికి చేరాడు. ఇంట్లో సుబ్బులక్ష్మి తన సంగీత సాధన చేసుకుంటుంది.

ప : చక్కని రాజ మార్గములుండగ
సందుల దూరనేల ఓ మనసా

అ.ప. : చిక్కని పాలుమీగడయుండగ
ఛీయను గంగా సాగరమేలే

*త్యాగరాజు కృతి, రాగం-ఖరహర ప్రియ, తాళం-ఆది*

𝄞𝄞

1942 తొలినాళ్లలో సుబ్బులక్ష్మి ఇంకొక ఇంటికి మారింది. ఇదీ అద్దె ఇల్లే కానీ తన మదురైలో మీనాక్షి గుడి అంత పెద్ద ఇల్లు. కల్కి పత్రికకు ప్రస్తుతం ఎగ్మోర్‌లో ఉన్న కార్యాలయం సరిపోక, పైగా శత్రుదేశాలు రవాణా వ్యవస్థ నాశనం చేయటానికి రైలుస్టేషన్ల మీద క్షిపణి దాడులు చేస్తున్నారని ఎగ్మోర్ రైలుస్టేషన్ ఎదురుగా ఉన్న తమ కార్యాలయాన్ని కీల్పాక్‌లో ఒక పెద్ద భవనానికి మార్చాడు సదాశివం. ఈ విషయాన్ని సదాశివం తన శైలిలో చెప్తూ ఒక పత్రికలో ఆ వార్త ఇలా వచ్చేలా చేశాడు, "మా కల్కి కార్యాలయం మద్రాసులోనే ఒక కొండ గుర్తుగా ఉంది, ఈ గుర్తు ద్వారా ఎగ్మోర్ రైలు స్టేషన్ను శత్రుసైన్యం



త్వరగా గుర్తుపట్టి వాటిమీద బాంబులు వేయటం మాకు ఇష్టం లేదు. కనుక మా 'కల్కి' కార్యాలయాన్ని 20, గురుస్వామి ముదలియార్ వీధి, కీల్పాక్‌కు మార్చుతున్నాము" అని.

ఈ పెద్ద భవనంలో కింద అంతా కల్కి కార్యాలయం అవగా విశాలమైన మొదటి అంతస్తు సుబ్బులక్ష్మి నివాసం, పావు వంతులోనే ఉన్న భవనాన్ని మినహాయిస్తే, ఆ చోటు అంతా పెద్దపెద్ద చెట్లతో నిండి ఉంది. సదాశివం ఆ చోటులో మంచి తోట చేసే పనికి పూనుకున్నాడు.

𝄞𝄞

ఈ సంవత్సరపు సంగీత సభల కాలం తమిళ ఇసై (సంగీతం) ఉద్యమం, కర్ణాటక సంగీత సనాతన వాదుల ద్వేషపూరిత వాతావరణం మధ్య జరుగుతోంది. ఈ దఫా మద్రాసు మ్యూజిక్ అకాడమీలో సుబ్బులక్ష్మి కార్యక్రమం ఖరారయింది. సదాశివం ప్రాపకంలోకి వచ్చిన దగ్గరనుంచి సంగీత సభల కరపత్రాల మీద కోకిలగాన ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి అని వ్రాయిస్తున్నాడు సదాశివం. ఈ 1942వ సంవత్సరంలో కూడా గానకోకిల ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి మైలాపురంలోని శ్రీ సుందరేశ్వర హాలులో మ్యూజిక్ అకాడమీ ఆధ్వర్యంలో కచేరీ మొదలుపెట్టింది. సదాశివం అక్కడే ఎదురుగా కూర్చొని ఉన్నాడు. కచేరీలో చివరి కీర్తన అయిన వెంటనే నిర్వాహకులు వచ్చి, సుబ్బులక్ష్మికి ఏదో చెపుతున్నారు. 'ఏంటది, ఏమి చెపుతున్నారు వీళ్లు' అనుకుంటూ సదాశివం వచ్చేలోపల సుబ్బులక్ష్మి తెలుగులో ఒక త్యాగరాజ కృతి అందుకుంది. సదాశివం ఆగిపోయాడు. తెలుగు పాటని వింటున్నంతసేపూ అసహనంగా ఉన్నాడు. కచేరీ అవగానే వెంటనే వచ్చి, "ఎందుకు పాడావు ఆ పాట, బుద్ధుందా నీకు, నన్ను అడిగే పనిలేదా" అంటూ అక్కడే అందరిముందు గట్టిగా అరిచాడు. అనుకోని ఘటనకి సుబ్బులక్ష్మి శిలైపోయింది. కారులో కర్ణభేరి పగిలిపోయింది. ఇంటికి వచ్చాక, "నీకు తెలుసా ఆ తెలుగు పాట ఎందుకు పాడించారో, నువ్వు అప్పటిదాకా పాడిన పాటల్లో తమిళ పాటలు, తెలుగు పాటలు సరిసమానంగా ఉన్నాయి, తెలుగు పాటలు ఎక్కువ చేయటానికి పాడించారు. నేను ఆపకపోతే ఇంకోటి పాడించేవారు. నీకు ఈ మాత్రం కూడా తెలియలేదా? నీకు తెలియకపోతే నేను వచ్చేదాకా ఆగాలి. బుద్ధి లేని పనులు చేయకు. ఇసైవాణి బిరుదు ఇచ్చారు నీకు... తమిళ ఇసైలో ఉన్నాం. ఒళ్లు దగ్గర పెట్టుకో" అంటూ తిట్టాడు. కోపం మనిషిలోని మృగ ప్రవృత్తిని రంకె పెట్టిస్తుంది. ఆ మృగ ప్రవృత్తి కడదాకా చూపిగాని సదాశివం ఆగలేదు. అమ్మ దగ్గర అల్లారుముద్దుగా పెరిగిన సుబ్బులక్ష్మి అల్లాడిపోయింది.

𝄞𝄞𝄞𝄞

భాష కాదంటున్నారు. ఇది మ్యూజిక్ అకాడమీని నడుపుతున్న తెలుగువారి కుట్ర. తెలుగు, తమిళ బ్రాహ్మల పన్నాగం. ఇప్పుడు కర్ణాటక సంగీతంలో ఉన్న రాగాలు మన తమిళ పూర్వీకుల 'పణ్' లే. వాటికి సంస్కృత పేర్లు పెట్టి, క్రొత్తవాటిగా చెలామణి చేస్తున్నారు. త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి వీరందరూ తెలుగు, సంస్కృతంలో రాయక ముందు మను పాటలు పాడుకోలేదా? కృష్ణ అయ్యర్, గోపాలకృష్ణ భారతి కర్ణాటక బాణీలో వ్రాసిన తమిళ పాటలు మనవాళ్లెందుకు కచేరీలలో పాడటంలేదు? మన సంగీత విద్వాంసులే వాళ్లకి అర్థంకాని తెలుగు భాషలో పాడుతుంటే, ఇక శ్రోతల పరిస్థితి ఏంటి? పాటలోని భావం అర్థం కాకుండా పాడటమేమిటి, అది అర్థమయినట్లు ఈ శ్రోతల భేష్‌భేష్‌లేంటీ... మన తమిళనాట మనకి కావలసింది తమిళ పాటలు.. మన మాతృభాషలో పాటలు" అంటూ ముగించాడు.

సదాశివానికి తన పత్రికకి మంచి కథావస్తువు దొరికింది. తన గురువు రాజగోపాలాచారి మద్రాసు ప్రెసిడెన్సీ ప్రధానమంత్రిగా హిందీ భాషని పాఠశాలల్లో నిర్బంధ విద్యగా చేసినా సంగీతం విషయంలో మాత్రం మాతృభాష వైపే మొగ్గుచూపాడు. సదాశివానికి తమిళ సంగీత ఉద్యమంవైపు మొగ్గుచూపటానికి ఇంకే కారణాలు అవసరమవ్వలేదు. ఈ ఉద్యమంలో తన పత్రికని భాగస్వామిని చేయటమే కాకుండా సుబ్బులక్ష్మిని కూడా భాగస్వామిని చేయటానికి నిర్ణయించుకొని ఇంటికి చేరాడు. ఇంట్లో సుబ్బులక్ష్మి తన సంగీత సాధన చేసుకుంటుంది.

ప : చక్కని రాజ మార్గములుండగ
సందుల దూరనేల ఓ మనసా

అ.ప. : చిక్కని పాలుమీగడయుండగ
ఛీయను గంగా సాగరమేలే

*త్యాగరాజు కృతి, రాగం-ఖరహర ప్రియ, తాళం-ఆది*

𝄞𝄞

1942 తొలినాళ్లలో సుబ్బులక్ష్మి ఇంకొక ఇంటికి మారింది. ఇదీ అద్దె ఇల్లే కానీ తన మదురైలో మీనాక్షి గుడి అంత పెద్ద ఇల్లు. కల్కి పత్రికకు ప్రస్తుతం ఎగ్మోర్‌లో ఉన్న కార్యాలయం సరిపోక, పైగా శత్రుదేశాలు రవాణా వ్యవస్థ నాశనం చేయటానికి రైలుస్టేషన్ల మీద క్షిపణి దాడులు చేస్తున్నారని ఎగ్మోర్ రైలుస్టేషన్ ఎదురుగా ఉన్న తమ కార్యాలయాన్ని కీల్పాక్‌లో ఒక పెద్ద భవనానికి మార్చాడు సదాశివం. ఈ విషయాన్ని సదాశివం తన శైలిలో చెప్తూ ఒక పత్రికలో ఆ వార్త ఇలా వచ్చేలా చేశాడు, "మా కల్కి కార్యాలయం మద్రాసులోనే ఒక కొండ గుర్తుగా ఉంది, ఈ గుర్తు ద్వారా ఎగ్మోర్ రైలు స్టేషన్ను శత్రుసైన్యం



త్వరగా గుర్తుపట్టి వాటిమీద బాంబులు వేయటం మాకు ఇష్టం లేదు. కనుక మా 'కల్కి' కార్యాలయాన్ని 20, గురుస్వామి ముదలియార్ వీధి, కీల్పాక్‌కు మార్చుతున్నాము" అని.

ఈ పెద్ద భవనంలో కింద అంతా కల్కి కార్యాలయం అవగా విశాలమైన మొదటి అంతస్తు సుబ్బులక్ష్మి నివాసం, పావు వంతులోనే ఉన్న భవనాన్ని మినహాయిస్తే, ఆ చోటు అంతా పెద్దపెద్ద చెట్లతో నిండి ఉంది. సదాశివం ఆ చోటులో మంచి తోట వేసే పనికి పూనుకున్నాడు.

𝄞𝄞

ఈ సంవత్సరపు సంగీత సభల కాలం తమిళ ఇసై (సంగీతం) ఉద్యమం, కర్ణాటక సంగీత సనాతన వాదుల ద్వేషపూరిత వాతావరణం మధ్య జరుగుతోంది. ఈ దఫా మద్రాసు మ్యూజిక్ అకాడమీలో సుబ్బులక్ష్మి కార్యక్రమం ఖరారయింది. సదాశివం ప్రాపకంలోకి వచ్చిన దగ్గరనుంచి సంగీత సభల కరపత్రాల మీద కోకిలగాన ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి అని వ్రాయిస్తున్నాడు సదాశివం. ఈ 1942వ సంవత్సరంలో కూడా గానకోకిల ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి మైలాపురంలోని శ్రీ సుందరేశ్వర హాలులో మ్యూజిక్ అకాడమీ ఆధ్వర్యంలో కచేరీ మొదలుపెట్టింది. సదాశివం అక్కడే ఎదురుగా కూర్చొని ఉన్నాడు. కచేరీలో చివరి కీర్తన అయిన వెంటనే నిర్వాహకులు వచ్చి, సుబ్బులక్ష్మికి ఏదో చెపుతున్నారు. 'ఏంటది, ఏమి చెపుతున్నారు వీళ్లు' అనుకుంటూ సదాశివం వచ్చేలోపల సుబ్బులక్ష్మి తెలుగులో ఒక త్యాగరాజ కృతి అందుకుంది. సదాశివం ఆగిపోయాడు. తెలుగు పాటని వింటున్నంతసేపూ అసహనంగా ఉన్నాడు. కచేరీ అవగానే వెంటనే వచ్చి, "ఎందుకు పాడావు ఆ పాట, బుద్ధుందా నీకు, నన్ను అడిగే పనిలేదా" అంటూ అక్కడే అందరిముందు గట్టిగా అరిచాడు. అనుకోని ఘటనకి సుబ్బులక్ష్మి శిలైపోయింది. కారులో కర్ణభేరి పగిలిపోయింది. ఇంటికి వచ్చాక, "నీకు తెలుసా ఆ తెలుగు పాట ఎందుకు పాడించారో, నువ్వు అప్పటిదాకా పాడిన పాటల్లో తమిళ పాటలు, తెలుగు పాటలు సరిసమానంగా ఉన్నాయి, తెలుగు పాటలు ఎక్కువ చేయటానికి పాడించారు. నేను ఆపకపోతే ఇంకోటి పాడించేవారు. నీకు ఈ మాత్రం కూడా తెలియలేదా? నీకు తెలియకపోతే నేను వచ్చేదాకా ఆగాలి. బుద్ధి లేని పనులు చేయకు. ఇసైవాణి బిరుదు ఇచ్చారు నీకు... తమిళ ఇసైలో ఉన్నాం. ఒళ్లు దగ్గర పెట్టుకో" అంటూ తిట్టాడు. కోపం మనిషిలోని మృగ ప్రవృత్తిని రంకె పెట్టిస్తుంది. ఆ మృగ ప్రవృత్తి కడదాకా చూపిగాని సదాశివం ఆగలేదు. అమ్మ దగ్గర అల్లారుముద్దుగా పెరిగిన సుబ్బులక్ష్మి అల్లాడిపోయింది.

𝄞𝄞𝄞𝄞

"చంద్రన్!" సదాశివం కల్కి కార్యాలయంలో బెల్ కొట్టాడు. చంద్రన్ వెంటనే వచ్చాడు.

"చంద్రన్ నువ్వేం చేస్తున్నావ్?"

"రేపటికి కావలసిన పనులు చూసుకుంటున్నాను సార్."

"ఆ పనులు రేపు చూసుకున్నా సరిపోతుంది కదా.." ఆలోచించాడు చంద్రన్.

"చేసుకోవచ్చు సర్, రేపు కూడా చేయొచ్చు."

"మరి ఈ రోజు చేయటం ఎందుకు? ఇదిగో ఇవి తీసుకెళ్లి టైపుచేసి తీసుకురా. వెంటనే. చూడు చంద్రన్ రేపు చేసే పనులు రేపే చెయ్యి. ఈ రోజు పనులు ఈ రోజు చెయ్యి. వెళ్లు" అని చెప్పి పంపాడు సదాశివం.

వెళుతూవెళుతూ తల గోక్కుంటూ ఆలోచించుకుంటున్నాడు చంద్రన్. 'రేపటి పని ఈ రోజు చెయ్యి, ఈ రోజు పని ఇప్పుడు చెయ్యి, ఇదేగదా నేను చిన్నప్పుడు చదువుకున్నది', అనుకున్నాడు చంద్రన్. అలా బయటికి వెళ్లాడో లేదో మళ్లీ వచ్చి సదాశివం ముందు నిలబడ్డాడు, "సార్, మీకోసం ఎవరో ఇద్దరు సినిమా నిర్మాతలు వచ్చారు."

"లోపలికి పంపు."

వాళ్లిద్దరూ లోపలికి వచ్చి కూర్చున్నారు. "కాఫీలు పంపమని చెప్పు చంద్రన్." "చెప్పండి, ఏం పనిమీద వచ్చారు?" వచ్చినవాళ్లని అడిగాడు సదాశివం.

ఒక నిర్మాత మొదలుపెట్టాడు. "మేము ఒక సినిమా తీయబోతున్నాము. అందులో ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిగారిని హీరోయిన్ అని అనుకున్నాము. డబ్బులు విషయంలో మాకెలాంటి ఇబ్బందులు లేవు. మీరు సావిత్రికి తీసుకున్నదానికంటే ఎక్కువే ఇస్తాము. కాకపోతే ఒకమాట..."

"ఏమిటది?" అడిగాడు సదాశివం.

"ఈ సినిమాకి మీరు నిర్మాత కారు, దర్శకులు కారు, కాబట్టి మీరు ఈ సినిమాలో ఏమాత్రం జోక్యం చేసుకోకూడదు. సెట్టులో ఉండొచ్చుకాని దేనిలో కూడా సలహాలు ఇవ్వకూడదు."

సదాశివం కోపం అణుచుకుంటున్నాడు. ఈ లోపు తిట్లకు బదులు ఒక మాట వచ్చింది సదాశివం నోట్లోంచి. "సినిమా ఏంటి?"

"ద్రౌపదీ వస్త్రాపహరణం."

కుర్చీని వెనక్కి తన్ని లేచాడు సదాశివం. "చంద్రన్! వీళ్లకి బయటకు దారి చూపించు."

వీళ్లేకాదు, సుబ్బలక్ష్మిని తమ సినిమాల్లో నటించమని కోరుతూ దర్శక నిర్మాతలు వరుస కడుతున్నారు. సదాశివంకి నచ్చనవి వారి కథలు కాదు, డబ్బు విషయాలూ



సెబాస్!
కోకిలగాన శ్రీమతి ఎం. ఎస్.
సుబ్బులక్ష్మియొక్క గానవాహినినుండి
హిస్ మాస్టర్స్ వాయ్స్ రికార్డులు

1942 'భారతి' పత్రికలో హెచ్.ఎమ్.వి వారి ప్రకటన

కాదు. సుబ్బులక్ష్మి పూర్తిగా తన అదుపులో ఉండాలి. తన పట్టు జారి ఇంకొకళ్ల అజమాయిషీలోకి వెళ్లకూడదు ఒక్క క్షణమైనా సరే. సుబ్బులక్ష్మి విషయంలో తనకు నచ్చనివి ఏవీ జరగటానికి వీల్లేదు. సుబ్బులక్ష్మి చెయ్యటానికి లేదు, ఇంకొకరు చేయించుకోటానికి లేదు.

ఒకప్రక్క కల్కి వారపత్రిక చక్కగా నడుపుతున్నారు సదాశివం, కృష్ణమూర్తి. మరోవైపు సుబ్బులక్ష్మి సినిమా అవకాశాలు గురించి ఆలోచిస్తున్నాడు సదాశివం. పాటలు పాడే హీరోయిన్ తన చేతిలో ఉంది. పేరు ఉన్న హీరోయిన్ తన చేతిలో ఉంది. ఇప్పుడు కథనంలో ఒక చేయి వేయటానికి కృష్ణమూర్తి కూడా ప్రక్కనే ఉన్నాడు. అసలు సంగతి, ఇప్పుడు డబ్బుకి కూడా ఫైనాన్షియర్లు దగ్గరకు వెళ్లనవసరం లేదు. రెండు లక్షలు తను సర్దుబాటు చేసుకోగలుగుతాడు. పైగా రాజగోపాలాచారి ఇప్పుడు ఢిల్లీలో చక్రం తిప్పుతున్నాడు. ఏ పని కావాలన్నా అడగడమే ఆలస్యం అయిపోతుంది. తర్జనభర్జన పడి, సదాశివం ఏ సినిమా తీసినా ఈసారి పూర్తిగా తానే నిర్మాత అని నిర్ణయించుకున్నాడు. తన భార్య సినీ ఆకర్షణ శక్తిని ఇంకోసారి డబ్బుగా మార్చటానికి ఉద్యుక్తుడయ్యాడు.

𝄞𝄞𝄞𝄞

"కుంజా!" కిందనుంచి పైకివచ్చాడు సదాశివం.

"ఏమిటి మామా" అంటూ వచ్చింది సుబ్బులక్ష్మి. "కుంజా, ఈసారి నేను 'మీరా' అనే సినిమా తీస్తున్నాను. నువ్వే మీరావి."

"మీరానా...?" ఆలోచిస్తుంది సుబ్బులక్ష్మి.

"అవును మీరావే. అచ్చం మన ఆండాళ్ లాగానే కృష్ణుడుని పెళ్లాడతానని పట్టుపడుతుంది, కృష్ణుడినే తన భర్తగా ఊహించుకుంటుంది. బ్రజ్ భాషలో వేలకొలది పాటలు కృష్ణుడికోసం పాడింది. వాటిలో మంచి పాటలు మన సినిమాలో ఉంటాయి. నీకు మీరా మీద పుస్తకాలు ఇస్తాను, చదువు."

"అలాగే మామా."

సదాశివం వెళ్లగానే సదాశివం మేనకోడలు తంగం, "కుంజక్కా! నేను కింద విన్నాను. ఇంకా రెండు కథలు ఉన్నాయి కృష్ణమూర్తి మామ దగ్గర. వాటిల్లో అయితే ఎంచక్కా హీరోయిన్ కత్తియుద్ధాలు చేస్తుంది, గుర్రాలు ఎక్కుతుంది. ఆ సినిమా చేస్తానను కుంజక్కా"

"వద్దే తంగం. నాకు ట్రామ్ ఎక్కాలన్నా భయమే. ఇంకా ఆ గుర్రాలు ఏం ఎక్కుతాను. మీరా అయితే పాటలు పాడటమే పని, నాకు వచ్చిందే అది. అవేవో పాడితే అయిపోతుంది. ఇంకేమి చేయనవసరంలేదు." సుబ్బులక్ష్మి ధైర్యం తెచ్చుకుంది. ఇవి తను ఆపమంటే ఆగే పనులు కాదు. పూర్తిగా ఆలోచించి, ఎంతో దూరం ఆలోచించి ఖరారు అయి



చివరకు తన దగ్గరకు వస్తాయి. అప్పుడే కిందకి వెళ్లిన సదాశివం మళ్లీ పైకి వచ్చాడు. "కుంజా! చిన్నప్పటి మీరాలాగా రాధ చేస్తుంది. ఇది చెప్పటానికే వచ్చాను మీరా" అంటూ వెంటనే వెళ్లిపోయాడు.

"మీరా.... నన్ను మీరా అన్నారేంటే మామ.." ఆశ్చర్యంగా సదాశివం వైపే చూస్తూ ఉంది. పిల్లలు, "అమ్మ నువ్వు "మీరా", "కుంజక్కా నిన్ను మీరా అన్నాడు మామయ్య" అంటూ ఎగురుతున్నారు.

సదాశివం సుబ్బులక్ష్మిని మీరా అనటంలోనే, సదాశివం మీరా సినిమా గురించి ఎంతగా ఆలోచించాడో, తన ఆలోచనల్లో సుబ్బులక్ష్మి మీరా లాగా ఎలా ఇమిడిపోవాలో, ఆ సినిమా ఎంత బాగా తీయాలో తన మనస్సులో ఖచ్చితమైన ప్రణాళిక వేసుకున్నాడనే పట్టుదల కనిపించింది. వెంటనే డంగన్‌ను పిలిపించి తన ఇంటిలోనే కృష్ణమూర్తితోపాటు సమావేశమయ్యాడు. "నాకు తెలుసు డంగన్ సుబ్బులక్ష్మి చేత నటింపచేయటం, సంభాషణలు పలికించడం భగీరథ ప్రయత్నమని, మన అదృష్టం బాగుండి ఆ మూడు సినిమాలు ఆడాయి. కానీ ఇప్పుడు మనల్ని తొందరపెట్టటానికి ఎవరూ ఉండరు. నాకు తొందర లేదు. సుబ్బులక్ష్మి సరిగ్గా చేస్తుంది అంటేనే కెమెరా ముందుకు వెళ్లేది. ఎన్నిసార్లయినా చేయించు డంగన్. ఏమంటావు..."

"థ్యాంక్యూ సర్.. ఎమ్.ఎస్.తో అంత సమయం కావాల్సిందే." మొహమాటం లేకుండా చెప్పాడు డంగన్. "ఇప్పటిదాకా నేను, కృష్ణమూర్తి వ్రాసిన కథనం ఇది. మీరేమైనా మార్పులు చేస్తే చెయ్యండి. ఇవిగో మీరా పుస్తకాలు, ఇంగ్లీష్‌లో ఉన్నాయి. మీరు తప్పకుండా చదవండి" డంగన్ ఆ పుస్తకాలు, కథనం ఉన్న పుస్తకం అన్నీ తీసుకుని చూస్తున్నాడు. అవన్నీ ఓమారు చూసి, "సర్, నాకు కూనూర్‌లో బస ఏర్పాటు చెయ్యగలుగుతారా... స్క్రిప్ట్ పని అక్కడ చూస్తాను." కృష్ణమూర్తి సదాశివంవైపు చూశాడు. 'అవసరమా అంత ఖర్చు. మద్రాసులో చూసుకోలేడా ఆ పని' అన్నట్లు. సదాశివంకి తెలుసు ఎక్కడ ఖర్చుపెట్టాలో. "తప్పకుండా, డంగన్ మీకు కూనూర్‌లో అన్ని ఏర్పాట్లూ చేస్తాను. మీరు చక్కగా పనిచేస్కోండి" అని మాట ఇచ్చాడు.

ప్రతి ఆదివారం సదాశివం సుబ్బులక్ష్మితోసహా కూనూరు వెళ్లి, డంగన్ స్క్రిప్ట్ పనులు ఎందాకా వచ్చిందో చూసి, చర్చించి వస్తున్నాడు. డంగన్ మూడు నెలల్లో స్క్రిప్ట్ తయారు చేసుకొని వచ్చాడు. కాగితంలో కుడివైపు తమిళంలో, ఆంగ్లంలో సంభాషణలు ఉన్నాయి. దాని పక్కనే ఎడమవైపు ఆ సంభాషణలు సంబంధించిన సన్నివేశం ఎలా జరగాలి అనేదాన్ని వ్రాసుకున్నాడు. ఇదే కాగితం తమిళంలో వ్రాయబడి సినిమాకి సంబంధించిన వారి అందరి దగ్గరా ఉంటుంది. ఇక సుబ్బులక్ష్మికి తర్ఫీదు మొదలయింది. సుబ్బులక్ష్మి నటన ఫర్వాలేదు అనుకున్న రోజున, "ఇక షూటింగ్ మొదలుపెడదామా డంగన్" అడిగాడు

సదాశివం. "కూర్చోండి మీకొక మాట చెప్పాలి" అంటూ సదాశివంని కూర్చోబెట్టి చెప్తున్నాడు డంగన్. "మీరు గమనించే ఉంటారు శకుంతల సినిమాలో ఎమ్.ఎస్. కొన్ని సన్నివేశాల్లో అందంగా కనిపించింది. కొన్నిటిలో అంత అందంగా కనిపించలేదు. ఈ సినిమాలో అలా జరగనివ్వొద్దు. సినిమా అంతా మీరానే కాబట్టి నేను కెమెరామేన్ జతిన్, ఒక పద్ధతి అనుసరిస్తాము. అదేంటంటే..." అదేంటో చెప్పాడు డంగన్. సదాశివం సరేనన్నాడు.

ఒకరోజు పొద్దున్న సుబ్బలక్ష్మి, సదాశివం న్యూటోన్ స్టూడియోకి చేరుకున్నారు. ఒక ఫ్లోరులో సుబ్బలక్ష్మిని కుర్చీమీద కూర్చోబెట్టాడు డంగన్, చుట్టూ పెద్ద లైట్లు ఏర్పాటు చేసుకున్నాడు. "ఎమ్.ఎస్. మీరు ఇలానే చాలాసేపు నేరుగా చూస్తూ కూర్చోవాలి, మేము లైట్లు వేస్తూ, ఆర్పుతూ ఉంటాము, మీరు లైట్లవైపు చూడొద్దు. మేము మిమ్మల్ని చూస్తున్నప్పుడు కదలొద్దు, మీరు ఎప్పుడు అలసిపోతే అప్పుడు కాసేపు ఆగుదాం. మీరు మళ్లీ వచ్చి ఇక్కడే కూర్చోవాలి. సరేనా ఎమ్.ఎస్."

డంగన్ కూడా సుబ్బలక్ష్మిని ఎమ్.ఎస్. అని పిలవడం మొదలుపెట్టాడు. సుబ్బలక్ష్మి ముఖం ఆకృతి కొలతలు తీసుకొని, మైనంతో అలాంటి ముఖం ఒకటి తయారు చేసుకున్నారు. లైట్ల కింద సుబ్బలక్ష్మి ఏ కోణంలో బాగా అందంగా చూపించగలరో చూసుకుంటున్నారు.

నాలుగు గంటల తర్వాత డంగన్ ఇంకొక్కసారి సుబ్బలక్ష్మి ముఖం వైపు చూస్తున్నాడు... నాలుగు గంటల నుంచి ఎంతో ఓపిగ్గా కూర్చొంది. మోము వెన్నెల ప్రసరిస్తుంది. మూడు నెలల నుంచి కూనూరులో చూసిన పచ్చని పర్వతశ్రేణులు, చల్లని వెన్నెల రాత్రులు, సుబ్బలక్ష్మి ప్రశాంతమైన మోము పక్కన తేలిపోయాయి.

'మీరా' చిత్రీకరణ ఇక పద్ధతి ప్రకారం జరిగిపోతూ ఉంది.

మళ్లీ మద్రాసు సంగీత సభల కాలం వచ్చేసింది. తమిళ ఇసై, మద్రాసు మ్యూజిక్ అకాడమీ ఈసారి వారివారి వాదనలు వినిపించుతూ తెరముందుకు వచ్చి గొంతుపెంచాయి.

మద్రాసు మ్యూజిక్ అకాడమీ తన 16వ వార్షిక సమావేశం, మైలాపూర్‌లోని శ్రీ సుందరేశ్వర హాలులో జరుపుతూ, వ్యవస్థాపక సభ్యులు టి.వి. సుబ్బారావు మాట్లాడుతూ "సంగీతంలో స్వరం ముఖ్యం, అక్షరం కాదు. భాషను సంగీతంతో ముడిపెట్టకండి, సంగీతమే ఒక అందమైన భాష, వినసొంపైన భాష" అని తమిళ భాషావాదులకు ఒక సందేశం ఇచ్చాడు.

దీనికి సమాధానంగా తమిళ ఇసై వారి మొదటి సమావేశంలో, జార్జి టౌను లోని సెయింట్ మేరీస్ హాలులో, ప్రముఖ వ్యాపారవేత్త, రాజకీయ నాయకుడు, బాలసరస్వతి





సుబ్బలక్ష్మి ముఖ ఆకృతిని గమనిస్తూ దర్శకుడు డంగన్

పోషకుడు ఆర్.కె. షణ్ముఖం మాట్లాడుతూ “సంగీతంలో స్వరం ఎంత ముఖ్యమో అక్షరం కూడా అంతే ముఖ్యం. సంగీతంలో ధ్వనే అంత ముఖ్యమయితే వాద్య సంగీతంతోనే సరిపెట్టుకోవచ్చుకదా. మరి తెలుగు, సంస్కృతంలో కర్ణాటక సంగీతం అంటూ పాడటం ఎందుకు? ఈ కర్ణాటక సంగీత కచేరీలో మన తమిళులు ఎలాంటి భావోద్వేగాలు లేకుండా శిలలై కూర్చొని, ఏమీ అర్థం కాకపోయినా చివరిలో అర్థమైనట్లు చప్పట్లు కొడుతున్నారు. ఇన్ని అవస్థలెందుకు? మనం తమిళులం, మనకు మన మాతృభాషలోనే కర్ణాటక సంగీత కచేరీలు కావాలి” అని ముగించగానే సెయింట్ మేరీస్ హాలు హర్షాతిరేకంతో, చప్పట్లతో మారుమ్రోగింది.

ఈ గట్టి అభ్యర్థనను సవాలు చేస్తూ మ్యూజిక్ అకాడమీ వాళ్లు ఇలా స్పందించారు: “కర్ణాటక సంగీతానికి నిర్దిష్టమైన లక్షణాలు ఉన్నాయి. ఆ లక్షణాలు తెలుగు, సంస్కృత భాషల్లో పోతపోయబడ్డాయి. కొత్త భాషని ఆ సంగీతంలోకి చొప్పించి, కర్ణాటక సంగీత విలువల్ని కాలరాయొద్దు.”

ప్రతిసవాలు విసురుతూ తమిళ ఇసై వారు “కర్ణాటక సంగీతం తెలుగు, తమిళ బ్రాహ్మల అతి కొద్దిమంది అజమాయిషిలోనే ఉంది. ఈ బ్రాహ్మలు మన ప్రాచీన సంగం, తేవారం, తిరుప్పుగళ్ సాహిత్యంలోనే వున్న ‘పన్’లు ని తీసుకొని వాటికి సంస్కృత పేర్లుపెట్టి, కొత్త రాగాలుగా చెలామణి చేస్తున్నారు. ద్రవిడుల విద్యను వారికే నేర్పుతున్నారు ఈ ఆర్యులు. ఇంగ్లీషువారు ఆర్యులకి వత్తాసు పలుకుతున్నారు. త్యాగరాజుకి ముందు కూడా తమిళంలో శాస్త్రీయ సంగీతం ఉంది. ఆ తర్వాత కూడా ఘనం కృష్ణ అయ్యర్, గోపాలకృష్ణ భారతి వ్రాసిన తమిళ పాటలు ఉన్నాయి, ఇప్పుడు కర్ణాటక సంగీత కచేరీలలో ఈ పాటలు ఎందుకు అనుమతించటంలేదు?

మద్రాసు మ్యూజిక్ అకాడమీవారు, వారి అసలువాదనను వినిపించారు. “తమిళ భాష కర్ణాటక సంగీతానికి అనువైన భాష కాదు” అని మళ్లీ పునరుద్ఘాటించారు. “తమిళ భాషలోని హల్లులు, హల్లులతో ముగించే మాటలు సంగీతానికి సరిపడవు, తమిళ భాషతో కర్ణాటక సంగీత రాగాలాపన, మనోధర్మం పాటించలేము” అని ప్రకటించారు.

“మీ వాదనలు మాకనవసరం, మా మాతృభాషలో పాటలు కావాలి” తమిళ ఇసైవారు నొక్కి చెప్పారు.

మద్రాసు మ్యూజిక్ అకాడమీ వారు “కర్ణాటక బాణిలో తమిళ పాటలు ఉంటేనే అనుమతిస్తాం. కాని ఇప్పటికిప్పుడు తమిళ కర్ణాటక పాటలు ఎలా వస్తాయి, తెలుగు పాటలో తమిళ మాటలు పేరుస్తున్నారు. అప్పుడు పాట అర్థమవుతుందేమోగాని సంగీతం



ఖూనీ అవుతుంది. కర్ణాటక సంగీతం ఉన్నత ప్రమాణాలని కాపాడటమే మా లక్ష్యం. ఇందులో ఇంకెలాంటి రాజకీయం లేదు.”

ఇప్పటికిప్పుడు తమిళ ఇసై రాజకీయమైంది. సి.ఎన్. అన్నాదురై రచయిత, పత్రికా సంపాదకుడు ద్రవిడ పార్టీ నాయకుడు మాట్లాడుతూ, “వీరి వాదన సంగీతం గురించి కాదు, మనం ఎక్కడ ప్రత్యేక తమిళ రాష్ట్రం కోరుతామేమోనని వారి భయం. అందుకే అడుగడుగునా తమిళ భాషను అణగతొక్కటానికి ప్రయత్నిస్తున్నారు. మద్రాసు మ్యూజిక్ అకాడమీవాళ్ల కర్ణాటక సంగీత విద్వత్తులు మనకొద్దు. మనకు అర్థమయ్యే పాటకావాలి.” ఆయన వాదనకు బలం చేకూర్చుతూ, ఇంకా ఇలా చెప్పాడు, “ఇప్పుడు ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి తెలుగు కృతులు బ్రహ్మాండంగా, సరైన తెలుగులో, తప్పులు లేకుండా పాడుతుంది, ఆ పాటలు తోటి సంగీత విద్వాంసులకి అర్థం అవుతాయి కానీ మన తమిళులకు అర్థం కావు. కాని ఎమ్.ఎస్. తమిళంలో పాడితే, తమిళుల ఆనందానికి హద్దులుండవు. ఆ మధురమైన సంగీతాన్ని పూర్తిగా ఆస్వాదిస్తారు.”

అన్నాదురై మాటలు మద్రాసు ప్రెసిడెన్సీలో ప్రజల మనోఫలకం పైన ఉన్న అభిప్రాయాలని నాలుక మీదకి తెచ్చాయి. తమిళ ఇసై గురించి కాదు, సుబ్బలక్ష్మి గురించి, కర్ణాటక సంగీతం ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి పేరుతో గుర్తించబడుతుంది. సుబ్బలక్ష్మి తెలుగులో ఉచ్చారణ దోషాలు లేకుండా సరిగ్గా పాడుతుంది. ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మికి ఎమ్.ఎస్. నామరూపం అయింది.

సదాశివం కూడా ఈ నామరూపాన్నే పలుకుతున్నాడు. “ఇలా అయితే ఎమ్.ఎస్. మీ అకాడమీలో పాడదు.”

“పర్వాలేదు, మొదలు, ముఖ్యమైన పాటలన్నీ తెలుగు, సంస్కృతంలోనే ఉండాలి. తుక్కడాలు తమిళంలో ఉండొచ్చు” చెప్పారు మ్యూజిక్ అకాడమీ నిర్వాహకులు. ఇంటికి వచ్చిన తర్వాత సదాశివం, “కుంజా, నువ్వు ఈసారి మ్యూజిక్ అకాడమీలో పాడటంలేదు.” హుకుం జారీచేశాడు సదాశివం. సుబ్బలక్ష్మికి బాధేసింది. తను, తన తల్లి కాళ్లు అరిగేలా తిరిగి మద్రాసు మ్యూజిక్ అకాడమీలో అవకాశం తెచ్చుకునేవారు. గొప్ప కర్ణాటక సంగీత విద్వాంసుల నెలవు మ్యూజిక్ అకాడమీ. అలాంటి అకాడమీ ఇప్పుడు తనను హారతిపట్టి తోడ్కొని వెళ్లి పాడించుకునే పరిస్థితి, కాని ఇప్పుడు పాడొద్దని తీర్మానించాడు సదాశివం. చెప్పింది తన భర్త కాబట్టి సుబ్బలక్ష్మి, “అలాగే మామ, మీ ఇష్టం” అంది.

ప్రజలను తండోపతండాలుగా ఆకర్షించే సుబ్బలక్ష్మి కచేరీలు లేకపోయినా మద్రాసు మ్యూజిక్ అకాడమీ తన కచేరీలు అరియక్కుడి, ముసిరి, జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం

మొదలగు ఉద్దండులతో మొదలు పెట్టుకుంది. ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటి, తమిళ ఇసైల తురుపు ముక్క సుబ్బలక్ష్మి; ఈ రెండు సభలలో కేవలం తమిళంలోనే పాటలు పాడుతూ, తమిళులని తన గానమాధుర్యంలో ఓలలాడించింది. "తమిళ ఇసై వాణి" అంటూ శ్రోతలు మురిసిపోయారు. ఇరవై ఏడేళ్ల సుబ్బలక్ష్మి గొంతు, ఆ ప్రాయానికి తగ్గట్టు, పచ్చని కోనల్లో ఎత్తుపల్లాలకు అనుగుణంగా తుళ్లుతూ పారుతున్న ఏరులా ఉంది.

𝄞𝄞𝄞𝄞

గత రెండేళ్లుగా 'క్విట్ ఇండియా' ఉద్యమంతో అతలాకుతలమైన దేశం ఇప్పటికి కాస్త కుదుటపడింది. ఇప్పటికిగానీ గాంధీజీ దగ్గర సెలవు తీసుకొని మద్రాసు చేరలేదు గాంధీజీ వియ్యంకుడు, రాజకీయ నాయకుడు అయిన రాజగోపాలాచారి, వచ్చీరాగానే సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చాడు. సదాశివం పరుగుపరుగున వచ్చి సాదరంగా ఆహ్వానించి, అతిథి మర్యాదలు చేశాడు తన రాజకీయ గురువుకి. రాజకీయ చర్చలు అయిన తర్వాత "సదాశివం, నేను నీ తరపున గాంధీజీకి, ఒక మాట ఇచ్చాను" చెప్పాడు రాజగోపాలాచారి. "నా తరపున.. గాంధీగారి దగ్గర.." అనుకుంటూ ఆశ్చర్యం సదాశివానికి, చూస్తున్నాడు.

"కస్తూర్బా గాంధీగారి పేరు మీద ఎమ్.ఎస్. చేత కచేరీలు చేయించి, ఆ వచ్చిన డబ్బును కస్తూర్బా మెమోరియల్ ఫండ్‌కి ఇస్తామని మాటిచ్చాను, ఏమంటావు.."

ఒకపక్క మీరా పనులు జరుగుతున్నాయి. కానీ సదాశివం దాని గురించి క్షణం కూడా ఆలోచించలేదు. "మీ మాట మాకు వేదవాక్కు అలానే చేద్దాం. ఆ పనిమీద ఉంటాను ఇక" అని భరోసా ఇచ్చాడు.

మద్రాసు, తిరుచిరాపల్లి, మదురై, కోయంబత్తూరు, తంజవూరు, ఇలా ఐదుచోట్ల సుబ్బలక్ష్మి కచేరీలకి ఏర్పాటయింది. మదురైలో కచేరీ ఉందని తెలియగానే సుబ్బలక్ష్మికి పట్టరాని సంతోషమేసింది. మదురై నుంచి వచ్చేసి ఎనిమిది సంవత్సరాలు, మళ్లీ అటువైపు చూసింది కూడా లేదు. అమ్మని, చెల్లిని చూడలేదు. మిగతా ఊళ్లలో కచేరీల మాట ఎలా ఉన్నా, మదురై కచేరీ కోసం సుబ్బలక్ష్మి తహతహలాడుతుంది. కచేరీకి ఒకరోజు ముందే మదురై చేరింది. సుబ్బలక్ష్మి బసచేసిన విడిదికి వెంటనే అన్నా, చెల్లి, మామలు, అత్తలు అందరూ వెళ్లారు. మూగాంబిక, రంగ, రాజం, మీనాక్షి, అన్న, చెల్లిని చూసుకొని మళ్లీ చిన్నపిల్లయింది సుబ్బలక్ష్మి. గురువుగారి కాళ్లకి నమస్కారం చేసుకుంది. ఉబ్బితబ్బిబ్బయిపోయాడు సుందరేశ భట్టర్. "నా పేరు నిలబెడుతున్నావు కుంజమ్మా" అంటూ పొంగిపోయాడు. అందరినీ పేరుపేరునా పలుకరిస్తుంది. "రంగమ్మా అమ్మను తీసుకురాలేదే?" "నువ్వొచ్చి మీ అమ్మ గడ్డం పట్టుకోవలసిందేనమ్మా" అంది రంగ. "ఇంటికి ఎప్పుడొస్తావు కుంజా?" అడిగాడు అన్న. "ఇప్పుడు కాంగ్రెస్ నాయకులు భోజనాలు ఏర్పాటు చేశారన్నా. అది అయిన తర్వాత ఇంటికొచ్చి గుడికి వెళ్దాం" చెప్పింది సుబ్బలక్ష్మి. "కుంజా, రేపు నీ కచేరీలో తంబూర వేస్తా" చెప్పింది రాజం. "ఒసేయ్ రాజం, నువ్వు వేసే తంబూరకి కస్తూర్బా మళ్లీ కిందకి వస్తుందేమోనే.." అంది మీనాక్షి. "నాకు తంబూర వేయటానికి నా కూతురు వచ్చింది రాజంపిన్నీ" అంటూ రాధను పనిలో పని పరిచయం చేసింది సుబ్బలక్ష్మి. "పదండి, పదండి, దాని కోసం చాలామంది ఎదురు చూస్తున్నారు" అనుకుంటూ సుబ్బలక్ష్మి ఆత్మీయులందరూ బయులుదేరారు.

అందరూ షణ్ముగవడివు ఇంటికి వచ్చారు. "షణ్ముగం నిన్ను చాలాసార్లు అడిగింది, రాలేదని" అంది రంగ. "దాన్ని చూడ్డానికి జనం తోసుకుంటున్నారు షణ్ముగం" అంది మీనాక్షి. "లోపల మన ఊరి గొప్పోళ్లందరూ ఉన్నారు కుంజాతో మాట్లాడుతూ" అంది మరకతం. "ఫోటోలు కూడా తీస్తున్నారు" అంది రాజం. షణ్ముగవడివు ఎటో చూస్తుంది కాని, చెవులారా వింటుంది కూతురు కబుర్లు. "షణ్ముగం మన దగ్గర నుంచి వెళ్లిన పిల్లలా లేదు, కాస్త లావెక్కింది. చక్కగా ఉంది, అచ్చం బ్రాహ్మల పిల్లలా ఉంది."

"అది బ్రాహ్మల పిల్లే" అరిచి చెప్పింది షణ్ముగవడివు.

𝄞𝄞𝄞𝄞

"రాజాజీ, ఇదిగోండి ఎనభైవేలు, గాంధీగారికి చేర్చండి" అంటూ సదాశివం రాజగోపాలాచారి చేతిలో డబ్బు పెట్టాడు. అవి కస్తూర్బా మెమోరియల్ ఫండ్‌కి సుబ్బలక్ష్మి కచేరీలవల్ల సాధించిన డబ్బు.

"కుంజమ్మా, ఇది నీకు" అంటూ రాజగోపాలాచారి ఆ డబ్బు తీసుకుంటూ ఒక ఉత్తరం బదులుగా ఇచ్చాడు సుబ్బలక్ష్మికి. సుబ్బలక్ష్మి ఉత్తరం చూసింది, ఏమీ అర్థం కాలేదు, ఆ రాతా అర్థం కాలేదు, ఇంగ్లీషు అర్థం కాలేదు, చివరిలో తమిళంలో ఉన్న పేరు చూసి ఆశ్చర్యానందాలకు గురైంది. సంతోషపడిపోతూ ఉత్తరం భర్త చేతిలో పెట్టింది. అది మహాత్మాగాంధీ సుబ్బలక్ష్మి కస్తూర్బా ఫండ్‌కి చేస్తున్న కచేరీలను మెచ్చుకుంటూ రాసిన ఉత్తరం. అంతా ఇంగ్లీషులో వ్రాసి, తమిళంలో సంతకం చేశారు గాంధీ. సదాశివం అక్క తన చివరి రోజుల్లో తన పిల్లలయిన అంబి, తంగంను సదాశివంకి అప్పచెపుతూ రాసిన ఉత్తరంతోపాటు, ఇప్పుడు ఈ ఉత్తరం కూడా సుబ్బలక్ష్మికి అత్యంత విలువైనదైంది.

𝄞𝄞

"షదాషివం గారు!" డంగన్ పిలుపుతో తలెత్తాడు సదాశివం. "ఎమ్.ఎస్. తన డైలాగ్‌లు ప్రాక్టీస్ చేసి చాలా రోజులవుతుంది."

"పాటలు కూడా" ఆ వెనకే వచ్చిన సంగీత దర్శకుడు వెంకటరామన్ అన్నాడు.

"ఇంకొన్ని రోజులుదాకా కుంజమ్మకు తీరికుండదు, మీరు ఈ లోపల రాధకి తర్ఫీదివ్వండి" చెప్పాడు సదాశివం.

"రాధ తన పోర్షను బ్రహ్మాండంగా నేర్చుకుంది. వాళ్లమ్మను మించిపోయింది" చెప్పాడు డంగన్. "అవునవును" అన్నాడు వెంకటరామన్.

"ఈ బొంబాయి పని ఒక్కటి కానివ్వండి, ఇక మీరానే మనకు" ఒక ప్రక్క 'మీరా' పని చూస్తూనే అన్నాడు సదాశివం.

బొంబాయిలో విక్రమాదిత్య సంగీత సమారోహాలు జరుగుతున్నాయి. సుబ్బలక్ష్మి సదాశివం బొంబాయి చేరుకున్నారు. కౌసాజి జెహాంగీరు హాల్లో, తను మదురైలో ఎదురింటి రేడియోలో విన్న హిందుస్థానీ గొంతులు సజీవ రూపాలై తను ముందు పాడటంతో తన్మయురాలైంది సుబ్బలక్ష్మి. ఆ గొప్పగొప్ప హిందుస్థానీ విద్వాంసులని చూడక ముందే వాళ్ల గొంతు పేరుపేరునా తెలుసు సుబ్బలక్ష్మికి. ఇప్పుడు ఆ గొంతు, ఆకారాన్ని జతచేసుకుంటోంది.

దేశం నలుమూలలనుంచి గొప్పగొప్ప విద్వాంసులు వచ్చారు. అల్లాదియా ఖాన్ జైపూర్ ఘరానా నుంచి, ఫైయాజ్ ఖాన్ గ్వాలియర్ ఘరానా నుంచి, ఓంకార్‌నాథ్ ఠాగూర్, ఇలా దేశంలోని ప్రముఖ సంగీతజ్ఞులంతా వచ్చారు. సుబ్బలక్ష్మికి పాడటానికి ఆహ్వానం వచ్చినా సుబ్బలక్ష్మి వచ్చింది మాత్రం ఈ గొప్ప హిందుస్థానీ విద్వాంసుల కచేరీలు వినాలని.

"మామా, ఒకసారి అల్లాదియా ఖాన్ గారిని కలుద్దాం, ఆయనకి తొంభై ఏళ్లు, మళ్లీ బొంబాయి వస్తామో రామో" భర్తను అడిగింది.

"అలాగే కుంజా, తీసుకువెళ్తాను" అన్నాడు సదాశివం.

అల్లాదియా ఖాన్ ఇంట్లో ఆయన ముందు వినమ్రంగా కూర్చుంది సుబ్బలక్ష్మి. అంతకు ముందురోజే కచేరీ చేశారాయన. తొంభై ఏళ్ల వయసులో, ముందు కాస్త తడబడినా ఆ తర్వాత శ్రుతిశుద్ధతతో గొప్పగా పాడారు. ఆయనను చూస్తూ మదురైకి వెళ్లిపోయింది సుబ్బలక్ష్మి. వాళ్ల ఇంటి దాబా పైన అందరూ నిద్రపోతున్న వేళ ఎలాంటి చడీచప్పుడూ లేని సమయాన, దూరంగా అమ్మవారి గుడి గోపురాలు కనిపిస్తూ, వాటినీ తనను కప్పేస్తూ నక్షత్రాలు అద్దుకున్న ఆకాశం క్రింద ఎదురింటి రేడియోలోంచి వస్తున్న అల్లాదియా ఖాన్ సంగీతం వింటూ మైమరచిపోయేది. హిందుస్థానీ సంగీతమే సంగీతం. శ్రుతికి మారుపేరు.

"మీది జైపూర్ ఘరానా నా" సదాశివం ప్రశ్నతో ఈ లోకంలోకి వచ్చింది సుబ్బలక్ష్మి.



"జైపూర్ అత్రౌలి ఘరానా" చెప్పారు అల్లాదియా ఖాన్.

"శుభలక్ష్మీ, నువ్వు పూరియా ధనశ్రీ పాడగలవా" అడిగారు అల్లాదియా ఖాన్.

"సుబ్బలక్ష్మి హిందుస్థానీ సంగీతం పూర్తిగా నేర్చుకోలేదు" అన్నాడు సదాశివం.

అల్లాదియా ఖాన్ సుబ్బలక్ష్మివైపు చూశారు. గొంతు సవరించుకుని, కర్ణాటక సంగీతంలో పూరియా ధనశ్రీకి సమానమైన పంతువరాళి రాగం ఆలపించింది. ఏకాగ్రతతో విన్నారు అల్లాదియా ఖాన్. చాలా సేపటి సుబ్బలక్ష్మి రాగాలాపన. మెచ్చుకుంటూ "నువ్వే ఒక ఘరానావి" అంటూ దీవించారు.

✤✤✤✤

తిరిగి మద్రాసు చేరారు. మద్రాసులో ధనుర్మాసం, సంగీత సభల కాలం. "కృష్ణమూర్తి ఆ మ్యూజిక్ అకాడమీ వాళ్లు ఏమన్నా దారికొచ్చారా.. అదే పాట పాడుతున్నారా?" అడిగాడు సదాశివం.

"వాళ్లెప్పుడూ ఎమ్.ఎస్. కచేరీ కోసం రాలేదు. మిగతా సభలన్నీ వచ్చాయి."

"వీళ్లకి ఇలా కాదుగానీ, పైపై సంగీత సభ నడిపించాలి. ఒక్కసారి పిలిపించు చెప్తా."

టి.టి. నరసింహన్ ఐ.సి.ఎస్. అధికారి, మద్రాసు ప్రెసిడెన్సీలో పెద్ద పదవిలో ఉన్నారు. అతను స్వయానా కర్ణాటక సంగీత విద్వాంసుడు కూడా. ఒక సభను ఏర్పరచి సంగీత సేవ చేస్తున్నారు. "నరసింహన్‌గారూ, ఎమ్.ఎస్. మీ సభలో పాడుతుంది. కానీ, తొంభై తొమ్మిది శాతం తమిళ పాటలే పాడుతుంది. ఈ సభల కాలంలో మూడుసార్లు ఎమ్.ఎస్. కచేరీ పెట్టించండి. మ్యూజిక్ అకాడమీ వాళ్లు దిగిరావాలి." అలా తనను కాదు అని చెప్పి తన మాటకు ఎదురు చెప్పిన మద్రాస్ మ్యూజిక్ అకాడమీ మీద కత్తిగట్టాడు అహం దెబ్బతిన్న సదాశివం.

✤✤

సుబ్బలక్ష్మికి ఈ రోజుల్లో నిన్నటికి మించి ఈ రోజు తీరిక లేకుండాపోతుంది. ఇంటిపని, వంటపని ఎప్పుడో వదిలేసింది. అయినా తీరిక లేదు. తన కచేరీ సాధనలు, సినిమా సాధనలు ఒకటి తర్వాత ఒకటి ఉంటూనే ఉన్నాయి. దీనికి తోడు ఆరు నెలల నుంచి రాధ, కృష్ణమూర్తి కూతురు ఆనంది, భరతనాట్యం నేర్చుకుంటున్నారు. వీరి అరంగేట్రం తేదీలు కూడా ఖరారయ్యాయి. ప్రఖ్యాత నట్టువ రామయ్య పిళ్లై వీరికి గురువు. రామయ్య పిళ్లై 'మీరా' సినిమాలో కూడా నృత్యాలు కూర్చుతున్నారు.

ఇప్పుడు కృష్ణమూర్తి సదాశివంకి వ్యాపార భాగస్వామే కాక బాగా ఆప్తుడు కూడా అయ్యాడు.

ఒకరోజు డంగన్ వచ్చేశాడు. "ఇంక మనము షూటింగ్ మొదలుపెట్టాలి సర్" అంటూ తొందరపెట్టాడు.

"ఇంక అదే పని డంగన్" చెప్పాడు సదాశివం.

"ఇంకొక విషయం సర్, మనం తప్పకుండా ఉదయపూర్ వెళ్లాల్సిందే."

"కూనూర్ అయ్యింది. ఇప్పుడు ఉదయపూరా" అంటూ కృష్ణమూర్తి సదాశివంవైపు చూశాడు. డంగన్‌కి అర్థమయింది. "మనం ఉదయపూర్ వెళితేనే నేటివిటీ ఉంటుంది షదాషివంగారూ. అక్కడ తీస్తే వచ్చే ఎఫెక్టే వేరు. ఆపై మీ ఇష్టం" అన్నాడు డంగన్.

"మనం వెళ్తున్నాం. మీరు ఏర్పాట్లు చూసుకోండి. నేను ప్రయాణం సంగతి చూస్తాను" అభయమిచ్చాడు సదాశివం.

డంగన్ వెళ్లగానే, "కృష్ణమూర్తీ! ఉదయపూర్ సంస్థానం దివాను మన మీర్జా ఇస్మైల్, ఒక్కమాట రాజాజీతో చెప్పించామంటే మనక్కావలసిన ఏర్పాట్లన్నీ ఆయనే చూస్తారు" అటునుంచి నరుక్కొచ్చాడు సదాశివం. సదాశివం తన మనోఫలకం మీద 'మీరా' సినిమాని ఒక గొప్ప కళాఖండం లాగా ఊహించుకొని ఉన్నాడు. సుబ్బలక్ష్మి పాటలు, వెంకటరామన్ సంగీత దర్శకత్వం, కృష్ణమూర్తి సాహిత్యం, డంగన్ దర్శకత్వం, తన పనితనం, వీటన్నిటిమీదా అపారమైన నమ్మకం సదాశివానికి. తన ఊహకి కార్యరూపం ఇవ్వటం మొదలుపెట్టాడు.

న్యూటోన్ స్టూడియోలో 'మీరా' ముహూర్తపు పూజతో చిత్రీకరణ ప్రారంభమయింది. ముహూర్తపు సన్నివేశం పదేళ్ల రాధ అంటే సినిమాలో చిన్నప్పటి మీరా మీద చిత్రీకరించారు. చిన్నారి మీరా ఆడుకుంటుండగా అమ్మ పిలుస్తుంది, రూప గోస్వామి అనే సాధువు ఒక కృష్ణుడి విగ్రహాన్ని మీరా తాతకి ఇస్తాడు. ఆ విగ్రహాన్ని చూసిన క్షణం నుంచే మీరా కృష్ణుడి పట్ల ఆకర్షితురాలవుతుంది. ఒకరోజు ఒక పెళ్లి ఊరేగింపు చూస్తుంది, నా పెళ్లి కుమారుడు కృష్ణుడే అంటుంది అమ్మతో. అదెలా సాధ్యం అంటే ఏడుస్తుంది. లోకం అసాధ్యం అన్నదాన్ని సాధ్యం చేసుకోవటానికి చిన్నారి మీరాకు కృష్ణుడే లోకం అవుతాడు. భక్తిపారవశ్యంతో ఆశువుగా పాటలు పాడుకుంటుంది. 'మీరా' సినిమాలో ఇప్పటిదాకా రాధ బ్రహ్మాండంగా నటించింది. రాధ నటనముందు సుబ్బలక్ష్మి ఇప్పటిదాకా చేసిన మూడు సినిమాల్లో నటన దిగదుడుపే. రాధ చేత మూడు పాటలు కూడా పాడించారు. మూడవ పాటలో డంగన్ గొప్ప పనితనం కనబరిచాడు. చిన్నారి మీరా పాడుతూపాడుతూ పెద్దదయిపోతుంది. సుబ్బలక్ష్మి కృష్ణుడి కోసం తపిస్తూ పాడుతూ కనిపిస్తుంది. చిన్నప్పటి హీరోయిన్, హీరో ఒక్క పాటలో పెద్దవారైపోవటం, భారతీయ సినిమాకి డంగన్ ఇచ్చిన ఉపాయం. ఇక ఇప్పటి నుంచి సుబ్బలక్ష్మి మీరా. సదాశివంకు మూడు కథలు దొరికినా,



అల్లాదియా ఖాన్‌తో సుబ్బలక్ష్మి

వాటినుంచి మీరానే ఎంచుకొని, మీరానే ఖాయం చేశాడు. నిజ జీవితంలో మీరా పాటలు పాడుతుంది. పాటలే పాడుతుంది. మాటలు తక్కువ. సుబ్బలక్ష్మి గత మూడు సినిమాల్లో ఎంత చెప్పి చూసినా, మాటలు సరిగ్గా మాట్లాడలేకపోయింది. పాటలు మాత్రం అద్భుతంగా పాడింది. 'శకుంతల' సినిమా ఆడింది అంటే అది కేవలం సుబ్బలక్ష్మి, జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం పాటలు, దంగన్ పనితనంవల్ల. 'మీరా'లో ఇంతకు ముందు చూపించిన హాలీవుడ్ టెక్నిక్‌లాగా, 'శకుంతల'లో అలాంటి టెక్నిక్కులు మూడు చూపించాడు. సుబ్బలక్ష్మిచేత ఎక్కువ మాటలు మాట్లాడించకుండా, నటనమీద ఎక్కువ ఆశలు పెట్టుకోకుండా పాటలే పాడించాలి. అందుకే సదాశివం 'మీరా'ని ఎంచుకున్నాడు.

చిన్నారి మీరా పాటలో పెళ్లీడు మీరా అవుతుంది. ఆ పాట అవగానే మీరా తాత వచ్చి మేవాడ్ రాజు భోజ్‌రాజుని పెళ్లాడమని శతవిధాలా నచ్చచెబుతాడు. మీరా అయిష్టంగానే ఒప్పుకొని, పెళ్లి చేసుకొని చితోడ్‌గఢ్‌కి బయలుదేరుతుంది.

సదాశివం కూడా తన పిల్లలతోసహా పెద్ద పటాలం వేసుకొని ఉదయపూర్ చేరుకున్నాడు. అక్కడ మీర్జా ఇస్మైల్ సిఫార్సుతో, ఉదయ్‌పూర్ రాజు భూపాల్ సింగ్‌ను కలుసుకున్నాడు, సుబ్బలక్ష్మితో సహా.

-మీరు వినే ఉంటారు ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి గారి గురించి. ఆమె కోకిలగాన, ఇసైవాణి బిరుదాంకితురాలు. ఈ రోజుల్లో మేటి కర్ణాటక సంగీత విద్వాంసురాలు, నటీమణి కూడాను." రాజు భూపాల్ సింగ్‌కు విన్నవించాడు మీర్జా ఇస్మైల్, "అయితే ఒకసారి కచేరీ ఏర్పాటు చెయ్యండి" ఆదేశించాడు ఉదయ్‌పూర్ రాజు.

'అయిపోయింది, సగం పని అయిపోయినట్లే మనకి' అనుకున్నాడు సదాశివం మనసులో. ఆ సాయంత్రమే సుబ్బలక్ష్మి రాజదర్బారులో కచేరీ చేసింది. అందులో ముఖ్య అంశం కళ్యాణి రాగం. ఆ తరువాతి రోజు అసలు పనిమీద వెళ్లాడు సదాశివం రాజుగారి దగ్గరికి.

సదాశివం మాట్లాడేముందే "నిన్న మీ భార్య పాడిన కళ్యాణి రాగానికి, పాత రోజుల్లో అయితే మా రాజ్యాన్ని వ్రాసిచ్చేవారం.. కాని ఇప్పుడా పని చేయలేం కాబట్టి చెప్పండి, మీ సినిమా కోసం మా తరఫు నుంచి ఏం కావాలన్నా చేస్తాం... రాజ్యాన్ని వ్రాసివ్వటం తప్ప" నవ్వుతూ చెప్పాడు ఉదయ్‌పూర్ మహారాజు. దర్బారులో ఉన్న అందరూ నవ్వుకున్నారు మహారాజు ఛలోక్తికి.

"నాకు మీ కోట, తోట, కోటలోని ఆలయం, మీ ఉత్సవాల్లో ఊరేగించే ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, మీ ప్రజలు కొంతమంది." ఇలా చెప్పుకుంటూ పోతున్నాడు సదాశివం. "మహారాజా, మీ రాజ్యం తప్ప అన్నీ అడుగుతున్నాడు" రాణా భూపాల్ సింగ్ చెవిలో



ఇంకొక దివాను గొణిగాడు. రాణా నవ్వుతూ, "మీకేం కావాలంటే అది దివాన్ మీర్జా ఇస్మైల్‌ని అడిగి తీసుకోండి. ఆ కల్యాణి రాగానికి ఏమిచ్చినా తక్కువే" అంటూ కల్యాణి రాగం ఆలపిస్తూ రాజా దర్బారులోంచి వెళ్లిపోయాడు.

మీరా మెట్టినింటికి రాగానే రాజప్రాసాదంలోని తోటలో పాట పాడుకుంటుంది.

పెద్దపెద్ద కొలనులు, ఆ కొలనులలో ఫౌంటెన్లు, ఏనుగుల తొండంలోనుంచి పైకెగసి వస్తున్న నీళ్లు, ఇవన్నీ వున్న ఆ పెద్ద తోట ఉదయపూర్ మహారాజావారి రాజప్రాసాదంలోని తోట. ఆ పాట, 'కాత్రినిలే వరుమ్ గీతం', సాహిత్యం కృష్ణమూర్తిది. అప్పటికే బాగా ప్రాచుర్యం పొందిన ఒక బెంగాలీ పాట స్వరాన్ని బదులు తీసుకున్నారు. ఆ పాటలో నటించటానికి చాలా కష్టపడింది సుబ్బలక్ష్మి. అప్పుడప్పుడు కళ్లు పెద్దవి చేసి నటించాలని చూసింది కానీ అదేమీ పండలేదు. పాట మాత్రం భేష్. సదాశివం అంతా గమనిస్తూనే ఉన్నాడు.

కృష్ణుడే లోకంగా గడుపుతున్న మీరాని, భర్తని అశ్రద్ధ చేస్తున్నావని ఆడపడుచు హెచ్చరిస్తుంది. అయినా సరే మీరాకి కృష్ణుడే లోకం.

ఆ తర్వాత సినిమాలో మీరా ఇంకో భజన పాడాల్సి ఉంది. అప్పుడు సదాశివం, తను పదేపదే చెప్పేదే మళ్లీ చెప్పాడు. "కుంజా, నువ్వు నటించాల్సిన పనే లేదు, నువ్వు ఈ భజనలన్నీ వాటి భావాన్ని ప్రతిఫలించేట్లు పాడు, మీరా భక్తి పారవశ్యంతో ఆమె హృదయంలోనుంచి నేరుగా వచ్చిన భావనలు ఇవి. నువ్వు కూడా అలా భక్తిలో లీనమై పాడు. జీవిస్తావు. అదే వేనవేలు, నటించటం మాట మర్చిపో." సదాశివం చెప్పిన ఈ మాటలు సుబ్బలక్ష్మికి తారకమంత్రం అయింది. "అలాగే మామ" అంది.

సినిమాలో తరువాతి పాట, 'ఎనదు ఉళ్లమే' ఇక్కడ దంగన్ మళ్లీ అద్భుతమైన పనితనం చూపించాడు. మామూలుగా బాసింపట్టు వేసుకొని తంబూర పట్టుకొని పాడటం కాకుండా, కెమెరాకి పూజామందిరంకి మధ్యలో అడ్డంగా కూర్చొని, మోకాలు పైకి లేపి, ఆ మోకాలిమీద తంబూర పట్టుకున్న చేతిని ఆనిచ్చి, మీరా వరకు అంతా చీకటి చేసి, ఆకారం మాత్రమే కనిపించేట్లు చేసి, పల్లవి పూర్తి అయిన తర్వాత మెల్లగా మీరా మీద వెలుతురు ప్రసరిస్తుంది. ఈ చిత్రీకరణ అందం, సుబ్బలక్ష్మి పాట, జితిన్ బెనర్జీ కెమెరా సుబ్బలక్ష్మి మోము మీదే కేంద్రీకరించి తీసిన ఈ పాట చూసేవారిని తన్మయులను చేస్తుంది. మీరా భర్తగా చేసిన చిత్తూరు నాగయ్య వచ్చి మాట్లాడినప్పుడు, 'అయ్యో పాట అయిపోయిందా' అనిపిస్తుంది. ఈ పాట తర్వాత మీరా తన భర్తచేత కృష్ణుడికి చితోడ్‌గఢ్‌లో ఒక గుడి కట్టించేటట్లు మాట తీసుకుంటుంది. గుడి పూర్తయి తొలి పూజల వేళ, మీరా వరసపెట్టి మూడు పాటలు పాడుతుంది. మూడో పాటకల్లా మీరా 'మీరా మాత' అవుతుంది.

ప్రజలు తండోపతండాలుగా ఆ ఆలయానికి వచ్చి, మీరా మాతను, కృష్ణుడిని దర్శించుకుంటారు. ఇది భర్తకు మింగుడుపడదు. మేవాడ్ పరువు తీస్తున్నావని అభిశంసిస్తాడు. వీటన్నిటికీ విరుగుడుగా విజయదశమి రోజున సామంతులందరితో దర్బారు ఏర్పాటయ్యేవేళ ప్రక్కనే వుండమంటాడు. ఆ రోజున పూర్తి రాజలాంఛనాలతో తయారయ్యి దర్బారుకి వస్తుండగా, కృష్ణుడి మురళీనాదం దోవ మళ్లిస్తుంది. రాజప్రాసాదం నుంచి గుడికి పరిగెత్తుకుంటూ వెళ్లి ఆలయంలో కృష్ణుడికి భజనారాధన చేస్తుంది. దీనితో మరిదికి కోపం వచ్చి విషప్రయోగం చేస్తాడు మీరా మీద. ఆ విషం కృష్ణుడు తాగి, మీరాను కాపాడుతాడు. మీరా ఇది తెలుసుకొని భక్తి పారవశ్యంతో పాటపాడుతుంది. మీరా భజనలు జానపదాలై అక్బర్ బాదుషా వరకు వినిపిస్తాయి. అక్బర్ తన సామంతుడైన మాన్‌సింగ్‌కు ఒక ముత్యాల గొలుసు ఇచ్చి మీరాకు బహుమానంగా ఇవ్వమని పంపుతాడు. మారువేషంలో ఉన్న మాన్‌సింగ్ అతని అనుచరుడు మీరా పాటకు పాదాక్రాంతమవుతారు. అప్పుడు అక్బర్, మాన్‌సింగ్‌లు చలించిపోతే, ఇప్పుడు కృష్ణుడి దర్శన భాగ్యానికి పరితపిస్తూ, ప్రాధేయపడుతూ పాడుతున్న సుబ్బలక్ష్మిని చూసి డంగన్‌తో సహా చిత్రబృందం అంతా చలించిపోయారు.

వచ్చింది శత్రుసామంతులని తెలిసి, రాణాను ఉసిగొల్పి కృష్ణుడి మందిరాన్ని పడగొట్టే దుశ్చర్యకు పాల్పడతాడు రాణా తమ్ముడు. మీరాను ఆలయాన్ని వదిలి బయటికి రమ్మన్నా, మీరా తన భగవానుడిని వదలనని భజనలో లీనమైపోతుంది. రాణా చివరి నిమిషంలో మనసు మార్చుకొని వచ్చి ఆ దుశ్చర్య ఆపుతాడు, మీరా కూడా మనస్సులో దృఢనిశ్చయం చేసుకొని, రాణాకి ఒక నమస్కారం పెట్టి, ఇక అక్కడ ఉండలేనని బృందావనం బయలుదేరుతుంది. దోవలో భజనలు పాడుతూ ఉంటే జనం తన వెనక బారులు తీరుతూ ఉంటారు. మీరా ఎండ తుఫానుల బారిన పడుతుంది. ఒక సన్నివేశంలో మీరా తంబూర క్రింద పడి ముక్కలయినట్లు చూపేటట్లు సన్నివేశం సిద్ధం చేసుకున్నాడు డంగన్. సుబ్బలక్ష్మికి అది విని చాలా బాధవేసింది. "తంగం! ఇలారా" అని పిలిచింది. "ఏంటి కుంజక్కా" అంటూ వచ్చింది పదిహేనేళ్ల తంగం.

"తంగం, నువ్వు డంగన్ గారికి ఇంగ్లీషులో చెప్పు, తంబూర విరిగినట్లు చూపించొద్దని, నాకస్సలు ఇష్టంలేదు అలా." తంగం చెప్పింది డంగన్‌కి. కానీ దర్శకుడు డంగన్ మాత్రం సన్నివేశాన్ని మార్చలేదు. ఆ విరగ్గొట్టటం చిత్రీకరణ సమయంలో సుబ్బలక్ష్మికి చూపించకపోయి ఉండవచ్చు కాని తంబూరని విరగ్గొట్టాడు.

బృందావనంలో మీరా తనకు చిన్నతనంలో కృష్ణుడి విగ్రహం బహూకరించిన రూపగోస్వామితో కలిసి తన చివరి మజిలీ అయిన ద్వారకకు వెళ్లడానికి



నిశ్చయించుకుంటుంది. ద్వారక వెళ్లడానికి ఒంటె ఒక్కటే మార్గం. సుబ్బలక్ష్మిని ఒంటె ముందు నిలబెట్టారు. "కమాన్ ఎమ్.ఎస్... ఎక్కు" అన్నాడు డంగన్.

"కుంజా ఎక్కు త్వరగా" అన్నాడు సదాశివం.

"మామా, ఇది మిద్దెనా, మేడనా ఎక్కటానికి? ఒంటె.. నా వల్లకాదు మామా" అంది.

"నువ్వు మహారాణివి కాదు కుంజా ఇప్పుడు... పల్లకిలో తీసుకెళ్లటానికి, తప్పదు ఒంటె ఎక్కాలి" అని ఒంటెను కూర్చోబెట్టారు. భయపడుతూ భయపడుతూ సుబ్బలక్ష్మి అంబారిలో కూర్చొంది. ఒంటె లేచేటప్పుడు వెనక కాళ్లమీద లేచింది, సుబ్బలక్ష్మి ముందుకు పడబోయింది. ఆ తర్వాత ముందు కాళ్లమీద లేచినప్పుడు వెనక్కు పడింది. అదృష్టవశాత్తు భయంతో గట్టిగా పట్టుకుంది కాబట్టి ఒంటెమీద అలా నిలిచింది. "మామా.. దీన్ని కదలొద్దని చెప్పండి. నేను దిగేస్తాను" అని అరుస్తూ ఎటునుంచి కిందకు దిగాలో వెతుక్కుంటూ ఉంది. "అందుకే చెప్పా కుంజక్కా నీకూ.. గుర్రం ఎక్కే కథ ఉంది, అందులో చేస్తానని చెప్పమని" కిందనుంచి తంగం జాలిపడింది. సుబ్బలక్ష్మికి ఒంటె యోగం తప్పక, ఒంటెమీద కూర్చున్నప్పుడు రెండు చేతులతో అంబారిని విడవకుండా పట్టుకుంది. చివరికి మీరా ద్వారక చేరుకుంది. కృష్ణుడి దేవాలయంలోకి పాడుకుంటూ వెళ్లాలి. కాని వెంట ఉన్నది కూడా తెచ్చుకున్న అతి కొద్దిమంది యక్స్ట్రాలు. "సర్, ఇది ఆఖరి సన్నివేశం, నాకు ఇంకా జనం కావాలి, మీరా వెనుక చాలామంది ఉండాలి" అన్నాడు డంగన్ సదాశివంతో. "మీరు మీ పని చేసుకుంటూ పొండి. జనం తప్పకుండా వస్తారు" అన్నాడు ధీమాగా సదాశివం. సుబ్బలక్ష్మి మీరాభజనలు పాడుకుంటూ ద్వారక వీధిలో నడుస్తూ ఉంటే మీరానే మళ్లీ వచ్చిందనుకొని ద్వారక ప్రజలు సుబ్బలక్ష్మి వెనకే ఆలయానికి చేరారు. కాని అక్కడ ఆలయంలో, హిందువు కాదని డంగన్‌ని రానివ్వలేదు. ఇక్కడ వేషాలు ఎవరికీ కొత్త కాదు, డంగన్ వెంటనే పంచకట్టుతో తయారయి వచ్చి, కాశ్మీర్ బ్రాహ్మణుడనని ఆలయం లోపలికి వచ్చాడు. ఇక మీరా ద్వారక ఆలయంలోకి వస్తుంది. గర్భగుడి తలుపులు మూసి ఉంటాయి. పరమ భక్తితో, ఆత్మసమర్పణతో "జనార్దనా జగన్నాథా.. నన్ను నీలో కలుపుకో" అని దిక్కులు పిక్కటిల్లేలా వేడుకుంటుంది. అంతట ఆ శ్రీకృష్ణుడు దయతలచి, గర్భగుడి తలుపులు తెరిపించి, సాక్షాత్కరించి, మీరాను తన దగ్గరకు ఆహ్వానిస్తాడు. ఆనందాశ్చర్యాలతో మీరా గర్భగుడివైపు పరిగెత్తుకు వెళ్లి జగన్నాథునిలో ఏకమవుతుంది. సుబ్బలక్ష్మి ఈ ఆఖరి సన్నివేశంలో జీవించింది. ఆర్తితో పాడి చివరకు ప్రాణం విడిచి పడిపోయినట్లు నటించే దగ్గర నిజంగా సొమ్మసిల్లి పడిపోయింది.

మధ్యమధ్యలో కొద్ది మాటలతో దృశ్యకావ్యంగా 1945
ఇరవైయొక్క పాటలతో, మధ్యమధ్యలో కొద్ది మాటలతో 'మీరా' విడుదలైంది. రెండవ రోజు
నవంబరు మూడోతారీఖున మద్రాసు ప్రెసిడెన్సీలో 'మీరా' విడుదలైంది. సుబ్బలక్ష్మి పేరు తమిళనాట
నుంచే సినిమాహాళ్లు నిండిపోవడం మొదలయ్యాయి. సుబ్బలక్ష్మి పేరు తమిళనాట
మారుమ్రోగిపోయింది. సదాశివం విజయగర్వంతో తేలిపోతున్నాడు. మూడు సంవత్సరాల
నుంచి ముందుండి అందరినీ నడిపించాడు. ఉదయపూర్ ఒంటెలతోసహా. అందరికంటే
సుబ్బలక్ష్మి బాగా కష్టపడింది. ఇరవైఒక్క పాటలే కాదు ఇంకో ఇరవై పాడమన్నా పాడుతుంది
కానీ సంభాషణలు, నటన, సుబ్బలక్ష్మికి ఏమాత్రం ఆసక్తి లేని విషయాలు, కాని భర్త
ప్రోద్బలంతో సాధన చేసిచేసి ఫరవాలేదనిపించుకుంది. చిత్రీకరణ సమయంలో ఒకసారి
యమునలో మునిగినంతపనయ్యి కొంచెంలో ప్రాణాలతో బయటపడింది. సదాశివం
సినిమా విజయవంతమైందని తెలపటానికి, ఇంకా ప్రాచుర్యం కల్పించటానికి, పత్రికా
విలేఖరులతో సమావేశం ఏర్పాటు చేశాడు. ఈ రోజునుంచి 'కల్కి'లో క్రమపద్ధతిలో
'మీరా' సినిమాకి ప్రాచుర్యం ఇవ్వటం ప్రారంభించాడు.

విలేఖరులు ఒక్కొక్కరూ వస్తున్నారు. "తంబీ, ఈ సినిమాలో ఎమ్.ఎస్. బ్రహ్మాండంగా
నటించింది" అన్నాడు 'ఆనంద వికటన్' విలేఖరి.

"ఇల్లై అణ్ణా.. అలాగేమి నటించలా, అబ్బే ఇదేం నటన? అనుకోకుండా సరిపోను
చేసింది" అన్నాడు 'కుముదం' విలేఖరి.

"ఏది ఏమైనా ఈ సంవత్సరం ఆఖరులో వచ్చినా 'మీరా'నే ఈ సంవత్సరపు గొప్ప
సినిమా" అని ఏకగ్రీవంగా తమ అభిప్రాయం తెలిపారు విలేఖర్లు. సదాశివం వింటున్నాడు.
ప్రక్కనే ఉన్న డంగన్‌వైపు తిరిగి, "డంగన్ మీకు గుర్తుందా.. ఉదయ్‌పూర్ దివాన్ సర్
మీర్జా ఇస్మైల్‌గారి భార్య ఎమ్.ఎస్.ను విజయదశమి దర్బార్ షూటింగ్‌కు తయారు
చేస్తున్నప్పుడు 'మీరా' మా అమ్మాయి, హిందీలో తీయాలికానీ మదరాసీ భాషలో
తీస్తున్నారెందుకు అని అడిగారు, గుర్తుందా డంగన్ మీకు?"

"బాగా గుర్తుంది" చెప్పాడు డంగన్.

"తమిళంలోనే ఇలా ఆడితే మీరా భజనలు ఆ భజనల అసలు భాషలో సుబ్బలక్ష్మి
పాడి వినిపిస్తే ఇంకెలా ఉంటుంది? డంగన్! మీరా సినిమాను మనం మళ్లీ హిందీలో
తీస్తున్నాం" నిర్ణయించేశాడు సదాశివం అక్కడికక్కడ. డంగన్ సదాశివం తెలివికి
ఆశ్చర్యపోతూ అతని నిర్ణయాన్ని మనసారా సమర్థించాడు. అప్పుడే విలేఖరుల
సమావేశంలోనే ప్రకటించాడు హిందీలో 'మీరా' తీస్తున్నట్లు. పిల్లలు ఎగిరి గంతులేశారు.
మళ్లీ ఉదయపూర్ విహారయాత్రకి వెళ్లొచ్చని. "మళ్లీ ఒంటె ఎక్కాలా" సుబ్బలక్ష్మి
దిగాలుపడింది.







'మీరా' చిత్రంలోని సన్నివేశాలు. పై చిత్రంలో చిన్నప్పటి మీరాలా నటించిన బేబి రాధ





'మీరా' చిత్రంలోని సన్నివేశాలు





తెరపై బొమ్మలు కదిలి భారతదేశంలో ముప్పైమూడేళ్లు, మాట్లాడి పదహారేళ్లు. ఏటేటా విడుదలవుతున్న సినిమాల సంఖ్య ఎక్కువవుతూనే ఉంది. సంప్రదాయ వినోద సాధనాలు మెల్లగా వెనుకంజ వేస్తుంటే సినిమాలపై మోజు నానాటికి పెరిగిపోతూ ఉంది. అలాగే సినిమా నటుల మీద కూడా, హీరోయిన్‌ల మీద మరీను. ఇలాంటి సమయంలో సుబ్బలక్ష్మి నటించిన ప్రతి సినిమా తనకు ఏదోవిధంగా గొప్ప పేరు తెస్తున్నప్పుడు, సుబ్బలక్ష్మికి మద్రాసు ప్రెసిడెన్సిలో విపరీతమైన మోజు ఏర్పడింది. నటిగా పామరుల్లోనూ, కర్ణాటక సంగీత కళాకారిణిగా పండితులల్లోనూ కీర్తిగడించింది. అయినా కూడా ఈసారి మద్రాసు మ్యూజిక్ అకాడమీ వాళ్లు తమ వార్షిక సంగీత సభలకి సుబ్బలక్ష్మిని పిలవలేదు. సదాశివం కూడా బెట్టు విడవలేదు. "ఎమ్.ఎస్. కచేరీ ఒక్కటి చాలు మాకు, ఈ కచేరీకి వచ్చే డబ్బులతో సంవత్సరం అంతా సభని నడపడానికి డబ్బులు ఏర్పాటవుతాయి." మైలై సంగీత సభ బయట నిర్వాహకుడు నరసింహన్ సుబ్బలక్ష్మి కచేరీకి వస్తున్న జనాన్ని చూసి అంటున్నాడు. ఈసారి కూడా ఎక్కువ తమిళ పాటలు పాడి, తమిళ సంగీత ఉద్యమాన్ని ఇంకాస్త ముందుకు తీసుకు వెళ్లింది సుబ్బలక్ష్మి.

𝄞𝄞𝄞𝄞

కీల్పాక్‌కు దగ్గరలో ఉన్న ఒక బజారులోని కాకా హోటల్లోకి ఇద్దరు వ్యక్తులు వచ్చి కూర్చున్నారు. రెండు కాఫీలు చెప్పారు. వీళ్లు మాటల్లో పడిపోయారు. "మొత్తం ఇరవైయొక్క పాటలు, మనం ఇప్పుడు మూడోపాటలో ఉన్నాము, ఇంకా ఎన్ని రోజులు పడుతుందంటారు?" మద్రాసు మనిషి కలకత్తా నుంచి వచ్చిన వ్యక్తిని అడిగాడు. "శుభలక్ష్మికి ఎక్కువ రోజులు పట్టవు నేర్చుకోవటానికి, జుట్టు ఉన్న అమ్మ ఏ కొప్పైనా పెట్టగలదని.. సంగీత సరస్వతికి ఏ భాష అయితే ఏమి, హిందీ అయితే ఏంటి బ్రజ్ భాష అయితే ఏమిటి?" వాళ్లు అలా మాట్లాడుకుంటూనే ఉన్నారు గాని కాఫీ రాలేదు. మద్రాసు వ్యక్తి హోటల్ గల్లాపెట్టె దగ్గర కూర్చున్న వ్యక్తి దగ్గరికెళ్లి, "ఆయన మన ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిగారికి పాటలు నేర్పటానికి కలకత్తానుంచి వచ్చారు" అని చెప్పాడు. వెంటనే ఆ హోటలు యజమాని హడావుడిగా లేచి, "అయ్యగార్లకు రెండు స్పెషల్ కాఫీ" అంటూ కాఫీలు తెప్పించాడు. "సినిమా ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మికి ఇంకా పేరు తెచ్చింది" అన్నాడు కలకత్తా నుంచి వచ్చిన వ్యక్తి ఐన, దిలీప్‌కుమార్ రాయ్. ఈయన ప్రఖ్యాత గాయకుడు, సంగీతకారుడు. "అవునవును ఆమెను చూడటానికి సగంమంది వస్తుంటే, ఆమె గొంతు వినటానికి సగంమంది వస్తున్నారు." ఇలా మాట్లాడుకుంటూ విశాలమైన కల్కి ఆవరణలోకి అడుగుపెట్టారు. తోట పక్కగుండా భవంతిలోకి వెళ్తుంటే బజ్జీలు తింటూ

డంగన్ కనిపించాడు. "ఏంటీ ఇక్కడున్నారు?" సంగీత దర్శకులు, దర్శకుడు డంగన్‌ని అడిగారు. "ఎమ్.ఎస్.తో మాట్లాడటానికి నా వంతు కోసం ఎదురు చూస్తున్నాను. లోపల సంగీత సాధన చేస్తున్నారు. రండి, మీరూ కూర్చోండి. బజ్జీలు తినండి" అంటూ వారికి బజ్జీలు అందించాడు డంగన్. "మేము లేకుండా సాధనా?" "ఇది సినిమా కోసం కాదు. ఎమ్.ఎస్. ఈ నెలలో శ్రీలంక వెళ్తున్నారు. బెనిఫిట్ కచేరీ కోసం, ఆ కచేరీ సాధన ఇది" చెప్పాడు డంగన్. "అయ్యో, మేమయినా కాస్త అలా వెళ్లి విశ్రాంతి తీసుకున్నామే... పాపం ఆమెకు విశ్రాంతి లేదు" అన్నాడు ఇప్పటిదాకా దిలీప్ కుమార్ రాయ్‌తో ఉన్న 'మీరా' సంగీత దర్శకుడు వెంకట్రామన్. "ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి పేరుని అందరూ బాగా వాడుకుంటున్నారు" అన్నాడు రాయ్.

కాసేపటికి, సుబ్బులక్ష్మికి శ్రీలంక కచేరీకి కావాల్సిన పాటలు నేర్పుతున్న సంగీత విద్వాంసుడు సెమ్మంగుడి శ్రీనివాస అయ్యరును కారులో సాగనంపి, డంగన్ దగ్గరకు చేరాడు సదాశివం.

"సర్, యుద్ధం అయితే ముగిసిందికానీ, మనకు ఇంకా ఫిల్మ్ కొరత ఉంది. దిగుమతి కావటం లేదు. అందుకు నేను ఒక ఆలోచన చేశాను." "ఏంటది?" అడిగాడు సదాశివం.

"మనం ఫిల్మ్‌కోసం ఆగలేము. అందుకని లాంగ్‌షాట్‌లన్నీ అలానే ఉంచుదాం. మీరా పాడే పాటలే మళ్లీ తీద్దాం" సదాశివం సమాధానం కోసం ఎదురు చూస్తున్నాడు డంగన్. "కానీ ఫిల్మ్ లేదని మీరు రాజీపడద్దు, సినిమా అతుకులబొంతలా ఉండకూడదు" ఆదేశించాడు సదాశివం.

సంవత్సరం అంతా మీరా పాటల సాధనలోనూ, త్యాగరాజస్వామి శతవార్షికోత్సవాలతో సహా ఏడు 'బెనిఫిట్', (లబ్ధి) కచేరీలతో తీరిక లేకుండా సాగింది. హిందీ 'మీరా' చిత్రీకరణ పూర్తయింది. ఢిల్లీలో పత్రికా విలేఖరులకి 'మీరా' సినిమాని చూపించే ఏర్పాటు చేశాడు సదాశివం. పత్రికా విలేఖరులు ఈ హిందీ సినిమా గురించి ఉత్తర భారతదేశంలో వారివారి పత్రికల్లో మంచి సమీక్ష వ్రాయాలని సదాశివం తపన.

పత్రికా విలేఖరులతోపాటు సరోజినీ నాయుడు, విజయ రాఘవాచారి కూడా చూశారు. సినిమా అయి బయటికి వస్తున్నప్పుడు, విజయ రాఘవాచారి సరోజినీ నాయుడుతో, "సరోజినీ, ఎమ్.ఎస్. పాటలు విన్నావు కదా, ఎంతో బాగున్నాయ్, మరి ఇక నీ 'నైటింగేల్ ఆఫ్ ఇండియా' బిరుదు ఎమ్.ఎస్.కి ఇచ్చేస్తావా?" సరోజినీనాయుడు క్షణం ఆలోచించకుండా "నేనెప్పుడో ఇచ్చేశాను" అంది. ఇది విన్న సదాశివంకి వెంటనే ఒక ఆలోచన తట్టింది. చెరుకుగడకంటే పై ఎత్తుగడ వేశాడు. విజయరాఘవాచారితో





శ్రీలంక వెళుతూ ఓడలో సుబ్బులక్ష్మి

తన ఆలోచన చెప్పాడు. ఆ ఆలోచనతో ఇద్దరూ సరోజినీ నాయుడు దగ్గరికి వెళ్లి చెప్పారు. "అలాగే చెప్తాను. నా మనసులో ఉన్నది చెప్పమంటున్నారు అంతేగా." "చాలా సంతోషమండి. కృతజ్ఞులం" అన్నాడు సదాశివం. "నాకు ఈ అవకాశం ఇచ్చినందుకు నేనే కృతజ్ఞురాలిని" అంది సరోజినీ నాయుడు.

"మరి ఎప్పటిదాకా ఉంటున్నారు ఇక్కడ?" అడిగింది సరోజినీనాయుడు.

"ముందు మీ పని, ఆ తర్వాత గాంధీగారిని దర్శించుకొని వెళతాం."

"దర్శించుకోండి. బాగా దర్శించుకోండి. కానీ సుబ్బలక్ష్మితో ఒక కచేరీ ఇప్పించి వెళ్లండి ఇక్కడ. నేను నెహ్రూజీని కూడా ఆహ్వానిస్తాను ఆ కచేరీకి" చెప్పింది సరోజినీ నాయుడు.

"మీ ఆలోచన అయితే బాగుంది కానీ, ఆయన ఈ పరిస్థితుల్లో రాగలరా.. పంజాబ్, బెంగాల్‌లో హింస చెలరేగిపోతుంది. ప్రభుత్వం, పరిపాలన చేతులు మారుతున్న ఇప్పుడు..." అంటూ సందేహం వెలిబుచ్చాడు సదాశివం.

"ఆహ్వానిద్దాం.. చూద్దాం.. మరి నేను కచేరీకి ఏర్పాటు చేస్తాను. అన్నీ నేను చూసుకుంటాను" అని ఆ కచేరీ వ్యవహారాలన్నీ తనే తీసుకుంది సరోజినీనాయుడు.

సరోజినీనాయుడుతో అనుకున్న పని పూర్తిచేసుకున్న తర్వాత హిందీ 'మీరా' చిత్రీకరణ సంపూర్ణమయ్యింది. ఆ తరువాతి రోజు గాంధీగారి సాయంత్రపు ప్రార్థనా సమావేశానికి చేరుకున్నారు. సుబ్బలక్ష్మి 1941లో నాగ్‌పూర్‌లో గాంధీని చూసిన తర్వాత, ఇది రెండవసారి గాంధీని చూడటం. అప్పుడు సుబ్బలక్ష్మి భక్తిగీతాలు పాడింది. అదేరోజున గాంధీ తన డైరీలో ఇలా వ్రాసుకున్నారు: "సుబ్బలక్ష్మి గొంతు ఎంతో మధురంగా ఉంది. ఆమె పాడేటప్పుడు భజనలో లీనమై పాడుతుంది. ఊరికే పాడుకోవటం వేరు, భగవంతునిలో లీనమై పాడటం వేరు." అలాంటి సుబ్బలక్ష్మి మళ్లీ ఈ సాయంత్రపు ప్రార్థనా సమావేశంలో భజనలు పాడింది. కానీ గాంధీ చాలా ముభావంగా ఉన్నారు. అహింస, అహింస, అహింస పరమోధర్మః అని పాతికేళ్లుగా ఏ భారతీయులకి నేర్పాడో వారే ఈ రోజుల్లో ఒకళ్లనొకళ్లు అతి హేయంగా చంపుకుంటున్నారు. గాంధీ మనస్సు రక్తమోడుతుంది.

సదాశివం రాధని పిలిచాడు. "రాధా, నువ్వు 'ఘనశ్యామ్ ఆయారే' పాటకి అభినయం చెయ్యి" అని చెప్పి పంపాడు. రాధ అంతకు ముందు బొంబాయిలో ప్రదర్శన ఇచ్చినప్పుడు ఈ పాటకి అభినయం చేసింది. ఆ పాటనే ఇప్పుడు గాంధీ ముందు చేసింది. ఈ అభినయం చూసి గాంధీ మొహంలో కాస్త చిరునవ్వు పూచింది. గాంధీ మనస్సుని కాస్త తేలిక పరిచినందుకు సంతోషించాడు సదాశివం.



నెహ్రూ, ఇతర ఢిల్లీ ప్రముఖుల ముందర సుబ్బలక్ష్మి కచేరి ఇచ్చిన తర్వాత, అందరూ మద్రాసు బయలుదేరారు. సదాశివం వచ్చాడని తెలియగానే ఇంటి యజమాని అయిన శర్మ వచ్చాడు. "సదాశివంగారూ చెప్పండి, మరి ఏమి ఆలోచించారు? కొంటారా ఈ ఇంటిని?" సదాశివం ఈ విషయం గురించి ఆలోచిస్తూనే ఉన్నాడు. అందుకనే వెంటనే చెప్పాడు. "నేను మీ ఇంటిని కొంటాను. కాస్త వ్యవధి ఇవ్వండి. రెండు దఫాలుగా మీకు డబ్బు కడతాను" అని.

అన్నట్లుగానే బయాన ఇచ్చాడు. అప్పటికే వందేళ్ల క్రితం ఒక బ్రిటన్ దేశస్థుడు కట్టుకున్న ఆ విశాలమైన భవంతి చేతులు మారుతూ ఇప్పుడు సదాశివం చేతిలోకి వచ్చింది. ఆ బంగళాకి 'కల్కి బిల్డింగ్స్' అని పేరు పెట్టాడు.

1947 ఆగస్టు 15 ఉదయాన రెండు వందల ఏళ్ల దాస్యశృంఖలాలను తెంచుకొని కొంగ్రొత్త సూరీడు తూర్పున అరుణాచలంలో ఉదయించి, స్వేచ్ఛాపూరితమైన కిరణాలను పరిచాడు. ఆ ఉత్తేజభరితమైన కిరణాల కింద తన సొంత బంగళా ఆవరణలో మువ్వన్నెల పతాకం ఎగురవేసి దేశభక్తి గీతాలు పాడుతూ, కల్కి కుటుంబం స్వాతంత్ర్య సంబరాల్లో పాల్గొని నవభారతానికి స్వాగతం పలికింది.

ఇదే సమయంలో సుబ్బలక్ష్మి దిలీప్‌కుమార్ రాయ్‌తో కలిసి పాడిన 'వందేమాతరం' దేశభక్తి గీతాన్ని హెచ్.ఎమ్.వి. గ్రామఫోను కంపెనీవారు రికార్డు చేశారు. ఈ రోజుల్లో సుబ్బలక్ష్మి గొంతు పిల్ల ఏరులన్నీ కలగలిపి కదంతొక్కుతున్న జలపాతంలాగా ఉంది. తల్లి రెక్క కిందనుంచి బయటికి వచ్చి రివ్వున ఎగురుతున్న గువ్వలాగుంది. జలపాతంలాగా ఎంత లోతుకు వెళ్లినా, గువ్వలాగా ఎంత పైకి వెళ్లినా ఆ గొంతు తొణకదు, బెణకదు. శాస్త్రీయ సంగీతపు లక్షణాలు చెక్కుచెదరకపోవటం ఒక ఎత్తైతే, మళ్లీమళ్లీ వినాలనిపించే శ్రావ్యత ఇంకొకెత్తు. సుబ్బలక్ష్మి పాటకి ఉన్న ఈ రెండు లక్షణాలు ఆమెను ఏకకాలంలో పండితపామరులకు దగ్గర చేశాయి.

✤✤✤✤

గాంధీజీ సుచేత కృప్లాని ద్వారా సుబ్బలక్ష్మికి ఒక సందేశం పంపారు. ఆ సందేశం తెలియజేస్తూ మద్రాస్ రేడియో కేంద్రం నుంచి కల్కి బిల్డింగ్స్‌కి ఫోను వచ్చింది. ఆ రోజు అక్టోబరు ఒకటి ప్రొద్దున. 'హరి తుమ్ హరో ' అనే మీరా భజన ఎమ్.ఎస్.చేత పాడించి, ఆ రికార్డు ఆయన పుట్టినరోజు కల్లా ఢిల్లీ చేర్చమన్నారని రేడియో అధికారి చెప్పాడు.

సదాశివం ఏమాత్రం ఆలోచించాల్సిన పని లేదు. సుబ్బలక్ష్మికి ఏ పాటవచ్చో ఏ పాట రాదో సదాశివానికి క్షుణ్ణంగా తెలుసు, వెంటనే చెప్పాడు. "సుబ్బలక్ష్మికి ఆ పాట సాహిత్యం అసలు తెలియదు. స్వరం కూడా తెలియదు. దయచేసి ఈ మాట చెప్పి ఈ ఒక్కసారి ఆ పాట తెలిసినవాళ్లచేత పాడించుకోండి" అని. రేడియో అధికారి సరేనన్నాడు.

కాని ఆ రోజు సాయంత్రమే ఫోను వచ్చింది. "గాంధీజీ, ఇంకెవరినోటా ఈ పాట వినటానికి ఇష్టపడటం లేదు, సుబ్బలక్ష్మి పాడకపోయినా పర్వాలేదు, ఈ పాటని శ్లోకంలా చదివినా చాలంటున్నారు" అని.

గాంధీజీ నుంచి అంత మాట వినగానే సదాశివం సుబ్బలక్ష్మిని వెంటబెట్టుకొని మద్రాసు రేడియో కేంద్రానికి చేరుకున్నాడు. అప్పుడు సాయంత్రం ఐదు గంటలు అయ్యింది. రేడియో స్టేషనులో కొందరు సంగీతకారులు, పియానో వైద్యనాథన్‌తో కలిసి ఆ పాటను స్వరపరచటం మొదలుపెట్టారు.

"కుంజా, నువ్వు ఈ లోపల పాట బాగా చదువుకో" అని పుస్తకం ఇచ్చాడు సదాశివం. పాటని స్వరపరచి, సుబ్బలక్ష్మికి నేర్పి రికార్డు చేసేసరికి రాత్రి రెండు దాటింది. ఆ తెల్లారే అక్టోబర్ రెండు, గాంధీ పుట్టినరోజు. తొలి విమానంలో ఆ రికార్డు ఢిల్లీ వెళ్లిపోయింది.

రాత్రికి సదాశివం ఇంటికి ఫోను వచ్చింది. "గాంధీజీ పాట విన్నారు, సుబ్బలక్ష్మిని బాగా మెచ్చుకున్నారు" అని సుచేతా కృప్లాని చెప్పింది.

1947 నవంబరు ఆఖరున మళ్లీ 'మీరా' బృందం ఢిల్లీకి చేరుకుంది. హిందీ 'మీరా'ను భారత ప్రధాని నెహ్రూ కోసం ప్రత్యేకంగా చూపించటానికి ఏర్పాట్లు పూర్తయ్యాయి.

𝄞𝄞

"మిస్టర్ నెహ్రూ! నేను భారత స్వాతంత్ర్యం విషయంలో తొందరపడ్డానా? జరగబోయే మార్పులకు అందరూ సిద్ధంగా ఉంటారని నేను వచ్చీ రావటంతోనే చెప్పాను, భారతదేశం నుంచి బ్రిటీష్‌వారు ఎప్పటికల్లా వెళ్లిపోతారో, ఆ చెప్పటమే తప్పయినట్లుంది. ఏమిటీ కలహాలు ఈ దేశంలో.. బ్రిటీష్ పేపర్లన్నీ నన్ను తప్పుపట్టాయి ఈ మారణహోమానికి, ఇది చాలదన్నట్లు ఇంకా కశ్మీరు అంశం ఎటూ తేలకుండా ఉంది." బాధపడుతున్నాడు, చివరి గవర్నర్ జనరల్ మౌంట్‌బాటన్. నెహ్రూ సాలోచనగా వింటున్నాడు. "మన ప్రయత్నాలన్నీ చేస్తున్నాం. త్వరలో అన్నీ సద్దుమణుగుతాయి. గాంధీజీ కల్లోలిత ప్రాంతాల్లో స్వయంగా తిరుగుతున్నారు" అని సాంత్వన పరుస్తూ చెప్తున్నా మౌంట్‌బాటన్ ఇంకా నిరాశా నిస్పృహలోనే ఉన్నాడు.

వెంటనే నెహ్రూకి ఒక ఆలోచన వచ్చింది. "మౌంట్‌బాటన్, మీ మనసు తేలికపడాలంటే, ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి అని ఒక గాయనీమణి పాట మీరు వినాల్సిందే. ఆమె సినిమా స్పెషల్ షో వేస్తున్నారు. రేపు మీరుకూడా తప్పకుండా రండి. మీకు మంచి మార్పుగా ఉంటుంది." తానే అతిథి అయిన నెహ్రూ తన అతిథిని వెంటతెచ్చుకోనున్నాడు.



MS సుబ్బలక్ష్మి

డిసెంబర్ అయిదున ఢిల్లీ ప్లాజా సినిమా హాలు ముందు నెహ్రూ నుంచొని ఉన్నాడు. మాటిమాటికీ గడియారం చూసుకుంటున్నాడు. నెహ్రూ వెనకే సరోజినీ నాయుడు, సదాశివం, కృష్ణమూర్తి ఉన్నారు. "నెహ్రూజీ మీకొక విషయం తెలుసా.. నేను మీరా సినిమాలో నటించాను" అంది సరోజినీ నాయుడు నెహ్రూతో. నెహ్రూ ఒకపక్క గడియారం చూసుకుంటూనే 'అవునా' అన్నట్లు చూశాడు. "చూస్తారుగా.. మీకే తెలుస్తుంది" అంది సరోజినీ నాయుడు. నెహ్రూ ఎదురు చూస్తున్న అతిథులు వచ్చారు. గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్‌బాటన్, ఆయన భార్య లేడీ ఎడ్వినా మౌంట్‌బాటన్.

సినిమా మొదలైంది. అన్నిటికంటే ముందు చంద్రప్రభ సినీటోన్స్ అనే పేరు వచ్చి, ఆ తర్వాత నిర్మాతగా సదాశివం పేరు వస్తుంది. ఆ వెంటనే 'సంగీత చిత్ర' 'మీరా' అన్న తర్వాత ఎమ్.ఎస్. శుభలక్ష్మి అని పేరువస్తుంది. హిందీవాళ్లకి సుబ్బలక్ష్మి అంటే వింతగా ఉండవచ్చుననుకొని సుబ్బలక్ష్మి పేరు శుభలక్ష్మిగా పరిచయం చేశారు. పైగా ఉత్తర భారతీయులు సుబ్బలక్ష్మి అని పలకరు కూడా. సుబ్బలక్ష్మి అని చెపితే శుభలక్ష్మి అనే పలుకుతారు.

పేర్లు అయిన వెంటనే తెర మీద సరోజినీనాయుడు సుబ్బలక్ష్మి దగ్గరికి వచ్చి పలుకరించి ప్రేక్షకుల వైపు చూసి ఇలా చెప్తుంది:

"ఇప్పుడు నేను మీకు దక్షిణ భారతానికి చెందిన సుబ్బలక్ష్మిని ఉత్తర భారత ప్రజలకు పరిచయం చేస్తున్నాను. ఈమె తన తమిళ 'మీరా'కి హిందీ అనువాదం సమర్పిస్తున్నారు.

నా పరిచయ వాక్యాలు ఒక్క ఉత్తర భారతానికే కాకుండా యావత్ ప్రపంచానికి అర్థం కావాలనే ఉద్దేశంతో నేను హిందీలో కాకుండా ఇంగ్లీష్‌లో మాట్లాడుతున్నాను.

దక్షిణ భారతదేశంలో పిల్లలతోసహా అందరూ సుబ్బలక్ష్మి యొక్క శ్రావ్యమైన గొంతు విన్నారు. వారికి ఆమె వ్యక్తిత్వం యొక్క సమ్మోహన శక్తి తెలుసు. ఆమె మనస్సు యొక్క ఉదారత తెలుసు. కానీ ఉత్తర భారతదేశానికి ఈ గొప్ప కళాకారిణి గురించి ఇంకా తెలియాల్సి ఉంది.

భారతదేశపు ఒక అద్భుతమైన కళాకారిణి తన పాటల ద్వారా కోట్లకొలది హృదయాలను ఎలా చూరగొందో నా మాటల ద్వారా ప్రపంచం నలుమూలలా తెలియాలి. చాలామందికి ఇంకా తెలియని విషయం ఏమిటంటే ఈమె తన పాటలతో ఎన్నో మంచి కార్యక్రమాలకు లబ్ధి చేకూర్చుతున్నారు.

నాకు హిందీ 'మీరా' చూసే భాగ్యం లభించింది. రాజపుత్ రాజుల వైభోగం, వీరత్వం నేపథ్యంలో అద్భుతంగా తీయబడిన సినిమా ఇది. మీరా గాథ భారతదేశ గాథ. భారతదేశ



భక్తివిశ్వాసాల గాథ. కృష్ణుడే లోకంగా గడిపిన మీరా పాత్రలో సుబ్బలక్ష్మి నటన మీరాలాగా భ్రాంతి కలిగించేలా లేదు. ఈ సినిమాలో రెండు గంటలపాటు సుబ్బలక్ష్మి పాటలు వింటే సాక్షాత్తూ మీరానే వచ్చి పాటలు పాడినట్లు ఉంది. అందుకనే నాకు పూర్తి నమ్మకం ఉంది, ఎవరైతే ఈమె శ్రావ్యమైన గొంతు వింటారో, ఎవరైతే ఈమె నటన కాంచుతారో, ఎవరైతే ఈమె ప్రతిభను గుర్తిస్తారో, ఈమె మీరాలాగా నటించలేదు, ఈమే మీరా అని నమ్ముతారు.

ఇంతకంటే ఇంక నేనేమీ చెప్పనవసరం లేదు. ఈ సినిమా చూసిన తర్వాత మీరంతా ఈమెను మీ మనస్సులోకి ఆహ్వానించి, ఎప్పటికీ గుర్తుపెట్టుకుంటారు. భారతదేశం ఈ తరంలో ఒక గొప్ప కళాకారిణిని అందించినందుకు గర్వపడతారు."

ఇలా చెప్పి సరోజినీనాయుడు సుబ్బలక్ష్మి వైపు తిరిగింది. సుబ్బలక్ష్మి ప్రేక్షకుల వైపు తిరిగి నమస్కరించింది. నెహ్రూ సరోజినీనాయుడు వైపు తిరిగి 'నువ్వు చెప్పిన నటన ఇదా..... బాగుంది, బాగుంది' అన్నట్లు మెచ్చుకోలుగా చూశాడు.

సదాశివం పట్టుదల, సుబ్బలక్ష్మి శ్రమవల్ల సుబ్బలక్ష్మి హిందీ సంభాషణలు వెంట్రుకవాసితో తమిళయాస తప్పించుకున్నాయి. కానీ ఆ వాసనలు పూర్తిగా అయితే పోలేదు. మీరా భజనలు చాలా బాగా పాడింది సుబ్బలక్ష్మి. సుబ్బలక్ష్మి పాటలే సినిమాకి ఆయువు. నెహ్రూకి చాలా బాగా నచ్చింది సినిమా. ముఖ్యంగా రాధని మెచ్చుకున్నాడు. మౌంట్‌బాటన్ దంపతులు సినిమాకి హీరోయిన్లయిన సుబ్బలక్ష్మిని, రాధను పూలమాలలతో సత్కరించారు.

ఆ రోజునే హిందీ సినిమా విడుదల కూడా. ఇంకో రెండు రోజులు ఢిల్లీలో ఉండి సినిమా ఎలా ఆడుతుందో ప్రత్యక్షంగాచూసి, మళ్లీ ఇంటికి బయలుదేరింది మద్రాసు బృందం. తోడుగా, ఢిల్లీ పెద్దమనుషులతో మసిలిన జ్ఞాపకాలు చెదరకుండా పదిలంగా ఉండేందుకు వారితో ఉన్న ఫోటోలు పట్టుకుని రైలు ఎక్కారు.

𝄞 𝄞

మద్రాసులో సంగీత సభలు మొదలయ్యాయి. ప్రముఖులతో సుబ్బలక్ష్మి ఫోటోలు, తమిళ 'మీరా'తో ప్రజలలో వచ్చిన విపరీతమైన ఆదరణ చూసి, మద్రాసు మ్యూజిక్ అకాడమీవాళ్లు ఆలోచనలో పడ్డారు. "ఇంత పేరున్న గాయని మన సభలో పాడకపోతే ఎలా సుబ్బారావుగారూ" కృష్ణమాచారి అడుగుతున్నాడు.

"నిజమే. మరి మీరు వెళ్లి సదాశివాన్ని ఒప్పించి, ఏర్పాటు చేయండి" పంతాలు పక్కనబెట్టి అనుమతి ఇచ్చాడు సుబ్బారావు.

పెద్దపెద్ద పరిశ్రమలకు యజమాని అయిన కృష్ణమాచారి ఒకంత అపరాధ భావంతో బెరుగ్గా సదాశివం దగ్గరకు వచ్చాడు. సదాశివం గెలిచాడు. తన దగ్గరకు తగ్గి వచ్చినవారిని ఇంకా బాగా చూసుకుంటాడు సదాశివం. ఈసారి మద్రాసు మ్యూజిక్ అకాడమీలో సుబ్బలక్ష్మి పాడటానికి నిశ్చయమయింది. కృష్ణమాచారి వెళుతుండగా "మీకు ఒక బోనస్ కూడా ఇస్తాను. ఆనంది, రాధ భరతనాట్యం కూడా ఏర్పాటు చేయండి. సుబ్బలక్ష్మి పాడుతుంది వాళ్లకు" చెప్పాడు సదాశివం.

"సుబ్బలక్ష్మి ఉంటే బోనస్సే మరి, తప్పకుండా ఏర్పాటు చేస్తాను" అంటూ సంతోషంగా వెళ్లాడు టి.టి. కృష్ణమాచారి.

నూతనోత్సాహంతో నూతన సంవత్సరంలోకి అడుగిడింది భారతావని. అలాగే సుబ్బలక్ష్మి కూడా.

1948, జనవరి ఒకటిన మ్యూజిక్ అకాడమీలో రాధ, ఆనంది భరతనాట్య ప్రదర్శనలో తన కుటుంబ సొత్తు అయిన 'పదాలు' తనివితీరా పాడుకుంది. పదాలు సుబ్బలక్ష్మి ఈమధ్య కాలంలో మళ్లీ పాడలేదు. రాధ, ఆనందీలకు ఇది మూడవ పెద్ద ప్రదర్శన. అన్నింటిలోనూ సుబ్బలక్ష్మి కోసం, సుబ్బలక్ష్మి పాటకోసం జనం పోటెత్తారు.

జనవరి కల్కి పత్రిక విడుదలయింది. ముఖచిత్రం నెహ్రూతో రాధ. లోపలి పేజీల్లో నెహ్రూ, మౌంట్‌బాటన్‌లతో సుబ్బలక్ష్మి ఫోటోలున్నాయి. కల్కి ప్రారంభమయిన దగ్గర నుంచి ప్రతి సంచికలో సుబ్బలక్ష్మి గురించి విధిగా ప్రచురిస్తున్నాడు సదాశివం. 'సావిత్రి' సినిమాలో నారదుడిని వేషం దగ్గర నుంచి, 'మీరా' సినిమా నిర్మాణం సంగతులు, కస్తూర్బా మెమోరియల్ కచేరీలు, ఇతర లబ్ధి కచేరీలు, మామూలుగా చేసే కచేరీలు, హిందీ 'మీరా', నెహ్రూ మౌంట్‌బాటన్‌తో సుబ్బలక్ష్మి పాట విని సేదతీరాలని చెప్పిన విషయం, అన్నీ వివరంగా ప్రచురిస్తున్నాడు సదాశివం.

మదురైలో, "అమ్మా! అమ్మా!" అంటూ కల్కి పత్రిక చేతబుచ్చుకొని ఇంటికి పరిగెత్తుకుంటూ వచ్చాడు శక్తి. షణ్ముగవడివుకి చెల్లెలు ఉన్న పేజీలు తిప్పి చూపించాడు. పెద్దవాళ్ల మధ్య తన కూతురుని తదేకంగా చూసుకుంటుంది. స్నేహితురాళ్లు వచ్చి చేరారు. అప్పుడెప్పుడో వాళ్లు కుంజమ్మ గ్రామఫోను ప్లేటు తిప్పి చూసుకున్నట్లు, ఈసారి సుబ్బలక్ష్మి ఫోటోలు చూసుకుంటున్నారు. "షణ్ముగం, మనమింతదాన్ని చేయగలిగేవాళ్లమా దీన్ని" అంది రంగ.

"ఎంతదయితే ఏమి? నా కూతురు నాకే అందని చందమామ అయినప్పుడు" బాధపడింది షణ్ముగవడివు.



షణ్ముగవడివు మనస్సు కాస్త మళ్లించటానికి ప్రయత్నిస్తూ, "రాజం, నువ్వు చెప్పవే ఈ బొమ్మలో ఉన్నవాళ్లెవరో.."

రాజం మొదలుపెట్టింది, "ఇదిగో దండ వేసుకొని, కాస్త కనిపిస్తున్న పిల్ల సదాశివం పిల్ల, ఆ పక్కనే దండ వేసుకున్నది మన పిల్ల, అటుపక్కన మన ప్రధాని నెహ్రూ, ఆయన పక్కన దండేసుకుని ఉంది ఆయన పెళ్లాం." షణ్ముగవడివు తలెత్తి చూసింది.

"రాజం! కాంగ్రెసువాళ్లు విన్నారంటే నీ పటం కట్టించి, నీకేస్తారు ఓ దండ. ఆవిడ ఆ తెల్లదొర పెళ్లాం" అంది రంగ.

శక్తి వైపు తిరిగి రంగనాయకి, "ఒరేయ్ శక్తి! కుంజా వాళ్ల ఇల్లు మన గుడి అంత ఉంటుందటగా" కళ్లు పెద్దవి చేసుకొని అడిగింది.

"అవును రంగమ్మా పెద్ద బంగళా అది. నేను వెళ్లానుగా." రంగనాయకి షణ్ముగవడివుని ఓ కంట చూస్తూ ఉంది. షణ్ముగవడివు ఇంకా ఇటు కూతురు చేసిన పనిని అటు సదాశివం చేసిన పనిని, వెంటనే సమర్థించుకోలేకపోయినా కూతురికి వస్తున్న పేరుని చూసి కాస్త కుదుటపడింది.

1948లో సుబ్బలక్ష్మికి ఎంత పేరుందంటే.. ఉప్పెనలాగా ఎగసి అలాగే సాగిపోతున్న ద్రవిడ కళగమ్ యొక్క రాజకీయ బహిరంగ సభ జరుగుతుంది. ద్రవిడ రాజకీయాల ఆద్యుడు డెబ్బైఏళ్ల ఇ.వి. రామస్వామి వేదికమీద మాట్లాడుతున్నాడు. పార్టీ యువరక్తం అయిన అన్నాదురైకి రామస్వామితో విభేదాలు ఉండి, సభకు రాలేదు. అన్నాదురై అభిమానులు అన్నాదురై ఎందుకు సభకు రాలేదు అని అరుస్తున్నారు. అప్పుడు ఇ.వి. రామస్వామి, "మీరు నన్ను వాళ్లు ఎందుకు రాలేదు, వీళ్లు ఎందుకు రాలేదు, ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి ఎందుకు రాలేదు అని అడగొద్దు" అని అంటూ తన ప్రసంగం కొనసాగించుకుంటూ వెళ్లాడు. రామస్వామి అన్న మాట సుబ్బలక్ష్మితో సహా అందరినీ ఆశ్చర్యపరిచింది. అసలు సుబ్బలక్ష్మికీ ఆ సభకీ ఎలాంటి సంబంధం లేదు. అయినా రామస్వామి అంతటి మనిషి సుబ్బలక్ష్మి పేరు తీసుకున్నాడంటే సుబ్బలక్ష్మికి ఉన్న ప్రజాదరణ అటువంటిది. చిన్నవాళ్ల నుంచి పెద్దవాళ్ల దాకా అందరినోటా నానుతున్న పేరు, అందరూ చూడాలనుకునే మనిషి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి.

ఇంట్లో ఫోను మోగింది. "హలో" అన్నాడు సదాశివం. "సార్, నేను డిస్ట్రిబ్యూటర్ నారాయణని, ఇప్పుడే ఢిల్లీ నుంచి ఫోను వచ్చింది. మీరా సినిమా నెల దాటినా ఇంకా హౌస్‌ఫుల్ ఆడుతుంది. మీకు త్వరలో కలెక్షన్ పంపుతాను"

"అలాగే నారాయణ గారు చాలా సంతోషం" అని ఫోను పెట్టాడు సదాశివం. ఇంతలోనే గుమస్తా ఒకరు టెలిగ్రామ్ తీసుకొచ్చాడు. గబగబా చూశాడు సదాశివం. అది కలకత్తా నుంచి వచ్చింది. దానిలోని వార్త. 'బసుశ్రీ సినిమా హాలులో అఖిల భారత బాక్స్ ఆఫీస్ రికార్డు. పోయినవారం కలెక్షన్ 32,000' అంత పెద్ద ఇంట్లో సుబ్బులక్ష్మిని వెతుక్కుంటూ పోయి ఈ రెండు విషయాలు చెప్పాడు. "కుంజా, మనం కష్టపడినందుకు దేవుడు కరుణించాడు" అని చెప్పి కింద ఉన్న పత్రిక కార్యాలయానికి వెళ్లిపోయాడు. ఏదైనా విశేషం ఉన్నా లేకున్నా సుబ్బులక్ష్మి అమ్మకి ఉత్తరం వ్రాయటం మాత్రం మానదు. వెంటనే ఈ సంతోషమైన విషయం అమ్మకి చెప్పటానికి ఒకచోట కూర్చుంది. వ్రాయటం మొదలు పెట్టింది.

"ప్రియమైన అమ్మకు, నీకు నా నమస్కారములు."

𝄞𝄞𝄞𝄞

గత రెండు సంవత్సరాల నుంచి విపరీతంగా ప్రయాణాలు చేస్తూ పనులు చేస్తూ అలసిపోయి సేదతీరుతూ సుబ్బులక్ష్మి ఈసారి తిరువయ్యూరు త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలకి వెళ్లలేదు. రేడియోలో ఆరాధనోత్సవం వింటోంది. హఠాత్తుగా పాటలు ఆగిపోయాయి. "ఏంటీ" అనుకుంటూ రేడియోవైపు తిరిగింది. "ఒక దుర్వార్త, జాతిపిత గాంధీజీ మరణించారని తెలియచేయటానికి చింతిస్తున్నాము." నమ్మశక్యం కాని ఈ వార్త విని, సుబ్బులక్ష్మి స్పృహతప్పి క్రిందపడిపోయింది. సపర్యలతో కోలుకుంది కానీ, ఆ తర్వాత 'అంతటి మహాత్ముడిని ఎందుకు చంపారు?' అంటూ బాధపడుతూనే ఉంది. రాజాజీకి వియ్యంకుడు గాంధీజీ, రాజాజీ ఇంకా బాధపడుతున్నాడు. గురుతుల్యుడైన రాజాజీ బాధ చూసి, గాంధీ చూపిన మార్గాన్నే అనుసరిస్తున్న సదాశివానికి గాంధీ మరణం వీళ్లద్దరి బాధకంటే ఎక్కువ బాధ కలిగించింది.

ఈ సంతాప రోజుల్లోనే ఓరోజు టి.టి. కృష్ణమాచారి సుబ్బులక్ష్మి ఇంటికి వచ్చాడు. సుబ్బులక్ష్మి ఎదురుపడింది. కాస్త పెద్ద బొట్టు పెట్టుకునే సుబ్బులక్ష్మి పెట్టీ పెట్టనట్లు ఒక చిన్న బొట్టు పెట్టుకుని ఉంది. చేతికి గాజులు లేవు, మెడలో గొలుసు లేదు, ఒక్క ముక్కుపుడక ఉంది. అదీ చాలా చిన్నది. సుబ్బులక్ష్మిని అలా చూసి కృష్ణమాచారి ఒక్కసారిగా భయపడ్డాడు. "సదాశివం ఉన్నాడమ్మా" అంటూ భయం భయంగా అడిగాడు. ఇంతలో సదాశివం రానే వచ్చాడు. 'హమ్మయ్య' అంటూ ఊపిరి పీల్చుకున్నాడు. "సదాశివం ఏంటీ ఎమ్.ఎస్. అలా ఉంది, గాజులు, గొలుసులు ఏవి?"

"గాంధీజీ చనిపోయారు కదా, ఇవన్నీ ఎందుకు?" అని ఏడ్చినంత పనిచేశాడు సదాశివం.



"ఏడ్చినట్లుంది. బాధ ఎవరికి లేదు? ఇలా చూపించనవసరంలేదు. పిలిచి గాజులు, గొలుసులు వేసుకోమని చెప్పు. ఇప్పుడే, నాముందే" అంటూ తొందరపెట్టాడు కృష్ణమాచారి.

𝄞𝄞𝄞𝄞

హిందీ 'మీరా' బాగా ఆడి, మెల్లగా సినిమా హాళ్ల నుంచి తప్పుకుంది. కానీ ఉత్తర భారత ప్రజల మనస్సుల్లో మాత్రం సుబ్బులక్ష్మి నిలిచిపోయింది. అక్కడ ఆడపిల్లలకి శుభలక్ష్మి అని తల్లిదండ్రులు పేరుపెడుతున్నారని కూడా వార్తాపత్రికలు ప్రచురించాయి. ఆ ఉత్తర భారతం నుంచి మళ్లీ పిలుపు వచ్చింది సుబ్బులక్ష్మికి. సదాశివం వెంటనే ముసిరి సుబ్రహ్మణ్యం అయ్యర్ అనే ప్రఖ్యాత సంగీత విద్వాంసుణ్ణి ఇంటికి పిలిపించుకున్నాడు. "ముసిరి గారు ఢిల్లీలో మద్రాసీ ఎడ్యుకేషనల్ సొసైటీ వాళ్లు మన తమిళుల కోసం ఒక పాఠశాల నిర్మించటానికి నిధుల కోసం సుబ్బులక్ష్మి కచేరీ ఏర్పాటు చెయ్యమన్నారు, అక్కడికి నెహ్రూ గారితో సహా పెద్దపెద్దవాళ్లందరూ వస్తారు. పైగా తమిళులు, దక్షిణాదివారు బాగా వస్తారు. కృతులు రెండు నేర్పండి."

"తప్పకుండా నేర్పుతాను. మరి హిందీ వాళ్లకి ఇవి అర్థంకావుగా.... పర్వాలేదా?"

"మీరా భజనలు ఎలాగూ పాడుతుంది. గాంధీగారికి నచ్చిన 'హరి తుమ్ హరో' తర్వాత 'వైష్ణవ జనతో' పాడుతుంది. సూరదాస్, కబీర్ పాటలు కూడా నేర్చుకునే ఏర్పాటు చేస్తున్నాను" అని చెప్పాడు సదాశివం. మళ్లీ నెహ్రూ ముందు కచేరీ చాలా గొప్పగా చేయించాలనే పట్టుదల మీదున్నాడు సదాశివం. సుబ్బులక్ష్మికి మాత్రం గొప్ప కర్ణాటక సంగీత విద్వాంసుడి దగ్గర కృతులు నేర్చుకోవటం చాలా సంతోషంగా ఉంది. చాన్నాళ్ల తర్వాత తన సొంత ఘరానా లోకి వచ్చింది.

"కూర్చోమ్మా." చాప చూపెట్టాడు ముసిరి. గురువులు కూర్చోమనేదాకా కూర్చోదు సుబ్బులక్ష్మి. తనకు అమ్మ నేర్పిన మొదటి పాఠం ఇది.

"నీకు నేను శ్యామశాస్త్రి కృతి, 'దురుసుగా', సావేరి రాగంలో నేర్పిస్తానమ్మా." సంతోషంగా తల ఊపింది సుబ్బులక్ష్మి.

వారి సాధన కాసేపు చూసి, తన కల్కి కార్యాలయానికి చేరుకున్నాడు సదాశివం. అప్పటికే అక్కడికి ఒక దర్శకుడు వచ్చి ఎదురు చూస్తున్నాడు. పరస్పర పలకరింపులు అయిన తర్వాత ఆ దర్శకుడు మొదలుపెట్టాడు, "ఈ మొత్తం వ్యవహారంలో మీకే లాభం, ఎందుకంటే ఒకటి మేము కల్కి కృష్ణమూర్తి గారి కథ 'అమర తార'ను సినిమా తీయటానికి నిర్ణయించుకున్నాం. మీకు ఆ కథ హక్కులుకి డబ్బులు ఇస్తాం. రెండు ఆ సినిమాకి హీరోయిన్ ఎమ్.ఎస్, చెప్పండి ఏమంటారు?" కాలిమీద కాలు వేసుకొని కూర్చున్నాడు

ఆ వచ్చిన దర్శకుడు. "ఇంత గొప్ప అవకాశం ఇస్తున్నాను మీకు, తేల్చుకోండి మరి" అన్నట్లు. సదాశివం ఆలోచిస్తున్నాడు.

"నాకు కాస్త సమయం కావాలి, ఆలోచన బాగానే ఉంది. నేను ఆలోచించి మీకు మళ్లీ కబురు పెడ్తాను" అని చెప్పాడు. సదాశివంకి వాళ్లు చెప్పిన కథ తెలుసు. సుబ్బలక్ష్మి నటిస్తే బాగానే ఉంటుంది. సదాశివం ఇప్పటికిప్పుడు తనే సొంతంగా సినిమా తీసే పరిస్థితుల్లో లేడు. హిందీ 'మీరా' మీద వచ్చిన లాభాలు, కల్కి పత్రిక మీద, కల్కి బంగ్లా కొనటానికి పెట్టేశాడు. సూచనప్రాయంగా తన అంగీకారం తెలిపేవాడే ఈ సినిమాకి, ఆ దర్శకుడు ఇంకొక్క మాట మాట్లాడి ఉండకపోతే. సదాశివం మౌనాన్ని అర్ధాంగీకారంగా ఎంచి ఆ దర్శకుడు తన ప్రతిపాదనకు ఇంకో మాట జతచేశాడు. "సదాశివంగారూ, ఒక్క మాట, మీరు ఈ సినిమా నిర్మాణంలో ఎలాంటి జోక్యం చేసుకోకూడదు." సదాశివం మొహం ఒక్కసారిగా మారిపోయింది. "మీకు 'మీరా' దర్శకుడు ఎవరో తెలుసా?" మీకసలు తెలుసా అన్నట్లు అడిగాడు సదాశివం. "ఎందుకు తెలియదు..డంగన్! హాలీవుడ్ నుంచి వచ్చాడు.." "ఆ హాలీవుడ్ నుంచి వచ్చిన దర్శకుడికి నేను ఎంత చెపితే అంత. నా జోక్యం లేకుండా కృష్ణమూర్తి కథ ఇవ్వడు, సుబ్బలక్ష్మి కాలు కూడా కదపదు. ఇక మీరే ఆలోచించుకొని రండి" అని చెప్పి వారిని పంపించేశాడు.

ఈ లోపల ముసిరి సాధన ముగించి వెళ్లిపోతుండగా రాధ ఉయ్యాలమీద పాట పాడుతూ ఉంది. 'ఆనందమె సొల్వెనే...' అని సుబ్బలక్ష్మి 'శకుంతల' సినిమాలో పాడిన పాట పాడుతుంది. ముసిరి సుబ్రహ్మణ్యం అయ్యర్ బాగా పాడుతుందే అనుకుంటూ దగ్గరకి వచ్చాడు. 'రాధా! నీకు ఇంకా ఏమిపాటలొచ్చు?" "'సుధామయి' వచ్చు. పాడనా?" "ఏది పాడు" ముసిరి వింటూ ఉన్నాడు. చాలా చక్కగా పాడింది రాధ. ఆశ్చర్యమేసింది ముసిరికి. "నీకు ఎవరు నేర్పారు ఈ పాటని?"

"నాకెవరూ నేర్పలేదు. మా అమ్మ పాడుతుంటే విని నేర్చుకున్నాను." అంది. ఇంకా ఆశ్చర్యమేసింది ముసిరికి. "ఇంకా ఏమి నేర్చుకున్నావు? ఇలా వింటూ?" "'సరసీ రుహ' వచ్చు పాడనా?" అంది పద్నాలుగేళ్ల రాధ.

"పాడై" అన్నాడు ముసిరి. ఇదీ విన్నాడు. వెంటనే సదాశివం దగ్గరకు వచ్చాడు రాధని తీసుకొని, "సదాశివం గారు మీరు చాలా అదృష్టవంతులు. సుబ్బలక్ష్మికి పుట్టుకతో వచ్చింది సంగీత జ్ఞానం. మీ అమ్మాయి పుట్టి సాధిస్తుంది, వెంటనే రాధకు సంగీతం నేర్పించండి సుబ్బలక్ష్మికి మంచి తోడవుతుంది."

ముసిరి మాటలకు మురిసిపోయాడు సదాశివం. రాధ సదాశివం గారాలపట్టి. తొలి సంతానం అయినందుకు రాధ మీద విపరీతమైన ప్రేమ. రాధ చాలా చురుకైన



పిల్ల. మీరాలో పాటలు, నటన వెంటనే నేర్చుకుంది. భరతనాట్యం కూడా అంతే. అనతికాలంలోనే ప్రదర్శనలు ఇచ్చే స్థాయిని అందుకుంది. "ఇప్పటిదాకా తీరిక లేక పట్టించుకోలేదు, మీరు చెప్పారుగా ఇక ఒక గురువుని పెట్టేస్తాను." ముసిరితో చెప్పాడు సదాశివం, కూతురిని గర్వంగా చూసుకుంటూ.

𝄞𝄞

సుబ్బలక్ష్మి 1949 మార్చి నెలలో మద్రాసీ ఎడ్యుకేషనల్ సొసైటీకి ఆర్థిక లబ్ధి చేకూర్చేందుకు కచేరీ చేయటానికి ఢిల్లీ వచ్చింది. ప్రధాని నెహ్రూ, మౌంట్‌బాటన్ స్థానంలో స్వతంత్ర భారత దేశానికి గవర్నర్ జనరల్ అయిన రాజగోపాలాచారి, ఇతర ఢిల్లీ పెద్దలందరూ ఈ కచేరీకి విచ్చేశారు. కచేరీ తర్వాత నెహ్రూ చిన్న ప్రసంగం ఇచ్చాడు. అది విని ముందు అందరూ ఆశ్చర్యపోయారు. ఆ తర్వాత మెల్లగా చప్పట్ల జోరందుకుంది.

ఈ కచేరీ తరువాతి రోజు రాజాజీ అధికార నివాసమైన 'గవర్నమెంట్ హౌస్'కి చేరుకుంది సుబ్బలక్ష్మి బృందం. రాధ రాజాజీ కోసం భరతనాట్యం చేసింది. ప్రదర్శన అయిన తర్వాత ఆడవాళ్లంతా ఒకవైపుకు చేరారు. మగవాళ్లంతా ఒకవైపుకు చేరారు. సుబ్బలక్ష్మి ఆ విశాలమైన భవనాన్ని చూస్తుంది. ఈ భవనానికి తను ఇది రెండవసారి రావటం. ఎత్తైన గదులు, పెద్దపెద్ద దీపాలు, ఖరీదైన వస్తువులు, ఎయిర్ కండిషనర్లు, ముప్పై ఏళ్ల నుంచి ఇక్కడ గవర్నర్ జనరల్ ఉంటూ వస్తున్నారు. వారి ఠీవికి, అవసరాలకు అనుగుణంగా కట్టించబడి అలానే కొనసాగిస్తున్నారు. "కుంజా! ఈ బంగళా తిరగటానికి ఒకరోజు సరిపోదు" అంది రాజాజీ కూతురు నామగిరి. ఇంతలో భోజనానికి అందరూ ఎదురు చూస్తున్నారని కబురు వచ్చింది. అందరూ వచ్చి, ఒకేసారి ఒక ఇరవైమంది కూర్చొని తినగలిగే డైనింగ్ టేబిల్ గదిలోకి వచ్చారు. చక్కగా తయారై ఉన్న పరిచారికులు టేబులు మీదకి ముందు పాత్రలు తీసుకొచ్చి పెడుతున్నారు. ఒక్కొక్కళ్లు ముందు ఖరీదైన పింగాణి ప్లేట్లు, వెండి స్పూన్లు, ఫోర్కులు పెడుతున్నారు. అవి చూడగానే సుబ్బలక్ష్మి పక్కనున్న నామగిరివైపు తిరిగి, "మీరా సినిమా చూసిన తర్వాత మౌంట్‌బాటన్ మమ్మల్ని ఇక్కడికే భోజనానికి పిలిచారు, అప్పుడు నెహ్రూగారు నా పక్కనే ఉన్నారు నీలాగ, ఇలానే ఫోర్కు ఇచ్చారు తినటానికి, నాకు చేతకాలేదు. ఫోర్కుతో ప్లేటులోనుంచి ఏదో తీసుకోబోతూ ఉంటే ఫోర్కు జారి కిందపడింది." నామగిరి నవ్వింది. అందరూ వీళ్లవైపు చూశారు. కాసేపు ఆగి మళ్లీ చెప్పటం మొదలుపెట్టింది సుబ్బలక్ష్మి. "నాకూ నెహ్రూగారికి మధ్య పడింది ఆ ఫోర్కు. నేను దాన్ని తీద్దామని వంగుతుంటే నెహ్రూగారు ఎవరితోనో మాట్లాడుతున్నవాళ్లు మాట్లాడుతూనే, నా చెయ్యి గట్టిగా పట్టుకొని వంగవద్దని వారించారు. ఇంకో ఫోర్కు తెప్పించారు." మళ్లీ నవ్వింది నామగిరి. 'ఏంటీ వీళ్లు ఇలా నవ్వుకుంటున్నారు' అని మళ్లీ చూశారు అందరూ.

భోజనాలు అయ్యి రాజాజీ సదాశివం ఇద్దరే ఉన్నారు. "కుంజమ్మ విషయంలో తర్వాత ఏమి చేద్దామనుకుంటున్నావు సదాశివం?" రాజాజీ అడిగాడు.

సదాశివంకి తెలుసు రాజాజీ సరిగ్గా ఏ విషయం గురించి అడుగుతున్నాడో, అందుకనే మౌనంగా ఉన్నాడు. "నేను చెప్పేది విను, ఇక సినిమాలు ఆపెయ్యి. సినిమాలు విషం. ఆ వాతావరణంలోకి నువ్వు నీ కుటుంబం వెళ్లొద్దు. నిన్న ఎంత చక్కగా భక్తిపాటలు పాడింది, ఇప్పుడీ కుంజమ్మ ప్రజలకు మీరా, పరమ భక్తురాలు, ప్రజల మనస్సులో అలానే ఉండనీ, సినిమాల్లో చేర్చి పిచ్చిపిచ్చి వేషాలు వేయించి, వెకిలి పాటలు పాడించి, ఉన్న పేరును చెడగొట్టకు. ఇప్పుడు సినిమాలో నటిస్తున్న ఆడవాళ్లందరూ ఎవరు? వాళ్లతో కుంజమ్మని కలపకు." గీతోపదేశం అర్థం చేసుకున్న అర్జునుడిలా మారిపోయాడు సదాశివం.

ఏప్రిల్ రెండోవారం 'కల్కి' వారపత్రిక విడుదలయింది. ఆ పత్రికతో వచ్చి శక్తి, షణ్ముగవడివు ముందు, అత్తల ముందు, మామల ముందు, ఇంటి చుట్టుప్రక్కలవాళ్లముందు నెహ్రూ తన చెల్లి గురించి ఏమన్నాడో చదివి వినిపిస్తున్నాడు. "ఈ సంగీత సామ్రాజ్ఞి ముందు నేనెంత, ఒక మామూలు ప్రధానమంత్రిని మాత్రమే." విన్నవారందరూ ఆశ్చర్యపోయారు. "ఏంటీ ప్రధాని నెహ్రూ అలా అన్నాడా... నెహ్రూ మన అమ్మాయి గురించి అంత పెద్ద మాటన్నాడా, ఆహా.. ఎంత గొప్పదయింది మనమ్మాయి" అంటూ ఊరంతా పొగిడేస్తుంటే షణ్ముగవడివు సంతోషించింది. "ఒరేయ్ శక్తీ, అది అక్కడ ఆ లొల్లాయి పాటలే పాడిందా, నేను నేర్పినది పాడిందా" కొడుకుని అడిగింది.

"కర్ణాటక సంగీతం, భజనలు, మీరా పాటలు పాడిందమ్మా, అన్నీ సమానంగా పాడింది."

"ఊ..." అంటూ వెళ్లిపోయింది షణ్ముగవడివు. తను కూతురికి నేర్పింది శుద్ధమయిన కర్ణాటక సంగీతం. కానీ గాంధీ అన్నట్లు సుబ్బలక్ష్మి పాడనే అవసరంలేదు, పాటను చదివినా సరే వింటాం అంటున్నారు రసజ్ఞులు. పైగా సుబ్బలక్ష్మిని చూసినా చాలనుకుంటున్నారు. సుబ్బలక్ష్మి ఇప్పుడు ఎలాంటి కెమెరా గిమ్మిక్కులు లేకపోయినా చాలా అందంగా కనిపిస్తుంది. ఇప్పుడు మదురై షణ్ముగవడివు సుబ్బలక్ష్మి మధుర మీనాక్షి గుడిలోని అమ్మవారి పాదాలని తాకి, అనంతమైన ఆకాశంలోకి రివ్వున ఎగురుతున్న పచ్చని చిలుక. సదాశివం ఈ చిలుక రెక్కలు విరిచి కట్టాడు. అయినా చిలుకను ఎగరమన్నాడు.







1949లో ఢిల్లీలో ప్రధాని నెహ్రూ, రాజగోపాలాచారి ఇతర ప్రముఖుల ముందు కచేరీ ఇస్తున్న సుబ్బలక్ష్మి, ప్రక్కనే రాధ



కచేరీ అనంతరం మాట్లాడుతున్న ప్రధాని నెహ్రూ. వింటున్న సుబ్బలక్ష్మి, రా



'గవర్నమెంట్ హౌస్'లో గవర్నర్ జనరల్ రాజగోపాలాచారితో సుబ్బలక్ష్మి, రాధ



కల్కి బిల్డింగ్స్‌కి మద్రాసులో పేరుపొందిన జ్యోతిష్కుడు కవిసెరి వచ్చాడు. సదాశివం రాధని పిలిచాడు. "కవిసెరిగారికి నిమ్మకాయ షరబత్ చేసి తీసుకురామ్మా" అని చెప్పి పంపాడు. "మీరు నాకూ సుబ్బలక్ష్మికి కుదిర్చిన పెళ్లి ముహూర్తం బ్రహ్మాండంగా ఉంది. ఇప్పటిదాకా కూడా అన్నీ అనుకున్నదానికంటే గొప్పగా జరిగిపోతున్నాయి. మీకంటే ముందు, నేను ఒకసారి హిమాలయాలకి వెళ్లినప్పుడు ఒక సాధువు చెప్పాడు, నా జీవితంలోకి ఒక స్త్రీ వస్తుందని, నా జీవితం మారుతుందని."

"కానీ ఆ సాధువు, నేను చెప్పినట్లు మీరు ఆ స్త్రీ జీవితాన్ని మారుస్తారని చెప్పలేదు కదా" తను ఆ హిమాలయ సాధువుకంటే గొప్పవాడనని కాస్త, కాస్త సదాశివంని పొగిడే ఉద్దేశంతో చెప్పుకున్నాడు ఆ జ్యోతిష్కుడు.

"అందుకే మిమ్మల్ని పిలిపించింది."

లోపల సుబ్బలక్ష్మి గబగబా మజ్జిగ చిలుకుతుంది. "అమ్మా, ఆయన పెద్ద జ్యోతిష్కుడంటున్నావుకదా.. మరి నాన్న నిమ్మకాయ షరబత్ తెమ్మన్నప్పుడు, ఆయనకి నిమ్మకాయలు మన ఇంట్లో లేవని తెలియాలికదా.. చెప్పమ్మా" అని వాళ్లమ్మని అడుగుతుంది రాధ. సుబ్బలక్ష్మి మజ్జిగ గ్లాసులో పోసి ఇస్తూ "పోకిరిపిల్ల, వెళ్లి ఇచ్చిరా, ఇప్పటికే ఆలస్యమైంది. మీ నాన్న అరుస్తారు" అంటూ కూతురుని పంపించింది.

"నా మేనకోడలికి పెళ్లి చేశాను. అంబికి కూడా ఒకదారి చేస్తే నేను అక్కకు ఇచ్చిన మాట నిలబెట్టుకున్నవాడినవుతాను. వాడి జాతకం చూసి చెప్పండి."

"అc.. తప్పకుండా, మళ్లీ వచ్చి కలుస్తాను" అంటూ కవిసెరి వెళ్లిపోయాడు. సదాశివం మొదటి అంతస్తు నుంచి తోటలోకి చూస్తున్నాడు. అవి సంక్రాంతి రోజులు. పిల్లలు తోటలోని మల్లెపూలు కోసి తెస్తుంటే సుబ్బలక్ష్మి ఇంకా కొందరు పూలు కడుతున్నారు. సదాశివానికి పద్దెనిమిదిమంది తోబుట్టువులు. వీరందరి పిల్లలు, వాళ్ల పిల్లలు వెరసి సదాశివం ఘురానా అయి కూర్చుంది. మళ్లీ వీళ్లేకాక అక్కచెల్లెళ్ల ఆడపడుచులు, సదాశివం అన్నదమ్ములు, తోడి అల్లుళ్లు, వాళ్ల పిల్లలు, ఎవరైనా, ఎంతమందైనా, ఎన్నిరోజులైనా వచ్చి సుబ్బలక్ష్మి ఇంట్లో ఉండవచ్చు. ఇప్పుడు తోటకి నిండుగా, ఇంటికి నిండుగా ఈ ఘురానా సభ్యులే కనిపిస్తున్నారు. సుబ్బలక్ష్మి కుటుంబం మచ్చుకు కూడా కనిపించదు. షణ్ముగవడివు పిలిచినా రాదు, వడివాంబకి పిలుపే ఉండదు. ఒక్క శక్తివేల్ మాత్రమే పిలవకపోయినా చెల్లికోసం వచ్చి, ఇంట్లోవాళ్ల మంచిచెడ్డలు చేరవేసి వెళ్తుంటాడు. సదాశివం చూపులే ఆమడ దూరం పెట్టాయి శక్తివేల్‌ని. ఎప్పుడో అరుదుగా వచ్చే అన్నతో విప్పారిన మొహంతో మాట్లాడి, ఒక పూట భోజనం పెట్టి పంపిస్తుంది సుబ్బలక్ష్మి. ఈ ఆనందాన్ని మళ్లీ అన్న వచ్చేవరకూ గుండెలోనే దాచుకుంటుంది. సుబ్బలక్ష్మి ఇంట్లో

ప్రతి పూటా ఒక పాతికమందికి తక్కువ లేకుండా విందుభోజనం చేస్తూ ఉంటారు. ఈ ఇంటి ఖర్చులకు ఆదాయ వనరులలో కల్కి పత్రికది సింహ భాగమైతే, సుబ్బలక్ష్మి గ్రామఫోన్ల రికార్డులు అమ్ముడుపోయేకొద్దీ వచ్చే ఆదాయం, రేడియో ప్రసారాలు, ఇంకా కచేరీలు చేస్తే వచ్చే ఆదాయం.

సుబ్బలక్ష్మికి లబ్ధి కచేరీల అభ్యర్థనలు ఏటేటా ఎక్కువవుతున్నాయి. దానికి కారణం సుబ్బలక్ష్మికి ఉన్న ప్రజాదరణ, సుబ్బలక్ష్మి పాటకి ఉన్న సమ్మోహన శక్తి.

1923లో పొణకా కనకమ్మ నెల్లూరులో కస్తూర్బా బాలికా విద్యాలయాన్ని, ఏర్పాటు చేశారు. ఆ తర్వాత కొన్నాళ్లకే నిధుల లేమితో మూసివేశారు. మరలా 1929లో రెండెకరాల భూమి కొని, మహాత్మాగాంధీ చేత పాఠశాల నిర్మాణానికి పునాదిరాయి వేయించారు. కానీ అప్పటినుంచి అర కొర సదుపాయాలతోనే ఆ విద్యాలయం నడుస్తుంది. ఈ విషయం విద్యాలయానికి తొలి ధర్మకర్త అయిన పొణకా కనకమ్మని బాధించింది, అప్పటి మద్రాసు రాష్ట్ర ఆర్థిక మంత్రి, నెల్లూరు వాస్తవ్యులు అయిన బెజవాడ గోపాలరెడ్డి గారిని కలిసి సహాయం కోరారు. ఆయన మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిని కలిసి ఒక ఆలోచన చేశారు. ఆ ఆలోచన ఆచరణలో పెట్టటానికి, నెల్లూరు కలెక్టర్ మలయప్పన్ సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చాడు. "నన్ను మీ దగ్గరికి ఆర్థికమంత్రి పంపించారు" అంటూ విషయం చెప్పుకొచ్చాడు. "ఎమ్.ఎస్.గారు ఒక కచేరీ చేస్తే ఆ విద్యాలయానికి నిధులు చేకూర్చగలుగుతారు. ఆడపిల్లలకు తరగతి గదులు ఏర్పడతాయి."

"గాంధీ గారు ప్రారంభించిన విద్యాలయం, తప్పకుండా ఎమ్.ఎస్. కచేరీ ఇస్తుంది. మీరు ఏర్పాట్లు చేసుకోండి" అని భరోసా ఇచ్చాడు సదాశివం.

అనుకున్నరోజున సుబ్బలక్ష్మి, సదాశివం పక్కవాద్య కళాకారులతో సహా మద్రాసు నుంచి బయలుదేరి నెల్లూరులోని విద్యాలయానికే నేరుగా చేరుకున్నారు. మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి, బెజవాడ గోపాలరెడ్డి, ఇతర ప్రముఖులు, కిక్కిరిసిన జనం ముందు మూడుగంటల కచేరీ చేసింది. ఆ వెంటనే కాసేపు విశ్రాంతి తీసుకొని అందరికీ వీడ్కోలు పలికి వెంటనే మద్రాసుకి బయలుదేరింది. "అబ్బా, వెంటనే బయలుదేరుతున్నారు. క్షమించండి, మీకో గది కూడా ఏర్పాటు చేయలేదు విశ్రాంతి తీసుకోవటానికి" బాధపడింది కనకమ్మ. "ఏమీ ఫర్వాలేదు. నాలుగ్గంటల్లో ఇంటికి వెళ్తాం" అంది నవ్వుతూ సుబ్బలక్ష్మి. ఆ అందమైన మోముని చూస్తూ సాగనంపింది కనకమ్మ. కారు కనుమరగవ్వగానే గుర్తొచ్చింది కనకమ్మకి, "అబ్బా.. ఇంతటి చక్కని మనిషి రూపు గుర్తుండిపోవటానికి ఫోటోలు తీసే ఏర్పాటు కూడా చేయలేదు" అనుకుని చాలా విచారించింది. రెండు రోజుల తర్వాత కలెక్టర్ మలయప్పన్ సదాశివాన్ని మళ్లీ కలిశాడు, "సదాశివం గారూ!



మొన్న నెల్లూరులో కచేరీకి లక్షా ముప్పైవేలు వచ్చాయి. పదివేలు పందిరి ఖర్చుకు సరిపోయాయి. గోపాలరెడ్డిగారు మీరు ఎంత అడిగితే అంత ఇచ్చిరమ్మన్నారు" అని వినయంగా చెప్పాడు. "పక్కవాద్య కళాకారులకి తప్ప నేనేమీ తీసుకోను. మావల్ల మీరు అమ్మాయిలకు తరగతి గది కట్టించగలిగితే మాకు అదే పదివేలు. ఇంకేమీ వద్దు" అని చెప్పాడు సదాశివం. సుబ్బలక్ష్మి పేరు, గానం ఆ విద్యాలయానికి భవనం ఏర్పరిచింది.

ఈ సంవత్సరం మొదట్లో మద్రాసు ముఖ్యమంత్రి పిలిస్తే, సంవత్సరం ఆఖరున ఉత్తర్‌ప్రదేశ్ ముఖ్యమంత్రి గోవింద్ వల్లభ్ పంత్ పిలిచారు. లక్నోలో శ్రీ సప్రు జ్ఞాపకార్థం ఒక కచేరీ ఇచ్చింది సుబ్బలక్ష్మి. నెల్లూరు కచేరీకి ఎలాంటి ప్రయాణ ఖర్చులు తీసుకోలేదు, నెల్లూరు దగ్గర కాబట్టి. కానీ లక్నో ప్రయాణానికి మాత్రం పిలిచినవారే అన్ని ఖర్చులూ భరించేటట్లు చూసుకున్నాడు సదాశివం. సుబ్బలక్ష్మి పాడినందుకు మాత్రం డబ్బులు తీసుకోలేదు. సదాశివం సూచనమేరకు లక్నోలో అన్నీ హిందీ భజనలే పాడింది. మీరా భజనలు. సూర్‌దాసు భజనలు. గోవింద వల్లభపంత్ సుబ్బలక్ష్మి పాటలు విని, "పోయిన నా ఆత్మను తిరిగి పొందగలిగాను" అని తన ప్రసంగంలో వ్యాఖ్యానించాడు. సదాశివం ఇంకో వ్యాఖ్య కూడా విన్నాడు. "ఈమె మన 'బాయ్' లాగానే రా, మద్రాసులో వీళ్లని దేవదాసీలంటారు." అని జనంలో ఇద్దరు చెప్పుకుంటుండగా విన్నాడు. లక్నో నుంచి తిరిగివస్తూ బొంబాయిలో ఆగి, ఇంకో కచేరీ ఇచ్చింది సుబ్బలక్ష్మి.

తన ఇంట్లో సదాశివం దీర్ఘాలోచనలో ఉన్నాడు. సుబ్బలక్ష్మి సదాశివం దగ్గరికి వచ్చి, "మామా, పిల్లలకూ, నాకూ బట్టలు కుట్టించాలి. బజారుకి వెళ్లమా..." అని అడిగింది పిల్లలందరినీ వెనకేసుకొచ్చి.

"వద్దు. రాధకి, ఆనందికి కుట్టాడు కదా అతన్ని పిలుస్తాను ఇంటికి"

"మామయ్యా, అతను డ్రామా బట్టలు కుట్టేవాడు" తంగం అంది.

"అలాగా.. అయితే అతనికి చెప్పి వేరే దర్జీని పంపమని చెప్తాను. నువ్వు బయటకు వెళ్లొద్దు కుంజమ్మా.. నిన్ను జనం గుర్తుపట్టి చుట్టుముడతారు" అన్నాడు సదాశివం. సుబ్బలక్ష్మి పిల్లలతో ఇంట్లోకి వెళ్లిపోయింది.

సదాశివం ఆ కాలపు పురుష దురహంకారి. భార్యను అవసరమైన పనికి కూడా బయటికి పంపడు. జనం గుర్తుపట్టి చుట్టుముడతారు అనేది ఒక సాకు మాత్రమే.

సదాశివం మళ్లీ తన ఆలోచనలలోకి వెళ్లిపోయాడు. లక్నో, బొంబాయిలలో సుబ్బలక్ష్మిని ముంచెత్తిన పొగడ్తలు, హర్షధ్వానాలు ఏవీ గుర్తులేవు 'ఆమె దేవదాసి' అన్న మాటే గుండెని గుచ్చుతుంది. మద్రాసు ప్రభుత్వం దేవదాసీ వ్యవస్థను నిషేధించి నిండు మూడు సంవత్సరాలు. మొదటినుంచీ ఇదిగో పులి అదిగో తోక అన్న చందాన

వ్యవహరించి, దేవదాసీలను ఊపిరి సలుపుకోకుండాచేసి, వారి జీవనోపాధులను కొల్లగొట్టి బజారుకీడ్చింది ప్రభుత్వం, సంఘం. కొన్నేళ్ల క్రితం దేవదాసీలకు చేతిపైన దేవుని ముద్రవేసేవాళ్లు. ఇప్పుడు సమాజం దేవదాసీలకు కళంకిత ముద్రవేసింది. దేవదాసీలంటే దిగజారినవారు, దేవదాసీలంటే సినిమాల్లో నటిస్తూ ఒక కథానాయకుడి తర్వాత ఇంకో కథానాయకుడితో నటిస్తూ తెరమీదే సన్నిహితంగా మసిలే ఆడది, దేవదాసీలంటే శృంగారభరితమైన జావళీలు, పదాలు పాడుతూ ధనికుల్ని ఆనందింపచేసే స్త్రీలు. 1950లో సమాజంలో దేవదాసీలంటే ప్రజలకు ఉన్న భావన ఇది. ఈ భావన నుంచి సుబ్బలక్ష్మిని అమాంతంగా వేరుచేయ తలపెట్టాడు సదాశివం.

𝄞𝄞𝄞

హైదరాబాదు నుంచి కృష్ణ గాన సభ వారు వచ్చారు సుబ్బలక్ష్మి ఇంటికి. "ప్రతాప్ నర్సింగ్ గిరి ధనరాజ్‌గిరి గ్యాన్ బహదూర్ వారు ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మితో కచేరీ వినాలని కోరుకుంటున్నారు" చెప్పాడు కృష్ణ గాన సభ ప్రతినిధి.

"క్షమించండి, పేరునుబట్టి వీరేదో గొప్పవారని తెలుస్తుంది, కానీ నాకు సరిగ్గా తెలియదు.. ఎవరు వీరు?" అని మర్యాదగా అడిగాడు సదాశివం.

"వీరు హైదరాబాదులో అత్యంత సంపన్నులు, నిజామ్ ప్రభుత్వానికే అప్పులు ఇస్తుంటారు." రొట్టె విరిగి నేతిలో పడ్డట్టయింది సదాశివానికి. కానీ షరతులమీద షరతులు పెట్టాడు. ఎందుకంటే సంపన్నుల కోటలలో, సంగీత విభావరులు ఎలా ఉంటాయో సదాశివానికి తెలుసు. "ఎమ్.ఎస్. జావళీలు, పదాలు పాడదు, కర్ణాటక సంగీతం, భజనలు, మీకు కావాలంటే హిందుస్థానీ సంగీతం కూడా పాడుతుంది. మీకు ఇలా సమ్మతమైతేనే వస్తాం. అక్కడకు వచ్చిన తర్వాత జావళీలు, పదాలు పాడమని దయచేసి అడగవద్దు" నిక్కచ్చిగా చెప్పాడు సదాశివం.

మెల్లగా సుబ్బలక్ష్మి గాన భాండాగారంలోనుంచి చిన్నప్పటి నుంచీ నేర్చుకుంటూ వచ్చిన జావళీలని, పదాలని ఏరిపారేశాడు. ఎంతటివాళ్లు అడిగినా సుబ్బలక్ష్మిచేత అవి పాడించడు. హైదరాబాదు సంపన్నుల ఇంట్లో కచేరీ చేసి, మంచి పారితోషికం, బహుమతులు తీసుకుంది సుబ్బలక్ష్మి.

సదాశివం ఒక దేవదాసీని చేసుకున్నందుకు అతని బంధుగణం ముక్కున వేలేసుకున్నా... నీరున్న బావిలోకే కప్పలు చేరినట్లు మెల్లగా కల్కి బంగళాలోకి చేరారు. కానీ సంప్రదాయబద్ధమైన బ్రాహ్మణ కుటుంబాలు, అటు కాంగ్రెసు వాదుల్లోనూ, ఇటు సంగీతజ్ఞుల్లోనూ, ఇరుగుపొరుగులోనూ సుబ్బలక్ష్మిని ఇంకా తమలో ఒకరిగా ఆమోదించలేదు. తన సాటి బ్రాహ్మణులు సుబ్బలక్ష్మిని బ్రాహ్మణ స్త్రీగా ఆమోదించేలా



చేయటం సదాశివం తక్షణ కర్తవ్యం అయ్యింది. తండ్రి ద్వారా సగం బ్రాహ్మణురాలైన సుబ్బలక్ష్మిని పూర్తిగా బ్రాహ్మణీకం చేయపూనుకున్నాడు సదాశివం.

"కుంజా, నువ్వు ప్రతి పండగకి మడిశార్ కట్టుకో" ఈ దిశగా మొదటి ఆదేశం జారీ అయింది.

"అలాగే మామా" సుబ్బలక్ష్మి సంతోషంగా ఒప్పుకుంది.

𝄞𝄞

సుబ్బలక్ష్మి దినచర్య పొద్దున్నే ఐదుగంటలకు మొదలయింది. స్నానం చేసి, మడి చీరతో కిందకు వచ్చి తులసి మొక్కకు పూజచేసి, ఆపైన తన పూజ ముగించుకుని రోజువారీ చీర కట్టుకొని, కాఫీ తాగి సాధనకు కూర్చుంది. కల్కి బంగళాలో ఒక గది సంగీత సాధనకు ప్రత్యేకంగా కేటాయించబడింది. ఆ గదిలో ఒక పెద్ద పియానోతోపాటు, తన తల్లి తనకు ఇచ్చిన వీణ, రెండు తంబూరలు, మృదంగం, హార్మోనియం అన్నీ ఉన్నాయి. సుబ్బలక్ష్మి గంటకు పైగా సాధన చేయగా, మెల్లగా రాధ, విజయ వచ్చి సాధనకు తోడయ్యారు. ఇంకో గంట వీరితో సాధన చేసి ఆ పూట సాధన ముగించింది. "కుంజక్కా! టిఫిన్ తిందువు రా" తంగం వచ్చి పిలిచింది. ఇప్పుడు కల్కి ఇంటి పనులన్నీ తంగం చూసుకుంటుంది. కల్కి బంగళాలో కల్కి పత్రిక పనులు తప్ప మిగతా అన్ని విషయాల్లో అందరి మీద అజమాయిషీ చేసే హక్కు, బాధ్యత తంగంకి ఇచ్చాడు సదాశివం. తంగం భర్త అనంత్‌ని కల్కి పత్రిక వ్యవహారాల్లో తనకు చేదోడుగా ఉంచుకున్నాడు. తంగం కింద నమ్మకంగా, నిష్టగా పనిచేసేది లక్ష్మి, లక్ష్మి కూతురు విశాలం. ఆ తర్వాత ఇద్దరు వంటవాళ్లు, ఇద్దరు పనివాళ్లు, నలుగురు తోటపనివాళ్లు. వీళ్లందరిచేత పని చేయించేది సదాశివం మేనకోడలు తంగం.

సుబ్బలక్ష్మికి సంగీత సాధన తప్ప ఇంటిపనులు ఏవీ చూసే అవసరం లేకుండా ఏర్పాటు చేశాడు సదాశివం. "తంగం, ఎందాక వచ్చాయి పనులు" తన సంగీత పుస్తకాలు సర్దుకుంటూ అడిగింది సుబ్బలక్ష్మి. "ఇప్పుడే మొదలవుతున్నాయి కుంజక్కా ఒక పెద్దాయన వస్తున్నారుగా. ఆయన వెనక ఒక ఇరవైమంది వస్తారు భోజనానికి. అందరికీ ఏర్పాటు చేయాలిగా."

"ఆ పెద్దాయన ఎవరో తెలుసా నీకు?"

"నాకు భోజనాలు ఏర్పాటు చెయ్యాలనేదే తెలుసు."

"పోకిరి పిల్ల. ఆయన అమెరికా నుంచి వచ్చారు. పాశ్చాత్య దేశపు వయోలి విద్వాంసుడు యాహుది మెన్యూహిన్." "చూద్దాం అయితే. సరే, నువ్వు తిందువు ర

అంటూ పనుల్లోకి వెళ్లింది తంగం. సుబ్బలక్ష్మి గదిలో నుంచి రాబోతుండగా చూపు మృదంగం మీద పడింది. వెంటనే అన్న గుర్తొచ్చాడు. బయలుదేరిందల్లా ఆగిపోయి మృదంగం వాయిస్తూ కూర్చుంది. కాసేపటికి రాధ వచ్చి, "అమ్మా, నీకు మదురై నుంచి ఉత్తరం" అని ఇచ్చి వెళ్లింది. సంతోషపడింది సుబ్బలక్ష్మి. ఇప్పుడే తన పుట్టింటివాళ్లని తలుచుకుంది. అక్కడ నుంచి ఉత్తరం వచ్చింది. ఉత్తరం చదవటం మొదలుపెట్టింది.

ప్రియమైన కుంజాకి,

అన్న దీవించి వ్రాయునది. ఇక్కడ అంతా కుశలమే. ముఖ్యంగా రాయునది ఏమనగా అమ్మ నేర్పిన విద్యవల్ల, నీకున్న పేరు వల్ల నన్ను మదురైలో సద్గురు సంగీత సమాజానికి సెక్రటరీని చేశారు. ఇది జరిగి సంవత్సరం అవుతుంది. అయినా కూడా నేను నీ కచేరీని మా సమాజంలో ఏర్పాటు చేయనందుకు నా వెనక అందరూ నవ్వుతున్నారు. నా మొహం మీదే నవ్వే లోపల నువ్వు ఒకసారి వచ్చి కచేరీ చేయాలి. నేను నీకు ఈ ఉత్తరం చేరిన తరువాత వారం ఇద్దరు కాంగ్రెసు పెద్దమనుషులతో సహా వచ్చి మీ ఆయన్ని అడుగుతాను. ఈలోపల నువ్వు కూడా ఒక మాట చెప్పు. ప్రస్తుతానికి ఇంతే సంగతులు.

ప్రేమతో అన్న

ఆ ఉత్తరంలోని విషయం గురించి ప్రత్యేకంగా సదాశివంతో చెప్పనవసరంలేదు. అది చించిన తర్వాతే పైకి వచ్చింది.

నవంబరులో ఢిల్లీలో రామకృష్ణ మిషన్ కోసం ఒక లబ్ధి కచేరీకి బయలుదేరి వెళ్లింది సుబ్బలక్ష్మి బృందం. ఈ కచేరీకి భారత ప్రధాని నెహ్రూ కూడా విచ్చేశారు. ఢిల్లీ నుంచి తిరిగి వస్తున్నప్పుడు బొంబాయిలో కూడా ఒక లబ్ధి కచేరీ చేసింది.

సుబ్బలక్ష్మి తన మేనమామ షణ్ముగసుందరం కొడుకు అయిన గోపీని సదాశివంకి సిఫార్సు చేసి కల్కి పత్రిక ఏజెంటుని చేసింది. ఆ గోపి కల్కి పత్రిక పట్టుకొని చదవటం మొదలుపెట్టాడు. "ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి కచేరీ అనంతరం ప్రధాని నెహ్రూ మాట్లాడుతూ.. 'ఈ సంగీత సామ్రాజ్ఞి ముందు నేనెంత.. ఒక మామూలు ప్రధానిని'" అంటూ చదువుతున్నాడు. అందరూ మొహం చిట్లించి, "ఒరేయ్ గోపీ అది ఎప్పటి పత్రికరా.. ఎప్పటిదో పాతది చదువుతున్నావేమోరా" అందరూ అడిగారు ఒకేసారి. "పాతది కాదు. ఈ వారందే. పోయిన నెలలో రామకృష్ణ మిషన్ కోసం కచేరీ చేసింది కుంజా. నెహ్రూ వచ్చారు ఆ కచేరీకి. అప్పుడు ఆయన చెప్పిన మాటలివి."

"సంగీత సామ్రాజ్ఞి ముందు నేనెవరిని... ఒక మామూలు ప్రధానిని" అందరూ ఇంకోసారి పైకి చదువుకున్నారు. ఈ మాట నెహ్రూ ఇది రెండవసారి అనటం. మొదటిసారిగా 1949లో అన్నాడు, మళ్లీ ఇప్పుడు 1953లో కూడా అన్నాడు.





వయోలిన్ విద్వాంసుడు యాహుది మెన్యూహిన్‌తో సుబ్బలక్ష్మి, సదాశివం, ముసిరి(సదాశివం ప్రక్కన)



వయోలిన్ విద్వాంసుడు యాహుది మెన్యూహిన్‌తో సుబ్బలక్ష్మి, రాధ

"ఆ.. దాని సంగీతం గురించి ఇంకెవరు ఏమన్నారురా" అడిగింది షణ్ముగవడివు.

"ఇంకా ఉపరాష్ట్రపతి రాధాకృష్ణన్ అన్నారత్తా."

"ఏమన్నార్రా?"

"శ్రీమతి సుబ్బలక్ష్మి పాట వినటం ఒక గొప్ప అనుభూతి. ఆమె శ్రోతలని ఎప్పుడూ తన్మయులని చేస్తారు. భగవంతుడు ఆమెకు ఇచ్చిన సంగీత వరాన్ని దేశ సేవకై వినియోగిస్తున్నారు" మౌనంగా విన్నది షణ్ముగవడివు. కాస్సేపాగి "ఏదీ ఇలా ఇవ్వు" అంటూ పత్రికను తీసుకొని మళ్లీ కూతురు గురించి చదువుకుంది.

సదాశివం మదురై కార్యక్రమాన్ని ఆపలేకపోయాడు. శక్తివేల్ గర్వంగా చెల్లెలి కచేరీ ఏర్పాట్లు చేసుకొనిపోతున్నాడు. "చొక్కనాథా! మా అమ్మాయికి బ్రహ్మాండంగా స్వాగతం పలకాలి, మా బావ అదిరిపోవాలి. మన స్వాగతానికి."

"నాయుడుగారూ! మా అమ్మకు ముందువరుసలోనే కుర్చీ వేయండి" అంటూ ఆనందంగా, గర్వంగా పనులు చేసుకుపోతున్నాడు.

ఆ రోజు రానే వచ్చింది. మదురైలో సద్గురు సంగీత సమాజం ఆధ్వర్యంలో పెద్ద పందిరి వేయబడింది. మదురై పురప్రముఖులు, ఇంకా ఎందరో ప్రముఖులు, పట్టలేనంత జనం వచ్చారు. అమ్మ ముందు కూర్చుంది. సుబ్బలక్ష్మి సంతోషించింది. కూతురు గురించి ప్రముఖులు గొప్పగా చెప్పి, సన్మానిస్తూ ఉంటే షణ్ముగవడివు ఉప్పొంగిపోయింది. కార్యక్రమంలోని భాగంగా , "ఇప్పటిదాకా మన ఊరి మాణిక్యాన్ని అందరూ తగువిధంగా సన్మానించారు. ఇప్పుడు ఈ మాణిక్యాన్ని మనకు ఇచ్చిన వారి తల్లిగారు శ్రీమతి షణ్ముగవడివుని శ్రీమతి సుబ్బలక్ష్మి సన్మానిస్తారు" అని అనగానే, ఒక నిర్వాహకుడు వచ్చి షణ్ముగవడివుని వేదికపైకి తీసుకువచ్చాడు. సుబ్బలక్ష్మి అమ్మ మెళ్లో పూలదండ వేసి, కాళ్లకు నమస్కారం చేసి పైకి లేచింది. తల్లీకూతుళ్లు ఆప్యాయంగా హత్తుకున్నారు. ఆ స్పర్శలో కోటి పలకరింపులు, వేయి ఓదార్పులు, పలు కబుర్లు. అమ్మ స్పర్శ అక్కడే ఒక్క క్షణం ఆగమంది. షణ్ముగవడివు తన మెడలోని పూలదండని తీసి సుబ్బలక్ష్మి మెడలో వేసింది, 'నువ్వే గెలిచావు నా చిన్నిమారాణి' అన్నట్లు. హర్షధ్వానాలు మిన్నంటాయి. మదురై తన మాణిక్యాలను చూసి మురిసిపోయింది. తర్వాత సుబ్బలక్ష్మి కచేరీ చేసింది. మొదటి పాట, 'సరోజ దళ నేత్రి హిమగిరి పుత్రీ, నీ పదాంబుజములనే సదా నమ్మినానమ్మా.' తన మధుర మీనాక్షి మీద పాట.

𝄞𝄞𝄞𝄞



ఢిల్లీలో రామకృష్ణ మిషన్ లబ్ధి కచేరీలో ప్రధాని నెహ్రూ నుంచి జ్ఞాపిక స్వీకరిస్తూ సుబ్బల

సదాశివం కల్కి కార్యాలయంలో ఉండగా సోదరులైన ఇద్దరు కర్ణాటక సంగీత విద్వాంసులు, సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ సిఫారుసు ఉత్తరం తీసుకుని వచ్చారు.

"ఇతను మా తమ్ముడు ఆత్మనాథన్, వీడికి మీరు ఉద్యోగం ఏదైనా చూపుతారని" సదాశివం ఆ కుర్రాడివైపు చూశాడు. తను చిన్నతనంలో ఉన్నట్లుగా ఉన్నాడు. ఏ పనైనా సాధించుకొచ్చే రకంలా ఉన్నాడు. "అలాగే, అయ్యంగారు చెప్పిన తర్వాత కాదనలేను. రమ్మనండి."

"వీడికి చాలా కోపమండి, ఎలా భరిస్తారో ఏమో" అని ఒక అన్న చెప్పాడు. ఇంకొక అన్న "మీకన్నా కోపిష్టోడండీ" అని, వెంటనే నాలుక కరుచుకున్నాడు. "ఆత్మనాథన్! ఈ రోజు క్రొత్త సంవత్సరం రోజు, క్రొత్త సంవత్సర శుభాకాంక్షలు. అయినా నీకు సెలవు ఇవ్వను. ఇప్పుడు నీకు చాలా ముఖ్యమైన పని, జాగ్రత్తగా చేయి."

"చేస్తానండి. చెప్పండి" అన్నాడు ఆత్మనాథన్, కొత్త ఉద్యోగం కొత్త ఉత్సాహంతో.

"మద్రాసు ప్రభుత్వం వారు, క్రొత్తగా ఏర్పరచిన పద్మపురస్కారాలకి సుబ్బలక్ష్మి పేరు సిఫారసు చేశారు. నువ్వు సుబ్బలక్ష్మి చేసిన లబ్ధి కచేరీలు, ఇప్పటిదాకా ఆమెకు వచ్చిన బిరుదులు అన్నీ చేర్చి, ఆమె పద్మభూషణ్ పురస్కారానికి ఎందుకు అర్హురాలో ప్రభుత్వానికి తెలియచెప్పేలా వ్రాయి."

"సర్, పద్మశ్రీకి వద్దా?"

"వద్దు, సుబ్బలక్ష్మి ఆ స్థాయి ఎప్పుడో దాటింది" నమ్మకంగా చెప్పాడు సదాశివం.

𝄞𝄞

1954 సంవత్సరం మొదటినుంచి సుబ్బలక్ష్మి పెద్దగా కచేరీలు చేయలేదు. ఎందుకంటే సదాశివంకు తీరిక లేదు. కృష్ణమూర్తి ఆరోగ్యం దెబ్బతింది. చాలా ప్రమాదకరంగా ఉంది పరిస్థితి. కృష్ణమూర్తి సాంఘిక నవలలు, చారిత్రాత్మక నవలలు, కథలు, సమీక్షలు కల్కి పత్రికకి ఆయువుపట్టు. ఎప్పుడు ఏమవుతుందో తెలియకుండా ఉంది కృష్ణమూర్తి పరిస్థితి. భయపడుతున్నట్లుగానే వార్త వచ్చింది. "కుంజా, పద. కృష్ణమూర్తికి ఏమీ బాగోలేదట" అంటూ సుబ్బలక్ష్మిని, పిల్లలందరినీ తీసుకొని సదాశివం కృష్ణమూర్తి ఇంటికి చేరాడు. చివరిసారిగా స్నేహితుడిని చూసుకున్నాడు. కాసేపట్లో భయపడినదల్లా జరిగిపోయింది. కృష్ణమూర్తి భార్య రుక్మిణి, కూతురు ఆనంది, కొడుకు రాజేంద్రన్‌లకు ధైర్యం చెప్తూ దగ్గరుండి అన్ని పనులు చూసుకున్నారు సుబ్బలక్ష్మి, సదాశివం.



రాధకు ఇప్పుడు నిండు ఇరవైఏళ్లు. ముమ్మరంగా పెళ్లి ప్రయత్నాలు చేస్తున్నాడు సదాశివం. రాధ పాదరసంలాంటి బుర్రతో పుట్టింది. సంగీతంలోని గమకాలు, సంగతులు ఇట్టే పట్టేస్తుంది. సంగీతజ్ఞులు తిశ్ర, చతురశ్ర, మిశ్ర అంటూ లెక్కలు వేసుకుంటుంటారు. రాధకు ఆ లెక్కలతో పని లేదు వినగానే పట్టేస్తుంది. ఇక అవి అలానే గుర్తుండిపోతాయి. గత ఐదు సంవత్సరాల నుంచి సుబ్బలక్ష్మికి గాత్రసహకారం అందిస్తుంది. రాధ పెళ్లి చేసినా సుబ్బలక్ష్మికి అందుబాటులో ఉండాలనే ఆలోచనలో ఉన్నాడు. సదాశివం ఎదురుచూస్తున్న జ్యోతిష్కుడు కవిసెరి సుబ్రహ్మణ్యశాస్త్రి వచ్చాడు. "చాలా సంబంధాలు చూశాను. ఏవీ కుదరలేదు."

"అమ్మాయి జాతకం ప్రకారం ఇంకొంచెం సమయం పడుతుంది. ఆదుర్దా పడకండి. ఈలోపల అద్భుతాలు జరుగుతాయి. మిమ్మల్ని చూసి ఇతరులు ఈర్ష్యపడతారు" సర్దిచెప్పాడు శాస్త్రి. ఆయనను సాగనంపుతుండగా కల్కి బిల్డింగ్స్‌లోకి కారు వెనక కారు దుమ్ములేపుకుంటూ లోపలికి వస్తున్నాయి. గేటు దగ్గర గూర్ఖా కారులని లెక్కపెడుతున్నట్లు ఒక్కో కారు లోపలికి వస్తుంటే చూస్తున్నాడు.

మొదట జీపులోంచి పోలీసులు దిగారు. వెనక కారు దగ్గరకు వెళ్లి కారు డోరు తీయగా ప్రధాని నెహ్రూ కారుల్లోంచి దిగాడు. మిగతా కారుల్లోంచి మద్రాసు కాంగ్రెసు నాయకులు దిగుతున్నారు. కార్లు రేపిన దుమ్ము సద్దుమణుగుతుంది. విషయం గ్రహించిన సదాశివం, సంభ్రమాశ్చర్యాలలోనుంచి బయటపడి, "శాస్త్రిగారూ, మీరు చెప్పిన అద్భుతాలు ఇప్పుడే జరిగిపోతున్నాయి" అనుకుంటూ నెహ్రూకి స్వాగతం పలకటానికి ఎదురువెళ్లాడు. నెహ్రూని సాదరంగా ఆహ్వానించి, పైకి తీసుకువెళ్లి అతిథి మర్యాదలు చేశాడు. ప్రధాని నెహ్రూ ఎలాంటి సందేశం లేకుండా ఠక్కున ఊడిపడటం చూసి సుబ్బలక్ష్మికి నోట మాట రాలేదు. ఆయన ఆవడి కాంగ్రెస్ మహాసభకు వెళ్తూ ఇంకా సమయం ఉందని సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చాడు. రాధతోసహా అందరినీ పలకరించి, కృష్ణమూర్తి కుటుంబాన్ని పరామర్శించాడు. నెహ్రూ ఆవడికి బయలుదేరి వెళ్లాడు. అందరూ వెళ్లిన తర్వాత "ఆత్మనాథన్!" కేకేశాడు సదాశివం.

"సర్, పత్రిక ప్రింటింగ్ ఆపాను, ముఖచిత్రం నెహ్రూగారిది వేద్దామా" సదాశివం ఆలోచనల్ని అందుకున్నాడు ఆత్మనాథన్.

𝄞𝄞𝄞

1955కల్లా కల్కి తమిళనాట అత్యంత ప్రజాదరణ పొందిన పత్రికే కాక అన్ని ప్రాంతీయ భాషల్లోకంటే ఎక్కువగా అచ్చువేయబడుతున్న పత్రిక. సదాశివం, కృష్ణమూర్తి లేమిలో కూడా ఈ పేరు నిలబెట్టుకోవాలనే ప్రయత్నంలో ఉన్నాడు. రాజగోపాలాచారి

ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసి ఒక సంవత్సరం కావొస్తుంది. సంఖ్యాబలం చూపి కొత్త తరం ఈ డెబ్బై ఏళ్ల పాత తరం మనిషిని పదవీచ్యుతుడిని చేసింది. "పోతన్! పద, మనమిద్దరం రాజాజీ దగ్గరకు వెళ్లి, మన పత్రికకు ప్రతి నెలా సంపాదకీయం రాయమని అడుగుదాం."

"మంచి ఆలోచన సర్" అన్నాడు పోతన్ జోసఫ్, కల్కి పత్రికకు వ్యాసాలు వ్రాసే విలేఖరి.

"నేనిప్పుడే బట్టలు మార్చుకొని వస్తాను" అని చెప్పి పైకి వచ్చాడు. "రాధా, నేను ఇందాక నీకు గుండీ కుట్టమని ఒక చొక్కా ఇచ్చాను. అది తీసుకురా." అని కూతుర్ని పిలిచాడు.

రాధ భయంగానే వచ్చింది. "మర్చిపోయాను నాన్నా, కుట్టలేదు."

"కుట్టలేదా" కోపంతో ఊగిపోతున్నాడు సదాశివం. "కుట్టలేకపోతే నాకు ముందే చెప్పాలి. నేను కుట్టుకుంటాను." ఈ మాటతో మొదలుపెట్టి నానాతిట్లూ తిడుతున్నాడు. ఆ తిట్లు విని సుబ్బలక్ష్మి పరుగుపరుగున వచ్చింది. ఏడుస్తున్న రాధను దగ్గరకు తీసుకుని "ఎదిగిన పిల్ల తిట్టకండి" అంది.

"నువ్వు నాకు చెప్పేదానివా?" ఇప్పుడు సుబ్బలక్ష్మి వంతు. ఇద్దరినీ తిట్టితిట్టి అలసిపోయి, ఇంకా కోపం పోక ఆ చొక్కా తీసుకొని ముక్కలుముక్కలుగా చించి, కిందకు కొట్టి వెళ్లిపోయాడు. సదాశివంతో పెళ్లికి ఒప్పుకున్నరోజునే సుబ్బలక్ష్మి వీటన్నిటికీ సిద్ధపడింది.

𝄞 𝄞

కల్కి కార్యాలయం విలేఖరులతో నిండిపోయింది. "మిత్రులారా, శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిని భారత ప్రభుత్వం పద్మభూషణ్ పురస్కారంతో సత్కరించింది. ఈ వార్త మాకు నిన్ననే అందింది" అని ప్రకటించాడు సదాశివం. "మీరు కాఫీ టిఫిన్లు చేస్తూ ఉండండి, సుబ్బలక్ష్మి వస్తారు. మీరు ఫోటోలు తీసుకోవచ్చు. ఎలాంటి ఇంటర్వ్యూలూ చేయవద్దు" హెచ్చరించాడు సదాశివం.

"తంబీ! ఇది రాజాజీ, నెహ్రూ చేసిన పని. సుబ్బలక్ష్మి కంటే పట్టమ్మ బాగా పాడుతుంది"

"ఇల్లై అణ్ణా, సుబ్బలక్ష్మి పాటకి, మీరా సినిమాకి, లబ్ధి కచేరీలకీ ఇచ్చారు. ఆమె అర్హురాలే."





కల్కి బంగ్లాకు విచ్చేసిన ప్రధాని నెహ్రూ



ప్రధాని నెహ్రూని సాగనంపుతున్న సుబ్బలక్ష్మి, సదాశివం, రాధ, తంగం

1955 ... భారత ప్రభుత్వ పద్మభూషణ్ పురస్కారాన్ని అందుకుంది సుబ్బులక్ష్మి. హెచ్.ఎమ్.వి. వారు, రసజ్ఞులు ఇచ్చిన కోకిలగాన, తమిళ్ ఇసై ఇచ్చిన ఇసైవాణి, ఈ పద్మభూషణ్ ముచ్చటగా మూడవ బిరుదు. బిరుదుల బహూకరణ కార్యక్రమానికి ఎందరో ప్రముఖులు విచ్చేశారు. అందరినీ అమితంగా ఆకర్షించింది సుబ్బులక్ష్మి మాత్రమే. కార్యక్రమానికి విచ్చేసిన ప్రముఖుల్లో హెలెన్ కెల్లర్ ఒకరు. ఆ మరుసటిరోజు సదాశివం తన హోమ్‌మినిస్టర్‌ని పిలిచాడు.

"ఏమిటి మామయ్యా" అంటూ వచ్చింది తంగం.

"తంగం, రేపు మనింటికి హెలెన్ కెల్లర్ వస్తారు."

"పిలిచేశారూ ఆమెని కూడా."

"ఆమె ఎంత గొప్పామో నీకు తెలుసా?"

"సరేలే మామయ్యా, భోజనానికి ఆమెతోపాటు ఎంతమంది వస్తారో చెప్పు.'

"ఒక నలభై మందిని వేసుకో."

"సరే మామయ్యా, ఏర్పాటు చేస్తాను" అంటూ తంగం వెళ్లిపోయింది. రెండురోజుల తర్వాత హడావుడి అంతా తగ్గిన తర్వాత సుబ్బులక్ష్మి తన గదిలో కూర్చొని అమ్మకు ఉత్తరం వ్రాయటం మొదలుపెట్టింది.

ప్రియమైన అమ్మ,

నీకు నా నమస్కారములు. మేమంతా ఇక్కడ కుశలమే. మీరు కూడా కుశలమని భావిస్తున్నాను.

నీ ఉత్తరం చేరింది. మొన్న పదకొండవ తేదీన గవర్నర్ శ్రీప్రకాశ గారు నా పద్మభూషణ్ పతకం, ప్రశంసాపత్రం బహూకరించారు. ఎంతోమంది ప్రముఖులు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. ప్రశంసాపత్రంలో నా పేరు మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి అని వ్రాసి ఉంది. గవర్నర్ శ్రీప్రకాశ మాట్లాడుతూ, ఆయన, ఇంకా యావత్తు మద్రాసు, నాకు ఈ పురస్కారం ఇస్తున్నందుకు సంతోషిస్తున్నారని చెప్పారు. అమెరికా నుంచి ఒక గొప్ప వ్యక్తి, హెలెన్ కెల్లర్ అని, ఆమె చూడలేదు, వినలేదు, కానీ ఎన్నో భాషలు వచ్చు. తనలాంటివాళ్లకి ఎందరికో సాయం చేసింది, ఆమె కూడా కార్యక్రమానికి వచ్చారు. ఆమె నా మొహాన్ని తట్టితట్టి చూసి, నా గొంతు విని, నీది చాలా అందమైన మొహం, నీ గొంతు కూడా చాలా తియ్యగా ఉంది అని చెప్పింది. ఆ తర్వాత నేను, రాధ శ్రీరంగపుర విహార పాట పాడాము. మనము ఈసారి కలుసుకున్నప్పుడు నీకు నా పతకం చూపిస్తా. ఈ ఉత్తరం మామకి, అన్నకి చూపించు. మామకి, అన్నకి నా



నమస్కారాలు చెప్పు. లక్ష్మిని, శాంతిని, వసంతని అడిగానని చెప్పు. నేను వాళ్లకి చీరలు, లంగాలు తెస్తాను. రాధ, విజ్జి, తంగం మిమ్మల్ని అడిగానని చెప్పమన్నారు. మా ఆయన కూడ. ఇంతే సంగతులు ఇప్పటికి. నీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూ...

నీ ప్రియమైన కూతురు కుంజ.

తృప్తిగా అమ్మకు ఉత్తరం వ్రాసుకుంది. అర రావులో ఆరు నెలలకి సరిపడా ప్రేమ కురిపించేసింది. తన పేరులో ఇంకా తల్లి పేరు ఉందని ఆనందంగా చెప్పుకుంది. తలెత్తేసరికి పిల్లలంతా చుట్టూ ఉన్నారు. ఉత్తరాన్ని నోటీతో అందించి పక్కనపెట్టి పిల్లలపైపు చూసింది. ఒక విషయం వాళ్లని తొలిచేస్తుంది. 'ఏంటీ' అన్నట్లు చూసింది సుబ్బులక్ష్మి.

"అమ్మా! హెలెన్ కెల్లర్ చూడలేదు, వినలేదు, మరి భాష ఎలా నేర్చుకుంది?"

"నాన్నని అడుగుదాం పదండి" అంటూ సదాశివం దగ్గరకు వెళ్లారందరు. వెన్నెల రాత్రి, కల్కి బంగ్లా పై అంతస్తు వరండాలో సదాశివం ముందు అందరూ కూర్చున్నారు.

"తపన, పట్టుదల, మీ అమ్మను చూడండి, ఎంత తపనతో సంగీతం నేర్చుకుంటుందో. అలానే" చెప్పాడు సదాశివం.

సుబ్బులక్ష్మి తపనతో సంగీత సాధన చేస్తూనే ఉంది. నిరంతర అభ్యాసి. సుబ్బులక్ష్మి తపనకు తగ్గట్టుగా సదాశివం గురువులని ఏర్పాటు చేస్తున్నాడు. అందులో మొదటివారు సెమ్మంగుడి శ్రీనివాస్ అయ్యర్. తర్వాత ముసిరి, అరియక్కుడి. ఒకరోజు సెమ్మంగుడి సుబ్బులక్ష్మి ఇంటినుంచి బయటకి వస్తున్నాడు. ముసిరి ఎదురయ్యాడు. "ఏంటి ముసిరీ ఇప్పుడు నీవంతా. వెళ్లు వెళ్లు" అన్నాడు సెమ్మంగుడి. "మీ పాఠం అయ్యిందా. మీ పాట నేర్పారా?" అడిగాడు ముసిరి. "ఇంకెక్కడ నా పాట, ఒకసారి పాడి వినిపించాను. మొత్తం పట్టేసింది. అచ్చం నాలాగే పాడుతుంది, రేపటికి నాకు మించిపోతుంది. ఇక నువ్వు నీ పాటని సమర్పించుకో పో" అంటూ ముసిరిని పంపాడు సెమ్మంగుడి. మదురై నుంచి వచ్చిన తర్వాత సినిమా పాటలు నేర్చుకోవటంలోనే పదేళ్లు గడిచిపోయాయి. కర్ణాటక సంగీతం కోసం సుబ్బులక్ష్మి మనసు తహతహలాడిపోతుంది. పైగా మద్రాసులో గొ... విద్వాంసులందరి పరిచయ భాగ్యాలు సుబ్బులక్ష్మికి దక్కాయి. వాళ్లు నోరు తెరిస్తే చాల... స్వర, తాళాలను లెక్కపెట్టేస్తుంది. రాగ, శ్రుతిలయలను ఇట్టే పట్టేస్తుంది.

𝄞𝄞𝄞𝄞

1955కల్లా మద్రాసులో డజనుకి తక్కువ లేకుండా సంగీత సభలు ఉన్నా... కానీ, వీటన్నింటిలోకి మద్రాసు మ్యూజిక్ అకాడమీకి ప్రత్యేకమైన స్థానం. మొట్టమొ... స్థానం. కర్ణాటక సంగీతపు విలువలని కాపాడేందుకు కంకణం కట్టుకుంది. మొదటిన... విద్యాధికులు, సంపన్నులు, ఉన్నతోద్యోగులు కనుసన్నల్లో నడుస్తుంది. ఈ సంగీ...



ల్కి బంగ్లాకు విచ్చేసిన హెలెన్ కెల్లర్‌తో తంగం, సుబ్బలక్ష్మి , రాధ, ఆనంది, విజయ



1942 నుంచి బహూకరిస్తూ వస్తున్న సంగీత కళానిధి అనే బిరుదు కర్ణాటక సంగీత ప్రపంచానికి 'నోబుల్ బహుమతి'లాంటిదయ్యింది. మద్రాసు మ్యూజిక్ అకాడమీ 'సంగీత కళానిధి' అని ఒక విద్వాంసుడికి రాజముద్ర వేస్తే, ఇక ఆ విద్వాంసుడి జన్మ ధన్యమయినట్లే. అంతటి మద్రాసు మ్యూజిక్ అకాడమీ సొంత భవనం లేక కొన్ని సంవత్సరాలు మైలాపురంలోని సుందరేశ్వర హాలు, కొన్ని సంవత్సరాలు పి.ఎస్. హైస్కూలులో బంగళాలో అద్దె చెల్లించి సభలు నిర్వహిస్తున్నారు. ఈ సంవత్సరంలోనే స్థలం కొనగలిగారు, అందులో కార్యాలయం నడిపిస్తున్నారు. ఆ కార్యాలయంలో, "కృష్ణమాచారిగారూ! అకాడమీకి భవనం పనులు ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా మొదలుపెట్టాలి" చెప్పాడు అకాడమీ ప్రస్తుత చైర్మన్ కృష్ణస్వామి.

"మొదలుపెట్టాలి, మనకంటే వెనుక మొదలయిన తమిళ ఇసై వాళ్లు బ్రహ్మాండమైన భవనం కట్టుకున్నారు" అన్నాడు సెక్రటరీ అయిన రాఘవన్.

"అవును. మనము కూడా తప్పకుండా ఈ స్థలంలో మంచి భవనం కడదాం" అన్నాడు రాజకీయ నాయకుడు కృష్ణమాచారి. ఇంతలో సదాశివం వస్తూ కనిపించాడు. "కృష్ణస్వామీ, సదాశివం వస్తున్నాడు, భవనం కోసం నిధులు సేకరించటానికి ఎమ్.ఎస్. కచేరీ అడుగుదాం. మీరెవ్వరూ తమిళ ఇసైకి అప్పుడే భవనం ఏర్పడిందని ఆయన ముందు ఏడవద్దు" అని హెచ్చరించాడు. పలకరింపులు అయిన తర్వాత "ఇవిగోండి రెండు వేల ఐదొందలు. తమిళ విభాగంలో మొదటి బహుమతి వచ్చినవారికి కల్కి పత్రిక తరుపున ఒక తంబూర కొని బహూకరించండి" తమిళ అనేదాన్ని నొక్కి పలుకుతూ చెప్పాడు సదాశివం. "చాలామంచిది సదాశివంగారూ, మీతో ఒక విషయం మాట్లాడాలి.. మేమే మీ ఇంటికి వచ్చి మాట్లాడాలి కానీ ఇదిగో ఇప్పుడే అనుకున్నాము, ఏంటంటే, మ్యూజిక్ అకాడమీ కోసం ఒక భవనం ఏర్పాటు చేయదలుస్తున్నాం. దానికి నిధుల కోసం ఎమ్.ఎస్. గారు ఒక కచేరీ చేస్తే చాలా ఉపయోగపడుతుంది" విన్నవించుకున్నాడు కృష్ణస్వామి. తనని ఒకప్పుడు వెలివేసిన మ్యూజిక్ అకాడమీ వాళ్లే ఇప్పుడు తన సాయంకోసం ప్రాధేయపడుతుంటే, సదాశివం తనదే మళ్లీ పైచేయి అయినందుకు విజయ గర్వంతో సరేనన్నాడు.

అక్టోబర్ ఐదున నెహ్రూ, ఇందిరాగాంధీ మద్రాసు వచ్చారు. సాయంత్రం మ్యూజిక్ అకాడమీ భవనానికి శంకుస్థాపన చేశాడు నెహ్రూ. ఆ తర్వాత వెంటనే ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి కచేరీ మొదలయింది. కచేరీ జరుగుతున్నప్పుడు, సుబ్బలక్ష్మి ఒక కృతి పాడుతున్నప్పుడు నెహ్రూ ఆ ప్రాంగణంలోకి అడుగుపెట్టాడు. సుబ్బలక్ష్మి తనకు ఇప్పటిదాకా నెహ్రూ ఇచ్చిన పొగడ్తలకు కృతజ్ఞతాభావం, తను చెప్పగలిగిన రీతిలో

అక్కడ అకాడమీ సభ్యుల ముందు, "ఎవరైనా ఒక ముఖ్యమైన కచేరీ ఉంటే ఏరి కోరి సంగీత కళానిధి బిరుదు ఉన్న విద్వాంసుడితో కచేరీ చేయిస్తారా.. లేదా నా ముందు పాటలు నేర్చుకున్న ఆడమనిషితో పాడిస్తారా?"

నిజమే అరియక్కుడి రామానుజ అయ్యంగారికంటే అనుభవం ఉన్న కర్ణాటక సంగీత విద్వాంసులు ఈ రోజున లేరు. కానీ అరియక్కుడి వారు కచేరీ చేసుంటే రెండు లక్షల రూపాయలు చేకూరేవి కాదు. సుబ్బలక్ష్మి కచేరీకి ఉన్న ప్రజాదరణ అది. అకాడమీ సభ్యులు సముదాయించి చూశారు. అరియక్కుడి స్థిమితపడలేదు. "ఇక నేను ఈ సభకు పాడను" అని తెగేసి చెప్పి వెళ్లిపోయాడు.

§§

సుబ్బలక్ష్మికి ఉన్న ప్రజాదరణని ఇంకొక మంచి పని కోసం వినియోగించటానికి నెహ్రూ తన భార్య పేరిట నెలకొల్పిన కమలానెహ్రూ మెమోరియల్ ఆసుపత్రికి లబ్ధి కచేరీ చేయమని పిలిచాడు. సుబ్బలక్ష్మి బృందం ఢిల్లీ బయలుదేరి వెళ్లింది. సుబ్బలక్ష్మి సదాశివం నెహ్రూ ఇంట్లో ఆతిథ్యం పొందారు. ఢిల్లీ నుంచి వచ్చిన తర్వాత అందరితో చెప్పుకుంటున్నాడు సదాశివం. "మమ్మల్ని నెహ్రూ ఆయన కూతురు ఇందిర ఎంత బాగా చూసుకున్నారనీ.. నన్నయితే, 'అల్లుడూ, నువ్వు అది తిన్నావా.. ఇది తిన్నావా.. అంటూ పక్కన కూర్చొని వడ్డించేవాడు. సుబ్బలక్ష్మిని అయితే 'సుబ్బలక్ష్మి నువ్వు అది తినకు..ఇది తినకు.. నీ గొంతు పాడవుతుంది' అని జాగ్రత్తలు చెప్పేవాడు. వచ్చిన అందరితో చెప్పుకొని మురిసిపోతున్నాడు. సుబ్బలక్ష్మి అమ్మకి ఉత్తరం రాసుకొని ప్రపంచానికంతా చెప్పినంత మురిసిపోయింది.

ప్రొద్దున్నే లేచి, తయారయి ఇంకా కల్కి కార్యాలయానికి ఎవ్వరూ రాకముందే కార్యాలయంలో కూర్చొని దినపత్రికలు చదువుతున్నాడు సదాశివం. ఒక వార్త దగ్గర తన చూపు ఆగింది. ఆ వార్తను మళ్లీ చదివాడు. సంతోషంతో పైకి వచ్చి, "కుంజా, నీకు ప్రభుత్వం సంగీత నాటక పురస్కారం ఇచ్చింది. నాకు తెలిసి ఇప్పటిదాకా మొట్టమొదటిసారి అరియక్కుడికి ఇచ్చారు. తర్వాత మన సెమ్మంగుడి గారికి, ఆ తర్వాత మైసూరు వాసుదేవాచారికి, మహారాజపురం విశ్వనాథ అయ్యర్‌కి తర్వాత నీకే కుంజా." సుబ్బలక్ష్మి కళ్లు చెమ్మగిల్లాయి. "ఈ నలుగురి తర్వాత తనకా" అనుకుంది. ఇంకా గొప్ప విద్వాంసులైన ముసిరి ఉన్నారు, చెంబై వైద్యనాథ్ భాగవతార్ ఉన్నారు, ఇంకా కొంతమంది ఉన్నారు. వీరికంటే ముందు ప్రభుత్వం తనను ఎంచుకోవటంతో కాసేపు ఏమీ మాట్లాడలేకపోయింది. ఆ తర్వాత "మామ, ఇవన్నీ మీవల్లే" అంటూ ఆనందబాష్పాలు రాల్చింది. ఏం చేశాడు సదాశివం.. గానం ఆమెది, గాత్రం ఆమెది. కానీ సుబ్బలక్ష్మి అనే కలకంఠి ఉన్నదని



దేశం నలుమూలలా దండోరా వేశాడు. 1944 నుంచి లబ్ధి కచేరీలతో, 1947 దాకా సినిమాలతో.

§§

రాధకు ఇంకా పెళ్లి సంబంధం కుదరలేదు. సదాశివంకు ఈ విషయం చాలా బాధగా ఉంది. బొంబాయి తమిళ సంఘానికి లబ్ధి కచేరీ చేసి తిరిగి వచ్చిన తర్వాత సుబ్బలక్ష్మికి జ్వరం మొదలయ్యింది. అది రెండురోజులకి టైఫాయిడ్ అని తేలింది. వాళ్లు కాలిపోయే జ్వరంతో సుబ్బలక్ష్మి కాలు కిందపెట్టలేకపోతుంది. రాజాజీ రోజూ వచ్చి, "కుంజమ్మకు జ్వరం లేదు ఈ రోజు" అని ఉత్సాహపరిచే ప్రయత్నం చేస్తున్నాడు. ముసిరి, సంగీతం ఆరోగ్యం చేకూరుస్తుందనే నమ్మకంతో సుబ్బలక్ష్మికి సంగీతం వినిపిస్తున్నాడు.

**ఏమో కలత చెంది మనమున**
**నేనెచట గతి కానకను**
**నీ మహిమలెల్ల చెవులారగ విని**
**ఈ మనసులోని వెత తీర్చుటకి**
**ఈవేళ బహునిపుణవని**
**కామాక్షి నీవే వేరెవరు కాదని తలచి కొలిచితిని**
**దురుసుగా కృపజూచి, సంతతమురోగ దృఢ శరీరము సలుపుము**

*శ్యామశాస్త్రి కృతి, రాగం- సావేరీ, తాళం- ఆది*

రాధ చిన్నప్పుడు ఒకసారి బడిలో 'కింగ్' అనే ఆంగ్ల పదాన్ని సొంత వాక్యములో ఉపయోగించమని చెబితే, 'మై ఫాదర్ ఈజ్ ఎ కింగ్' అని వ్రాసింది. రాధ ఏమి చూసిందో అదే వ్రాసింది. సదాశివం పెద్ద బంగ్లాలో అష్టైశ్వర్యములు, అష్టభోగములు అనుభవిస్తున్నాడు. ఈ రాజప్రాసాదం నుంచి ముందు సదాశివం తల్లి కాశీకి వెళ్లిపోయింది. ఆ తర్వాత వ్యవహారాల్లో దారిచూపిన టి.కె. చిదంబరం చాటుకి వెళ్లిపోయాడు. రాజ్యానికి సైన్యాధికారి అయిన కృష్ణమూర్తి అకాలంగా కాలం చేశాడు. రాజగురువు రాజాజీ పదవీచ్యుతుడయి ఉన్నాడు. అయినా రాజ్యం ఇంకా నిలబడిందంటే దానికి కారణం ఈ రాజ్యం యొక్క మహారాణి సుబ్బలక్ష్మి. సదాశివంకి పట్టుగొమ్మ సుబ్బలక్ష్మి. అలాంటి సుబ్బలక్ష్మి పదిరోజుల పైన మంచంలో ఉంటే సదాశివంకి కాళ్లు చేతులు ఆడటంలేదు.

"అయ్యర్‌గారూ.. ఒకప్రక్క రాధకి సంబంధం కుదరటంలేదు. మరోప్రక్క కుంజమ్మకి ఇలా" అంటూ సెమ్మంగుడి దగ్గర బాధపడుతున్నాడు సదాశివం. "బాధపడకండి, నేను మీ ఇద్దరినీ కంచి పరమాచార్య వారి వద్దకు తీసుకువెళ్తాను. వారు అనుగ్రహిస్తే, అన్ని

కష్టాలు తీరిపోతాయి." సదాశివం సరేనన్నాడు కానీ తన భయాలు బయటపెట్టాడు. "అంతటివారు నన్ను అనుగ్రహిస్తారా?" "తప్పకుండా." "మరి కుంజమ్మని?" "ఆయన సనాతనవాదే.. కానీ అన్నీ తెలిసిన జ్ఞాని. ముందు మనం దర్శించుకుందాం." ఆయన అన్నీ తెలిసిన జ్ఞాని కాబట్టి సదాశివం ఇంకా భయపడుతున్నాడు.

కంచి పరమాచార్య చంద్రశేఖరేంద్ర సరస్వతి కారణజన్ములు. భారతీయ ధార్మిక గ్రంథాలను, తత్వశాస్త్రాలను, గణితం, ఇతర వాఙ్మయం ఆపోశనపట్టిన జ్ఞాన సింధు. సత్యాసత్య, నిత్యానిత్య విచక్షణ పొందినవారికి సౌఖ్యాల మీదకి మనసు పోదు. ఆయన నివాసం కంచిలోని కామకోటి పీఠం ఆవరణలో ఒక పర్ణశాల. ఎంత దూరపు ప్రయాణమైనా కాలి నడకన వెళ్తారు. ఎక్కడ మజిలీ అయినా అక్కడ బస గోశాలల ప్రక్కనే, ఒంటిపూట భోజనం, మితమైన వస్త్రాలు, భారతీయ ఋషి పరంపర గతించిన మాటలని అనుకుంటున్న తరుణంలో పరమాచార్య భారతావనికి దారిచూపటానికి అవతరించారు.

పరమాచార్య ముందు భయభక్తులతో నమస్కరిస్తూ నిలబడ్డారు. ప్రాపంచిక విషయాలను దాటి వచ్చిన పరమాచార్యకు సంఘ కట్టుబాట్లు, కంచి కామకోటి పీఠం యొక్క ఆచారాలను పాటించాల్సిన బాధ్యత ఆయనపై ఉంది. పరమాచార్య ముందుగా సుబ్బలక్ష్మివైపు చూశారు. వెంటనే తన సహాయకుడిని పిలిచి అతని చెవిలో ఏదో చెప్పారు.

ఆ సహాయకుడు వచ్చి సదాశివం, సుబ్బలక్ష్మిని బయటకు తీసుకువచ్చాడు. సదాశివంకు ఒక విషయం చెప్పాడు. వెంటనే సదాశివం సుబ్బలక్ష్మిని తీసుకొని విడిదికి వెళ్లిపోయాడు. 'కుంజా తొందరగా మార్చుకో...' అని చెప్పాడు. సుబ్బలక్ష్మి ఇప్పటిదాకా తను కట్టుకున్న తమిళ అయ్యర్ స్త్రీల చీరకట్టును మామూలు చీరకట్టుగా మార్చుకున్న తర్వాత మళ్లీ పరమాచార్య ముందు నిలబడ్డారు. ఇప్పుడు మారిన చీరకట్టుతో ఉన్న సుబ్బలక్ష్మిని చూస్తున్నారు పరమాచార్య. ఆమె ఎలాంటిదో ముమ్మందు చెప్పనున్నారుకానీ..... ప్రస్తుతానికి కంచి కామకోటి పీఠం యొక్క ఆచారాల ప్రకారం, 'ఆమె పూర్తి బ్రాహ్మణురాలు కాదు కాబట్టి ఆ మడిశార్ ఇక్కడ కట్టుకోకూడదు' అనే నియమంవైపు మొగ్గుచూపారు.

ఇప్పుడు సదాశివంవైపు తిరిగారు పరమాచార్య. తీక్షణంగా చూస్తున్నారు. సంఘ కట్టుబాట్లు, కామకోటి పీఠం దృక్పథం నుంచి మాత్రమే కాదు... నైతిక విలువల కోణం నుంచి కూడా, 'సుబ్బలక్ష్మి ఒక బ్రాహ్మణుడి పంచన చేరి తన కుల ధర్మం పాటించింది, నువ్వు నీ కట్టుకున్న భార్యని వదిలేసి, నీ ధర్మం తప్పావు.' ఇది పరమాచార్య చూపుల భావన. పరమాచార్య చూపులు తాళలేక సదాశివం తన తప్పెరిగి తల దించుకున్నాడు. కొన్ని సంభాషణల తర్వాత సుబ్బలక్ష్మి సదాశివంలను దీవించి పంపారు పరమాచార్య.



కంచి పరమాచార్యుని దీవెనలవల్ల సుబ్బలక్ష్మి త్వరగా కోలుకుంది. అంతకంటే ఆనందించదగ్గ విషయమేమిటంటే రాధకు పెళ్లి కుదిరింది.

రాధకు పెళ్లి కుదరటంతోనే సదాశివం, తన మిత్రుడు కృష్ణమూర్తి భార్య రుక్మిణి దగ్గరకు వచ్చాడు. "కుంజా చెప్పు. కాదు. అడుగు రుక్మిణిని."

"రుక్మిణీ చెప్పు, నీకేమీ అభ్యంతరం లేదుకదా. మీ అబ్బాయిని విజయకు ఇచ్చి పెళ్లి చేయటానికి" అడిగింది సుబ్బలక్ష్మి. ఇప్పటికే తన మేనల్లుడు అంబిని కృష్ణమూర్తి, రుక్మిణి కూతురు అయిన ఆనందికి ఇచ్చి పెళ్లిచేసి, తన ఇంటికి తెచ్చుకున్నాడు. ఇప్పుడు తన కూతురుని రుక్మిణికి తోడుగా పంపుతానంటున్నాడు. ఇది సదాశివం తనకు, తన మిత్రుడు కృష్ణమూర్తికి ఇచ్చుకున్న మాట. రుక్మిణి కాదంటేతప్ప తన కూతురుని వేరొకరికి ఇవ్వనని నిర్ణయించుకున్నాడు ఎప్పుడో. రుక్మిణి, రాజేంద్రన్ ఇద్దరూ తమ ఇష్టం తెలిపారు. ఒకేరోజున కల్కి బంగ్లాలో పెద్ద పందిరిలో రాధ, విజయ ఇద్దరి పెళ్లి ఒకేసారి ఘనంగా చేశాడు సదాశివం. ఇందులో కూడా తన వైవిధ్యభరితమైన పనితనం చూపాడు సదాశివం. దీనికి ముందు కంచి పరమాచార్య ఆశీస్సులు పొంది వచ్చారు సుబ్బలక్ష్మి సదాశివం. ఈ శుభకార్యంలో సెమ్మంగుడి శ్రీనివాస్ అయ్యర్ కచేరీ చేశాడు. సుబ్బలక్ష్మి ప్రక్కనే కూర్చున్న రాధ అత్తగారు, "వదినా, వీళ్ల నాన్న వీడి పెళ్లిలో మీ కచేరీ పెట్టిస్తానని అనేవారు ఎప్పుడూ. ఈ సమయంలో కనుక ఆయన ఉండి ఉంటే ఎంత సంతోషించేవారో" అంటూ కళ్లు తుడుచుకుంది.

యాభైమూడేళ్ల సదాశివం పిల్లల పెళ్లిళ్లు చేసి, సగం బాధ్యతలు తీర్చుకున్నాడు. సుబ్బలక్ష్మికి ముప్పైతొమ్మిదేళ్లు. సదాశివం నడివయస్సు ఆఖరి మజిలీలో ఉండి, వృద్ధాప్యం గుమ్మం దగ్గర ఉన్నా అతనిలో చేవ ఏమాత్రం తగ్గలేదు. అదే యుద్ధ కుతూహలంతో ముందుకు వెళ్తున్నాడు. రామకృష్ణా మిషన్ భవనం కోసం నిధులు సమకూర్చటానికి శ్రీలంకలోని జాఫ్నాలో సంవత్సరాంతంలో మూడు కచేరీలు ఖాయం చేశాడు. ఈ లోపల మద్రాసులో పెళ్లిళ్ల కాలం కాబట్టి పెళ్లి ఇండ్లలో కచేరీ పిలుపులు ఉంటాయి సుబ్బలక్ష్మికి. మద్రాసులో ప్రతి ఒక్కరూ తమ ఇంట సుబ్బలక్ష్మి కచేరీ కావాలనుకుంటారు. ముఖ్యంగా పెళ్లిళ్లకి సుబ్బలక్ష్మి కచేరీ పెట్టటం అంటే గొప్ప విషయం. ఆడపెళ్లివారు గర్వంగా చెప్పుకునే విషయం. కానీ సుబ్బలక్ష్మి అందరికీ అందుబాటులో ఉండకుండా చేశాడు సదాశివం. రాధ మామగారు, వారి అబ్బాయి వివాహం రాధతో కాకుండా వేరొకరితో జరుపుతూ, సుబ్బలక్ష్మి కచేరీ కోరితే అది తీరని కోరికే అయ్యేది ఆయనకు. సదాశివం అత్యంత ధనవంతులకే మొదటి అవకాశం ఇస్తాడు. తర్వాత అవకాశాలు వాళ్లకే, చివ అవకాశాలు అత్యంత ధనికులకే. ఎగువ మధ్యతరగతివారికి కూడా సుబ్బలక్ష్మి కచే అందని ద్రాక్షే. అత్యంత ధనికులైన దేవకోట్టై చెట్టిగార్లు, ఇతర గొప్ప వ్యాపారస్తుల



,విశ్వనాథ్, విజయ,రాజేంద్రన్‌ల పెండ్లి వేడుకలో రాజగోపాలాచారి, సుబ్బలక్ష్మి, సదాశివం, విజయ వెనుక అనంత్(తంగం భర్త)



అత్యంత ధనికులైన మంత్రులు, ప్రభుత్వ అధికారులు, సంఘంలో పేరు, పలుకుబడి ఉన్నవారి ఇండ్లలోనే కచేరీ చేస్తుంది. వారే సదాశివం అడిగినంత డబ్బులు చెల్లించగలుగుతారు. అలాంటి కుటుంబమే విజయ-వాహిని స్టూడియో యజమాని, సినీ నిర్మాత అయిన నాగిరెడ్డిది. గత ఆరు సంవత్సరాలనుంచి మూడు భాషల్లో సినిమాలు తీసి, అవి విజయవంతమై వాళ్లతోబాటు తెలుగు సినిమాకీ పేరుప్రతిష్ఠలు చేకూర్చారు. ఈ సంవత్సరం 'మాయాబజార్' మూడు భాషల్లో తీసి, విడుదుల చేస్తే ఇప్పటిదాకా భారతీయ సినిమా ఎరుగని లాభాలు రాబడుతోంది. అలాంటి విజయవంతమైన నిర్మాత కొడుకు పెళ్లికి, సుబ్బలక్ష్మి కచేరీకి ఒప్పుకున్నాడు సదాశివం. సుబ్బలక్ష్మి బృందం పెళ్లి వేదికయిన విజయా గార్డెన్స్‌కి చేరుకుంది.

మన ఇంటికి బాగా కావలసినవాళ్లు, గొప్పవారు వస్తే, మనం ఎలాగైతే మన దగ్గర ఉన్న అత్యంత విలువైన వస్తువులు, వచ్చిన వారికోసం బయటపెడతామో, నాగిరెడ్డి తెలుగు సినిమా తురుపుముక్క, తెలుగు సినిమాకే కాక తమిళ సినిమాకి కూడా అగ్రనటి అయిన సావిత్రిని సుబ్బలక్ష్మికి పూలమాలవేసి సత్కరించమన్నాడు. సుబ్బలక్ష్మి కచేరీ కోసం కూర్చోబోయే ముందు సావిత్రి సుబ్బలక్ష్మి మెడలో పూలమాల వేసింది.

సుబ్బలక్ష్మి వంగి దండ వేయించుకొని సావిత్రికి నమస్కారం చేసింది. ఆ నమస్కారం మర్యాద కోసమే కాదు, సావిత్రిలోని కళకు కూడా. సుబ్బలక్ష్మి కూడా సినిమాల్లో నటించింది. కానీ సావిత్రి నటనా స్థాయిని అందుకోలేదు. ఆ మధ్యనే విడుదలయిన "మాయాబజార్"తో సావిత్రి నటనా సామర్థ్యం ఏమిటో తెలుసు సుబ్బలక్ష్మికి. సావిత్రి వినయంతో ప్రతినమస్కారం చేసింది. ఈ నమస్కారం కూడా కేవలం సభామర్యాద కోసమే కాదు, సుబ్బలక్ష్మిలోని సంగీత విద్వత్తుకి. సావిత్రి కూడా పాడగలదు కాని సుబ్బలక్ష్మి గాత్ర సౌరభానికి చాలా దూరం. ఇద్దరూ తమతమ రంగాల్లో నిష్ణాతులు. కళామతల్లి ముద్దుబిడ్డలు, ఒకరినొకరు అభినందించుకున్నారు.

ఇప్పుడు సావిత్రి పూలమాలతో సత్కరించినట్లు, వేరొక సందర్భంలో చెంబై వైద్యనాథ్ భాగవతార్ అనే ప్రముఖ విద్వాంసుడిని కచేరీకి ముందు సుబ్బలక్ష్మిని సత్కరించమన్నారు నిర్వాహకులు. చెంబై అందరినీ నవ్విస్తూ, నవ్వుతూ ఉల్లాసంగా ఉండే మనస్తత్వం కలిగినవాడు. నిర్వాహకులు వచ్చి పూలమాల ఇచ్చారు. సుబ్బలక్ష్మిని సత్కరించవలసిందిగా కోరారు. చెంబై పూలమాల తీసుకున్నాడుగానీ ముందుకు కదలటంలేదు.

"ఏంటండీ? రండీ పూలమాల వేయండి" అన్నాడు నిర్వాహకుడు.

"అబ్బీ, ఎలా వేయను? చాలా అందమైన ఆడమనిషి ఆవిడ."

"పర్వాలేదు రండి" అన్నాడు నిర్వాహకుడు.

"అలాకాదుకానీ, వాళ్లాయన్ని ఒకసారి అడుగు. వాళ్లావిడ మెడలో నేను దండ వేయొచ్చో లేదో..."

చెంబై సరదాగా అడుగుతున్నాడని తెలుసు నిర్వాహకుడికి. అతను కూడా నవ్వుతూ వెళ్లి సదాశివంకి విషయం చెప్పాడు.

"నాకేమీ అభ్యంతరం లేదు. చెంబైగారిని దండ వేయమనండి" అని చెప్పాడు సదాశివం.

నిర్వాహకుడు వచ్చి "మీరు కూడా విన్నారుగా ఇక పదండి పూలమాల వేద్దురు" అని అన్నాడు.

"అబ్బీ, సుబ్బలక్ష్మి వాళ్లాయన అనుమతి ఇచ్చాడు సరే, ఒక అందమైన మహిళ మెడలో పూలమాల వేస్తే మా ఆవిడ ఏమన్నా అనుకోదూ.. అలాగే వెళ్లి మా ఆవిడ అనుమతి కూడా తీసుకొనిరా" అని పూలమాలతో మళ్లీ కూర్చుండిపోయాడు చెంబై. నిర్వాహకుడు చెంబై భార్య దగ్గరకు వెళ్లి ఆమె అనుమతి కూడా తీసుకొచ్చాడు. అదే సంగతి చెంబైకి కూడా చెప్పాడు. అయినా చెంబై కదలలేదు.

"ఇదంతా బానేవుంది అబ్బీ, మరి అందగాడినైన నాచేత పూలమాల వేయించుకుంటే మరి అసలావిడకి పర్వాలేదా... మీరొకసారి సుబ్బలక్ష్మి సంగతి కూడా కనుక్కోండి..."

ఇలా అనేసరికి పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకున్నారందరు.

నవ్వుతూ, సిగ్గుపడుతూ సుబ్బలక్ష్మి తన ఆమోదం తెలిపింది. అప్పటికి అంతమందిని కడుపుబ్బ నవ్వించి, చెంబై వైద్యనాథ్ భాగవతార్ సుబ్బలక్ష్మి మెడలో పూలదండ వేశాడు. ఆ తర్వాత సుబ్బలక్ష్మి సంగీత విందు మొదలైంది. ఇది మద్రాసులోని ఒక అనాథ ఆశ్రమానికి లబ్ధి కచేరీ.

♫♫

రాధ కాపురానికి అహ్మదాబాద్ బయలుదేరుతుంది. రాధ భర్త విశ్వనాథన్ అక్కడ స్పిన్నింగ్ మిల్స్‌లో ఉద్యోగం. ఇరవై నాలుగేళ్ల రాధకి సుబ్బలక్ష్మితో ఇరవైరెండేళ్ల బంధం. ఎప్పుడో ఒకసారి రాధ తెలుసుకుంది సుబ్బలక్ష్మి తనను కన్న తల్లి కాదని. కానీ ఎప్పుడూ తన కన్న తల్లి ఉండి ఉంటే నన్ను ఇంకా బాగా చూసుకునేది అని తలంపు లేకపోగా ఆ ఒక్క మారుతల్లి, సవతితల్లి అనే పేరుకు మాత్రమే వాడబడుతున్న ఈ పేర్లు కూడా లేకుండా సుబ్బలక్ష్మి తన కన్నతల్లి అయి ఉంటే బాగుండేది అని అనుకునే బంధం రాధది. విజయది కూడా. రాధ అహ్మదాబాద్ వెళ్తూ, "నాన్నా అమ్మను అరవకు" బ్రతిమిలాడుతూ సదాశివంకి చెప్పింది.





సుబ్బలక్ష్మిని సన్మానిస్తున్న 'అందగాడు' చెంబై

"నాకు కోపం వచ్చినప్పుడు అరవకుండా కోపం నా దగ్గరే పెట్టుకుంటే నాకు బి.పి. వస్తుంది రాధా."

"అమ్మకు ఏడుపు వస్తుంది నాన్నా.. నువ్వు కాస్త కోపం తగ్గించుకో" గట్టిగా చెప్పింది రాధ. "సరేసరే.. నేను బిన్నిమిల్స్ వాళ్లకి చెప్పిపెట్టాను. వీలైనంత త్వరగా మద్రాసు బిన్నిమిల్స్‌లో చేరే ఏర్పాటు చేస్తాను. జాగ్రత్తగా వెళ్లిరామ్మా" అంటూ కూతురుని కాపురానికి సాగనంపాడు. సుబ్బలక్ష్మికి కలకత్తాలో పరిచయమైన నారాయణి రాధకు తోడుగా వెళ్లింది. విజయ మద్రాసులోనే కాపురం.

ఇప్పుడు సుబ్బలక్ష్మి ఢిల్లీ రేడియో కేంద్రానికి కచేరీ చేస్తుంది. కాని మామూలుగా రేడియో కేంద్రంలోని రికార్డింగ్ గదిలో ఇవ్వబడుతున్న కచేరీ కాదు. రెండు వందలమంది కూర్చున్న ఒక ఆడిటోరియంలో ఒకప్రక్క అతిధులు, రసజ్ఞులు కాగా రేడియో వారు తమ మైకులు ముందుంచి కచేరీని రికార్డు చేసుకునేలా ఏర్పాటు జరిగింది. అతిథులలో అతి ముఖ్యమైనవారు బ్రిటీషు రాచరికపు ప్రతినిధి ఏడవ హేర్‌వుడ్. ఈయన ఎలిజిబెత్ రాణికి అతి దగ్గర బంధువు. పైగా స్వతహాగా సంగీత జ్ఞానం కలవాడు. కచేరీ ఆద్యంతమూ ఆయన సుబ్బలక్ష్మి ప్రతిభాపాటవాన్ని నిశితంగా గమనించాడు. "సదాశివంగారూ ఆమె పాట అద్భుతం. నాకొక ఆలోచన వచ్చింది. సమయం వచ్చినప్పుడు మీకు నేను చెప్తాను" అని తర్వాత సదాశివంతో అన్నాడు హేర్‌వుడ్.

'ఏంటది? అంతటి పెద్దమనిషి సుబ్బలక్ష్మి గురించి ఏమి ఆలోచిస్తున్నాడు' ఈ సందేహం తొలిచేస్తుంది సదాశివాన్ని. అక్కడున్న ఢిల్లీ ప్రముఖులవల్ల తెలుసుకున్నాడు, ఎర్ల్ ఆఫ్ హేర్‌వుడ్ మద్రాసు కూడా వస్తున్నారని, వెంటనే ఆ దంపతులని తన ఇంటికి ఆహ్వానించాడు. మద్రాసు వచ్చాక తంగంను పిలిచి, "తంగం, మన ఇంటికి ఇంగ్లాండు రాణి అంతటివాడు వస్తున్నాడు, ఆయన ఎంత ధనవంతుడో తెలుసా? మన ఇల్లు ఎన్ని ఎకరాలనుకుంటున్నావ్?"

"రెండు ఎకరాలు" చెప్పింది తంగం.

"ఆయన ఇల్లు ఇంగ్లాండులో వెయ్యి ఎకరాలలో కట్టాడు. రాజవంశస్థుడు"

"అయితే, ఒక సైన్యానికి విందు ఏర్పాటు చేయమంటావా మామయ్యా?" ఆయన గురించి ఇన్ని మాటలెందుకు అసలు విషయం చెప్పు అన్నట్టు అడిగింది తంగం. ఆ ఇంట్లో సదాశివం ముందు నోరెత్తేది తంగం ఒక్కటే. తంగం మాటకి నవ్వొచ్చింది సదాశివానికి. నవ్వుతూ, "లేదు తంగం, ఆయన చాలా పెద్దమనిషి. చక్కగా ఒక్క పదిమందికి చేయించు చాలు."



ఆ రోజు రానేవచ్చింది. విందు అయ్యాక ఎర్ల్ ఆఫ్ హేర్‌వుడ్ దొర తన మనసులోని ఆలోచన బయటపెట్టాడు. "సదాశివంగారూ, ఎడిన్‌బరోలో అంతర్జాతీయ సంగీత ఉత్సవాలు 1947 నుంచి జరుగుతున్నాయి మీకు తెలుసా?" సదాశివం తెలియదన్నట్లు తల ఊపాడు.

"ఈసారి ఈ ఉత్సవాలకి, సుబ్బలక్ష్మికి, కర్ణాటక సంగీతానికి అవకాశముందేమో చూస్తాను" అని చెప్పాడు. భారతదేశంలో ఇంగ్లాండు రాణి బంధువుని క్రింద బాసింపట్టు వేయించి కూర్చోబెట్టి, అరిటాకుల్లో భోజనాలు వడ్డించి, తినిపించిన ఘనత సదాశివానికే దక్కుతుంది. పైగా దానికి ప్రతిఫలంగా ఒక అతిపెద్ద అవకాశం గురించి తెలుసుకున్నాడు. సదాశివం ఇక క్షణం ఆలస్యం చేయకుండా ఆ సంగీతోత్సవం గురించి శోధించటం మొదలుపెట్టాడు. శోధించగా శోధించగా తెలుసుకున్నది ఏమిటంటే ఎడిన్‌బరో అంతర్జాతీయ ఉత్సవం పాశ్చాత్య దేశాల్లో ఒక ప్రతిష్ఠాత్మకమైన లలిత కళల ఉత్సవం. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ప్రజల శక్తియుక్తులను ద్వేషాలకు ఉపయోగించకుండా మంచి మార్గంలోకి మళ్లించటానికి లలిత కళలను ఊతంగా తీసుకొని ఐరోపాఖండంలోని ప్రజలకు తమ కళలను ప్రదర్శించే అవకాశం, కోట్లమంది ఈ ప్రదర్శనలను చూసి ఆనందించే అవకాశం ఈ ఎడిన్‌బరో ఉత్సవం చేస్తూ వస్తున్న గొప్ప పని. ఇప్పటికి పది సంవత్సరాల నుండీ ఈ ఉత్సవం జరుగుతుంది. ఒక్కో సంవత్సరం ఒక్కో క్రొత్త సంస్కృతి యొక్క కళారీతిని ప్రవేశపెడుతూ వస్తుంది. ఇప్పటిదాకైతే భారతీయ కళలు అక్కడ ప్రదర్శింపబడలేదు. సదాశివం ఇక్కడదాకా తెలుసుకున్నాడు. ఎర్ల్ ఆఫ్ హేర్‌వుడ్ కూడా చెప్పి వెళ్లిందిదే. 'అవును, ఇక సుబ్బలక్ష్మి పాటని ప్రపంచానికి పరిచయం చెయ్యాలి, ఖాసా సుబ్బారావు చెప్పింది కూడా ఇదే. సుబ్బలక్ష్మికి, కర్ణాటక సంగీతానికి పేరు రావాలి' అని అనుకుంటూ ఆకాశ మార్గాన ఎక్కడో ఎడిన్‌బరో మద్రాసు మధ్యనుండగా, రాజాజీ చేతికర్ర చప్పుళ్లు సదాశివాన్ని మళ్లీ మద్రాసు మట్టి మీదకు తీసుకొచ్చి నిలబెట్టాయి.

రాజాజీ చాలా మథనపడుతున్నాడు. ఏదో దీర్ఘాలోచనలో ఉన్నాడు. "సదాశివం నెహ్రూ ఈ దేశాన్ని ఏం చేస్తున్నాడో తెలుస్తుందా నీకు?" అంటూ ఆవేశపడుతున్నాడు. మౌనంగా ఉన్నాడు సదాశివం.

మళ్లీ రాజాజీనే చెప్పటం మొదలుపెట్టాడు.

"ఆవడిలోనే నీకు నెహ్రూ ఎత్తుల గురించి చెప్పాను. మొన్నటికి మొన్న నాగపూర్‌లోకూడా సోషలిజం గురించి మాట్లాడుతున్నాడు. గాంధీ మనకు పోరిన ఆర్థిక వ్యవస్థకి పూర్తి విరుద్ధంగా వెళ్తున్నాడు. చిన్నచిన్న కమతాలని తీసివేసి ప్రభుత్వ ఆధ్వర్యంలో సమష్టి వ్యవసాయం మొదలుపెడతాడంట. ఇది రైతుల నడ్డి విరవటమే. చేనేత కార్మికుల

కుటీర పరిశ్రమలు ఎత్తేసి, ఆధునిక యంత్రాలతో మిల్లులు కడతాడంట. ఇది మన కార్మికుల సృజనాత్మకతని కాలరాసి, వారిని యంత్రాలుగా తయారు చేయటమే. గాంధీ చెప్పిన కుటీర పరిశ్రమను నాశనం చేయబూనుతున్నాడు. అన్నిచోట్ల, అన్ని రంగాల్లోను ప్రభుత్వ ఆధిపత్యాన్ని చొప్పించి ప్రజలకు స్వతంత్రం లేకుండా చేయపూనుతున్నాడు నెహ్రూ. నేను చూస్తూ మిన్నకుండలేను సదాశివం" తన చింత చెప్పుకున్నాడు రాజాజీ. రాజాజీ ఐదు సంవత్సరాలనుంచి ఏ పదవిలోనూ లేడు. ఇక రాజకీయాలనుంచి వైదొలిగే సమయమొచ్చింది. అయినా సదాశివానికి రాజాజీ ఎప్పటిలానే గురుతుల్యుడు, గౌరవనీయుడు. రాజాజీ బాధంతా అర్థమయింది సదాశివానికి. "చెప్పండి.. మీరు ఏం చెయ్యమంటే అది చేస్తాను. ఏం చేద్దాం?" నా తల తీసి మీ చేతిలో పెడతాను ఏం కావాలో చెప్పండి అన్నట్లు చెప్పాడు సదాశివం. "స్వతంత్ర పార్టీ" భవిష్యత్తులోకి చూస్తూ చెప్పాడు రాజగోపాలాచారి. సదాశివానికి తన కర్తవ్యం అర్థమయింది. అందులో మొదటి పని, రాజగోపాలాచారికి కల్కి బంగ్లా ప్రాంగణంలో రెండు గదుల ఇల్లు ఒకటి ఏర్పాటు చేశాడు వెంటనే. ఇక 'స్వతంత్ర' కార్యకలాపాలన్నీ అక్కడే జరగడం మొదలుపెట్టాయి. రాజగోపాలాచారి కోరిక మీద ఖాసా సుబ్బారావు తనకు తోడుగా 'స్వతంత్ర' కోసం పనిచేయటానికి, సుబ్బారావు పత్రిక 'స్వరాజ్య' బాధ్యత అంతా సదాశివం తీసుకున్నాడు. 1959 ఆగస్టు ఒకటిన బొంబాయిలో 'స్వతంత్ర పార్టీ' ఆవిర్భవించింది. సుబ్బలక్ష్మి ఈ సభ ప్రారంభానికి ముందు భక్తిగీతం ఆలపించి, శుభసంకల్పం చేసింది.

𝄞𝄞𝄞𝄞

సుబ్బలక్ష్మి లబ్ధి కచేరీలు అప్రతిహతంగా సాగిపోతున్నాయి. సుబ్బలక్ష్మి ఏ సంస్థ లబ్ధి కోసం కచేరీ చేయాలీ అనేది నిర్ణయించేది సదాశివమే. ఆ కచేరీలో ఏఏ పాటలు పాడాలన్నది నిర్ణయించేది కూడా సదాశివమే. ఒకరోజు బెంగుళూరు గాయన సమాజం నుంచి ఆ సంస్థ ప్రతినిధులు వచ్చారు. "మా అద్దె హాళ్ల కష్టాలు మీరు ఎరుగుదురు కదా.. మా ఊరిలోనే బంజారాలమవుతున్నాం. మీరు సుబ్బలక్ష్మిగారి చేత ఒక కచేరీ చేయిస్తే, దానికొచ్చిన డబ్బుని మా సమాజం భవన నిర్మాణానికి వినియోగించుకుంటాం" అని సదాశివానికి విన్నవించుకున్నారు.

"ఇప్పుడివేగా నడుస్తున్నాయి. ఆ మధ్యన మైలాపూర్ రసిక రంజని సభవారికి భవన నిర్మాణానికి కచేరీ చేసింది, కలకత్తాలో రసిక రంజని సభ వారికి కూడా చేసింది, మద్రాసు మ్యూజిక్ అకాడమీ సంగతి మీకు తెలిసిందే" అన్నాడు సదాశివం.

"మరి ఏర్పాటు చేసుకోమంటారా?"

"తప్పకుండా. మరి మీ సమాజం పోషకులు మైసూరు మహారాజువారు ఏమైనా వస్తారా కచేరీకి."





'కల్కి' పత్రికలో 'స్వతంత్ర పార్టీ' సిద్ధాంతాలను తెలుపుతూ గోగినేని రంగా రేఖాచిత్రం



'కల్కి' పత్రికలో 'స్వతంత్ర పార్టీ' సిద్ధాంతాలను తెలుపుతూ రాజాజీ రేఖాచిత్రం

సదాశివానికి మైసూర్ మహారాజావారు తప్పకుండా ఉండాలి ఆ కచేరీకి. అందుకోసం తనవైపు నుంచి కూడా ప్రయత్నం చేస్తాడు. ప్రతి విషయము గొప్పగా, ఆర్భాటంగా ఆలోచించే సదాశివం సుబ్బలక్ష్మి కచేరీలు సాదాసీదా కచేరీలలాగా ఉండనివ్వడు, వాటిని ప్రత్యేకమైనవిగా తీర్చిదిద్దుతాడు.

"ఏమాత్రం తీరికున్నా తప్పకుండా వస్తానన్నారు. సుబ్బలక్ష్మిగారి కచేరీ అయితే తప్పకుండా వస్తారు. ఒకసారి సుబ్బలక్ష్మి గారిని కలవొచ్చా?"

"లేదు, సుబ్బలక్ష్మి సాధన చేసుకుంటోంది. మేము త్వరలో కశ్మీరు వరద బాధితుల సహాయం కోసం కచేరీ చెయ్యటానికి ఢిల్లీ వెళుతున్నాము. ఇక బెంగుళూరులోనే కలుద్దాం" అని మొహమాటం లేకుండా చెప్పి పంపాడు సదాశివం.

త్వరలోనే బెంగుళూరు గాయన సమాజం కోసం బెంగుళూరులో కచేరీ చేసింది సుబ్బలక్ష్మి. యాభైఏళ్ల నుంచి గాయన సమాజం కూడబెట్టుకున్న డబ్బు రూ. 69,000/- వేలైతే, ప్రభుత్వం రూ. 75,000/- ఇవ్వగా ఆ రోజుని పురస్కరించుకొని ఒక పత్రిక అచ్చువేస్తే దానిలో వేసిన వాణిజ్య ప్రకటనల ద్వారా వచ్చిన డబ్బు రూ. 45,000/- అయితే, ఒక్కరోజులో సుబ్బలక్ష్మి కచేరీలో వచ్చిన డబ్బు రూ. 40,000/- వీటన్నిటినీ కలుపుకొని గాయన సమాజంవారు వారి సొంత భవన నిర్మాణానికి ముందుకెళ్లారు. సుబ్బలక్ష్మి ఒంటిచేత్తో ఇంత డబ్బు ఎలా రాబట్టగలిగిందో దీనికి సమాధానం కచేరీకి విచ్చేసిన మైసూరు మహారాజు శ్రీ చామరాజ రాజేంద్ర వడయార్ చెప్పారు. ఆయన కచేరీ తర్వాత ప్రసంగిస్తూ ఇలా అన్నారు: "శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మికి మనమెంతో ఋణపడి ఉన్నాము. ఎందుకంటే ఆమె తన మధుర కంఠంతో, శాస్త్రీయ సంగీతంపై పట్టుతో మనకు మన శాస్త్రీయ సంగీత విశిష్టతను తెలియచేస్తున్నారు. ఆమె సంగీతానికి ఒక గొప్ప ప్రత్యేకత ఉంది. మామూలు శ్రోతలను ఆమె సంగీతంలోని మాధుర్యం ఆకట్టుకుంటే, విద్వాంసులని స్వర లయ విన్యాసాలు ఆకట్టుకుంటాయి. ఆమె ప్రత్యేకత ఇంకోటి ఏమిటంటే ఆమె పాటకు దేశంలో అన్ని ప్రాంతాలలోనూ గొప్ప పేరుంది. ఎందుకంటే ఆ పాట శాస్త్రోక్తంగానూ, భక్తితోనూ మిళితమై ఉంది."

సుబ్బలక్ష్మికి ఆ శాస్త్రీయత రక్తంలోనే ఉంది. భక్తి తనకు పక్కింటిలాంటి అమ్మవారి గుడి పక్కనే ఉండటంతో భక్తి పుట్టుకతోటే పెరుగుతూ వచ్చింది. మధురమైన కంఠం మీనాక్షి అమ్మవారు మెచ్చి ఇచ్చిన వరం.

𝄞𝄞𝄞𝄞

"మామా.. అమ్మకు ఆరోగ్యం బాగోలేదంటున్నాడు అన్న... ఒకసారి వెళ్లి చూసొద్దాం మామా" అడిగింది సుబ్బలక్ష్మి. ఆలోచిస్తున్నాడు సదాశివం. కాసేపటికి, "సరే, మనకు



తిరువారూరులో పని ఉంది. త్రిమూర్తుల ఇళ్లు కొనాలి. నాతోపాటు ఇంకా ఇద్దరు... ముగ్గురు బయలుదేరుతారు. అందరం తిరువారూరులో పని చూసుకొన్న తర్వాత వాళ్లు మద్రాసు వచ్చేస్తారు. మనము మదురై వెళ్లి వద్దాం. నువ్వు వస్తున్నట్లు ఎవరికీ తెలియనీయవద్దని చెప్పు" అని ఆదేశించాడు సదాశివం.

తిరువారూరు పనులన్నీ అయిన తర్వాత అమ్మదగ్గరకు చేరుకుంది సుబ్బలక్ష్మి. తన ఇంట్లో అడుగుపెడితే చాలు, ఎక్కడ లేని ఆనందము, ఉత్సాహం కలుగుతాయి సుబ్బలక్ష్మికి. సదాశివంవి ఈ ఇంటివారితో ఇంకా పొడి పొడి మాటలే. కానీ ఆ ఉత్సాహం, ఆనందం అమ్మ పరిస్థితి చూసుకొని ఆవిరైపోయింది. షణ్ముగవడివుకి అస్సలు హుషారు లేదు. అమ్మ మంచం పక్కనే క్రింద కూర్చొని, "అమ్మా నువ్వు నాతో మద్రాసు రామ్మా, నేను దగ్గరుండి మంచి డాక్టర్‌కి చూపిస్తాను.. మామకు ఎంతోమంది తెలుసు" అనునయంగా, ప్రేమగా అడిగింది సుబ్బలక్ష్మి.

కడుపులో విపరీతమైన నొప్పితో బాధపడుతుంది షణ్ముగవడివు. పొట్టలో గడ్డ ఉన్నట్లు అనుమానం. "రామ్మా, నువ్వు ఇలా బాధపడొద్దు. అన్నా, నువ్వైనా చెప్పు" అంటూ బ్రతిమాలింది. కూతురుని తనివితీరా చూసుకోవటానికి కష్టమైనా సరే లేచి కూర్చుంది షణ్ముగవడివు. అమ్మ వడిలో తల పెట్టుకుంది సుబ్బలక్ష్మి. కూతురిని నిమురుతూ ఉంది షణ్ముగవడివు.

"ఎక్కడికీ వద్దు నా చిన్నిమారాణి. చల్లగా వెళ్లిపోతాను. అది ఒక్కటే ఇక. నువ్వు నా సంగీతాన్ని ముందుకు తీసుకెళ్తున్నావు. చాలా సంతోషంగా ఉంది. ఆ తృప్తి చాలు." మనస్ఫూర్తిగా చెప్పింది షణ్ముగవడివు. కూతురిని నిమురుకుంటూ తనలో మిగిలివున్న ఆశీస్సులు, ఆత్మీయత పంచుకుంటోంది. కాసేపున్న తర్వాత, "శక్తికీ పిల్లలు లేరు, నీకూ పిల్లలు లేరు. మీ తర్వాత నా వారసులు లేరు. అదొక్కటే బాధ" అంటూ వాపోయింది.

తన మదురైలో, తన ఇంటిలోనే ఏమైనా సరే అని నిశ్చయించుకుంది షణ్ముగవడివు. తన పొదరింటిని కూల్చిన మద్రాసుకు, తన కూతురిని తనకే చుట్టాన్ని చేసిన మద్రాసుకు రానే రానంది షణ్ముగవడివు.

షణ్ముగవడివుకి తన పరిస్థితి తెలుసు. తన కూతురు తన దగ్గరకు మళ్లీమళ్లీ రాలేదని కూడా తెలుసు. ఇదే ఆఖరు కావచ్చు. కూతురిని హత్తుకుంది.

"కుంజా.. కుంజా.. నా చిన్నిమారాణి"

"చెప్పమ్మా.."

"కుంజా... వడివా దగ్గరకు వెళ్లే వేళయిందమ్మా నాకు.."

సుబ్బులక్ష్మి 'అమ్మా' అంటూ ఏడ్చుకుంది. అమ్మను ఎక్కువసార్లు వచ్చి చూసిపోలేని తన అశక్తతను తలచుకొని ఇంకా ఏడ్చుకుంది సుబ్బులక్ష్మి.

♫♫♫♫

రాధ భర్త విశ్వనాథన్‌కు మద్రాసు బిన్నిమిల్స్‌లో ఉద్యోగం వచ్చేలా చేశాడు సదాశివం. రాధ కుటుంబం మళ్లీ మద్రాసుకు చేరుకుంది. కల్కి బంగ్లా ఇప్పుడు బంధువులందరూ కలిసే నెలవు అయింది. బంధువులకే కాదు మద్రాసు నగర మేధావుల కలయికకి ఒక ముఖ్యమైన కూడలి అయింది. రాజాజీ, ఖాసా సుబ్బారావు వంటి మేధావుల కార్యాలయం కల్కి గార్డెన్స్‌లో ఉండటమే కారణం. సదాశివం ఆతిథ్యంలో, ఎంతమంది ఎప్పుడు వచ్చినా ఎప్పుడు వెళ్లినా కాఫీ, టిఫిన్‌లు సరఫరా జరుగుతూనే ఉంటుంది. వీళ్లందరిని మించిన ఆకర్షణ శక్తి సుబ్బులక్ష్మిది. బయటకు రాకపోయినా మేడపైనుంచైనా ఒక్కసారి కనిపిస్తే చాలనుకుంటారు వచ్చినవాళ్లు. ఇప్పుడు 'స్వతంత్ర పార్టీ' ఆవిర్భావంతో కల్కి బంగ్లా రాజకీయ చర్చలతో కూడా వేడెక్కుతుంది. రోజుకి వచ్చిపోయే వాళ్లకి విరామం ఉండటంలేదు. కల్కి బంగ్లా మద్రాసుకి తలమానికం అయింది. తంగం, తంగం భర్త అనంత్‌కి తలకు మించిన పని భారం అయింది. సుబ్బులక్ష్మి, రాధ మాత్రం సంగీతంలో తలమునకలయి ఉంటారు. సదాశివం ఇంకో క్రొత్త గురువుని పెట్టాడు సుబ్బులక్ష్మికి. ఆమె ప్రసిద్ధ హిందుస్థానీ గాయకురాలు, సిద్ధేశ్వరీ దేవి. ఆమెకు కల్కి బంగ్లాలోనే బస ఏర్పాటు చేశాడు. ప్రొద్దున్నే తయారయి పియానో గదిలో కూర్చుంటారు. సుబ్బులక్ష్మి, రాధ, సిద్ధేశ్వరీదేవి. అకార సాధన 108 సార్లు చేయిస్తుంది సిద్ధేశ్వరీదేవి. సుబ్బులక్ష్మి 'ఆ...' అంటుంటే సిద్ధేశ్వరీదేవి రుద్రాక్షమాలతో లెక్కపెడుతూ ఉంటుంది. ఇలా ఒక నెల నుంచి అకార, ఉకార సాధనయే జరుగుతుంది. రెండవ నెలలో కూడా, "శుభే! ఏదీ అకార సాధన మొదలుపెట్టు" అంది సిద్ధేశ్వరీదేవి సుబ్బులక్ష్మిని. "సిద్ధే! మొదలుపెడతానుగానీ ఈ రోజునుంచైనా ఖయ్యాల్ మొదలుపెడదామా?" అంది సుబ్బులక్ష్మి. హిందుస్థానీ సంగీతం నేర్చుకోవాలనే కుతూహలం ఆపుకోలేక. సిద్ధేశ్వరీదేవి నిండు ఆరు నెలలు సదాశివం ఆతిథ్యం పొంది, సుబ్బులక్ష్మికి ఖయ్యాళ్లు, ఛోటే ఖయ్యాళ్లు, తుమ్రీలు నేర్పించింది. సుబ్బులక్ష్మి మద్రాసులోనే, తన హిందుస్థానీ గురువు ముందే పూర్తి హిందుస్థానీ సంగీత కచేరీ చేసింది.

♫♫♫♫

ఇరవై సంవత్సరాలు, సుబ్బులక్ష్మి సదాశివాన్ని పెళ్లాడి. పెళ్లి విషయంలో అనుకున్నది సాధించింది సుబ్బులక్ష్మి. పోషకుల బెడద వదిలితే చాలు ఆ తర్వాత సంగీతం తన జీవితంలో లేకపోయినా పర్వాలేదు, పిల్లల్ని కని, పెంచుకుంటే చాలు అనుకుంది.



కనకపోయినా నలుగురు పిల్లలకి తల్లి అయింది. సంగీతం జీవితం అయింది. సదాశివానికి సుబ్బులక్ష్మి పరిచయమైన తొలినాళ్లలోనే సుబ్బులక్ష్మికున్న సంగీత విద్వత్తుని పసికట్టాడు. ఆ విద్వత్తుని ఎక్కడ, ఎప్పుడు ఎలా ప్రదర్శిస్తే పేరు వస్తుందో అలా ప్రదర్శించి, సుబ్బులక్ష్మికి ఊహకి కూడా అందని పేరు తీసుకొచ్చాడు. దేవదాసీలు ఎలా ఉన్నా, ఎంత హుందాగా మెలిగినా వారిని చులకన భావంతో హేయంగా చూసే సమాజంలో ఈ దేవదాసీని బ్రాహ్మణోత్తమురాలుని చేశాడు. ఆమె విద్వత్తు విషయంలో పేరు తీసుకురావటంలోనూ, ఆమెను బ్రాహ్మణీకరణం చేయటంలోనూ సదాశివం పాత్ర పరిమితమే. బ్రాహ్మణత్వం ఆమెలో పుట్టుకతో ఉంది. సుబ్బులక్ష్మి ఎప్పుడూ పద్మినీజాతి స్త్రీలా మెలగాలనుకుంది. ఆమెకు ఆ లక్షణాలు అన్నీ ఉన్నాయి. అందుకే అందరూ, స్త్రీలైనా, బ్రాహ్మణులైనా ఆమెను సంభ్రమము, గౌరవంతో చూస్తున్నారు. కానీ సుబ్బులక్ష్మికి తెలుసు సదాశివం తనకోసం ఏం చేశాడో, మదురైకి ఎదురొడ్డాడు. తన సొంత కుటుంబాన్ని ఎదిరించాడు, ఆఖరికి రాజగోపాలాచారితో కూడా మాటలు పడ్డాడు. ఎన్ని అపనిందలు, దెప్పిపొడుపులు అయినా అన్నిటినీ తట్టుకొని తనని చెట్టీల బారిన పడకుండా కాపాడాడు. పెళ్లికి ముందు సినిమా ప్రపంచంలోకి అడుగుపెట్టినప్పుడు కూడా తన దగ్గరకు ఎవరైనా అకారణంగా వస్తే, విషం చిమ్మేవాడు వారిపై. అందుకు, ఆ తర్వాత సుబ్బులక్ష్మికి ఎనలేని పేరు తెచ్చినందుకు సదాశివానికి మనస్ఫూర్తిగా తలొగ్గింది సుబ్బులక్ష్మి. సదాశివం పురుషాహంకార వేధింపులను, తన కుటుంబాన్ని అంతగా తనతో కలవనీయకుండా చేయటంవల్ల తనకు కలిగిన బాధలన్నీ తన మనసులోనే అదిమిపెట్టుకొని సదాశివంకు మనస్ఫూర్తిగా తలొగ్గింది సుబ్బులక్ష్మి.

1961 లో సుబ్బులక్ష్మి మద్రాసు హై సొసైటిలో ఒక సభ్యురాలు. ఒట్టి సభ్యురాలే కాదు, మిగతావారు అనుకరించాలనుకునే అతివ. ఖరీదైన కంచిపట్టు చీర కట్టి, నలభై ఐదేళ్ల వయస్సులో తన పొడవాటి జుట్టు ముడిపెట్టి, ముడి చుట్టూ బొండు మల్లె చెండు పెట్టి, పాలమీగడ వర్చస్సుతో, అందమైన మోము మీద చెదరని నవ్వుతో, తీరైన ముక్కుకి రెండు బేసర్లతో, నుదిటిమీద పంచవన్నెల బొట్టుతో ఎవ్వరూ చూపు మరల్చుకోకుండా చేసే విరిబోణి, సంగీత సామ్రాజ్ఞి.

రుక్మిణీ దేవి స్థాపించిన కళాక్షేత్ర పాతిక సంవత్సరాలు పూర్తి చేసినందుకుగాను సిల్వర్ జూబ్లీ ఉత్సవాలు జరుపుకోబోతోంది. కళాక్షేత్ర సభ్యులు రుక్మిణీదేవితో సహా సుబ్బులక్ష్మి ఇంటికి వచ్చారు. క్రింద సదాశివంని ఆహ్వానించి, పైకి సుబ్బులక్ష్మి దగ్గరకు వచ్చారు. అన్నీ విన్న సుబ్బులక్ష్మి, "రుక్మిణీ, మీరు సోవనీర్ వేస్తున్నారుకదా... అందులో నా పేరు సుబ్బులక్ష్మిసదాశివం అని వేయండి" అని కోరింది సుబ్బులక్ష్మి. రుక్మిణీదేవి వెంటనే, "ఈ పని మీ ఆయనే చేయలేదు తల్లీ, మేము అస్సలు చెయ్యం. అయినా

ఇప్పుడు నీ పేరు ఉన్నపళాన మారిస్తే ఈ కొత్త మనిషెవరు అనుకుంటారు. వద్దు, నీ పేరు ఇలానే ఉండనీ" అని చెప్పింది రుక్మిణీదేవి. సుబ్బలక్ష్మికి వచ్చిన ఆలోచన సదాశివానికి ఎప్పుడూ రాలేదు.

కళాక్షేత్ర వేడుకల కార్యక్రమం మొదలయ్యే ముందు ఆడవాళ్లంతా ఒకచోట కూర్చొని ఉన్నారు. కళాక్షేత్ర విదేశాల నుంచి కూడా కళాకారులని ఆకర్షిస్తుంది. అక్కడ కూర్చున్నవారిలో విదేశీ కళాకారులు కూడా ఉన్నారు. వారు భరతనాట్యం నేర్చుకుంటున్నారు. అక్కడ ఉన్న భారతీయ మహిళలను ఉద్దేశిస్తూ, "మీరు నుదుటి మీద ఆ బొట్లు ఎందుకు పెట్టుకుంటారు?" అని అడిగింది ఒక విదేశీ మహిళ. 'అది మా సంస్కృతి నుంచి వచ్చింది', అనే సమాధానం నుంచి 'అక్కడ నాడీ మండలం ఉంటుంది', దాకా వివిధ సమాధానాలిచ్చి, 'భర్త ఉన్నంతవరకూ భారతీయ స్త్రీలు ఈ బొట్లు పెట్టుకుంటారు' అని ముగించారు. ఆ ప్రశ్న అడిగిన విదేశీ మహిళ ఏమి అర్థం చేసుకుందో ఏమో వెంటనే సుబ్బలక్ష్మి దగ్గరకు వచ్చి మొహంలో మొహం పెట్టి చూసింది. సుబ్బలక్ష్మి నుదుటి మీద బొట్లు లెక్కపెట్టటం మొదలుపెట్టింది. "ఒకటి, రెండు, మూడు నాలుగు, ఐదు!! అయితే మీకు ఐదుగురు భర్తలు. అవునా.." నిజం కనిపెట్టినంత ధీమాగా సుబ్బలక్ష్మిని అడిగింది. అవాక్కయింది సుబ్బలక్ష్మి. కాసేపటికి తేరుకుని, "నాకు ఒక భర్తే. కానీ, ఆయన ఐదుగురంత శక్తిమంతుడు" అని గర్వంగా చెప్పింది.

𝄞𝄞𝄞𝄞

సుబ్బలక్ష్మికి పెరుమాళ్ ఇష్టదైవం. సుబ్బలక్ష్మి తిరుమలకి దర్శనానికి వచ్చింది, పడమర మాడ వీధిలోని వైఖానస ఆశ్రమంలో బస. ప్రతిరోజూ సుప్రభాత సేవ దగ్గర నుంచి అన్ని సేవలకు అత్యంత భక్తిశ్రద్ధలతో హాజరవుతుంది. ఒకరోజు ఆచార్య పురుషులు సుప్రభాతం పాడేముందు సదాశివం ఒక అర్చకుడిని అడిగాడు, "సుబ్బలక్ష్మి మీతోపాటు స్వామికి సుప్రభాతం పాడవచ్చా" అని.

"లేదు, ఇక్కడి శాస్త్రాలు, ఆచారాలు ఒప్పుకోవు" అని అర్చకుడు సమాధానమిచ్చాడు. సదాశివానికి ఆ మాట నచ్చలేదు. తిరుమలేశునికి కూడా నచ్చినట్టు లేదు. ఆ రోజుకు మనసులో సుప్రభాతం పాడుకుంది సుబ్బలక్ష్మి. సదాశివం మద్రాసు చేరిన తర్వాత కూడా సుప్రభాతం గురించే ఆలోచిస్తున్నాడు. సదాశివానికి ఎక్కడ ఏ ఆలయానికి వెళ్లినా సుబ్బలక్ష్మిని గర్భగుడి ముందు నిలబెట్టి, మూల విరాట్టు ముందు పాట పాడించి గర్వపడిపోతుంటాడు. అలాంటిది తిరుమల అర్చకులు గట్టిగా లేదు అనేసరికి సదాశివానికి అహం దెబ్బతింది. వెంటనే కార్యోన్ముఖుడయ్యాడు. వెంకటేశ్వర సుప్రభాతం పుట్టుపూర్వోత్తరాలు కనుక్కోవటం ప్రారంభించాడు. క్రీ.శ. 1430లో ప్రతివాద భయంకర అణ్ణంగాచార్య విరచిత సంస్కృత శ్లోకాలు ఈ సుప్రభాతం శ్లోకాలు.





మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి

ఆయన వంశం ఇప్పుడు కంచిలో ఉందని తెలుసుకున్నాడు సదాశివం. వెంటనే కంచి వెళ్లి ఆ కుటుంబాన్ని కలిసి, వారి పూర్వీకులు కూర్చిన వెంకటేశ్వర సుప్రభాతం సుబ్బులక్ష్మికి నేర్పించమని అభ్యర్థించాడు. "ఎందుకు నేర్పిస్తున్నారు, ఎక్కడన్నా పాడటానికా" ఇరవై తరాల వేద పండితుల కుటుంబం అడిగింది. "లేదు. అందరూ వినేలాగా రికార్డు చేయిస్తాను" చెప్పాడు సదాశివం, తిరుమలలోని ఆ అర్చకులకి వినిపించేలా.

ఆ తిరుమలేశుడు కూడా విన్నాడు.

ప్రతివాద భయంకర అణ్ణంగాచార్య కుటుంబీకులు సమ్మతించారు. సుబ్బులక్ష్మి, రాధ కంచికి చేరుకున్నారు. రోజూ విధిగా, నిష్టగా సుప్రభాతం నేర్చుకుంటున్నారు.

మదురైలో షణ్ముగవడివు ఆరోగ్యం క్షీణిస్తుంది. తన కూతురికి తన గర్భంలో ఉన్నప్పటినుంచి పంచి యిచ్చిన సంగీతం వదలకుండా అందులోనే ప్రావీణ్యం సంపాదిస్తూ పేరు తెచ్చుకోవటమనే ఒకే ఒక తృప్తితో దైవసన్నిధి చేరటానికి సిద్ధపడుతుంది.

1962 ఆగస్టు ఐదున, కల్కి బంగ్లాలో ఫోను మ్రోగి, షణ్ముగవడివు కాలంచేసిందనే వార్త చెప్పింది. మద్రాసులో ఒకరి తర్వాత ఒకరు సుబ్బులక్ష్మి ఇంటికి చేరుకుంటున్నారు. అక్కడకు చేరుకున్నవాళ్లంతా అడుగుతున్నారు సదాశివంని, "ఎమ్.ఎస్. బయలుదేరిందిగదా.. మీరు వెళ్లాలంటే మన కారు ఉంది తీసుకొని వెళ్లండి" అని.

సదాశివం ఏమీ మాట్లాడదలుచుకోలేదు. వచ్చినవారికి మెల్లగా తెలిసింది సుబ్బులక్ష్మి పైనే ఉందని. తల్లిని చివరిసారిగా చూసుకునే ఏర్పాట్లు ఏమీ జరగటంలేదని. "తల్లి అక్కడ చనిపోయి ఉంది, కూతురుని ఇంకా ఇక్కడే ఉంచాడా? ఇదేమి కలికాలం?" అనుకుంటూ వచ్చినవాళ్లు వెళ్లిపోసాగారు.

సుబ్బులక్ష్మికి అమ్మ దగ్గరకు పరిగెత్తుకెళ్లాలని ఉంది. చివరిసారిగా తనివితీరా అమ్మను చూసుకొని తృప్తిగా అమ్మను పంపుకోవాలని ఉంది. తమ పేరులో తల్లి పేరు ఉండిపోయే అతి కొద్దిమంది అదృష్టవంతుల్లో తనూ ఒకతి. తన తల్లే తన గుర్తింపు. పేరులోనే కాదు తన సంగీతంలో, తన నడతలో, నడవడిలో. అందరూ తనని ఎమ్.ఎస్. అని పిలుస్తుంటే, ఆ పేరులో తనను పెంచిన ఊరి పేరు, కనిన తల్లి పేరు తనివితీరా వింటూ, ప్రతి పిలుపుకి పులకించిపోయింది. ఊరు ఎప్పుడో దూరమైంది, ఇప్పుడు తల్లి అందుకోలేని తీరమైంది. కని పెంచిన తల్లిని చివరిసారిగా చూసుకొని, హత్తుకొని ఈ జన్మనిచ్చినందుకు కృతజ్ఞతతో, ప్రేమతో తల్లి ముందు మోకరిల్లి, నా తల్లి అని ప్రపంచానికి చెబుదామని ఉంది. సరిగ్గా ఇదే తన భర్తకు ఇష్టంలేదు. తన భార్యను పూర్తిగా బ్రాహ్మణీకం చేశాడు సదాశివం. మళ్లీ తన భార్య తన మూలాల్లోకి వెళ్లి, ఆ మూలాల్ని అందరికీ తెలియజేయటం



ఇష్టం లేదు సదాశివానికి. విషయం గ్రహించింది సుబ్బులక్ష్మి. గుండెని పిండుతున్న బాధ, వ్యథ, కన్నీరు రూపంలో మున్నీరు అవుతుంది.

అమ్మ ఉన్నప్పుడు తరచుగా అమ్మ దగ్గరకు వెళ్లి చూసుకోలేకపోయిన తన అశక్తత, అమ్మ ఆరోగ్యం కనిపెట్టుకుంటూ ఉండి, తన దగ్గరకు తీసుకుని వచ్చి వైద్యం చేయించలేని తన పరిమితులు గుర్తుకు వస్తుంటే కుమిలిపోతుంది సుబ్బులక్ష్మి. చివరి రోజుల్లో దగ్గరుండే అదృష్టాన్ని ఎలాగూ నోచుకోలేదు. ఇప్పుడైనా అమ్మ దగ్గరకు వెళ్లగలనో లేదో అనే వ్యథతో కన్నీరు మున్నీరుగా ఏడుస్తూవుంది.

తన భర్త తనను మదురై పంపించటానికి ఏమాత్రం ఇష్టపడటంలేదు. ఇక ఆశ సన్నగిల్లుతున్న సమయాన సుబ్బులక్ష్మి గురువు సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ సుబ్బులక్ష్మి పరిస్థితి గ్రహించాడు. సదాశివంతో మాట్లాడే బాధ్యత తనపై వేసుకున్నాడు. మంకు పట్టుమీద ఉన్న సదాశివానికి శతవిధాలా నచ్చచెప్పి సుబ్బులక్ష్మి మదురై బయలుదేరే ఏర్పాటు చేశాడు. తన భర్త తనను మదురై పంపటానికి ఒప్పుకున్నాడని తెలియగానే అంతటి విషాదంలో కూడా సుబ్బులక్ష్మికి ప్రాణం లేచొచ్చింది.

మదురైలో, 'నా చెల్లి ఎప్పుడు వస్తే అప్పుడే తక్కిన కార్యక్రమాలు' అని పట్టుమీద ఉన్న శక్తివేల్ షణ్ముగవడివు పార్థివ దేహాన్ని కనిపెట్టుకున్నాడు.

ఎట్టకేలకు బాగా చీకటి పడిన తర్వాత సుబ్బులక్ష్మి మదురై చేరుకుంది. తల్లి పక్కకు చేరింది. అమ్మమీద వాలిపోయింది. తనను కోపగించుకున్నా, కొన్నాళ్లు పంతం పట్టినా ఎప్పటికీ తన తల్లి. తన తల్లి గురించి ఎంతమంది ఎలా చెవులు కొరుక్కున్నా, తన తల్లి తనకు తలమానికం.

కాస్త దూరంలో మీనాక్షి అమ్మవారి ఆలయం పశ్చిమ రాజగోపురం ఆకాశాన్ని తాకుతూ, తోడు నిలవగా అన్నతోపాటు ఆ రాత్రంతా అమ్మ ప్రక్కన కాపుకాసింది.

ప్రొద్దున్నే అమ్మను పంపే వేళ అయింది. అమ్మ తనను ఈ భూమి మీద జార్చటానికి ఎంత బాధపడిందో, అంతకంటే ఎక్కువ బాధతో అమ్మ చేయి విడిచింది. సందు చివరిదాకా నడచి సాగనంపింది. అమ్మ కనుమరుగయ్యే దాకా చూసి వెనక్కు మళ్లింది. కన్నీటి ధార వెనుక నుంచి పశ్చిమ రాజగోపురం రంగులన్నీ వెలసిపోయి కనిపించింది.

రెండు రోజులకే సుబ్బులక్ష్మి మద్రాసు చేరుకుంది. గుండె భారంగా ఉన్న సుబ్బులక్ష్మికి రోజులు కూడా భారంగా గడుస్తున్నాయి. అంతటి తన తల్లి కాలం చేస్తే ఏమీ ఆగలేదు. పొద్దు ఎక్కుతుంది..వాలుతుంది. సుబ్బులక్ష్మికి ఒక్కసారైనా కాలం ఆగి తన తల్లికి వందనం చేయాల్సిందేననిపిస్తుంది. కానీ కాలం ఆగలేదు, ఎవరూ ఆగలేదు. అందరూ ఎవరి పని వారు మామూలుగానే చేసుకుపోతున్నారు. సుబ్బులక్ష్మి మాత్రం స్థాణువు అయింది. సదాశివానికి సుబ్బులక్ష్మి ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా మామూలు మనిషి కావాలి.



మదురై అక్కమ్మ షణ్ముగవడివు



మదురై అక్కమ్మ వీణ షణ్ముగవడివు

అందుకు ఒక ఏర్పాటు చేశాడు. "కుంజక్కా , మామకీ నీకు షష్టిపూర్తి చేయటానికి ఏర్పాట్లు చేస్తున్నారు" అంది మంగళం. మంగళం సదాశివంకి ఇంకొక మేనకోడలు, సరిగ్గా సుబ్బలక్ష్మి వయస్సు. అందుకే సుబ్బలక్ష్మికి బాగా నేస్తు. "ఇప్పుడా?" అంది సుబ్బలక్ష్మి ఏమాత్రం ఆసక్తి చూపించకుండా. "నాకు తెలుసు కుంజక్కా నీ పరిస్థితి. కానీ మామ వినడుగా" అంది మంగళం సుబ్బలక్ష్మికి ఓదార్పుగా. షష్టిపూర్తిని సదాశివం చుట్టాలు అందరూ కలిసి ఒక పెద్ద వేడుకలా చేశారు. ఆ ఘట్టంలో సుబ్బలక్ష్మి, సదాశివం దండలు మార్చుకుంటున్నప్పుడు సుబ్బలక్ష్మికి బాధతో కంట నీరు కారినప్పుడు, ఆనందబాష్పాలనుకోవటం సదాశివం ఘరానాకే చెల్లింది.

షష్టిపూర్తి ఉత్సవం సుబ్బలక్ష్మికి ఉత్సాహం తేలేకపోయింది. సదాశివం గమనిస్తున్నాడు. "కుంజా, మనం త్వరలో ఢిల్లీ వెళ్లాలి. అక్కడ రెండు కచేరీలు ఉన్నాయి. ఆ తర్వాత సుప్రభాతం సాధన చేసుకోవాలి" అంటూ కర్తవ్య బోధన చేశాడు. మెల్లగా సుబ్బలక్ష్మి మామూలు మనిషయ్యింది. ఎక్కడో వందల మైళ్ల అవతల మదురైలో ఉండిఉండే తన తల్లి ఇప్పుడిక తన మనస్సులోనే శాశ్వతంగా ఉంటుంది. కలవడానికి, మాట్లాడటానికి ఇక ఎవరి అనుమతి అవసరం లేదు, ఏ అడ్డు లేదు. ఇకనుంచి పూజా తంతులో అమ్మకు కూడా వంతు.



స్వతంత్ర భారతదేశంలో మూడవ సార్వజనిక ఎన్నికలు జరుగనున్నాయి. రాజాజీ స్వతంత్ర పార్టీ దేశవ్యాప్తంగా పోటీ చేయనుంది. కల్కి బంగ్లాలో ఆంతరంగిక చర్చలు రోజూ జరుగుతూనే ఉన్నాయి. ఒక్కొక్కరోజు చిన్నపాటి బహిరంగ సభలు కూడా జరుగుతున్నాయి. రాజాజీ నెహ్రూ మీద, కామరాజ్ మీద దుమ్మెత్తిపోస్తున్నాడు. సుబ్బలక్ష్మి అన్ని సభలని దూరంగా కూర్చొని వింటుంది.

"తంబీ, అదిగో ఎమ్.ఎస్. చూశావా మీటింగ్ వింటుంది. ఎమ్.ఎస్. రాజాజీవైపు."

"ఇల్లై అణ్ణా... ఎమ్.ఎస్. నెహ్రూవైపు."

"ఇల్లై తంబీ, అడుగుదాం పద."

ఇద్దరూ సుబ్బలక్ష్మి దగ్గరకు వెళ్లారు. "ఎంఎస్. గారూ మీకు ఏ పార్టీ అంటే ఇష్టం?"

"అసలు వీళ్లు ఇలా కొట్టుకోవటాలు, తిట్టుకోవటాలు నాకస్సలు ఇష్టంలేదు. తొందరగా ఈ గొడవలు సమసిపోతే బాగుండు." అంటూ సుబ్బలక్ష్మి తన మనసులో ఉన్నమాట చెప్పింది. సుబ్బలక్ష్మికి కూడా నెహ్రూను ఎదిరించటం నచ్చకపోయినా, తమ బాగోగులు మొదటినుంచి కనిపెట్టుకు వచ్చిన రాజాజీవైపే మొగ్గుచూపింది.





షష్టిపూర్తి వేడుకలో సుబ్బలక్ష్మి



షష్టిపూర్తి వేడుకలో సుబ్బలక్ష్మి , సదాశివం ఘరానా

ఎల్ల్ ఆఫ్ హేర్‌వుడ్ ద్వార మద్రాసు వచ్చాడని తెలిసి సదాశివం ఆఘమేఘాల మీద అతనిని కలవటానికి వెళ్లాడు. "సదాశివంగారూ, మీకిచ్చిన మాట నిలబెట్టుకోవటానికి వచ్చాను. ఇంకా ఇతర భారతీయ కళాకారులని కూడా ఎంపిక చేసుకుంటాను" అని చెప్పాడు. సుబ్బలక్ష్మితోపాటు మద్రాసు నుంచి బాలసరస్వతి కూడా ఎడిన్‌బరో ఉత్సవానికి ఎంపికయింది. ఉత్తర భారతం నుంచి పండిత్ రవిశంకర్, అలీ అక్బర్ ఖాన్, అల్లా రఖా ఎంపిక చేయబడ్డారు.

1962 ఆఖరులో లబ్ధి కచేరీలకు ఢిల్లీ వెళ్లినప్పుడు నెహ్రూని కలిశారు సుబ్బలక్ష్మి, సదాశివం. సదాశివం నెహ్రూతో ఎడిన్‌బరో ఉత్సవానికి ఆహ్వానం వచ్చినట్లు చెప్పాడు. "పాశ్చాత్య దేశస్తులు ఎక్కువగా వాద్యసంగీతాన్ని ఇష్టపడతారు. మరి సుబ్బలక్ష్మి పాట వాళ్లకేమైనా వినబుద్ధవుతుందా అస్సలు. వెళ్లి, అక్కడ నవ్వులపాలు కాముకదా" అంటూ తన అనుమానాన్ని బయటపెట్టాడు సదాశివం.

నెహ్రూ టీ టేబుల్ మీద తాళం వేస్తూ, "పాశ్చాత్య సంగీతం ఎక్కువ వాద్యపరికరాల సంగీతమే, పాశ్చాత్యులు ఎక్కువగా మొజార్ట్, బెథోవెన్‌ల వాద్యగోష్ఠులు వింటుంటారు. వారు ఎక్కువగా వాద్యసంగీతాన్నే ఇష్టపడతారు. కానీ...." సుబ్బలక్ష్మివైపు తిరిగి "నీ విషయంలో మాత్రం కాదు. నీ పాట, పాటలోని శ్రావ్యత పాశ్చాత్యులు తప్పకుండా ఆనందిస్తారు' అని నెహ్రూ సుబ్బలక్ష్మికి, సదాశివంకి ధైర్యం చెప్పాడు.

సుబ్బలక్ష్మి వేంకటేశ్వర సుప్రభాతం సాధనలో మూడవ దశకి చేరుకుంది. మొదటి దశలో సుప్రభాతంలోని నాలుగు భాగాలకి అర్థం తెలుసుకుంది. రెండవ దశలో సుప్రభాతం కంఠస్థం చేసుకుంది. ఇరవై నిమిషాల నిడివిగల సుప్రభాతం ఇక పాడటం నేర్చుకోవటమే. *1963* మొదలు సుబ్బలక్ష్మి, రాధ శాస్త్రోక్తంగా పాడటం నేర్చుకుంటున్నారు.

వేదపండితుల ముందు, రికార్డింగులో ఎలా పాడుతుందో అలా ఏకబిగిన పాడి చూపిస్తుంది సుబ్బలక్ష్మి. రాధ వంత పాడుతుంది. అందరూ చెవులు నిక్కపొడుచుకుని వింటున్నారు. సదాశివంకి వొళ్లంతా చెవులే. ఎక్కడ అపశ్రుతి దొర్లినా పట్టటానికి తయారుగా ఉన్నాడు. తంబూర మీటగానే, "ఓం.. కౌసల్యా సుప్రజా రామా పూర్వా సంధ్యా ప్రవర్తతే.. ఉత్తిష్ఠ నరశార్దూలా కర్తవ్యం దైవమాహ్నికం." అని మొదలుపెట్టి ఏకబిగిన ఇరవై నిమిషాలపాటు పాడింది. పక్కవాద్యం కూడా లేకుండా ఇరవై నిమిషాలు పాటు తన గాత్రంతో కట్టిపడేసింది సుబ్బలక్ష్మి. "సదాశివంగారూ ఇక రికార్డింగుకు వెళ్లొచ్చు". వేదపండితులు తమ ఆమోదం తెలిపారు. "తప్పకుండా వెళ్దాం, రాధకు నెలలు నిండాయి. ఎప్పుడైనా కాన్పు కావొచ్చు" చెప్పాడు సదాశివం, తల్లి సాయంతో పైకి లేస్తున్న రాధని చూస్తూ. *1963*లో జూన్ *21*న హెచ్.ఎమ్.వి. వారి రికార్డింగు స్టూడియోలో సుబ్బలక్ష్మి,



రాధ వేంకటేశ్వర సుప్రభాతం రికార్డింగు దిగ్విజయంగా చేశారు. 23న రాధ పండంటి బాబుకి జన్మనిచ్చింది. ఆ బాబును శ్రీ వేంకటేశ్వరుడి వరంగా భావించి శ్రీనివాసన్ అని పేరు పెట్టింది.

సదాశివం వేంకటేశ్వర సుప్రభాతం పని పూర్తి చేసిన వెంటనే ఎడిన్‌బరో వెళ్లాల్సిన పనుల మీదకు దృష్టి మళ్లించాడు. రాజాజీ కనుసన్నల్లో అన్ని ఏర్పాట్లు జరుగుతున్నాయి. ప్రముఖ విద్వాంసుల సలహాలతో పాటలు కూర్చుతున్నాడు సదాశివం.

ఈలోపు జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో స్వతంత్ర పార్టీ ఆరు సీట్లు గెలుచుకుని ప్రజల్లో తమ ఉనికిని చాటుకుంది. మద్రాసు చట్టసభలో కాంగ్రెస్, డి.ఎమ్.కె. తర్వాత మూడవ అతి పెద్ద పార్టీ అయింది. ఆ పై వచ్చే ఎన్నికలకి ఆశలు నిలబెట్టుకుంది.

𝄞𝄞𝄞𝄞

ఎడిన్‌బరో ప్రయాణం మొదలైంది. కర్ణాటక సంగీతం ఎల్లలు దాటనుంది. బంధుమిత్ర శ్రేయోభిలాషుల వీడ్కోలు పలుకగా సుబ్బలక్ష్మి, సదాశివం, మృదంగం కళాకారుడు టి.కె. మూర్తి, వయోలిన్ కళాకారుడు ఆర్.ఎస్. గోపాలకృష్ణన్, ఘటం కళాకారుడు అలంగుడి రామచంద్రన్‌తో కలసి బొంబాయి రైలు ఎక్కింది.

అక్కడ కన్నన్ ఇంట్లో నాలుగురోజులు ఉండి ఆగస్టు 25న లండన్‌కు విమానం ఎక్కారు. సుబ్బలక్ష్మికేకాదు, సదాశివానికి, పక్కవాద్య కళాకారులందరికీ ఇదే మొదటి విమాన ప్రయాణం. రాధ బాలింత అవటంవలన సుబ్బలక్ష్మికి తోడురాలేకపోయింది. రాధ ఉంటే చాలా ధైర్యంగా ఉండేది సుబ్బలక్ష్మికి. సదాశివం ఎప్పుడు సుబ్బలక్ష్మివైపు చూసినా సుబ్బలక్ష్మి కళ్లు తెరిచే ఉంటుంది. అందరికీ కొత్తకొత్తగా, భయంభయంగా ఉంది. ఎలాగోలా లండన్ చేరుకున్నారు. నారాయణ్ మెనన్ ఎయిర్‌పోర్ట్‌కి వచ్చి వీళ్లను విడిదికి తీసుకెళ్లాడు. సుబ్బలక్ష్మిని చూసి, "మీరు బాగా అలసిపోయినట్లు ఉన్నారు. నిద్రపోలేదా?" అని అడిగాడు.

"లేదు, నారాయణ్‌గారూ, సుబ్బలక్ష్మి పడుకోలేదు. ఎవరో ఒకళ్లు మెలకువగా ఉంటేనే కదా పైలట్ నిద్రపోకుండా ఉండి, విమానం నడిపేది.. అందుకే ఆ బాధ్యత ఈసారి సుబ్బలక్ష్మి తీసుకుంది. నిద్రపోతే ఒట్టు" అన్నాడు సదాశివం. "అయ్యో... ఈ రోజల్లా విశ్రాంతి తీసుకోండి. రేపు స్కాట్‌లాండ్‌కి బయలుదేరుదాం" అని చెప్పి ఒక భారతీయ కుటుంబంతో వీరిని వదలివెళ్లాడు.

తరువాతి రోజు స్కాట్‌లాండ్ చేరుకున్నారు. ఆ తరువాతి రోజు ఎడిన్‌బరో అంతర్జాతీయ సంగీతోత్సవం ప్రారంభంకానుంది. వేదిక దగ్గరకు తయారవుతూ బంగారు

ఎర్ల్ ఆఫ్ హేర్‌వుడ్ ద్వార మద్రాసు వచ్చాడని తెలిసి సదాశివం ఆఘమేఘాల మీద అతనిని కలవటానికి వెళ్లాడు. "సదాశివంగారూ, మీకిచ్చిన మాట నిలబెట్టుకోవటానికి వచ్చాను. ఇంకా ఇతర భారతీయ కళాకారులని కూడా ఎంపిక చేసుకుంటాను" అని చెప్పాడు. సుబ్బలక్ష్మితోపాటు మద్రాసు నుంచి బాలసరస్వతి కూడా ఎడిన్‌బరో ఉత్సవానికి ఎంపికయింది. ఉత్తర భారతం నుంచి పండిత్ రవిశంకర్, అలీ అక్బర్ ఖాన్, అల్లా రఖా ఎంపిక చేయబడ్డారు.

1962 ఆఖరులో లబ్ధి కచేరీలకు ఢిల్లీ వెళ్లినప్పుడు నెహ్రూని కలిశారు సుబ్బలక్ష్మి, సదాశివం. సదాశివం నెహ్రూతో ఎడిన్‌బరో ఉత్సవానికి ఆహ్వానం వచ్చినట్లు చెప్పాడు. "పాశ్చాత్య దేశస్తులు ఎక్కువగా వాద్యసంగీతాన్ని ఇష్టపడతారు. మరి సుబ్బలక్ష్మి పాట వాళ్లకేమైనా వినబుద్ధవుతుందా అస్సలు. వెళ్లి, అక్కడ నవ్వులపాలు కాముకదా" అంటూ తన అనుమానాన్ని బయటపెట్టాడు సదాశివం.

నెహ్రూ టీ టేబుల్ మీద తాళం వేస్తూ, "పాశ్చాత్య సంగీతం ఎక్కువ వాద్యపరికరాల సంగీతమే, పాశ్చాత్యులు ఎక్కువగా మొజార్ట్, బెథోవెన్‌ల వాద్యగోష్టులు వింటుంటారు. వారు ఎక్కువగా వాద్యసంగీతాన్నే ఇష్టపడతారు. కానీ...." సుబ్బలక్ష్మివైపు తిరిగి "నీ విషయంలో మాత్రం కాదు. నీ పాట, పాటలోని శ్రావ్యత పాశ్చాత్యులు తప్పకుండా ఆనందిస్తారు' అని నెహ్రూ సుబ్బలక్ష్మికి, సదాశివంకి ధైర్యం చెప్పాడు.

సుబ్బలక్ష్మి వేంకటేశ్వర సుప్రభాతం సాధనలో మూడవ దశకి చేరుకుంది. మొదటి దశలో సుప్రభాతంలోని నాలుగు భాగాలకి అర్థం తెలుసుకుంది. రెండవ దశలో సుప్రభాతం కంఠస్థం చేసుకుంది. ఇరవై నిమిషాల నిడివిగల సుప్రభాతం ఇక పాడటం నేర్చుకోవటమే. 1963 మొదలు సుబ్బలక్ష్మి, రాధ శాస్త్రోక్తంగా పాడటం నేర్చుకుంటున్నారు.

వేదపండితుల ముందు, రికార్డింగులో ఎలా పాడుతుందో అలా ఏకబిగిన పాడి చూపిస్తుంది సుబ్బలక్ష్మి. రాధ వంత పాడుతుంది. అందరూ చెవులు నిక్కపొడుచుకుని వింటున్నారు. సదాశివంకి వొళ్లంతా చెవులే. ఎక్కడ అపశ్రుతి దొర్లినా పట్టటానికి తయారుగా ఉన్నాడు. తంబూర మీటగానే, "ఓం.. కౌసల్యా సుప్రజా రామా పూర్వా సంధ్యా ప్రవర్తతే.. ఉత్తిష్ఠ నరశార్దూలా కర్తవ్యం దైవమాహ్నికం." అని మొదలుపెట్టి ఏకబిగిన ఇరవై నిమిషాలపాటు పాడింది. పక్కవాద్యం కూడా లేకుండా ఇరవై నిమిషాలు పాటు తన గాత్రంతో కట్టిపడేసింది సుబ్బలక్ష్మి. "సదాశివంగారూ ఇక రికార్డింగుకు వెళ్లొచ్చు". వేదపండితులు తమ ఆమోదం తెలిపారు. "తప్పకుండా వెళ్దాం, రాధకు నెలలు నిండాయి. ఎప్పుడైనా కాన్పు కావొచ్చు" చెప్పాడు సదాశివం, తల్లి సాయంతో పైకి లేస్తున్న రాధని చూస్తూ. 1963లో జూన్ 21న హెచ్.ఎమ్.వి. వారి రికార్డింగు స్టూడియోలో సుబ్బలక్ష్మి,



రాధ వేంకటేశ్వర సుప్రభాతం రికార్డింగు దిగ్విజయంగా చేశారు. 23న రాధ పండంటి బాబుకి జన్మనిచ్చింది. ఆ బాబును శ్రీ వేంకటేశ్వరుడి వరంగా భావించి శ్రీనివాసన్ అని పేరు పెట్టింది.

సదాశివం వేంకటేశ్వర సుప్రభాతం పని పూర్తి చేసిన వెంటనే ఎడిన్‌బరో వెళ్లాల్సిన పనుల మీదకు దృష్టి మళ్లించాడు. రాజాజీ కనుసన్నల్లో అన్ని ఏర్పాట్లు జరుగుతున్నాయి. ప్రముఖ విద్వాంసుల సలహాలతో పాటలు కూర్చుతున్నాడు సదాశివం.

ఈలోపు జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో స్వతంత్ర పార్టీ ఆరు సీట్లు గెలుచుకుని ప్రజల్లో తమ ఉనికిని చాటుకుంది. మద్రాసు చట్టసభలో కాంగ్రెస్, డి.ఎమ్.కె. తర్వాత మూడవ అతి పెద్ద పార్టీ అయింది. ఆ పై వచ్చే ఎన్నికలకి ఆశలు నిలబెట్టుకుంది.

𝄞𝄞𝄞𝄞

ఎడిన్‌బరో ప్రయాణం మొదలైంది. కర్ణాటక సంగీతం ఎల్లలు దాటనుంది. బంధుమిత్ర శ్రేయోభిలాషుల వీడ్కోలు పలుకగా సుబ్బలక్ష్మి, సదాశివం, మృదంగం కళాకారుడు టి.కె. మూర్తి, వయొలిన్ కళాకారుడు ఆర్.ఎస్. గోపాలకృష్ణన్, ఘటం కళాకారుడు అలంగుడి రామచంద్రన్‌తో కలసి బొంబాయి రైలు ఎక్కింది.

అక్కడ కన్నన్ ఇంట్లో నాలుగురోజులు ఉండి ఆగస్టు 25న లండన్‌కు విమానం ఎక్కారు. సుబ్బలక్ష్మికేకాదు, సదాశివానికి, పక్కవాద్య కళాకారులందరికీ ఇదే మొదటి విమాన ప్రయాణం. రాధ బాలింత అవటంవలన సుబ్బలక్ష్మికి తోడురాలేకపోయింది. రాధ ఉంటే చాలా ధైర్యంగా ఉండేది సుబ్బలక్ష్మికి. సదాశివం ఎప్పుడు సుబ్బలక్ష్మివైపు చూసినా సుబ్బలక్ష్మి కళ్లు తెరిచే ఉంటుంది. అందరికీ కొత్తకొత్తగా, భయంభయంగా ఉంది. ఎలాగోలా లండన్ చేరుకున్నారు. నారాయణ్ మెనన్ ఎయిర్‌పోర్ట్‌కి వచ్చి వీళ్లను విడిదికి తీసుకెళ్లాడు. సుబ్బలక్ష్మిని చూసి, "మీరు బాగా అలసిపోయినట్లు ఉన్నారు. నిద్రపోలేదా?" అని అడిగాడు.

"లేదు, నారాయణ్‌గారూ, సుబ్బలక్ష్మి పడుకోలేదు. ఎవరో ఒకళ్లు మెలకువగా ఉంటేనే కదా పైలట్ నిద్రపోకుండా ఉండి, విమానం నడిపేది.. అందుకే ఆ బాధ్యత ఈసారి సుబ్బలక్ష్మి తీసుకుంది. నిద్రపోతే ఒట్టు" అన్నాడు సదాశివం. "అయ్యో... ఈ రోజల్లా విశ్రాంతి తీసుకోండి. రేపు స్కాట్‌లాండ్‌కి బయలుదేరుదాం" అని చెప్పి ఒక భారతీయ కుటుంబంతో వీరిని వదలివెళ్లాడు.

తరువాతి రోజు స్కాట్‌లాండ్ చేరుకున్నారు. ఆ తరువాతి రోజు ఎడిన్‌బరో అంతర్జాతీయ సంగీతోత్సవం ప్రారంభంకానుంది. వేదిక దగ్గరకు తయారవుతూ బంగారు

జరీతో ఉన్న పచ్చ అంచు కంచిపట్టుచీర కట్టుకుంది. ఆ తర్వాత, "మామా!" గట్టిగా పిలిచింది సుబ్బలక్ష్మి . అతి ముఖ్యమైనది మరచిపోయినట్లు. "ఏంటి కుంజా?"

"మామా తలలోకి పూలు.." "అబ్బా..... ఇదొకటి ఉంది కదా. ఇక్కడ పూలు ఎక్కడ దొరుకుతాయి కుంజా... సరే చూస్తానాగు" అనుకుంటూ వెళ్లాడు. కాసేపయిన తర్వాత, "కుంజా, ఇవే దొరికాయి ఇక, వీటినే దండకట్టుకో" అని పసుపు పచ్చని పెద్దపెద్ద మందారపూలు చేతిలో పెట్టాడు.

1963 ఆగస్టు 28న, కచేరీకి తయారయ్యి వేదిక దగ్గరకు చేరుకుంది సుబ్బలక్ష్మి బృందం. అక్కడ వారికి డ్యూక్ ఆఫ్ ఎడిన్‌బరో స్వాగతం పలికాడు. భారతదేశ కళలలో మొదటి ప్రదర్శన రవిశంకర్ సితార్ వాదనతో మొదలుపెట్టాడు. ఆ తర్వాత సుబ్బలక్ష్మి కచేరీ. కర్ణాటక సంగీతం గురించి ముందే కొంచమయినా చెప్తే బాగుంటుంది అనే ఉద్దేశంతో నారాయణ్ మెనన్ కర్ణాటక సంగీతం గురించి, సుబ్బలక్ష్మి పాడబోయే పాటల గురించి కాస్త వివరించాడు. అయినా సుబ్బలక్ష్మి భయపడుతూనే ఉంది. 'వీళ్లకి భాషా అర్థం కాదు.. శాస్త్రమూ అర్థం కాదు. ఇంక ఏమి వింటారు.. అస్సలు నా ముందు కూర్చుంటారా.. ఒక్కొక్కరూ వెళ్లిపోతుంటారా...' అనుకుంటుంది. కాని తన బాధ్యత తను నిర్వర్తించాలి. కర్ణాటక సంగీతాన్ని తొలిసారిగా యూరోపా ఖండంలో వినిపించబోతోంది. అన్ని కచేరీలకంటే మిన్నగా పాడాలనుకొని, సుబ్బలక్ష్మి తన కచేరీ మొదలుపెట్టింది.

మొదటిపాట 'విరిబోణి' వర్ణం. ఈ భైరవి రాగ వర్ణం పాడటంలో కర్ణాటక సంగీత ప్రపంచంలో సుబ్బలక్ష్మికి పెట్టిందిపేరు. అందుకే సదాశివం వర్ణాలలో ఈ వర్ణాన్ని ఎంచాడు. ఈ వర్ణంతోనే, ఈ మొదటి పాటతోనే శ్రోతల్ని కట్టిపడేసింది సుబ్బలక్ష్మి. ఆ తరువాతి పాట త్యాగరాజ కృతి 'ప్రక్కన నిలబడి' ఈ కృతిలో నెరవు అందరినీ ఆకట్టుకుంది. తరువాతి పాట శ్యామశాస్త్రి కృతి 'సరోజదళనేత్రి', సుబ్బలక్ష్మికి ఇష్టమైన రాగం శంకరాభరణంలో. ఇలా పాట వెంబడి పాట తెలుగు పాటలు పాడుతూ, ఎనభైశాతం తెలుగు మయమైన కర్ణాటక సంగీత వైభవాన్ని పాశ్చాత్యులకి పరిచయం చేసింది.

కర్ణాటక సంగీతం!! కన్నడిగుడయిన పురందరదాసుని కర్ణాటక సంగీత పితామహుడని అన్నారని కర్ణాటక సంగీతానికి ఆ పేరు మా కర్ణాటక రాష్ట్రం పేరుమీదుగా వచ్చిందన్నారు కన్నడిగులు. అదేంకాదు, కర్ణాలకి వినసొంపుగా ఉంటుందని 'కర్ణాటక సంగీతం' అని పేరువచ్చిందని కొందరన్నారు. ఇంకొందరు 'కర్ణాటకం' అంటే చాలా చాలా పాతది అని అర్థం, కర్ణాటక సంగీతం కూడా చాలా ప్రాచీనమైనది కాబట్టి 'కర్ణాటక సంగీతం' అనే పేరొచ్చిందని అన్నారు. మరికొందరు, ఈ సంగీత సంప్రదాయం కర్ణాటక ప్రాంతంలో, అనగా తూర్పు కనుమలు, కోరమండలం తీరం మధ్యనున్న ప్రాంతంలో





ఎడిన్‌బరోకి ప్రయాణమవుతున్న సందర్భంలో



ఎడిన్‌బరోకి వెళ్తూ విమానం నుంచి వీడ్కోలు

అభివృద్ధి చెందినది కాబట్టి కర్ణాటక సంగీతమనే పేరొచ్చిందని అన్నారు. కొంతమంది సంగీతజ్ఞులు, ఈ సంగీతం పూర్తిగా వ్రాయబడి నేర్చుకునే వీలు లేదు కాబట్టి, కర్ణాల ద్వారానే ఒక తరం నుంచి ఇంకో తరంకు నేర్పబడుతుంది కనుక, కర్ణాటక సంగీతమనే పేరు స్థిరపడిందని అన్నారు. సరే, ఇన్ని రకాలుగా వాదులాడుకోవటం ఎందుకు, ఈ సంగీతం సశాస్త్రీయమైనది కాబట్టి శాస్త్రీయ సంగీతం అని పిలుద్దాం అంది ఒక వర్గం. మద్రాసు మ్యూజిక్ అకాడమీలో జరిగిన చర్చలో రాజాజీ మాట్లాడుతూ ఈ సంగీతాన్ని 'దక్షిణాది సంగీతం' అని పిలుద్దాం అని ప్రతిపాదించాడు. ఈ వాదోపవాదనల మధ్య బొంబాయిలో జరిగిన సంగీత మహాసభ ఈ దక్షిణాది శాస్త్రీయ సంగీత సంప్రదాయానికి 'కర్ణాటక సంగీతం' అనే పేరునే ఖరారు చేసింది. ఇలాంటి మహోన్నతమైన కర్ణాటక సంగీతాన్ని కోకిలగాన ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి కంఠంలో వినటంకంటే వేరొక భాగ్యంలేదు. అలాంటి భాగ్యం పొందిన ఎడిన్‌బరో నగరవాసులు సుబ్బలక్ష్మి కచేరీ ముగించగానే కరతాళ ధ్వనులతో తమ హర్షాతిరేకం తెలుపుతున్నారు. సుబ్బలక్ష్మి ఎప్పటిలానే కచేరీ అయిన తర్వాత కూర్చుని నమస్కరిస్తుంది. కాసేపటికి లేచి నుంచుంది. చప్పట్లు ఆగటంలేదు. మళ్లీ అందరికీ నమస్కరించింది. ఆ హాలులోని శ్రోతలందరూ నుంచొని చప్పట్లు కొడుతూ తమ ఆనందాన్ని, మర్యాదని తెలుపుతున్నారు. చప్పట్లతో ఫ్రీమాసన్ హాలు మారుమ్రోగిపోతుంది. ఎంతసేపంటే... సుబ్బలక్ష్మి తన ముందు ఉన్నవారందరినీ పరికించి చూడగలిగినంతసేపు. వారి చప్పట్లను ఆనందిస్తూ, స్వీకరిస్తూ నిల్చుండిపోయింది.

విడిదికి వెళ్లిన తర్వాత, "మద్రాసులో మనవాళ్లు కొట్టినట్లు చప్పట్లు కొట్టారు.. వీళ్లకి నచ్చిందంటారా మామా.....?" అడిగింది భర్తని.

"నారాయణ్ మెనన్ వస్తేకాని ఏ సంగతీ చెప్పలేం..." అని సమాధానమిచ్చాడు సదాశివం. సదాశివం అనుమానాలు సదాశివానికి ఉన్నాయి. పాశ్చాత్యులు కర్ణాటక సంగీతం అర్థమై, అంతసేపు చప్పట్లు కొట్టారా... మర్యాదకోసం కొట్టారా.... అని.

తరువాతి రోజు నారాయణ్ మెనన్ ఆ ప్రాంతపు దినపత్రికలు తీసుకొచ్చి సదాశివం ముందు పెట్టాడు. సదాశివం ఒక్కొక్క దినపత్రిక తీసి చదవటం మొదలుపెట్టాడు. మొదటిగా 'ద టైమ్స్ లండన్' పత్రిక, ఈ పత్రిక సదాశివం 1935లో 'ఆనందవికటన్' గురించి ప్రకటన ఇచ్చిన దినపత్రిక. 'ఒక సంస్కృతి యొక్క గాత్ర సంగీతాన్ని అర్థం చేసుకోవటం ఆ సంస్కృతి వాద్య సంగీతంకంటే కష్టంగా ఉంటుంది కానీ ఇది శ్రీమతి సుబ్బలక్ష్మి విషయంలో మాత్రం తప్పు. ఎందుకంటే ఆమె గాత్రం కర్ణాటక సంగీతంలోని అందాన్ని, దానిలోని క్లిష్టమైన అంశాలను సైతం గొప్పగా పరిచయం చేసింది' అని వ్రాసింది. నెహ్రూ సుబ్బలక్ష్మి విషయంలో చెప్పినది నిజమని రుజువు చేసింది ఈ పత్రిక.



'ది స్టేట్స్‌మన్' పత్రిక తన సమీక్షలో 'బ్రహ్మాండమైన గాత్ర ప్రక్రియ. ఈ ప్రజ్ఞ ముందు మనవాళ్లి మోకాళ్లమీద వంగి నమస్కరిస్తుంది... ప్రపంచ సంగీతానికి ఎల్లలు చెరిగిపోతున్నాయి. త్వరలోనే కర్ణాటక సంగీతం మనకు అర్థమవుతుంది కూడా' అని వ్రాసింది. 'ది స్కాటిష్ డైలీ' 'అబ్బురపరచిన బంగారు వన్నె చీర మహిళ' అంటూ తన సమీక్షను మొదలుపెట్టింది.

ఒకటికి రెండుసార్లు చదివిగానీ సదాశివం తలెత్తలేదు. "అయితే పర్వాలేదు... అర్థంకాకపోయినా ఆనందించారు."

"వాళ్లు అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నట్లున్నారు సదాశివంగారు.. ఇంకొక కచేరీ పెట్టమంటున్నారు" అన్నాడు నారాయణ్ మెనన్. సెప్టెంబర్ రెండున ఎడిన్‌బరోలో సుబ్బలక్ష్మి రెండవ కచేరీ చేసింది.

సెప్టెంబర్ మూడున కూడా అక్కడి దినపత్రికలు, పత్రికలు కర్ణాటక సంగీత వైభవాన్ని, సుబ్బలక్ష్మి ప్రజ్ఞని ఎలుగెత్తి చాటాయి. సుబ్బలక్ష్మి రెండు ప్రదర్శనలిస్తే, సుబ్బలక్ష్మి బాల్యస్నేహితురాలు బాలసరస్వతిచేత ఎడిన్‌బరో ప్రజలు ఎనిమిది ప్రదర్శనలు ఇప్పించుకున్నారు. ప్రఖ్యాత అమెరికా నర్తకీమణి మార్తా గ్రాహమ్ బాలసరస్వతి నాట్యం చూసి చలించిపోయింది. సుబ్బలక్ష్మి ఇంట గెలిచి రచ్చగెలిస్తే, బాలసరస్వతి రచ్చగెలిచి, ఇంటగెలిచింది. మద్రాసులో రుక్మిణీదేవి అడుగుఅడుగునా తన సదిర్ నాట్యానికి తూట్లు పొడుస్తుంటే, ఒంటరి దేవదాసీ ఏమీ చేయలేక నిస్సహాయంగా నిలబడిపోయింది. అయినా అవకాశమున్నచోట పోరాడుతూనే ఉంది. ఒకసారి ఒక సభలో, "ఈ బ్రాహ్మణ స్త్రీలు మానుంచి మా నాట్యాన్నయితే తీసుకున్నారుకానీ మా కళను మాకు వదలివేశారు. ఎందుకంటే, అది తీసుకుంటే వచ్చేదికాదు, దానికోసం పెట్టిపుట్టాలి" అని ఎద్దేవా చేసి,తన పోరాటపటిమను నిలబెట్టుకుంది.

ఎడిన్‌బరోలో బాలసరస్వతిని చూసిన పాశ్చాత్యులు ఆమెను అమెరికాలోని విశ్వవిద్యాలయాలలో సదిర్ నేర్పించటానికి ఆహ్వానించారు. సుబ్బలక్ష్మికి ఇలాంటి ఆహ్వానాలేమీ రాలేదుగానీ, తన స్నేహితురాలి విజయానికి, బాలసరస్వతి ధనమ్మ వంశం పేరు నిలబెట్టినందుకు, మనస్ఫూర్తిగా ఆనందించింది సుబ్బలక్ష్మి.

బ్రిటీష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పోరేషన్‌కి సుబ్బలక్ష్మి గురించి ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ప్రపంచాన్నంతా నలభై ఏళ్ల నుంచి గమనిస్తున్న బ్రిటీష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పోరేషన్ సుబ్బలక్ష్మి చేత ఒక సంపూర్ణమైన కచేరీని రికార్డు చేసుకుంది.

తిరుగు ప్రయాణంలో జర్మనీలోని ప్రవాస భారతీయుల కోరికమేర అక్కడొక కచేరీ చేసింది సుబ్బలక్ష్మి. ఈజిప్ట్‌లో ఉమ్ కుల్సుమ్ అనే ప్రఖ్యాత గాయనీమణి కలుసుకొని ఇద్దరూ ఒకరికొకరు తమ సంగీతాన్ని పరిచయం చేసుకున్నారు.

మద్రాసులో సుబ్బలక్ష్మికి ఘనమైన స్వాగతం లభించింది. సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చిన వెంటనే రాధ చంటిపిల్లాడి పనుల్లో పడిపోయింది. సదాశివం, ఆత్మనాథన్ పక్కకు తీసిపెట్టిన దినపత్రికలు చూడటం మొదలుపెట్టాడు. మొదట 'ది హిందూ' దినపత్రిక చూశాడు. అందులో సుబ్బలక్ష్మి ఎడిన్‌బరో కచేరీ గురించి 'ఎమ్.ఎస్. ఇన్ టాప్ ఫార్మ్ ఎట్ ఎడిన్‌బరో' అనే శీర్షిక ఉంది. ఇక అక్కడ నుంచి తెచ్చిన పత్రికలు, ఇక్కడి పత్రికలు ముందు వేసుకుని కల్కి పత్రికలో తన ఎడిన్‌బరో విజయం గురించి ఏం వ్రాయాలో ఆ పనిమీద పడ్డాడు.

ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి ఇంకో మెట్టు ఎక్కింది. కర్ణాటక సంగీత కళాకారులెవ్వరూ ఎక్కని మెట్టు. ఎడిన్‌బరో ఉత్సవం సుబ్బలక్ష్మికి అమితానందాన్ని ఇచ్చిన అవకాశం. సదాశివానికి ఆనందంతోపాటు, విజయగర్వాన్ని ఇచ్చిన అవకాశం, సుబ్బలక్ష్మి ఒక గుప్పిట, రాజకీయ, సంఘపలుకుబడి ఇంకో గుప్పిట, ఈ రెండింటివల్ల సదాశివం పరపతి ఇంతింతై వటుడింతై చందాన పెరిగిపోతూ ఉంది. ఇప్పుడు మామూలు రాజుకాదు, రాజాధిరాజులా ప్రవర్తిస్తున్నాడు. అన్నిటికీ కారణమైన సుబ్బలక్ష్మి మాత్రం మామూలు గృహిణిలా తన పని తాను చేసుకుంటూపోతుంది. సంగీతంలో ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ ఉంటే సుబ్బలక్ష్మికి అణుకువ పెరుగుతుంది. సదాశివానికి అణగదొక్కే మనస్తత్వం ఎక్కువవుతుంది.

మైసూరులో కచేరీకి ఏర్పాట్లు జరుగుతున్నాయి. "కుంజా! కాంభోజీ రాగంలో ఈ పాట పాడు."

"అంతకు ముందు మైసూరు వెళ్లినప్పుడు కూడా కాంభోజీనే పాడాను మామా, జనంకి నచ్చదేమో మామా."

"నచ్చేటట్లు పాడు."

"భజనలు పాడేప్పుడు చిరతలు వాయించు కుంజా."

"కష్టం మామా, పాడుతూ చిరతలు వాయించటం, ఏదో ఒకటి లయ తప్పుతుంది.."

"తప్పకుండా చిరతల తాళం వేయాలి. గొప్పవారందరూ వేయలేదూ? తుకారామ్, మీరా వీళ్లందరి చేతుల్లో చిరతలు లేవూ?"

"ఈసారి ఘటం వద్దు. మృదంగం చాలు."

"సరే మామా."

"నువ్వు రాధ ఏం చీర కట్టుకుంటున్నారు...?" వాళ్లు చెప్పేలోపల,





ఎడిన్‌బరోలో అంతర్జాతీయ సంగీతోత్సవం వేదిక వద్ద సుబ్బలక్ష్మికి, సదాశివంకు డ్యూక్ ఆఫ్ ఎడిన్‌బరో స్వాగతం



ఎడిన్‌బరోలో నారాయణ్ మెనన్, బాలసరస్వతి, సుబ్బలక్ష్మి

"మొన్న ముత్తుచెట్టి తెచ్చిన కాఫీపొడి రంగు చీరలు కట్టుకోండి."

"సరే మామా."

మైసూర్ విడిది ప్రముఖ ఆంగ్ల రచయిత ఆర్.కె. నారాయణ్ ఇంట్లో. సుబ్బలక్ష్మి, సదాశివం ఎప్పుడూ హోటళ్లలో ఉండరు. తరువాతిరోజు కచేరి. ఆ రాత్రి భోజనాలయ్యి కూర్చున్నారు. ఆర్.కె. నారాయణ్ స్నేహితులు, వారి కుటుంబాలు సుబ్బలక్ష్మిని చూడటానికి వచ్చారు. సదాశివం "కుంజమ్మా!" అని కేకవేశాడు. సుబ్బలక్ష్మి ముందు గదిలోకి వచ్చింది. "వీరు నిన్ను చూడటానికి వచ్చారు" అని చెప్పాడు. సుబ్బలక్ష్మి వాళ్లకి నమస్కారం చేసి, సదాశివంవైపు చూసింది. ఉండనా వెళ్లిపోనా అన్నట్లు. వారిద్దరికే అర్థమైన సైగతో సుబ్బలక్ష్మి లోపలికి వెళ్లిపోయింది. నారాయణ్ అంతా గమనిస్తున్నాడు. ఇంకొంచెం సేపటితర్వాత ఇంకొంతమంది వచ్చారు. వీరు కాస్త ముఖ్యులు. ఈసారి సుబ్బలక్ష్మికి సైగ కాసేపు కూర్చోమని. ఆర్.కె. నారాయణ్ మాటలమధ్య చెప్తున్నాడు, "సదాశివంగారూ, కుంజమ్మా, వాళ్ల అమ్మ నాకు ముందే తెలుసు. ఒకసారి కుంజమ్మ, వాళ్లమ్మ ఇద్దరూ కచేరీకి మైసూరు వచ్చారు. కానీ తిరిగి వెళ్లేటప్పుడు డబ్బులు పోగొట్టుకున్నారు. అప్పుడు తమ్ముడు లక్ష్మణ్ వీరికి డబ్బులు ఇచ్చిపంపాడు. షణ్ముగవడివు ఆ తర్వాత కలిసినప్పుడల్లా కృతజ్ఞతలు చెప్పేది" అంటూ సుబ్బలక్ష్మికి అమ్మతో గడిపిన కచేరీ రోజులు గుర్తుచేశాడు నారాయణ్.

ఆ తరువాతి రోజు కచేరీలో ఎప్పటిలానే సదాశివం ముందువరుసలో సరిగ్గా సుబ్బలక్ష్మికి ఎదురుగా కూర్చున్నాడు. ఎవరైనా విశిష్ట అతిథి వుంటే.. మైసూర్ మహారాజులాగా లేదా ఇంకెవరైనా అతిథులు ఉంటే వారి పక్కన కూర్చుంటాడు. ఎక్కడ కూర్చున్నా ముందువరుసలోనే, కాస్త అటుగా ఇటుగా సుబ్బలక్ష్మి ముందే. సుబ్బలక్ష్మి కచేరీ మొదలుపెట్టేముందు సదాశివంవైపు చూస్తోంది. కచేరీ మొదలుపెట్టాలంటే ఒక చిన్న నవ్వు నవ్వుతాడు. వద్దంటే సుబ్బలక్ష్మికి, రాధకి మాత్రమే అర్థమయ్యే సైగచేస్తాడు. ఇప్పుడొక నవ్వు నవ్వాడు. కచేరీ మొదలుపెట్టింది సుబ్బలక్ష్మి.

కచేరీ జరుగుతుండగా నిర్వాహకుడికి చాలా చీటీలు వస్తున్నాయి. ఆ చీటీలలో శ్రోతలు తమకు ఫలానా పాట సుబ్బలక్ష్మి నోట వినాలని ఉందని వ్రాసి పంపుతున్నారు. అవన్నీ తీసుకువచ్చి సదాశివం చేతిలో పెడుతున్నాడు నిర్వాహకుడు. సదాశివం వాటిని చూసి జేబులో కుక్కుకుంటున్నాడు తప్ప ఆ పాటలు పాడమని చెప్పటంలేదు. చివరికి శ్రోతలు మంగళంకి ముందు గట్టిగా చెప్పటం మొదలుపెట్టారు. తమకి పురందరదాసు కృతి అయిన 'జగదోద్ధారణ' పాడి వినిపించాలని. సుబ్బలక్ష్మి సదాశివంవైపు చూసింది. సదాశివం సైగనుబట్టి మంగళం పాడేసి కచేరీ ముగించింది.



చివరిలో ఆ చిన్న అంతరాయం తప్ప కచేరీ బాగా జరిగింది. నిదానంగా సర్దుకొని, బయలుదేరటానికి సిద్ధంగా ఉంది సుబ్బలక్ష్మి బృందం. సభ నిర్వాహకుడు సదాశివం దగ్గరకువచ్చి, "బ్రహ్మాండంగా జరిగిందండీ కచేరీ, రసజ్ఞులు ఆనందం పట్టలేకపోయారు" అని తన ఆనందం కూడా తెలిపాడు. సదాశివం గర్వంగా నవ్వుకుంటున్నాడు. సభ నిర్వాహకుడు సదాశివం చేతిలో చెక్కులు పెట్టి, "కానీ సదాశివంగారూ, రసజ్ఞులు కోరినట్లు సుబ్బలక్ష్మి గారు 'జగదోద్ధారణ' పాట పాడి ఉంటే చాలా బాగుండేది" అని అన్నాడు. అంతే.... సదాశివం అతనివైపు కొరకొరా చూసి, అతనిచ్చిన చెక్కులు పరపరా చించి, కింద విసిరికొట్టి అందరినీ చరచరా బైటకి లాక్కెళ్లాడు.

సదాశివంకి అంతలోనే అంత కోపం ఎందుకు వచ్చిందో ఎవరికీ అర్థంకాలేదు.

𝄞𝄞𝄞𝄞

1965 మొదట్లో కల్కి పత్రికలో సుబ్బలక్ష్మి తన లబ్ధికచేరీల ద్వారా అక్షరాలా నలభై లక్షలు సమకూర్చిందని గర్వంగా ప్రకటించాడు సదాశివం. ఆ పత్రికలోనే ఏ తేదీన ఏ ఊరిలో కచేరీ చేసిందీ, ఏ సంస్థ అవసరానికి నిధులు సమకూర్చిందో ఒక పట్టిక రూపంలో ప్రచురించాడు. సుబ్బలక్ష్మి కచేరీ ఆయా సంస్థల అవసరాలకి పూర్తిగా నిధులు చేకూర్చలేదుగానీ, ఆ సంస్థ సంకల్పించుకున్న పనికి అవసరమయ్యే నిధులలో ముప్పై నుంచి నలభై శాతం నిధులు ఒంటిచేత్తో ఒక్క కచేరీతో సంపాదించిపెట్టేది. 1945లో బొంబాయిలో సౌత్‌ఇండియన్ ఎడ్యుకేషనల్ సొసైటీకి నలభైరెండువేలు సమకూర్చింది. ఇదే సంస్థకి 1947లో తొంభై ఎనిమిది వేలు సమకూర్చింది. తిరువారూరులో త్యాగరాజస్వామి పుట్టి పెరిగిన ఇంటిని కొనుగోలు చేయటానికి పాతికవేలు తనవంతుగా ఇచ్చింది. ఇప్పటిదాకా సుబ్బలక్ష్మి ద్వారా లబ్ధి పొందిన సంస్థలలో పాఠశాలలు, కళాశాలలు, ఆసుపత్రులు, గుడులు, సంగీత సభలు, ఆధ్యాత్మిక సంస్థలు ఇలా చాలానే ఉన్నాయి. ప్రత్యక్షంగా సుబ్బలక్ష్మికి ఈ కచేరీల ద్వారా డబ్బుపరంగా ఎలాంటి లబ్ధి లేకపోయినా సేవాభావంతో, సమాజానికి తమవంతు తోడ్పాటుగా సదాశివం ఈ లబ్ధి కచేరీలను కొనసాగిస్తున్నాడు. కానీ పరోక్షంగా ఈ లబ్ధి కచేరీలు సంవత్సరంలో సగటున పది కచేరీలు చేస్తూ, వారి ఆదాయానికి గండి కొడుతున్నట్లు. ఇదే కాకుండా సదాశివం డబ్బుని విషంలా చూస్తాడు. డబ్బు కూడబెట్టుకునే ఆలోచన ఎప్పుడూ ఉండదు, సుబ్బలక్ష్మికి కూడా ఉండనివ్వడు.

ఢిల్లీలో నేషనల్ డిఫెన్స్ ఫండ్‌కి సుబ్బలక్ష్మి కచేరీ చేస్తుంది. సుబ్బలక్ష్మి చేతులు కదుపుతూ పాడుతూ ఉంటే రాధ ఆ చేతులవైపే చూస్తుంది. సుబ్బలక్ష్మికి ఇప్పుడుదాకా సదాశివం ఎలాంటి బంగారు నగలు చేయించలేదు. సుబ్బలక్ష్మి వేసుకునే నగల్లో ఒక్క

తాళిబొట్టు, నల్లపూసలూ తప్ప మిగతావన్నీ వాళ్ల అమ్మ చేయించినవే. సదాశివం ఈ విషయం బాహాటంగానే అందరికీ చెప్తాడు. షణ్ముగవడివు చేయించిన గాజులు, సుబ్బలక్ష్మి చాలా కాలం క్రితం సదాశివం చెల్లెలి చేతులు ఓటిగా కనిపిస్తే, ఆమెకు ఇచ్చింది. సుబ్బలక్ష్మి మట్టిగాజులతోనే ఉంటుంది. అందుకని రాధ, విజయ అమ్మకు బంగారు గాజులు చేయించారు. రాధ ఇప్పుడు ఆ గాజులు వేసుకున్న సుబ్బలక్ష్మి చేతులని తృప్తిగా చూసుకుంటుంది. కచేరీ అయిన తర్వాత ప్రధానమంత్రి లాల్‌బహదూర్ శాస్త్రి మాట్లాడుతూ, "దేశం ఆర్థికంగా చితికిపోయింది. ఇలాంటి సమయంలోనే మనమీదకి శత్రువు దాడి చేసింది.. ఈ యుద్ధానికి నిధులు సమకూర్చటానికి అందరూ సహాయం చేయండి. ప్రధాని యుద్ధనిధికి విరాళాలు ఇవ్వండి" అని అభ్యర్థించాడు. ఇది విన్న వెంటనే ముందువరుసలో ఉన్న సదాశివం సుబ్బలక్ష్మివైపు సైగలు చేశాడు. సుబ్బలక్ష్మికి అర్థమయింది. రాధవైపు చూసింది. రాధ మొహం అప్పటికే పాలిపోయింది. కానీ అది తండ్రి ఆజ్ఞ కాబట్టి అమ్మవైపు చూసి, "ఇచ్చేయమ్మా" అంది. సుబ్బలక్ష్మి తన చేతికి ఉన్న బంగారు గాజులు తీసి లాల్‌బహదూర్‌శాస్త్రికి అందజేసింది. సుబ్బలక్ష్మి భూరివిరాళం ఇవ్వటం చూసి, అక్కడున్నవారు ఎవరికి తోచినది వారు విరాళంగా ఇచ్చారు. ఆ గాజులు రెండు నెలల క్రితం సుబ్బలక్ష్మి పుట్టినరోజుకి రాధ, విజయలు ప్రేమతో తమ తల్లికి ఇచ్చిన బహుమానం.

సదాశివం మంచిపని అనుకున్నదానికి, ఎలాగైనా సరే డబ్బులు సమకూర్చుతాడు. ఆగడు.

𝄞𝄞

తమిళనాడు సార్వత్రిక ఎన్నికలు ఇంకో సంవత్సరంలో ఉంటాయనంగా, 1965 ఆఖర్లోనే రాజాజీ ఒక మంచి ఆలోచన చేశాడు. ఆ ఆలోచనతో కల్కి బంగ్లా ఆవరణలోని తన కార్యాలయానికి వచ్చాడు. తంగం, సుబ్బలక్ష్మి వచ్చి, కాఫీ ఇచ్చి పలకరించి వెళ్లారు.

"సదాశివం! ఈసారి మనం తప్పకుండా డి.ఎమ్.కె.తో పొత్తు కుదుర్చుకోవాలి. నెహ్రూ లేని కాంగ్రెస్ తప్పకుండా ఓడుతుంది" అంటూ తన రాజకీయ అనుభవాన్ని బయటపెట్టాడు.

సదాశివం తీక్షణంగా వింటున్నాడు. వెంటనే, "రాజాజీ రమ్మంటున్నారని చెప్పి, వీలైతే ఇప్పుడే అన్నాదురైని వెంటతీసుకొనిరండి" అని చెప్పి తన మనుషులని పంపాడు.

కార్ల శబ్దానికి తంగం పైనుంచి చూసింది. కారమ్మట కారు నాలుగు కార్లు కల్కి బంగ్లాలోకి వచ్చాయి. ఒక కారులోంచి అన్నాదురై దిగి, సదాశివం తోడ్కొనిపోగా రాజాజీ దగ్గరకు వెళ్లాడు.



తంగం ఇంకా అక్కడే వుంది. వంటవాడు వచ్చాడు. "తంగమమ్మా! మొత్తం ముప్పైమందిదాకా అవుతారు భోజనానికి. వంట మొదలుపెట్టమంటారా.."

వెంటనే మొదలుపెట్టమంది. ఆ వెంటనే, "తంగమమ్మా! కూరగాయలు తేవాలి. ఇంకా చాలా సరుకులు కావాలి.. డబ్బులివ్వండి."

"తంగమమ్మా పాలు కావాలి డబ్బులు ఇవ్వండి" అంటూ పనివాళ్లు వస్తున్నారు.

తంగం చరచరా సుబ్బలక్ష్మి దగ్గరకు వచ్చింది. "కుంజక్కా ఏంటిది, ఎంతమందికి వండించను? ఇప్పటికే పాతికమందికి వండించాను. మళ్లీ ముప్పైమందికి వండాలంట. నాకు ఈ నెల ఖర్చులకి ఇచ్చిన డబ్బులు ఒక వారంలోనే సగం అయ్యాయి.. ఇలా అయితే చాలా కష్టం. రానీ మామయ్యని, చెప్తా ఈరోజు" అని చిందులు తొక్కుతుంది.

"పోనీలే తంగం, మీ మామయ్య చెప్పినట్లు చెయ్యమ్మా."

"నువ్వు మాట్లాడకు కుంజక్కా నీకేమీ తెలియదు. ఈ రోజు మామయ్యతో మాట్లాడాల్సిందే" అంది తంగం. తల కొట్టుకుంది సుబ్బలక్ష్మి. "ప్రపంచమంతా నేను నోరు విప్పితే వినాలనుకుంటే ఇది నన్ను నోరుమూసుకోమంటుంది. సరే, నువ్వు, మీ మామయ్య మీ ఇష్టంవచ్చినట్లు చేసుకోండి" అని చెప్పి తన సంగీతం గదిలోకి వెళ్లింది.

𝄞𝄞𝄞𝄞

ఎడిన్‌బరో కచేరీ కార్యక్రమాలు అన్నీ దగ్గర ఉండి నారాయణ్ మెనన్ చూసుకుంటే.. సదాశివంకి ఇంకొక అనుయాయుడు అయిన సి.వి. నరసింహన్ ఇంకొక గొప్ప చారిత్రక ఘటనని కూర్చతలపెట్టాడు. ఇతను తమిళ ఇసై కాలం నుంచి సుబ్బలక్ష్మి సదాశివంలకు బాగా తెలిసిన వ్యక్తి. ఐ.సి.ఎస్. అధికారి అయిన నరసింహన్ 1956లో ఐక్యరాజ్య సమితికి బదిలీ చేయబడ్డాడు. ఇప్పుడు అమెరికాలోని న్యూయార్క్‌లో ఐక్యరాజ్య సమితి కార్యాలయంలో రెండవ అతి ముఖ్య పదవిలో ఉన్నాడు.

అమెరికా నుంచి మద్రాసు వచ్చిన సి.వి. నరసింహన్ సదాశివంని కలిశాడు. "సదాశివం గారూ, మనం అనుకున్నట్లు ఈ సంవత్సరంలోనైనా సుబ్బలక్ష్మిగారి కచేరీ ఏర్పాటు చేద్దామనుకున్నాను కానీ అయ్యేటట్లు లేదు. ఢిల్లీలో అందరూ భారత్-పాకిస్థాన్ యుద్ధంలో తలమునకలుగాఉన్నారు. ఇప్పుడు ఈ సంగతి మనం లేవనెత్తటం కూడా బాగుండదు.. అందుకే వచ్చే సంవత్సరానికి పెట్టుకుందాం.. ఏమంటారు?" అడిగాడు నరసింహన్.

"అలాగే. మీరు చెప్పినట్లే చేద్దాం" అన్నాడు సదాశివం. ఒక్కింత నిరాశ చెందినా. కచేరీ కచేరీకి సుబ్బలక్ష్మి పరిధిని పెంచే లక్ష్యం పెట్టుకున్నాడు సదాశివం. షణ్ముగవడివు

తర్వాత సుబ్బులక్ష్మి గాన పటిమను, గాత్ర ఆకర్షణా శక్తిని అంచనా వేసిన వ్యక్తి సదాశివం. ఆ అంచనాలకు తగ్గట్టు కచేరీలలో సుబ్బులక్ష్మి గానం, గాత్రం ఎల్లలు దాటుతుంటే సదాశివం ఆ కచేరీలనే ఎల్లలు దాటిస్తున్నాడు. సుబ్బులక్ష్మి కోసం అసలైన విశ్వవేదిక ఆలోచించిపెట్టాడు. అది కాస్త ఆలస్యమయ్యేసరికి నిరాశపడ్డాడు.

ఆ తర్వాత కొన్నిరోజులకి 'ది హిందూ' పత్రికలో 'ప్రస్తుతం దేశంలో నెలకొని ఉన్న పరిస్థితులవల్ల శ్రీమతి సుబ్బులక్ష్మి ఐక్యరాజ్య సమితి కార్యక్రమాన్ని వాయిదావేసుకున్నారు' అని ప్రచురించారు. "మరీ విడ్డూరం కాకపోతే, అన్నీ సుబ్బులక్ష్మి ఇష్టమేనా ఏమిటి... ఢిల్లీలో అనుమతి ఇవ్వలేదని రాసుకోవచ్చుగా" అంటూ పెదవి విరిచారు సుబ్బులక్ష్మి విజయపరంపరని చూసి ఈర్ష్యపడుతున్నవాళ్లు.

𝄞𝄞𝄞𝄞

1966, ఐక్యరాజ్య సమితి ఆవిర్భావ దినోత్సవం అక్టోబర్ 24. ఆరోజును పురస్కరించుకొని, దానికి ఒక్కరోజు ముందు భారత అధికార ప్రతినిధిగా ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మిని భారతీయ సంగీతాన్ని ప్రపంచానికి పరిచయం చేయవలసిందిగా భారత ప్రభుత్వం కోరింది.

భారత ప్రభుత్వం కోరడం తరువాతి సంగతి, అసలు సంగతి, ఈ ప్రతిపాదనని సి.వి. నరసింహన్ ఐక్యరాజ్య సమితి వైపు నుంచి కూర్చుకొచ్చాడు. ఐక్యరాజ్య సమితి 1949 నుంచి ప్రతి సంవత్సరం ఐక్యరాజ్య సమితి ఆవిర్భావ దినోత్సవం సందర్భంగా సభ్యదేశాల నుంచి ఒక దేశపు ప్రఖ్యాత సంగీత కళాకారుడిచేత కచేరీ ఇప్పించటం ఆనవాయితీగా వస్తుంది. ఇప్పటికి ఎనిమిదిమంది ప్రపంచ ప్రఖ్యాత కళాకారులు తమ సంగీతాన్ని వినిపించారు. చివరిసారి 1962లో ఒక ప్రఖ్యాత వయోలిన్ విద్వాంసుడు కచేరీ ఇచ్చాడు. ఐక్యరాజ్య సమితి ఈ సంగీత సమాహారాల ముఖ్య ఉద్దేశం ప్రపంచ దేశాలు, వివిధ దేశాల సంస్కృతుల గొప్పతనాన్ని తెలుసుకొని గౌరవించుకోవాలని. గత తొమ్మిది సంవత్సరాలనుంచి ఐక్యరాజ్య సమితిలో ఉన్నత పదవులలో పనిచేస్తున్న నరసింహన్ ఇలాంటి సంగీత సమ్మేళనాలు ఐదు చూశాడు. అప్పుడే తట్టింది అతనికి, ఒక సంవత్సరం సుబ్బులక్ష్మిని ఆహ్వానించవచ్చని. ఐక్యరాజ్య సమితిలో రెండవ అతిపెద్ద పదవికి చేరినప్పుడు తన ఆలోచనకు కార్యరూపం ఇవ్వటం ప్రారంభించాడు.

ఎప్పుడయితే ఐక్యరాజ్య సమితి కచేరీ ఖరారు అయ్యిందో సదాశివంలోని మార్కెటింగ్, పబ్లిక్ రిలేషన్స్ విజృంభించాయి. ఒక్క సంవత్సరపు ఆలస్యం అమృతం అయ్యింది సదాశివానికి, ఒక సంవత్సరం ముందు ఆలోచించి పెట్టిన తన ఆలోచనలకి ఇంకా చక్కని కార్యరూపం ఇవ్వడం మొదలుపెట్టాడు.



ముందుగా సుబ్బులక్ష్మి మీద చిన్న పుస్తకం ప్రచురించాడు. ముప్పైరెండు పేజీల పుస్తకంలో మొదటి పేజీలోనే చెప్పాడు సదాశివం. "నా భార్య సంగీత గమనం గత పాతికేండ్లలో ఏ స్థాయికెళ్లిందంటే, నేను నా భార్యని అదేపనిగా పొగుడుతున్నానని మీరు అనుకున్నా ఆమె సంగీత గమనం ఘనత చెప్పుకోవలసిందే. అందుకే నా భార్య సాధించిన విజయాల గురించి తెలుపుతున్న ఈ పుస్తకం అతి కొద్దిమంది సన్నిహితుల కోసమే" అని.

ఈ పుస్తకంలో సదాశివం 1940లో సుబ్బులక్ష్మిని పెళ్లిచేసుకున్న దగ్గర నుంచి 1944 కస్తూర్బా కచేరీల నుంచి, వేంకటేశ్వర సుప్రభాతం, ఎడిన్‌బరో కచేరీదాకా క్షుణ్ణంగా రాసుకొచ్చాడు. ఆమె లబ్ధి కచేరీలు ఇప్పటిదాకా నలభైలక్షలు చేకూర్చాయని చెప్పాడు. సుబ్బులక్ష్మి సంగీతం గురించి గాంధీ నుంచి నెహ్రూ, రాధాకృష్ణన్, వల్లభాయ్ పటేల్, రాజేంద్రప్రసాద్, మైసూర్ మహారాజు, ఎడిన్‌బరో‌లో పాశ్చాత్య సంగీత విద్వాంసులు ఎవరు ఎప్పుడు ఏమన్నారో కూడా చక్కగా రాశాడు. చివరిగా ఐక్యరాజ్య సమితి కచేరీకి వెళ్తున్నట్లు తెలియజేశాడు. చిట్టచివరిగా సుబ్బులక్ష్మిని, తనను నడిపిస్తున్న శక్తులు రెండని అది ఒకటి రాజాజీ, రెండు కంచి పరమాచార్య అని చెప్పి, వారిద్దరికీ కృతజ్ఞతలు, వందనాలు సమర్పించారు.

ఈ పుస్తకాన్ని రాజాజీ చూసి ఇలా అన్నారు, "నీకు నీ భార్యమీద ఉన్న ప్రేమ చూస్తుంటే సావిత్రికి సత్యవంతుడి మీద ఉన్న ప్రేమ గుర్తుకు వస్తుంది నాకు" అని.

ఆ వెంటనే సుబ్బులక్ష్మి, సదాశివం కంచి పరమాచార్య దగ్గరకు ఆశీస్సుల కోసం వెళ్లారు. "పరమాచార్యులవారి ఆశీర్వాదం కోసం అభ్యర్థిస్తున్నాను, భారతదేశ ప్రతినిధిగా విశ్వవేదిక పైకి వెళ్తుంది" అంటూ సదాశివం పరమాచార్య దీవెనలకోసం అభ్యర్థించాడు.

పరమాచార్యులవారు సుబ్బులక్ష్మిని దీవించి, "సదాశివం... నేనొక శ్లోకం ఇస్తాను.. సుబ్బులక్ష్మి చేత పాడిస్తావా... అక్కడ..." అంటూ అడిగారు.

"పరమాచార్యులువారు ఆజ్ఞాపించాలి" అన్నాడు సదాశివం.

పరమాచార్య నుంచి వచ్చిన తర్వాత కుటుంబానికి రెండవ పెద్దదిక్కు అయిన రాజాజీ వద్దకు ఆశీస్సులకి వచ్చారు.

"కుంజమ్మ భయపడుతుంది రాజాజీ.. ప్రపంచ దేశాల ప్రతినిధుల ముందు కచేరీ అంటే ఎంత పెద్ద బాధ్యత! ఏ చిన్న తప్పుచేసినా దేశానికి అవమానం కదాని..." చెప్పాడు సదాశివం.

"కుంజమ్మా! నువ్వు మామూలుగా ఏ కచేరీ అయినా ఎలా చేస్తావో అలాగే చెయ్యి ఈ కచేరీ కూడా. కొత్తగా ఇంకేదో చేద్దాం అనుకోకు. అన్ని కచేరీలలాగే ఇదీనూ"




సుబ్బులక్ష్మి మీద సదాశివం ప్రచురించిన పుస్తకంయొక్క ముఖచిత్రం



సుబ్బులక్ష్మికి సరైన దృక్పథం చూపి, సుబ్బులక్ష్మికి ధైర్యం చెప్పాడు రాజాజీ.

"సదాశివం! నేనూ, జనరల్ కరియప్ప ఈ విషయమే మాట్లాడుకుంటుంటే మాకో ఆలోచన వచ్చింది."

"ఏంటది రాజాజీ..."

"కుంజమ్మ అక్కడ కర్ణాటక సంగీతంతోపాటు ఒక ఆంగ్ల పాట కూడా పాడితే వినేవాళ్లకు ఒక్క పాటైనా అర్థమయినట్లు ఉంటుంది. వాళ్లు మన సంగీతం పాడలేకపోయినా మనం వాళ్ల పాట పాడగలిగినవాళ్లమనే గొప్పమనకుంటుంది."

"తప్పకుండా పాడుతుంది. చెప్పండి ఏ పాట పాడిద్దాం..." అడిగాడు సదాశివం.

'నేను ఆ పాట వ్రాస్తున్నాను సదాశివం."

"మీరు కూడా వ్రాస్తున్నారా... పరమాచార్య కూడా అనుగ్రహిస్తున్నారు. శుభం. ఇంతకంటే కావలిసిందేముంది" అంటూ రాజాజీ ఆశీస్సులతో వెళ్లారు సుబ్బులక్ష్మి, సదాశివం, రాధ, విజయ ఇంకా పక్కవాద్య కళాకారులు.

కంచి పరమాచార్య సంస్కృతంలో ఆయన కృతిని ఇచ్చారు. ఈ పాటని వసంత్ దేశాయ్ స్వరపరిచాడు. రాజాజీ ఆంగ్ల పాటని ఆల్ ఇండియా రేడియో పాశ్చాత్య సంగీతపు విభాగాధిపతి హాండెల్ మాన్యువల్ స్వరపరిచాడు.

సదాశివం ఈ రెండు పాటలని ప్రత్యేకంగా సాధన చేయించాడు. కంచి ముత్తుచెట్టిని పిలిచి సుబ్బులక్ష్మికి, రాధకి, విజయకి ఒకే రకం చీరలు నేయించాడు. పక్కవాద్య కళాకారులయిన మూర్తికి, వినాయక్‌రామ్‌కి, సుబ్రహ్మణ్యంకి సూట్లు, కుర్తా పైజమాలు, పట్టుపంచెలు, చొక్కాలు కుట్టించాడు. సమితి కచేరీ ప్రాముఖ్యతని దృష్టిలో పెట్టుకొని. ఆ రోజు పాడబోయే పాటలన్నీ చాలాసార్లు పూర్తి వాయిద్యాలతో అచ్చమైన కచేరీలాగా సాధన చేయించాడు సదాశివం. ఆ తర్వాత ఒకరోజు, "మీరు రేపు సూట్లు వేసుకొని ఇంటికి రండి" చెప్పాడు సదాశివం పక్కవాద్య కళాకారులకి, "ఎందుకండీ..." అడిగారు వాళ్లు.

"మనం ఎప్పుడూ లుంగీలు, పంచెలు తప్ప ఈ సూట్లు వేసుకోలేదు కదా.. అలవాటు చేసుకుందాం రండి. ఒకేసారి అక్కడికి వెళ్లిన తర్వాత వేసుకొని, మనకి ఊపిరాడకపోతే కష్టం."

"అవునండీ. ఇదే సరైన పద్ధతి. మొన్న కుట్టించి తెచ్చినరోజు, వేసుకున్నాను. సరిపోయిందో లేదోనని. నా చేతులు, కాళ్లు వంగితే ఒట్టు" అన్నాడు టి.కె. మూర్తి.

"మీకు ఇంకోవిషయం తెలుసా, మేము ఎడిన్‌బరో వెళ్లినప్పుడు తరువాతరోజు ఆలస్యమవుతుందని, ముందురోజు రాత్రే సూటు వేసుకుని పడుకున్నాడు అప్పుడు మాతో వచ్చిన ఘటం వాద్య కళాకారుడు, అలంగుడి రామచందర్. అంత ఇబ్బంది అయింది కొత్తగా ఈ సూట్లు వేసుకోవటం. అందుకే మీరంతా ఒకటికి నాలుగుసార్లు సూట్లు వేసుకుంటూనే ఉండండి. అలవాటు అయ్యేదాకా" చెప్పాడు సదాశివం.

బృందంలో అందరినీ చక్కగా ముస్తాబుచేసి ఫోటోలు తీయించిపెట్టాడు సదాశివం. ఇవి ఎప్పుడు ప్రచురించాలో కూడా ఆలోచించి పెట్టుకున్నాడు.

అక్టోబరు 23న ఐక్యరాజ్య సమితి కచేరి అయితే, సదాశివం 7 వారాల వ్యవధిలో 15 కచేరీలు అమెరికా, ఐరోపా ఖండాలలో ఖరారు చేశాడు. సుబ్బలక్ష్మి బృందం సెప్టెంబరు పదిహేనున ఈ ఖండాంతర యాత్రకి బయులుదేరే రోజునుంచి తనకు బాగా సన్నిహితుడైన కస్తూరి రంగన్ దినపత్రిక హిందూలో ఏరోజు ఏ వార్త రావాలో పద్ధతిగా వ్రాసి పెట్టాడు. ఆత్మనాథన్‌ని పిలిచి, "ఆత్మనాథన్! ఇలాంటి ఒక కాపీ తీసుకువెళ్లి హిందూలో పెట్టు. నేను ఏరోజు ఏ వార్త రావాలో అంతా వ్రాసిపెట్టాను. ఏమాత్రం తేడా రాకూడదు. నువ్వు ఈ పని జాగ్రత్తగా చూడు. జెనీవాలో కచేరీ అయితే దాని ముందురోజు, కచేరీ రోజు, ఆ తర్వాత రోజు ఆ కచేరీ గురించే రావాలి. నేను ఫోను చేస్తూ ఉంటాను."

"అలాగే మామా!" అన్నాడు ఆత్మనాథన్. ఆత్మనాథన్ కల్కిలో చేరి పన్నెండేళ్లు. సదాశివానికి కుడిభుజం అయ్యాడు.

సెప్టెంబరు పదిహేనోతేదీన సుబ్బలక్ష్మి బృందం మద్రాసు నుంచి బొంబాయికి బయలుదేరింది. మద్రాసు పురప్రముఖులు, సంగీత విద్వాంసులు అందరూ వచ్చి ఆప్యాయంగా, ఆర్భాటంగా సాగనంపారు.

వారి రైలు బయలుదేరగానే, "ముసిరిగారూ... మనం మద్రాసులో ఒక మంచి కచేరీ ఏర్పాటు చేసుకోవాటానికే కిందామీదా పడుతున్నాము.. మన శిష్యురాలైయుండి, ఈవిడేమిటయ్యా మైలాపూరు వాణీమహల్‌లో చేసినట్లు విదేశాల్లో చేస్తుంది..." అడిగాడు నారాయణస్వామి.

"స్వామిగారూ... అది మనకి సాధ్యం కాదులెండీ..."

"ఏం, ఎందుకు?"

"మనం మగవాళ్లం. మనకి మొగుళ్లు ఉండరు. ఉన్నా సదాశివంలాంటి వాడు దొరకడు."

ఎంతైనా కర్ణాటక విద్వాంసుల పరిశీలన ప్రకారం సుబ్బలక్ష్మికంటే పట్టమ్మకి విద్వత్తు ఎక్కువ. బృంద, ముక్త, వసంతకుమారి, సుబ్బలక్ష్మి వీరంతా పట్టమ్మ తర్వాతే. కానీ





ఐక్యరాజ్య సమితి కచేరీ బృందం- వయోలిన్ వాద్యకారుడు వి.వి. సుబ్రహ్మణ్యం, ఘటం వాద్యకారుడు వి.వినాయక్‌రామ్, మృదంగం వాద్యకారుడు టి.కె.మూర్తి, తంబూర కళాకారిణి విజయ, గాయని ఎమ్.ఎస్.సుబ్బలక్ష్మి, సహకార గాయని రాధ



సుబ్బులక్ష్మికే గొప్ప ప్రజాదరణ, అవకాశాలకి కారణం ఏమిటంటే, ఒకటి ఆమె మధురమైన కంఠం, రెండు, అందరూ అనుకుంటున్నట్లు సదాశివం.

బొంబాయి నుంచి విమానంలో దగ్గరదగ్గర మూడునెలల యాత్రకి బయలుదేరారు. విమానంలో సదాశివం సుబ్బులక్ష్మివైపు చూశాడు.

ఒక కాగితం మీద ఏదో రాసుకుంటుంది.

"ఏంటి కుంజా రాస్తున్నావు?" కాగితంలోకి చూస్తూ అడిగాడు సదాశివం.

"నారాయణికి ఉత్తరం రాస్తున్నా మామా, నిద్ర రావటంలేదు" అంది సుబ్బులక్ష్మి. సుబ్బులక్ష్మికి గంటలతరబడి కార్లల్లో,రైళ్లలో ప్రయాణం అలవాటే కానీ ఇంకా విమానం భయం పోలేదు.

వారు విమానం ఎక్కిన తరువాతి రోజున రాజాజీ ఒక ఆంగ్ల పాట వ్రాశారనీ, ఆ పాటని సుబ్బులక్ష్మి ఐక్యరాజ్య సమితిలో పాడనుందని 'ది హిందు' లో ప్రచురించారు. మొదటి మజిలీ అయిన జెనీవా సెప్టెంబరు 19న చేరుకున్నారు. ఇటు మద్రాసులో సెప్టెంబరు 20న రాజాజీ వ్రాసిన ఆంగ్ల పాట సాహిత్యం 'ది హిందూ' దినపత్రికలో ప్రచురించారు. సుబ్బులక్ష్మి బృందం జెనీవా చేరిందని కూడా తెలియపరిచారు. జెనీవాలో ఒకప్పుడు ప్రపంచ ప్రఖ్యాత వాద్యకారుడు బెథోవెన్ కచేరీ చేసిన రెడౌట్ విల్లా అనే సముదాయంలో సుబ్బులక్ష్మి కచేరీ. హాలు కిక్కిరిసిపోయింది. అందరూ సుబ్బులక్ష్మి కచేరీ కోసం ఉవ్విళ్లూరుతున్నారు. ఆ వాతావరణం చూసిన సదాశివం, "సుబ్బులక్ష్మి తన పాట వినిపించటానికి ఇలాంటి అంతర్జాతీయ వేదిక కోసమే నేను కష్టపడింది, ఆమె గొంతు అంతర్జాతీయంగా వినిపించాలి. అందరికీ నచ్చి, ఆమెను మెచ్చుకోవాలి, నేను నా పని చేశాను. సుబ్బులక్ష్మి ఇప్పుడు తన పని బ్రహ్మాండంగా చేస్తుంది" అని ఉద్వేగంతో అన్నాడు. సదాశివం లేకపోతే సుబ్బులక్ష్మి ఇంత త్వరగా అంతర్జాతీయ వేదికలకు వచ్చి ఉండేది కాదు. సదాశివం పరిచయాలవల్ల, అతని సామర్థ్యంవల్ల యాభైయేళ్లకే రెండవసారి అంతర్జాతీయ వేదికకు, అందులో ఒకటి అత్యంత ప్రతిష్ఠాత్మకమైన ఐక్యరాజ్య సమితి వేదికకు రాగలిగింది.

జెనీవా నుంచి ప్యారిస్ చేరుకొని అక్కడ కూడా కచేరీ చేసింది.

సెప్టెంబర్ 23 న మద్రాసులో 'హిందూ' దినపత్రిక'లో రాజాజీ ఆంగ్ల పాట, ఆ పాటను సుబ్బులక్ష్మి సమితి కచేరీలో పాడటం అనే అంశంమీద పెద్ద దుమారం రేగింది. మన సంస్కృతికి ప్రతినిధిగా వెళ్తూ మధ్యలో ఆ ఇంగ్లీష్ పాటెందుకు అని ప్రశ్నించాడు ఒక పాఠకుడు. ఇంకో పాఠకుడు ప్రఖ్యాత పాశ్చాత్య సంగీత విద్వాంసుడు యాహుదీ



మెన్యూహిన్ కర్ణాటక సంగీతం ఆలపిస్తాడా ఎప్పుడైనా... వాళ్లెవ్వరూ చేయనిది మనకెందుకు అని ప్రశ్నించాడు.

మొత్తానికి ఈ ఆంగ్ల పాట ఆలోచన ఎవరికీ నచ్చినట్లు లేదు.

పారిస్ నుంచి లండన్ చేరుకుంది సుబ్బులక్ష్మి బృందం. అక్టోబర్ రెండు గాంధీ జయంతినాడు ఇండియా హౌస్‌లో, భారత రాయబారి సమక్షంలో కచేరీ చేసింది. గాంధీకి ఇష్టమైన భజనలతో కచేరీ చేసింది.

మద్రాసులో లండన్ కచేరీ గురించి వివరాలు తెలుపుతూ 'ది హిందూ' కంచి పరమాచార్య కృతి 'మైత్రీమ్ భజతా..' సాహిత్యం కూడా ప్రచురించింది.

లండన్ నుంచి అమెరికా చేరుకుంది సుబ్బులక్ష్మి బృందం. ఇంకొన్ని కచేరీలు చేసుకుంటూ అతి ముఖ్యమైన కచేరీ అయిన ఐక్యరాజ్య సమితి కచేరీకి న్యూయార్క్ చేరుకుంది.

న్యూయార్క్ విడిదిలో సుబ్బులక్ష్మి, రాధ, విజయ, మధ్యాహ్నం జరగనున్న కచేరీకి సన్నద్ధమవుతున్నారు. వారి కంచిపట్టుచీరలు పక్కనపెట్టుకుంటున్నారు. ఒక పనిమీద సుబ్బులక్ష్మి రాధని పిలిచింది. ఆ పిలుపు సుబ్బులక్ష్మికే వినిపించలేదు. మళ్లీ పిలిచింది. 'రాధా... రాధా..' అనుకుంటూ... గొంతు పెగలటంలేదు.. అస్సలు గొంతులోంచి మాట బయటికి రావటంలేదు. సుబ్బులక్ష్మి ఒక్కసారిగా వెన్నులో వణుకుపుట్టుకొచ్చింది. ఇంకొన్ని గంటల్లో భారతదేశ ప్రతినిధిగా, కర్ణాటక సంగీతపు ప్రతినిధిగా అతి ముఖ్యమయిన కచేరీ జరగనుంది. సదాశివంవైపు చూసింది, ఈ కచేరీ బ్రోచర్‌లో వివరాలు చూసుకుంటున్నాడు. రాధ దగ్గరకు వచ్చి చేయి పట్టుకొని రాధని పక్కగదిలోకి తీసుకెళ్లింది. "ఏంటమ్మా... ఇటు తీసుకొచ్చావు" అడిగింది రాధ.

ఏడుపు మొహంతో, సైగలతో, సన్నని గొంతుతో, తనకి గొంతులోంచి మాట రావటం లేదని చెప్పింది సుబ్బులక్ష్మి. రాధకి ఏడుపొచ్చింది.

"ఏడవకు, మీ నాన్న వస్తారు" అంటూ సైగలు చేసింది.

"ఇప్పుడెలామ్మా..."

వెంటనే తన 'వానిటీ' పెట్టెలోంచి కంచి పరమాచార్యులవారి పటం తీసి ముందు పెట్టుకుంది. ధ్యానం చేసుకుంటూ కూర్చుంది. రాధ, విజయ సదాశివంకి ఏమాత్రం అనుమానం రాకుండా చూసుకుంటున్నారు. వారిద్దరికీ చాలా ఆదుర్దాగా ఉంది.

కాసేపటికి సదాశివం వచ్చాడు. "కుంజా! కుంజా!"

"అమ్మ ధ్యానం చేసుకుంటుంది నాన్నా" అంది రాధ. లోపలికి వచ్చి చూశాడు

సదాశివం. సుబ్బలక్ష్మి ధ్యానంలోనే ఉంది. "సరే రాధ, ఇదిగో మల్లెపూలచెండు కూడా వచ్చేసింది ఇండియానుంచి. ఇక తయారవ్వండి, తొందరగా" అని చెప్పి వెళ్లాడు. మళ్లీ ఏ మందారపూలో, పొద్దుతిరుగుడు పూలో పెట్టుకోవాల్సి వస్తుందేమోనని ఈ రోజుకి మాత్రం ఇండియా నుంచి మల్లెపూలు చెండులు వచ్చే ఏర్పాట్లు చేశాడు సదాశివం. సుబ్బలక్ష్మి బృందం చక్కగా తయారయ్యి ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ హాలుకి చేరుకున్నారు.

జనరల్ అసెంబ్లీ హాలు ఐక్యరాజ్య సమితి భవనాల్లో అన్నిటికంటే అతి పెద్దది. ఒకసారి ఢిల్లీలో టి.టి. కృష్ణమాచారి సుబ్బలక్ష్మికి పార్లమెంటు భవనం చూపించినప్పుడు, ఆ విస్తీర్ణాన్ని చూసి, "ఇలాంటి సౌధంలో కచేరీ చేస్తే ఎంత బాగుంటుంది కదా" అని అంది. భారత పార్లమెంటులోనయితే అవకాశం రాలేదుకానీ, ఇప్పుడు భారత పార్లమెంటుకంటే మూడింతలు పెద్దదయిన సౌధంలోకి సుబ్బలక్ష్మి కచేరీ కోసం అడుగుపెట్టింది. ముందుగా పక్కవాద్య కళాకారులు, గాత్రసహకారం అందిస్తున్న రాధ, తంబూర వేస్తున్న విజయ వెళ్లి, అక్కడ 1800 మందితో నిండిపోయున్న సౌధంలో, వారికి ముందు ఉన్న వేదికపై పరిచిఉన్న తివాచీ మీద కూర్చున్నారు. టి.కె. మూర్తి ఎడిన్‌బరోలో తప్ప ఇంకెవరూ ఇలాంటి వాతావరణాన్ని చూడలేదు. కాస్త మసకగా ఉంది. అల్లంత దూరాన వెలుగుతున్న విద్యుత్తు దీపాలు ఈ సౌధం ఎంత పెద్దదో, అక్కడ ఎంతమంది కూర్చున్నారో ఒక అంచనా ఇస్తుంది. ఆ తర్వాత సి.వి. నరసింహన్ వచ్చి, "మిస్టర్ ప్రెసిడెంట్, మిస్టర్ సెక్రటరీ జనరల్, యువర్ ఎక్సలెన్సీస్, లేడీస్ అండ్ జెంటిల్‌మెన్, ఈ మధ్యాహ్నం మీరు వినబోయే సంగీతం మీలో కొందరికి కొత్తగా, భిన్నంగా అనిపించవచ్చు. ఈ పాటలు ఎక్కువగా తెలుగులో, సంస్కృతంలో ఉంటాయి. సంస్కృతం, భారతదేశపు ప్రాచీనభాష. దక్షిణభారత శాస్త్రీయ సంగీతపు పాటలన్నీ ఎక్కువగా తెలుగు భాషలో ఉంటాయి.పాడబోయే ఇతర పాటలు... కన్నడ భాషలో ఒక పాట, తమిళంలో ఒక పాట, ఈ పాటని ఆరు రీతులలో పాడుతారు. ఆ తర్వాత, కంచి కామకోటి పీఠాధిపతి జగద్గురు శంకరాచార్యులవారు ప్రత్యేకంగా ఈ సందర్భం కోసం కూర్చిన మంగళాశాసనం, సంస్కృతంలో ఉంటుంది. అలాగే, భారతదేశ గొప్ప రాజనీతిజ్ఞుడు అయిన చక్రవర్తి రాజగోపాలాచారిగారు, ప్రేమతో రాజాజీ అని పిలవబడేవారు, ఈ సందర్భం కోసమే ప్రత్యేకంగా కూర్చిన ఇంగ్లీష్ గీతం ఒకటి ఉంటుంది.

యువర్ ఎక్సలెన్సీస్, లేడీస్ అండ్ జెంటిల్‌మెన్ ఇప్పుడు సగర్వంగా ఈనాటి కళాకారిణిని మీ ముందుకు ఆహ్వానిస్తున్నాను" అని చెప్పి మైకుతోసహా వెళ్లిపోయాడు. అప్పుడు సౌధం అంతా పూర్తిగా మసకగా చేయబడింది. వేదికకు కుడివైపునుంచి సుబ్బలక్ష్మి నడుచుకుంటూ వస్తూ ఉంటే సుబ్బలక్ష్మిమీదే వెలుతురు వేస్తూ సుబ్బలక్ష్మి



వేదికమీద తన బృందం దగ్గరకు వచ్చేదాకా దారి చూపిస్తుంది. ఆ తరువాత ఆ వెలుతురు వేదికమీదనున్న కచేరీ సభ్యులు మీద ఉండి సౌధం అంతా మసగ్గా ఉండిపోయింది. సుబ్బలక్ష్మి ముందుగా ఎదురుగా ఉన్న సభ్యులకి నమస్కారం చేసింది. ఆ తర్వాత కుడివైపు సభ్యులకి, ఆ తర్వాత ఎడమవైపు సభ్యులకి నమస్కారం చేసి హుందాగా కూర్చొని చీర సరిచేసుకుంది. ఇక కచేరీ మొదలుపెట్టే సమయం వచ్చింది. గొంతు సంగతి ఇంకా సుబ్బలక్ష్మికి కూడా తెలియదు. పైకి నవ్వుతూ, హుందాగా, గంభీరంగా ఉన్నా, మనస్సులో ఇంకా పరమాచార్యని ధ్యానం చేసుకుంటూవుంది. మొదటి కృతి 'రామ నన్ను బ్రోవరా...' ఇప్పుడు ఆ పరంధాముడి బ్రోవు కావాలి... ఎప్పుడూ పాటని భావంతో పాడే సుబ్బలక్ష్మికి, పాటకి ముందే భావంతో నిండిపోయింది గొంతు. రాధకి, విజయకి, సుబ్బలక్ష్మికి ఉత్కంఠగా ఉంది. మరుక్షణం గొంతు విప్పి పాడాలి.

చివరిసారిగా పరమాచార్యను తలుచుకొంది. తంబూర నాదం వినిపిస్తుంది, గొంతు సరిచేసుకుంటూ చిన్న ఆలాపన చేసింది. 'రామ నన్ను బ్రోవరా' అంటూ పాటందుకుంది. ఆశ్చర్యం... గొంతు మామూలుగా చక్కగా ఉంది.

సుబ్బలక్ష్మి, రాధ, విజయ అందరూ మనసులోనే ఆనందపడుతూ పాట కొనసాగించారు. ఈ త్యాగరాజ కృతిలో కర్ణాటక సంగీత రీతికి ప్రత్యేకమైన నెరవు, కల్పన స్వరాలని ఈ విశ్వవేదికకు పరిచయం చేసింది. ఈ త్యాగరాజ కృతి అయిన తర్వాత 1800 మంది వివిధ దేశాల సభ్యులు మొదటిసారిగా విన్న కర్ణాటక సంగీతపు కృతికి అబ్బురపడి చప్పట్లతో ఆనందాశ్చర్యాలని తెలిపారు. రెండవ పాట, "సారసాక్ష పరిపాలయమామ్" స్వాతి తిరునాళ్ సంస్కృత కృతి. ఈ పాటకు మొదలులో కర్ణాటక సంగీత రాగాలాపన రుచి చూపించింది. ఆ తరువాతి కృతి సుబ్బలక్ష్మికి ఇష్టమైన శంకరాభరణం రాగంలో శ్యామశాస్త్రి కృతి.. 'సరోజదళ నేత్రి..' తన మదురై అమ్మవారిమీద. ఈ కృతి ఒక్కటే అరగంట పైగా సాగింది. మొదట పదినిమిషాలు రాగాలాపన చేసింది. తరువాత వయోలిన్ వాద్యకారుడు పదినిమిషాలు రాగాలాపన చేశాడు. తరువాత సుబ్బలక్ష్మి కృతి పాడింది. చివరిగా వినాయక్‌రామ్ ఘటం, టి.కె. మూర్తి మృదంగంల తని ఆవర్తనం. ఈ తని ఆవర్తనానికి శ్రోతలు మూడుసార్లు చప్పట్లు కొట్టారు.

సి.వి. నరసింహన్ మళ్లీ వచ్చి "యువర్ ఎక్సలెన్సీస్, లేడీస్ అండ్ జెంటిల్‌మెన్, ఇప్పుడొక విరామం. ఆ తర్వాత మొదటి పాట ఇంగ్లీష్‌లో గీతం. ఈ గీతానికి శ్రీ హెరాల్డ్ షాంప్, శ్రీమతి సుబ్బలక్ష్మి, రాధలకు పియానో సహకారం అందిస్తారు" అని చెప్పి వెళ్లాడు. ఆ చిన్న విరామం కోసం సుబ్బలక్ష్మి బృందం అంతా లేచి, వారి గదిలోకి వెళ్లారు. సుబ్బలక్ష్మి 5 గంటలు ఏకబిగిన కచేరీ చేయగలదు. ఇప్పుడు అయింది ఒక గంట మాత్రమే. విరామం సుబ్బలక్ష్మికి కాదు, వింటున్నవాళ్లకి.

కొద్దిపాటి విరామం తర్వాత కర్ణాటక సంగీత కచేరీలలో ఎవ్వరూ ఇప్పటిదాకా చూడని విశేషం చూడాల్సొచ్చింది. విరామం తర్వాత వచ్చిన సుబ్బలక్ష్మి, రాధ వేదికకు ఒకపక్క నుంచొని, రాజాజీ వ్రాసిన ఆంగ్ల పాట పాడారు. ఆ తర్వాత వచ్చి కూర్చొని కచేరీ మొదలుపెట్టారు. కర్ణాటక సంగీత రత్నత్రయంలోని ముత్తుస్వామి దీక్షితుని కృతి 'శ్రీ రంగపుర విహార'తో మొదలుపెట్టారు. ఆ తరువాత మైసూర్ మహారాజా జయచామరాజేంద్ర వడయార్ కృతి 'శివశివ భో'. పురందర దాస కృతి 'జగదోద్ధారణ' తరువాతి పాట. ఈ పాట అయిన తర్వాత సభ్యులు చేసిన కరతాళ ధ్వనులు ఇప్పటిదాక వినిపించిన దానికంటే గట్టిగా, ఎక్కువసేపు వినిపించాయి. శ్రోతలని తనవైపు తిప్పుకుంది అనటానికి ఇది నిదర్శనం. 'జగదోద్ధారణ....' హిందుస్థానీ కాఫీ రాగంలో ఉండే ఈ కృతి చాలా క్లిష్టమైన కృతి, ఊపిరి తీసుకోవటానికి కూడా తెరిపి ఉండదు. ఊపిరి బిగబట్టి సంగతులు, గమకాలు పలకాలి. ఇలాంటి విద్వత్తు సుబ్బలక్ష్మికి వెన్నతోపెట్టిన విద్య. జగదోద్ధారణ అద్భుతంగా పాడేవారిలో సుబ్బలక్ష్మిది మొదటిస్థానం. ఆ విద్వత్తుని విదేశీయులు కూడా గుర్తించి, గౌరవించినందుకు ఆనందించింది సుబ్బలక్ష్మి బృందం. తరువాతి పాట మీరా భజన 'హరి తుమ్‌హారో'. ఆ తరువాతి పాట రాగమాలికలో తమిళ పాట 'వడరైగయీ మాథథి'. ఇంకొక్క పాట ఉండనగా ఐక్యరాజ్య సమితి జనరల్ సెక్రటరీ యుథాంట్ వచ్చి ముగింపు భాషణ ఇచ్చాడు. "యువర్ ఎక్స్‌లెన్సీస్, లేడీస్ అండ్ జెంటిల్‌మెన్... మీ అందరికీ తెలుసు మనకు మామూలుగా ప్రతి సంవత్సరం రెండు కచేరీలు ఉంటాయి. ఒకటి ఐక్యరాజ్య సమితి దినోత్సవం రోజున, ఇంకొకటి మానవ హక్కుల దినోత్సవం రోజున. గత ఏడాది అంతర్జాతీయ సహకార దినోత్సవం సందర్భంగా ఇంకొక కచేరీ ఏర్పాటు చేయ నిశ్చయించాము. అందుకోసం నేను శ్రీమతి సుబ్బలక్ష్మిని, ఆమె సంగీత సహాయకులను న్యూయార్క్ ఆహ్వానించాను. అనేక కారణాల వల్ల కచేరీ వాయిదా వేయబడింది. అందుచేత ఈ సంవత్సరం మరలా శ్రీమతి సుబ్బలక్ష్మిని ఆహ్వానించాను. ఐక్యరాజ్య సమితి దినోత్సవ ముందు రోజు కచేరీ చేయమని. మీరంతా ఒక గంటదాకా ఆమె సంగీతం విన్నారు. చూస్తూంటే ఈ కార్యక్రమం బాగా విజయవంతమైందనిపిస్తుంది. మనం చాలా మంచి సంగీతం విన్నాము. మీలో కొందరికి అది భిన్నంగా తోచి ఉండవచ్చు. ఈ కచేరీకి ఇంతమంది హాజరవటం చూస్తే, ఐక్యరాజ్య సమితి క్రొత్త ఆలోచనలని ఎలా సాదరంగా ఆహ్వానిస్తుందో తెలుస్తుంది. వ్యక్తిగతంగా నా గురించి చెప్పాల్సివస్తే బర్మా దేశస్థుడినైన నేను బర్మాలో ఎక్కువగా ఉండే భారతీయుల నుంచి ఈ సంగీతం ఇంతకు ముందు కూడా విన్నాను. కానీ ఈ రోజు శ్రీమతి సుబ్బలక్ష్మి ఆమె సహాయకులు అందించిన సంగీతం వినటం సరికొత్త అనుభవంలాగుంది. మీరంతా శ్రీమతి సుబ్బలక్ష్మికి, ఆమె సహాయకులకి ఇచ్చిన



ప్రోత్సాహం చూస్తుంటే, సంగీతానికి ఎల్లలు లేవని నిరూపితమైంది. సంగీతం విశ్వజనీనమైన భాష పలుకుతుందని తెలుపుతుంది.

ఈ సందర్భంలో నేను భారత ప్రభుత్వానికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను. వారి ఔదార్యం వల్లనే ఈ రోజు ఈ సంగీత కచేరీ వీలుపడింది. ఇంకా శ్రీమతి సుబ్బలక్ష్మి ఇక్కడ ఉన్న ఆమె సహాయకులకే కాకుండా మనము, ఆమె భర్త సదాశివంకి కూడా కృతజ్ఞతలు తెలుపుకోవాలి. శ్రీమతి సుబ్బలక్ష్మి ఆమె స్వదేశమైన భారతదేశంలో గొప్ప పేరున్న సంగీతజ్ఞులలో ఒకరు. కొన్ని సంవత్సరాల క్రితం ఇలానే ఆమె ఎడిన్‌బరో అంతర్జాతీయ సదస్సులో కూడా కచేరీ చేశారు. కానీ అమెరికాకు ఆమె ఇదే మొదటిసారి రావటం అనుకుంటున్నాను. ఈ రోజు ఈ కచేరీకి ముందు అమెరికాలో కొన్నిచోట్ల కచేరీలు చేశారు. ఇంకా కొన్నిచోట్ల చేయనున్నారు. శ్రీమతి సుబ్బలక్ష్మి మరియు ఆమె బృందం ఈ దేశంలో చక్కగా వారి సమయం గడుపుతారని ఆశిస్తున్నాను. ధన్యవాదాలు."

ఈ భాషణ అయిన తర్వాత కంచి పరమాచార్య మంగళాశాసనం పాడి, ఐక్యరాజ్య సమితి ఎందుకు ఏర్పరచబడిందో ఆ విలువల్ని ఆ సమితికి, 'మైత్రీం భజతా, యుద్ధం త్యజతా, స్పర్ధాం త్యజతా, త్యజత పరేషు అక్రమాక్రమణం' అంటూ మరొక్కసారి ఆ ఐక్యరాజ్య సమితి దిక్కులు పిక్కటిల్లేలా గుర్తుచేసి, తన కచేరీని ముగించింది. కరతాళ ధ్వనులు, మెల్లగా ఒక్కొక్కటిగా వెలుగుతున్న విద్యుత్తు దీపాలు ఉరుములు, మెరుపులని తలపించాయి. అందరూ లేచి నుంచున్నారు. సుబ్బలక్ష్మి అందరికీ నమస్కరించింది. ఒక ఉద్యోగిని వచ్చి పుష్పగుచ్ఛం సుబ్బలక్ష్మికి ఇచ్చింది. ఆ పుష్పగుచ్ఛం రెండుచేతుల్లో ఉండగా మళ్ళీ అందరికీ తలవంచి వీడ్కోలు పలుకుతూ సుబ్బలక్ష్మి ముందు నడవగా, తన బృందం వెనుక నడిచింది. వారందరూ కనుచూపు నుంచి దూరమయినా కూడా చప్పట్లు ఆగలేదు. వేదికమీద వదలి వెళ్లిన తంబూర, ఘటం, మృదంగం భారతీయతకు ప్రతీకగా, కర్ణాటక సంగీత రాయబారులుగా ఆ చప్పట్లను అందుకున్నాయి.

వేదిక వెనక వారి గదిలోకి వెళ్లగానే సుబ్బలక్ష్మి, సదాశివం, రాధ, విజయ, మూర్తి, వినాయకరామ్, సుబ్రహ్మణ్యం ఆనందంతో ఉద్విగ్నులయ్యారు. ఒకళ్లనొకళ్లు అభినందించుకున్నారు. ఏ ప్రకారంగా చూసినా అత్యంత ప్రతిష్ఠాత్మకమైన కచేరీని దిగ్విజయంగా ముగించారు.

"నాన్నా, కచేరీకి ముందు అమ్మకు గొంతు పెగలలేదు" మెల్లగా చెప్పింది రాధ. "ఇప్పుడు కదా.. ఆనందంతో మనకి గొంతు పెగలటంలేదు. అప్పుడంటావేంటి.." అన్నాడు సదాశివం.

రాధ జరిగిన కథ చెప్పింది. ఒక్క క్షణం బిత్తరపోయాడు సదాశివం. "గొంతు రాకపోయి ఉంటే..." అనుకున్నాడు. కంచి పరమాచార్యమీద భక్తిభావం

ద్విగుణీకృతమయ్యింది సుబ్బలక్ష్మికి, సదాశివానికి. ఆ తరువాతి రోజు ఎడిన్‌బరోలో నారాయణ్ మెనన్‌లాగా, సి.వి. నరసింహన్ న్యూయార్క్ దినపత్రికలన్నీ పట్టుకొని వచ్చి, "మనం గెలిచాం" అని హర్షాతిరేకంతో చెప్పాడు.

"సదాశివంగారు! మీ అందరినీ వీడ్కోలు విందుకి పిలిచారు యు థాంట్‌గారు."

"అలాగే, తప్పకుండా వస్తాం, చక్కగా సుందరం ఇంట్లో భోంచేసి వస్తాం."

"అదేంటీ..."

"అంతే నరసింహన్, ఆ ఫోర్కులతో, స్పూనులతో భోజనం మాకు విందు భోజనం కాదు. వట్టి అభోజనం అవుతుంది. ఒకప్రక్క ఆకలితో నకనకలాడిపోతూ నవ్వుతూ మాట్లాడాలి. మా వల్లకాదు నరసింహన్‌గారు.." అన్నాడు సదాశివం విదేశీయాత్రల్లో విందుభోజనాల గురించి తమ బృందం అభిప్రాయం చెప్తూ....

విదేశాలలో ఎక్కడ ఉన్నా అక్కడ తమిళులు, తమిళులు లేకపోతే ఇంకెవరైనా భారతీయులు సుబ్బలక్ష్మి బృందం కోసం భోజనాలు ఏర్పాటు చేస్తున్నారు.

యు థాంట్ గారు విందుకు పిలిచినరోజు మైలాపూర్ సుందరం ఇంటికి భోజనానికి వచ్చారు. చక్కగా భోజనం చేసి కూర్చోగా, సదాశివం చెప్పగా అతిథులకోసం, సుబ్బలక్ష్మి పాడటం మొదలుపెట్టింది. తంబూర కూడా లేకుండా సుబ్బలక్ష్మి గానాన్ని ఆస్వాదిస్తున్నారు. కానీ కాసేపట్లోనే ఆ ఇంటి గోడకే ఆనుకుని ఉన్న పక్కింట్లో నుంచి, సుత్తులు గోడని కొడ్తూ ఉంటే ఆ శబ్దాలు గట్టిగా వినిపిస్తున్నాయి. ఈ అపశ్రుతులు పాట వింటున్న వారికి చాలా ఇబ్బందిగా ఉన్నాయి. సుబ్బలక్ష్మి బృందానికి ఆతిథ్యం ఇచ్చిన వ్యక్తి పక్క ఇంటికి వెళ్లకుండానే, "నేను ఏమీ చేయలేనండీ.. క్షమించండి" అని చెప్పాడు.

"మన మద్రాసు కాదు కదా.. రూపాయ్ చేతిలోపెట్టి, కాసేపు కాఫీ తాగిరండి బాబూ అని చెప్పటానికి" గుసగుసలాడుకున్నారు వినాయకరామ్, మూర్తి.

సుబ్బలక్ష్మి ఆ మోతల్ని పట్టించుకోకుండా పాట పాడుతూనే ఉంది. ఇబ్బంది పడుతూనే వింటున్నారు ఆ ఇంటిలో ఉన్నవాళ్లు. కాసేపటికి, ఆ మోతలు ఆగిపోయాయి. అందరూ హమ్మయ్య అనుకొని హాయిగా సుబ్బలక్ష్మి పాట వింటున్నారు. ఇంతలో ఎవరో తలుపు తట్టారు. తలుపు తెరవగా ఇద్దరు వ్యక్తులు తమని తాము పరిచయం చేసుకున్నారు. "మేము పక్కింట్లో పనులు చేస్తున్నాము. ఆమె పాట మాకు వినిపిస్తూ ఉంది. ఏమీ అర్థం కాలేదుకానీ చాలా బాగుంది. మేమూ వినొచ్చా...." అని అడిగారు.

సుబ్బలక్ష్మికి ఈ విదేశీయాత్రలో రెడొట్ హాలు కచేరీలో గొప్ప పేరొచ్చింది. ఐక్యరాజ్య సమితి కచేరీని అమెరికా పత్రికలు ఎలుగెత్తి చాటాయి. కానీ... ఈ ఇద్దరి సామాన్యుల మెచ్చుకోలు సుబ్బలక్ష్మికి మహదానందమయింది.



ఐక్యరాజ్య సమితి కచేరీ తర్వాత అమెరికాలోని ఇతర ప్రాంతాలలో కచేరీలు చేస్తూ ఉంది సుబ్బలక్ష్మి.

తన రెండవ విదేశీయాత్రని దిగ్విజయంగా పూర్తిచేసి, డిసెంబర్ నాలుగున బొంబాయి చేరుకుంది. భారత అధికార ప్రతినిధికి స్వాగతం పలుకుతూ ప్రభుత్వ ప్రతినిధులు, బంధువులు, స్నేహితులు, అభిమానులు విమానాశ్రయంకి వచ్చి ఆత్మీయంగా, అట్టహాసంగా స్వాగతం పలికారు. ఆ రోజునే బయలుదేరి డిసెంబర్ ఐదున మద్రాసు చేరుకున్నారు. మద్రాసు రైలుస్టేషన్‌లో సుబ్బలక్ష్మికి అఖండమైన స్వాగతం లభించింది. ఇంటికి వెళ్లగానే, ఆత్మనాథన్ ఒక టెలిగ్రామ్ ఇచ్చాడు సదాశివానికి.

"సదాశివం, మీరు తిరిగి స్వదేశం చేరినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. సుబ్బలక్ష్మిని చూసి మేమంతా గర్వపడుతున్నామని చెప్పు" – సర్వేపల్లి రాధాకృష్ణన్, భారత రాష్ట్రపతి.

సుబ్బలక్ష్మిని ఇంటి ఆడవాళ్లంతా చుట్టుముట్టారు, పిల్లల్ని ముద్దుచేసుకుంటుంది సుబ్బలక్ష్మి.

"ఆత్మా!" కేక వేశాడు సదాశివం.

"ఇదేంటీ, ఎవరు ఇలా రాశారు..." అరుస్తున్నాడు సదాశివం. ఏంటీ అనుకుంటూ సదాశివం చేతిలోని పత్రికలోకి చూశాడు. "అవును మామా, ఇక్కడ అందరూ ఇలానే అనుకుంటున్నారు. బడిపిల్లలాగా మన ఎమ్.ఎస్.సుబ్బలక్ష్మి అంతమంది ముందు నుంచొని పాట పాడటమేమిటి, అసహ్యంగా ఉందంటూ తిట్టిపోశారు మామా."

"ఇంకా ఎవరేమన్నారు దీని గురించి?" గద్దించాడు సదాశివం.. "మనవాళ్లేమో.. ఈ యాత్రకి రాజాజీ పాట దిష్టిచుక్క అని అన్నారు మామా."

"సార్, రాజాజీ వస్తున్నారు" గుమస్తా వచ్చి చెప్పాడు. వెంటనే ఆ పత్రికలన్నిటినీ ఒక చుట్టచుట్టి ఎవరికీ కనిపించనిచోట దూర్చాడు సదాశివం. తన గురువు, దైవం అయినటువంటివారి పాటను ఇలా పత్రికలు వాటికి ఇష్టం వచ్చినట్లు రాయటం ఏమాత్రం నచ్చలేదు సదాశివానికి. స్వతంత్ర కార్యాలయంలో గురువుకి సుఖాసనం ఏర్పరచి, చేతులు కట్టుకు కూర్చున్నాడు.

"సదాశివం, నాకు చాలా సంతోషంగా ఉంది. నువ్వు ఎన్నికలకల్లా తిరిగి వచ్చావు అంతా మనకు అనుకూలంగా సాగిపోతుంది. నామాట రాసుకో కాంగ్రెస్ ఈసార ఓడిపోతుంది."

కాంగ్రెస్‌వాదిగా ఉండి, కాంగ్రెస్‌లో గడించిన అనుభవాన్నంతా కాంగ్రెస్‌క వ్యతిరేకంగా ఎక్కుపెట్టాడు ఈ రాజకీయ కురువృద్ధుడు. సంవత్సరం క్రితమే డి.ఎమ్. పార్టీ, స్వతంత్ర పార్టీకి పొత్తు కుదిర్చాడు.

ఐక్యరాజ్య సమితి కచేరీ నుంచి తిరిగి వచ్చిన సుబ్బలక్ష్మికి అఖండ స్వాగతం

**సమితి సభ్యులను సమ్మోహితులుగా చేసిన సుబ్బలక్ష్మి గానం**

[illegible]

26 అక్టోబర్, 1966
'ఆంధ్రభూమి' నుంచి



రెండు నెలలలో మద్రాసు రాష్ట్ర ఎన్నికలు జరుగనున్నాయి. కల్కి బంగ్లా ఆవరణలోనే స్వతంత్ర కార్యాలయం కూడా ఉండడంతో, రాజాజీ ఆధ్వర్యంలో రోజూ జరిగే చర్చలతో, సమీక్షలతో, సభలతో ఎంతో హడావుడిగా ఉంది. ఆ హడావుడి యొక్క వేడి రోజుకి పదహారు గంటలు కల్కి బంగ్లాలోని వంటగదిలో మండుతున్న పంట చెరుకు చెప్తుంది. తంగం దగ్గర తరుగుతున్న నెలసరి డబ్బులు చెప్తున్నాయి. సదాశివం ఈ విధంగా రాజకీయాలలో నిమగ్నమైయుండగా సుబ్బలక్ష్మికి కాస్త తీరిక దొరికింది. ఫిబ్రవరి దాకా ఎలాంటి కచేరీలు లేవు. సుబ్బలక్ష్మి అమ్మలక్కల సుబ్బక్కయింది. ఇప్పటికల్లా తన మనుమసంతానం పదిమంది ఉన్నారు. సదాశివం తరుఫున బంధువులు లెక్కలేనంతమంది. ఈ తీరికవేళ అందర్నీ పలుకరించే పనిమీద ఉంది.

❦❦

రాజాజీ ఊహించినట్లుగానే డి.ఎమ్.కె., స్వతంత్ర కూటమి మద్రాస్ రాష్ట్ర సార్వత్రిక ఎన్నికలలో విజయం సాధించింది. ఎంకి పెళ్లి సుబ్బి చావుకొచ్చిందన్నట్లు, మళ్లీ తంగంకు నడ్డి విరిగేంత పని. సదాశివం బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేశాడు. ఇటు ప్రముఖులు, అటు కార్యకర్తలు, ఎంతోమంది విందారగించారు. ముఖ్యమంత్రి కాబోతున్న అన్నాదురై ఈ విందులో, "సదాశివం, నీ దేశభక్తి పాటలు నేను అప్పట్లో విన్నాను. ఏదీ మళ్లీ పాడు ఈ రోజు" అని అడిగాడు. దానికి సదాశివం, "సుబ్బలక్ష్మిని చేసుకున్న తర్వాత నేను పాడటం ఆపేశాను. క్షమించండి, పాడలేను" అన్నాడు. అన్నాదురై ఇక మళ్లీ అడగలేదు.

సదాశివం పాడటం ఒక్కటే చేయంది, సుబ్బలక్ష్మి పాటకి సంబంధించి మిగతా అన్ని పనులు చేస్తాడు. కచేరీ సందర్భము, స్థలమునుబట్టి ఎలాంటి పాటలు పాడాలో నిర్ణయిస్తాడు. అవి ఏ వరుసలో పాడాలో నిర్ణయిస్తాడు. ఏ రాగ, తాళ, కాలంలో ఆ పాటలు ఉండాలో కూడా నిర్ణయించేస్తాడు. జన్మతః సంగీత జ్ఞానం ఉంది కాబట్టి, సుబ్బలక్ష్మిని చేసుకున్న వెంటనే సంగీత శాస్త్రం యొక్క సూత్రాలు ఆకళింపు చేసుకున్నాడు. ఈ జ్ఞానంతో సుబ్బలక్ష్మి ఏ పాట పాడితే బాగుంటుందో, ఏ పాట పాడితే బాగుండదో ఇట్టే పసిగట్టేసేవాడు. మద్రాసు రేడియో వారు తమిళ పాటను, భాషను ప్రోత్సహించటానికి, రెండవ శతాబ్దపు తిరుక్కురళ్ పాటలను కర్ణాటక బాణీలో అమర్చి, జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం, అరియక్కుడి, పట్టమ్మ, మహారాజపురం లాంటి విద్వాంసులకు నేర్పుతామన్నారు. వీరందరు వెనకాడారు. సదాశివం సుబ్బలక్ష్మికి ఆ పాటలు నేర్పించటం మొదలుపెట్టాడు.

కానీ నాలుగు పాటలు నేర్చుకున్న తర్వాత ఈ పాటలు సుబ్బలక్ష్మి గొంతుకు నప్పటంలేదని రేడియోవారిని ఇక రావద్దని చెప్పాడు. సుబ్బలక్ష్మి తండ్రి సుబ్రహ్మణ్య అయ్యర్ కూతురుకి సంగీత జ్ఞానం ఉన్నవాడికే, సుబ్బలక్ష్మినిచ్చి పెళ్లి చేయాలనుకున్నాడు.



తన పిల్లలు, బంధువులతో మళ్లీ 'పాట' విడుపు





అయన స్వయంగా చేయలేకపోయినా, చూడలేకపోయినా ఆయన దీవెనలవల్ల సుబ్బలక్ష్మికి అలాంటి భర్తే దొరికాడు.

ఇలాంటి సంగీత జ్ఞానమే సదాశివం కూతురైన రాధకు కూడా వంశపారంపర్యంగా అబ్బింది.

కల్కి బంగ్లాలో నికరంగా నివాసముండేది సుబ్బలక్ష్మి, సదాశివం, తంగం, తంగం భర్త అనంత్. సమయానికి వచ్చిపోయే పదిమంది పనిమనుషులు కాకుండా సుబ్బలక్ష్మిని, సదాశివాన్ని విడవలేక విడవలేక విడిచి వెళ్లి, ప్రొద్దున్నే మళ్లీ చేరుకునేవారు విశాలం, ఆత్మ. విశాలం సుబ్బలక్ష్మికి అంతరంగిక పరిచారికురాలు. విశాలం తల్లి సుబ్బలక్ష్మికి పెళ్లైన కొత్తనుండి పనులు చేస్తూ తన తర్వాత తన కూతురుకి ఈ కల్కి సంస్థానం కొలువు ఖాయం చేసి వెళ్లింది. విశాలంకి పెళ్లై కుటుంబం ఉన్నా ఎప్పుడో రాత్రికి వెళ్లి మళ్లీ ప్రొద్దున్నే వచ్చేస్తుంది.

ఆత్మ కూడా అంతే, సదాశివం తర్వాతే అతనికి తన సంసారం. ఉండేది ఈ ఆరుగురే అయినా, రాధ, విజయ, అంబి, ఆనంది, సుబ్బలక్ష్మి గురువులు రోజూ వస్తూనే ఉంటారు. ఇంకా సదాశివం కుటుంబంలో వారు ఎవరయినా, ఎంతమందైనా నిరాటంకంగా రావచ్చు. ఏ పూట భోజనమయినా, టిఫిన్లు అయినా యాభైమందికి తగ్గకుండా వండి వారుస్తుంటారు. ఏ పూటకి ఆ పూటకి విందు భోజనాలే. ఏకబిగిన గంటలు గంటలు కూర్చొని గురువుల ముందు సాధన చేస్తూ, విందు భోజనాలు చేస్తూ సుబ్బలక్ష్మి ఈ సమయానికి కాస్త వొళ్లు చేసింది. ఇలాంటి విందు భోజనమే చేసి ఆడవాళ్లందరూ ఒక గదిలో చాపలు పరుచుకొని పిచ్చాపాటి మాట్లాడుకుంటూ నిద్రపోయేటట్లున్నారు. వారి నిద్రని భంగపరుస్తూ, క్రింద కల్కి కార్యాలయం నుంచి పెద్దగా నవ్వులు వినిపించాయి. ఏంటో అనుకున్నారు. మళ్లీ నిద్రలోకి జారుకుంటుండగా, ఒక గుమస్తా వచ్చి తలుపుకొట్టి ఒక ఉత్తరం ఇచ్చి వెళ్లాడు. ఆ ఉత్తరాన్ని అందరిలో చిన్నదయిన పదిహేనేళ్ల గౌరీకి ఇచ్చారు. గౌరి చదవటం మొదలుపెట్టింది.

అతి దివ్యమైన, దేవతామూర్తియైనట్టి గంధర్వ కాంత అయిన సుబ్బలక్ష్మి దేవి గారికి,

నేను మీ పదాంబుజములను పూజించే ఒక సేవకుడిని. మీరు మామూలు మానవులు కారు. మీరు అసమాన్యులని బహుశా మీకు తెలియకపోవచ్చు. మీరు ఎవరో, ఎలాంటివారో నేను చెప్తాను.

మొదటి సన్నివేశం –

కైలాస పర్వతం మీద శివపార్వతులు సుఖాశీనులై ఉండగా ఇంద్రుడు నారదుడిని, దేవతాగణాన్ని తోడ్కొని వస్తాడు.

దేవతలు: శంభోశంకర! సదాశివా!! మమ్మల్ని ఈ నరకం నుంచి కాపాడు.

ఇంద్రుడు: భూలోకం అంతా భయానకంగా ఉంది. అంతటా అపశ్రుతులు, అపస్వరాలతో నిండిపోయి ఉంది. ఇవి సుస్వారాలని, శుద్ధమైన శ్రుతిని వినిపించకుండా గోలపెడుతున్నాయి.

దేవతలు: మా కర్ణభేరులు కకావికలమైపోకుండా, ఈ అపశ్రుతులవల్ల మేము అపవిత్రులమైపోకుండా మమ్మల్ని కాపాడు స్వామి.

శివుడు: నేను భూలోకానికేగి పరిస్థితి ఏమిటో చూసి వస్తాను.

నారదుడు: దేవా, ఈ పని పార్వతీ దేవికి అప్పగించొచ్చుకదా....

శివుడు: మంచి ఆలోచన నారదా. పార్వతీ నువ్వు మదురైకి వెళ్లి, తమిళనాట అతి కొద్దిమంది గొప్ప సంగీత విద్వాంసులలో ఒకరైన షణ్ముగవడివు కడుపున జన్మించు.

పార్వతి: నాథా! మీ ఎడబాటు ఎలా భరించను.......

శివుడు: ఈ ఎడబాటు కొన్నాళ్లే పార్వతి, త్వరలోనే నేను నీ భర్త సదాశివంలాగా జన్మిస్తాను. మనిద్దరం కలిసి, భూలోకంలోని అపస్వరాలను తరిమికొట్టి సుస్వరాలను ప్రతిష్ఠించి, లోకకల్యాణం కావిద్దాం......

గౌరి చదవటం ఆపింది. అంతా నిశ్శబ్దం.

క్రింద మగవాళ్లలాగా ఈ ఆడవాళ్లకి నవ్వు రాలేదు. అందరూ సుబ్బలక్ష్మివైపు చూస్తూ ఆమెలో పార్వతిని వెతుకుతున్నారు. ప్రపంచం సుబ్బలక్ష్మిలో సరస్వతిని ఎప్పుడో చూసింది, సుస్వరాల సుబ్బలక్ష్మిని.

త్యాగరాజ శిష్యపరంపరలో మూడవ తరానికి చెందిన మైసూరు వాసుదేవాచారి తన కృతి, 'బ్రోచేవారెవరురా నినువినా రఘువరా నను బ్రోచేవారెవరురా' సుబ్బలక్ష్మి పాడితే విని, "ఒక పేద తండ్రి తన కూతురుకి వివాహం జరిపించి తన దగ్గర నుంచి వెళ్లేప్పుడు మట్టిగాజులు, మామూలు బట్టలతో పంపిస్తే, ఆ కూతురు మళ్లీ తనకు కనిపించేసరికి వజ్రాల నగలతో, పట్టుచీరతో వచ్చినట్లు... నాక్కూడా సుబ్బలక్ష్మి నోట నా పాటను వింటుంటే అలాగే ఉంది, సాదాసీదాగా ఉన్న పాట గమక, భావ సౌందర్యంతో ఉట్టిపడుతోంది" అని సభాముఖంగా పొగిడారు సుబ్బలక్ష్మిని.

ప్రఖ్యాత హిందుస్థానీ గాయకుడు ఉస్తాద్ బడేగులామ్ అలీ ఖాన్ సుబ్బలక్ష్మిని 1950లలోనే 'సుస్వర సుబ్బలక్ష్మి' అని కొనియాడారు.

షహనాయి కళాకారుడు ఉస్తాద్ బిస్మిల్లా ఖాన్ సుబ్బలక్ష్మికి 'దక్షిణ భారతపు షహనాయి' అని కితాబు ఇచ్చారు.





మైసూర్ వాసుదేవాచారి (మైకు ముందు వ్యక్తి), సుబ్బలక్ష్మి, కళాక్షేత్ర రుక్మిణీ ద

1949 లోనే ఖాసా సుబ్బారావు తన 'స్వతంత్ర' పత్రికలో: 'ఎలాంటి ఉపమానాలు నిర్వచించలేని ఈమె గొంతు మన దేశంలోనే కాకుండా ప్రపంచం మొత్తంలో సంగీతమయమైన గొంతు. సుబ్బలక్ష్మి గొంతు గుసగుసలు, నిశ్శబ్దం మధ్య స్థాయిలో పాడగలదు. అదే గొంతులో నయాగరా జలపాత హోరు కూడా వినిపిస్తుంది. ఇంకోసారి బ్రహ్మాండంలో తుఫానుల శక్తి తరంగాల ప్రవాహం ఆ పాట ఝరిలో వినిపిస్తుంది. ఖంగుమని గంటలా మ్రోగిన ఒక్క స్వరంతోనైనా, ఆకాశం, సముద్రమంత విస్తారంగా పాడుతున్నా, వేగవంతమైన పాట మలుపులోనైనా వినసొంపైన శ్రావ్యత ఉంటుంది. ఆ శ్రావ్యతతోబాటు ఆమె కళ్లలో, ముఖంలో అద్భుతమైన భావప్రకాశం ప్రస్ఫుటిస్తుంది. పాటకు ఠీవిగా, గంభీరంగా ఆమె చూపే మితమైన చేతుల కదలికలు చూస్తుంటే కుదురుగా నాట్యమాడుతున్న పాట కనిపిస్తుంది. ఈ మనోహరమైన దృశ్యాన్ని చూస్తూ, రసజ్ఞులు ఆనందంలో తేలియాడుతూ, పరవశులై, సమయపాలన మర్చిపోయి, తన్మయులై ఆమె పాట వింటూ వారి కనులకు, వీనులకు ఆత్రంగా విందుకావిస్తారు.'

ఎమ్. ఎస్. ఇప్పటికే మన దేశానికి గర్వకారణమయ్యారు. కోటానుకోట్లమందికి తన పాటద్వారా సంతోషాన్ని పంచుతున్నారు. త్వరలోనే ఆమె ఘనత దేశ సరిహద్దులు దాటుతుంది. ప్రపంచాన్ని తన పాటతో సమ్మోహన పరుస్తుంది' అని భవిష్యవాణి రాశారు.

ఖాసా సుబ్బారావు చెప్పిన రోజు తప్పకుండా వచ్చింది. 1963లో, 1966లో విదేశీ సంగీతజ్ఞులు సుబ్బలక్ష్మి సంగీత విద్వత్తుని గుర్తించారు. 'ది న్యూయార్క్ టైమ్స్' నవంబర్ 18, 1966న సుబ్బలక్ష్మి విద్వత్తుని ఇలా కొనియాడింది, 'ఆమె తన పాట ద్వారా తెలిపే భావం మాటలకందనిది. సుబ్బలక్ష్మి గొంతు ఇంకొక యంత్ర వాద్యంలాగా గాడి తప్పని స్వరంలాగా వినిపిస్తుంది. ఒక్కొక్కసారి ఆ గొంతు సన్నగా వినిపిస్తుంది. ఇంకొకసారి శంఖం పూరించినట్లు ఉంటుంది. మరొకసారి చిక్కగా ఉంటుంది, అప్పుడప్పుడు అంతర్ముఖి అవుతుంది. ఇంకోసారి ఉవ్వెత్తున ఎగసి పాడుతుంది. ఆమె గొంతు పక్కవాద్యాలతో చక్కని సంభాషణ జరుపుతుంది. సుబ్బలక్ష్మి పాట పాశ్చాత్యులకు ఒక గొప్ప ఆవిష్కరణ. ఆమె పునరాగమనానికై మేమంతా ఉత్సుకతతో ఎదురుచూస్తూ ఉంటాము.'

ఇలా భారతదేశమంతటా, విదేశాలల్లోను అందరినీ అబ్బురపరచిన సంగీతం సుబ్బలక్ష్మిది. మరి ఇలాంటి సంగీతాన్ని గుర్తించవలసిన తీరులో గుర్తించకుండా ఎవరుంటారు.

1968 చివరలో ఒకరోజు సుబ్బలక్ష్మి, సదాశివం, సెమ్మంగుడి, ముసిరి మ్యూజిక్ అకాడమీకి కారులో బయలుదేరారు. దారిలో ముసిరి సెమ్మంగుడివైపు చూసి ఒక సైగ



చేశాడు. "ఊ.... చెప్పండి" అన్నట్లు. "సదాశివం! ఈ సంవత్సరం సంగీత కళానిధి బిరుదు సుబ్బలక్ష్మికి ఇవ్వటానికి మ్యూజిక్ అకాడమి సభ్యులు నిర్ణయించారు" చెప్పాడు సెమ్మంగుడి.

సుబ్బలక్ష్మికి ఆనందంతో నోట మాట రాలేదు.

సదాశివం మాత్రం ముసిరివైపు, సెమ్మంగుడివైపు ఆశ్చర్యానందాలతో చూస్తూ, "ఇది ఏకగ్రీవమే కదా.... ఎవరూ అడ్డు చెప్పలేదుకదా......"

"ఎవ్వరూ అడ్డుచెప్పలేదు. సభ్యులందరూ సుబ్బలక్ష్మికే ఓటు వేశారు."

మద్రాస్ మ్యూజిక్ అకాడమీ 1929లో స్థాపించబడి, అప్పటినుంచి కర్ణాటక సంగీత ప్రమాణాలను కాపాడుకుంటూ, కర్ణాటక సంగీత వైభవాన్ని దక్షిణ భారతదేశ గగనతలంలో రెపరెపలాడిస్తున్న సంస్థ. ఎన్నెన్నో సంస్థలు వచ్చి కాలగమనంలో కలసిపోయినా..... నలభైయేళ్ల నుంచి కర్ణాటక సంగీతం కోసం పాటుపడుతున్న సంస్థ. అరియక్కుడి రామానుజ అయ్యంగార్, ముసిరి సుబ్రహ్మణ్యం అయ్యంగార్, మైసూర్ వాసుదేవాచారి, చెంబై, ద్వారం వెంకటస్వామి నాయుడు నుంచి, ఆ తర్వాత తరంలో జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం వరకూ వారి సంగీత మేధస్సును గుర్తించి సత్కరించిన సభ. ఇప్పుడు సంగీత కళానిధిగా సుబ్బలక్ష్మిని ఎంపిక చేసింది. సుబ్బలక్ష్మికి ఈ సమయంలో తన తల్లే గుర్తుకు వచ్చింది. తన తల్లి తన మొదటి సంగీత గురువు. తల్లి భిక్షే ఈనాటి తన సంగీత సంపద.

1969 జనవరి ఒకటిన సుబ్బలక్ష్మికి 'సంగీత కళానిధి' బిరుదు ప్రదానం చేసే రోజుగా ఖాయం చేశారు అకాడమీవారు. ఆ రోజున సుబ్బలక్ష్మి అధ్యక్ష ఉపన్యాసం ఇవ్వాలి. అప్పటినుంచి వచ్చే సంవత్సరం ఇంకొకరిని సంగీత కళానిధి బిరుదుకి ఎంపికచేసేదాకా, సుబ్బలక్ష్మి మద్రాస్ మ్యూజిక్ అకాడమీ అధ్యక్షురాలి హోదాలో ఉంటుంది.

ఈ అధ్యక్షురాలు ఇవ్వవలసిన ఉపన్యాసాన్ని ఆమె ప్రమేయం ఏమాత్రం లేకుండా తనదైన పద్ధతిలో, సెమ్మంగుడి, ముసిరి సహాయంతో కూరుస్తున్నాడు సదాశివం. అంతా అయిపోతుందన్న సమయాన సుబ్బలక్ష్మి అటువైపు వచ్చింది.

"కుంజమ్మా..... నువ్వు చెప్పాల్సిన ఉపన్యాసం తయారైంది. నువ్వేమన్నా చెప్పాలనుకుంటున్నావా...." అడిగాడు సదాశివం.

సుబ్బలక్ష్మి కళ్లు మెరిశాయి. "అవును మామా" అంది, అది ఏంటో చెప్పింది. 'అనవసరంగా అడిగినట్లు ఉన్నానే' మనసులోనే అనుకున్నాడు సదాశివం.

1969 జనవరి ఒకటిన క్రిక్కిరిసిన మ్యూజిక్ అకాడమి ప్రాంగణంలో అడుగు పెట్టింది ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి. గతంలో తనను ఐదు సంవత్సరాలపాటు బహిష్కరించిన మద్రాస్ మ్యూజిక్ అకాడమి ఈ రోజు వారి అత్యంత ప్రతిష్ఠాత్మకమైన బిరుదుని అందుకోవటానికి ఆహ్వానించింది. రసజ్ఞుల, సంగీతజ్ఞుల హర్షాతిరేకం మధ్యన సుబ్బలక్ష్మి ఒకప్పటి కాశ్మీరు యువరాజు కరణ్‌సింగ్ చేతులమీదుగా తన 'సంగీత కళానిధి' బిరుదును అందుకుంది.

ఇప్పుడు అధ్యక్షురాలి హోదాలో ఉపన్యాసం ఇవ్వాలి. అంతా ఒక పెద్ద కాగితంలో వ్రాసి ఇచ్చి ఉన్నా దానిలోని మొదటి భాగం మాత్రం నేరుగా గుండెలోంచి వచ్చింది. మర్యాదలు అయిన తర్వాత తన గుండెలోని మాట చెప్పుకుంది, "ఇలాంటి విశిష్టమైన సందర్భాలలో ఒక స్త్రీని అధ్యక్షత వహించమన్నప్పుడు, ఆ స్త్రీకి తన తల్లి అందరికంటే ముందుగా జ్ఞప్తికి రావటం సర్వసాధారణం. నా విషయంలో నా తల్లి నాకు కేవలం మాతృమూర్తే కాకుండా నా సంగీత గురువు కూడా. మా అమ్మ మదురై వీణ షణ్ముగవడివు అనుగ్రహమే ఈ రోజు నా ఈ సంగీత జ్ఞానం. నా తల్లిగా, నా సంగీత గురువుగా ఆమెకు నమస్కరిస్తూ ఆమె ఆత్మ ఎక్కడున్నా నన్ను కాపాడుతూనే ఉండాలని ప్రార్థిస్తున్నాను." అంటూ మొట్టమొదటిసారిగా తన తల్లి గురించి బాహాటంగా చెప్పి క్రిక్కిరిసిన ప్రాంగణంలో శంఖనాదం పూరించి, గుండె బరువు తగ్గించుకుని, తనకు రాసి ఇచ్చిన ఉపన్యాసం చదువుకుంటూ వెళ్లింది.

ఆ తరువాతి రోజు సుబ్బలక్ష్మి తన అభిమానులని ఆశ్చర్యపరుస్తూ వీణ కచేరీ చేసింది. అక్షరాలా అమ్మ వీణ మీద, అమ్మ నేర్పిన వీణానాదం పలికించి, రెండు గంటలసేపు వీనులవిందు చేసింది. మరొక్కసారి అమ్మకు, అమ్మ వీణ పరంపరకు మద్రాసు మ్యూజిక్ అకాడమీలో జేజేలు పలికింది. తను, తన తల్లి, మద్రాసు సంగీత సభలు, అందులోనూ మద్రాసు మ్యూజిక్ అకాడమీ, తన గుండె గదుల్లోని తీపిగుర్తులు.

𝄞𝄞

ఇప్పుడు సుబ్బలక్ష్మి మామూలు సుబ్బలక్ష్మి కాదు. సంగీత కళానిధి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి. సుబ్బలక్ష్మికి తన పద్మభూషణంకంటే, సంగీత నాటక అవార్డుకంటే సంతోషాన్నిచ్చింది ఈ సంగీత కళానిధి బిరుదు. అనుకున్నదానికంటే దిగ్విజయంగా సాగిపోతుంది సుబ్బలక్ష్మి సంగీత పయనం. అలాగే సదాశివం పరపతి కూడా. సుబ్బలక్ష్మి భర్తగా ఒక గొప్ప హోదా ఎలానూ ఉంది. కాని ఇప్పుడు తన స్థాయి ఇంకా పెరిగింది. మద్రాసులో అక్షరాలా తన ప్రభుత్వం రాజ్యమేలుతుంది. ఇక కల్కి బంగ్లాలో సంబరాలకి తక్కువ లేకుండాపోయింది. విశాలమైన కల్కి బంగ్లా పచ్చిక బయళ్ల మీద వారానికొక వేడుక అన్నట్లు సాగిపోతున్నాయి. సదాశివం ఆలోచన పెద్దది. చేయీ పెద్దది. ఈసారి





శ్రీ కరణ్ సింగ్ నుంచి సంగీత కళానిధి పురస్కారాన్ని అందుకుంటూ...



అదే వేదిక పైన తన స్పందన తెలుపుతూ..



తన తల్లి వీణ వాయిస్తూ సుబ్బలక్ష్మి



నలభైరోజులపాటు రామాయణం పఠనం ఏర్పాటు చేశాడు. ఈ నలభై రోజులు కల్కి బంగ్లా ద్వారాలు అందరికీ తెరిచే ఉంటాయి, అందరికీ సాయంత్రం ఫలహారాలు వండిస్తున్నాడు. "మామయ్యా! బజారులో అడుక్కుతినేవాళ్ళు కూడా తిని వెళ్తున్నారు."

"చాలామంచిది తంగం. వాళ్లు తింటేనే మనకు పుణ్యం."

"మామయ్యా, వాళ్లు తింటే ఫర్వాలేదు, పని పాట లేనివాళ్లు కూడా వచ్చి తింటున్నారు, తేరగా వస్తుంది కదా అని."

"ఒక పనిచేద్దాం తంగం..... వాళ్లచేత గిన్నెలు కడిగించేద్దాం" మామయ్య మాటకు తల కొట్టుకొంది తంగం.

కల్కి బంగ్లాలో అవుతున్న ఖర్చు హోమ్ మినిష్టరయిన తంగంకు బాగా తెలుసు. తంగం మనస్సు కీడు శంకిస్తోంది.

𝄞𝄞

ఆల్ఇండియా రేడియో మద్రాసు, విజయవాడ కేంద్రాల పరిధిలో, వేకువజామున, రేడియో ఉన్న ప్రతి ఇంట రేడియో పెట్టి ఆత్రుతగా ఎదురు చూస్తున్నారు. ఈ ఎదురు చూపులు ఈ ఒక్క రోజునుంచే కాదు, గత రెండు సంవత్సరాల నుంచి జరుగుతూ వస్తున్న తంతు. రోజులో ఏ సమయానికి ఇంతగా లేనంతగా శ్రోతలు వేకువజామున రేడియో ముందు వొళ్లంతా చెవులు చేసుకుని తయారుగా ఉన్నారు.

"కౌసల్యా, సుప్రజా రామా పూర్వా సంధ్యా ప్రవర్తతే" అంటూ రేడియోలో సుబ్బలక్ష్మి పాడిన వేంకటేశ్వర సుప్రభాతం మొదలయింది. వింటున్నవారు తదేకంగా వింటున్నారు. వారు వినటం ఇది మొదటిసారో, రెండోసారో కాదు. గత రెండు సంవత్సరాల నుంచి వింటున్నారు. అయినాసరే, ప్రతిసారీ సుబ్బలక్ష్మి వేంకటేశ్వర సుప్రభాతం కొత్తగా, వినసొంపుగా పదేపదే వినాలనిపిస్తోంది శ్రోతలకు. ఆ మధ్యదాకా సుబ్బలక్ష్మి పాడిన వేంకటేశ్వర సుప్రభాతం హెచ్.ఎమ్.వి. వారు అమ్ముతున్న గ్రామఫోన్ రికార్డుల్లోనే ఉండిపోయింది. అవి కొనుక్కోగలిగిన వారికే వినే భాగ్యం ఉండేది. కాని ఎప్పుడైతే మద్రాసు రేడియో కేంద్రం సుబ్బలక్ష్మి సుప్రభాతం ప్రసారం చెయ్యటం మొదలుపెట్టిందో, వేంకటేశ్వర సుప్రభాతానికే బ్రహ్మాండమైన ప్రాచుర్యం లభించినట్లయింది. రేడియోవారు వేదపండితుల సుప్రభాతం కాకుండా కొన్ని సంవత్సరాల నుండి సుబ్బలక్ష్మి సుప్రభాతమే ప్రసారం చేస్తున్నారు. సుబ్బలక్ష్మి రికార్డు మార్చటానికి చేతులు రాక, ఆమె గాత్ర మాధుర్యం పై అనురక్తి తీరక, సుబ్బలక్ష్మి సుప్రభాతం వినాలనే అనురక్తి, వేంకటేశ్వరుడిమీద భక్తితో పోటీపడుతుంది. ఒక సంవత్సరపు సాధన ఊరికే పోలేదు. స్వచ్ఛమైన ఉచ్చారణతో,



కల్కి బంగ్లా పచ్చిక బయళ్ల మీద 'గార్డెన్ పార్టీలు'





సున్నితమైన గమక సొంపులతో కొన్నిచోట్ల, ఇంకొన్ని శ్లోకాల దగ్గర కంచుగంట మ్రోగినట్లు పాడుతూ, ఏ ఉపమానమూ సరిగ్గా నిర్వచించలేని తన తియ్యని గొంతుకు సార్థకత చేకూర్చుకుంది సుబ్బలక్ష్మి. ఇక విన్నవారి స్థితి అలౌకికం. ఇంకా ఇంకా ఆ పాట ఝరిలో తేలియాడాలనే అనుకాంక్ష ఉంది కానీ, రేడియోలో వేంకటేశ్వర సుప్రభాతం పూర్తయింది. వెంటనే రేడియో కట్టేసి మధురమైన అనుభూతి పొందిన ఉత్సాహంతో దైనందిన కార్యక్రమాలు మొదలుపెట్టబోతున్నారు. నూటికి తొంభైమందికిపైనవారికి వారివారి సంసార బాధ్యతలు నెరవేర్చే పనిమీద ఆ రోజు మొదలవుతుంది. ఏ ఒక్కరికో, ఇద్దరికో సంసారాన్ని ఉద్ధరించే ఆలోచనలు వస్తాయి. అలాంటి ఆలోచనలతోనే రాజగోపాలాచారి, సుప్రభాతం అయిన వెంటనే రేడియో కట్టేసి సుబ్బలక్ష్మి ఇంటికి బయలుదేరాడు. సుబ్బలక్ష్మి వడ్డించగా టిఫిన్, కాఫీలు తీసుకొన్న తర్వాత తన ఆలోచన బయటపెట్టాడు రాజాజీ, "కుంజమ్మా, ప్రొద్దున నీ వేంకటేశ్వర సుప్రభాతం రేడియోలో విని వస్తున్నాను. ఎన్నిసార్లు విన్నా ఇంకా ఇంకా వినాలనిపిస్తుంది. గాన సిద్ధి సాధించావు. నీ ఈ రికార్డు తిరుమల కొండలు ఉన్నంతవరకూ ఉంటుంది."

సుబ్బలక్ష్మి అణకువతో కుంచించుకుపోయి వామనావతారంతో పోటీ పడుతోంది.

"నువ్వు ఇలాంటి పనే ఇంకొకటి చెయ్యాలి కుంజమ్మా." ఆ మాటకి తలెత్తి రాజాజీవైపు చూసింది సుబ్బలక్ష్మి.

"నువ్వు విష్ణుసహస్ర నామాలు కూడా రికార్డు చేయాలి. విష్ణుసహస్ర నామాలు పలికినా, విన్నా మానవులు సుఖసంతోషాలతో బ్రతుకుతూ, చివరకు జన్మ సంసార బంధాలు తెంచుకునేందుకు సులువైన మార్గం కలదని తెలియచేయాలి."

సుబ్బలక్ష్మికి సాక్షాత్తు ఆ భగవంతుడే ఆజ్ఞాపించినట్లు ఉంది. ప్రక్కనుండి వింటున్న సదాశివం పరిస్థితి కూడా అంతే. భగవంతుడు తను అనుకున్న పనులని మానవ మాత్రులచేత చేయిస్తాడు. అమోఘమయిన సంగీత నైపుణ్యం, అంతకంటే మించిపోయిన శ్రావ్యమైన గొంతు ఒకే మనిషికి ఇచ్చి, ఆ మనిషిని ఊరికే కూర్చోబెట్టి మామూలు పాటలు పాడుకోమంటాడా..... కానే కాదు. లోకకల్యాణం కోసం ఉపయోగించే మార్గాలు చూపెడతాడు.

సదాశివం వెంటనే కార్యోన్ముఖుడయ్యాడు. సదాశివం కల్కి బంగ్లాలోని సంగీతపు గదిలోకి ఒకరిని తోడ్కొని వచ్చాడు. పంచకట్టులో, పై శరీర భాగమంతా వైష్ణవ నామాలతో, ఒక ఉత్తరీయం కప్పుకుని ఉన్న ఆ మనిషిని చూసి సుబ్బలక్ష్మి వినయంగా నమస్కరించింది. "కుంజమ్మా, వీరు అగ్నిహోత్రం రామానుజ తాతాచారిగారు. వేదవేదాంగ పండితులు. నీకు విష్ణుసహస్రనామాలు నేర్పుతారు."

అంతటివారి దగ్గర నేర్చుకోబోతున్నందుకు సుబ్బలక్ష్మి ఆనందానికి అవధులు లేకుండాపోయాయి.

ఆ రోజు నుంచి కల్కి బంగ్లా వేదోచ్చారణలతో, విష్ణు సహస్ర నామాలతో మారుమ్రోగుతూ ఉంది. పంచమ వేదంగా భావించబడే మహాభారతంలోని భాగం ఈ విష్ణు సహస్ర నామాలు.

నెలలు తరబడి నేర్చుకుంటున్నారు సుబ్బలక్ష్మి, రాధ. ముందుగా సుబ్బలక్ష్మి వేదపండితులు పాడుతున్న విష్ణుసహస్ర నామాలు వింటుంది.

వారు పాడిన తర్వాత తాదాత్మ్యంతో కళ్లు మూసుకునే ఉండి, "నాకు ఈ వేదోచ్చారణలు, సంస్కృత వాక్కులు చాలా ఇష్టం. ఎంత విన్నా ఇంకా ఇంకా వినాలనిపిస్తుంది" అంది.

"కుంజమ్మా! నువ్వు వినటంతోనే సరిపెడతావా ఏంటీ? నువ్వు పాడాలి. మేము వినాలి" అన్నాడు సదాశివం. సదాశివం మాటకు అందరూ నవ్వినా సుబ్బలక్ష్మికి విష్ణుసహస్ర నామ స్తోత్రం మీదే ధ్యాస ఉంది. స్వతహాగా పరమ భక్తురాలయిన సుబ్బలక్ష్మి భక్తిరసంలో మునిగిపోయింది. పాడించటాలు, రికార్డింగులు, కచేరీలు సదాశివం పని, సుబ్బలక్ష్మి ఎక్కడ పాడినా, ఎప్పుడు పాడినా తన పాటతో, భక్తితో భగవంతుడికి ఆత్మార్పణ చేసుకోవటమే పని.

సుబ్బలక్ష్మి వినదలచినన్ని సార్లు విష్ణుసహస్ర నామాలు విన్న తర్వాత ఇక సుబ్బలక్ష్మి పాడటం మొదలుపెట్టింది. ఆ మొదటిరోజు సుబ్బలక్ష్మి పాడటం పూర్తి చేసిన తర్వాత వేదాచార్యులు అగ్నిహోత్రం తాతాచారి, "మాలాంటి వేదపండితులకి కూడా వెయ్యి జన్మలెత్తినాకాని రాని సంస్కృత ఉచ్చారణ ఎంత అవలీలగా పలుకుతున్నారు మీరు...." అంటూ సుబ్బలక్ష్మి వాక్శుద్ధిని విని ఆశ్చర్యపోయారు.

ఇక విష్ణుసహస్రనామ సాధనలో చివరి అంకానికి చేరుకుంది సుబ్బలక్ష్మి. నలభైరోజులు వేదపండితులతోసహా సుబ్బలక్ష్మి విష్ణుసహస్ర నామం పఠనం చేసింది. ఈ మండలకాలం కల్కి బంగ్లాలోని సంగీతపు గదే కాకుండా బంగ్లా అంతా విష్ణుసహస్ర నామాలతో మారుమ్రోగిపోయింది. ఈ మండలకాల సాధన కూడా అయిన తర్వాత రికార్డింగుకి తేదీలు ఖాయం చేశాడు సదాశివం. ఆరోజు విష్ణు సహస్ర నామం రికార్డు చెయ్యటానికి హెచ్.ఎమ్.వి. రికార్డింగు స్టూడియోకి చేరుకున్నారు. హెచ్.ఎమ్.వి. వారి రికార్డింగు గదిలో ముందుగా విష్ణురూపుడైన వేంకటేశ్వరుడిని పూజించిన తర్వాత, "ఓం...." అంటూ ప్రణవనాదంతో మొదలుపెట్టింది. అందమైన పదాలు, పదసమూహాలు, అందమైన ప్రాసలతో వున్న వాక్యాలని మొదటినుంచి చివరి వరకూ శ్రుతి శుద్ధంతో ఇరవైతొమ్మిది



నిమిషాలు ఏకబిగిన పాడి, అలవోకగా నాద నాట్యం కావించింది. పైగా తన ముందు మైకులు, ఆ ముందు వేంకటేశ్వరుడు తప్ప, విష్ణుసహస్ర నామాల పుస్తకం ప్రక్కన లేకుండా, చూసుకునే అవసరమే రాకుండా పాడటం పూర్తిచేసింది. ఇప్పుడు సుబ్బలక్ష్మికి యాభైనాలుగేండ్లు.

"హమ్మయ్య" అనుకుంటూ సుబ్బలక్ష్మి, రాధ మైకుల దగ్గరనుంచి దూరంగా వచ్చారు. హెచ్.ఎమ్.వి. వారి సౌండ్ ఇంజనీర్ రఘు, "తాతాచారి గారు మీరు రండి, ప్లేబాక్ చేసి మీకు వినిపిస్తాను" అని అన్నాడు.

ఇప్పుడు ఆయన రికార్డు అయిన విష్ణుసహస్ర నామాలు వింటారు. ఉచ్చారణ దోషాలు ఏమైనా ఉన్నాయేమో ఇంకా ఇతర మార్పులు ఏమైనా ఉండాలేమో చూస్తారు. ఆయన అంతా బాగుంది, సరేనంటే ఇక ఈ రికార్డింగు ప్రజల్లోకి వస్తుంది. ఎంత సూక్ష్మమైనదైనా తప్పు దొర్లకూడదనే ఉద్దేశంతో తాతాచారిగారు, ఆయనతోబాటు సదాశివం చెవులు రిక్కించి వింటున్నారు. ఇంకో అరగంట పూర్తిగా విన్నారు. అగ్నిహోత్రం తాతాచారిగారు, సుబ్బలక్ష్మివైపు తిరిగి, "శ్రీమహావిష్ణు ప్రీత్యర్థే దగ్గర ప్రత్యర్థే అని పాడినట్లు ఉంది. అది తప్పు, అది సరిగ్గా పాడాల్సిందే" అని చెప్పారు. సుబ్బలక్ష్మి ఆ మాట వినేసరికి నీరసపడిపోయి, గోడకు జారిపోయింది. క్రొత్తగా వచ్చిన షుగర్ వ్యాధి చాలా బాధపెడ్తోంది. తన శరీరం, మనస్సు ఇంకా ఆ వ్యాధికి అలవాటు పడలేదు. ఇక తప్పదన్నట్లు, "రాధా పద, తంబూర తీసుకొని" అంటూ మైకు వద్దకి బయలుదేరింది. ఒక్క తప్పు దిద్దుకోవటమన్నా మళ్లీ మొదటినుంచీ రికార్డు చెయ్యవలసిందే. పూర్తి అరగంట మళ్లీ విష్ణుసహస్ర నామం పాడాల్సిందే. ఇంతలో సౌండ్ ఇంజనీర్ రఘు, "అమ్మా, మీరాగండి, నేను దీన్ని ఎడిటింగ్‌లో సరిచేయగలుగుతానేమో చూస్తాను......" అని చెప్పి, తాతాచారిగారివైపు తిరిగి, "ఇంకేమైనా తప్పులు ఉన్నాయేమో చెప్పండి" అని అన్నాడు.

తాతాచారిగారు ఇంకొక మార్పు చెప్పారు. "అమానీ మానదో మాన్యో... దగ్గర అమానీలో మీ గొంతు వినిపించటంలేదు, బహుశా మీరు ఊపిరి పీల్చుకుంటానికి ఆగి ఉంటారు. అక్కడ కూడా మీ గొంతు ఉంటే బాగుంటుందని నా ఉద్దేశం. మీరేమంటారు.....?"

"వద్దు, మార్చొద్దు, రాధ నాతోపాటు విష్ణుసహస్ర నామం పాడిందని అందరికీ తెలియనివ్వండి. ఇంకేమైనా దోషాలుంటే మళ్లీ పాడతాను, ఇదొక్కటే అయితే అలానే ఉండనివ్వండీ" చెప్పింది సుబ్బలక్ష్మి.

"ఈ విషయంలో మీకెలాంటి అభ్యంతరం లేకపోతే నాకేమీ పర్వాలేదు. అలాగే ఉండనివ్వండి" అన్నారు తాతాచారి.

కానీ ఆ ఒక్కచోట, ఆ ఒక్క పదం సుబ్బలక్ష్మి నోట కాకుండా రాధ నోటన విన్నప్పుడు సుబ్బలక్ష్మి గొంతు గొప్పతనం తెలుస్తుంది. ఆ కాసేపు పాటకి ఆత్మ పోయినట్లుంటుంది.

ఈ రెండు విషయాలు తప్ప తాతాచారిగారికి ఎంచటానికి ఇక ఏమీ తప్పులు వినిపించలేదు. అందరూ వచ్చేస్తుంటే, సౌండ్ ఇంజనీర్ రఘు, "సదాశివంగారూ మళ్లీ ఏ రోజు వస్తారు...?" అని అడిగాడు సదాశివంని.

"మళ్లీ ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు సదాశివం.

"విష్ణుసహస్ర నామం రికార్డులో అరగంటే తీసుకుంటుంది. ఇంకా పదిహేను నిమిషాలు ఖాళీగా ఉంటుంది రికార్డు. ఇప్పుడొచ్చేవన్నీ ఎల్.పి.లు. కదా.."

"అవును కదా.. ఆ సంగతే గుర్తులేదసలు..." అంటూ ఆలోచనలోపడ్డాడు సదాశివం.

ఇప్పుడు రికార్డు చేసింది విష్ణుసహస్ర నామాలు, వీటికి జతగా ఏమిచేయాలన్నా అంతే పవిత్రంగా ఉండాలి. ఏమి చేయాలో బాగా ఆలోచించాలి. అదే సంగతి రఘుకి చెప్పి బయలుదేరాడు సదాశివం.

వెంటనే రాజాజీతో సమావేశమయ్యాడు. ఆలోచించి, ఆలోచించి భజగోవిందం సంస్కృత శ్లోకాలను విష్ణుసహస్ర నామం ప్రక్కన రికార్డు చేయటానికి నిర్ణయించారు. ఈ శ్లోకాలను సుబ్బలక్ష్మి ఎప్పటి నుంచో తన కచేరీలలో పాడుతూనే ఉంది.

ముప్పైఒక్క శ్లోకాలలో రికార్డులో ఉన్న సమయానికి తగ్గట్టు పది శ్లోకాలను ఎంచుకున్నారు. ఈ పది శ్లోకాలకు ముందు రాజాజీచేత భజగోవిందం శ్లోకాల యొక్క ప్రాముఖ్యత చెప్పించాడు సదాశివం.

రాజాజీ పుణ్యమాని, సుబ్బలక్ష్మి, భజగోవిందం, విష్ణు సహస్ర నామం స్తోత్రాలు దిగ్విజయంగా రికార్డు చేసింది.

𝄞 𝄞

*1970*లో సుబ్బలక్ష్మికి తమిళ ఇసై సంగం, సుబ్బలక్ష్మి తమిళ సంగీతానికి చేసిన సేవలకు తన 'ఇసై పేరరిఞ్ఞర్' బిరుదు సుబ్బలక్ష్మికి బహూకరించింది. సుబ్బలక్ష్మి తమిళ ఇసై ఉద్యమ నాటినుండి ఈ సభకు ప్రతి సంవత్సరం పారితోషకం లేకుండా కచేరీలు చేస్తూ వచ్చింది, వరుసగా పదమూడు సంవత్సరాలు అలాంటి కచేరీలు చేసింది.

రాజగోపాలాచారి తొంభైమూడోఏట అడుగుపెట్టనున్నాడు. తమిళనాడులో ఎన్నికలవేళ కూడా వచ్చింది. ఈసారి డి.ఎమ్.కె.కి స్వతంత్ర పార్టీ, రాజాజీ యొక్క అవసరమే లేకుండా పోయింది. అయినా రాజాజీ తన పలుకుబడి, ప్రాబల్యం తగ్గుతుందని మధనపడే మనిషి





1970లో విష్ణుసహస్ర నామాలు రికార్డు చేస్తూ హెచ్.ఎమ్.వి వారి రికార్డింగ్ స్టూడియోలో సదాశివం, అగ్నిహోత్రం రామానుజ తాతాచారి, సుబ్బలక్ష్మి, రాధ, హెచ్.ఎమ్.వి సౌండ్ ఇంజనీర్ రఘు



కాదు. ఇప్పుడు రాజాజీ ఆరోగ్యం కూడా అంత బాగోలేదు. కల్కి బంగ్లాలో స్వతంత్ర కార్యాలయం వెళ్ళిపోయింది. ఇంట్లో విశ్రాంతి తీసుకుంటున్న రాజాజీ దగ్గరకు సదాశివం వచ్చాడు.

"రాజాజీ మీమీద ఒక పుస్తకం తీసుకొస్తున్నాను, ఎలా చేయాలో చెప్పండి" అని ప్రక్కన కూర్చున్నాడు సదాశివం.

"వద్దు సదాశివం! ఇవన్నీ వద్దు. వ్యాసుడు, వసిష్ఠుడు వాళ్ల గురించి ఏమన్నా రాసుకొని వెళ్లారా? వాళ్లు వచ్చిన పనిని చేసుకొని వెళ్లారు, అంతే. నేను చనిపోయిన తర్వాత నన్ను ఎవరూ గుర్తుపెట్టుకోనవసరంలేదు సదాశివం" అంటూ సదాశివం తలపెట్టిన పుస్తకాన్ని గట్టిగా వద్దని చెప్పాడు రాజాజీ.

సదాశివం జీవితాంతం గుర్తుపెట్టుకునే సాయాలు చేశాడు రాజాజీ, రాజాజీ మర్చిపోయినా సదాశివం మర్చిపోడు. సదాశివానికి రాజాజీ పెద్దదిక్కు. అలాంటివారికి ఒక చిన్న ఆనందాన్ని ఇచ్చేందుకు రాజాజీ వద్దన్నా, సదాశివం 'రాజాజీ - 93 సంవత్సరాలు' అనే పుస్తకం అచ్చువేయించాడు. ఆ పుస్తకాన్ని వినోబా భావే చేత ఆవిష్కరణ చేయించాడు. ఆ సభలో మొదటి పుస్తకాన్ని రాజాజీకి ఇచ్చినప్పుడు, ఆ పుస్తకం తీసుకొని, 'మీ జీవితంలో ప్రతి క్షణం నా కోసం ఏదో ఒకటి చేస్తూ ఉన్న మీ ఋణం ఎలా తీర్చుకోను..... భగవంతుడు నిన్ను, నీ భార్యను చల్లగా చూడుగాక" అని రాసి ఇచ్చి సదాశివంకి అందించాడు.

భగవంతుడు తనవంతుగా సదాశివాన్ని చల్లగానే చూస్తూ వచ్చాడు ఇప్పటిదాకా. కానీ సదాశివం ఆర్థిక విషయాలలో తనచుట్టూ ఉన్న మనుషులని ఇంకా చల్లగా చూసుకుంటున్నాడు. కల్కి బంగ్లా పచ్చికబయళ్ల మీద సుబ్బలక్ష్మి సదాశివం సేదతీరుతుండగా కాస్త పరిచయం ఉన్న దంపతులు వచ్చి తమ గోడు వెళ్లబోసుకున్నారు. అత్యంత దయనీయమైన ఆర్థిక కష్టాల్లో ఉన్నామన్నారు. వెంటనే సదాశివం సుబ్బలక్ష్మివైపు చూశాడు. సుబ్బలక్ష్మి మారుమాట్లాడకుండా చేతికున్న గాజులు తీసి ఇచ్చేసింది వచ్చినవాళ్లకి.

ఆ తరువాతిరోజు విషయం తెలిసిన రాధ, "అమ్మా, గాజులు ఎందుకిచ్చావు, ఇంట్లోకెళ్లి డబ్బులు తెచ్చి ఇవ్వచ్చుకదా......"

"రాధా! ప్రొద్దున్నే పనివాళ్లందరికీ జీతాలిచ్చాము. ఇంట్లో డబ్బు పెద్దగా లేదు" చెప్పింది తంగం. రాధా తంగం, ఒకరి కళ్లల్లోకి ఒకళ్లు చూసుకున్నారు. కల్కి బంగ్లామీద లక్ష్మీదేవి కినుకు వహించింది. 1950లలో కల్కి పత్రిక అత్యధికంగా అమ్ముడుపోతున్న



ప్రాంతీయ పత్రిక. కాని, 1970లకి వచ్చేసరికి అమ్మకాలు సగానికి సగం పడిపోయాయి. కానీ కల్కి బంగ్లా ఖర్చులు మాత్రం పెరుగుతూనే ఉన్నాయి. కల్కి బంగ్లా ఆదాయానికి ఖర్చులకి మధ్య అగాధం పెరగటం మొదలైంది.

కల్కి పత్రికకి ఆదరణ తగ్గుతున్నా, సుబ్బలక్ష్మి పాటకి మాత్రం ఆదరణ అంతకంతకు పెరుగుతూపోతుంది. పోయినేడు ఏకంగా పదహారు లబ్ధి కచేరీలు చేసింది. అందులో ఒకటి రాజమండ్రి కందుకూరి రాజ్యలక్ష్మి మహిళా కళాశాలకు చేసింది. ఈ సంవత్సరం ఎనిమిది లబ్ధి కచేరీలు చేసింది. వచ్చే సంవత్సరం అనగా 1972లో కూడా లబ్ధికచేరీలు ఖరారు చేయబడుతున్నాయి.

మదురై తన మాణిక్యాన్ని మళ్లీ గుర్తుచేసుకుంది. 1952లో స్థాపించబడిన శ్రీ సద్గురు సంగీత సమాజం 1967 నుంచి 'మధుర కళాప్రవీణ' అనే బిరుదుని బహూకరిస్తూ వస్తుంది. 1967లో సుబ్బలక్ష్మి గురువయిన సెమ్మంగుడిని, ఆ తరువాత 1970లో పట్టమ్మని, ఈ బిరుదుతో సత్కరించారు. ఈ 1972వ సంవత్సరంలో తమ ఊరి ఆడపడుచుని సత్కరించ నిర్ణయించింది సద్గురు సంగీత సమాజం. ఈ సమాజానికి మొదట్లో సుబ్బలక్ష్మి అన్న శక్తి కూడా సెక్రటరీగా తన సేవలందించాడు. ఫిబ్రవరిలో సుబ్బలక్ష్మి తన ఊరు చేరుకుంది. తల్లి చనిపోయి సరిగ్గా పది సంవత్సరాలు. తన పుట్టింట్లో తను పూర్తిగా ఒంటరిది కాకుండా అన్న ఉన్నాడు. కానీ శక్తికి కూడా ఆరోగ్యం దెబ్బతింది. కచేరీలు చాలా తక్కువ చేస్తున్నాడు.

శ్రీసద్గురు సంగీత సమాజం తమ సుబ్బలక్ష్మిని 'మధుర కళా ప్రవీణ'గా గౌరవించుకుంది. ఆ వెంటనే సుబ్బలక్ష్మి కచేరీ మొదలైంది. ఆ సభాప్రాంగణం వెనుకనే రైలు మార్గం ఉంది. కచేరీకి ముందే, సభాకార్యక్రమాలు జరుగుతున్నప్పుడే ఆ ప్రాంగణమంతా జనంతో నిండిపోయింది. కచేరీ జరుగుతుండగా జనం ఇంకా వస్తూ ప్రహరీ లేని ఆ ప్రాంగణంలో జనం రైలుపట్టాలు మీద కూడా కూర్చొని, సుబ్బలక్ష్మి పాట వింటున్నారు. పరవశులై పాట వెంబడి పాట వింటూనే ఉన్నారు. ఇంతలో మదురై నుంచి తిరువనంతపురం వెళ్లవలసిన తిరువనంతపురం ఎక్స్‌ప్రెస్ దూరం నుంచే కూత పెట్టుకుంటూ వస్తోంది. ఆ రైలు కూత వినిపించినాకానీ ఏ ఒక్కరూ లేచే ప్రయత్నం చేయలేదు. మాకు ఇప్పుడు సుబ్బలక్ష్మి పాటే ముఖ్యం అన్నట్లు కూర్చుండిపోయారు. రైలును 'నువ్వు ఆగాల్సిందే' అన్నట్లు ఎవరూ పట్టించుకోలేదు. మృదంగం వాయిస్తున్న టి.కె. మూర్తి అనుకోకుండా ఇటువైపు చూశాడు. పొగలు కక్కుతూ, సెగలు చిమ్ముతూ వచ్చి జనాల ముందే ఆగిన రైలును చూసి, ఒక్క క్షణం గుండె, మృదంగం లయ తప్పాయి.



మదురైలో శ్రీసద్గురు సంగీత సమాజం నుంచి, టి.టి.కృష్ణమాచారి చేతుల మీదుగా 'మధుర కళా ప్రవీణ' పురస్కారం అందుకుంటున్న సుబ్బలక్ష్మి, వెనుక సదాశివం, శ్రీసద్గురు సంగీత సమాజం అధ్యక్షులు శివసాంబన్.



సుబ్బలక్ష్మివైపు చూశాడు. రైలును చూసినట్లే ఉందిగానీ ఏమాత్రం ఆ ధ్యాస లేకుండా తన పాట పాడుకుంటూ పోతుంది. టి.కె. మూర్తి ఇంకా ఆశ్చర్యంగా సుబ్బలక్ష్మివైపు తిరువనంతపురం ఎక్స్‌ప్రెస్‌వైపు మార్చిమార్చి చూస్తున్నాడు. మధ్యలో ఒకసారి ముందు వరసలో కూర్చున్న శక్తివేల్‌వైపు చూశాడు, "ఏమనుకున్నావ్! నా చెల్లి అంటే" అనే భావన శక్తివేల్ నవ్వులో కనిపించింది.

❦ ❦

రాజాజీ మంచం పట్టాడు. సుబ్బలక్ష్మి రాజాజీ ప్రక్కనే కూర్చొని విష్ణు సహస్ర నామాలు పాడి వినిపిస్తోంది. అదృష్టవంతుడు రాజాజీ. ఏకంగా సుబ్బలక్ష్మి నోటనే విష్ణు సహస్ర నామాలు వింటూ ప్రాణాలు విడిచాడు. చక్రవర్తి రాజగోపాలాచారి, నిజమైన నాయకుడు. విలువలే ఊపిరిగా జీవితం గడిపిన మహోన్నతమైన మనిషి, రాజాజీ మరణం సదాశివానికి తీరని లోటు అయింది. రాజకీయాలకు పూర్తిగా స్వస్తి చెప్పాడు. ఇప్పుడు ఏ రాజకీయ పార్టీ పిలిచినా, పోదలుచుకోవటంలేదు. రాజకీయాలకు దూరంగా ఉండటం సరైన నిర్ణయమైనా, రాజాజీ లేకపోవటం కల్కి పత్రికకు పెద్ద దెబ్బ. రాజాజీ వ్రాసే సంపాదకీయాలు, వ్యాసాలు ఇకమీదట ఉండబోవు. కల్కి అమ్మకాలు మరింత తగ్గనున్నాయి.

❦ ❦

భజగోవిందం, విష్ణు సహస్ర నామం ఎల్.పి. రికార్డులు దక్షిణ భారతంకన్నా ఉత్తర భారతంలో ఎక్కువ అమ్ముడుపోతున్నాయి. ఉత్తర భారతానికి సుబ్బలక్ష్మి ఎప్పటినుంచో సుపరిచితం. లబ్ధి కచేరీలు మొదలుపెట్టిన 1944 వ సంవత్సరం నుండి, గత 28 ఏండ్లలో ఢిల్లీలో 19 సార్లు కచేరీ చేసింది. కాన్పూర్, జబల్‌పూర్, ఖరగ్‌పూర్, జమ్‌షడ్‌పూర్, కలకత్తా, హౌరా, లక్నో, భోపాల్ మొదలగు ఉత్తరాది నగరాల్లో కూడా తన శ్రావ్యమైన గొంతు వినిపించింది. ఉత్తర భారతంలో సుబ్బలక్ష్మి పూర్తిగా భజనలే పాడుతుంది. కబీర్‌దాస్, తులసీదాస్, సూర్‌దాస్, మీరా, నర్సింగ్‌మెహతా మొదలైనవారి భజనలు వినిపిస్తుంది. వారి భాషలో పాడుతున్నందుకు సుబ్బలక్ష్మి ఉత్తర భారతంలో కూడా ప్రతి ఇంటా పరిచయమున్న పేరే.

సుబ్బలక్ష్మికి ఉన్న గుర్తింపు తనను వెతుక్కుంటూ వచ్చే బిరుదులు, సత్కారాలలో తెలిసిపోతుంది. 1969లో సంగీత కళానిధి బిరుదు వస్తే, 1970లో 'ఇసై పేరరింగ్నర్' అయితే, 1971లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వాళ్లు డాక్టర్ ఆఫ్ లెటర్స్ పట్టా ప్రదానం చేశారు. అలానే 1973లో ఢిల్లీ విశ్వవిద్యాలయం వారు కూడా వారి స్వర్ణ జయంతి ఉత్సవాల్లో సుబ్బలక్ష్మిని డాక్టర్ ఆఫ్ లెటర్స్ సత్కారానికి ఎన్నిక చేశారు.

ఈ సత్కారం అందుకోవటానికి సుబ్బలక్ష్మి ఢిల్లీ చేరుకుంది. అక్కడ బస సుబ్రహ్మణ్య చంద్రశేఖర్ అక్కగారి ఇంట్లో. సుబ్రహ్మణ్య చంద్రశేఖర్ ప్రఖ్యాత ఖగోళ భౌతిక శాస్త్రవేత్త. ఈయన అమెరికాలోనే ఉంటున్నాడు. కానీ ఢిల్లీ విశ్వవిద్యాలయం ఈయన్ను కూడా డాక్టర్ ఆఫ్ లెటర్స్‌తో గౌరవించదలచి ఆహ్వానించినందుకు ఢిల్లీ చేరుకున్నాడు. ఆ తర్వాత రోజు ఢిల్లీ విశ్వవిద్యాలయ ప్రాంగణంలో ప్రధానమంత్రి ఇందిరాగాంధీ ముఖ్య అతిథి కాగా, సుబ్బలక్ష్మి, చంద్రశేఖర్, సత్యజిత్‌రే మొదలగువారు వేదిక మీద కూర్చున్నారు. సుబ్బలక్ష్మి ప్రక్కన శాస్త్రవేత్త చంద్రశేఖర్ కూర్చున్నాడు, సుబ్బలక్ష్మి కాస్త తలతిప్పినా.... ఆమెకు అలంకరించిన కాన్వొకేషన్ క్యాప్ క్రింద పడిపోతుంది. నాలుగుసార్లు పడింది, చంద్రశేఖర్ ఆ క్యాప్‌ని తీసి దులిపి సుబ్బలక్ష్మికి ఇస్తూనే ఉన్నాడు. ఐదోసారి పడినప్పుడు "ఇది మీకు అవసరం లేదేమో...." అంటూ తీసి పక్కనపెట్టాడు. అక్కడ కార్యక్రమం అయిన తర్వాత సత్యజిత్‌రేతో సహా అందరూ మళ్లీ చంద్రశేఖర్ ఇంటికి చేరుకున్నారు. అక్కడ, "చంద్రశేఖర్, మీకు తెలుసా. ఈ అవార్డు తీసుకోవటానికి సుబ్బలక్ష్మి గారు వస్తున్నందుకే నేనూ ఈ అవార్డు తీసుకుంటానని ఒప్పుకున్నాను" చెప్పాడు సత్యజిత్‌రే.

"నేనూ అంతే" నవ్వుతూ చెప్పాడు చంద్రశేఖర్.

అందరూ సుబ్బలక్ష్మిచేత చిన్నపాటి కచేరీ ఇప్పించుకొని కానీ తృప్తిపడలేదు.

ఇంతలో సుబ్రహ్మణ్య చంద్రశేఖర్‌ని ఇంటర్వ్యూ చేయటానికి ఒక విలేఖరి వచ్చాడు. ప్రశ్నలు సంధిస్తున్నాడు. నక్షత్రాలు, రెడ్‌జెయింట్, వైట్‌డ్వార్ఫ్, సూపర్ నోవా, క్రిష్ణబిలాలు అలాఅలా అంతరిక్షంలోనే సంచరిస్తున్నారు.

"మీకు అంతరిక్షమే పరిశోధనా కేంద్రం, ఆ అంతరిక్షంలో విహరిస్తున్నప్పుడు మీరు ఎప్పుడైనా భగవంతుడి ఆనవాళ్లు ఏమైనా చూశారా....... భగవంతుడనే ఒక శక్తి లేకపోతే ఈ అంతరిక్షం ఇలా ఒక పేర్చబడిన క్రమంలో ఉండేది కాదు అని భావిస్తున్నారా....."

"ఎంతమాత్రమూ లేదు. భగవంతుడున్నాడని నాకు ఏమాత్రం నమ్మకము లేదు" కాసేపు అంతా నిశ్శబ్దం..

"చివరి ప్రశ్న, మరి ఈ జన్మభూమి కోరి మరీ ఆహ్వానించి ఇచ్చిన నిన్నటి అవార్డు గురించి మీ స్పందన....."

"భారతదేశంలో ఒక అవార్డు తీసుకోవటం చాలా ఆనందంగా ఉంది. అందులోనూ నా చిరకాల మిత్రుల మధ్య, రాజకీయ నాయకులతోపాటు వేదిక మీద కూర్చోవటం వింతగా అనిపించింది, కానీ, విజ్ఞాన శాస్త్రంలోని నా కృషిని ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిగారి



సంగీతపు స్థాయితో పోల్చి, ఆమె ప్రక్కన నన్ను కూర్చోబెడితే పులకించిపోయాను" అని చెప్పాడు ఖగోళ భౌతిక శాస్త్రవేత్త చంద్రశేఖర్.

❖❖

ఢిల్లీ నుంచి మద్రాసు చేరుకుంది సుబ్బలక్ష్మి.

ఆ వెంటనే మహాశివరాత్రి రోజుకి కంచి కామకోటి పీఠానికి చేరుకుంది. కంచి పరమాచార్య మహాశివరాత్రి పూజలు సాయంత్రం ఆరుగంటలకి మొదలుపెట్టి తెల్లవారుజాము ఆరుగంటలకి ముగిస్తారు. సుబ్బలక్ష్మి పరమాచార్యుల వారి భక్తురాలైనప్పటి నుంచి, తనకు వీలున్నప్పుడల్లా ఈ పూజకు హాజరవుతుంది. పరమాచార్య ప్రతి కాలపూజ పూర్తి చేసిన తర్వాత సుబ్బలక్ష్మి ఒక పాట పాడుతుంది, పక్కవాద్యాలు ఏమీ లేకుండా, అలా తెల్లవారేదాకా పరమాచార్యులచే ఒక కాలపూజ, ఆ తరువాత ఒక సుబ్బలక్ష్మి శైవగీతం.

నవవిధ భక్తి ప్రక్రియల్లో సంకీర్తన ప్రక్రియ ఒకటి. భగవంతుడి నామము, ఆయన గుణగణాలు ప్రేమతో శ్రద్ధతో పాడటమే సంకీర్తనం. కృష్ణుడు నారదుడితో ఇలా చెప్పాడు: వైకుంఠం కాదు, యోగుల హృదయాలలో కాదు... భక్తులు ఎక్కడ సంకీర్తన చేస్తే అక్కడ నేనుంటాను.... అని.

సుబ్బలక్ష్మి సంకీర్తనంతో కంచి కామకోటి పీఠం పరిసరాలు ఆధ్యాత్మికతతో వెలుగులీనింది. పన్నెండు గంటలు భక్తిపారవశ్యంతో పాడి, సుబ్బలక్ష్మి సదాశివంతో అంది "మామా, ప్రశాంతమైనవేళ, ఏ పక్కవాద్యాల ధ్యాసా లేకుండా, నాలో నేను భగవంతునిలో లీనమై పాడటం అందులోనూ పరమాచార్యుల ముందు నా సంగీతం, నా పాట ఇప్పుడు సార్థకమైనట్లు ఉంది" అని. కంచి పరమాచార్యులకు సుబ్బలక్ష్మి దంపతులు ఇష్టభక్తులయ్యారు. తరువాతి రోజు కామాక్షిని కొలుచుకొని ఆలయం బయటకు వస్తుండగా భిక్షగాళ్లు ద్వారానికి రెండువైపులా కూర్చొని భిక్షాటన చేస్తూ ఉన్నారు. సుబ్బలక్ష్మి తన పర్సులోంచి ఒక నోట్ల కట్ట చేతిలో ఉంచుకొని ఒక్కొక్క నోటు ఒక్కొక్క యాచకుడికి ఇస్తూ వస్తుంది. మెల్లగా యాచకులు సుబ్బలక్ష్మిని చుట్టుముట్టుతున్నారు. ఒక అంధుడు సుబ్బలక్ష్మి దాకా రాలేకపోతున్నాడు, సదాశివం వెంటనే అతని దగ్గరకి వెళ్లి వంద నోట్లున్న రెండు రూపాయల కట్ట ఒకటి ఇచ్చి వచ్చాడు. వెనక్కి తిరిగి చూసేసరికి సుబ్బలక్ష్మిని పూర్తిగా చుట్టుముట్టారు యాచకులు. అందరినీ అరుస్తూ సుబ్బలక్ష్మిని తీసుకెళ్లిపోయాడు సదాశివం. ఆ గుంపుని చూసి హడలిపోయింది సుబ్బలక్ష్మి. "మామా, నిన్న కూడా డబ్బులు పంచాను కదా..... నిన్న మూగలేదు నా చుట్టూ, ఈ రోజేంటి ఇలా....." అని అడిగింది. "నిన్న ఎంత పంచావు ఒక్కొక్కళ్లికి..."



కంచి పరమాచార్యులను పూజిస్తూ సుబ్బలక్ష్మి దంపతులు



"మీరు రెండు రూపాయల కట్ట ఇచ్చారుకదా.... అదే పంచాను....."

"ఈ రోజు ఎంత పంచావో తెలుసా......"

"అంతే, రెండు రూపాయలే ఒక్కొక్కళ్లకి..."

"కాదు.. ఈ రోజు ఇరవై రూపాయల నోట్లు పంచావు. నీకు తేడా తెలియలేదు."

"అయ్యో, మామా, చాలా డబ్బులు ఖర్చు చేసినట్లు ఉన్నానుగా......"

"ఏమీ ఫర్వాలేదు.... నువ్వు ఇవ్వకపోతే ఆ నోట్లకట్ట నా దగ్గర ఉండేది, అది ఆ గుడ్డివాడికి ఇచ్చి వుండేవాడిని. ఇక దాని గురించి ఆలోచించకు. అవసరమైన వాళ్లకి డబ్బు ఇవ్వటంకంటే పుణ్యమేముంది?"

ఎలా అయినా సరే, అవసరమైనదానికంటే డబ్బు తనదగ్గర ఎప్పుడూ ఉంచుకోడు సదాశివం. తర్వాత తీరిగ్గా లక్షరూపాయలు ఇచ్చేకంటే, అవసరమున్నప్పుడు అడిగినవారికి తక్షణమే వంద రూపాయలు సాయం చేయటమే సదాశివం నైజం. అలా చేయాలని అందరికీ చెప్తుంటాడు కూడా. సుబ్బలక్ష్మికి ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. తన దగ్గర ఆ వంద రూపాయలు ఉన్నా లేకున్నా, అడిగినవారి అవసరం తీర్చటానికి పూనుకుంటాడు సదాశివం. సదాశివం చేసే దానాలు అతను గుర్తుపెట్టుకోడు. ఎక్కడా రాసుకోడు కూడా. కానీ సుబ్బలక్ష్మి లబ్ధి కచేరీలు మాత్రం అవి మొదలయిన సంవత్సరం నుంచి తేదీ, ఏ ఊర్లో చేసింది, ఏ సంస్థ లబ్ధి కోసం చేసింది వివరంగా వ్రాసిపెడుతున్నాడు. కల్కిలో కూడా ప్రచురించాడు ఒకసారి. అలా ప్రచురించటం అనుకోకుండా సుబ్బలక్ష్మికి ఒక బ్రహ్మాండమైన మేలు చేసింది.

సుబ్బలక్ష్మి ఇంటికి ఒక రిజిస్టర్డ్ పోస్ట్ వచ్చింది. సదాశివం సంతకంపెట్టి, ఆ కవర్ విప్పి చూశాడు. అధికారిక ఉత్తరాలులాగున్నాయి, చదవటం మొదలుపెట్టాడు. ఫిలిప్పీన్స్.... రామన్ మెగసెసె అవార్డు...... ఆ ఉత్తరాలన్నీ ఒకటికి నాలుగుసార్లు చదివాడు....

సదాశివం ఎగిరి గంతేసినంత పనిచేశాడు. వెంటనే సెమ్మంగుడికి, రాధకి, విజయకి, ఆనందికి మద్రాసు మ్యూజిక్ అకాడమీకీ ఫోన్లు వెళ్లిపోయాయి. సుబ్బలక్ష్మిని పిలిచి చెప్పాడు. "ఇదేమి అవార్డు మామా? ఎవరు ఇచ్చే అవార్డు ఇదీ? నాకు సంగీత కళానిధి అవార్డు ఒక్కటే తెలుసు మామా, మిగతావన్నీ అవి వచ్చిన తర్వాత తెలిసినవే" అంది.

"ఇలాంటి అవార్డు ఉందని నాకు తెలియదు కుంజా, అయినా మనం కస్తూర్బా మెమోరియల్‌కి పాడింది, ఆసుపత్రుల కోసం, పాఠశాలల కోసం పాడింది ఏదైనా అవార్డు వస్తుందనా?"

మెల్లగా అందరూ వస్తున్నారు అభినందించటానికి. కుటుంబంలో చిన్నపిల్లలు ప్రపంచ పటాన్ని పరిచారు క్రింద. ఫిలిప్పీన్స్ దేశాన్ని గుర్తించారు, "అమ్మా, నువ్వు ఇప్పటిదాకా

దేశానికి పశ్చిమంవైపు వెళ్లావు, ఇప్పుడు తూర్పు దిక్కుకు వెళ్లాలి" చెప్పింది విజయ.

ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మికి రామన్ మెగసెసే అవార్డు ప్రకటించబడిందని తర్వాత రోజు ప్రపంచానికి తెలిసింది. అలానే ఫిలిప్పీన్స్‌లోని భారత సంతతికి చెందిన ప్రజలకు కూడా. వెంటనే ఫిలిప్పీన్స్‌లోని భారత రాయబారికి సుబ్బులక్ష్మి కచేరీలు జరిపించాలని అభ్యర్థనలు వెల్లువెత్తాయి. కేవలం ఫిలిప్పీన్స్ లోనయితే అంతగా ఆశ్చర్యపోనక్కరలేదు. అటుపక్కనున్న బ్యాంకాక్, హాంక్‌కాంగ్, సింగపూర్, మలేసియా, జపాన్ దేశాల నుంచి కూడా అభ్యర్థనలు వచ్చాయి.

సి.వి. నరసింహన్, నారాయణ్ మెనన్ మళ్లీ రంగంలోకి దిగారు. వీరు పెద్ద హోదాల్లో ఉన్న అధికారులు. పైగా సదాశివం చంకలోని పిల్లల చందం. ఫిలిప్పీన్స్‌లో భారత రాయబారి వీరితో చేరాడు.

అందరూ కలసి సుబ్బులక్ష్మి మెగసెసే అవార్డు అందుకొన్న తర్వాత మనీలాలో ఒక కచేరీ, ఆ తర్వాత బ్యాంకాక్, హాంక్‌కాంగ్, టోక్యో, సింగపూర్, మలేసియాలలో కూడా కచేరీలు చేసేటట్లు ప్రణాళిక చేశారు.

పురస్కారం ప్రకటించిన రెండు నెలలకి సుబ్బులక్ష్మి బృందం ఫిలిప్పీన్స్ రాజధాని మనీలాకు చేరుకుంది. ఇక్కడ సుబ్బులక్ష్మికి ఇప్పటిదాకా దక్కని అరుదైన గౌరవం లభించింది. సుబ్బులక్ష్మి ఇంకా నలుగురు అవార్డు తీసుకోనున్న వారితో సహా ఫిలిప్పీన్స్ దేశ సైనిక వందనం అందుకుంది. ఆ వెంటనే ప్రొటోకాల్ పాటిస్తూ అట్టహాసమైన అవార్డు బహూకరణ కార్యక్రమం మొదలయింది. సుబ్బులక్ష్మికి అర్థం కాని భాషల్లో మాట్లాడుతూ కార్యక్రమం జరిగిపోతుంది. సుబ్బులక్ష్మికి ఏమీ అర్థంకాక, అప్పుడప్పుడు రాగాలాపనలు చేసుకొంటూ గడిపింది. తనవంతు వచ్చినప్పుడు అవార్డు అందుకుంది. ఈసారి సుబ్బులక్ష్మికి రాసివ్వబడిన ఉపన్యాసం ఇంగ్లీష్‌లో ఉంది.

ఆ తరువాతి రోజు మనీలాలో కచేరీ ఏర్పాటయింది. వేదిక పైనుంచి సుబ్బులక్ష్మి చూసినప్పుడు ఫిలిప్పీన్స్ అధ్యక్షుని భార్య అయిన ఇమెల్డా మార్కోస్ తలుపుకి దగ్గరగా ఒక ప్రక్కకి కూర్చొంది. మధ్యలో వెళ్లిపోదామని అలా పక్కకు కూర్చుందేమో అనుకుంది సుబ్బులక్ష్మి. కానీ కచేరీ ముగిసేదాకా ఇమెల్డా మార్కోస్ కచేరీ వింటూనే ఉంది. ఆ తరువాతి రోజు సుబ్బులక్ష్మి బృందాన్ని విందుకు ఆహ్వానించింది ఇమెల్డా. విందుకు వెళ్లేముందు ఈసారి సుబ్బులక్ష్మి బృందంకి తిని వెళ్లే తీరిక లేకపోయింది. ఈ తప్పుకి శిక్ష తప్పలేదు. వెళ్తూవెళ్తూ కారులో సుబ్బులక్ష్మి రాధతో అంది, "రాధా, ఈ ఇమెల్డాకి కాస్త జ్ఞానం ఉన్నట్లు ఉంది, నిన్న కచేరీ పూర్తిగా వింది" అవునన్నట్లు నవ్వింది రాధ.



ఇమెల్డా నివాసం పెద్ద రాజప్రాసాదం. రాష్ట్రపతి భవంతులు, మైసూర్ మహారాజు రాజప్రాసాదాలు, రాజస్థాన్ రాజప్రాసాదాలు చూసిన సుబ్బులక్ష్మికి ఇమెల్డా భవనం ఆశ్చర్యగొలపలేదు. కానీ రాధతో సహా మిగతావారంతా కళ్లు చెదిరిపోయే సంపదను చూసి ఆశ్చర్యపోతున్నారు. ఇమెల్డా 'ఫస్ట్ లేడి ఆఫ్ ఫిలిప్పీన్స్' కాని.... ఆమెను 'ఫస్ట్ లేడీ ఆఫ్ ఎక్స్‌ట్రావగన్స్' అని కూడా అంటారు. అంత మితిమీరిన దుబారాతనం (ఎక్స్‌ట్రావగన్స్) కనిపిస్తుంది ఆ అధికార నివాసంలో. అత్యంత ఖరీదైన డైనింగ్ టేబుల్ చుట్టూ విందుకు కూర్చున్నారు. ఇమెల్డా సుబ్బులక్ష్మిని మళ్లీ పాడమని అభ్యర్థించింది.

సుబ్బులక్ష్మి ఒక పాట పాడింది. పక్కనున్న భారత రాయబారిని అడిగింది, "సుబ్బులక్ష్మి వాళ్లు భారతదేశంలో ఏ ప్రాంతానికి చెందినవారు?" "దక్షిణ భారతదేశానికి మేడమ్" చెప్పాడు భారత రాయబారి. "ఓ...." అనుకుంటూ తల ఊపింది ఇమెల్డా. ఆ తర్వాత భోజనాలు వడ్డించమంది.

"రాధా, ఈమెకు ఉత్తర భారతదేశం పద్ధతులు దక్షిణ భారతదేశం పద్ధతులు కొంచెం వేరుగా ఉంటాయనే జ్ఞానం కూడా ఉంది రాధా" మెల్లగా రాధ చెవిలో చెప్పింది సుబ్బులక్ష్మి. 'అవునవును', అన్నట్లు తలవూపింది రాధ.

ముందు ఒక వంటకం వచ్చింది, "ఇది చేపల పులుసు" అంది ఇమెల్డా. "మేము ఎవ్వరమూ తినం" అన్నాడు భారత రాయబారి. ఆ తర్వాత ఇంకో వంటకం వచ్చింది. "ఇది పీతల పులుసు, ఫిలిప్పీన్స్ పీతలకి పెట్టిందిపేరు. తినండి" అంది. "ఇది కూడా తినము, క్షమించండి" అన్నాడు భారత రాయబారి.

"అయితే.. ఇది కోడిమాంసం...." "ఇది వేటమాంసం....." వంటకం తర్వాత వంటకం మాంసాహార వంటకాలు వస్తున్నాయి. టేబిల్ మీద పెట్టబడకుండానే వెళ్లిపోతున్నాయి.

"అమ్మా, కడుపు కాలుతుంది. ఇమెల్డా జ్ఞానం ఇలా ఏడ్చిందేమిటి..... ఇంటికి పిలుస్తున్నవాళ్లు శాకాహారులో మాంసాహారులో కూడా తెలుసుకోదా...." నీరసంగా, కోపంగా అంది రాధ. ఇక అక్కడ కూర్చున్నందుకు ఏదో ఒకటి తినాలి కాబట్టి టేబుల్ మీద ఉన్న పళ్లు తిని, పళ్ల రసాలు తాగి విందు అయిందనిపించారు.

తన అతిథులను సాగనంపుతూ ఇమెల్డా అతిథులకు బహుమానాలు ఇచ్చింది. పైకి బాగా అలంకరించి వున్న పెట్టెలలో లోపల ఉన్న వస్తువులు చాలా ఖరీదైన బహుమతుల్లా ఉన్నాయి. అందరూ తిరిగి వారి బసకు బయలుదేరారు, "తొందరగా పోనివ్వండీ ఆకలి కేకలు వేస్తుంది" అంటూ అందరూ ముక్తకంఠంతో రాగం అందుకున్నారు.

"ఏదోలే రాధా. ఇమెల్డా కాస్త భోజనాల దగ్గర తడబడింది కాని ఎంత మంచి బహుమానాలిచ్చి మర్యాద చేసిందో చూడు" అంది ఓదార్పుగా సుబ్బలక్ష్మి.

ఇంటికి రాగానే ప్రొద్దున మిగిలిపోయిన ఇడ్లీలు గబగబా తిని, శాంతించారు. ఆ తర్వాత ఇమెల్డా ఇచ్చిన బహుమతులు తెరవడం మొదలుపెట్టింది రాధ. ముందు సదాశివం పెట్టె తెరిచింది. అందులో ఉన్నవి నచ్చలేదు. ఆ తర్వాత తనకిచ్చిన పెట్టె తీసింది. ఆ పెట్టెలోనూ అవే ఉన్నాయి. సుబ్బలక్ష్మికి ఇచ్చిన పెట్టె తెరుస్తూ మిగతా వారిని కూడా తెరవమంది. అన్నింటిలో అవే ఉన్నాయి. సుబ్బలక్ష్మికి ఇచ్చిన పెట్టెలో కూడా అవే ఉన్నాయి. పెట్టెకు పెట్టె నిండుగా సిగరెట్లు.

అమ్మవైపు తిరిగింది రాధ. "ఇమెల్డా, మర్యాద, జ్ఞానం" అంది.

𝄞 𝄞

సుబ్బలక్ష్మికి రామన్ మెగసెసె అవార్డు ప్రజాసేవ విభాగం క్రింద ఇవ్వబడింది. 1958 నుంచి ఇవ్వబడుతున్న ఈ అవార్డులు ఆసియా ఖండపు నోబుల్ పురస్కారాలుగా ఖ్యాతిగాంచాయి, ఈ అవార్డు ఫౌండేషన్ సభ్యులు మూడో కంటికి తెలియకుండా ఆయా అవార్డులకి అర్హులైనవారిని గుర్తిస్తారు. ఇందులో ఆ వ్యక్తి అర్హత తప్ప ఎలాంటి ప్రలోభాలకి తావులేదు. రామన్ మెగసెసె ఫౌండేషన్ సభ్యులు తనను వెతుక్కుంటూ వచ్చేసరికే సుబ్బలక్ష్మి 170కి పైగా లబ్ధి కచేరీలు చేసింది. పైగా తన విష్ణు సహస్ర నామం, భజగోవిందం రికార్డులమీద వస్తున్న డబ్బులు, ఇంకా వేంకటేశ్వర సుప్రభాతం రికార్డు మీద వస్తున్న ఆదాయం కూడా వివిధ సంస్థలకు అందేలా చేశాడు సదాశివం. రామన్ మెగసెసె బృందం సుబ్బలక్ష్మిని గుర్తించేటప్పటికి సుబ్బలక్ష్మి అలుపు అనేది లేకుండా పదేపదే తన గాత్రాన్ని మంచి పనుల కోసం వినియోగిస్తూ ప్రజలకి నిస్వార్థ సేవ చేస్తున్న త్యాగశీలి. 1944లో కస్తూర్బా మెమోరియల్ లబ్ధి కచేరీలతోనే సదాశివం ఈ లబ్ధి కచేరీల శక్తిసామర్థ్యాలు కనిపెట్టాడు. సుబ్బలక్ష్మికి విపరీతమైన పేరు రావటం ఖాయం. సుబ్బలక్ష్మి శ్రావ్యమైన గొంతు, పాండిత్యం వల్ల కచేరీలకు వచ్చే జనానికి తరుగు ఉండదు. ఇక పెత్తందారీ అంతా తనదే. కచేరీ అభ్యర్థనలతో జనం తన ముందు వరస కడతారు. పరపతి, పలుకుబడి అన్నీ వచ్చి చేరతాయి. ఇక డబ్బు సంగతి అంటే సదాశివంకి డబ్బు ఎప్పుడూ ముఖ్యంకాదు. గాంధీ, రాజాజీ విధేయుడిగా వాళ్లలాగా అసంగ్రహం అలవరచుకున్నాడు. పైగా, మంచి పనులకు కాస్త తమవంతు సాయం చేస్తున్నందుకు గర్వపడేవాడు. అలా సుబ్బలక్ష్మి లబ్ధి కచేరీలు మూడు ఆసుపత్రులు, ఆరు జ్ఞప్తి కచేరీలు అన్నట్లు సాగిపోతూ ఉన్నాయి. ఏటికి ఏడు కచేరీలు కూడా పెరుగుతూ వస్తున్నాయి. అభ్యర్థనలు ఉప్పెనలాగా వస్తున్నాయి. కానీ సదాశివం తన మార్కెటింగ్





ఇతర పురస్కార గ్రహీతలతో పాటు ఫిలిప్పీన్స్ దేశ సైనిక వందనాన్ని అందుకుంటూ సుబ్బలక్ష్మి



రామన్ మెగసెసే అవార్డు అందుకొన్న తర్వాత ఉపన్యాసం ఇస్తున్న సుబ్బ



ఇమెల్డా మార్కోస్ రాజప్రాసాదంలో సుబ్బలక్ష్మి బృందానికి విందు



ఇమెల్డా మార్కోస్ తన అతిథులకు బహూకరిస్తున్న బహుమతులు



నైపుణ్యాన్ని పూర్తి సామర్థ్యంతో వినియోగించి, అంచెలంచెలుగా కృషిచేస్తూ సుబ్బలక్ష్మికి ఒక హోదా కల్పించాడు సంగీతపు విపణిలో. ఆ హోదాకి ఏమాత్రం తగదు అనుకున్న లబ్ధి కచేరీ అభ్యర్థనలను దగ్గరకు రానివ్వడు. ఆచి తూచి లబ్ధి కచేరీ ఎంపిక చేసిన తర్వాత వారికి సదాశివం పెట్టే షరతులు, "కచేరీ ప్రాంగణంలో నాకు ఖాళీ కుర్చీలు కనబడకూడదు. మీరు టిక్కెట్టు రేట్లు, డోనర్ టిక్కెట్లు రేట్లు ఎంతైనా పెట్టుకోండి, ఎన్నైనా అమ్ముకోండి నాకు ఎలాంటి డబ్బు అవసరం లేదు మీనుంచి. కానీ సుబ్బలక్ష్మి కచేరీ కనీసం లక్షరూపాయల ఆదాయం చూడాలి. అంతా మీరే ఉపయోగించుకోండి" అని. అదృష్టవశాత్తు సుబ్బలక్ష్మి పాట పుణ్యమాని కచేరీల నిర్వాహకులు సదాశివం షరతులు అమలుపర్చటానికి ఎలాంటి కష్టం పడనవసరం లేకుండేది, సుబ్బలక్ష్మి పేరు చాలు వాళ్లకి.

సదాశివం అసంగ్రహం, సుబ్బలక్ష్మి సేవ ఊరికే పోలేదు. నోబుల్ బహుమతి తర్వాత నోబుల్ బహుమతి అంత అవార్డు వరించింది. మనీలా నుంచి బ్యాంకాక్ చేరుకున్నారు. అక్కడ ఎస్.పి. సుందరం అనేవారి ఇంట ఆతిథ్యం. సుబ్బలక్ష్మికి ఆతిథ్యమివ్వటమంటే సాక్షాత్తు ఒక గంధర్వ కాంతకు, అంతకు మించి ఒక మీరాకు, ఆండాళ్లుకు ఆతిథ్యమిస్తున్నట్లే. సుందరం కుటుంబం తమకు వచ్చిన ఈ అవకాశానికి ఆనందంలో తేలిపోతున్నారు. సుందరం భార్య అయితే తమ అదృష్టాన్ని ఇంకా నమ్మలేకపోతుంది, అమితానందంతో సుబ్బలక్ష్మికి ఏమి కావాలో దగ్గరుండి చూసుకుంటుంది.

ఎస్.పి. సుందరం సూచనమేర, ఇదివరకే థాయ్‌లాండ్ రాజు భూమిపాల్ చేస్తున్న సేవా కార్యక్రమానికి తోడ్పాటునిస్తూ తనవంతుగా ఒక లబ్ధి కచేరీ చేసింది సుబ్బలక్ష్మి.

ఆ రోజు కచేరీ అయిన తర్వాత రాత్రి సుందరం ఇంట్లో తృప్తిగా వేడి వేడి తమిళ వంటకాలతో భోజనాలు చేసి, ఇక అందరూ పడుకోబోతుండగా సుందరం భార్య సుబ్బలక్ష్మికి ఏమన్నా కావాలోమోనని ఇంకొకసారి అడగటానికి వచ్చింది. తలుపు తట్టింది. సుబ్బలక్ష్మి లోపలికి రమ్మంది. మెల్లగా తలుపు తీసి లోపలికి వచ్చింది. ఎదురుగా కనబడిన దృశ్యాన్ని చూసి తట్టుకోలేకపోయింది ఆ ఇంటావిడ. వచ్చిన పని త్వరగా త్వరగా పూర్తి చేసుకొని తన గదిలోకి వచ్చింది. మొహం పాలిపోయి ఉంది. రక్తం చుక్క లేదు మొహంలో. ఎవరిమీద తన అక్కసు వెళ్లగక్కాలో తెలియక దుప్పట్లను విదిలించి కొడుతుంది. భర్త చూస్తూ ఉన్నాడు. "ఏమైందీ..." అని అడిగాడు. "సుబ్బలక్ష్మి చేత కాళ్లు తుడిపించుకుంటాడా? ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి చేత కాళ్లు తుడిపించుకుంటాడా...?" అని ఆవేదన పడుతుంది.

"ఎవరు తుడిపించుకున్నారూ...?" అనుమానంగా అడిగాడు భర్త.

"ఇంకెవరు? వాళ్లాయన."

'అంతేకదా...' వాళ్లాయనే కదా దీనికెందుకు అంత బాధ అన్నట్లు భార్యవైపు చూసి ఇక వదుకున్నాడు సుందరం. సుందరంగారి భార్యమాత్రం తను చూసింది జీర్ణించుకోలేకపోయింది. "భగవంతుడు ఏరి కోరి ఆమెచేత పాటలు పాడించుకుంటుంటే, ఈయన ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి చేత కాళ్లు తుడిపించుకుంటాడా? అపచారం, అపచారం. అసలు మనసెలా ఒప్పింది ఈయనకు..." అనుకుంటూ వ్యథ చెందింది.

సుబ్బలక్ష్మి పట్ల ప్రజల్లో ఉన్న మనోభావం అంత ఉదాత్తమైనది. 'ఆమెను ఇది కించపరచటం' అని అనుకున్నది ఏదైనా తట్టుకునే స్థితిలో లేరు.

ఆ తర్వాత టోక్యో, సింగపూర్, కౌలాలంపూర్‌లో కూడా కచేరీలు చేసి, ఇంటికి చేరుకున్నారు. తన మూడవ విదేశీయాత్ర దిగ్విజయంగా పూర్తిచేసుకొచ్చింది. కొన్నిరోజులు సేదతీరి కుదుటపడగానే అన్నకు ఫోనుచేసి మాట్లాడుదాం అనుకుంది. ఇంతలోనే అన్న దగ్గరనుంచి కబురు వచ్చింది.

దీపావళికి రెండు రోజులు ముందు లక్ష్మి సుబ్బలక్ష్మికి ఫోను చేసింది. "వదినా, ఈయనకు ఏమీ బాగోలేదు.. అప్పుడప్పుడే స్పృహలోకి వస్తున్నారు. నిన్ను కలవరిస్తున్నారు. నువ్వు తొందరగా రా" అని చెప్పింది. అన్న పరిస్థితి భర్తకి చెప్పింది సుబ్బలక్ష్మి.

"సరే, దీపావళి రోజున పొద్దున్నే బయలుదేరి వెళ్దాం" అన్నాడు సదాశివం. సుబ్బలక్ష్మి, సదాశివం, ఆత్మ వెల్లూరులో శక్తి ఉన్న ఆసుపత్రికి చేరుకున్నారు. అన్న ప్రక్కనే కూర్చుంది సుబ్బలక్ష్మి. అన్న చేతిని తీసుకొని నిమురుతూ ఉంది. తన అన్న తన తోబుట్టువు ఇరవై సంవత్సరాలు ప్రేమగా కలిసి పెరిగిన అన్న. శక్తి స్పృహలోకి వచ్చాడు. చెల్లి వచ్చినందుకు ఆనంద బాష్పాలు కార్చాడు. వాళ్ల అమ్మకి తెలిసినట్లు, శక్తికి కూడా తెలుసు తన చెల్లి మళ్లీమళ్లీ తన దగ్గరకు రాలేదని, ఇదే ఆఖరిచూపు.

ఒకళ్ల చేయి ఒకళ్లు విడవకుండా పట్టుకొని, చిన్నచిన్న కబుర్లు చెప్పుకుంటున్నారు. రక్తసంబంధపు స్పర్శతో శక్తి పుంజుకుంటున్నాడు శక్తివేల్. ఇంతలో సదాశివం నుంచి కబురు వచ్చింది ఇక బయలుదేరమని. అన్నని విడవలేక విడిచింది సుబ్బలక్ష్మి. "మళ్లీ వస్తా అన్నా" చెప్పింది సుబ్బలక్ష్మి. శక్తి సన్నగా నవ్వుకున్నాడు. మద్రాసు తిరుగు ప్రయాణమైయ్యారు. ప్రొద్దుపోయేసరికల్లా మద్రాసు చేరుకున్నారు. దీపావళి రోజు ప్రతి వీధి ప్రమిదల కాంతితో వెలిగిపోతున్నాయి. సుబ్బలక్ష్మికి మాత్రం అన్నను తలుచుకుంటూ మొహం పాలిపోయింది. కల్కి బంగ్లాలో కారు దిగీ దిగంగానే అనంత్ ఎదురు వచ్చాడు, సుబ్బలక్ష్మివైపు భయంగా చూస్తూ, "బాబాయ్, వెల్లూరు నుంచి ఫోన్ వచ్చింది" అన్నాడు.

సుబ్బలక్ష్మి ఊపిరి బిగపట్టి చూసింది అనంత్‌వైపు, అనంత్ తల దించుకున్నాడు.



సుబ్బలక్ష్మి పైన తన గదిలో వెక్కివెక్కి ఏడుస్తుంది. తనని అన్నదగ్గరకు పంపే సూచనలేమీ తనకు కనిపించలేదు. సదాశివం ఆత్మని అయితే వెంటనే వెనక్కు వెల్లూరుకి పంపి అక్కడ లక్ష్మికి తోడుగా పనులు చూసి రమ్మన్నాడు. తనని మాత్రం పంపేటట్లు లేదు. అమ్మ చనిపోయినప్పుడే అతి కష్టంమీద పంపాడు తనని. ఇప్పుడు ఇంకా భీష్మించుకుని వున్నాడు. ఎవరి మాట వినే స్థితిలో లేడు. ఈ జన్మలో చివరిసారిగా అన్నను చూసుకోగలను అనే ఆశ మెల్లగా అడియాశ అయ్యింది సుబ్బలక్ష్మికి. సదాశివం మొండి పట్టుదలకు తల వంచింది.

తన పుట్టింటివారు ఇక ఎవ్వరూ లేరు అన్న బాధ ఇంకా తొలిచివేస్తుంది సుబ్బలక్ష్మిని. సుబ్బలక్ష్మికి అన్నతో ప్రేమానురాగాలతో పెనవేసుకున్న బంధం. తండ్రి లేని ఇంట్లో అన్నే తండ్రిలాంటివాడు సుబ్బలక్ష్మికి. చిన్నప్పటినుంచి తను ఇల్లు విడిచి వచ్చేదాకా తనని గారాబం చేసిన అన్న, తను వృద్ధిలోకి వచ్చినప్పుడు 'నా చెల్లి' అని జబ్బ చరుచుకొని చెప్పిన తన అన్న. తన వంతుగా అన్న వేలుపట్టుకొని నడిచిన సుబ్బలక్ష్మి, అమ్మ తర్వాత అన్నకు ప్రేమగా వండిపెట్టిన చెల్లి, తల్లికి కూడా చెప్పని విషయాలు అన్నకు చెప్పుకున్న సుబ్బలక్ష్మి, అలాంటి అన్న తనను వదిలి వెళ్లినందుకు ఒక క్షోభ అయితే తను అన్న దగ్గరకు వెళ్లలేకపోవటం మరింత క్షోభ.

సుబ్బలక్ష్మి అంత కుమిలిపోతున్నా సదాశివానికి కనికరంలేదు, సూర్యుడికి కనికరం లేదు, తీక్షణమైన కిరణాలు నిన్నటి వేళకే పొడిచి సుబ్బలక్ష్మి సేదతీరకుండా లేపాడు ఈ రోజు సుబ్బలక్ష్మికి ఒక కచేరీ కూడా ఉంది. "మామా....... కచేరీ చేయలేను.... నీరసంగా, బాధతో చెప్పింది సుబ్బలక్ష్మి. "సరే కుంజా, నువ్వు రావొద్దు, రాధను తీసుకె కచేరీ పూర్తి చేయించుకొస్తా" అని చెప్పి సదాశివం రాధతో వెళ్లిపోయాడు. ఈ ఏకాం సమయంలో సంగీతపు గదికి వచ్చి అన్న మృదంగం తీసుకుంది. ఆదితాళం వాయిస చివరి సంస్కారాలు చేయించుకుంటున్న తన అన్నని మనోనేత్రాలతో దర్శించుకుంటుం తన అన్న, తనకు జ్వరం వస్తే కనిపెట్టుకొని ఉన్న తన అన్న, అత్తల వెటకారపు మాట తనదాకా రాకుండా అడ్డుపడిన అన్న, తన భర్త ఏకపక్షంగా వ్యవహరించి, తనకు పిల్ల పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్నాడని ఏడ్చుకుంది ఈ అన్న దగ్గరే. అలాంటి అన్న కడసారిగా చూసుకొని పంపే భాగ్యం దక్కక, తన భక్తిలో, ధ్యానంలో పంపుకుంది.

**సొగసుగా మృదంగ తాళము జతకూర్చి**
**నిన్ను సొక్కచేయు ధీరుడెవ్వడో రామా......**
**నిగమశిరోర్థము కలిగిన నిజవాక్కులతో,**
**స్వరశుద్ధముతో రామ.....**
**సొగసుగా మృదంగ తాళము....**

*త్యాగరాజు కృతి, రాగం-శ్రీ రంజని, తాళం-రూ*

సుబ్బులక్ష్మి తనకుతాను ఓదార్చుకోవటంతప్పు చేసేదేమీలేదు. ఒకరు ఓదార్చితే తీరే బాధ కాదు. భగవంతుడికి వేడుకోలు, ధ్యానమే తనకు ఆధారం. మరింతగా అంతర్ముఖి అవుతుంది. మధుర మీనాక్షి గుడిలో రివ్వున ఎగిరే పచ్చని చిలుకలాంటి కలికి, సదాశివం బంగారు పంజరంలో పంకజాక్షి అయింది. సదాశివం పాడమన్నదే పాట, సదాశివం ఆడమన్నదే ఆట, సదాశివం మాట్లాడమన్నదే మాట. నుంచోమంటే నుంచోటం, కూర్చోమంటే కూర్చోవటం.. లోపలికి వెళ్లిపోమంటే వెళ్లిపోవటం, ఎవరితో మాట్లాడాలో ఎంతవరకూ మాట్లాడాలో, ఎక్కడ మాట్లాడాలో గిరిగీసేదీ సదాశివమే.

"తంగం!" పిలుచుకుంటూ తంగం దగ్గరికి వచ్చాడు సదాశివం. "ఏమిటి మామయ్యా....." అడిగింది యాభైయేళ్ల తంగం. "నీ దగ్గర ఉన్న డబ్బులు ఇవ్వు తంగం. నీకు వైద్యనాథన్‌తో మళ్లీ పంపుతాను." మొదటిసారిగా తన మామయ్య తనని డబ్బులు అడుగుతున్నాడు.

తనకు నెల ఖర్చులకి ఇచ్చిన డబ్బంతా ఇచ్చింది తంగం. "తంగం మన ఇంట్లో మాతా ఆనందమాయి వచ్చి ఉంటారమ్మా....."

"ఆమె ఒక్కరేగా మామయ్యా......" ఒక్కతే అయితే బాగుండు అని ప్రార్థించుకుంటూ అడిగింది తంగం.

"లేదు తంగం. ఆమె శిష్యులు కూడా వచ్చి ఉంటారు"

"ఎంతమంది మామయ్యా......" భయపడుతూ అడిగింది.

"నలభైమంది" తంగంవైపు మళ్లీ చూడకుండా వెళ్లాడు సదాశివం.

సదాశివం మాతా ఆనందమాయి కోసం బావి తవ్వించి, ఆమె శిష్యులు కోసం తాత్కాలిక గుడిసెలు కట్టించాడు. ఖర్చు..... ఖర్చు...... తంగం అంతా గమనిస్తూనే ఉంది. మామయ్య ఎప్పుడూ లేనంతగా డబ్బుకోసం తడముకుంటున్నాడు.

కల్కి పత్రికను ఎంత జనరంజకం చేసినా 'ఆనంద వికటన్', 'కుముదమ్' లాంటి పత్రికల పోటీని తట్టుకోలేకపోయింది. వీటికితోడు విపణిలో 'బొమ్మై'లాంటి సినిమా పత్రికలు కూడా వచ్చాయి. కల్కి పత్రిక అమ్మకాలు సన్నగిల్లాయి. సుబ్బులక్ష్మి కచేరీ డబ్బులు, రికార్డుల మీద వచ్చే ఆదాయం 'కల్కి' ఉద్యోగుల జీతాలకు వాడవలసివస్తుంది. సదాశివం అష్టైశ్వర్యాలు తరగనున్నాయి. మరి కలకంఠి కంట కన్నీరొలికిన సిరి ఇంట నుండ నొల్లదు సుమతీ!



మాతా ఆనందమాయి పూర్తి మండల కాలం కల్కి బంగ్లాలో ఆతిథ్యం స్వీకరించి దయచేశారు.

ఆ తర్వాత కొన్ని నెలలకి తంగంకి నెలవారి ఖర్చు డబ్బులు ఇంకా రాలేదు. కల్కి క్యాషియర్ వైద్యనాథన్ దగ్గరకు వచ్చింది.

"వైద్యనాథన్, నాకు ఇంకా డబ్బులు పంపలేదు మీరు....?"

"తంగమమ్మా... ఈ నెల మీకివ్వటానికి చాలా కష్టంగా ఉంది. ఇంటి ఖర్చులు సర్దుకోండీ..... ఈసారికి పనోళ్లకి జీతాలు మాత్రమే ఇవ్వగలను. ఇంకొక్క పైసా బయటికి రాదు" మెల్లగా చెప్పాడు వైద్యనాథన్.

తంగంకు చాలా బాధేసింది. తడి కళ్లతో సుబ్బులక్ష్మి దగ్గరకు వచ్చింది. సుబ్బులక్ష్మి సంగీతన సాధన చేస్తూనే తంగంని లోపలికి పిలిచింది.

సుబ్బులక్ష్మిలో త్యాగరాజే కనిపించాడు తంగంకి. పాటలో తన్మయుత్వం పొందుతూవుంది. ఇలాంటి భక్తి పారవశ్యంలోని మనస్సుకి ఈ లౌకిక విషయాలు ఎందుకులే అనుకుంటూ...... తంగం అక్కడ నుంచి వెళ్లిపోయింది.

1975లో భారత ప్రభుత్వం పద్మపురస్కారాలు ప్రకటించింది. సుబ్బులక్ష్మికి పద్మవిభూషణ పురస్కారం బహూకరించినట్లు ప్రకటించింది. శ్రేయోభిలాషులు అంతా సుబ్బులక్ష్మి ఇంటికి చేరి అభినందిస్తున్నారు. కళాక్షేత్ర రుక్మిణీదేవి, "కుంజమ్మా, మాలాంటివాళ్లకి కొన్ని అవార్డులు వదిలిపెట్టమ్మా, అన్నీ నువ్వే తీసుకుంటే ఎలా" అంది.

ఇంకొకరు, "సదాశివంగారూ, తర్వాత సుబ్బులక్ష్మిగారికి వచ్చేది భారతరత్న బిరుదేనండీ" అని అన్నారు.

దానికి సదాశివం, "భారతరత్న చనిపోయినవాళ్లకి మాత్రమే ఇస్తారనుకుంటా" అని తనకు తెలిసింది చెప్పాడు.

సాధన, కచేరీలు, బిరుదులు, కచేరీలు, సన్మానాలు, కచేరీలు, డాక్టరేట్లు, ఇలా సాగిపోతుంది సుబ్బులక్ష్మి జీవితం.

నెహ్రూ పదకొండవ సంస్మరణ సంవత్సరంలో, సుబ్బులక్ష్మికి 'మీరా' రోజుల నుంచి స్నేహితురాలయిన ఇందిరాగాంధీ, నెహ్రూ పుట్టి పెరిగిన తీన్‌మూర్తి భవన్‌లో సుబ్బులక్ష్మిచేత భజన కార్యక్రమం ఏర్పాటు చేసుకుంది.



రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ నుంచి పద్మవిభూషణ్ పురస్కారం స్వీకరిస్తున్న ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి



తంగం కల్కి బంగ్లా పై అంతస్తు నుంచి చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తుంది. తన మామయ్యతో, కుంజక్కతో చెప్పవలసిన మాటొకటి ఉంది. అది చెప్పటానికి తంగంకి మనసు రావటంలేదు. అందులోనూ ఇప్పుడున్న పరిస్థితుల్లో, అయినా తప్పటంలేదు. ఒక్కసారి కుంజక్క ముందు ఆ మాట అని చూద్దామని సుబ్బలక్ష్మి దగ్గరకు వచ్చింది. సుబ్బలక్ష్మి తన స్నేహితురాలు నారాయణితో ఉంది. "రా తంగం!" అంటూ పిలిచింది. "తంగం నాకు ఇమెల్డా ఇచ్చిన బహుమానం తీసుకురా" అంది. తంగం తీసుకొచ్చింది. ఆ చెక్క పెట్టెలోంచి ఒక తాళంచెవి తీసింది సుబ్బలక్ష్మి. "దీన్ని 'కీ టు మనిలా' అంటారట. అసలు ఇది ఎందుకో, ఈ తాళంచెవితో ఏం చేసుకోమని ఇచ్చిందో ఇమెల్డా...." అంటూ చెప్తుంది సుబ్బలక్ష్మి. అందరిముందు ఇలాగే చెప్తుంది. రాధ, గౌరి చాలాసార్లు చెప్పారు సుబ్బలక్ష్మికి అదేంటో. అయినా అర్థం కాలేదు. అసలే బాధల్లో ఉన్న తంగం, "కుంజక్కా ఆ తాళంచెవి ఎవరికన్నా ఇస్తే , వాళ్లు ఎప్పుడైనా మనీలాకి రావచ్చు, వాళ్ల సొంతింటిలాగా అని. అది ఒక గౌరవం. నువ్వు మన కల్కి బంగ్లా తాళంచెవిని చిన్నానీకి ఇచ్చావంటే దాని అర్థమేంటి... తను ఎప్పుడైనా రావొచ్చని కదా అలానే ఇదికూడా." చిన్న పిల్లలకి ఒక బొమ్మ తెచ్చి 'కీ' తిప్పి ఎలా పనిచేస్తుందో చూపిస్తే ఎలా కేరింతలు కొట్టి నవ్వుతారో అలా నవ్వుకుంది సుబ్బలక్ష్మి, మొదటిసారిగా విషయం అర్థమైనందుకు.

తంగం అక్కడే అసహనంగా కూర్చుంది. "తంగం, నీకు వొంట్లో బాగోలేదా..... ఏంటి అలాగున్నావ్" అడిగింది సుబ్బలక్ష్మి.

"ఏమీలేదు కుంజక్కా బాగున్నాను. నేను చాలా రోజులునుంచి చూస్తున్నాను. కారు డ్రైవర్ ఒకడు, ఇద్దరు వంటవాళ్లకి అస్సలు పనిలేదు. వాళ్లని మాన్పిస్తే మంచిది" అసలు విషయం కాకుండా ఈ అవసరమైన విషయం ఇంకోటి చెప్పింది.

"నీ ఇష్టం మీ మామ ఇష్టం" అంది సుబ్బలక్ష్మి.

తంగం తనకు తోచిన విధంగా కల్కి బంగ్లా ఖర్చులు తగ్గిస్తూ వచ్చింది.

ళ ళ ళ ళ

1976 సుబ్బలక్ష్మికి అరవైఏళ్లు, సదాశివంకి డెబ్బైనాలుగు. రాజాజీ బ్రతికుంటే తొంభైఎనిమిదేళ్లు, ఇంకో రెండేళ్లలో వంద సంవత్సరాలు పూర్తయి, రాజాజీ శతజయంతి సంవత్సరం రానుంది. "నేను చనిపోయిన తర్వాత నన్ను ఎవరూ గుర్తుపెట్టుకోనక్కరలేదు సదాశివం" అని చెప్పినా కూడా సదాశివం మనసు ఊరుకోవటంలేదు. తన పరపతిని పూర్తిగా ఉపయోగించి భారత రాజధానిలో రాజాజీకి విగ్రహం ఏర్పాటుకి వ్యూహరచన చేశాడు. అందుకు నిధుల కోసం మద్రాసులో ఒకటి, ఢిల్లీలో ఒకటి సుబ్బలక్ష్మి కచేరీలు ఏర్పాటు చేశాడు. ఈ సంవత్సరంలో ఈ రెండు కచేరీలు కలుపుకొని లబ్ధి కచేరీలు 14 చేసింది సుబ్బలక్ష్మి.

"కుంజక్కా...."

"ఏంటీ తంగం....." తంగం ఏమీ మాట్లాడలేదు.

"తంగం.... చాలా రోజులనుంచి చూస్తున్నాను నువ్వు సంతోషంగా లేవు. చెప్పు ఏంటీ సంగతి..."

తంగం గట్టిగా ఊపిరి పీల్చుకొని చెప్పింది "పిల్లలు ఎప్పటినుంచో వాళ్ల దగ్గరకు రమ్మని బలవంతపెడుతున్నారు కుంజక్కా. నాకు వెళ్లటం ఇష్టంలేదు కానీ వాళ్లు వినటంలేదు." సుబ్బలక్ష్మి వెంటనే ఏమీ మాట్లాడలేకపోయింది. సదాశివం ఇంటికి మొదటిసారిగా వచ్చినప్పటినుంచి తంగం ఉంది, తన చేతిలో పెరిగిన పిల్ల. చిన్నప్పుడు తను బాగోగులు చూస్తే పెద్దదయిన తర్వాత కల్కి కోట పనులన్నీ నెత్తినేసుకొంది. ఇక వెళ్తానంటుంది. తన పిల్లల దగ్గరకు వెళ్తానంటుంది. ఎలా ఆపగలదు సుబ్బలక్ష్మి. "సంతోషంగా వెళ్లిరా తంగంకన్నా" అని దీవించింది. దిగిన భారంతో భర్త అనంత్ దగ్గరకు వచ్చి, "కుంజక్క మామయ్యకు చెప్తానంది. నేను చెప్పలేను మామయ్యకు. ఇక మెల్లగా అన్నీ సర్దుతాను" అంది.

"నేనిప్పుడే రాను తంగం. ముందు నువ్వెళ్లు" అన్నాడు భర్త అనంత్.

"అదేం.. ఎందుకు రారు?"

"ఇక్కడ పరిస్థితి ఏమీ బాగోలేదు. కల్కి ఉద్యోగులకి జీతాలిచ్చి ఆరు నెలలు అవుతుంది."

❦❦

సి.వి. నరసింహన్ పనిగట్టుకొనిమరీ మద్రాసు వచ్చివాలాడు. సుబ్బలక్ష్మికి వీరాభిమాని, సదాశివంకి విధేయుడు. ఇరవైరెండేళ్ల నుంచి ఐక్యరాజ్య సమితిలోనే ఉన్నత స్థాయిలో ఉన్నాడు. ఇటు అధికార హోదాతో అటు ఎప్పటినుంచో అమెరికాలో ఉంటున్న కారణంగా అమెరికాలో ఉన్న భారతీయ సంతతికి, నరసింహన్ సుపరిచితుడయ్యాడు. 1970లో ఏర్పాటయిన 'ది హిందూ టెంపుల్ సొసైటి ఆఫ్ నార్త్ అమెరికా'కి అధ్యక్షుడు. ఇప్పుడొక పనిమీద సదాశివం దగ్గరకి వచ్చాడు.

"సదాశివంగారూ, నాకు వచ్చే సంవత్సరమే పదవీ విరమణ. ఇక భారత దేశానికి తిరిగి వచ్చేస్తాను. ఈ లోపల ఇంకొక్కసారి సుబ్బలక్ష్మి గారిని అమెరికాకి తీసుకువెళ్తాను. మా టెంపుల్ సొసైటీ న్యూయార్క్‌లో, ఇతర నగరాలలో హిందూ దేవాలయాలు నిర్మించడానికి ప్రయత్నిస్తుంది. సుబ్బలక్ష్మిగారు కచేరీలు చేస్తే బాగుంటుంది. ఇప్పుడు అమెరికాలో 1966 కంటే నాలుగు రెట్లు ఉన్నారు భారతీయులు. ఈ దేవాలయాలకి విగ్రహాలు తిరుపతి తిరుమల దేవస్థానం ఆధ్వర్యంలో తయారవుతున్నాయి" చెప్పుకుంటూ



వెళ్తున్నాడు నరసింహన్. సదాశివం ఎప్పుడూ ఇలాంటివాటికి అత్యుత్సాహం చూపేవాడు. ఇప్పుడు అంతగా స్పందించటం లేదు. వేరొక విషయం మీద ఉంది మనస్సు.

"నరసింహన్, ఈరోజు తంగం వెళ్తుంది" మనసులో ఉన్న విషయాన్ని బయటకు చెప్పాడు.

"ఎక్కడికి?" ఆశ్చర్యంగా అడిగాడు నరసింహన్. సదాశివం చెప్పేలోపల తంగం వచ్చింది. మామయ్య కాళ్లకు నమస్కారం చేసింది. పెళ్లిచేసి అత్తవారింటికి పంపిస్తున్నంత బాధతో తంగంని పంపాడు సదాశివం. అక్క అక్కకి ఇచ్చిన మాట గుర్తుకు వచ్చింది. 'అక్కా నేను పంపలేదు. తనే వెళ్తానంది' అని మనసులో అనుకున్నాడు. ఒక్కొక్కరు వెళుతున్నారు సదాశివంని వదిలి. తల్లి, టి.కె.సి., కృష్ణమూర్తి, ఖాసా, రాజాజీ, ఆ వెలితి సదాశివంలోని ప్రతి కదలికలో కనిపిస్తుంది. దీనికితోడు కల్కిలో తీవ్రమైన ఇబ్బందులు.

ఇంకొకరోజు మళ్లీ వచ్చాడు నరసింహన్.

"మీరు మాట అయితే ఇవ్వలేదుగదా. ఆలోచిద్దాం నరసింహన్, ఇక్కడ నాకు చాలా ముఖ్యమైన పనులు ఉన్నాయి."

"అలాగే, కానీ తొందరగా చేస్తే మంచిది... వచ్చే సంవత్సరం నా చేతిలో అధికారం ఉండదు."

ఇంతలో క్రింద నుంచి అరుపులు, కేకలు, వాదనలు వినిపిస్తున్నాయి. సదాశివం, నరసింహన్ త్వరత్వరగా క్రిందకు వచ్చారు.

"సార్ అమెరికా నుంచి వచ్చిన పెద్దాయనతో ఉన్నారు. దయచేసి ఇప్పుడు ఏమీ గోల చెయ్యకండీ....." అంటూ కాళ్లు పట్టుకున్నంత పనిచేసి అనంత్, ఆత్మ కల్కి ఉద్యోగుల గోలను ఆపారు.

సదాశివం, నరసింహన్ క్రిందకు రాగానే కోపాన్ని అదిమిపెట్టుకున్న ఉద్యోగులు, ఇక్కడ ఏమీ జరగలేదే అన్నట్టు ఉన్న అనంత్, ఆత్మనాథన్ కనిపించారు.

నరసింహన్ వెళ్లిపోయాడు. వెళుతూ వెళుతూ మధ్యలో ఆగిపోయి ఉన్న కల్కి ప్రింటింగ్ యంత్రాలను చూస్తూ వెళ్లాడు.

నరసింహన్ వెళ్లిన తర్వాత, "ఏంటీ గోల" అని అరిచాడు సదాశివం.

"గోలా..... ఇది మీకు గోలలాగుందా.... ఆరు నెలలు అయింది జీతాలిచ్చి...."

"ఇక మీరు జీతం మొత్తం బకాయిలతోసహా ఇచ్చేదాకా పనిచేయబోం" అంటూ అందరూ ఎవరికి తోచిన విధంగా వారు అరవసాగారు.

"విశ్వాసం లేని జాతి" తిట్టాడు సదాశివం.

"నేను జీతాలు ఎగ్గొట్టేవాడిలా కనిపిస్తున్నానా?" పంచె పైకి కట్టి ఉద్యోగుల మీదకు వెళ్తున్నాడు చెప్పులేకుండా సదాశివం. అత్త, అనంత్ ఆపి, సదాశివంని పైకి తీసుకువచ్చారు. వెళ్ళిపోవాలనుకున్న నరసింహన్ పైనే ఉన్నాడు.

"సదాశివంగారూ మీరేం భయపడకండి... కల్కి పత్రిక ఆగదు. సాయంత్రానికల్లా నేను వాళ్ళకి జీతాలు ఏర్పాటు చేస్తాను."

"వద్దు. ఆ పని చేయకు" నామీద ఒట్టే ఆ పని చేశావంటే అన్నట్లు చెప్పాడు.

నరసింహన్ ఎంత బలవంతపెట్టినా, బ్రతిమాలినా సదాశివం ఒప్పుకోలేదు.

"మీరేకాదు, ఇంకా చాలామంది, ఇంకా ముందే డబ్బు సర్దుతామన్నారు. మామ ఒప్పుకోలేదు" చెప్పాడు అత్త.

"వీళ్లని నేను ఎలా చూసుకున్నానో నీకు తెలుసా నరసింహన్...." బాధ బైటికి చెప్పుకుంటున్నాడు సదాశివం.

"వీళ్లేమైనా కొత్తవాళ్లనుకుంటున్నావా.... అంతా పాతవాళ్లే, నా డబ్బు తిన్నవాళ్లే, బయట బజారులో పది రూపాయలకు భోజనం అయితే నేను ఇక్కడ కాంటీన్‌లో రెండు రూపాయలకి పెట్టించా, సంవత్సరానికొకసారి కొత్త బట్టలు పెట్టా, వాళ్ల పెళ్లాం పిల్లలకు కూడా దీపావళికి ఏదో ఒక కానుక ఇచ్చేవాడిని, ఇప్పుడు జీతంలో కొంచెం కొంచెం సర్దుబాటు చేస్తూనే ఉన్నాను, కాస్త ఓర్చుకోలేరా... నేను ఇవ్వలేని పరిస్థితిలో ఉంటేనేకదా ఇవ్వనిది, నాకు వ్యవధి కూడా ఇవ్వకుండా కల్కి యంత్రాలు ఆపేస్తారా?"

"కల్కి ఆగదు. నేను పూచీ" చెప్పాడు నరసింహన్.

"ఆ విశ్వాస ఘాతకులకి నేను మళ్లీ తిండిపెట్టను. కల్కిని ఆగిపోనివ్వండి."

❖❖

ఒక వారం తర్వాత నరసింహన్‌కి కబురు పెట్టాడు సదాశివం. "నరసింహన్ మీరు అమెరికాలో మీ ఏర్పాట్లు చూసుకోండి" అని చెప్పాడు. నరసింహన్ సంతోషంగా, "ఒక్కసారి సుబ్బలక్ష్మిగారికి చెప్పొస్తాను" అంటూ పైకి వచ్చాడు.

"అమ్మా! అమెరికాలో నాకు ఇదే ఆఖరు సంవత్సరం. నేను దగ్గరుండి మీకు ఎలాంటి ఇబ్బందులు లేకుండా ఈ టూర్ అంతా జరిపిస్తాను. అమెరికాలో మన దేవుళ్లకు సరైన ఆలయాలు లేవు. చూస్తుంటే బాధేస్తుంది.. మన దేవుళ్లని ఒక ఇంటివారిని చేసినవారవుతారు..."

"మామ మా ఇల్లు అమ్మేస్తున్నారు....."

నరసింహన్ నమ్మలేనట్లు చూసి మళ్లీ సదాశివం దగ్గరకు పరిగెత్తుకొచ్చాడు.



"సదాశివంగారూ! జీతాలివ్వటానికి రెండెకరాల బంగ్లా అమ్మాలా...." సదాశివం నవ్వి ఊరుకున్నాడు.

"సదాశివంగారూ, జీతాలకి నేను డబ్బిస్తాను మీరు ఇంత పెద్ద ఇంటిని అమ్మితే మద్రాసు నగరంలో మనం మళ్లీ ఇంత పెద్ద ఇంటిని కొనలేం."

"తంగం వెళ్లిపోయింది, అనంత్ కూడా వెళతాడు... ఇక మిగిలేది ఇద్దరం ముసలోళ్లం. మా ఇద్దరికీ ఇంత పెద్ద ఇల్లు అవసరమా చెప్పు" సదాశివం తన ఆలోచన మార్చుకునేటట్లు లేనే లేదు.

నరసింహన్, ఇంకా ఇతర మిత్రులు, బంధువులు ఎంత చెప్పినా సదాశివం వినలేదు. ఒకరి నుంచి డబ్బు తీసుకోవటం ససేమిరా ఇష్టంలేదు సదాశివానికి. కల్కి బంగ్లా అమ్మటానికే నిశ్చయించాడు.

మహర్షి యోగి సంస్థ ప్రతినిధులు వచ్చారు. పద్నాలుగు లక్షలకు చెక్కు ఇచ్చారు. మద్రాసు మహానగరం నడిబొడ్డున విశాలమైన స్థలానికి పద్నాలుగు లక్షలు ఒక లెక్కా అనే ఉద్దేశంతో. ఇది ఎప్పటికీ బంగారుబాతే అనే ఉద్దేశం వారికి మొదటినుంచీ ఉంది. అన్నీ తెలిసిన సదాశివం మాత్రం అమ్మటం కాకుండా మరే విధంగానైనా ప్రస్తుత ఆర్థిక కష్టాలు గట్టెక్కే మార్గాలున్నా బంగారు బాతుని ఒక్కసారికే ఉపయోగించదలుచుకున్నాడు. ఎవ్వరి దగ్గర నుంచి డబ్బు తీసుకొనే అలవాటు కానీ, మనస్సు కానీ లేని సదాశివం మహర్షి సంస్థ వారిని ఒక్క మాట అడిగాడు.

"మేము ఇంకో నెలలో అమెరికాకు కచేరీలకు వెళ్తాం, అప్పటిదాకా....."

"మీరు ఎప్పుడు మమ్మల్ని ఈ ఇంట్లోకి రమ్మంటే.. అప్పుడే వస్తాం. మాకు తొందరలేదు" అని చెప్పి వెళ్లారు.

"అనంత్! ఈ డబ్బు వచ్చిన తర్వాత వాళ్లకివ్వవలసిన జీతాలన్నీ లెక్కకట్టి, దానికి రెండింతలు, నా తరుపున వాళ్ల మొహానకొట్టెయ్" అని ఆదేశించాడు.

❖❖

ఇక నరసింహన్‌తో అమెరికా ప్రయాణపు ప్రణాళికలు వేయటానికి చర్చలు మొదలుపెట్టాడు. మొత్తం పద్నాలుగు నగరాల్లో కచేరీలు నిర్ణయించారు. ముందుగా అమెరికా తూర్పు తీర నగరమైన న్యూయార్క్‌లో మొదటి కచేరీ చేసి మెల్లగా మధ్యప్రాంతాలలోని నగరాల్లో కచేరీలు చేసి, చివరకు అమెరికా పశ్చిమ తీర ప్రాంతంలోని శాన్‌ఫ్రాన్సిస్కో నగరంలో కచేరీలు కుదిర్చారు, అమెరికా తూర్పు, పడమర తీరాల్లో కచేరీలు ఉన్నాయి కాబట్టి ఈ యాత్రకి 'కోస్ట్ టు కోస్ట్ టూర్' అని పేరుపెట్టారు. అమెరికాలో 'టెంపుల్ సొసైటీ ఆఫ్ నార్త్ అమెరికా' వారితో పూర్తిగా చర్చించి తేదీలు కూడా ఖరా

చేసి, సదాశివం పత్రికలకు తమ 'కోస్ట్ టు కోస్ట్ టూర్' వివరాలు తెలియజేశాడు. ఈ విషయం ఒక్కటే కాకుండా, ఇక నుంచి ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి డబ్బు కోసం పాడదు, ఇలాంటి లబ్ధి కచేరీలకు తప్ప అని పత్రికా ముఖంగా ప్రకటించాడు. ఇప్పుడు కల్కి పత్రిక మూసివేయబడింది కనుక, 'తను భార్య సంపాదన మీద బ్రతుకుతాడని', అనుకునే మాట రావొచ్చు కనుక, సదాశివం ఈ పనిచేశాడు. రికార్డుల మీద రావలసిన కొన్ని ఆదాయాలని సైతం వెంటనే కొన్ని సంస్థలకి దానం చేసేశాడు.

కల్కి బంగ్లా నుంచి పేరు, ప్రతిష్ఠ, అనంతమైన ఆత్మసంతృప్తి అనే సంపదలు తప్ప పూచిక పుల్లంత ధన సంపదను కూడా సర్దుకోకుండా, తనను తాను తేలికపరచుకొని, సదాశివం అమెరికా ప్రయాణానికి సర్దుకోవటం మొదలుపెట్టాడు.

"కుంజమ్మా! కంచి పరమాచార్య ఎలా ఉంటారో చూస్తున్నావు కదా, రాజాజీ, గాంధీజీ ఎలా బ్రతికారు.. మనమూ వారి బాటనే నడవాలి. బాధపడకు" అంటూ సుబ్బులక్ష్మిని ఓదార్చాడు సదాశివం.

తన 'శకుంతల' సినిమాలో దుష్యంతుడి దగ్గరకు పంపబడేముందు కణ్వ మహర్షి ఆశ్రమంలో ప్రతి చెట్టుకి, పుట్టకి, జింకలకి, పక్షులకీ ఎలా వీడ్కోలు చెపుతుందో, అలాగే ఈ నాలుగు రోజులు సుబ్బులక్ష్మి కల్కి బంగ్లా తోటలోని ప్రతి చెట్టుకు, కొమ్మకు, రెమ్మకు వీడ్కోలు చెప్పుకుంది. తన సిగలోకి మల్లెచెండునిచ్చిన బొండుమల్లె తీగలకు వెళ్లొస్తానని చెప్పుకుంది. తన ఆవులు లక్ష్మి గౌరిలను రోజూ నిమిరేకంటే ఎక్కువసేపు నిమిరి, చివరిసారిగా వాటికి తిండిపెట్టింది. తన పూదోట చివరిసారిగా అడుగుతుంది పూలు తీసుకోమని, పూలు కోసుకుంటూ సుబ్బులక్ష్మి ఒక చెట్టు మోడు దగ్గర ఆగిపోయింది. అక్కడే ఉన్న విశాలం, "అమ్మా..... ఈ చెట్టు మనం ఇక్కడ వచ్చినప్పటినుంచి ఉంది, దీనిని కొట్టేసినందుకే...." అంటూ ఏడ్చింది. సుబ్బులక్ష్మి నిబ్బరంగా విశాలంని ఓదార్చింది. భారమైన మనస్సుతో కల్కి బంగ్లాలోకి వచ్చింది. రాగానే ఎదురుగా కల్కి పత్రిక కార్యాలయం. అక్కడే గోడ మీద తన ఫోటో, పత్రిక మొదలుపెట్టినరోజు పెట్టిన ఫోటో ఇంకా అక్కడే ఉంది. ఇక మీద ఉండబోదు.

పై అంతస్తుకు వెళ్లటానికి టేకు చెక్కతో చేయబడి ఉన్న మెట్లు ఎక్కుతోంది. రాష్ట్రపతులు, ప్రధానులు, మహారాజులు, గవర్నర్లు, విదేశీ ప్రతినిధులు, సంగీతజ్ఞులు ఎక్కిన మెట్లవి. పైకి వచ్చి అన్ని గదులు తిరగచూసుకుంది. చివరకు తన సంగీతం గదికి వచ్చింది. 'మీరా' దగ్గర నుంచి కర్ణాటక, హిందుస్థానీ సంగీతం, రవీంద్ర సంగీతం, భజనలు, వేంకటేశ్వర సుప్రభాతం, విష్ణుసహస్ర నామాలతో మారుమ్రోగిపోయిన గది. కళ్లవెంట నీరు జలజలా కారింది. ముప్పైరెండేళ్ల అనుబంధం ఈ ఇంటితో.



"కుంజమ్మా! ఈ పియానో ఎవరి ఇంటికి పంపమంటావు? రాధకా, విజయకా, తంగంకా, అనందికా... చెప్పు, నువ్వు ఏది చెపితే అదే...." కుంజమ్మను తేలికపరచటానికి అన్నాడు సదాశివం. ఒక్కో గదిలో ఉన్న సామాను ఏమేమి చెయ్యాలో అనంత్‌తో చెప్పుకుంటూ వస్తున్నాడు సదాశివం. ఇంకో రెండు రోజులకి బయలుదేరే రోజు రానే వచ్చింది. అంతా సర్దుకుంటున్నారు. అమెరికాకే కాదు, కల్కి బంగ్లా నుంచి శాశ్వతంగా బయటకు కూడా.

"కుంజమ్మా ఈ ఇంటికి ఇంక రాము. అమెరికా నుంచి వచ్చేప్పుడు నేరుగా ఆనంది ఇంటికి వెళతాము" చెప్పాడు సదాశివం.

ఇక ఆ బంగ్లాతో రుణం తీరిపోయింది. సుబ్బులక్ష్మి ఇంట్లోంచి పంచలోకి వచ్చింది. ఆ పంచ చివరికి వచ్చింది. క్రిందకు చూస్తే తోట, తోట పక్కన విశాలమైన పచ్చికబయలు... ఎన్ని పెళ్లిళ్లు చేసింది అక్కడ సుబ్బులక్ష్మి.... తన కూతుళ్ల పెళ్లిళ్ళు, సదాశివం పెద్ద కుటుంబంలోని పిల్లలకు పెళ్లిళ్లు, పేరంటాలు, రామాయణ, భాగవత ప్రవచనాలు... రెండు వందలకు తగ్గకుండా ఈ ముప్పైఏళ్లలో శుభకార్యాలు జరిగాయి అక్కడ. బాధని దిగమింగుకుంటూ పైకి చూసింది. చంద్రుడు కూడా వీడ్కోలు చెప్పటానికి వచ్చాడు. ఇలాంటి ఎన్ని వెన్నెల రాత్రులలో కల్కి పిల్లలకి ఇక్కడ గోరుముద్దలు తినిపించింది, ఎంత కమ్మని ఆలాపనలు చేసింది. వెనక్కు తిరిగి చూస్తే అంతా తన కోసం చూస్తున్నారు... ఇక కల్కి బంగ్లాకి వీడ్కోలు పలికి బయటకు వచ్చేశారు. వెనక్కి తిరిగి చూస్తే గుర్ఖా కల్కి బంగ్లా గేట్లు మూసివేస్తున్నాడు.

𝄞𝄞𝄞𝄞

సుబ్బులక్ష్మి, సదాశివం, రాధ, వయోలిన్ విద్వాంసుడు అళగిరి స్వామి, మృదంగం విద్వాంసుడు గురువైయ్యారు దొరై, మేనేజర్ హోదాలో ఆత్మనాథన్, ఇది ఈసారి అమెరికా వెళ్తున్న సుబ్బులక్ష్మి బృందం. సెప్టెంబర్ 7న ఢిల్లీ నుంచి బయలుదేరారు. ముందుగా మాస్కో మీదుగా లండన్ చేరుకున్నారు. సెప్టెంబర్ 11న లండన్‌లోని 'హర్ మెజెస్టీస్ హాల్'లో భారతీయ విద్యాభవన్ కోసం కచేరీ చేసింది. రెండువేల పౌండ్లు ఆర్జించి పెట్టింది. ఈ కచేరీలో భారత సంతతి వారు సుబ్బులక్ష్మి పట్ల తమ అభిమానాన్ని కనీవినీ ఎరుగని రీతిలో తెలుపుకున్నారు. భారతీయ విద్యాభవన్ వారు ఆ రోజు వచ్చిన డబ్బుతో వారికి లండన్‌లో ఒక భవనం కొనుక్కోవటానికి వీలు పడుతున్నందుకు పరమానందభరితులై సుబ్బులక్ష్మి గౌరవార్థం ఒక గొప్ప విందు ఏర్పాటు చేశారు. భారత రాయబారితోసహా ఎందరో ప్రముఖులు విచ్చేశారు ఆ కార్యక్రమానికి.

అమెరికాలో తొలి కచేరీ సెప్టెంబర్ పదిహేడున న్యూయార్క్‌లో జరగనుంది. ఈ కచేరీకి వచ్చే ఆదాయాన్ని న్యూయార్క్‌లోని ఫ్లషింగ్ ప్రాంతంలో అప్పుడే రెండు నెలల

క్రితమే ప్రతిష్ఠింపబడిన వినాయకుడి గుడికి, ఇంకా కొన్ని వసతులు సమకూర్చటానికి వాడతారు. ఇక్కడ ఈ పనిమీద కచేరీ చేస్తుంటే అక్కడ తన ఇంటిని ఖాళీ చేస్తున్నారు. హిందూ టెంపుల్ సొసైటీకి ఏడు కచేరీలు చేసి పిట్స్‌బర్గ్ చేరుకుంది. ఇక్కడ శ్రీవేంకటేశ్వర స్వామివారి మూలవిరాట్టు ప్రతిష్ఠాపన జరిగి ఈ మధ్యనే ఈ ఆలయం కుంభాభిషేకం జరుపుకుంది. ఈ ఆలయానికి నేరుగా తిరుపతి దేవస్థానంవారే మూలవిరాట్టు మూర్తిని చెక్కించి తీసుకువచ్చారు. పెరుమాళ్ సుబ్బలక్ష్మికి మధుర మీనాక్షి తర్వాత తన ఇష్ట దైవం. పిట్స్‌బర్గ్ శ్రీ వేంకటేశ్వర ఆలయానికి తనవంతు సాయం చేస్తూ గానంచేస్తూ, సంకీర్తన చేస్తూ పరిసరాలను మర్చిపోయింది. ఒకచోట ఉద్వేగానికి లోనయ్యి కన్నీళ్లు కార్చుకుంది. ఆలాపనలు, మాటా మంతి, ముచ్చట్లు అన్నీ తన పెరుమాళ్‌తోనే, పెరుమాళ్ బదులు పలికాడు, 'నీ ఇంటి బాధ మరిచి నా ఆలయం పనిమీద వచ్చావు, నీ సేవను నేను మరువను.'

అమెరికాలో అనుకున్న పద్నాలుగు కచేరీలలో పదమూడవ కచేరీకి కార్నేగి హాలుకి చేరుకుంది. న్యూయార్క్‌లోని కార్నేగి హాలుకి ప్రపంచంలో సాటియైనది ఇంకొకటి లేదు. 1891 నుంచి శాస్త్రీయ, సంగీత నృత్య సమ్మేళనాలు జరుగుతున్నాయి. ఆ నాటి నుంచి ఒక్క రోజు కూడా తెరిపిలేకుండా ప్రఖ్యాత కళాకారులచే ప్రదర్శనలు ఇవ్వబడుతున్నాయి. ఒకసారి ఒక ప్రఖ్యాత వయోలిన్ విద్వాంసుడు తరువాతి రోజు కార్నేగి హాలులో తన కచేరీ కోసం అదే వేదిక మీద సాధన చేసుకుంటూ ఉన్నాడు. అతని సాధనపట్ల అతను తృప్తి చెందలేదు. నిరాశగా కార్నేగి హాలు బయటకు వచ్చాడు. వీధిలో ఇద్దరు యాత్రికులు అతన్ని "కార్నేగి హాలుకు దారి ఏదండీ" అని అడిగారు. ఆ వయోలిన్ కళాకారుడు గుండె లోతుల్లో నుంచి చెప్పాడు, "సాధన ద్వారా." అలాంటి సాధకులకే కార్నేగి హాలులో ప్రవేశం. గానాన్ని సాధకము చేసుకొని సాధనలో ఆత్మార్పణం చేసే సాధకురాలే సుబ్బలక్ష్మి. 1928లో రాగిణీదేవి, 1930లో రవీంద్రనాథ్ టాగోర్, 1968లో పండిట్ రవిశంకర్, అల్లా రాఖా తర్వాత ఇప్పుడు అదే కార్నేగి మెయిన్ హాలులో కచేరీ చేయనుంది సుబ్బలక్ష్మి.

ఈ వేదిక మీద నరసింహన్ సుబ్బలక్ష్మిని పరిచయం చేస్తూ 'ద ఫస్ట్ లేడీ ఆఫ్ కర్ణాటిక్ మ్యూజిక్' అని చెప్పాడు. కర్ణాటక సంగీతపు మొదటి మహిళ! నిజమే మరి! రాగం తానం పల్లవి పాడిన మొదటి మహిళ! కర్ణాటక సంగీతాన్ని భారతదేశం ఆవల పరిచయం చేసి, ప్రాచుర్యం కల్పిస్తున్న మొదటి మహిళ!

గత పది సంవత్సరాల నుంచి కర్ణాటక సంగీతాన్ని వింటూ ఉన్న పాశ్చాత్యులకు కర్ణాటక సంగీతపు సౌరభాలు అనంతం అని చాటిచెప్పి అమెరికా నుంచి తిరిగి వచ్చింది సుబ్బలక్ష్మి. నేరుగా ఆనంది అంబి ఇంటికి వచ్చారు. కల్కి బంగ్లాతో పోల్చుకుంటే ఎంతో చిన్న ఇల్లు. ప్రయాణ బడలికలు అయిన తర్వాత, "కుంజమ్మా, మనం పెళ్లి చేసుకున్నప్పుడు ఏ స్థితిలో ఉన్నామో ఇప్పుడు కూడా అదే స్థితి."





లండన్ 'హర్ మెజెస్టీస్ హాల్'లో సుబ్బలక్ష్మి కచేరి

'నేను నిన్ను అంతకంటే క్రిందకు దిగజార్చలేదు' అనే ఉద్దేశంతో అన్నాడు సదాశివం.

భర్త ముందు ఏమీ అనకపోయినా తన స్నేహితురాలు నారాయణితో "మా ఇద్దరి కోసమని కాదు, ఆ ఆస్తి పిల్లల కోసమయినా ఉండేది కదా... ఎంత ఆస్తి? ఎంత డబ్బు పోయింది" అని చాలా బాధపడింది సుబ్బలక్ష్మి. కాసేపాగి "మేమయినా... ఎలా బ్రతకాలి నారాయణీ పిల్లల మీద ఎన్నాళ్లని భారం వేస్తాం...." అని ఏడ్చేసింది. పెరుమాళ్ చూస్తున్నాడు. పావులు కదుపుతున్నాడు. సుబ్బలక్ష్మి ఈ లోపలే తొందరపడింది.

అందరినీ ఇట్టే నమ్మేసే సుబ్బలక్ష్మి, ఒకరి గురించి మంచే తప్ప ఇంకో విధంగా ఆలోచించని సుబ్బలక్ష్మి కాషాయం బట్టలు తొడిగి, విబూది విదిలించేవారు ఎవరైనా సరే, వంగి వంగి నమస్కారం చేస్తుంది. మొదటిసారిగా ఇలాంటి ఒకరి గురించి పదేళ్ల క్రితమే కూతురు రాధ నుంచి వింది. సదాశివంకి ఇష్టం లేకపోవడంతో అతని దగ్గరకు ఇప్పటిదాకా వెళ్లలేదు. ఈ కష్ట సమయంలో సదాశివంకి కూడా ఇంకా దైవకృప కావాల్సొచ్చి, అతని దగ్గరకు వెళ్లారు. భారతీయ ఆధ్యాత్మికతను కవచంగా పెట్టుకున్న ఇతని అసలి రూపు పూర్తిగా వేరు. సుబ్బలక్ష్మి రాగానే, "ఏదీ పది సంవత్సరాల నుంచి నువ్వు చేయాలనుకున్న నమస్కారం చేయి" అన్నాడు, ఒక రాయి విసిరాడు, తగిలింది. సుబ్బలక్ష్మి పడిపోయింది.



సుబ్బలక్ష్మి, సదాశివం తమ విశాలమైన బంగ్లా అమ్ముకొని అప్పులు తీర్చి, వారి దగ్గర డబ్బు ఇంకేమీ లేక అవస్థపడుతూ ఆనంది ఇంట్లో ఉంటున్నారని మెల్లగా అందరికీ తెలిసింది. మొదటి పావు కదిలింది. కంచి పరమాచార్యులువారు, "ప్రభుత్వం ఆ బంగ్లాని కొని, తిరిగి సుబ్బలక్ష్మికి ఇచ్చేయొచ్చుకదా" అని అన్నారు. "ఆమెకు ఈ సహాయం చేయదగ్గ మనిషే కాని సుబ్బలక్ష్మికి ఇస్తే ఇలాంటి ప్రతిపాదనలు వందల సంఖ్యలో వరుసకడతాయి ప్రభుత్వం ముందు... సుబ్రహ్మణ్య భారతి ఇల్లు కొనమని, సంగీత త్రిమూర్తుల ఇల్లు కొనమని, రామానుజం ఇల్లు కొనమని.. ఇవన్నీ ప్రభుత్వం వల్ల కాదు" అని చెప్పి ప్రభుత్వం చేతులెత్తేసింది.

ఇంకో పావు కదిలింది. 'మీరా' సినిమాలో రామచంద్రన్ అనే కుర్రవాడు చిన్న వేషం ఒకటి వేశాడు. ఒకరోజు చిత్రీకరణ అయిన తర్వాత, అతనికి ఉండటానికి ఇల్లు లేక, ఎక్కడికీ వెళ్లలేక స్టూడియో బయటనే పక్కపరచుకోబోతుంటే సదాశివం చూసి తన విశాలమైన కల్కి బంగ్లాలో బస ఏర్పాటు చేశాడు. రామచంద్రన్‌కి ఆ ఆదరణ ఈరోజువరకూ గుర్తు. ఇప్పుడతను తమిళనాడుకి ముఖ్యమంత్రి ఎమ్.జి. రామచంద్రన్. సదాశివం సహాయానికి ప్రతిఫలంగా, సుబ్బలక్ష్మి గానామృతానికి కానుకగా ప్రభుత్వం తరఫున ఒక ఇల్లు కేటాయిస్తానని అధికారులతో కబురు పంపాడు. "నా చేయి ఎప్పుడూ పైచేయిగానే



ఉంది. ఇప్పుడు ఆ చేయి చాచి క్రిందకు దిగజారలేను, క్షమించండి" అని వద్దని గట్టిగా చెప్పాడు సదాశివం. ఈ పాచికా పారలేదు.

ఇక శ్రీవేంకటేశ్వరుడు రంగంలోకి దిగాడు.

తిరుమలలోని తిరుపతి తిరుమల దేవస్థానం యొక్క కార్యనిర్వహణాధికారి కార్యాలయంలో కార్యనిర్వహణాధికారి పి.వి.ఆర్.కె. ప్రసాద్ కొత్తగా తలపెట్టిన అన్నమయ్య ప్రాజెక్ట్ గురించి ప్రాజెక్ట్ డైరక్టర్ అయిన కామిశెట్టి శ్రీనివాసులుతో మాట్లాడుతూ ఉండగా ఒక గుమస్తా వచ్చి ఒక ఉత్తరం ఇచ్చి వెళ్లాడు. అన్నమయ్య ప్రాజెక్టు డైరెక్టర్ వెళ్లిన తర్వాత ప్రసాద్ ఆ ఉత్తరం చూశారు. కంచి పరమాచార్య నుంచి వచ్చింది. వెంటనే అప్రమత్తమై ఉత్తరం చదివారు ప్రసాద్, ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి ఆర్థిక కష్టాల్లో ఉన్నారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆమెకు తగు సహాయం చేయాలి అని వ్రాసుంది ఆ ఉత్తరంలో. ప్రసాద్‌కి ఏమీ అర్థంకాలేదు. పెద్ద బంగ్లాలో, నౌకరు, చాకర్లుతో, కార్లతో ఉండే సుబ్బలక్ష్మికి ఆర్థిక కష్టాలేంటీ అని.

శ్రీవేంకటేశ్వరుడు అన్నీ సిద్ధం చేసేపెట్టాడు. అప్పుడే ఎదురుగా ఉన్న దినపత్రిక మీద సుబ్బలక్ష్మి గురించి వచ్చిన ఒక వార్త మీద ప్రసాద్ చూపు పడింది. ఆ వార్తని చదవగా కంచి పరమాచార్య ఎందుకు తనకు ఉత్తరం వ్రాయాల్సి వచ్చిందో అర్థమయింది. సుబ్బలక్ష్మి ఇల్లు లేనిది అయిందనీ.. సుబ్బలక్ష్మి అభిమానులందరికీ తెలిసి, చివరికి పేపర్లలో కూడా వ్రాశారు. 'సరస్వతీ అంశమైన ఈ గానగంధర్వురాలికి లక్ష్మీ కటాక్షం ఎందుకు సన్నగిల్లింది.... అంత పెద్ద ఆస్తి, కొంచెమైనా మిగలకుండా ఎలా కరిగిపోయింది.....' ఇలాంటి ప్రశ్నలు తొలిచివేస్తున్నాయి ఆ అధికారి మనస్సుని. ఎవరో తొందరపెడుతున్నట్లు, ముందుకు తోస్తున్నట్లుగా, ప్రసాద్ దేవస్థానం అధికారులతో ఉన్నఫళాన సమావేశం ఏర్పరిచారు.

"సుబ్బలక్ష్మి తీవ్రమైన ఆర్థిక కష్టాలలో ఉన్నారని ఆమెకు సాయం చేయమని పరమాచార్య దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. మనం ఆమెకు ఏదో ఒక సాయం చేయాలి" అని అధికారుల ముందు విషయమేమిటో చెప్పారు.

సమావేశంలోని అధికారులు చాలా బాధపడ్డారు. వారందరికీ సుబ్బలక్ష్మి స్వయంగా కూడా పరిచయం.

"సుబ్బలక్ష్మి గారు ఇప్పటికే మన దేవస్థానం వారి ఆస్థాన విద్వాంసురాలు. ఆమె ఆస్థాన విద్వాంసురాలు కాకపోయి ఉంటే వెంటనే ఆ పదవి ఇచ్చేవాళ్లం."

"ఇప్పుడు ఇంకేం చేయగలం?" మధనపడుతున్నారు అధికారులు. "ఒక పనిచేయగలం సర్. దేవస్థానం ఆస్థాన విద్వాంసుల జీతభత్యాలు పెంచుదాం.

ఏమంటారు?" అని అడిగాడు ఒక అధికారి. కార్యనిర్వహణాధికారికి ఈ ఆలోచన నచ్చలేదు. సుబ్బలక్ష్మి తీసుకుంటుంది కేవలం నామమాత్రమైన జీతభత్యాలు. అయినా దేవస్థానం వారు ఈ జీతభత్యాలని అమాంతంగా పెంచే వీలు వుండదు. ఇంకా ఎన్నో విధాలుగా ఆలోచన చేశారు. కానీ ఏమీ తేలలేదు. ఏమీ పాలుపోక తొందరగా ఆ సమావేశం ముగించి, ఆనంద నిలయంలో, గర్భగుడిలో శ్రీవేంకటేశ్వరుడి ముందు నిలబడి ప్రార్థిస్తున్నారు కార్యనిర్వహణాధికారి ప్రసాద్. "శ్రీనివాసా..... నా ఉపాయాలు అడుగంటాయి, నీ భక్తురాలి బాధ్యత నీదే స్వామీ" అంటూ అత్యంత భక్తితో వేడుకొని మహాద్వారం నుంచి బయటకు వచ్చీరాగానే ఆ అధికారికి భజనలు వినిపించాయి. తలెత్తి అటువైపు చూశారు. ఆలయానికి ఎదురుగా ఒక వృద్ధురాలు తంబూర మీటుతూ శ్రీవేంకటేశ్వరుడిని కీర్తిస్తూ పాటలు పాడుతుంది, ఆమె చుట్టూ ఉన్న నలుగురయిదుగురు తాళం వేస్తూ వంతపాడుతున్నారు.

కార్యనిర్వహణాధికారి ఆ వృద్ధురాలినే చూస్తున్నారు. ఏ ఊసూ లేకుండా తన్మయత్వంతో సంకీర్తన చేస్తుంది. కార్యనిర్వహణాధికారి చూస్తూనే ఉన్నారు. రెప్పపాటు ఆ వృద్ధురాలిలో సుబ్బలక్ష్మి కనిపించింది ఆయనకు. శ్రీవేంకటేశ్వరుడు దారి చూపించాడు. ఆ అధికారి మోము ఆనందనిలయంపైన స్వర్ణ రంజితమైయున్న విమాన శోభకి పోటీపడింది. శ్రీవేంకటేశ్వరుడు సుబ్బలక్ష్మి విషయంలో ఏమిచెయ్యాలో దిశానిర్దేశం చేశాడు.

ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా కంచి పరమాచార్య దగ్గరకు వెళ్లి ఇంకొంచెం విపులంగా విషయం చర్చిద్దామనే ఆత్రుతతో ఆ రాత్రి నిద్ర కూడా పట్టలేదు ప్రసాద్‌కి. తెల్లారిన వెంటనే కంచికి ప్రయాణమైయారు. కంచిలో, "స్వామీ, అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుడిని కీర్తిస్తూ రచించిన పదకీర్తనలకు ప్రాచుర్యం కల్పించాలని, తిరుపతి తిరుమల దేవస్థానంవారు గట్టి పట్టుదల మీద ఉన్నారు. అందుకే అన్నమయ్య ప్రాజెక్ట్ కూడా ఈ మధ్యనే మొదలైంది. ఈ ప్రాజెక్టు క్రింద అన్నమాచార్య కృతులని సుబ్బలక్ష్మిగారి చేత పాడిస్తే ఆమెకు సహాయం చేసినట్లు అవుతుంది."

"నాకు తెలుసు, నిన్ను శ్రీవేంకటేశ్వరుడు మంచి ఆలోచనతో పంపిస్తాడని. కానీ వాళ్లకి డబ్బులు ముట్టటానికి ఈ పనికి పూనుకున్నామని వాళ్లకి ఏమాత్రం అనుమానమొచ్చినా ససేమిరా వద్దంటారు...."

"స్వామీ, మన అదృష్టం కొద్దీ ఈ అన్నమయ్య ప్రాజెక్ట్ ఇప్పటిప్పుడు మనం పుట్టించింది కాదు కదా..... 1922లో అన్నమయ్య తాళపత్రాలు దొరికిన దగ్గర నుంచి ఏదో ఒక పేరుతో అన్నమయ్య సాహిత్యం మీద పని జరుగుతూనే ఉంది."



"మంచిది, కానీ డబ్బు విషయం దగ్గర జాగ్రత్తగా ఉండండి. డబ్బు కూడబెట్టుకుందామనే లౌకికులు కారు వారు. వారి జీవిత కాలంలో వాళ్ల కోసం అవసరాలకి తడుముకోకుండా ఏర్పాటయ్యేటట్లు చూడు" అంటూ కంచి పరమాచార్య దీవించి పంపారు.

వెంటనే తిరుమల వచ్చి సంబంధించిన అధికారులలో సమావేశమయ్యారు ప్రసాద్. వాళ్లకి తన ఆలోచన చెప్పారు. అన్నీ సరిగ్గా కుదిరాయి. అన్నమయ్య సంకీర్తనలు పాడి వినిపించకపోతే, వాటిమీద ఎన్ని సంవత్సరాలు, ఎన్ని పరిశోధనలు చేసినా ఫలితం నామమాత్రమే. అన్నమయ్య కీర్తించినట్లు, సంకీర్తనం చేయాలి. అది ప్రజలకు వినిపించాలి. భక్తి భావం పెంపొందించాలి. ఈ పనికి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి కంటే అర్హులెవరు? సమావేశమైన అధికారులందరూ హర్షాతిరేకంతో ప్రసాద్ ఆలోచనకి ఆమోదముద్ర వేశారు.

ఆ తరువాతి రోజే రమేశన్ అనే ఒక అధికారిని వెంటబెట్టుకొని సుబ్బలక్ష్మి ఇంటికి చేరుకున్నారు ప్రసాద్. శ్రీవేంకటేశ్వరుడి పటం, లడ్డు, ఇతర ప్రసాదాలు మర్యాదపూర్వకంగా తీసుకొచ్చారు. ముందు గదిలో సదాశివం, ఆత్మనాథన్ ఉన్నారు. సదాశివానికి శ్రీవేంకటేశ్వరుడి పటం అందజేశారు ప్రసాద్. ఆనందంగా అందుకుని ముందు టీపాయ్ మీద పెట్టాడు. ప్రసాద్ వచ్చిన పని చెప్పారు.

"చాలా సంతోషం. చాలా మంచి పని. వాగ్గేయకారుల పనిని బయటకు తీసుకురావాలి. ఇప్పుడు అన్నమయ్యవంతు."

సగం పని అయిందనుకున్నారు ప్రసాద్.

"కానీ అన్నమయ్య సంస్కృతంలో తక్కువ, తెలుగులో ఎక్కువ వ్రాశారు కదా..."

"అవునండీ...."

"అయితే... ఇప్పుడు ఈ అరవైఏండ్ల వయసులో సుబ్బలక్ష్మి తెలుగు పాటలు నేర్చుకొని పాడటం చాలా కష్టం, వద్దులెండి. ఆమెను ఇబ్బంది పెట్టొద్దు" చెప్పాడు సదాశివం.

"ఇబ్బందేమీ లేకుండా మెల్లగా నేర్చుకునే ఏర్పాటు చేస్తాను, త్యాగరాయ కీర్తనల లాగే ఉంటాయి" ఆదుర్దాగా చెప్పారు ప్రసాద్.

"త్యాగరాజ కీర్తనలంటే తను చిన్నతనం నుంచి నేర్చుకుంటోంది కాబట్టి కష్టమనిపించలేదు. భావం తెలుసుకొని, పలకటం నేర్చుకొని, ఒక కీర్తన పూర్తిగా నేర్చుకోవాలంటే ఒక వారంపైమాటే. మీరు యాభై కీర్తనలు అంటున్నారు. అంటే ఒక సంవత్సరం పైమాటే. అన్ని రోజులు ఆమెని కష్టపెట్టడం మంచిది కాదు." ఇదే ఆఖరిమాట అన్నట్లు చెప్పేశాడు సదాశివం.

"లేదండీ, అస్సలు కష్టమనేది లేకుండా నేర్చుకునే ఏర్పాటు నేను దగ్గరుండి చేస్తాను." ఒప్పించే ప్రయత్నాలు చేస్తూనే వున్నారు ప్రసాద్.

"సుబ్బలక్ష్మికి వున్న పేరు చెడగొట్టిగానీ వూరుకునేటట్లులేరే మీరూ.." వెంటనే అందుకున్నాడు సదాశివం. సదాశివంకు కోపం వచ్చేస్తోంది. తల దించుకున్నారు ప్రసాద్. ప్రసాద్‌కి ఏమీ పాలుపోలేదు. 'విషయం త్వరత్వరగా ఇక్కడదాకా వచ్చి ఇక్కడితో వెనక్కి తిరిగేటట్లు ఉంది, శ్రీనివాసా నీదే భారం' అనుకుంటూ ప్రార్థించుకుంటూ ఉన్నారు.

ఆ వెంటనే ఎప్పుడూ సదాశివం పిలవనిదే బైటకి రాని సుబ్బలక్ష్మి ముందు గదిలోకి వచ్చింది. వచ్చినవారు లేచి నుంచున్నారు. టీపాయి మీద ఉన్న శ్రీవేంకటేశ్వరుడి పటం తీసుకొని, "పెరుమాళ్ నా దగ్గరకు నువ్వే వచ్చావా" అంటూ కళ్లకద్దుకుని పరిసరాలని మర్చిపోయి, నిండైన భక్తితో చెమ్మగిలిన కళ్లతో కాసేపు ధ్యానం చేసుకుంది.

ఆర్ద్రతతో నిండి ఉన్న ఆమె భక్తి చూసి, విస్మయం చెందారు వచ్చినవారు. ఆమె భక్తి పాటలు ఎందుకు అంతగా హృదయానికి హత్తుకుంటాయో, మళ్లీమళ్లీ వినాలని ఎందుకు అనిపిస్తుందో ఇప్పుడు అర్థమయింది వారికి. "కుంజమ్మా! వీరు తిరుపతి తిరుమల దేవస్థానం అధికారులు, నీచేత అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుడి మీద ఐదువందల ఏండ్ల క్రితం వ్రాసిన కీర్తనలు రికార్డు చేయటానికి వచ్చారు. నేను వద్దని చెప్పాను. నీకు తెలుగు చాలా కష్టం అవుతుందని...."

"పెరుమాళ్ కోసం ఎంత కష్టమైనా పడతాను, కాదనకండి ఒప్పుకోండి. పెరుమాళ్లే మన ఇంటికి వచ్చి అడుగుతున్నట్లుంది" అని భర్తని ప్రాధేయపడింది సుబ్బలక్ష్మి. సుబ్బలక్ష్మి ఆ మాట అనేసరికి సదాశివం కించిత్ ఆశ్చర్యంగా చూస్తూ ఆలోచిస్తున్నాడు. అధికార ద్వయం ఉత్కంఠతో ఊపిరి బిగబట్టి వేచిచూస్తున్నారు.

"సరే అయితే కుంజమ్మా, నీ ఇష్టప్రకారమే చేద్దాం" ఒప్పుకున్నాడు సదాశివం.

ఊపిరి పీల్చుకొని తేలికపడ్డారు దేవస్థానం అధికారులు. కాని వారి ముందు అసలు సమస్య అలానే ఉంది. పారితోషిక విషయం. ఈ విషయం వెంటనే మాట్లాడాలి, కాని కాస్త తేడా వచ్చినా, వారు తప్పుగా అర్థంచేసుకున్నా కథ పూర్తిగా అడ్డం తిరుగుతుంది. మళ్లీ శ్రీవేంకటేశ్వరుడిని తలుచుకుంటూ, "అమ్మా, మీరు పాడినందుకు దేవస్థానం వారు మీకు డబ్బు కట్టాలి" అంటూ చెప్తుండగానే.

"పెరుమాళ్ కోసం పాడటం ఏమిటీ, డబ్బులు తీసుకోవడం ఏమిటి?" అంది సుబ్బలక్ష్మి తన నిజభక్తిని ఇంకోసారి తెలుపుతూ.

"నిజమే అమ్మా, మీ భక్తి మాకు తెలుసు. మీరు తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన విద్వాంసురాలిగా ఎలాగ స్వామివారి సేవకులై, నామమాత్రపు భత్యాలు తీసుకుంటున్నారో తెలుసు. కానీ, మీచేత పాటలు పాడించుకొని మీకు దేవస్థానం తరుపు నుంచి పారితోషికం ఇవ్వకపోతే ఒక అధికారిగా నేను తప్పుచేస్తున్నట్లు అవుతుంది, పైగా మీరు పాడిన ఈ రికార్డులు లక్షల సంఖ్యలో దేశవిదేశాల్లో అమ్మబడతాయి.



దేవస్థానానికి ఆదాయం వస్తుంది. అప్పుడైనా మీకు ప్రతిఫలం ఇవ్వడం మా బాధ్యత. దయచేసి కాదనకండి" జాగ్రత్తగా, చిన్న గొంతుతో చెప్పారు కార్యనిర్వహణాధికారి ప్రసాద్.

సుబ్బలక్ష్మి సదాశివంవైపు చూసింది.

"సరే, అలాగే కానివ్వండి" అన్నాడు సదాశివం. మానవమాత్రులని ఒకపక్క ఆందోళనపెడుతూనే ఒక్కొక్క ఆటంకాన్ని తీసివేస్తూ కథ సుఖాంతం చేశాడు శ్రీనివాసుడు.

పూర్తిగా తేలికపడిన ప్రసాద్, "తిరుమల తిరుపతి దేవస్థానం ఏడులక్షల రూపాయలు సుబ్బలక్ష్మిగారి పేరుమీద బ్యాంక్‌లో జమచేస్తుంది. వాటిమీద వచ్చే వడ్డీ ఆమె జీవితాంతం వాడుకోవచ్చు" వడ్డీకాసులవాడి లెక్కచెప్పారు.

సుబ్బలక్ష్మి ఈ లెక్కను కాస్త మార్చింది, అందరినీ ఆశ్చర్యపరుస్తూ. బహుశా ఇదే మొదటిసారి కావచ్చు డబ్బు విషయాలలో తలదూర్చటం.

"ఏంటమ్మా? చెప్పండి, మీరేమన్నా చెప్పదలచుకున్నారా?" ఏదో చెప్పదలచుకున్న సుబ్బలక్ష్మివైపు చూస్తూ అన్నారు ప్రసాద్.

"నాతో రాధ కూడా పాడుతుంది కదా...."

"తప్పకుండా పాడుతుంది."

"అయితే నా పేరుమీద కొంత, రాధ పేరుమీద కొంత, మామ పేరు కొంత డబ్బు పెట్టండీ... మొత్తం నా పేరుమీదే వద్దు." సరిగ్గా చెప్పింది సుబ్బలక్ష్మి. లెక్క సరిచేసింది. దేవస్థానం అధికారులకి కూడా ఈ పద్ధతితో పెద్దగా సమస్య ఏమీ లేదు. రాధవరకూ ఫరవాలేదు కానీ సదాశివం విషయంలో కాదు, 'అతనికి డబ్బు ఎందుకు?' అని పై అధికారులు అడిగితే... ఇది కాస్త సమస్యగా తోచింది ప్రసాద్‌కు. పి.వి.ఆర్.కె. ప్రసాద్ ముహుర్తాలు, తిథులు అన్నీ చూసుకొని వచ్చారు కాబట్టి వెంటనే సంతకాలు కూడా పెట్టించుకుంటున్నారు. ఆ సంతకాలు చేస్తున్నప్పుడు సుబ్బలక్ష్మి, సదాశివం సెక్రటరీ అయిన ఆత్మనాథన్, "మన ఆర్థిక పరిస్థితి ఈనాటికి ఇలా తయారవబోతుందని ముందే గ్రహించిన శ్రీవేంకటేశ్వరుడు అన్నమయ్యచేత పాటలు వ్రాయించి పెట్టాడు" అని అన్నాడు. కావచ్చు... కానీ శ్రీనివాసుడికి ఎప్పుడో తెలుసు సరిగ్గా ఈ సమయానికి సుబ్బలక్ష్మి గొంతు ఎంత శ్రావ్యంగా ఉంటుందో, ఆ మధురాతి మధురమైన గొంతు తనను కీర్తిస్తూ వినటానికే ఈ జగన్నాటకం, పైగా తనకోసం పాటలు పాడించుకుంటానని చిన్నారి కుంజమ్మకే మాట ఇచ్చాడు.

తిరుమల తిరుపతి దేవస్థానం సుబ్బలక్ష్మికి అన్నమయ్య పాటలు నేర్పటానికి అన్నమయ్య ప్రాజెక్ట్ డైరెక్టర్ అయిన కామిశెట్టి శ్రీనివాసులుని మద్రాసులోనే ఉండేటట్లు ఏర్పాటు చేసింది.

తెలుగు పాటని యథావిధిగా వ్రాసి ఇస్తే, ఆ పాటని చెప్పించుకొని తమిళంలో వ్రాసుకుంటుంది సుబ్బులక్ష్మి. ఒక్కొక్క వాక్యానికి అర్థం తెలుసుకునే క్రమంలో ప్రతి మాటకి అర్థం చెప్పించుకుంటుంది. ప్రతిమాటకు అర్థం పూర్తిగా తెలుసుకొని, పాటలోని భావాన్ని పూర్తిగా గ్రహించి, పాట రాగయుక్తంగా నేర్చుకుంటుంది. 1978 మొదట్లో మొదలయిన ఈ సాధన శ్రద్ధగా, నిష్ఠగా సాగుతుంది. ఆరునెలల్లోనే మొదటి లాంగ్ ప్లే రికార్డు తయారయింది. ఈ రికార్డులని తిరుమల మాడవీథులలో ఊరేగింపుగా తీసుకొచ్చి 1922లో ఏ గూటిలోంచి అన్నమయ్య దాచిన తాళపత్రాలు క్రిందకు దొర్లాయో ఆ గూటి ముందు సుబ్బులక్ష్మి పాడిన అన్నమయ్య పాటలు రికార్డును ఉంచి, అన్నమయ్యకు నమస్కరించుకుంది సుబ్బులక్ష్మి. ఆ తర్వాత గర్భగుడిలో శ్రీవేంకటేశ్వరుడికి అర్పించి, దీవనలుపొంది, ఆలయం ఎదురుగా ఉన్న కళ్యాణ మంటపంలో అన్నమయ్య కీర్తనలు శ్రీవేంకటేశ్వరుడికి వినిపించింది. ప్రజలకు ఇంకా బాగా తెలియజేసేందుకు సదాశివం ఈ రికార్డును రాష్ట్రపతి సంజీవరెడ్డి చేత విడుదల చేయించాడు. పి.వి.ఆర్.కె. ప్రసాద్ ఇప్పుడు సదాశివం పేరుమీద ఎందుకు డబ్బు వేశారో దానికి కాస్త సమర్థన ఇచ్చుకోవచ్చు అనుకున్నారు.

అనుకున్న ఐదు బాలాజీ పంచరత్నాల లాంగ్ ప్లే రికార్డులో ఒకటి విజయవంతంగా ప్రజల్లోకి వచ్చింది. ప్రజల్లోకి వచ్చిన తర్వాత ఇంకా విజయవంతమైంది. శ్రీవేంకటేశ్వరుడి పట్ల అన్నమయ్యకు ఉన్న అనురాగం, భక్తి, తేట తెలుగు కృతులలో జాలువారగా, సుబ్బులక్ష్మి మధుర కంఠంలో భావయుక్తంగా పాడిన సంకీర్తనలు వినటానికి ప్రజలు చెవులు కోసుకున్నారు.

మొదటి రికార్డు పని అయిన తర్వాత సుబ్బులక్ష్మి విశాఖపట్నం చేరుకుంది. అక్కడ వినాయక వేంకటేశ్వరస్వామి ఆలయానికి లబ్ధి కచేరీ చేయటానికి. సాయంత్రం కచేరీ అయితే ఆ ప్రొద్దుట నుంచే తుఫాను వాతావరణం ఏర్పడి బాగా వర్షాలు కురుస్తున్నాయి. నిర్వాహకులు అక్షరాలా నీరు కారిపోతూ, సదాశివం దగ్గరకు వచ్చారు. వాళ్లని చూడగానే వాళ్లెందుకు వచ్చారో వేలాడేసిన వాళ్ల మొహాలు చెప్తున్నాయి, వాళ్లకు తనను బ్రతిమిలాడే అవకాశం ఇవ్వకుండా, "మీరు కచేరీని రేపటికి పెట్టుకోండి. పర్వాలేదు, మేము ఉండిపోతాం" అన్నాడు. సదాశివం నుంచి అనుకోని వరానికి ఉబ్బితబ్బిబ్బైపోయారు నిర్వాహకులు. వర్షం ఇంకా జోరున పడుతూ ఉంది. సుబ్బులక్ష్మి ఖాళీగా ఉందని తెలుసుకున్న అక్కడి మహిళా మండలి సభ్యులు ఆమె దర్శన భాగ్యం కోసం వచ్చారు.

"ఈ వర్షంలో మీకు తీసుకురావటానికి ఏమీ దొరకలేదు. మా ఇంట్లో ఉన్న ఈ పసుపు, కుంకుమ, పూలు తప్ప." అంటూ అవి ఇచ్చారు సుబ్బులక్ష్మికి, బెరుకుగా ఆ మహిళలు.





తిరుమలలోఅన్నమయ్య భాండాగారం ముందు అన్నమయ్య పాటల మొదటి ఎల్.పి రికార్డును సమర్పిస్తున్న సుబ్బులక్ష్మి, రాధ, పి.వి.ఆర్.కె.ప్రసాద్ (కుడి వైపు చివరన)

"నాక్కావలసింది ఇవే" అంటూ సంతోషంగా వాటిని తీసుకుంది సుబ్బలక్ష్మి. సదాశివం మెల్లగా అక్కడికి వచ్చాడు. ఆ మహిళలు కుక్కిన పేనుల్లాగా అయిపోయారు. సదాశివం అంటే హిట్లర్ అని వాళ్లకి సదాశివం రాక ముందే కబురొచ్చింది. సదాశివం వాళ్లని పలుకరించాడు. మహిళలు ప్రతినమస్కారం చేసి మళ్లీ మౌనంగా ఉండిపోయారు. ఆశ్చర్యంగా సదాశివం వారితో చక్కగా మాట్లాడటం మొదలుపెట్టాడు. "కుంజమ్మా, నువ్వు ఈ పాట పాడు వాళ్లకి" అన్నాడు. మహిళలు ఇంకా ఆశ్చర్యపోయారు. సుబ్బలక్ష్మి ఆ పాట పాడిన తర్వాత సదాశివం ఆ త్యాగరాజకృతికి స్వయంగా అర్థం కూడా చెప్పి ఆ మహిళల జన్మ ధన్యం చేశాడు. సదాశివం మారాడా... కోపం, అహం తగ్గిందా... ఏమో....

విశాఖపట్నంలో తరువాతి రోజు కచేరీ పూర్తిచేసుకొని మద్రాసు తిరిగి వచ్చారు.

"అనంతపూర్ నుంచి ఒక సభ నిర్వాహకులు వచ్చారు మామా" అంటూ ఆత్మ చెప్పాడు.

విసుక్కున్నాడు సదాశివం. "నేను ఇంతకు ముందే ఫోన్‌లో చెప్పాను కుదరదని. ఎందుకు వచ్చాడు?" సదాశివం విసుక్కుంటుండగానే అనంతపురం త్యాగబ్రహ్మ సంగీత సభ వ్యవస్థాపకుడు వచ్చారు. "మా సభ స్థాపించి ఇరవై సంవత్సరాలవుతుంది. ఈ సందర్భంలో ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిగారు కచేరీ చేస్తే అనంతపూర్ వారంతా సంతోషిస్తాము" అని మళ్లీ సదాశివంకు విన్నవించుకున్నాడు.

"లేదు, నేను మీకు ముందే చెప్పాను."

"మా సభ ఏదో చిన్న సభ కాదు, మంగళంపల్లి వారు గత ఇరవై సంవత్సరాల నుంచి మా సభలో కచేరీ చేస్తున్నారు. ఇంకా ఎంతోమంది చేశారు."

"అయినా సరే, సుబ్బలక్ష్మి చేయదు."

ఆ సభ ప్రతినిధి సదాశివంని చాలాసార్లు వేడుకున్నాడు. సదాశివం ఒక్క మెట్టు కూడా దిగలేదు. వచ్చినతనికి చాలా కోపమొచ్చింది, "సుబ్బలక్ష్మి నా సభలో పాడకపోతే కొంపలేం మునగవ్" అంటూ కోపంగా అరిచి వెళ్లిపోయాడు, అగ్నిగుండంలాగా బద్దలవటానికి, సిద్ధంగా ఉన్న సదాశివంను తప్పించుకొని.

ఇంకొకసారి ప్రముఖ సంగీతజ్ఞులు అయిన ఒక మద్రాసువాసి సదాశివంకు ఫోన్‌చేసి, "సుబ్బలక్ష్మిగారి తల్లి, షణ్ముగవడివుగారి వీణ రికార్డులు నా దగ్గర ఉన్నాయి, మీకు తీసుకొచ్చి ఇవ్వనా" అని అడిగారు.

"ఆ లం# పాటలు నాకొద్దు" అని అరిచాడు సదాశివం.

సుబ్బలక్ష్మి విందా..... వినపడకుండా ఉండటానికి ఇది కల్కి బంగ్లా కాదు. నాలుగు గదుల చిన్న ఇల్లు.



సుబ్బలక్ష్మి ఎప్పటికీ శివోహం. సదాశివం ఇప్పటికీ సదా అహం.

❦❦❦❦

1978లో రాజాజీపట్ల తమకున్న బాధ్యత నెరవేర్చారు సుబ్బలక్ష్మి, సదాశివం. ఉన్నత పదవుల్లో నిస్వార్థ సేవ చేసినందుకుగాను భారత రాజధానిలో రాజగోపాలాచారి పేరుమీద రాజాజీ మార్గ్ అని ఒక ప్రధాన వీధికి పేరు పెట్టేలా చూసి, రాజాజీ విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.

ఈ సంవత్సరం ఆఖరులో బాలాజీ పంచ రత్నమాలలోని రెండవ రికార్డు విడుదలకు సిద్ధమయింది. ఈసారి ఈ రికార్డు విడుదల కార్యక్రమాన్ని ఇంకా ఘనంగా నిర్వహించాడు సదాశివం. ఐదు రాష్ట్రాలలో, ఆయా రాష్ట్ర గవర్నర్లచేత ఒకేరోజు ఒకే సమయానికి విడుదల చేయించాడు. అప్పుడెప్పుడో ఒకసారి సుబ్బలక్ష్మి నా భర్త ఐదుగురితో సమానం అని చెప్పిన మాటను నిజం అనిపించాడు. ఐదుచోట్ల అవతారమెత్తినట్లు, అన్నిచోట్లా దిగ్విజయంగా కార్యక్రమం జరిపించాడు.

పి.వి.ఆర్.కె. ప్రసాద్, 'సదాశివం పేరు మీద కూడా ఎందుకు డబ్బు వేశాడు?' అనే ప్రశ్న కూడా ఇక ఎవరూ అడిగే ధైర్యం చేయరు.

సుబ్బలక్ష్మిని ఎక్కువ కష్టపెట్టకూడదు అనే ఉద్దేశ్యంతో బాలాజీ పంచరత్నమాల ఐదు రికార్డుల్లో మూడు మాత్రమే అన్నమయ్య కీర్తనలతో రికార్డు చేయటానికి నిర్ణయించారు.

1980లో విడుదలకి సిద్ధంగా ఉన్న మూడవ రికార్డులో ఆదిశంకరుల గణేశ పంచరత్నం, వల్లభాచార్యుని మధురాష్టకం, జయదేవుని దశావతార అష్టపది, నామ రామాయణం, హనుమాన్ చాలీసా... రికార్డు చేయటానికి నిర్ణయించారు. ఈ స్తోత్రాలు, శ్లోకాలు, పాటలు వ్రాసినవారు ఎలాగూ ధన్యులే, ఎక్కడో పూజగదుల్లో పుస్తకాల్లో ఉండిపోయే వీటిని తన బంగారు గొంతుతో వినిపించి ప్రజలు వినేలా చేసి ధన్యురాలయింది సుబ్బలక్ష్మి. ముఖ్యంగా మధురాష్టకం, గణేశ పంచరత్నం, తులసీదాసు హనుమాన్ చాలీసా, నామరామాయణం. ఈ పాటలను ఎంచినవారు కూడా ధన్యులు. ఈ పాటలలో పూర్తిగా సుబ్బలక్ష్మి గొంతుకే ప్రాధాన్యమిచ్చి, రాధ గొంతును అతి తక్కువ స్థాయిలో ఉంచటంతో సుబ్బలక్ష్మి గాత్ర మాధుర్యాన్ని పూర్తిగా ఆస్వాదించే వీలు కుదిరింది. ముఖ్యంగా 'మధురాష్టకం'. ఈ పాట విన్నంతసేపూ మధురాపతి వచ్చి నృత్యం చేసినట్లనిపిస్తుంది. మధురాతి మధురం ఎమ్.ఎస్. పాట.

ఇరవైయవ శతాబ్దం తొలి భాగంలో ఆవిష్కృతమవుతున్న సాంకేతిక సాధనాలు, పరికరాలవల్ల సుబ్బలక్ష్మి మేలు పొందినంతగా ఇంకే ఇతర సంగీత కళాకారిణి మేలు పొందలేదు. సుబ్బలక్ష్మి పుట్టక ముందే గ్రామఫోను కనిపెట్టబడింది. పట్టుమనిపదేళ్లు

వచ్చాయో లేదో సుబ్బలక్ష్మి గ్రామఫోను రికార్డుల్లో పాడి చిచ్చర పిడుగనిపించుకుంది. అప్పటి నుంచి గ్రామఫోను ప్లేటుల్లో పాడుతూ విష్ణు సహస్ర నామం దాకా గ్రామఫోను కంపెనీకి లాభాలు తెచ్చిపెట్టింది. సుబ్బలక్ష్మి ప్రతిభను దూరదూర ప్రాంతాలలో కూడా లక్షలమందికి చేర్చింది గ్రామఫోను రికార్డు.

అలా సభలలో, ప్లేట్లలో పాడుతూ ఉండగా మైకు ఆవిష్కరించబడింది. సుబ్బలక్ష్మి అమోఘమైన గొంతుని, ఆ గొంతులోని శాస్త్రీయతను నిక్కచ్చిగా పలికించే ప్రతి సూక్ష్మమైన అంశం పందిళ్లలో, పెద్దపెద్ద భవంతులలో ఆఖరున కూర్చున్నవారికి కూడా స్పష్టంగా వినిపించేలా చేసింది మైకు. మైకు సుబ్బలక్ష్మి శ్రోతల సంఖ్యను, అభిమానుల సంఖ్యను, సుబ్బలక్ష్మిని ఆరాధించేవారి సంఖ్యను లెక్కకు మించిపోయేలా చేసింది.

ఆ వెనువెంటనే భారతదేశంలో ప్రాచుర్యంలోకి తీసుకురాబడిన రేడియో సుబ్బలక్ష్మి శ్రోతల సంఖ్యాబలమే కాకుండా స్థాన బలిమిని కూడా హెచ్చు చేసింది. మద్రాసు, బెంగుళూరు, తిరువనంతపురం, హైదరాబాదు, ఢిల్లీ రేడియో కేంద్రాలలో పాడుతూ దేశం నలుమూలలా వినిపిస్తున్న సుబ్బలక్ష్మి గొంతును గుర్తుపట్టేస్తున్నారు శ్రోతలు. 1966లో బి.బి.సి. కూడా సుబ్బలక్ష్మి చేత కచేరీ ఇప్పించుకొని ప్రసారం చేసింది. ఇక చిన్నచిన్న ఆవిష్కారాలన్నీ ఒకటయ్యి సినిమా అనే పెద్ద ఆవిష్కరణ జరిగింది. నాల్గవ సినిమాతోనే సుబ్బలక్ష్మి దేశవ్యాప్తంగా కీర్తిని ఆర్జించింది.

ఈ నవయుగంలోని సాంకేతిక పరికరాలు, సుబ్బలక్ష్మికి తన సంగీత ప్రయాణంలో అడుగడుగునా తోడయ్యి సుబ్బలక్ష్మిని ప్రజలకి చాలా దగ్గర చేశాయి.

1970ల చివరిలో ఊపందుకున్న ఇంకొక పరికరం సుబ్బలక్ష్మి శ్రోతలని ఆమెకు భక్తులని చేసింది. అప్పటిదాకా సభల్లోనూ, రేడియోల్లోనూ, ప్లేట్లలోనూ విన్న శ్రోతలు, సుబ్బలక్ష్మి టి.వి.లో పాడుతూ కనిపించేసరికి, ఆమె రూపం, ఆమె భక్తితో మమేకమై పాడే తీరు చూసి ఆమెకే భక్తులైపోయారు.

1979లోనే సుబ్బలక్ష్మి అన్నమయ్య కృతులు కూడా మద్రాస్ దూరదర్శన్‌లో పాడింది.

అన్నమయ్య కీర్తనలు గ్రామఫోను రికార్డుల ద్వారా బాగా ప్రజాదరణ పొందుతున్నాయి. తెలుగువారు ఎక్కడున్నా సుబ్బలక్ష్మి ఆలపించిన అన్నమయ్య సంకీర్తనలు వింటున్నారు. ఇక ఆంధ్రప్రదేశ్ సంగతి చెప్పనవసరంలేదు. ఆంధ్రప్రదేశ్‌కి సుబ్బలక్ష్మి, సుబ్బలక్ష్మి పాట సుపరిచితం. వేంకటేశ్వర సుప్రభాతంతో 'మన సుబ్బలక్ష్మి' అయింది. ఇప్పుడు అన్నమయ్య పాటలతో 'మా సుబ్బలక్ష్మి' అయింది. సరిగ్గా ఇప్పుడే భారతదేశ వాణిజ్య విధానాల కారణంగా సంగీతం వినిపించబడే తీరులో ఇంకొక పరికరం అందుబాటులోకి వచ్చింది. అదే టేపురికార్డరు, క్యాసెట్టు. ఈ పరికరం గ్రామఫోను అంత ఖరీదు కాదు. రేడియో, సభల గానంలాగా ఒక నిర్ణీత సమయంలోనే వినాల్సిన



బాధ లేదు. ఈ టేపురికార్డరు క్యాసెట్ తక్కువ వెలకు దొరుకుతున్నందువల్ల ఎక్కువ మంది ప్రజలు కొనుగోలు చేస్తున్నారు. ఈ మార్పుని గమనించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఇప్పటిదాకా విడుదల చేసిన బాలాజీ పంచరత్నమాల మొదటి మూడు రికార్డులని క్యాసెట్ల రూపంలో విడుదల చేశారు. అన్నమయ్య కీర్తనలు అందరికీ అందుబాటులోకి వచ్చాయి. తెలుగువారు సుబ్బలక్ష్మి అన్నమయ్య కీర్తనలలో తన్మయత్వం చెందుతున్నారు. తెలుగు ప్రజలలో ఉన్న అభిమానం, ఆదరణ చూసి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సుబ్బలక్ష్మిని తగు రీతిలో సన్మానించదలుచుకుంది. సుబ్బలక్ష్మి ఇంటికి ఫర్మానా వెళ్లింది.

'శ్రీమతి సుబ్బలక్ష్మిని ఆంధ్రప్రదేశ్ ఆస్థాన విద్వాంసురాలిగా నియమిస్తున్నట్లు ముఖ్యమంత్రి శ్రీఅంజయ్య నిర్ణయించారని, ఆస్థాన విద్వాంసురాలిగా నెలకు మూడువేలు రూపాయలు పారితోషికం, ఇంకా ఇతర వెసులుబాట్లు ఇవ్వబడతాయి' అని ఆ ఫర్మానా సారాంశం.

"ఆత్మ! వారికి వెంటనే ఉత్తరం టైపుచేసి పంపు. సుబ్బలక్ష్మి ఆస్థాన విద్వాంసురాలిగా ఉండటానికి సంతోషమేగానీ ఆ డబ్బు మాత్రం అసలు తీసుకోమని చెప్పు. అలాగయితేనే ఆ పదవి ఒప్పుకుంటారని చెప్పు" ఆదేశించాడు సదాశిం.

"అలాగే మామా" అంటూ గంటలో ఉత్తరం టైపుచేసి హైదరాబాద్‌కి పంపాడు ఆత్మనాథన్.

హైదరాబాద్‌లో రవీంద్రభారతిలో సుబ్బలక్ష్మిని ఆంధ్రప్రదేశ్ ఆస్థాన విద్వాంసురాలిగా నియమిస్తూ కార్యక్రమం జరుగుతోంది. ముఖ్యమంత్రి అంజయ్య, సాంస్కృతిక శాఖ మంత్రి భాట్టం శ్రీరామ్మూర్తి వేదికపైనున్నారు. మంత్రి మాట్లాడుతూ, "సుబ్బలక్ష్మి గారు ఆస్థాన విద్వాంసురాలిగా వేతనం తీసుకోవాలి" అని సూచించారు. అందుకు సమాధానంగా సదాశివం వేదికమీద మాట్లాడుతున్నప్పుడు, "సుబ్బలక్ష్మి లాంఛనప్రాయంగా ఒక రూపాయి మాత్రమే వేతనంగా తీసుకుంటుంది" అని ప్రకటించాడు.

ఆ తరువాత నెలలో బాలాజీ పంచ రత్నమాల లోని నాల్గవ రికార్డుని ఢిల్లీలో ప్రధాని ఇందిరాగాంధీ చేతుల మీదుగా విడుదల చేయటానికి నిశ్చయమయింది. సదాశివం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కూడా ఈ వేడుకకి ఆహ్వానించాడు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున సాంస్కృతిక శాఖామంత్రి అయిన భాట్టం శ్రీరామ్మూర్తి ఢిల్లీ వచ్చారు. ఆ కార్యక్రమంలో ఇందిరాగాంధీ తన చిన్ననాటి స్నేహితురాలయిన సుబ్బలక్ష్మిని ఆత్మీయంగా హత్తుకుంది.

తెలుగువారిలోనున్న ఆత్మీయత సుబ్బలక్ష్మిని ఈ సంవత్సరం కరీంనగర్‌కి కూడా తీసుకువచ్చింది.

బాలాజీ పంచరత్నమాలలోని ఐదవ రికార్డు కూడా విడుదలకు సిద్ధమయింది. ఈ ఐదవ రికార్డు విపణిలోకి వచ్చేముందే తిరుమల తిరుపతి దేవస్థానానికి గత నాలుగు రికార్డులు, క్యాసెట్లు అమ్మకాలవల్ల అక్షరాలా పది లక్షల రూపాయలు వచ్చాయి. సుబ్బులక్ష్మి పేరున బ్యాంక్‌లో జమచేసిన ఐదు లక్షల కంటే ఎక్కువే, మూడు సంవత్సరాలలోనే వచ్చేసింది. అన్నమయ్య ఒక పాటలో అంటాడు, 'నీరు కొలది తామరము' అని. సుబ్బులక్ష్మి అంకిత భావం, ఆత్మసమర్పణ, భక్తి కొలదీ విరివిగా విప్పారిన ఈ విజయ తామరము.

𝄞𝄞𝄞𝄞

'అప్పు లేనివాడు అధిక సంపన్నుడగును' అని వేమన చెప్పినట్లు, కల్కి బంగ్లా అమ్మిమరీ అప్పులు తీర్చేసి హాయిగా ఉన్నాడు సదాశివం. సుబ్బులక్ష్మి కొన్నాళ్లు బాధపడి, ఇక ఆ విషయం మర్చిపోవటానికి ప్రయత్నిస్తోంది. కానీ ఎప్పుడూ, ఒక్కసారి కాదు కదా అరసారి కూడా ఈ విషయంలో భర్తని దెప్పలేదు. మళ్లీ మదురైలో తన చిన్న ఇల్లంత ఇంటికి చేరుకుంది. సదాశివంకి మాత్రం మళ్లీ సొంతంగా ఒక ఇల్లు ఏర్పరచుకోవాలనే ఆశ మాత్రం మనసులో ఉంది.

కల్కి బంగ్లాలో పావు భాగంలో పావు భాగం అంత చిన్న ఇంటికి మారినా సుబ్బులక్ష్మి సంగీత ప్రస్థానంపై ఎలాంటి ప్రభావం లేదు. ఇంకా పైకిపైకి పోతూనే ఉంది. కల్కి బంగ్లా నుంచి వచ్చేసిన గత మూడు సంవత్సరాలలో సగటున సాలీనా ఐదు లద్ది కచేరీలు చేస్తూ వచ్చింది. సుబ్బులక్ష్మి ఇంటికి టాటాలు, బిర్లాలు, గవర్నర్లు, ముఖ్యమంత్రులు, రాజకీయ నాయకులు, అధికారులు, విలేఖరులు, అభిమానుల రాకపోకలకి కొదవలేదు. వారికి ఇచ్చే ఆతిథ్యంలో కూడా ఎలాంటి కొదవ కనబడనీయలేదు. అతిథులకే కాదు, వారి వెంట వచ్చే కారు డ్రైవర్లకు కూడా.

అన్నమయ్య పుణ్యమాని సుబ్బులక్ష్మిని ఆంధ్రదేశం కలవరిస్తుంది. గుంటూరు ప్రజలకి ఆమె దర్శనభాగ్యం కలుగచేయమని విన్నవించుకుంది గుంటూరులోని నాగార్జున సంగీత కళాశాల. ఆ విన్నపాన్ని మన్నించి సుబ్బులక్ష్మి గుంటూరుకు చేరుకుంది. కనకాభిషేక సన్మాన ప్రాంగణానికి వేదమంత్రోచ్చారణల మధ్య పూర్ణ కుంభ స్వాగతంతో తోడ్కొని వచ్చారు నిర్వాహకులు. నగర శివారులో ఒక పెద్ద గోడౌన్‌లో వేదిక ఏర్పాటు చేశారు. పదివేల మందికి పైగా సుబ్బులక్ష్మి అభిమానులు తరలివచ్చారు. టిక్కెట్లు కొనుక్కుని మరీ వచ్చారు. వేదిక పైకి వచ్చేవరకు ఆ పదివేల మంది అభిమానులు అయస్కాంతం ఎటువెళితే అటు ఇనుపముక్కలు వెళతాయో అలా ఆ ప్రాంగణం ఒక చివరికి పూర్ణకుంభ స్వాగతం జరుగుతున్నవైపు వచ్చారు. సుబ్బులక్ష్మితో పాటే వేదికదాకా వచ్చి సుబ్బులక్ష్మి వేదికనెక్కిన తర్వాత ఎవరి స్థానాల్లోకి వారొచ్చారు. వేదికపై నుంచి పదివేల పైన జనాన్ని చూసి






ఢిల్లీలో ప్రధాని ఇందిరాగాంధీ బాలాజీ పంచ రత్నమాల నాల్గవ రికార్డుని విడుదల చేయుట

సుబ్బులక్ష్మి ఆశ్చర్యపోయింది. జస్టిస్ అమరేశ్వరి, తదితర నగర ప్రముఖులు సుబ్బులక్ష్మికి కన్నుల పండుగగా కనకాభిషేకం కావించారు. ఈ సన్మానం జరుగుతున్నంతసేపు గుంటూరు ప్రజలు వారి ఇంటి ఆడపిల్లకు సన్మానం జరుగుతున్నట్లు ఆనందించారు. వారి ఇంటి ఆడపిల్లకు కాదేమో..... ఎందుకంటే, జనంలో ఒకరన్నారు, 'అమ్మవారికి అభిషేకం చేస్తున్నట్లు ఉంది' అని. సరిగ్గా అప్పుడే ఒకరు పెద్దలను, బందోబస్తును దాటుకొని వచ్చి, సుబ్బులక్ష్మికి సాష్టాంగ నమస్కారం చేశారు.

కనకాభిషేక సన్మానం జరుగుతున్నంతసేపు గుంటూరు ప్రజలు ఆనందపడిపోతూ నిలుచుని హర్షాతిరేకం తెలిపారు. పాశ్చాత్య దేశాల్లో తనకు లభించిన స్టాండింగ్ ఒవేషన్ గుర్తొచ్చింది సుబ్బులక్ష్మికి. సన్మాన కార్యక్రమం అనంతరం సుబ్బులక్ష్మి మాట్లాడుతూ "నేను 1968వ సంవత్సరంలో కూడా గుంటూరు వచ్చాను. అప్పుడు లయోలా పాఠశాల నిర్మాణం కోసం కచేరీ చేయటానికి వచ్చాను. మళ్లీ ఇన్ని సంవత్సరాలకి, ఈ పట్టణానికి రావటం చూస్తే ఈ పట్టణానికి నాకూ ఏదో తీయని రాగానుబంధం ఉందనిపిస్తుంది" అని అనగానే అక్కడున్నవారు చప్పట్లు కొట్టారు. అవి ఎలాగంటే పట్టణం ఇటు శివారు నుంచి పట్టణం మీదుగా అటు చివరికి వినిపించేటట్లు.

కనకాభిషేక సత్కారం పూర్తయ్యేసరికి చాలా ఆలస్యమయింది. ఆ వెంటనే అశేష ప్రజలు ఎదురు చూస్తున్న కచేరీ ప్రారంభించి, కచేరీ ఆఖరి పాటదాకా వారిని మంత్రముగ్ధులని చేసింది. ఆ తరువాత రోజు విజయవాడ, తుమ్మలపల్లివారి కళాక్షేత్రంలో కచేరీ చేసింది.

సరిగ్గా ఇంకో నెలకి విజయవాడ నుంచి ఇంకో వేడుకోలు వచ్చింది. ఈ విన్నపాన్ని కూడా అంగీకరించాడు సదాశివం.

విజయవాడలో, 'గానప్రియ' అనే పేరుతో ఒక తమిళుడు నడుపుతున్న సంగీత సభ తరుపున సుబ్బులక్ష్మి కచేరీ ఏర్పాటు చేశాడు.

కచేరీకి ముందు సుబ్బులక్ష్మి, రాధని ఒక గదిలోకి పంపి తలుపేశాడు సదాశివం. మూడు గంటలు సాధన చేసుకొని గదిలోంచి బయటకు వచ్చారు సుబ్బులక్ష్మి, రాధ. ఆ వెంటనే మళ్లీ నాలుగ్గంటలసేపు సాధన చేసిన కృతులతోనే కచేరీ చేసింది సుబ్బులక్ష్మి.

కచేరీ అయిన తర్వాత సుబ్బులక్ష్మి దగ్గరకు నిర్వాహకుడు వచ్చి "బ్రహ్మాండంగా చేశారు కచేరీ" అంటూ గొప్పగా జరిగిందని చెప్పాడు. "అంతా చక్కగా జరిపారు" అంటూ సుబ్బులక్ష్మి కచేరీ విజయం నిర్వాహకుడికే కట్టబెట్టింది.

"సౌందర్య రాజన్, తంబూరలు వాయించిన ఆ భార్యాభర్తలకి మీరు ఎంత ఇస్తారు?" అడిగాడు సదాశివం.



శ్రీమతి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి సంగీత కచేరి

నాగార్జున సంగీత కళాశాల, గుంటూరు

సగర్వంగా సమర్పించు కర్ణాటక సంగీత కచేరి

సంగీత కళానిధి, ఆంధ్రప్రదేశ్ ఆస్థాన విదుషీమణి, విశ్వవిఖ్యాత [illegible] గ్రహీత

"శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి"గారిచే

10-1-82 ఆదివారం సాయంత్రం 6 గంటలకు

శ్రీ కరీమూన్‌ఖాన్-మహబూబ్‌ఖాన్ టొబాకో కంపెనీ

(మంగళగిరిరోడ్, గుంటూరు-1) ఆవరణలో

సంగీత కళాశాల సహాయార్థం. సంగీత ప్రియులకు చక్కని అవకాశం

టిక్కెట్లు:- రూ 100/ రూ 5[illegible]/- రూ [illegible]5/- రూ 10/- మాత్రమే

టిక్కెట్లు దొరుకు చోటు :

1. నాగార్జున సంగీత కళాశాల, 2/14, బ్రాడీపేట, గుంటూరు-4. ఫోన్ 23899

2 ది విజయ అండ్ కంపెనీ, జిన్నాటవర్, గుంటూరు-3 ఫోన్ : 21956

'ఆంధ్ర పత్రిక' నుంచి



గుంటూరు సభలో సుబ్బులక్ష్మిని సన్మానిస్తున్న జస్టిస్ అమరేశ్వరి

"చెరొక పాతిక ఇస్తానండీ."

"బాగా వాయించారు రాజన్."

"ఏంటీ, తంబూరనా" నవ్వుతూ అన్నాడు.

"అవును, తంబూరనే. నాలుగ్గంటలు శ్రుతి బాగా నిల్పారు. ఇంద ఈ వంద రూపాయలు నా తరఫున ఇవ్వు వాళ్లకి" అంటూ రాజన్‌కి వెంటనే డబ్బులు ఇచ్చాడు సదాశివం. విజయవాడలో తెరముందు వారికి సుబ్బలక్ష్మి, నాలుగు గంటలు కచేరీ వీనుల విందు అయితే తెరవెనకవారికి సుబ్బలక్ష్మి మూడు గంటల సాధన విస్మయపరచిన విషయం. నాలుగు గంటల కచేరీకి ముందే మూడు గంటల సాధన. అదీ అంత గొప్ప విద్వాంసురాలయిన, అరవైఆరేళ్ల సుబ్బలక్ష్మి.

ఇదే సంగీత సభకు అతి కొద్ది రోజులకే ఆంధ్రప్రదేశ్‌కి చెందిన ఒక ప్రముఖ విద్వాంసుడు కచేరీ చేయటానికి ఆహ్వానించబడ్డాడు. ఆయన కచేరీ ఇంకో గంటలో ప్రారంభమవుతుందన్నా కూడా ఏమాత్రం ప్రశాంతమైన వాతావరణం కోరుకోకుండా అందరితో పిచ్చాపాటీ మాట్లాడుతూనే ఉన్నాడు. చూసిచూసి నిర్వాహకుడు, "మీరు సాధన చేసుకోరా కచేరీ ముందు, మొన్న సుబ్బలక్ష్మిగారు వచ్చినప్పుడు మూడు గంటలపాటు సాధన చేసుకున్నారు. అలాగ మీరేమీ చేసుకోరా" అని అడిగాడు.

"కచేరీకి ముందు సాధనా..... సరిసరి. దానికంటే ముందు ఇంకొక మాట, ఏదో చిన్నచిన్న భజనలు, భక్తి గీతాలు పాడుకునే సుబ్బలక్ష్మిని నాతో పోల్చకండి. అయినా వేదికమీదకెళ్లి చేసేదేమిటి? సాధనే కదా, మళ్లీ ముందు కూడా సాధనేంటి విడ్డూరంగా" అని సెలవిచ్చాడు ఈ విద్వాంసుడు.

సాధన! సాధన!! సాధన!!! నిద్ర, తిండి లాంటి కనీస అవసరాలకు లేవటం తప్ప రోజంతా సాధన చేసిన రోజులు ఎన్నో సుబ్బలక్ష్మికి. సాధన, అంకితభావంతో చేసే సంగీత సాధన, భక్తితో చేసే సంగీత సాధన. అమ్మ ఇహ పర సాధనకు రెండింటికీ ఉపయోగపడుతుందని నేర్పించినా సుబ్బలక్ష్మి ఇహలోక సౌఖ్యాల కోసం సంగీతాన్ని ఉపయోగించటం ఏనాడో మానేసింది.

**సంగీత జ్ఞానము భక్తి వినా సన్మార్గము కలదే మనసా**
**న్యాయాన్యాయములు తెలుసును జగములు**
**మాయామయమని తెలుసును**
**దుర్గుణ కాయజాది షడ్రిపుల జయించే**
**కార్యము తెలుసును త్యాగరాజునికి.....**

త్యాగరాజు కృతి, రాగం– ధన్యాసి, తాళం– ఆది



సుబ్బలక్ష్మికి భక్తి, సంగీతం వేరువేరు కాదు. చిన్నతనంలోనే మీనాక్షి అమ్మవారికి ఎదురుగా, తనివి తీరేంతవరకూ నుంచున్నప్పుడే భక్తి మొదలైంది. ఆ భక్తి 'మీనాక్షి మేముదమ్ దేహి', 'సరోజ దళనేత్రి హిమగిరి పుత్రీ నీ పదాంబుజములనే సదా నమ్మినానమ్మ', 'త్రిపుర సుందరీ నన్ను అందరిలో జూచి బ్రోవమ్మా', అని కృతులలో ప్రతిఫలించింది, ప్రతిఫలిస్తూనే ఉంది. భక్తి ఎల్లలు లేనిది. త్యాగరాజస్వామి భక్తి అసాంప్రదాయమైనది. రాముడి గుణగణాలు పొగుడుతాడు, తనను బ్రోవమని వేడుకొంటాడు, కరుణ చూపనందుకు కోప్పడతాడు, దెప్పుతాడు, చురకలు వేస్తాడు. ఏమి చేసినా, భక్తితోనే. తనువుతో, మనస్సుతో పొంగి పొర్లే ప్రేమ, అవధులు లేని ప్రేమ. ఈ ప్రేమని, భక్తిని అడుగడుగునా, నియమనిబంధనలతో నిండియున్న రాగతాళ గతులలో కూర్చాడు త్యాగరాజు. బంధాలెరుగని ప్రేమ రాగ తాళ గతులలో బంధించబడింది.

అయినా త్యాగరాజు పాటలో భక్తి అపారం. సంగీత లక్షణ, లక్ష్యాలు అమోఘం. ఇదెలా సాధ్యం.... కారణ జన్ములకు మాత్రమే సాధ్యం. సుబ్బలక్ష్మి కూడా అలాంటి కారణజన్మురాలు. శాస్త్రీయ సంగీత లక్షణ లక్ష్యాలు గుర్తెరిగి పాడుతూ, అదే సమయాన తన భక్తిని తెలుపుతూ, పాడే పాటను ఆస్వాదించే జ్ఞానార్థి.

❦❦❦❦

కపిల వాత్సాయన సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చింది. ఈమె భారతీయ నృత్యం, కళల చరిత్ర పరిశోధకురాలు. లండన్‌లో జరప తలపెట్టిన 'ఫెస్టివల్ ఆఫ్ ఇండియా ఇన్ లండన్' కోసం మూడు సంవత్సరాల నుంచి శ్రమిస్తుంది.

"అంతా సిద్ధమేగా మీరు...." అడిగింది కపిల వాత్సాయన సుబ్బలక్ష్మిని.

"సిద్ధమే కాని, ప్రభుత్వం మళ్లీ నన్నే ఎందుకు ఎంపిక చేసుకుంది?" ఈ ప్రశ్న, ఈ అనుమానం సదాశివంకి కూడా ఉంది. ప్రతిసారీ సుబ్బలక్ష్మికే అవకాశం ఇస్తుంటే మిగతా కర్నాటక సంగీత విద్వాంసులు నొచ్చుకోరా అని.

"సుబ్బలక్ష్మి ఎంపిక ఏకగ్రీవం. ఇటు భారతదేశంలో ఇందిరాగాంధీ ఎంపిక చేశారు. అటు లండన్‌లో భారతీయులు మిమ్మల్నే కావాలన్నారు. మీరు ఈ విషయంలో ఎక్కువగా ఆలోచించనవసరం లేదు."

"మనం విదేశాలలో మన దేశపు గొప్ప వారసత్వాన్ని తీసుకెళ్లాలి, అక్కడ పేరు చెపితే గుర్తుపట్టే వ్యక్తిని తీసుకెళ్లాలి, అంతేకానీ నేను తీసుకెళ్లిన వారి గురించి నేనే ఒక పేజీ చదివి వినిపించేలా కాదు."

కాస్త సమాధానపడింది సుబ్బలక్ష్మి. ఆ మధ్యనే, 'అంతర్జాతీయ సంగీత సమాఖ్య' సుబ్బలక్ష్మిని గౌరవ సభ్యురాలిగా చేర్చుకుంది. సుబ్బలక్ష్మికి ఈ 'ఫెస్టివల్ ఆఫ్ ఇండియా ఇన్ లండన్' ప్రయాణం ఐదవ విదేశీ ప్రయాణం. ఈ సమయానికి తన తోటి మహిళా

సంగీతజ్ఞులు పట్టమ్మ, వసంత కుమారి, బృంద రెండు సంగీతపరమైన విదేశీ ప్రయాణాలకు మించి చేయలేకపోయారు. సుబ్బులక్ష్మి లండన్‌కి అయితే ఇది ఏకంగా నాలుగోసారి వెళ్లటం.

ఫెస్టివల్ ఆఫ్ ఇండియాలో భాగంగా సుబ్బులక్ష్మి రాయల్ ఆల్బర్ట్ హాల్‌లో కచేరీ ఇవ్వనుంది. న్యూయార్క్‌లో కార్నేగి హాలులాగా ఈ హాలు కూడా ప్రతిష్ఠాత్మకమైన హాలు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సంగీతజ్ఞులందరూ ఈ రాయల్ ఆల్బర్ట్ హాలులో వారి కచేరీ చేసే ఉంటారు. అలాంటి గొప్ప హాలులో సుబ్బులక్ష్మి కచేరీ మొదలైంది. ముందు వరుసలో బ్రిటిష్ రాణి ఎలిజబెత్, ఆమె కుమారుడు ప్రిన్స్ ఛార్లెస్, బ్రిటిష్ ప్రధాని థాచర్, ఇంకా ఎందరో సంగీతజ్ఞులు ఉన్నారు. ఎలిజబెత్ మహారాణితోసహా ఎవరూ కచేరీ మధ్యలో వెళ్లలేదు. ఆ తర్వాత ప్రఖ్యాత సంగీతజ్ఞుడు జుబిన్ మెహతా వాద్యగోష్ఠి. సుబ్బులక్ష్మి వేదిక దిగి శ్రోతల్లో కూర్చోవటానికి వచ్చింది.

“మీ శ్రావ్యమైన సంగీతం విన్న తర్వాత నాకే ఈ వాద్యగోష్ఠి చేయబుద్ధి కావటంలేదు. ఇక శ్రోతల పరిస్థితి ఏమిటి?” అని అన్నాడు సుబ్బులక్ష్మిని మనస్ఫూర్తిగా అభినందిస్తూ జుబిన్ మెహతా.

సుబ్బులక్ష్మికి సదాశివం చెప్పాడు జుబిన్ మెహతా ఏమన్నాడో. సుబ్బులక్ష్మి నిండైన నవ్వే సమాధానం.

జుబిన్ మెహతా వేదికనెక్కి నూటయాభై వాద్యపరికరాలతో గోష్ఠి చేశాడు.

ఆ తర్వాత జుబిన్ మెహతాతో, “మేము ఒక మృదంగం, వయోలిన్, తంబూరాలనే శ్రుతి చేసుకోవటమే ఒక పెద్ద పని అనుకుంటే మీరు నూటయాభై వాద్యాలను ఒకే శ్రుతి మీద ఉంచి కచేరీ చేశారు. చాలా గొప్ప విషయం” అంటూ మనస్ఫూర్తిగా అభినందనలు తెలిపింది.

లండన్ కార్యక్రమం దిగ్విజయంగా పూర్తి చేసుకొని తిరుగు ప్రయాణమయ్యారు. మధ్యలో జర్మనీలో ఆగారు. అక్కడ కాస్త సరదాగా తిరుగుతూ కొనుగోళ్లు చేస్తూ ఉండగా రాధకు తల బద్దలవుతున్నంత తలనొప్పి వచ్చింది. కానీ దేశంకాని దేశంలో ఎవ్వరినీ ఇబ్బంది పెట్టడం ఇష్టంలేక ఎవరికీ చెప్పలేదు. ఇది చాలాచాలా పెద్ద తప్పవబోతోంది, రాధకు, సుబ్బులక్ష్మికి, అందరికీ.

అది ఏప్రిల్ నెలాఖరు. రెండు రోజుల్లో అందరూ ఇంటికి చేరుకున్నారు. మే ఇరవై రెండవ తారీఖున రాధ తన ఇంట్లో మధ్యాహ్నం భోజనాలయిన తర్వాత, “అత్తా, తల నొప్పిగా ఉంది, పడుకుంటాను” అని చెప్పి పడుకుంది. సాయంత్రమైనా రాధ ఎంతసేపటికి లేవకపోయేసరికి రాధ అత్త గదిలోకి వెళ్లింది. ఒళ్లు కాలిపోయే జ్వరంతో రాధ స్పృహతప్పి పడి వుంది.



లేడీ వెల్లింగ్‌టన్ హాస్పిటల్‌లో, సుబ్బులక్ష్మి, నర్సులు రాధకి ఒళ్లు తుడుస్తున్నారు, సదాశివం వైద్యుల చుట్టూ తిరుగుతూ అప్పుడప్పుడు రాధ దగ్గరకి వచ్చి చూస్తున్నాడు. సుబ్బులక్ష్మి పరపతివల్ల క్షణాల్లో మద్రాసులోని పేరున్న వైద్యులు లేడీ వెల్లింగ్‌టన్ హాస్పిటల్‌కు చేరుకున్నారు. తరువాతి రోజు కూడా రాధకి స్పృహ రాలేదు. వెంటనే విజయా హాస్పిటల్‌కు మార్చారు. సుబ్బులక్ష్మి, సదాశివం బాధ అంతా ఇంతా కాదు. విజయా హాస్పిటల్ వైద్యులు వెంటనే అన్నిరకాల పరీక్షలు మొదలుపెట్టారు. డా॥చెరియన్ సదాశివాన్ని తన గదికి పిలిచాడు, “సదాశివం ఇంత ఆలస్యం చేశారేంటీ... అసలు పరిస్థితి అర్థంకావటంలేదు. రాధ కోమాలోకి వెళ్లింది.”

ఏడ్చేశాడు సదాశివం. తన తొలి బిడ్డ, గారాలపట్టి రాధ దగ్గరకు వచ్చాడు.

“ఏమంటున్నారు మామా?” ఆదుర్దాగా అడిగింది సుబ్బులక్ష్మి.

“రాధ ఏమన్నా ఆరోగ్యం బాగోలేదని చెప్పిందా కుంజమ్మా.....”

“లేదు మామా, లండన్‌లో కచేరీకి ముందంతా దగ్గుతో బాధపడింది అంతే, ఇంకే బాధా ఉందని చెప్పలేదు.”

“ఏం మామ ఏమంటున్నారు డాక్టర్లు, ఇంకా స్పృహరాదే రాధకు......” సదాశివం మళ్లీ కన్నీళ్లపర్యంతమయ్యాడు. సుబ్బులక్ష్మికీ ఏడుపు ఆగటంలేదు.. సదాశివం ధైర్యం తెచ్చుకొని “ఇంకా పరీక్షలు చేస్తున్నారు కుంజమ్మా..... ఎందుకో ఏంటో కనుక్కుంటారు, నువ్వు ధైర్యంగా ఉండు.....” అంటూ సుబ్బులక్ష్మిని సముదాయించాడు.

మెల్లగా వైద్యులు కనుక్కున్నదేమంటే, రాధ చిన్నప్పుడు ఒకసారి అనారోగ్యం బారిన పడినప్పుడు టిబి వ్యాధి కారిణియైన బాక్టీరియా రాధ శరీరంలోకి చేరి, ఇప్పటికి మళ్లీ బయటపడి ఉంటుందని. ఇక ఆ ప్రకారంగా చికిత్స మొదలుపెట్టారు. ఒక వారం గడిచింది, రాధ ఇంకా కోమాలోనే ఉంది. సుబ్బులక్ష్మి ఇరవైనాలుగు గంటలూ రాధ పక్కనే ఉండి సపర్యలు చేస్తుంది. సుబ్బులక్ష్మి రాధ దగ్గరకు చేరేసరికి, రాధకు సరిగ్గా రెండేళ్లు, చంటిపిల్లలకు చేయవలసిన సపర్యలు దాటి వచ్చిన వయస్సు. ఇప్పుడు రాధ చంటిపిల్లలా మంచముమీదే ఉన్న ఈ సమయంలో సుబ్బులక్ష్మి స్వయంగా అన్ని పనులు చేస్తూ తల్లిగా ఆ కొదవ కూడా తీర్చుకుంది. సుబ్బులక్ష్మికి, రాధకు రక్తసంబంధం లేకపోయినా అంతకుమించి అనురాగ బంధం వీరిది. చిన్నప్పుడు సదాశివం దెబ్బల నుంచి కాపాడటానికి రాధని సుబ్బులక్ష్మి తన వెనుక దాచి పెట్టుకుంటే రాధ పెద్దదయిన తర్వాత సదాశివం కోపం నుంచి తల్లిని కాపాడుకుంటూ వచ్చింది. ఒకసారి నారాయణ్ మెనన్ ఒకరికి సుబ్బులక్ష్మిని రాధని పరిచయం చేస్తూ “ఈమె సుబ్బులక్ష్మిగారు. రాధ సవతితల్లి” అని పరిచయం చేస్తే, సుబ్బులక్ష్మి పదిరోజులు బాధపడింది ఆ పిలుపుకి.

రాధకి పదేండ్ల వయసప్పటి నుంచి కచేరీలలో తన పక్కన కూర్చుంటుంది. నలభై ఏళ్ల బంధం తనదీ రాధది. ఎప్పుడూ కళకళలాడుతూ తిరుగుతూ ఉండే రాధ ఈ రోజు ఇలా కదలిక లేకుండా ఉండటం, సుబ్బలక్ష్మికి తీవ్రమైన వేదనను కలిగిస్తున్న విషయం.

సంగీతం ఆరోగ్యం చేకూరుస్తుందనే నమ్మకంతో రాధ ప్రక్కనే కూర్చొని ఎప్పుడూ పాటలు పాడుతూ ఉంది సుబ్బలక్ష్మి. తంగం, ఆనంది, విజయ, మంగళం వీరంతా ఒకరి తర్వాత ఒకరు హాస్పిటల్‌లో ఉంటూ ఉన్నా సుబ్బలక్ష్మి మాత్రం ఎప్పుడూ రాధతోనే. ఒకరోజు సుబ్బలక్ష్మి పాట పాడుతూ ఉండగా, అందరినీ ఆశ్చర్యపరుస్తూ ఒక సంఘటన జరిగింది. రాధ తన కాలి మెట్టెతో మంచం కోడుకేసి కొడుతూ తాళం వేస్తుంది. సుబ్బలక్ష్మి ఆనందంతో ఇంకా పాట గట్టిగా పాడటం మొదలుపెట్టింది. రాధ కాలి మెట్టెతో తాళం వేస్తూనే ఉంది. ఒకరిద్దరు పరిగెత్తుకుంటూ వెళ్లి డాక్టర్‌ను పిలుచుకు వచ్చారు. డాక్టర్లు కూడా ఆశ్చర్యపోయారు.

కోమా స్థితి నుంచి పెద్దగా మార్పు లేకపోయినా సుబ్బలక్ష్మిని పాటలు అలా పాడుతూ ఉండమని చెప్పి వెళ్లారు. రాధ కోమాలో ఉన్నప్పుడే ఒక ఆపరేషన్ చేశారు.

మొత్తానికి నలభైఎనిమిదవ రోజు, సుబ్బలక్ష్మి సదాశివం, కుటుంబ సభ్యులు, మిత్రుల దైవప్రార్థనలవల్ల రాధ స్పృహలోకి వచ్చింది. ఇంకొక వారం రోజులకి ఇంటికి వచ్చింది.. అందరూ భోజనం చేస్తున్నారు. ఆనంది రాధని సదాశివంవైపు చూడమని సైగ చేస్తుంది. మామూలుగానే భోజనం చేస్తున్న సదాశివంని ఒకసారి చూసి ఏమీ అర్థంకాక ఎందుకు చూడమన్నావు అన్నట్లు చూసింది ఆనందివైపు.

"బాబాయి ఈరోజే భోజనం చేస్తుంది, నువ్వు హాస్పిటల్‌లో ఉన్న నలభైఎనిమిది రోజులు వట్టి మజ్జిగ తాగారంతే" అని చెప్పింది. రాధ వెంటనే సదాశివం దగ్గరకు వచ్చి "నాన్నా!" అంటూ వాలిపోయింది, అక్కడున్నవారి అందరి కళ్లు చెమ్మగిల్లాయి.

1982లో లండన్ నుంచి వచ్చిన తర్వాత నుంచి పది నెలలు దాకా సుబ్బలక్ష్మి ఎలాంటి కచేరీలు చేయలేదు. రాధ ప్రక్కనే ఉంటూ, రాధ కోసం పాటలు పాడుతూ ఉంది. 1982 మే నెలలో కోమాలోకి వెళ్లిన రాధ మళ్లీ జులై నెలలో స్పృహలోకి వచ్చింది. మెల్లగా కోలుకుంటుంది. 1983కల్లా ఫర్వాలేదనిపించింది. ఎక్కువ విశ్రాంతిలో ఉండటంవల్ల ఒళ్ళుచేసింది. సదాశివం 1983 మార్చిలో ఎప్పటి నుంచో వెనక్కు పడిపోయిన ఒక ముఖ్యమైన కచేరీకి ఒప్పుకున్నాడు. అమెరికాలోని హూస్టన్ నగరంలో మీనాక్షి ఆలయం కట్టడానికి నిధులు సేకరించటానికి జరగాల్సిన కచేరీ అది. మద్రాసు మ్యూజిక్ అకాడమీలోని ఆడిటోరియమ్‌లో కచేరీ జరుగుతుంది. సుబ్బలక్ష్మికి గాత్రసహకారాన్ని అందించటానికి ఒక అందమైన యువతి సుబ్బలక్ష్మి ప్రక్కన ఉంది. అయినా సుబ్బలక్ష్మి అందం, తేజస్సు ముందు ఎంతటి అందగత్తైనా తేలిపోవలసిందే.



ఈ అందమైన యువతి పేరు గౌరి. ఆనంది కూతురు. కచేరీ జరుగుతుండగా.... ఒక శ్రోత వేదికవైపు నిర్లిప్తంగా చూస్తున్నాడు. పక్కనున్న అతనితో, "ఎమ్.ఎస్.ని ఒక్కదాన్నే వేదికమీద చూస్తుంటే చంద్రుడు లేని ఆకాశాన్ని చూస్తున్నట్లుంది" అని అన్నాడు.

"అవును అలాగే ఉంది ఎమ్.ఎస్. ప్రక్కన రాధ లేకపోతే ఏదో వెలితిగా ఉంది" అని బదులిచ్చాడు పక్కనతను. అలా కచేరీ జరిగిపోతూ ఉండగా హఠాత్తుగా వేదిక మీద తెర మూసివేశారు. శ్రోతలందరూ, "ఏంటీ, ఏమైందీ.. కచేరీ మధ్యలో ఆపి తెర లాగారెందుకు.... ఏమయింది....." అని ఆదుర్దా పడుతూ ఎవరికి తోచిన సమాధానం వారిచ్చుకుంటున్నారు.

కాసేపటికి తెర తీయబడింది. ఆశ్చర్యం! ఆకాశంలోకి నెలవంక వచ్చేసింది. తల్లి ప్రక్కకు బిడ్డ వచ్చేసింది, ఎమ్.ఎస్. ప్రక్కన రాధ చేరింది.

శ్రోతలు ఆనందంతో చప్పట్లు కొడుతూ లేచి నుంచుని రాధకు స్వాగతం పలికారు. తన పట్ల, మద్రాసు వాసులు చూపుతున్న ఈ అనురాగాన్ని చూసి రాధ ఆనందబాష్పాలు కార్చింది.

కచేరీ మళ్లీ మొదలైంది. కాసేపు మామూలుగా కూర్చున్న రాధ ఆ తర్వాత ఒక కాలు చాపుకు కూర్చుంది. రాధ మెల్లగా మామూలు మనిషైంది కానీ కాస్త నెమ్మదించింది. అంతకు ముందు రాధ కాదు.

ఈ కచేరీ తర్వాత సదాశివం ఎలాంటి కచేరీలకి ఒప్పుకోలేదు. రాధే కుటుంబానికంతటికీ కేంద్రబిందువు అయింది. రాధ దగ్గర ఎక్కువ కాలం గడుపుతున్నారు. యాభైఏళ్ల తర్వాత వచ్చిన తీరిక. కాని కలతతో నిండియున్న తీరిక. రాధను చూస్తేనేమో పెద్ద దెబ్బ తట్టుకుని కోలుకుంటుంది కానీ రాధ ముగ్గురు పిల్లల్లో ఆఖరి బిడ్డ ఆడపిల్ల. ఈ అమ్మాయి మానసికంగా ఎదగని పిల్ల. సుబ్బలక్ష్మి రాధ ఆరోగ్యం, ఈ తెలియని పిల్లని తలుచుకొని బాధపడుతోంది.

ఎనిమిది నెలల విరామం తర్వాత సుబ్బలక్ష్మి 'శంకర నేత్రాలయ' అనే ప్రముఖ వైద్యశాలకు రెండు లబ్ధి కచేరీలు చేయటానికి ఒప్పుకుంది. ఒక లబ్ధి కచేరీ బొంబాయిలో జరిగింది. రెండు నెలల తర్వాత కలకత్తాలో ఇంకో కచేరీ ఉండబోనుంది.

సుబ్బలక్ష్మి ఇంటిలో ఫోను మ్రోగింది.

"మామా! జి.డి. బిర్లాగారు" అంటూ హడావుడిగా ఫోను ఇచ్చాడు ఆత్మ.

"ఓం నమఃశివాయ" అంటూ ఫోన్‌లో పలకరించాడు సదాశివం.

సదాశివం ఫోన్లో పంచాక్షరితో పలకరించటం ఎప్పటినుంచో అలవరచుకున్నాడు. జి.డి. బిర్లా, దేశంలో అతి పెద్ద వ్యాపార సామ్రాజ్యమైన బిర్లా గ్రూప్‌కి అధిపతి. గాంధీజీకి

అతి సన్నిహితుడైన జి.డి. బిర్లా రాజాజీ ద్వారా సదాశివంకు పరిచయం. కల్కి బంగ్లాకి కూడా విచ్చేసి సదాశివం ఆతిథ్యం పొందాడు. ఇప్పుడు సుబ్బులక్ష్మి సదాశివం కలకత్తా వస్తున్నారని తెలుసుకొని స్వయంగా తన ఇంటికి ఆహ్వానించటానికి ఫోన్ చేశాడు.

"తప్పకుండా ఇంటికి రండి చక్కగా కాలక్షేపం చేద్దాం. వీలైతే ఒక కచేరీ పెట్టుకుందాం" బిర్లా ఆహ్వానాన్ని ఆనందంగా స్వీకరించాడు సదాశివం. కలకత్తాలో శంకర నేత్రాలయ కచేరీకి ముందు జి.డి. బిర్లా బంగ్లాలోని తోటలో బిర్లా కుటుంబీకుల కోసం కచేరీ ఏర్పాటయింది. పచ్చగా, గుబురుగా, ఏపుగా పెరిగిన చెట్ల మధ్య వేదిక ఏర్పాటు చేశారు. ముదురు పసుపుపచ్చని పట్టుచీరలో అరవైఏడేళ్ల వయస్సులో, సుబ్బులక్ష్మి మొహంలో గొప్ప తేజస్సుతో చూపు మరల్చుకోలేనంత సౌందర్యం ఉట్టిపడుతుంది.

కచేరీ మొదలుపెట్టే ముందు 'పాడగలవా రాధా' అన్నట్లు చూసింది రాధవైపు. రాధ మునుపటి రాధ కాదు, చూపులకే చురుగ్గా కనిపించే రాధ ఇప్పుడు మన్నుతిన్న పాములాగుంది. 'గుంఘురు బాంధ్ పద్ ఆయీ మీరా..' అనే భజన పాడటం మొదలుపెట్టింది సుబ్బులక్ష్మి. రాధ అప్పుడప్పుడు పాడుతుంది, అప్పుడప్పుడు ఆగిపోతుంది, ఇంకోసారి అనూహ్యంగా చరణాన్ని ఎత్తుకుంటుంది. సుబ్బులక్ష్మి కూతురువైపు ఆదుర్దాగా అప్పుడప్పుడు తిరిగి చూసుకుంటుంది. కచేరీలలో ఇలా రాధని కనిపెట్టుకోవడం, సరిగ్గా పాడుతుందా లేదా అని చూసుకోవటం ఎప్పుడో చిన్నతనంలో తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నప్పుడు చేసిన పని. మళ్లీ ఇన్నాళ్లకు చేయాల్సి వచ్చింది.

అప్పుడప్పుడు రాధను చూసుకుంటూ పాడుతుంది సుబ్బులక్ష్మి. చిరతలు వాయిస్తూ, పల్లవి, మొదటి చరణం భక్తిపారవశ్యంతో పాడుతుంది. రెండవ చరణంలోకి వచ్చింది. ఇక్కడొక అనుకోని విషయం జరిగింది. రెండవ చరణంలోని ముగింపు పంక్తి సుబ్బులక్ష్మి ఐదుసార్లు పాడింది. ఇది పెద్ద విషయమేమీకాదు. ఈ పాటలోని పల్లవి పంక్తులు ఒక్కొక్కటి ఆరుసార్లు పాడింది. ఇప్పుడు ఈ పంక్తిని పదేపదే పాడుతున్న కారణాలు వేరు. పాట సరళి కూడా తేడాగా ఉంది. ఈ పంక్తికి కొనసాగింపుగా మొదటి చరణంలోని పంక్తి పాడుతుంది రాధ. ఐదుసార్లు 'ఝునన ఝునన పద్ గుంఘురూ బాజే...' అని పాడి సుబ్బులక్ష్మి తల దించుకొని ఆగిపోయింది. ఇదీ విషయం. సుబ్బులక్ష్మి తన కచేరీలలో ఎప్పటికీ జరగకూడదనుకునే విషయం. ఇప్పటిదాకా జరగని విషయం.

సుబ్బులక్ష్మి తన కచేరీ జీవితంలో మొట్టమొదటిసారిగా పాట మధ్యలో మరిచిపోయింది. దాదాపు ఒక సంవత్సరంన్నర సాధనకు దూరంగా ఉండటము, మనస్సు అన్యాక్రాంతమవడంతో అరవై ఏళ్లలో మొట్టమొదటిసారిగా కచేరీలో పాట మర్చిపోయింది. ఇప్పుడు శ్రోతలు గమనించారు, 'అయ్యో, పాపం సుబ్బులక్ష్మికి పాట గుర్తొస్తుందా లేదా..'



అని ఉత్కంఠతో చూస్తున్నారు. రాధ మాత్రం 'అమ్మా, నన్ను ఈ విషయంలో ఇన్వాల్వ్ చేయొద్దు' అన్నట్లు ఎటో చూస్తుంది. రాధకి కూడా తరువాతి వరస గుర్తుకు రాలేదు. కానీ ఈ చరణాన్ని మొదట్లో అందుకుంది రాధే...... సుబ్బులక్ష్మి ఇంకోసారి ప్రయత్నం చేసింది.

'ఝునన ఝునన పద్ గుంఘురూ బాజే.....'

రాధ అంతకు ముందులానే వెనక చరణంలో పంక్తి పాడుతూ పాటని సాగనిస్తుంది. పక్క వాద్య కళాకారులు అదే లయ మీద వాయిస్తున్నారు. అందరి చూపులూ సుబ్బులక్ష్మివైపే.... సుబ్బులక్ష్మి ఇలా కచేరీలో అందరిముందు మర్చిపోయినందుకు సిగ్గుతో తల్లడిల్లిపోతుంది. ఆరవసారి మెల్లగా తనలో తను పాడుకుంది, ఫలితం లేదు. ఏదో గుర్తుకు వచ్చింది. 'ఉహూం...' అనుకుంటూ తల అడ్డంగా తిప్పుకుంది. ఇక పరిసరాలను పూర్తిగా మర్చిపోయి, 'ఝునన ఝునన పద్ గుంఘురూ బాజే...' అంటూ ఆలాపన చేసుకుంది. గుర్తొచ్చింది. 'అవును, ఇదే' అని అనుకున్నట్లు తల నిలువుగా ఊపి, రాధవైపు తిరిగి సరియైన పాట వరుస మొదలుపెట్టింది. రాధ ఏదో పాడబోయేదల్లా రక్కున నోరుమూసి, అమ్మ పాడుతున్న వరుస అందుకుంది. సుబ్బులక్ష్మికి పాట గుర్తొచ్చినప్పుడు, 'ఇదే కదా రాధ' అన్నట్టు రాధవైపు చూసినప్పుడు రాధ చిన్నపిల్లలా 'అవునమ్మా, భలే గుర్తుతెచ్చుకున్నావ్! భలెభలే!' అన్నట్లు నవ్వుకుంది. ఇక పాట తనకే గుర్తొచ్చినట్లు పాడుకుంటూపోయింది.

గత ముప్పై సంవత్సరాల నుంచి రాధ సుబ్బులక్ష్మికి గాత్ర సహకారం అందిస్తూ వస్తుంది. తోడుగా, వంతుగా పాడుతూ సహకార గాత్రానికి మారుపేరు అయ్యింది. సుబ్బులక్ష్మి సాంగత్యంలో రాధ సంగీతాన్ని బాగా ఆపోశన పట్టింది. సదాశివం ఒకసారి ప్రశ్న అడిగి సమాధానం కూడా అతనే చెప్పాడు.

"ఏం రాధా..... నీకు ఒక్కదానివే కచేరీ చేయాలని ఉందా..... నువ్వు కూడా గాయకురాలివి అవుతావా......" అని అడిగాడు. రాధ సమాధానం చెప్పేలోపలే, "రాధా, నువ్వు మీ అమ్మకి ఎప్పుడూ కచేరీలో తోడుగా ఉండాలి. మీ అమ్మ పక్కనే ఉండు" అని చెప్పాడు కూతురికి.

"సరే నాన్న, అలాగే ఉంటాను. అమ్మ ప్రక్కనే ఉంటాను" అంది రాధ. రాధ ప్రక్క గాయనిగా కాకుండా ఒంటరిగా ఎదగగలిగిన విద్వత్తు ఉంది. కాని, అమ్మకే సేవచేయదలచుకుంది.

సుబ్బులక్ష్మి ప్రక్కన కూర్చొని సుబ్బులక్ష్మికంటే తక్కువ శ్రుతిలో పాడుతుంది. అసలు పాడుతుందా లేదా అని అనిపిస్తుంది. కానీ, ఏ కారణం చేతనైనా సుబ్బులక్ష్మి ఓ రెండు

క్షణాలు ఆగినా, పాట ఆగదు, రాధ గొంతు వినిపిస్తుంది. అమ్మ, నాన్న చెపితే తప్ప అమ్మకంటే గొంతు ఎప్పుడూ పెంచదు. అలాంటి రాధ ఈ రోజు ప్రక్కగాయనిగా నిరాశపరచింది. సదాశివం చాలా బాధపడుతున్నాడు. ఆ బాధలో దారి చూపిస్తాడేమోననుకొని, కొత్తగా కొలుస్తున్న స్వామి దగ్గరకు వచ్చారు.

"రాధకు నీమీద చెడు అభిప్రాయం ఉంది" అన్నాడు సుబ్బలక్ష్మితో.

సర్వాంతర్యామి అయినట్లు మళ్లీ ఒక రాయి వేశాడు. భయంకరంగా గురి తప్పింది. ముగ్గురి గుండెల్లో గాట్లు పెట్టింది. రాధ బాగా పెద్దదయినప్పుడుగానీ తెలియలేదు, సుబ్బలక్ష్మి తన కన్నతల్లి కాదని. తెలిసినా మనస్సు నమ్మనంది. సుబ్బలక్ష్మి చేతుల్లో అల్లారుముద్దుగా పెరిగింది. మంచం మీద ఉన్న మూడునెలలు కంటికి రెప్పలా చూసుకుంది. రాధకు తల్లిమీద ఏమి అభిప్రాయం ఉందో రాధకు తెలుసు, సుబ్బలక్ష్మికి తెలుసు, సదాశివంకు తెలుసు. సర్వాంతర్యామి అని పిలిపించుకోవాలనే తపనతో ఆ కాషాయ వేషధారి ఆ రాయి వేశాడు. సుబ్బలక్ష్మి పరిస్థితి, ఒక ప్రామాణికమైన పరిస్థితి. ఉదాహరణగా మనం మన తల్లిదండ్రులను ఆరాధించినంతగా ఇంకొక వ్యక్తిని ఆరాధిస్తూ ఉంటాం. ఒకరోజు ఆ వ్యక్తి మన ప్రేమకు, ఆరాధనా భావానికి యోగ్యుడు కాదని తెలుస్తుంది. కానీ, అప్పటిదాకా అతనినే నమ్మిన మనస్సు రక్తమోడుతుంది, నమ్మకం వమ్మయినదని చెప్పుకోవటానికి, మనస్సు రాదు. ఇక ఆ బంధం కాస్త పెరిగిన దూరంతోనయినా పదుగురిముందు అలా నడుస్తూనే ఉంటుంది. అలాంటి కాషాయ వేషధారులకు ఇలాంటి వారి బలహీనతలే ఆధారం.

**మనుజుడై పుట్టి మనుజుని సేవించి**
**అనుదినము దుఃఖమందనేల**
**జుట్టెడు కడుపుకై చొరని చోటుజొచ్చి**
**పట్టెడు గూటికై బతిమాలి...      ॥మ॥**

*అన్నమయ్య (క్రీ.శ. 1408-క్రీ.శ.1503) కీర్తన, రాగం - ఆభోగి, తాళం - ఆది*

తంజావూరు బృహదీశ్వరాలయం ప్రాకారం లోపల సుబ్బలక్ష్మి కచేరీ చేస్తోంది. నాలుగు తరాల ముందు తన పూర్వీకులు ఈ ఆలయంలో దేవుడికి సేవలు చేసి ఉండవొచ్చు. బాలసరస్వతి పూర్వీకులు ఈ ఆలయ నర్తకీమణులే. తంజావూరులో వేయ్యేళ్ల క్రితం రాజరాజచోళుని హయాంలో ఈ బృహదీశ్వరుడు నాలుగువందల మంది దేవదాసీల నృత్యగానాలతో అలరారాడు. ఈ ఆలయం నృత్యగాన కళలకు కేంద్రమైంది. ఘనమైన గతాన్ని పునరావృత్తం చేస్తూ తమిళనాడు ప్రభుత్వం తంజావూరు సాంస్కృతికోత్సవం ఏర్పాటు చేసింది. ఇప్పుడు ఈ ఆలయంలో దేవునికి తన సంగీతంతో సేదతీరుస్తూ తన జాతి ధర్మం పాటిస్తుంది ఈ దేవదాసి. రాత్రి బాగా చీకటి పడేదాక కచేరీ చేసి, వెయ్యిమందికి తగ్గకుండా ఉన్న జనంలోనుంచి, తనను ఒక్కసారైనా చూడాలనుకొని, తనవైపు



తోసుకొస్తున్న జనం నుంచి మెల్లమెల్లగా దాటుకుంటూ తన విడిదికి చేరుకుంది. స్నానం చేసి, భోజనాలయ్యి ఇక పడుకుందాం అనుకుండగా, తలుపు మోగింది. ఎవరో తలుపు కొడుతున్నారు. "ఎవరో చూడు గౌరీ" అంది సుబ్బలక్ష్మి. తలుపు తీసి చూస్తే భార్యాభర్తలిద్దరు, ఏదో ఒక పల్లెటూరు నుంచి వచ్చినట్లున్నారు. అలసిపోయి దుమ్ముకొట్టుకుపోయి ఉన్నారు. సుబ్బలక్ష్మిని చూడగానే అమితానందంతో, "మీ పాట వినాలని మేము మా ఊరి నుంచి ముప్పైమైళ్లు నడిచి వచ్చాం. కానీ మేమొచ్చేసరికే మీ కచేరి అయిపోయింది" అని చెప్పారు. సుబ్బలక్ష్మి వెంటనే వాళ్లని లోపలికి పిలిచింది. "గౌరీ, మామ గది తలుపు గట్టిగా వేసిరా" అంది. గౌరి తలుపు వేసొచ్చింది. "గౌరీ మనం వీళ్లకోసం ఒక పాట పాడదాం, పాపం అంత దూరం నుంచి వచ్చారు" అంది. గౌరికి కళ్లు తిరిగాయి, అసలే కళ్లు మూసుకుపోతున్నాయి, ఇన్నిన్ని గంటలు సుబ్బలక్ష్మికి తంబూర వేయటం, వంత పాడటం గౌరికి అస్సలు అలవాటు లేదు, రాధకి జబ్బు చేసిన తర్వాత, రాధ ఎప్పుడు రాలేకపోతే అప్పుడు గౌరి సుబ్బలక్ష్మికి తోడువస్తుంది.

"బామ్మా, యిప్పుడు టైమ్ ఎంతైందో తెలుసానీకు? పన్నెండైంది. మనం ప్రొద్దున్నే మళ్లీ బయలుదేరాలి."

"ఫరవాలేదులే గౌరీ, తంబూరా తీసుకురా" అంటూ క్రింద కూర్చొంది.

సుబ్బలక్ష్మికి తన పాట వినాలనుకునేవారు ఎవరైనా సరే, భగవంతుడితో సమానం. తన అరవైఎనిమిదేళ్ల సంగీత యాత్రలో కొన్ని వందలకుపైగా కచేరీలు చేసి ఉంటుంది, కానీ ఏనాడూ తన శ్రోతలని తేలికగా తీసుకోలేదు. ఒకసారి ఒక ఐదేళ్ల పాప పాడమని అడిగింది, ఒళ్లో కూర్చోపెట్టుకుని పాడి వినిపించింది. సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చే దేశాధినేతలు, మహారాజులు వచ్చి పాట పాడించుకొని వింటుంటారు. వారి కోసం ఎలా పాడుతుందో, ఇందాక కచేరీలో ఎలా పాడిందో అలానే ఈ ఇద్దరి పామరుల కోసం అలానే శ్రద్ధగా పాడింది. రెండు పాటలు విని, ఆ దంపతులు తృప్తిగా, ఆనందంగా ఇంటికి తిరిగి వెళ్లారు. సదాశివం లేచి ఉంటే వీళ్లు ఎప్పుడో ఇంటికి, పాట కంచికి పోయి ఉండేది.

𝄞 𝄞

టెలివిజన్ సుబ్బలక్ష్మిని ప్రజలకి ఇంకా చేరువ చేసింది. రేడియోలో ఆమె పాట విన్నవారు, ఆమె గొంతుకి, విద్వత్తుకి దాసోహం అయితే టి.వి.లో చూసినప్పటి నుంచీ, ఆమె మనోహరమైన రూపు అందరిని సమ్మోహనపరుస్తుంది. 1979 నుంచీ సుబ్బలక్ష్మి టి.వి. కార్యక్రమాలలో కనిపిస్తూ ఉంది. ఇప్పుడు 1984 వచ్చేసరికి, ఈపాటికి భారతదేశంలో టి.వి.లు కొనేవాళ్ల సంఖ్య కూడా పెరిగి, సుబ్బలక్ష్మిని ఆరాధించేవాళ్ల సంఖ్య కూడా విపరీతంగా పెరిగిపోయింది.

1984 త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు టి.వి.లో నేరుగా ప్రసారం చేస్తున్నారు. ప్రతి సంవత్సరం సుబ్బలక్ష్మి ఈ ఉత్సవానికి వస్తుంది. ఆరాధన రోజున కాషాయపు రంగు పట్టుచీరలో ఉన్న సుబ్బలక్ష్మి ఘనపంచరత్న కృతులు ఆలపిస్తూ కనిపిస్తోంది. ఆరాధనోత్సవం తరువాత చాలామంది పెద్దపెద్ద విద్వాంసులు తిరువైయ్యారులో కచేరీలు చేస్తారు. ఆ కచేరీలు కూడా టి.వి.లో ప్రసారం చేస్తున్నారు. కచేరీలో ఒక్కొక్క విద్వాంసుడు ఒక్కొక్కలాగా ప్రవర్తిస్తూ ఉంటాడు. టెలివిజన్ ప్రేక్షకులు అందరినీ గమనిస్తున్నారు. ఒక విద్వాంసుడు, మధ్యలో ఉండి కచేరీ మొదలుపెట్టినవాడు మెల్లగా ఎడమ చేతివైపు వయొలిన్ మాస్టారు దగ్గరకి వెళ్లిపోతాడు, 'మాస్టారు ఏంటీ, నా వొళ్లో కూర్చుంటారా....' అన్నట్లు ఆ వయొలిన్ విద్వాంసుడు చూస్తే మెల్లగా వచ్చిన దారినే జరుగుకుంటూ వెళ్లివెళ్లి ఈసారి మృదంగం మాస్టారు దాకా వెళతాడు.... అలా కచేరీ అంతసేపు తేలులాగా తిరుగుతూ ఉంటాడు.

ఇంకొక విద్వాంసుడిది కర్ణాటక సంగీత కచేరీ కాదు. సాక్షాత్తు హరికథా కాలక్షేపమే. శరీరాన్ని రుబ్బురోలుగా తిప్పుతూ ఉంటాడు, ఆ రెండు చేతులలో చేయగలిగిన విన్యాసాలన్నీ చేస్తాడు. ఎదురుగా కూర్చున్న శ్రోతలని మధ్యమధ్య రెచ్చగొడుతూ ఉంటాడు. వాళ్లకి పందేలు విసురుతూ ఉంటాడు.

ఇంకొక విద్వాంసుడు తొడమీద అలుకుతున్నట్లు తాళమేసుకుంటూ, బావిలోంచి నీళ్ల బిందె తోడుతున్నట్లు రాగాన్ని తోడుతూ ఉంటాడు.

కొంతమంది విద్వాంసులు రాగం ఎన్ని మెలికలు తిరుగుతుందో అన్ని మెలికలూ రాగంతోపాటు తిరిగిపోతారు.

ఒక విద్వాంసుడైతే గొంతులో పలికే రాగాలు, సంగతులని ఎదురుగా ఏదో పలక పెట్టినట్లు దానిమీద చేతులతో రాసేస్తూ ఉంటాడు.

ఇంకొకరు 'బాబోయ్, నువ్వు ఇంకాసేపు పాడితే నీకు గుండెపోటు వచ్చేలా ఉంది, నువ్వు పడుతున్న కష్టానికి' అని అనిపించేలా పాడుతారు.

ఒకళ్లయితే, అతను చూపే చిత్రవిచిత్రమైన హావభావాలకి, "నాయనా, నువ్వు పాడుతుంటే చూడలేము, వినగలం అంతే, నీకు రేడియోనే మహబాగు" అని అనిపించేలా ఉంటుంది.

ఇక విదుషీమణుల విషయానికి వస్తే, వసంతకుమారి, పట్టమ్మ చీర భుజాల చుట్టూ నిండుగా కప్పుకొని కదలకుండా, మెదలకుండా తమపని తాము చేసుకుంటూపోతారు.

ఇలా రకరకాల విద్వాంసులని చూసిన టి.వి. ప్రేక్షకులకి సుబ్బలక్ష్మి పాటపాడుతూ చూడటం ఒక గొప్ప అనుభూతి. ఎంచలేని ముఖారవిందం. పాట అందుకుందంటే ఇక ఎవరితోనూ సంబంధం పెట్టుకోదు. పక్కవాద్య కళాకారుని చూసి నవ్వటం, వాళ్లని



సరిచేయాలనుకోవటం అలాంటివేవీ చేయదు. ఆమెకు జన్మతః సిద్ధించిన వరం వల్ల ఎంతటి క్లిష్టమైన రాగాన్ని పాడుతున్నా మొహం భయపెట్టే సంకోచ వ్యాకోచాలు చూపదు. ఎంత పైస్థాయికి వెళ్లినా ఆమె ముఖ కవళికలు అంతే చూడబుద్ధవులాయి. వేదికమీద రెండు తంబూరల మధ్య సరస్వతియై సుబ్బలక్ష్మి, పక్కవాద్య కళాకారులతో కానీ, శ్రోతలతోకానీ ఎలాంటి సంభాషణలు జరపకుండా నేరుగా భగవంతుడితోనే మాట్లాడుతూ ఉంటుంది. ఇప్పుడు టి.వి.లో కనిపిస్తుందని కాదు, సుబ్బలక్ష్మి ఎప్పుడూ పాడే తీరే అది. భగవంతుడి కోసం పాట, అందమైన సుబ్బలక్ష్మి అందంగా పాడుతుంటే, టి.వి.లో వీలున్న ప్రతిసారీ ప్రసారం చేస్తుంటే, సుబ్బలక్ష్మికి దేశవ్యాప్తంగా అభిమానులు హెచ్చుమీరుతున్నారు. మైకు ఒకప్పుడు తనకెలా మేలు చేసిందో ఇప్పుడు టి.వి. అలా తన కీర్తిని ఇంకా ఇనుమడింప చేసింది.

𝄞𝄞𝄞𝄞

అమ్మ కడుపు చల్లగా రాధ కోలుకొని అమ్మతో మళ్లీ కచేరీలలో పాడుతుంది. కాని సుబ్బలక్ష్మికి ఒక కష్టం తర్వాత ఇంకొక కష్టం తప్పటంలేదు. రాధకు హఠాత్తుగా వచ్చిన అనారోగ్యం క్రుంగదీసినా తన భక్తితో, దేవుడి మీద భారంవేసి నెట్టుకు వచ్చింది. సుబ్బలక్ష్మికి మళ్లీ రెండు ఎదురు దెబ్బలు తగలనున్నాయి. 1984 ఫిబ్రవరిలో తన బాల్యస్నేహితురాలు బాల చనిపోయింది. బాలా! బాలసరస్వతి!! ఎగ్మోర్‌లో బాలా ఇంటికి వచ్చింది సుబ్బలక్ష్మి. 'బాలా, తన అతి సన్నిహితమైన స్నేహితురాలు... తను నలుగురిలో గొంతు ఎత్తకపోయినా, బాలా దేవదాసీల పట్ల జరుగుతున్న అన్యాయాలకు, చులకన చూపులకూ ఎదురొడ్డి తమ జాతి పేరు కడదాకా ఎలుగెత్తి చాటిన బాలా.' బాలాని విడవలేక విడిచింది సుబ్బలక్ష్మి. ఈ సంవత్సరం ఆఖరున ఇంకొక మిత్రురాలి వియోగం భరించాల్సి వచ్చింది సుబ్బలక్ష్మికి. ఇందిరాగాంధీ హత్యగావించబడింది. ఆ సంతాప రోజుల్లో సుబ్బలక్ష్మి దూరదర్శన్‌లో భజనలు పాడింది.

వైరాగ్యానికి చిహ్నమైన రంగు చీరలో, నుదుటి మధ్య ఒకే ఒక్క పెద్ద కుంకుమ బొట్టుతో, తలలో పూలు లేకుండా, తంబూర తప్ప ఇంకే పక్క వాద్యం లేకుండా పాడుతూ, భారత జాతిని ఈ సంతాప రోజుల్లో తన పాటతో ఊరడించింది.

**పునరపి జననం పునరపి మరణం**
**పునరపి జననీ జఠరే శయనం**
**ఇహ సంసారే బహు దుస్తారే**
**కృపయా పారే పాహి మురారే**

*ఆదిశంకరాచార్య ( క్రీ.శ. 8వ శతాబ్దం), రాగం-కాఫి, తాళం-ఆది*

𝄞𝄞

హైదరాబాద్ వజీర్ సుల్తాన్ టుబాకో ఇండస్ట్రీ ఛైర్మన్ కార్యాలయంలోకి ప్రముఖ ఫోటోగ్రాఫర్ టి.ఎస్.నాగరాజన్‌ను ఒక పెద్ద ఉద్యోగి తీసుకువెళ్లాడు.

"సర్, వీరినే ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మిగారి ఫోటోలు తీయటానికి ఎంపిక చేసింది."

పనిలో మునిగి ఉన్న ఛైర్మన్, "సదాశివంతో చాలా కష్టం, జాగ్రత్తగా చేసుకురండి.... ఆల్ ది బెస్ట్" అని పంపించేశారు.

బయటికి వచ్చి ఆ ఉద్యోగి దగ్గర మిగతా వివరాలు తీసుకుంటున్నప్పుడు, "అంత కష్టమా సదాశివంతో....." అని అడిగాడు నాగరాజన్.

"కష్టమేనంట.... మేము ఫోటోగ్రాఫర్ల కోసం చూస్తున్నప్పుడు ఒక డైరెక్టర్ దొరికాడు, ఆయన చెప్పాడు మాకు. గవర్నమెంట్ ఫిల్మ్స్ డివిజన్‌వాళ్లు ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మిగారి మీద డాక్యుమెంటరీ తీయటానికి పూనుకున్నారు. మొదలయ్యి రెండేళ్లు అవుతుంది, ఇప్పటిదాకా ఇద్దరు డైరెక్టర్లు మారారు కాని, ఆ డాక్యుమెంటరీ ఇంకా ఒక కొలిక్కి రాలేదు...."

"ఎందుకు" ఆత్రంగా అడిగాడు నాగరాజన్.

"సదాశివం అంక్షలకి, వీళ్లు సుబ్బులక్ష్మి గారిని మదురై తీసుకువెళ్తాము, అక్కడ గుడిదగ్గర తీస్తే బాగుంటుంది అంటారు. సదాశివం ఒప్పుకోడు, సుబ్బులక్ష్మి చేత మాట్లాడిస్తాము అంటారు. నన్ను అడగండి మీకు ఏం కావాలో, నేను చెప్తాను అంటాడంట. ఇంకా సాగుతూనే ఉందట ఆ డాక్యుమెంటరీ...."

"అలాగా..... చూస్తాను నా అదృష్టం ఎలా ఉంటుందో......" అనుకుంటూ వచ్చేశాడు నాగరాజన్.

మద్రాసు వచ్చి సుబ్బులక్ష్మి ఇంటికి ఫోన్ చేశాడు. సదాశివం గురించి చెప్పినట్లే, సదాశివం నిక్కచ్చిగా మాట్లాడి రేపు వచ్చి సెక్రటరీ ఆత్మతో మాట్లాడండి అని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

ఆ తరువాతి రోజు నాగరాజన్ తన భార్య మీనాక్షిని కూడా వెంటబెట్టుకొని సుబ్బులక్ష్మికి ఇష్టమైన మల్లెపూలు, పండ్లు తీసుకొని సుబ్బులక్ష్మి ఇంటికి వచ్చాడు. మీనాక్షి ఊరు సుబ్బులక్ష్మి ఊరు, మదురైనే. సుబ్బులక్ష్మి నుంగంబాకం ఇంటి ముందు ఒక చిన్న రేకుల షెడ్డు గదిలో ఆత్మ కూర్చొని ఉన్నాడు. నాగరాజన్ అతన్ని వి.ఎస్.టి. ఇండస్ట్రీ వాళ్లు ఎందుకు పంపారో చెప్పాడు.

"సుబ్బులక్ష్మిగారు పూజచేసుకుంటున్నారు, అయిన తర్వాత లోపలికి తీసుకువెళ్తాను, ఇదీ సంగతని ఆమెకు చెప్పండి, ఏమంటారో చూద్దాం......" అన్నాడు ఆత్మ.



అక్కడే వేచివున్న తర్వాత ఇద్దరినీ లోపలికి తీసుకువెళ్లాడు ఆత్మ. పూజ ముగించుకొని నేతచీరలో, చల్లని స్వచ్ఛమైన నవ్వుతో సుబ్బులక్ష్మి ముందు గదిలోకి వచ్చింది. వెనకే సదాశివం వచ్చాడు. నాగరాజన్ వచ్చిన పని సుబ్బులక్ష్మికి చెప్పాడు. వెంటనే సుబ్బులక్ష్మి క్రింద కూర్చొని విశాలంకు సైగచేసింది. విశాలం తంబూర తీసుకువచ్చి ఇచ్చింది.

"ఇప్పుడు తీసుకుంటారా ఫోటోలు?" అడిగింది సుబ్బులక్ష్మి. నాగరాజన్ సిగ్గుతో ముడుచుకుపోయి, కుర్చీలోంచి క్రిందకు దిగి, మోకాళ్లమీద పడిపోయి , "ఈరోజు కెమెరా తీసుకు రాలేదు. మీకు చెప్పి వెళ్దామని వచ్చాను" అంటూ గొణిగాడు.

సుబ్బులక్ష్మి భర్తవైపు చూసింది.

"సరే, ఎలాగూ తంబూర పట్టుకొని కూర్చున్నావు కదా, అప్పుడే లేవడం ఎందుకు..... ఒక పాట పాడు" అన్నాడు. సుబ్బులక్ష్మి నాగరాజన్‌వైపు చూసి "ఏం పాట పాడను" అని అడిగింది.

"మధ్యమావతి" అతనికి ఇష్టమైన రాగం పేరు చెప్పాడు.

'పాలించు కామాక్షి పావని' అనే శ్యామశాస్త్రి కృతి పాడి వినిపించింది.

అనుకోని వీనుల విందుకి నాగరాజన్ దంపతులు సంబరపడిపోయారు.

ఆ తరువాతి రోజు, ఫోటోలు తీయటానికి నిశ్చయించుకున్నారు. రాత్రికి బాగా ఆలోచించాడు నాగరాజన్, సుబ్బులక్ష్మి ఫోటోలు బాగా తీయాలి. అప్లికేషన్‌లకు పెట్టే పాస్‌పోర్ట్ సైజ్ ఫోటోలు, కెమెరావైపే చూస్తూ నిటారుగా నించున్న ఫోటోలు, గ్రూప్ ఫోటోలు కాకుండా బాగా తీయాలి అని నిర్ణయించుకున్నాడు.

ఆ తరువాతరోజు మళ్లీ భార్యతో సహా వెళ్లాడు. తలుపు కొట్టగానే సుబ్బులక్ష్మే తలుపు తీసింది. నమస్కారం చెపుతూ ఆహ్వానించింది. అప్పుడు తట్టింది, నాగరాజన్‌కు సుబ్బులక్ష్మిని రోజూ గమనిస్తూ, తను ఇంట్లో ఎలా పనులు చేసుకుంటూపోతుందో, ఆ క్షణాలని ఫోటో తీయాలని నిర్ణయించుకున్నాడు. ఫోటోల కోసం సుబ్బులక్ష్మిని కంచి పట్టుచీర కట్టుకోమన్నాడు. సుబ్బులక్ష్మి మీనాక్షిని తన గదిలోకి తీసుకువెళ్లి అల్మారా తెరచి, "ఏ చీర కట్టుకోనో చెప్పు" అంది. మీనాక్షి పెద్దగా కష్టపడనవసరంలేదు. అక్కడ సరిగ్గా ఏడు కంచి పట్టుచీరలు, ఏడు రోజువారి చీరలు ఉన్నాయి. ఇప్పుడే కాదు, కల్కి బంగ్లాలో ఉన్నప్పుడు కూడా ఇన్నే చీరలు సుబ్బులక్ష్మికి. అంతకంటే ఎక్కువ ఒక్క చీర కొన్నా, ఎవరయినా బహూకరిస్తే వచ్చినా అది వెంటనే ఎవరికో ఒకరికి ఇచ్చేస్తుంది.

చీర ఒక నిమిషంలో మార్చుకుంది సుబ్బులక్ష్మి. మొదటగా పూజచేస్తున్నట్లు ఫోటో తీసుకుంటానన్నాడు. సుబ్బులక్ష్మి తన పూజామందిరం ముందు కూర్చొంది. కల్కి బంగ్లాలో ఒక గది అంతా పూజగదే. ఈ ఇంట్లో ఒక అల్మారాలో దేవుళ్ల విగ్రహాలు, పటాలు

పెట్టుకుంది. ఈ ఏర్పాటు అటు ఆ దేవుడికి ఇబ్బంది లేదు. సుబ్బలక్ష్మికీ ఇబ్బంది లేదు. పూజా మందిరం ముందు కూర్చొని పూజ చేసుకుంటూ మంత్రాలు చదువుకుంటూ ఉంది, నాగరాజన్ ఫోటోలు తీసుకున్నాడు, సుబ్బలక్ష్మి ఇక లేస్తుందేమో అని చూస్తున్నాడు, సుబ్బలక్ష్మి పూజలో నిమగ్నమయిపోయింది. నాగరాజన్ భార్యతో చెప్పాడు, సుబ్బలక్ష్మిని ఇక రమ్మని చెప్పమని.

"ఇంతే నేను, పూజలోకి వెళ్లానంటే ఎప్పటికోగాని రాను" అంటూ సుబ్బలక్ష్మి లేచింది.

"మేము ఇందాక వచ్చినప్పుడు మీరు తలుపుతీసి నమస్కారం చేసి లోపలికి రమ్మన్నారు. అలాగే మళ్లీ చేయగలరా....." తరువాతి ఫోటో అలా తీసుకుందామని అడిగాడు నాగరాజన్.

దేశంలోని మహిళల్లో అందరికంటే ఎక్కువగా ఫోటోలు తియ్యబడే మహిళ సుబ్బలక్ష్మి. తనను ఎవరో ఒకరు ఫోటోలు తీస్తూనే ఉంటారు. ఇలాంటి ఫోటో ఎవరూ తీస్తానసలేదు ఇప్పటివరకు. అయినాసరే నవ్వుతూ సరేనంది. నాగరాజన్ వాకిలి బయటకు వెళ్లాడు. సుబ్బలక్ష్మి లోపలి నుంచి వస్తూ నమస్కారం చేస్తూ వచ్చింది.

"ఇలా కాదు....." అని మార్పులు చెప్పాడు నాగరాజన్. మళ్లీ ఇంకోసారి చేసింది సుబ్బలక్ష్మి. నాగరాజన్ మళ్లీ మార్పులు చెప్పాడు. సుబ్బలక్ష్మి నమస్కారం చెపుతూ రావడం, నాగరాజన్ మార్పులు చెప్పడం, ఇలా నాలుగైదుసార్లు జరిగింది. నాగరాజన్ ఇంకా ఫోటో తీసుకోలేకపోయాడు. మళ్లీ చెయ్యండి అని చెప్పటానికి జంకుతున్నాడు. సుబ్బలక్ష్మి నవ్వుతూ,

"మీరెన్నిసార్లయినా అడగండి ఫరవాలేదు. మీకు నచ్చినంతవరకూ చేస్తాను. నేను సినిమా యాక్టర్‌ని, మీకు తెలుసుకదా, ఇవన్నీ నాకు అలవాటే" అంది. ఏమాత్రం విసుక్కోకుండా, ఈ ఫోటో ఇంక వద్దు అనకుండా ఓపిగ్గా నడుచుకొంది. అంతటి గొప్ప మనిషి దగ్గర నుంచి అంతటి వినమ్రత చూసి ఆశ్చర్యపోయాడు నాగరాజన్.

𝄞 𝄞

"అరే! సుబ్బలక్ష్మిగారు పూలు కడుతూ ఫోటో! చాలా బాగుంది" అంటూ నాగరాజన్ తీసుకొచ్చిన ఫోటోలు చూస్తున్నాడు వి.ఎస్.టి. చైర్మెన్.

"ఇది ఇంకా బాగుంది ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి ఏమిటీ ఇంటిముందు ముగ్గు వేయటం ఏమిటి? ఆమెకు అసలు ముగ్గులేయటం వచ్చా" అంటూ ఆశ్చర్యపోతున్నాడు.

"వండర్‌ఫుల్ జాబ్! నాగరాజన్‌గారు బ్రహ్మాండంగా ఉన్నాయి ఫోటోలు. థ్యాంక్యూ." అన్నాడు వి.ఎస్.టి. చైర్మెన్.



నాగరాజన్ బయటకు వెళ్తూ ఉంటే ఒకపక్క శిల్పంలాంటిది చూసి ఆగాడు.

"అది సుబ్బలక్ష్మిగారికి ఇవ్వనున్న ట్రోఫి. మా అవార్డు పేరు 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్' అవార్డు. పోయిన సంవత్సరం ఈ అవార్డును ప్రపంచంలో మన దేశం పేరు నిలబెడుతున్న మన జుబిన్ మెహతాకి ఇచ్చాం. ఆయనను అమెరికా నుంచి తీసుకువచ్చాం. అదిగోండి ఆయనకు ఇచ్చిన ట్రోఫి నమూనా." నాగరాజన్ అటువైపు చూశాడు. పొగాకులు పెద్దపెద్దవిగా పరుచుకొని ఉన్నాయి. "ఈ ట్రాఫీని ఒక ప్రముఖ శిల్పి పీడా చేశారు. దీని ఫిలాసఫీ 'థండర్' అంటే 'ఉరుము', స్వేచ్ఛ ఎప్పుడూ చల్లగా రాదు. స్వేచ్ఛ కావాలంటే ఉరిమి తీసుకోవాలి."

ఇంకా చెప్తున్నాడు వి.ఎస్.టి.చైర్మెన్, "ఈ సంవత్సరపు 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్' అవార్డు ట్రాఫీని ఇంకొక ప్రముఖ శిల్పి నందగోపాల్ మలిచారు. ఈ ట్రాఫీ ఫిలాసఫీ 'గొప్ప పాండిత్యం స్వేచ్ఛాపూరితమైన వాతావరణంలోనే సాధ్యం.'

డిసెంబర్‌లో ఢిల్లీలో సుబ్బలక్ష్మి 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్' అవార్డుని, 'గొప్ప పాండిత్యం, స్వేచ్ఛపూరితమైన....' ఆ ట్రాఫీని అందుకుంది.

సుబ్బలక్ష్మి పాండిత్యమైతే సాధించింది కానీ, అది సాధించింది పూర్తిగా సదాశివం ఆంక్షల మధ్య సతమతమవుతూనే, స్వేచ్ఛాపూరితమైన వాతావరణంలోనైతే ఎంతమాత్రమూ కాదు.

𝄞 𝄞 𝄞

1986 వ సంవత్సరపు త్యాగరాజ ఆరాధనోత్సవాలు దూరదర్శన్‌లో ప్రసారం చేస్తున్నారు. అప్పటి సంగీత ధురంధరులు అందరూ ఉన్నారు, మహారాజపురం సంతానం, సెమ్మంగుడి, పట్టమ్మ, ఇలా అందరిని చూపిస్తోంది టి.వి. ప్రజలందరూ సుబ్బలక్ష్మి కోసం చూస్తున్నారు. అసలు వచ్చిందా రాలేదాని, అందరినీ చూపుతూ చూపుతూ కెమెరా సుబ్బలక్ష్మి మీద ఆగింది. అంతే, కళాకాంతులతో వెలిగిపోతున్న మోము కనిపించింది. సుబ్బలక్ష్మి మోము కాంతిపుంజంలాగా ప్రకాశిస్తుంది. పక్కన తనకంటే రెండేళ్లు చిన్నదైన పట్టమ్మ తన వయస్సుకు తగ్గట్టే అరవైఎనిమిదేళ్ల ముసలమ్మలానే ఉంది. కానీ సుబ్బలక్ష్మి మిలమిలలాడుతూ, డెబ్బైఏళ్లు ఉన్నట్లుగా లేదు. త్యాగరాజ ఆరాధనోత్సవాలలో వందలమంది సంగీతజ్ఞుల ఘన పంచ రత్న కృతులు ఒకేసారి పాడుతారు. తొంభైతొమ్మిది శాతం అంతా చక్కగానే పాడుతారు. కాని కొన్నిసార్లు ఒక ప్రక్కవారు కృతిలో ముందుకు వెళ్లిపోతారు, ఒక ప్రక్కవారు వెనకే ఉండిపోతారు. ఇలాంటి ఇబ్బందే ఇప్పుడు కూడా కలిగింది. పట్టమ్మ ఆవేశపడిపోతూ అందరికీ వేలు చూపించిమరీ గమ్మునుండమంటుంది. పట్టమ్మ ప్రక్కనే ఉన్న సుబ్బలక్ష్మి మాత్రం తల దించుకొని,



'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్' అవార్డుతో సుబ్బలక్ష్మి

పాట పాడకుండా ఆగి అంతా సద్దుమణిగాక కానీ మళ్ళీ అందరితో తన గొంతు కలపలేదు. అందరూ తనని అనుసరించాలనే ఆలోచన అస్సలే లేదు సుబ్బలక్ష్మికి. కనీసం ఆడవాళ్ళైనా తనకు వంత పాడాలని కూడా లేదు. మీకే నేను వంతపాడుతాను అని అణుకువ కలిగినది సుబ్బలక్ష్మి. అక్కడున్నవాళ్లు, టి.వి.లో ప్రజలు గమనిస్తూనే ఉన్నారు. అంతటి రసాభాసలో కూడా ప్రశాంతత చెదరకుండా ఎవరినీ తప్పుపట్టకుండా తల దించుకొని అంతా సద్దుమణిగేదాకా తనలో తాను ఉండిపోయింది.

ఇంకా పాటలో త్యాగరాజు ముద్ర వచ్చినప్పుడు, త్యాగరాజుకి నమస్కరిస్తుంది. అక్కడ అంతమంది విద్వాంసులు సాక్షాత్తు త్యాగరాజు ముందు కూర్చొని ఆయన కృతుల ఆలపిస్తున్నా ఎవరూ ఆ సమయంలో నమస్కరించటంలేదు. సుబ్బలక్ష్మి ఒక్క త్యాగరాజే కాదు ఏ కృతిలోనైనా వాగ్గేయకారుడి ముద్ర వచ్చినప్పుడు వారికి నమస్కారం చేయటం సుబ్బలక్ష్మి సంస్కారం.

సుబ్బలక్ష్మి ఎప్పుడూ ఇంతే ప్రశాంతంగా ఉంటుందా, రోజుకి ఇరవైనాలుగ్గంటలూ... మూడొందల అరవైఐదు రోజులూ.. అని అడిగితే, లేదు! సుబ్బలక్ష్మికి కూడా చిరాకులు, కోపాలు ఉన్నాయి.

గోడమీద బల్లుల్ని చూస్తే మహాచిరాకు సుబ్బలక్ష్మికి. పడుకోబేయే ముందు అన్ని లైట్లు ఆపేసిన తర్వాత, కాసేపాగి తన దిండు క్రింద ఉన్న టార్చ్‌లైట్ తీసుకొని, లైటువేసి గోడలన్నీ పరీక్షగా చూసి, బల్లులు లేవు అని నిర్ధారించుకొనిగానీ ప్రశాంతంగా పడుకోలేదు.

భోజనం చేసేటప్పుడు తినకుండా వదిలిపెట్టే పదార్థాలను కంచంలో ఒక పక్కకు పెడితే సుబ్బలక్ష్మికి చిరాకు. ఆ పదార్థాలను వేరే చిన్న గిన్నెలో పెట్టుకుంటూ భోంచేయాలంటుంది.

కచేరీలలో యువతరం గాయనీమణులు తలకు పెట్టుకున్న పూలను చెరొక భుజంమీదుగా ఒక్కో చెండుని ముందుకు వేసుకుంటే, ఆ ఆహార్యం నచ్చక కాస్త చిరాకు పడుతుంది.

ఇంతకంటే చిరాకు, బాధ సుబ్బలక్ష్మికి కచేరీలలో తరచుగా ఎదురువుతుంటాయి. ఒకసారి మద్రాసులో ఒక ప్రముఖమైన కచేరీ చేస్తోంది సుబ్బలక్ష్మి. ఆ కచేరీకి ఉత్తర భారతం నుంచి హిందీ మాతృభాషైన ఒక ప్రముఖ రాజకీయనేత విచ్చేశాడు. యథావిధిగా సదాశివం ఆ ప్రముఖుడిని తన ప్రక్కనే కూర్చుండబెట్టుకున్నాడు. కచేరీ బ్రహ్మాండంగా సాగిపోతుంది. ఈ కచేరీలోని ప్రధాన అంశం ఖరహర ప్రియ రాగంలో కృతి. ఒక వర్ణం, రెండు కృతుల తర్వాత సుబ్బలక్ష్మి ఈ ఖరహర ప్రియ రాగం దగ్గరకు వచ్చింది. క్షణాల్లో ఈ ముఖ్యమైన అంశాన్ని ఎలా నడిపించాలో ఇంకొక్కసారి ఆలోచించుకుంది. రాగలాపన ఎంతసేపు చేయాలి, స్వరప్రస్తారాలు ఎంతసేపు, నెరవు ఎంతసేపు, ఇలా

ఆలోచించుకొని, అంతా సిద్ధపడి ఖరహర ప్రియ రాగాలాపన కోసం నోరుతెరిచింది. కాని ఆగిపోయింది. సదాశివం సంకేతం అందింది. కచేరీలో ఎప్పుడో తర్వాత ఒకసారి పాడాలనుకున్న సూరదాసు భజన పాడమని సంకేతమందింది. ఎందుకంటే ఆ హిందీ ప్రముఖుడు వెళ్లిపోతున్నాడు కాబట్టి. నోటి దగ్గర నుంచి తినబోయే ముద్ద తీసివేసినట్లు సదాశివం సుబ్బులక్ష్మి నోటి నుంచి పాటను తీసేశాడు. సుబ్బులక్ష్మికి పాట ఒక్క నోటి నుంచి, నాలుక నుంచి వస్తే ఫర్వాలేదుగాని, సుబ్బులక్ష్మికి పాట తనలోని అణువు అణువు నుంచి వస్తుంది. మనసులో నుంచి, హృదయంలో నుంచి ఆ హృదయాంతరాలలో నుంచి పాట వెల్లివిరిసే సమయానికి, నొక్కిపెడితే, ఆ ఒత్తిడి కోపమై, చిరాకై, కన్నీటిలా ఉబికి వస్తే, రసజ్ఞులతో సహా ఆ హిందీ ప్రముఖుడు, సదాశివం అది సూరదాసు భజన భావశబలత అనుకొంటున్నారు.



1980లు సుబ్బులక్ష్మికి బ్రహ్మరథం పడుతున్నాయి. దేవాలయాల్లోని దేవుళ్లు సుబ్బులక్ష్మి సుప్రభాతాలతోనే నిద్రలేస్తున్నారు. వైష్ణవాలయాలు 'ఓం కౌసల్యా సుప్రజా రామా.....' అంటూ వేంకటేశ్వర సుప్రభాతంలో మేల్కొంటున్నాయి. శైవాలయాలు కాశీ రామేశ్వర సుప్రభాతాలతో మేల్కొంటున్నాయి, అమ్మవారి ఆలయాలు కామాక్షి సుప్రభాతంతో మేలుకొంటాయి. ప్రజలు కర్ణాటక సంగీతంతో సేద తీరాలంటే సుబ్బులక్ష్మి క్యాసెట్లు కొని వింటున్నారు. మద్రాసు కాకుండా ఇతర చోట్ల సుబ్బులక్ష్మి కచేరీ ఏర్పాటయితే, జీవిత కాలంలో ఒక్కసారి వచ్చే సువర్ణావకాశాన్ని వదులుకోకుండా సుబ్బులక్ష్మి కచేరీలకు పోటెత్తుతున్నారు రసజ్ఞులు. ప్రభుత్వం గానీ ఇంకే ఇతర సంస్థగానీ ఒక పురస్కారం నెలకొల్పితే ముందు సుబ్బులక్ష్మికి బహూకరిస్తున్నారు. భారత ప్రభుత్వం ఏదైనా అంతర్జాతీయ కార్యక్రమం పూనుకుంటే సుబ్బులక్ష్మి చేత ప్రారంభంలో ప్రార్థనలు చేయిస్తారు. అలాంటి ఒక కార్యక్రమం కోసం బెంగుళూరు వచ్చింది సుబ్బులక్ష్మి. 'సార్క్' దక్షిణ ఆసియా దేశాల సమాఖ్య రెండవ సదస్సు బెంగుళూరులో జరుగుతుంది. భారతదేశం గొప్పగా భావించే, విలువైన సంపద సుబ్బులక్ష్మి. అలాంటి సుబ్బులక్ష్మిని ప్రారంభ ప్రార్థనలు చేయటానికి ఆహ్వానించారు. సుబ్బులక్ష్మి కారు వేదిక దగ్గరకు బయలుదేరింది. మధ్యలో "మామా..." అంటూ ఏదో చెప్పింది సదాశివంకి, సదాశివం గడియారం ఒకసారి చూసుకొని కారు డ్రైవర్‌కి జయనగర్ పోనిమ్మని చెప్పాడు. కారు జయనగర్‌లో ఒక చోట ఆగగానే.... అక్కడ పూలకొట్టులో మనిషి సుబ్బులక్ష్మిని చూసి పరుగెత్తుకొచ్చాడు. "అమ్మా! ఒక నిమిషం" అంటూ కొట్టులోకి వెళ్లి మల్లె, జాజి మాలలు, సంపెంగలు తీసుకొచ్చి సుబ్బులక్ష్మి చేతిలో పెట్టాడు, వద్దంటున్నా సదాశివం అతనికి డబ్బులు ఇచ్చి బయలుదేరారు.... 'మామా! ఈ శ్రీనివాసు ఎక్కడ నుంచి తీసుకు వస్తాడు ఈ పూలు,



ఎంతగా గుబాళిస్తున్నాయి......" అనుకుంటూ పూలచెండు తలలో తురుముకుంది. ఎప్పుడూ బెంగుళూరు వచ్చినా సుబ్బులక్ష్మి ఈ పూలకొట్టుకి ప్రత్యేకంగా వచ్చిమరీ పూలు కొనుక్కుంటుంది.

'సార్క్' సదస్సులో ప్రొద్దున పాడిన తర్వాత సాయంత్రం కర్ణాటక ముఖ్యమంత్రి రామకృష్ణ హెగ్డే, ముఖ్యఅతిథిగా పాల్గొనే కార్యక్రమానికి విచ్చేసింది. వేదికపై ఒకరి తర్వాత ఒకరు మాట్లాడుతూ, సుబ్బులక్ష్మిని అభినందిస్తూ మాట్లాడుతూ ఉంటే సుబ్బులక్ష్మి తాళంవేసుకుంటూ తన పాటలు నెమరువేసుకుంటుంది. చివరిగా రామకృష్ణ హెగ్డే మాట్లాడుతూ.... "సుబ్బులక్ష్మిగారికి 'భారతరత్న' బిరుదు ప్రకటించాలి" అని అన్నప్పుడు సభలో అందరూ చప్పట్లు కొట్టినప్పుడు సుబ్బులక్ష్మి తాళం ఆపి, ఈ లోకంలోకి వచ్చింది. ఆ తరువాత రోజు పేపర్లలో 'కర్ణాటక ముఖ్యమంత్రి హెగ్డే సుబ్బులక్ష్మికి 'భారతరత్న' సిఫార్సు!' 'సుబ్బులక్ష్మికి భారతరత్న అర్హతలన్నీ ఉన్నాయి – హెగ్డే' ఇలా ఈ వార్తని ప్రముఖంగా ప్రచురించారు. సదాశివం ఆ పేపర్లు మార్చిమార్చి చదివాడు. "కుంజమ్మకు రావలసిన ఇంకో అవార్డు ఉన్నదన్నమాట" అని అనుకుంటున్నాడు.



ఆర్. వెంకట్రామన్ తమిళ కాంగ్రెస్ నేత. ఇప్పుడు భారతదేశ రాష్ట్రపతి. సదాశివానికి ఎప్పటినుంచో సన్నిహితుడు. ఇప్పుడు రాష్ట్రపతి భవనం మళ్లీ సుబ్బులక్ష్మి సేవకై తయారుగా ఉంది. సదాశివానికి రాష్ట్రపతి భవనం నుంచి ఫోన్ వచ్చింది. "సదాశివం, మాస్కోలో ఈ సంవత్సరం ఫెస్టివల్ ఆఫ్ ఇండియా జరగబోతుంది. నేను సుబ్బులక్ష్మిగారి కచేరీలు కుదురుస్తున్నా, ఏమంటారు?"

"రష్యా బాగా చలిదేశం. నాకు ఎనభైనాలుగేళ్లు, నేను తట్టుకోలేను ఆ చలికి.... వద్దు" అన్నాడు సదాశివం.

"లేదు మీరు వెళ్లాల్సిందే. నేను రాష్ట్రపతి అయివుండి మిమ్మల్ని ఆ ఫెస్టివల్‌కు పంపకపోతే మనవాళ్లు నన్ను ఊరుకోరు" అంటూ రాష్ట్రపతి వెంకట్రామన్ సుబ్బులక్ష్మి కార్యక్రమం ఖరారు చేశాడు.

మాస్కో కంటే ముందు సుబ్బులక్ష్మి హైదరాబాద్ వచ్చింది. ఇక్కడ రెండు కార్యక్రమాలు, ఒకటి రామకృష్ణామఠంలో రామకృష్ణ పరమహంస 150వ జయంతి ఉత్సవం, ఇంకొకటి 'కళాసాగరం' సాంస్కృతిక సంస్థలో కచేరి.

హైదరాబాద్‌లో మారేడ్‌పల్లిలో వారికి ఆతిథ్యం ఇస్తున్న ఇంట్లో ఆప్తులందరూ చేరారు. వారిలో ఖాసా సుబ్బారావుగారి అల్లుడు వామనరావు ఒకరు. అందరూ సుబ్బులక్ష్మితో మాట్లాడుతూ ఉండగానే సదాశివం, "కుంజమ్మా, రాధా ఇటు రండి" అని పిలిచాడు.

"సాధన చేసుకోండి. బయలుదేరాలి" అంటూ ఒక గదిలోకి పంపి తలుపు మూసి వచ్చాడు. మళ్ళీ ఎక్కడ 'ఝునన ఝునన పద గుంఘురు బాజే....' చేస్తారేమోనని సదాశివం భయం.

సుబ్బలక్ష్మి ఏ ఊర్లో అడుగుపెడితే అక్కడ ప్రసార మాధ్యమాలన్నీ ఆమెచుట్టూ చేరతాయి. ఏమన్నా ఇంటర్వ్యూ వీలవుతుందేమోనని గట్టిగా ప్రయత్నిస్తారు. సదాశివం ఏమాత్రం పడనివ్వడు. ఎవరో అతి కొద్దిమంది అదృష్టవంతులు మాత్రమే ఇంకొక్క అడుగు ముందుకేయగలుగుతారు. అదికూడా గట్టి సిఫారసు ఉన్నవాళ్లే. ఆల్ ఇండియా రేడియో ఉద్యోగిని అయిన తురగా జానకి రాణి, త్వర త్వరగా రామకృష్ణా మఠంకి ఒక పెద్ద టేపు రికార్డర్‌తో వచ్చింది, అది లక్ష రూపాయల ఖరీదుచేసే టేపురికార్డర్, అతి ముఖ్యమైన వారికోసం తప్ప దానిని బయటికి తేనివ్వరు. కార్యక్రమానికి ముందే సుబ్బలక్ష్మితో ఇంటర్వ్యూ గురించి చెప్పి, మాట తీసుకుందామని. కానీ అక్కడ మాట్లాడటం కుదరలేదు. వామనరావుని ప్రాధేయపడగా, సాయంత్రం రాజ్‌భవన్‌కి రమ్మన్నారు. రాజ్‌భవన్‌లో గవర్నర్ కుముద్‌బెన్ జోషీ కోసం, సుబ్బలక్ష్మి నటించిన మీరా సినిమా చూపెట్టబడుతోంది. చాలా సంవత్సరాల తర్వాత సుబ్బలక్ష్మి కూడా తన 'మీరా' చూసుకుంటోంది. నిండు నలభై సంవత్సరాలు ఆ సినిమా చేసి. తనను చూసి నవ్వుకుంది, ఒంటెమీద తనను చూసుకుంటే ఇప్పుడు కూడా కుర్చీ గట్టిగా పట్టుకుంది. ఆ భయం ఇంకా భయమే. డంగన్ గుర్తొచ్చాడు, కృష్ణుణ్ణి మళ్లీ దర్శించుకుంది.

సినిమా అయిన తర్వాత జానకి రాణి రాధ దగ్గరకు వచ్చింది, విషయం చెప్పింది. "నాన్నని అడిగి చెప్తాను. మీరు తెలుగులో మాట్లాడాలి అంటున్నారు.... ఇన్ని వాక్యాలు కష్టమేమో.... నాన్నని అడిగి చెప్తాను.... రేపు మీరు మారేడ్‌పల్లి రండి" అని చెప్పింది.

ఆ తర్వాత రోజు జానకీ రాణి మళ్లీ టేప్‌రికార్డర్ పట్టుకొని వెళ్లింది. సుబ్బలక్ష్మి వచ్చింది. కాళ్లకు నమస్కారం చేసుకుంది జానకీరాణి. వంగి లేచినప్పుడు జానకీ రాణి జుట్టు చూసి, "నీ జుట్టు బాగుంది, కొన్ని తెల్లగా కొన్ని నల్లగా చూడటానికి బాగుంది... నిన్న చూశావా మీ ముఖ్యమంత్రి ఎలా నల్లని రంగు వేశాడో" అస్సలు నచ్చలేదు అన్నట్లు చెప్పింది. సుబ్బలక్ష్మి తనకు ఏమన్నా ఇంటర్వ్యూ ఇస్తుందేమోనని ఆశగా చూస్తుంది జానకి రాణి.

ఆ తపన చూసిన సుబ్బలక్ష్మి "పాట కావాలంటే నేను నీకు పాడతాను ఇప్పుడు" 'నేను నీకు చేయగలిగింది ఇంతే' అన్నమాట ఆ కళ్లు జాలిగా చెప్పాయి.

ఇంతలో రాధ వచ్చి "అమ్మా! సాధన" అంది.

"సాయంత్రం కచేరీ ఉంది, నువ్వు తప్పకుండా రా. ఇప్పుడు సాధనకెళ్తున్నాను. సాధన ఎంతో బాగా చేస్తాము కానీ దానిలో పావువంతే కచేరీలో వస్తుంది" అని చెప్పి వెళ్లిపోయింది.



సాయంత్రం 'కళాసాగరం' యొక్క కచేరీ. ఆద్యంతం వింది జానకీరాణి. కచేరీ ముగిసిన తర్వాత 'సాధనలో పావువంతు ఉండే కచేరీనే ఇలా ఉంటే.... సాధనలో పాడినదల్లా కచేరీలో పాడగలిగితే ఆ కచేరీ ఎలా ఉంటుంది?' అనుకుంది జానకీరాణి. ఇలాంటి గొప్ప పాటగత్తె ఇంటర్వ్యూ నేను తీసుకొని తీరాలి అని మళ్లీ పట్టుదల తెచ్చుకొని, మళ్లీ ప్రయత్నించింది కానీ ఇంటర్వ్యూ తీసుకోలేకపోయింది. అయినా సరే పట్టు విడువకుండా ఆ తరువాతిరోజు సాయంత్రం సికింద్రాబాదు స్టేషన్‌కి టేపురికార్డర్‌తో సహా వచ్చింది. స్టేషన్ మాస్టర్ గదిలో అంతా కూర్చున్నారు. సుబ్బలక్ష్మి వంక ఆశగా చూస్తుంది. "నువ్వు ఇచ్చిన ఇంటర్వ్యూ కాగితం నా పర్సులోనే ఉంది....." అంటూ తన పర్సులోంచి ఆ కాగితం తీసి చూపించింది. అంతే, ఇంకేమి మాట్లాడలేదు. మిగతావి ఆ కళ్ళు చెప్తున్నాయి.. "నేను అశక్తురాలిని. నేను నీకేమీ చేయలేను" అని. మద్రాసు రైలు వచ్చింది. అందరితోపాటు వెళ్లి రైలు ఎక్కించింది. ఈ మూడు రోజులలో ఒక్క రోజు కూడా సదాశివం ఈ ఆకాశవాణి ఉద్యోగిని చూడనైనా లేదు, అసలు ఆవిడ ఒకామె పక్కన ఉందీ అని కూడా లెక్కచేయలేదు. రైలు లోపల కూర్చున్న తరువాత కిటికీలోంచి తననే చూస్తున్న సుబ్బలక్ష్మిని చూసి, 'మాట్లాడమన్నదే మాట్లాడే, పాడమన్నదే పాడే చిలుక, బంగారు పంజరంలో చిలుక' అనుకుంది.

ఈ చిలుకకు ఆ బంగారు పంజరం ఎప్పుడో అలవాటయ్యింది. అక్కడే సర్దుకుపోయింది, ఆ పంజరంలోనే సుఖశాంతులు సమకూర్చుకుంది. తన మదురై ఇల్లు ఇరుకుదైనా తనకు మాత్రం విశాలమైనది. కల్కి బంగ్లా ఎకరాలకు మించిపోయినా, చిన్న పంజరమే తనకు.

ఈ సర్దుబాటు చూసినవాళ్లందరూ సుబ్బలక్ష్మి అంత ప్రజ్ఞాశాలి అయి ఉండి కూడా సదాశివంని భరిస్తున్నందుకు సుబ్బలక్ష్మిని వేనోళ్ల పొగుడుతున్నారు. కానీ సుబ్బలక్ష్మిని, సదాశివంని అతి దగ్గరగా చూసిన ఆర్.కె. నారాయణ్ మాత్రం సుబ్బలక్ష్మిని ఈ పంజరంలోనుంచి విడిపించాడు.

ఆర్.కె. నారాయణ్ ప్రఖ్యాత ఆంగ్ల కథా, నవలా రచయిత. సుబ్బలక్ష్మి బాధలు చూడలేక తన ఒక కథలో సుబ్బలక్ష్మిని వెనక్కు ఆమె తల్లి దగ్గరకు పంపించేశాడు. అది ఎలాగంటే, సెల్వి వృద్ధిలోకి వస్తున్న ఒక గాయని, ఒకసారి ఫోటో తీయించుకోవటానికి మోహన్ అనే ఒకతని ఫోటో స్టూడియోకి వస్తుంది. అక్కడి నుంచి ఇద్దరికీ పరిచయం పెరుగుతుంది. ఎవరికీ తెలియకుండా మోహన్ సెల్విని పెళ్లి చేసుకుంటాడు. వినాయకుని గుడి వీధిలో ఉండే సెల్వి, ఒక ఆంగ్లేయుడు కట్టిన పెద్ద బంగ్లాలోకి మారుతుంది. సెల్వికి దేశవ్యాప్తంగా గొప్ప పేరు తీసుకొస్తాడు మోహన్. ఆమె డబ్బు వ్యవహారాలన్నీ అతనే చూస్తాడు. మెల్లగా ఒక పద్ధతి ప్రకారం సెల్విని తన పుట్టింటివారికి దూరం చేస్తాడు. అంతేకాదు సెల్వి అభిమానులెవరూ సెల్వితో మాట్లాడటం సహించలేదు మోహన్,

అతనికి ఈర్ష్య, అనుమానం. సుబ్బలక్ష్మిని సదాశివంని దగ్గరగా చూసినవారికి సెల్వీ సుబ్బలక్ష్మి అని, మోహన్ సదాశివం అని ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఆర్.కె. నారాయణ్ వీరిద్దరికీ తెలిసినవాడు అని తెలిసినవారికి ఈ కథ ఎవరిని ఉద్దేశించి వ్రాసిందో అస్సలు చెప్పనవసరంలేదు.

కథ ఇంతవరకూ వారి కథే. కానీ సుబ్బలక్ష్మి బాధలు చూడలేక, ముఖ్యంగా తన తల్లి చనిపోయినప్పుడు అనుభవించిన సంఘర్షణ, అన్న చనిపోయినప్పుడు వెళ్లలేక ఆమె పడిన క్షోభ తెలిసి, సుబ్బలక్ష్మి కథను ఇక్కడ మార్చాడు ఆర్.కె. నారాయణ్. కథలో సెల్వి తల్లి చనిపోతుంది. సెల్వి ఎక్కడ పనులు అక్కడ వదిలేసి, ఎక్కడ కచేరీలు అక్కడ వదిలేసి తల్లి పక్కకు చేరుకుంటుంది. ఇక తిరిగిరాదు. మోహన్ వచ్చి ఎంత బ్రతిమిలాడినా వెనక్కి రాదు. ఆఖరిసారిగా ఒక రాత్రివేళ వచ్చి మాట్లాడాలి తలుపు తియ్యమంటాడు మోహన్. 'ఇది మాట్లాడే వేళ కానే కాదు. తలుపు తీయను, ఎప్పటికీ తీయను' అంటుంది.

చాలామందికి తెలిసినట్లు గౌరీకి కూడా 'సెల్వి' గురించి తెలిసింది. ఒకసారి ఎదురుపడ్డప్పుడు నారాయణ్‌ని అడుగుతుంది, "ఎందుకిలా రాశారు.. అలా ఏమీ కాదే.." అని. నారాయణ్ నవ్వి, "నీకు ఊహ తెలిసే ఇరవై ఏళ్ల ముందు నుంచీ.. కుంజమ్మకి పెళ్ళైన దగ్గర నుంచీ నాకు అంతా తెలుసు. అందుకే సుబ్బలక్ష్మి కనీసం నా కథలోనైనా సంతోషంగా ఉండాలని వాళ్లమ్మ దగ్గరకు పంపేశాను" అని చెప్పాడు.

కథ కానిదీ, నిజమైనదీ బ్రతుకు. సెల్వి కథలోని ముగింపు కథలోనే ఉండిపోయింది. సుబ్బలక్ష్మి బ్రతుకు ఏ మార్పు లేకుండా అలానే సాగిపోతుంది. "నేను కేవలం ఒక పాటలు పాడే మనిషిని, ఎక్కడ పాడమంటే అక్కడ పాడే మనిషిని" సుబ్బలక్ష్మి ఈ ఒక్క వాక్యంతోనే తన పరిస్థితి తెలిపింది. అంతకు మించి ఎప్పుడూ బయటపడలేదు. పాట, పాట, పాటే తన ఆలంబన, పాటే తన ఆలాపన.

𝄞 𝄞

ఎయిర్ ఇండియా బోయింగ్ విమానం మూడువందలకు పైగా ప్రయాణికులతో నిండి ఉంది. వీరంతా భారతదేశపు ప్రథమశ్రేణి కళాకారులు. యు.ఎస్.ఎస్.ఆర్. రాజధాని మాస్కోలో 'ఫెస్టివల్ ఆఫ్ ఇండియా'లో వారి కళలు ప్రదర్శించబోతున్నారు. ముందు వరుసలోనే షహనాయి విద్వాంసుడు ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ ఉన్నాడు, ఇంకొంతమంది కళాకారుల కోసం వేచియున్నారు. మెల్లగా ఒక్కొక్కరు వస్తున్నారు. చివరిగా సుబ్బలక్ష్మి విమానంలోకి వచ్చినప్పుడు ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ లేచి నుంచుని సుబ్బలక్ష్మికి వినమ్రంగా నమస్కరించాడు. బిస్మిల్లాఖాన్ సుబ్బలక్ష్మికంటే పెద్దవాడు. ఆ తర్వాత ఒక మణిపూరి నృత్య కళాకారిణి సుబ్బలక్ష్మి పాదాలను తాకి నమస్కారం చేసుకుంది.



"నువ్వు సాక్షాత్తు సరస్వతీ దేవికి నమస్కారం చేసుకుంటున్నావు" అని ఆ కళాకారిణితో అన్నాడు బిస్మిల్లాఖాన్.

ఆ విమానంలో సుబ్బలక్ష్మి అందరికీ ఆటోగ్రాఫులు ఇస్తూనే ఉంది.

మాస్కోలో బసచేసిన హోటల్‌కి, ఒక మాస్కో విలేఖరి సుబ్బలక్ష్మిని వెతుక్కుంటూ వచ్చాడు. "సుబ్బలక్ష్మి అనేవారు రేపు 'ఫెస్టివల్ ఆఫ్ ఇండియా'ను తన పాటతో ప్రారంభించుతున్నారట, వారిని ఒకసారి చూడొచ్చా.....?" అని అడిగాడు.

గౌరి సుబ్బలక్ష్మిని పిలుచుకు వచ్చింది. ఆ విలేఖరి నమ్మలేనట్లు చూశాడు. "రేపు ప్రారంభోత్సవం చేసేది ఇంత ముసలావిడా" అని ఆశ్చర్యపోయాడు. వెంటనే గౌరి టేప్‌రికార్డర్‌లో సుబ్బలక్ష్మి ఈ మధ్యనే రికార్డు చేసిన శంకర స్తుతి పెట్టి వినిపించింది. ఆ పాట ఆసాంతం విన్న ఆ విలేఖరి, "ఊ... ఈమె ప్రారంభోత్సవం చేయగలిగినామె" అనుకుంటూ వెళ్లిపోయాడు.

1950లలో శ్రీలంక తర్వాత సుబ్బలక్ష్మికి 1963లో లండన్‌లోని ఎడిన్‌బరో మ్యూజిక్ ఫెస్టివల్‌తో మొదటిసారిగా పాశ్చాత్య దేశాల పర్యటన మొదలైంది. ఈజిప్ట్, జర్మనీలలో కూడా కచేరీలు చేసింది. 1966లో అమెరికా వెళ్లింది. 1974లో ఫిలిప్పీన్స్ తదితర తూర్పు దేశాలలో కచేరీలు చేసింది. 1977లో మళ్లీ అమెరికాలో పర్యటించింది. ఈ 1987లో సోవియట్ రష్యాకి వచ్చింది. విడిది అయిన హోటల్ రోజియా నుంచి ఫెస్టివల్ ఆఫ్ ఇండియా ప్రారంభోత్సవ ఉత్సవం మొదలుకానున్న కెథడ్రల్ స్క్వేర్‌కు బయలుదేరారు. ఒకప్రక్క మాస్కవ నది నిండుగా ప్రశాంతంగా ప్రవహిస్తుంటే, రహదారికి ఇంకోప్రక్కనే క్రెమ్లిన్ కోట గోడ మధ్యమధ్యలో ఎత్తైన బురుజులతో ఉంది. అక్కడ నుంచి ఒక కోట ద్వారం నుంచి క్రెమ్లిన్ లోపలికి వచ్చారు, క్రెమ్లిన్, సోవియట్ దేశపు ఆయువుపట్టు, సోవియట్ ప్రజల చరిత్రకి, ఉత్థాన పతనాలకి సాక్షి. ఈ ప్రాంగణంలో, ప్రత్యేకమైన నిర్మాణశైలిలో ఉన్న రాజప్రాసాదాలు, ఉల్లిపాయ ఆకారంలో బంగారపు గుమ్మటాలతో ఉన్న చర్చిలు, గడియారపు స్తంభాలు చూసుకుంటూ ఉంది సుబ్బలక్ష్మి. కలల లోకంలో ఉన్నట్లుంది. క్రెమ్లిన్‌లోని కెథడ్రల్ స్క్వేర్‌కి చేరుకుంది. ఈ కెథడ్రల్ స్క్వేర్ క్రెమ్లిన్‌కి గుండెవంటిది. ఇక్కడ జార్ చక్రవర్తులకి పట్టాభిషేకాలు జరుగుతూ ఉండేవి. ఇప్పటికి కూడా సోవియట్ అధ్యక్షుడు ఇక్కడే ప్రమాణ స్వీకారం చేస్తాడు. ఇలాంటి కెథడ్రల్ స్క్వేర్‌లో సోవియట్ ప్రెసిడెంట్ గోర్బచేవ్, భారత ప్రధాని రాజీవ్‌గాంధీ, ఫెస్టివల్ ఆఫ్ ఇండియాను ప్రారంభోత్సవం చేయటానికి సిద్ధంగా ఉన్నారు. కెథడ్రల్ స్క్వేర్ ద్వారం దగ్గర అధికారులు సుబ్బలక్ష్మిని ఆపేశారు.

"క్షమించండి, మీ దగ్గర లోపలికి వెళ్లటానికి తగిన అనుమతి పత్రాలు లేవు" అని లోపలికి పోనివ్వలేదు.



రష్యాలో కచేరీ చేయనున్న కర్ణాటక సంగీత బృందంతో రాష్ట్రపతి ఆర్. వెంకట్రామన్, గోపాల్‌కృష్ణగాంధీ (రాజాజీ, గాంధీల మనుమడు). బృందసభ్యులు ఘటం కళాకారుడు విక్కూ వినాయక్‌రామ్, వయోలిన్ కళాకారుడు కందాదేవి అళగిరిస్వామి, మృదంగం కళాకారుడు కె.వి. ప్రసాద్, సదాశివం, సుబ్బలక్ష్మి, విజయ, గౌరీ రామ్‌నారాయణ్



అక్షరాలా ఒక్క అడుగు వేస్తే గమ్యం ఉంది. ఆ అడుగు లోపలే ఆపేసరికి సదాశివంకి చిర్రెత్తుకొచ్చింది. ఉన్నది సోవియట్‌లోనైనా చక్రం తిప్పి సుబ్బలక్ష్మిని లోపలికి తీసుకువెళ్లాడు. వీరితోపాటే ఆపబడిన సితార్ విద్వాంసుడు ఇమ్రత్‌ఖాన్ మాత్రం లోపలికి రాలేకపోయాడు.

కెథడ్రల్ స్క్వేర్ వేదిక పక్కకు వస్తున్నప్పుడు రాజీవ్‌గాంధీ సుబ్బలక్ష్మిని నవ్వుతూ పలుకరించాడు. సుబ్బలక్ష్మి ప్రార్థన గీతాలతో ఫెస్టివల్ ఆఫ్ ఇండియా మొదలవనుంది. సుబ్బలక్ష్మి పాడింది. చుట్టూతా ఉన్న బంగారు గుమ్మటాలు ఖంగుమనిపించేలా పాడింది.

ఫెస్టివల్ ఆఫ్ ఇండియాకు బ్రహ్మాండమైన ప్రారంభం జరిగి, మూడు రోజులుగా మాస్కో ఇంకా ఇతర పట్టణాల్లో కూడా ఉత్సవాలు సాగిపోతున్నాయి. ఇందిరాగాంధీ ఎప్పుడో చెప్పింది, "సుబ్బలక్ష్మి పాట పాడిన తర్వాత అంతా శుభమే జరుగుతుంది" అని.

సుబ్బలక్ష్మి మొదటి కచేరీ క్రెమ్లిన్ అసెంబ్లీ కాంగ్రెస్‌లో, అంటే సోవియట్ పార్లమెంట్‌లో. ఎప్పటిలానే సుబ్బలక్ష్మి కచేరీ ఎలా చేస్తానో అనుకుంటూ ఆందోళనపడుతోంది. "విక్కూ బాగా చేస్తాననంటావా కచేరీ..." ఘటం వాయించే వినాయకరామ్‌ని అడిగింది.

"మీకేమమ్మా బ్రహ్మాండంగా చేస్తారు" అని చెప్పినా సుబ్బలక్ష్మి దేవుణ్ని తలుచుకుంటూనే ఉంది. అద్భుతమైన నిర్మాణశైలిలో ఉన్న విశాలమైన భవనంలో, సుబ్బలక్ష్మి బృందం కూర్చొని ఉంది. వేదికపైన సుబ్బలక్ష్మి, సహవాద్య కళాకారులు కూర్చున్న చోటనే వెలుతురు ఉంది. సుబ్బలక్ష్మి ప్రక్కన గౌరి, 'లక్ష్మి' అని సుబ్బలక్ష్మి ముద్దుగా పిలుచుకొనే తంబూరతో ఉంది, విజయ 'సరస్వతి' అనే తంబురతో ఉంది. రాధ రాలేదు. సుబ్బలక్ష్మి 'ఎమ్.ఎస్. బ్లూ' చీర కట్టుకొని ఉంది. 1950లలో ముత్తుచెట్టి కొత్తగా ఈ రంగు చీర నేసి ఇస్తే, సుబ్బలక్ష్మి కట్టుకున్న తర్వాత, మద్రాసు మహిళలకు ఈ రంగు విపరీతంగా నచ్చి ముత్తుచెట్టిని అదే చీర వారికి కూడా నేయమని అడగటంతో, ఆ రంగు చీరకి అప్పటి నుంచి 'ఎమ్.ఎస్. బ్లూ' అని పేరొచ్చింది.

ఇక తంబూరలు మొదటి షడ్జమం పలకగానే సుబ్బలక్ష్మి అన్ని భయాలు మర్చిపోయింది. కచేరీ చేయటానికి సిద్ధమవుతుండగా ఒక అధికారిణి వచ్చి పూలగుత్తి ఇచ్చివెళ్లింది. పరమానందంగా పూలు తీసుకుంది సుబ్బలక్ష్మి. తన తల్లి వీణమీద వాయిస్తే, తను చెవులు కోసుకునే కల్యాణి రాగాలాపనతో, 'నిధి చాలా సుఖమా' త్యాగరాజ కృతితో మొదలుపెట్టింది. ఆ తర్వాత అన్నమయ్య కృతి 'నమోనమో రఘుకుల నాయకా' చివరిగా 'నాద బిందు కలాది' అరుణగిరినాథర్ కృతి. కచేరీ ముగిసింది. చప్పట్లు

మారుమ్రోగుతున్నాయి. వెంటనే వేదిక ముందు తెర తొందరగా క్రిందకి దిగింది. రెండు గంటల సమయంలోనే సుబ్బలక్ష్మికి వీరాభిమానులయిన సోవియట్ శ్రోతలకి, సుబ్బలక్ష్మికి మధ్య అడ్డంగా తెరపడిపోయింది. అయితేనేం.... ఎవ్వరూ అక్కడితో ఆగిపోలేదు. పక్కనుంచి వచ్చేసి సుబ్బలక్ష్మిని చుట్టుముట్టి అభినందిస్తూ ఆటోగ్రాఫ్‌లు తీసుకుంటున్నారు.

'నాల్గవరోజు మాస్కో కన్సర్‌వేటరి'లో రాఛ్‌మానినీఫ్ హాల్లో సుబ్బలక్ష్మి సంగీత కచేరి. 'మాస్కో కన్సర్‌వేటరీ' సోవియట్ దేశపు ప్రఖ్యాత ఉన్నత సంగీత విశ్వవిద్యాలయం. అందుకని సుబ్బలక్ష్మి ముందు మామూలు ప్రజలే కాకుండా, సంగీతజ్ఞులు కూడా ఉన్నారు.

మాస్కోలో తన రెండవ కచేరీలో, ఖరహరప్రియ రాగంలోని, 'ప్రక్కల నిలబడి', సావేరిలోని 'దురుసుగా', 'భావయామి గోపాలబాలం' పాడుతూ ఉంది. ఒక కృతి అవగానే మధ్యలో ఒక మహిళ చెమ్మగిల్లిన కళ్లతో ఒక పువ్వు తీసుకొచ్చి సుబ్బలక్ష్మికి ఇచ్చి, సుబ్బలక్ష్మి పాట ఆమెని ఎంతగా చలింపజేసిందో తెలిపింది. కచేరీ పూర్తయిన తర్వాత రాఛమానినీఫ్ హాలులోని రసికులు చప్పట్లు కొట్టుకుంటూ సుబ్బలక్ష్మి చుట్టూ చేరి, ఆమె వెనకనే నడుస్తూ ఆమె కారు ఎక్కి వెళ్లేదాకా మెల్లగా వెంబడించి, సాగనంపారు.

సోవియట్ దేశస్థులకి కర్ణాటక సంగీతం కొత్తదయినా, సుబ్బలక్ష్మి తీయని గొంతులో, శ్రావ్యమైన రాగాలలో పాటలు విని పారవశ్యం చెందారు. రాత్రికి అందరూ స్నానాలు చేసి భోజనాల దగ్గరకు వచ్చినప్పుడు సుబ్బలక్ష్మి తన దగ్గరున్న విబూదిని అందరికీ దిద్ది.... "ఇంకొక పరీక్ష అయిపోయింది" అంటూ భారాన్ని దించుకుంది.

సదాశివం దగ్గరకి వచ్చి విబూది పెడుతూ "అంతా మీవల్లే మామా" అంది సదాశివం వైపు చూస్తూ...

𝄞𝄞

సుబ్బలక్ష్మిని ఇప్పటిదాకా తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం మొదలు, ఢిల్లీ విశ్వవిద్యాలయం, ఇందిరా కళా సంగీత విశ్వవిద్యాలయం, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం ఇలా ఐదు విశ్వవిద్యాలయాలు వారి గౌరవ డాక్టరేట్‌లు ఇచ్చి గౌరవించాయి. ఇప్పుడు మద్రాసు విశ్వవిద్యాలయం కూడా, సుబ్బలక్ష్మి మాస్కో నుంచి వచ్చిన వెంటనే సుబ్బలక్ష్మికి తమ విశ్వవిద్యాలయపు గౌరవ డాక్టరేట్ గుర్తింపు ఇవ్వనున్నట్లు ప్రకటించింది. దీనితో ఆరవతరగతిలో చదువుకు మంగళం పాడిన అమ్మడుకు ఆరు డాక్టరేట్‌లు.

మద్రాసు విశ్వవిద్యాలయం ఇలా డాక్టరేట్ ఇచ్చినట్లే ఇచ్చి అలా సుబ్బలక్ష్మి చేత కచేరీ ఇప్పించుకుంది.



సుబ్బలక్ష్మి కచేరీ మొదలైంది. ముందు వరుసలో కూర్చున్నవారిలో సుబ్బలక్ష్మి గురువు సెమ్మంగుడి శ్రీనివాస అయ్యంగార్‌తోపాటు ఇంకా ఇతర ప్రముఖ విద్వాంసులు ఉన్నారు. ఒక కర్ణాటక సంగీత కృతి తర్వాత ఒక భజన అందుకుంటుంది, అది కూడా ఒకసారి కబీరు దాసుది, ఒకసారి తులసీదాసుదీ, ఇంకోసారి తుకారామ్‌ది...

సదాశివంని ఉద్దేశిస్తూ, "భజనపరురాలిని చేశాడురా" అని అన్నాడు ప్రక్కనే ఉన్న ఒక ప్రముఖ విద్వాంసుడు సెమ్మంగుడితో.

"ఏం చేద్దాం.... వాళ్లాయన ఎలా చెపితే అలా చేస్తుంది. భజనలకి పెద్దపీట వేశాడు. అయినా సుబ్బలక్ష్మి మునుపటి సుబ్బలక్ష్మిలాగా ఇప్పుడు కూడా కర్ణాటక సంగీత విద్వత్తు చూపగలదు. అందులో అనుమానపడనవసరంలేదు" అన్నాడు సెమ్మంగుడి, తన శిష్యురాలిని వెనకేసుకొస్తూ.

సెమ్మంగుడి అన్న మాటకి, అతని ప్రక్కనే ఉన్న ఇంకో ప్రముఖ విద్వాంసుడు, "మీరు ఎన్నైనా చెప్పండి... సాక్షాత్తు మద్రాసు మ్యూజిక్ అకాడమీనే సంగీత కళానిధి బిరుదు ఇచ్చినా నేను ఎమ్.ఎస్.ని కర్ణాటక సంగీత విద్వాంసురాలిగా లెక్కగట్టను" అని చెప్పాడు.

సెమ్మంగుడి శ్రీనివాస్ అయ్యర్ సుబ్బలక్ష్మిని మొదటిసారిగా 1933లో కుంభకోణం మహామహంలో చూశాడు. అప్పుడు సుబ్బలక్ష్మి పాడుతుంటే, తల్లి వీణ వాయిస్తూ సహకారమందిస్తుంది. అప్పటికి పెద్దగా తెలియకపోయినా, మెల్లగా తల్లి కూతుళ్లు పరిచయమయ్యారు. సుబ్బలక్ష్మి సదాశివంను పెళ్లి చేసుకున్న తర్వాత సదాశివం అప్పటికే బాగా పేరున్న సెమ్మంగుడిని సుబ్బలక్ష్మికి ఆస్థాన గురువుగా ఏర్పాటు చేశాడు. సుబ్బలక్ష్మి విద్వత్తు ఎలాంటిదో సెమ్మంగుడి కంటే బాగా తెలిసినవారు లేరు. ఇందాక సుబ్బలక్ష్మిని తక్కువచేసి మాట్లాడిన విద్వాంసుడికి గట్టిగా సమాధానమివ్వగలడుకానీ తగినచోటు, సమయం కాదని మిన్నకున్నాడు.

𝄞𝄞

క్రొత్త సంవత్సరం మొదలుకాగానే సుబ్బలక్ష్మికి లబ్ధి కచేరీల పరంపర మొదలయింది.

జి.ఆర్. గోవిందరాజులు విద్యాసంస్థల లబ్ధి కోసం ఇంకా కీ.శే. గోవిందరాజుల విగ్రహ ప్రారంభోత్సవానికి కోయంబత్తూరు వెళ్లింది. అక్కడ నుంచి వచ్చిన తర్వాత మైలాపూరులోని సంస్కృత కళాశాలలో సెంగలపురము అనంతరామ దీక్షిత్ పురస్కారం అందుకొన్న తర్వాత అక్కడ ఏర్పాటయిన కచేరీలో పాడుతోంది. ఒకప్రక్క నుంచొని వింటున్న రిక్షాకార్మికుడు ఒకతను కచేరీ ఆసాంతం విన్నాడు, కచేరీ అయిన తర్వాత ఒక కాగితం ముక్క ఆత్మనాథన్ చేతిలో పెట్టి వెళ్లాడు. ఆత్మ తీసి చదివాడు "తీయని గొంతు. భారతదేశపు గొంతు."

కచేరీ అయిన మరుసటి రోజు గౌరి ఒక దినపత్రికతో సుబ్బులక్ష్మి దగ్గరకు వెళ్లింది.

"నిన్న కచేరీ గురించి పేపర్లో రాశారు. చదవనా?"

"చదువు" అంది సుబ్బులక్ష్మి, తన పాట గురించి ఏమన్నారో అనే కుతూహలంతో. ఎవరన్నా తప్పులెంచితే సరిదిద్దుకుందామనే తపనతోనే తప్ప తనను పొగిడితే విందామని కాదు. గౌరి చదవటం మొదలుపెట్టింది.

'కర్ణపేయమైన కర్ణాటక సంగీతం అనగానే స్ఫురించే పేరు ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి. సంగీత రంగంలో జాతీయ అంతర్జాతీయ ఖ్యాతిగడించిన ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి నిన్న సంస్కృత కళాశాలలో కచేరీ చేశారు. ప్రధాన భారతీయ భాషల్లోనేకాక ఇంగ్లీషు, ఉర్దూ, అరబిక్, జపాన్ భాషల్లో సైతం మధురాతి మధురంగా గానంచేసి, దేశ భాషా సీమలను చెరిపివేసిన మహా గాయని సుబ్బులక్ష్మి. నిన్న సంస్కృత భాషలోని కృతులు ఎక్కువ పాడారు. ఏ భాషలో పాడినా అదే తన మాతృభాష అన్న రీతిలో పాడుతారు. వీరు విష్ణుసహస్ర నామాలు పాడుతున్నప్పుడే అగ్నిహోత్రం తాతాచారి గారు వీరి వాక్శుద్ధి విని అబ్బురపడ్డారు. ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మిగారిలో ఇంకొక ప్రత్యేకత ఏమిటంటే పాటలోని భక్తి భావంలో మమేకం చెంది పాడుతారు. సంస్కృత కళాశాల ప్రాంగణంలోని రసజ్ఞులందరిలో భక్తిభావన రేకెత్తించారు.'

"గౌరీ, నేను ఎలా పాడేనో రాయలేదా" ఇవన్నీ నేను వింటూవస్తున్నవే, అనే ధోరణిలో అడిగింది.

"ఊ... చెప్తానాగు..." అంటూ పేపర్‌లోకి ఇంకా తలదూర్చింది గౌరి.

"ఆ......... ఇక్కడ రాశారు.. చదువుతా విను బామ్మా" 'ఎమ్.ఎస్. అంటే మెలోడియస్ సింగర్. ఆమె కర్ణాటక సంగీత కళాకారిణిలలో అగ్రగణ్యులు అని అంటే అతిశయోక్తి ఈషణ్మాత్రం కూడా లేదు. ఎమ్.ఎస్.కు ప్రపంచవ్యాప్తమైన ఖ్యాతి రావటానికి అతి ముఖ్యమైన కారణం ఆమె మధురాతి మధురమైన కోకిల గాత్రం. నిన్న సంస్కృత కళాశాల ఆవరణలోని రసజ్ఞులు ఆ గాత్ర మాధుర్యానికి మైమరచిపోయారు. ఈ గాత్రం కోట్లమందిలో ఒకరికి......' అని చెప్తూ ఉండగా, "గౌరీ! గొంతు గురించి కాదు, ఎలా పాడానో రాయలేదా..." "లేదు, అంతే రాశారు" అని చెప్పి పేపర్ ప్రక్కన పెట్టింది గౌరి. నిరాశపడింది సుబ్బులక్ష్మి.

"ఆ గొంతుకంటే ఇంకేముందయ్యా ఆమెలో? మంచి కంచిపట్టు చీరొకటి కట్టి, కనుబొమ్మలు నాజూగ్గాచేసి, బొమ్మను తీసుకొచ్చినట్లు తీసుకొచ్చి స్టేజిమీద కూర్చోబెట్టి పాడమంటే తేనెపలుకులు పలుకుతుంది."

"పేద్ద కర్ణాటక సంగీత విద్వాంసురాలిగా, మసిపూసి మారేడుకాయని చేసినట్లు చేశాడయ్యా సదాశివం."



సుబ్బులక్ష్మి ఎదుగుదలను చూసి ఈర్ష్యపడుతున్నవాళ్ల సంఘకార్యకలాపాల వృత్తాంతం ఇది.

సుబ్బులక్ష్మి చెవిన ఈ వదంతులు ఏదో ఒకచోట, ఏదో ఒక రూపేణ పడుతూనే ఉన్నాయి.

కర్ణాటక విద్వాంసుల ఒక వర్గం అభిప్రాయం ఇలా ఉన్నా ప్రజలు మాత్రం నూటికి నూరుశాతం సుబ్బులక్ష్మికి బ్రహ్మరథం పట్టారు. కర్ణాటక సంగీతం అంటే గుర్తొచ్చేది సుబ్బులక్ష్మి.

ఈ సంవత్సరం ఆఖరున మహారాజా స్వాతి తిరునాళ్ 175వ జయంతి ఉత్సవాలకి, కర్ణాటక సంగీతజ్ఞులందరూ తిరువనంతపురం ఆహ్వానించబడ్డారు. స్వాతి తిరునాళ్ స్వయంగా వాగ్గేయకారులు కాబట్టి దక్షిణ భారతదేశ సంగీతజ్ఞులందరూ ఉన్నారు. ఒకరి తర్వాత ఒకరు కచేరీ చేస్తూ ఉన్నారు. ఒకరోజు ఒక ప్రముఖ సంగీతజ్ఞుడు తన కచేరీకి తయారవుతూ త్రాగటానికి వేడినీళ్లు కావాల్సొచ్చింది. తన విడిదిలోని వంటగది దగ్గరకు వెళ్లాడు. ఆ ఇంటి వంటమనిషి పనులన్నీ చేసుకొని అలసిపోయి నిద్రపోతూ ఉంది. ఈ విద్వాంసుడు వెళ్లి, "ఏమ్మా! లే, నాకు కచేరీకి వేళవుతుంది, త్రాగటానికి కాస్త గోరువెచ్చని నీళ్లు ఇవ్వు" అని నిద్రనుంచి లేపాడు.

ఆ వంట మనిషి లేచి వెళుతూ, "ఆ.... ఈయనో పెద్ద ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి.. కచేరీ చేస్తాడంట... వేడినీళ్లు కావాలంట..." అని తిట్టుకుంటూ వెళ్లింది.

సుబ్బులక్ష్మి ఇంటింటా వంటింటా నానుతున్న, పేరున్న కర్ణాటక విద్వాంసురాలిగా పేరొచ్చింది.

అయినా సుబ్బులక్ష్మికి తనివితీర లేదు. తనకు విద్వత్తు లేక కాదు కానీ శుద్ధమైన కర్ణాటక కృతులకంటే తేలికైన రాగాలతో కూడిన భజనలే ఎక్కువ పాడుతుంది. సదాశివం ఆదేశాల మేరకు అలా పాడవలసివస్తుంది. అలా పాడుతున్నందుకు దేశమంతటా పేరొచ్చింది. చాలా సంతోషం సుబ్బులక్ష్మికి, కానీ పట్టమ్మ, వసంతకుమారిలాగా క్లిష్టమైన రాగం తానం పల్లవి, రాగాలాపనలు, నెరవులు, స్వరకల్పనలు చేసే స్వేచ్ఛ తనకు లేదని సన్నిహితుల దగ్గర బాధపడుతుంది. వీటన్నిటికి విరుగుడుగా సుబ్బులక్ష్మికి మంచి ఆలోచన వచ్చింది. సుబ్బులక్ష్మిలోని కర్ణాటక సంగీత విద్వత్తు ఉవ్వెత్తున లేచింది.

"మామా! నేను మేళకర్త రాగమాలిక నేర్చుకొని రికార్డు చేస్తాను మామా" అంది సదాశివంతో.

అప్పటికి సదాశివంకి పూర్తిగా తెలియదు అదేంటో.

కర్ణాటక సంగీతంకు రాగం మూలస్తంభం. ప్రధానమైన రాగాలను క్రోడీకరించే బృహత్కార్యం 16వ శతాబ్దం నుంచీ జరుగుతూ వచ్చింది. రామామాత్య (16వ శ),

వేంకటమఖి (17వ శ), మహావైద్యనాథ్ అయ్యర్ (19వ శ) ఈ మహాకార్యానికి ఆద్యులు.

సుబ్బులక్ష్మి రికార్డు చేయటం మొదలుపెట్టిన మేళకర్త రాగమాలిక మహావైద్యనాథ్ అయ్యర్ విరచిత మేళకర్త రాగమాలిక. 72 జన్య రాగాలలో 72 వరుసలలో వ్రాయబడింది. ఒక వరుస ఒక రాగంలో ఉంటే ఆ తరువాతి వరుస ఇంకొక రాగంలో ఉంటుంది.

తిరువారూరులో ప్రణతార్తిహార అని పిలవబడే పరమశివుడిని కీర్తిస్తూ రచించబడ్డ రాగమాలిక. అలా 72 కర్ణాటక రాగాలు వెంటవెంటనే ఉంటాయి. పాడేటప్పుడు ప్రతి వరుసలో ఉండే ఒక్కొక్క విశిష్టమైన రాగాన్ని, ఆ రాగ లక్షణాలు బహిర్గతపరుస్తూ జాగ్రత్తగా పాడాలి.

వెంటనే సెమ్మంగుడి సుబ్బులక్ష్మి ఇంటికి వచ్చేశాడు. చర్చలు జరిగాయి. సెమ్మంగుడి పచ్చజెండా ఊపాడు. సుబ్బులక్ష్మి వెంటనే పాట నేర్చుకోవటం మొదలుపెట్టింది.

72 ఏళ్ల వయసులో 72 మేళకర్త రాగమాలికను సుబ్బులక్ష్మి నేర్చుకోవటం చూస్తున్న సెమ్మంగుడి, "కుంజమ్మా, నువ్వు మళ్లీ విద్యార్థినివైపోయావు. నిత్య విద్యార్థివి నువ్వు" అని అన్నాడు సుబ్బులక్ష్మి అంకిత భావాన్ని మెచ్చుకుంటూ.

జనవరిలో గాంధీ వర్ధంతి సందర్భంగా సర్వ మత ప్రార్థనలకు ఢిల్లీ వెళ్లింది.

అక్కడ నుంచి వచ్చిన తర్వాత కంచి పరమాచార్య ముందు శివరాత్రి పూజలో పాటలు పాడటానికి, కంచి చేరుకుంది. సుబ్బులక్ష్మి కంచి స్వామి ముందు పరమానందభరితురాలై పాడుకుంది.

నారాయణ తీర్థులు ఆంధ్రప్రదేశ్‌లోని మంగళగిరి సమీపంలోని కాజా గ్రామంలో తల్లావఝ్జల గోవింద శాస్త్రిగా పుట్టి దైవ సంకల్పముచే తంజావూరు వెళ్లి వేదాలు, పురాణాలు, సంస్కృతం, నాట్య, సంగీత శాస్త్రాలు అధ్యసించి. కర్ణాటక సంగీత వాగ్గేయకారులలో మొదటి తరంగ రచయితలలో ఒకరయ్యారు.

కానీ ఆయన వ్రాసినవన్నీ సంస్కృత కృతులు, తరంగాలు అవటంచేత పండితుల ఆదరణ తప్ప, ప్రజాదరణ పొందలేదు. నారాయణ తీర్థుల వారి వారసులు, అభిమానులు ఆయన కృతులను జనంలోకి తీసుకు రావటానికి, నారాయణ తీర్థ ఆరాధనోత్సవాలు జరుప సంకల్పించారు. ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి 1938లో 'మా రమణన్' ఆలపించిన దగ్గర నుంచి కర్ణాటక సంగీత కచేరీలలో అది తప్పనిసరిగా పాడే ఒక పాట అయ్యింది. ప్రతి సంవత్సరం మద్రాస్ మ్యూజిక్ అకాడమీ కచేరీలో సదాశివం అంతగా ప్రాచుర్యం పొందని వాగ్గేయకారుడి పాట సుబ్బులక్ష్మి చేత పాడించి, ఆ వాగ్గేయకారుడి కృతి ప్రజల్లోకి తీసుకొచ్చేవాడు.



ఎవ్వరి నోటన పాడితే పాట పారిజాతమవుతుందో, ఎవ్వరు పాడితే పాట ప్రజలకు చేరువవుతుందో అలాంటివారి దగ్గరకే నారాయణతీర్థ ఆరాధన సంస్థ సభ్యులు వచ్చారు.

ఇలాంటి సుకృత్యాలు చేసే అలవాటు సుబ్బులక్ష్మికి, సదాశివంకి ఎప్పటినుంచో ఉంది కాబట్టి తిరుప్పుందుర్తి నారాయణతీర్థుల ఆరాధనోత్సవాల్లో నారాయణ తీర్థుల కృతులతో కచేరీ చేసింది.

ముప్పైరెండేళ్ల సుబ్బులక్ష్మికి క్షణం తీరిక లేకుండా ఎలా కచేరీలతో ముంచెత్తాడో అచ్చం అలానే ఈ డెబ్బైరెండేళ్ల వయస్సులో కూడా సదాశివం సుబ్బులక్ష్మిని తిప్పుతున్నాడు. సదాశివంకు ఎనభైఆరేళ్లు. నారాయణతీర్థులు వారి ఆరాధనోత్సవాల తర్వాత మళ్లీ ఢిల్లీ వెళ్లారు. ఆ తర్వాత ఈరోడ్, మదురై, ఆ తర్వాత మళ్లీ ఢిల్లీ. తర్వాత కోయంబత్తూరు, మళ్లీ ఢిల్లీ. ఢిల్లీకి స్పాస్టిక్ సొసైటీకి విరాళం కోసం కచేరీ చేయమని పిలిస్తే, ఈరోడ్‌లో కోదండరామస్వామి గుడి అభివృద్ధికై విరాళాలు సేకరించటానికని. ఇలా ఈ సంవత్సరం అంతా కచేరీలతో తీరిక లేకుండా గడిచిపోతుంది. ఎక్కడికి వెళ్లినా రైలుప్రయాణమే చేస్తారు. దగ్గరయితే కారు. రైలులో అయితే పదిహేనుమందికి తగ్గకుండా తీసుకువెళ్తాడు సదాశివం. వారందరు పేకాట వచ్చినవాళ్లయ్యే ఉండాలి. సదాశివం భోజనాల ఏర్పాటు ఎలా చేస్తాడంటే ఒక స్టేషన్‌లో ఎవరో ఒకరు తెలిసినవాళ్లు వాళ్ల ఇంట్లో వండుకొని స్టేషన్‌లో అందిస్తారు.

మద్రాసు విశ్వవిద్యాలయం సంస్కృత విభాగం ప్రాంగణంలో శ్రీఆదిశంకర భగవత్పాదుల ఉత్సవంలో కచేరీ చేయటానికి తయారవుతుంది సుబ్బులక్ష్మి. తన సహవాద్య కళాకారులందరూ ఎప్పుడో వచ్చారు. వాళ్లందరితో ఒక దఫా సాధన కూడా చేసింది. ఇక స్నానానికి వెళ్లింది. ఈ లోపల విశాలం సుబ్బులక్ష్మి కట్టుకునే చీర మంచం మీద పెట్టింది. ఇంకా తలలోకి మల్లెపూల చెండు, రెండు పక్కపిన్నులు కూడా. సుబ్బులక్ష్మి వచ్చి చీరకట్టుకొని, తయారవటం మొదలుపెడుతోంది. రాధ, విజయ, గౌరి, రాధ కోడలు మాల కూడా గదిలోకి వచ్చారు. మొహానికి కాంపాక్ట్ అద్దుకుంది సుబ్బులక్ష్మి. విశాలం జడవేసి కొప్పు పెట్టింది. సుబ్బులక్ష్మి మల్లెపూల చెండు పెట్టుకుంది. ఇంక వరుసపెట్టి ఐదు బొట్లు జాగ్రత్తగా పెట్టుకుంది. చివరిగా లేచి, అంతా సరిచూసుకొని, అల్మారలో ఉన్న అత్తరు సీసా తీసింది. "మా అమ్మ అత్తరు సీసా ఎవరికన్నా ఎప్పుడు ఇస్తుందో తెలుసా మాలా........" అడుగుతుంది రాధ తన కొత్త కోడలుని. "మా అమ్మకు ఆ అత్తరు వాసన నచ్చకపోయన్నా ఉండాలి లేకపోతే ఆ మనిషన్నా నచ్చకపోవాలి..."

"అమ్మో ఏది ఏమయినా నాకు అమ్మ నుంచి అత్తరు సీసా బహుమతిగా వద్దు బాబోయ్" అంటూ మనస్ఫూర్తిగా దండం పెట్టుకుంది మాల. అందరూ పగలబడి నవ్వుకున్నారు.

సుబ్బలక్ష్మి తన చీర మీద అత్తరు చల్లుకొని, తన చేతి రుమాలులో ఒకసారి చల్లుకొని అందరినీ చల్లుకోమని అత్తరు సీసా ముందుగా గౌరికి ఇచ్చింది. గౌరి గట్టిగా నొక్కి అత్తరంతా కొట్టుకుంటూ ఉంది. వెంటనే సుబ్బలక్ష్మి, "ఆ..... మెల్లగా మెల్లగా... కొంచెం కొట్టుకో.... అంతా కాదు...." అంది ఆదుర్దాగా. "మా అమ్మ గుమ్మడికాయలు పోయే కంతను వదిలి ఆవాలు పోయే కంతను పట్టుకుంటుంది" అంది రాధ. మళ్లీ నవ్వుల వాన. కూతురు తనమీద ఛలోక్తులు వేసినా చిన్న పిల్లలాగా గట్టిగా నవ్వుకుంది సుబ్బలక్ష్మి. రాధ అన్నదాంట్లో నిజం గ్రహించకపోలేదు సుబ్బలక్ష్మి.

అందరూ కలిసి నాలుగు కార్లలో మద్రాసు విశ్వవిద్యాలయం చేరుకున్నారు. సుబ్బలక్ష్మి వేదిక మీదకు రాగానే విశ్వవిద్యాలయంలోని విద్యార్థులు 'ఎమ్మెస్', 'ఎమ్మెస్ అమ్మా' అని కేకలేయటం మొదలుపెట్టారు.

"తంబీ... ఇప్పుడు కదా.... 'ఎమ్మెస్, ఎమ్మెస్...' అప్పుడు మేము మదురైలో హనుమంతరాయ వీధిలోకి వెళ్లామని తెలిస్తే చాలు మా అమ్మ చీపురుకట్ట తిరగేసేది. అందుకే అంటారు నది మూలాలు, ఋషి మూలాలు తెలుసుకోకూడదని....."

"ఇల్లై అణ్ణా.... ఆ మాటకొస్తే సుబ్బలక్ష్మి గంగోత్రి, అభిమానం నిలుపుకోవటానికి ఎంతకైనా సిద్ధపడుతుంది.....ఏమైనా చేస్తుంది..."

𝄞 𝄞

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సుబ్బలక్ష్మిని జీవితకాల ఆస్థాన విద్వాంసురాలిని చేస్తే, తమిళనాడు ప్రభుత్వం 'తనిపెరుమ్ కలైంగ్నర్' బిరుదుతో సత్కరిస్తే, మధ్యప్రదేశ్ ప్రభుత్వం 'కాళిదాస్ సమ్మాన్' ప్రకటించింది. ఈ సన్మానాన్ని అందుకోవటానికి భోపాల్ చేరుకుంది సుబ్బలక్ష్మి.

అక్కడ ఇద్దరు దంపతులు వచ్చారు. "మీ హనుమాన్‌చాలీసా మా అమ్మాయికి రోజూ వినిపిస్తాము, దానివల్ల మందులతో నయంకాని రోగం నయమైంది" అని చెప్పారు.

ఎక్కడికి వెళ్లినా సుబ్బలక్ష్మి ఆ దగ్గరలో ఉన్న సత్పురుషులను కలిసి ఆశీస్సులు తీసుకుంటుంది. అలానే భోపాల్‌కి దగ్గరలోని ఉజ్జయిని నగరంలో మౌని బాబా అనబడే బాబా దగ్గరకు వెళ్లింది. మౌని బాబా మౌనంగానే ఉంటారు తప్ప మాట్లాడరు. అత్యవసరమయితే పలకమీద వ్రాస్తారు. సుబ్బలక్ష్మిని ఆశీర్వదిస్తూ పలకమీద ఆశీర్వచనాలు వ్రాసి ఇచ్చారు.

మద్రాసుకు వచ్చీ రాగానే సదాశివం 'కాళిదాస్ సమ్మాన్'తోపాటు ఇచ్చిన నగదు బహుమతిని ఒకరికి ఇచ్చి కంచి పరమాచార్యకు పంపించాడు.

"సదాశివంగారు మీ పాదాలవద్ద పెట్టిరమ్మని పంపారు" అని చెప్పి సదాశివం మనిషి ఆ డబ్బు పరమాచార్య ముందు పెట్టాడు.



"ఎంత" పరమాచార్య అడిగారు.

"లక్ష రూపాయలు స్వామి."

"ఈ లక్షతో ఒక బంగారు హారం చేయించుకొని తీసుకురా, ఆడవారు వేసుకునేట్లు" అని చెప్పారు పరమాచార్య.

వెంటనే సదాశివం మనిషి కంచిలోనే బంగారం కొట్టుకు వెళ్లి, ఆ డబ్బుతో హారం చేయించుకొచ్చాడు. పరమాచార్య దగ్గరకు వచ్చాడు. పరమాచార్య ఆ హారం తన చేతుల్లోకి తీసుకొని "ఇది సుబ్బలక్ష్మిని వేసుకోమని చెప్పు. నేను ఇచ్చిన తర్వాత సదాశివం ఇది ఎవరికీ దానం చేయడు."

పరమాచార్యకు తెలుసు సదాశివం అవకాశం ఉన్నా కూడా సుబ్బలక్ష్మికి నగలు చేయించటమే లేదని, అందుకే ఆయన ఈ ఏర్పాటు చేశారు.

సుబ్బలక్ష్మి మేళకర్త రాగ మాలిక సంపూర్ణంగా నేర్చుకుంది. హెచ్.ఎమ్.వి. వారి రికార్డింగు స్టూడియోకి వెళ్లి రికార్డు చేసే ముందు తన పూజగదిలో పాడి కంచి పరమాచార్యకు తొలి అర్పణం చేసింది. రికార్డింగు పూర్తయింది. మహా వైద్యనాథ్ అయ్యర్ రచించిన మేళకర్త రాగమాలిక ఇప్పటిదాకా సంగీత పుస్తకాలలోనే ఉంది. సుబ్బలక్ష్మి పుణ్యమాని ఇప్పుడు వినటానికి కూడా అవకాశం వచ్చింది. మేళకర్త రాగమాలిక పుస్తకంలో ఉన్నంత తేలికైన పాటకాదు. 72 జన్యరాగాలను పలికించాలి. అది కూడా ఒక్కొక్క రాగం లక్షణాలు ఒక్కొక్క పంక్తిలోనే తెలపాలి. ఒక రాగం తరువాత చిట్టస్వరాలుంటాయి. చిట్టస్వరంలో పూర్వాంగం పాడిన రాగానిదయితే, ఉత్తరాంగం పాడబోయే రాగానిది. కర్ణాటక సంగీతంలో ఎంతో విద్వత్తు ఉన్నాకానీ మేళకర్త రాగమాలిక పాడటానికి వెనకాడుతారు సంగీతజ్ఞులు. అలాంటి గొప్ప పనిని సుబ్బలక్ష్మి ఈ ముదిమి వయసులో సాధించింది. అందుకే కంచి పరమాచార్యులవారి దగ్గరకు మేళరాగ మాలిక మొదటి రికార్డుని తీసుకువెళ్లి ఆశీర్వదించమన్నప్పుడు, "సూర్యచంద్రులు ఉన్నంతవరకు సుబ్బలక్ష్మి యొక్క ఈ మహత్కార్యము ఉండిపోతుంది" అని ఆశీర్వదించారు.

ఆయన అన్నట్లే సుబ్బలక్ష్మి పాడిన మేళరాగమాలిక కర్ణాటక సంగీత చరిత్రలో ఒక మైలురాయి అయింది.

𝄞 𝄞

1960లలో లబ్ధి కచేరీలు కాకుండా ఇతర కచేరీలకు పదివేల రూపాయలు తీసుకునేవాడు సదాశివం. 1977లో ఇక సుబ్బలక్ష్మి డబ్బులకు పాడదు అని ప్రకటించే ముందు దాకా అంతకు రెండింతలు తీసుకున్నాడు. ఆ వెంటనే డబ్బుకి చేసే కచేరీలు మాన్పించాడు. పొరపాటున ఎవరైనా డబ్బు ఇస్తే ఆ డబ్బుని అక్కడికక్కడే ఎవరో ఒకరికి

దానం చేసేవాడు. పురస్కారాలతోపాటు వచ్చే నగదు బహుమతి కూడా. 1974లో రామన్ మెగసెసె అవార్డుకి ఇచ్చిన పదివేల అమెరికా డాలర్లు మూడు భాగాలు చేసి, భారతీయ విద్యా భవన్ సంస్థకు, వాలెంటరీ హెల్త్ సర్వీసెస్, మద్రాస్‌కు, కుంభకోణంలోని రాజ వేద పాఠశాలకు సమానంగా విరాళం ఇచ్చాడు సదాశివం. ఆ తర్వాత తర్వాత ఇంకో నాలుగడుగులు ముందుకు వేసి ఎవరికైతే విరాళంగా ఇవ్వదలచుకున్నాడో వాళ్లని కూడా ఆ కార్యక్రమానికి తీసుకువెళ్లి, వీలైతే వేదికమీద, వీలుకాకపోతే వేదిక ముందు కూర్చోబెట్టి, నగదు బహుమతి అందగానే అదే వేదిక మీద విరాళంగా వాళ్లకి ఇచ్చేసేవాడు.

ఇప్పుడు రాజీవ్‌గాంధీ ఇచ్చిన లక్షరూపాయలు తీసుకున్న వెంటనే సదాశివంవైపు రావటానికి చూసింది సుబ్బలక్ష్మి. రాజీవ్‌గాంధీ అడ్డుగా ఉన్నందున ఒక్క క్షణంపాటు ఆ ప్రయత్నం ఆపింది. కాని చేతిలో ఏదో ముళ్లకంప ఉన్నట్లనిపించింది. రాజీవ్‌గాంధీని మెల్లగా తోసుకుంటూ వచ్చింది. సుబ్బలక్ష్మి రావటం చూసి రాజీవ్‌గాంధీ, అప్పటి కేంద్ర మంత్రి పి.వి. నరసింహారావు వెంటనే వెనక్కు జరిగారు. వారిద్దరినీ హడావుడిగా దాటుకొని సదాశివం చేతిలో డబ్బులు పెట్టింది, సదాశివం కాళ్లకు నమస్కారం చేసే వీలు, వాలు అక్కడ లేదు కాబట్టి చేయిని తాకి నమస్కారం చేసుకుంది. వెంటనే సదాశివం ఆ డబ్బుని వేదికపైనే ఉన్న 'లబ్ధిదారుడికి' ఇచ్చివేశాడు.

ఈ లక్షరూపాయలు సుబ్బలక్ష్మికి ఇందిరాగాంధీ జాతీయ సమైక్యతకుగాను 1990 సంవత్సరానికి ఇవ్వబడింది. దక్షిణాదిన అన్ని భాషలలో, ఉత్తరాదిన మరాఠి, గుజరాతి, బెంగాలి, హిందీ, హిందీ భాష యొక్క మాండలికాలయిన బ్రజ్, భోజ్‌పురి లాంటి భాషల్లో కూడా పాడి, అన్ని భాషల వాగ్గేయకారుల, భక్తికారుల పాటలు పాడి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి గొంతు అనే గొడుగు కింద దేశ ప్రజలందరినీ ఒక్కటి చేసిన సుబ్బలక్ష్మికంటే ఈ ఇందిరాగాంధీ జాతీయ సమైక్యత పురస్కారానికి అర్హులెవరు?

𝄞𝄞

సదాశివం పుణ్యమా అంటూ సుబ్బలక్ష్మికి డబ్బు మీద కోరిక పోయింది. చిన్నప్పుడు ఎప్పుడో పప్పుకూర, నెయ్యితో అన్నం కావాలనుకుంది. ఆ కోరిక త్వరలోనే తీరింది. యుక్తవయసులో పెళ్లిచేసుకోవాలనుకుంది. ఆ కోరికా తీరింది. కోరకుండానే పేరు, విద్వత్తు, డబ్బు పెరుగుతూనే వచ్చాయి. పేరు హెచ్చేకొలదీ ఒదగటం నేర్చుకుంది. విద్వత్తు పెరిగేకొద్దీ నిత్య విద్యార్థి అయింది. డబ్బు వచ్చేకొద్దీ దాతృత్వం అలవర్చుకొంది. ఒక్క కోరిక తప్ప సుబ్బలక్ష్మికి ఇంక ఏ కోరికలూ లేవు. ఆ కోరిక ఏమిటంటే తను సుమంగళిగా చనిపోవటం. సుబ్బలక్ష్మి సదాశివం దంపతులు 1990 దశకంలోకి అడుగుపెట్టారు. సుబ్బలక్ష్మి 74 ఏళ్లు, సదాశివం 88 ఏళ్లు వెనకేసుకొచ్చారు. సుబ్బలక్ష్మికి తన భక్తి, తన సంగీతమే ఆధారం. ఎన్ని డక్కాముక్కీలు తిన్నా తన సంగీతంలోనే సేదతీరింది. తనకు దక్కని ప్రశాంతతని తన సంగీత సాధనలో దక్కించుకుంది. తనకు ఇవ్వని స్వేచ్ఛని సంగీత రాగ, తాళ, లయ, స్వర ప్రస్తారాలతోపాటు విహరించి, తన అంతరాత్మకు అనంతమైన స్వేచ్ఛనిచ్చుకుంది. ఆ స్వేచ్ఛ సుబ్బలక్ష్మి ప్రతి కదలికలో కనిపిస్తుంది. ఆ ప్రశాంతత సుబ్బలక్ష్మి మోములో తొణికిసలాడుతూ ఉంటుంది. సుబ్బలక్ష్మి ప్రశాంతమైన వదనాన్ని, సున్నితమైన కదలికలని రెప్పవాల్చకుండా చూడాలనిపిస్తుంది. ఆమె నుంచి తేజోమయమయిన కిరణాలు నిరంతరం, శక్తి తరంగాలలా, చల్లగా ప్రసరిస్తూ ఉంటాయి. చంద్రకాంతిని మించుతాయి. 74 ఏళ్లకి ఆ మొహం చాలా చురుగ్గా, అందంగా, హుందాగా ఉంది. సదాశివం 88 ఏళ్ల ముసలివాడిలానే ఉన్నాడు. ఆ బోసినోరులో వయస్సు పూర్తిగా కనిపిస్తుంది. బుర్రమాత్రం ఇంకా పదునుగానే ఉంది. ఒకసారి 'దేనా బ్యాంక్' ప్రతినిధులతో సంప్రదింపులు జరుగుతుండగా, వారు రుణం నిరాకరించారు. అందుకు సదాశివం, "అయితే మీది 'దేనా బ్యాంక్' కాదన్నమాట 'లేనా బ్యాంక్' మాత్రమే" అని ఛలోక్తి వేశాడు.

పైకి ఎలా ఉన్నా సుబ్బలక్ష్మి షుగర్ వ్యాధితో బాధపడుతుంది. అప్పుడప్పుడు జ్వరాలు వస్తూ ఉంటాయి. ఒకసారి గాల్‌బ్లాడర్ తొలగించే శస్త్రచికిత్స జరిగింది. ఇప్పుడు కీళ్లనొప్పులు కూడా మొదలయ్యాయి. బాసింపట్టు వేసుకొని గంటల తరబడి కచేరీలలో కూర్చోవటం కష్టంగా ఉంటుంది. సదాశివం ఇంకా మెత్తబడ్డాడు. కదలికలు చాలా నెమ్మదించాయి. సుబ్బలక్ష్మి తన కోరికను పదేపదే దేవుడి దగ్గరే కాకుండా అందరి దగ్గరా చెపుతుంది. రాధ ఒక్కటే గట్టిగా సమాధానం చెప్పగలదు. "అమ్మా! నాన్న నీకంటే పద్నాలుగేళ్లు పెద్ద. నువ్వు ఇలాంటి కోరికలు కోరుకోకు" అని సుబ్బలక్ష్మి దేనికైనా సిద్ధంగా ఉండాలని చెప్తుంది.

𝄞𝄞𝄞𝄞

సుబ్బలక్ష్మికి వచ్చే కచేరీ పిలుపులు, పురస్కార ప్రకటనలు, ప్రారంభోత్సవ ఆహ్వానాలు, ఇంటర్వ్యూలకి వచ్చే విలేఖరుల సంఖ్య రోజుమీద రోజు పెరుగుతూనే ఉంది. సదాశివం ఎప్పటిలానే వాటిని వడకడతాడు. కొన్నిటిని చూసి చూడగానే తుక్కుబుట్టలోకి వేస్తాడు. కొన్నిటి గురించి వాకబు చేసుకుంటాడు. సుబ్బలక్ష్మి కచేరీ కోసం కానీ, ఆమెకు పురస్కారం ఇవ్వాలనుకునే సంస్థలు ముందుగానే గట్టి సిఫార్సుతో వస్తాయి. ఎలా అయితేనేమి, ఆంధ్రప్రదేశ్‌లోని ఏలూరు పట్టణ ప్రజలు అదృష్టవంతులు. సుబ్బలక్ష్మి దర్శనభాగ్యం కలుగబోతుంది వాళ్లకు. సదాశివం ఏలూరివారి గుప్తా ఫౌండేషన్ పురస్కారం అందుకోవటానికి ఏలూరు రావటానికి, సుబ్బలక్ష్మి చేత కచేరీ ఇప్పించటానికి ఒప్పుకున్నాడు.

𝄞𝄞

సుబ్బులక్ష్మి ఇంటర్వ్యూ కోసం బొంబాయి నుంచి ఒ.కె. జోషి అనే విలేఖరి వచ్చాడు. అతన్ని సదాశివం ముందు కూర్చోబెట్టారు. "అడగండి, మీ ప్రశ్నలేమిటి" చెప్పాడు సదాశివం.

"నేను సుబ్బులక్ష్మిగారి ఇంటర్వ్యూకి వచ్చాను. వారిని పిలిపిస్తే నేను వారిని ఇంటర్వ్యూ చేస్తాను" చెప్పాడు ఆ విలేఖరి.

"ఆమె ఎవరితోనూ మాట్లాడదు. నాతో మాట్లాడండి. మీకు అన్ని ప్రశ్నలకి నేను సమాధానం చెప్తాను" ఇంతకంటే వేరే దారిలేదు మీకు అన్నట్లు చెప్పాడు.

"క్షమించాలి. అన్ని ప్రశ్నలకు మీరెలా చెప్పగలుగుతారు........ ఆమె మనసులో ఏమనుకుంటున్నారో మీరెలా చెప్పగలుగుతారు, ఆమె పాట గురించి ఆమె కాకుండా ఇంకొకరు చెప్పి ఏమి లాభం?"

"మీరు ఒక పువ్వుని ఎలా విచ్చుకుంటుంది, ఎలా సువాసనలు వెదజల్లుతుంది అని అడిగితే ఆ పువ్వేమి చెప్పగలదు? అలాగే సుబ్బులక్ష్మిని అంత అందంగా ఎలా పాడతారు అని అడిగితే తను కూడా చెప్పలేదు."

"మీరు చెప్పగలుగుతారా....." మనసులో అడిగాడు సదాశివాన్ని ఆ విలేఖరి.

ఇక సుబ్బులక్ష్మిని ఇంటర్వ్యూ చేసే వీలు ఎలాగూ ఉన్నట్లు కనిపించటంలేదు కాబట్టి బొంబాయి నుంచి వచ్చినందుకు సదాశివంనే సుబ్బులక్ష్మి గురించి అడగటం మొదలుపెట్టాడు.

"ఈ మధ్యనే సుబ్బులక్ష్మి గారికి ఇందిరాగాంధీ జాతీయ సమైక్యతా పురస్కారం ప్రదానం చేశారు కదా, ఆమెకు దేశ భాషలన్నింటిలో ఏ భాషలో పాడటం ఇష్టం?"

"మీకు బహుశా తెలియదనుకుంటా... నేనూ, సుబ్బులక్ష్మి స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నాము. భారతదేశంలోని అన్ని భాషలు మాకు సమానమే. పైగా ఒక గాయనికి భాషతో పనిలేదు భావమే ప్రధానం. సుబ్బులక్ష్మికి అన్ని భాషలు ఒకటే."

సుబ్బులక్ష్మి అయితే ఏ భాషో చెప్పి ఉండేదేమో అనుకుంటూ రెండో ప్రశ్నలోకి వెళ్లాడు.

"సుబ్బులక్ష్మి గారికి కర్ణాటక సంగీతం ఒక శాస్త్రమా లేక కళా?"

"శాస్త్రీయ సంగీతం కదా, అది శాస్త్రమే."

సుబ్బులక్ష్మికి సంగీతం శాస్త్రమూ కాదూ.. కళా కాదూ.. తన జీవితం అది.

అలా ఇంటర్వ్యూ జరిగిపోతూ ఉంది. అరగంట తర్వాత సుబ్బులక్ష్మి ఆ గదిలోకి వచ్చి సోఫాలో కూర్చుంది. ఒ.కె. జోషి ఇంగ్లీష్‌లో అడుగుతున్నాడు. సదాశివం కూడా ఇంగ్లీషులోనే సమాధానం చెప్తున్నాడు. సుబ్బులక్ష్మి ఒక పదినిమిషాలు అక్కడుండి మళ్లీ లోపలికి వెళ్లిపోయింది. ఒ.కె. జోషి ఇంకో పదినిమిషాలు ఇంటర్వ్యూ చేసి, ఇక



పూర్తయినదని చెప్పి, "నేను ఎమ్.ఎస్. గారిని ఎప్పుడూ చూడలేదు. ఒక్కసారి ఆమెను పిలిపిస్తారా...... చూసి వెళ్తాను. వీలైతే ఫోటో తీసుకుంటాను."

నిర్ఘాంతపోయాడు సదాశివం. "ఇప్పుడు మన ముందు ఒకామెవచ్చి కూర్చొని వెళ్లారు కదా...... మీరు చూడలేదా?"

"చూశాను..."

"మరి ఆమే ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి."

ఈసారి నిర్ఘాంతపోవడం ఆ విలేఖరి వంతయింది. ఆయన వచ్చిన బొంబాయి మహానగరంలో కూడా ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి.... ఎమ్మెస్. అని కలవరించే దక్షిణాదులు, మరాఠీ అభంగ్‌లు ప్రహ్లాదంగా పాడుతుంది శుభలక్ష్మి అని కలవరించే మరాఠీలు పదేపదే ఆమె గొంతు వినాలని, ఏమాత్రం వీలయినా చూడాలనుకునే ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి ఇంత సాదాసీదాగా ఎలాంటి పటాటోపం ప్రదర్శించకుండా ఉంటారా...... అని అనుకుంటూ, ఆ ఆశ్చర్యంలోనే బొంబాయి బయలుదేరాడు.

సుబ్బులక్ష్మి చూట్టానికి బ్రాహ్మణ ఇండ్లలో బామ్మగారులా ఉంటుంది. పలుకరిస్తే పసిపిల్లలా నిండుగా నవ్వుతుంది. మీ పాట అద్భుతం అంటే అంతా గురువుల దయ అంటుంది. మీ గొంతు అద్భుతం అంటే దేవుడి దయ అని దండంపెట్టేసుకుంటుంది. మీ వేంకటేశ్వర సుప్రభాతం రోజూ మా గుడిలో టేప్‌రికార్డులో ప్రొద్దున్నే వినిపిస్తాం అంటే నవ్వుతూ, పరమ సిగ్గుపడిపోతుంది. ఎవరన్నా ఆటోగ్రాఫ్ ఇవ్వమని వస్తే, 'ముందు మామది తీసుకో' అని పంపిస్తుంది. ఇదంతా సదాశివం చేతిలో తన జీవితాన్ని వదిలేసిన ఫలితం. చీరలదగ్గర నుంచి చెప్పులదాకా అన్నీ సదాశివమే చూసుకుంటాడు. రెండు రూపాయలకు, ఇరవై రూపాయలకు తేడా గుర్తించలేదు, ఇంటి ఫోన్ నంబర్ తెలియదు. సుబ్బులక్ష్మికి సంగీతం తప్ప ఆలోచించటానికి ఏమీ ఉండదు.

𝄞 𝄞

మోహన్ గుప్తా ఆయన భార్య మల్లీశ్వరి, ఏలూరు పట్టణ ప్రముఖులు సన్నాయిమేళంతో సహా ఏలూరు రైలు స్టేషన్‌కు చేరుకున్నారు. మద్రాసు నుంచి వస్తున్న రైలు అల్లంత దూరం నుంచి కనిపించగానే మేళాలు మ్రోగించటం మొదలుపెట్టారు. మేళంతోసహా సుబ్బులక్ష్మి దిగిన కంపార్ట్‌మెంట్‌కి త్వరగా వెళ్లి సుబ్బులక్ష్మిని పూలమాలలతో ముంచెత్తి స్వాగతం పలికారు. సుబ్బులక్ష్మి తన మెడ నిండుగా ఉన్న పూలమాలలు ఒక్కొక్కటీ తీసి గౌరికిస్తోంది. పూలమాలలన్నీ తీసి, ఊతంగా మల్లీశ్వరి చేతిలో ఒక చేయివేసి, ఇంకో చేత్తో సదాశివంని పట్టుకొని ప్లాట్‌ఫామ్ మీద నుంచి స్టేషన్ బైటికి నడుస్తున్నారు. సుబ్బులక్ష్మి దారిలో నమస్కారం చెప్తున్నవాళ్లకి ప్రతినమస్కారం చేస్తుంది. మొహంలో

నవ్వు తప్ప ఎక్కడా ప్రయాణ బడలికగానీ, అలసటగానీ, స్తబ్దత కానీ కనిపించటంలేదు. పరిసరాలతో, చుట్టూ వున్న మనుషులతో, జరుగుతున్న సందర్భంతో మమేకమై ఉంది.

సాయంత్రం ఐదున్నరకు ఏలూరు కట్టమంచి రామలింగారెడ్డి ఆడిటోరియంలో సన్మాన కార్యక్రమం. నాలుగ్గంటలకల్లా ఆడిటోరియం ముప్పావువంతు నిండిపోయింది. ఐదున్నరకల్లా సుబ్బులక్ష్మిని పూర్ణకుంభ స్వాగతంతో వేదోచ్చారణల మధ్య తోడ్కొని వచ్చారు. కూచిపూడి నాట్యవేషధారణలో ఉన్న చిన్నపిల్లలు నడుస్తున్న దారిలో పూలు పరుచుకుంటూ రాగా సుబ్బులక్ష్మి ఆడిటోరియంలోకి వస్తూ ఉంటే చిన్నా పెద్దా అందరూ లేచారు. ముందుగా సుబ్బులక్ష్మిని ఆడిటోరియమ్‌లో ప్రేక్షకుల కుర్చీలలోనే కూర్చోబెట్టారు. వేదిక మీదకి ఇంకా తోడ్కొని పోలేదు. ఇక్కడ సుబ్బులక్ష్మి అభిమానులకు దొరికిపోయింది. ఒక్కొక్కళ్లు ముందు వరసలో ఉన్న కుర్చీల మీద నుంచి వంగి మరీ సుబ్బులక్ష్మి కాళ్లకి నమస్కారం చేసుకుంటున్నారు. ఫోటోలు తీసుకునేవాళ్లు ఫోటోలు తీసుకుంటున్నారు. సుబ్బులక్ష్మి చక్కగా నవ్వుతూ ఫోటోలు దిగుతుంది. మళ్లీ చిన్నపిల్లలు పూలు పరచగా, కుర్చీల మధ్య ఆ ఇరుకైన చోటులోంచి, సదాశివం వెనుక సుబ్బులక్ష్మి ఒక చేత్తో సదాశివంని పట్టుకుని మెల్లగా నడుస్తూ ఉంది. మధ్యలో ఒకసారి ఒకళ్లు నమస్కారం చెపితే ప్రతినమస్కారం చెప్పటానికి, సుబ్బులక్ష్మి చేయి వదిలాడు సదాశివం. ఆ తర్వాత వెనక్కి చేయి ఇస్తే, ఆధారం కోసమేమోనని మల్లీశ్వరి చేయి ఇచ్చింది. పట్టుకున్నాడు కాని వెంటనే చూసుకున్నాడు. 'మీ చేయా.... నాకొద్దు' అన్నట్లు వదిలేశాడు. వాళ్లావిడ చేయి అనుకున్నాడు మరి. ఈ వయస్సులో ఒకరికొకరు తోడు. ఆ పెద్ద వయసువాళ్లు ఎంత మెల్లగా నడిచి కష్టపడి మెట్లు ఎక్కగలరో అంత కష్టపడి, వేదిక మీదకి వచ్చి కూర్చున్నారు. ఏలూరు ప్రజలకి నమస్కరించి వారి హర్షధ్వానాల మధ్య వేదికనలంకరించారు. వేదిక పైనుంచి సుబ్బులక్ష్మి ఆడిటోరియం చూస్తే మొత్తం నిండిపోయివుంది. ఒక్క కుర్చీ ఖాళీలేదు. కుర్చీల ప్రక్కనే ఎంతోమంది నించున్నారు. ఇక ఎక్కడా నిలబడటానికి కూడా చోటులేదు. ప్రార్థనాగీతంతో సభాకార్యక్రమాలు మొదలయ్యాయి. కార్యక్రమ వ్యాఖ్యాత పి.వి.ఆర్.కె. ప్రసాద్ (ఐ.ఎ.ఎస్.) కార్యక్రమ వివరాల పట్టిక చూస్తూ , "కార్యక్రమ క్రమాలన్నీ పెద్దపెద్ద అక్షరాల్లో రాస్తూ చివరన కచేరీ అని చిన్న అక్షరాలతో రాశారు... ఈ జనం వచ్చింది ఆ కచేరీకి కానీ ఈ కార్యక్రమానికి కాదు" అని మైకులో గట్టిగా చెప్పారు. ఆ తర్వాత ఐదుగురు వ్యక్తులు గుప్తా ఫౌండేషన్, సుబ్బులక్ష్మి, సదాశివంల గురించి మాట్లాడుతూ అరగంట తీసుకున్నారు. ఈ వక్తలందరూ ఉదాహరించి, అభినందనలు తెలిపిన విషయం ఏమిటంటే సుబ్బులక్ష్మి , సదాశివంల వైవాహిక స్వర్ణోత్సవ సంవత్సరం ఈ 1990వ సంవత్సరం. 1940-1990 సుబ్బులక్ష్మి సదాశివంల వివాహమై యాభై వసంతాలు పూర్తయ్యాయి. గుప్తా ఫౌండేషన్ వారు ఈ సందర్భంగా సుబ్బులక్ష్మి దంపతులను తగురీతిగా సన్మానించదలిచారు. వేదిక మీద రెండు విశేషమైన పెద్ద ఆసనాలు వేసి సదాశివం



సుబ్బులక్ష్మిని కూర్చుండబెట్టారు. మల్లీశ్వరి దీపాలు తీసుకురాగా సుబ్బులక్ష్మి మెల్లగా లేచి దీపారాధన చేసింది. సుబ్బులక్ష్మి దంపతుల మీద పన్నీరు చల్లి, గంధం పూశారు. పైన పూలు చల్లారు. శాలువాలు కప్పి, గజమాలలు వేశారు. పూలు, పండ్లు, తాంబూలం, వస్త్రం, సుబ్బులక్ష్మికి సమర్పించి గుప్తా దంపతులు,వారి పిల్లలు సుబ్బులక్ష్మి దంపతులకు పాదనమస్కారం చేసుకున్నారు. వేదపండితులు ఆశీర్వచనాలు మొదలుపెట్టారు. ఇద్దరు చిన్నపిల్లలు కూచిపూడి వేషధారణలో ఆడిటోరియం ఆ చివర నుంచి ఒక జ్ఞాపిక, ప్రశంసాపత్రం, తీసుకువస్తుంటే ముచ్చటగా చూసింది సుబ్బులక్ష్మి. పిల్లలు జ్ఞాపిక, ప్రశంసాపత్రం వేదికమీదకి తీసుకురాగానే సుబ్బులక్ష్మి దంపతులకు ఒకటి తర్వాత ఒకటి బహూకరించారు. జ్ఞాపిక ఇవ్వటానికి నుంచోబెట్టి, ఆ తర్వాత కూర్చోబెట్టి, ప్రశంసాపత్రం ఇచ్చేప్పుడు మళ్లీ నుంచోబెట్టి, తర్వాత కూర్చోమని, మళ్లీ ఫోటోకోసం నుంచోమనీ సుబ్బులక్ష్మిని బాగానే శ్రమపెడుతున్నారు. మెల్లగా లేస్తూ కూర్చుంటూ, మోముమీద ప్రశాంతత చెదరకుండా సుబ్బులక్ష్మి అన్నింటినీ ఓపిగ్గా చేసుకుంటూవస్తుంది. వేదపండితులు ఆశీర్వచనాలు పూర్తిచేసి అక్షతలు వేయటానికి వచ్చినప్పుడు కష్టపడి లేచి నమస్కరించింది.

ఆ తర్వాత గుప్తా అవార్డు సుబ్బులక్ష్మికి ప్రదానం చేసే ప్రధానమైన ఘట్టం మొదలయింది. వేదిక ముందువైపు ఒకే ఒక్క ఆసనం ఉంచి, దానిపై సుబ్బులక్ష్మిని కూర్చోబెట్టారు. ఇక సుబ్బులక్ష్మికి ఇవ్వనున్న అవార్డులోని సారాంశం చదవటం మొదలుపెట్టారు. నిమిషాల తరబడి తన గురించి గొప్పగా చెప్తూ చదువుతుంటే సుబ్బులక్ష్మి ఎక్కువగా తల దించుకునే ఉంది. ఒకసారి దేవుడిని ప్రార్థించుకుంది. ఇంతగా పొగడ్తలు వింటున్నందుకు కాబోలు. ఎట్టకేలకు సుబ్బులక్ష్మికి గుప్తా ఫౌండేషన్ అవార్డ్ బహూకరించారు. ఆ తర్వాత మోహన్ గుప్తా ఏలూరు ప్రజలకు ఇంకొక మహదవకాశం కల్పించారు. ఏలూరు ప్రజలను సుబ్బులక్ష్మిని సత్కరించుకోమన్నారు. అవకాశం ఇచ్చిందే ఆలస్యం ఆడిటోరియంలోని జనం వరుసకట్టారు. మొదట పదిమంది మెల్లగా వచ్చినా, ఆ తర్వాత అభిమానుల ఉధృతి పెరిగింది. పిన్నలు, పెద్దలు, అధికారులు, వరుసగా వస్తూ పూలు, పళ్లు, శాలువాలు, చీరలు తీసుకొచ్చి సుబ్బులక్ష్మికి ఇస్తున్నారు. సుబ్బులక్ష్మికి వేసే దండకు సుబ్బులక్ష్మి తీసి పక్కకు ఇచ్చేసే దండలకు తెంపులేదు. పదిహేను నిమిషాలలో యాభైమందికి పైగా సుబ్బులక్ష్మి మీద తమ అభిమానాన్ని చాటుకొని, సుబ్బులక్ష్మిని అభిమానంతో ఉక్కిరిబిక్కిరి చేశారు. సుబ్బులక్ష్మంత వయసున్నావిడ వచ్చి పసుపు కుంకుమలు ఇచ్చి, కాళ్లకు నమస్కరించటానికి వంగితే సుబ్బులక్ష్మి వారించింది. ప్రతి ఒక్కరూ భక్తితో వచ్చి, వంగి వంగి నమస్కరించి వెళ్తున్నారు. ఆడవారు, మగవారు, పిల్లలు ఎందరో వచ్చారు. ఇంకెంతోమంది వరుసకట్టి ఉన్నారు. ఒక్క చిన్న పట్టణంలోనే ఇంతమంది భక్తులుంటే సుబ్బులక్ష్మికి దేశవ్యాప్తంగా, ప్రపంచవ్యాప్తంగా ఎంతమంది

భక్తులంటారో ఊహించుకుంటేనే మనస్సు ఉప్పొంగుతుంది. సుబ్బలక్ష్మి నవ్వుతూ అందరి అభిమానాన్ని స్వీకరిస్తుంది. ఒక్కోసారి ఆశీర్వదించటానికి చేయి కూడా ఖాళీగా ఉండటంలేదు. ఒక చేతిలో బహుకరించబడిన చీర, ఒక చేతిలో పళ్లు. పూలదండలు ఏవోఒకటి వుండిపోతున్నాయి. రానురాను అభిమానులు వెల్లువెత్తుతున్నారు. ఇక నిర్వాహకులు మేల్కొని, ఈ విధంగా అభిమానం తెలుపుకునే పద్ధతిని త్వరగా ఆపేద్దామనుకుని నిర్ణయించారు. అయినా కూడా అభిమానులు ఆగలేదు. ఆత్మ హడావుడిగా వచ్చి అందరినీ వారించే ప్రయత్నం చేస్తున్నాడు. సుబ్బలక్ష్మికి, అభిమానులకి మధ్య అడ్డంగా నిలబడ్డాడు. అయినా సరే ఆత్మ వెనక నుంచి వచ్చి సందు చేసుకొని నమస్కారం చేసుకొని వెళుతున్నారు. ఆఖరికి మల్లీశ్వరి, ఆత్మ సుబ్బలక్ష్మిని అక్కడ నుంచి వెనక్కి తీసుకువెళ్లి, వేదికమీదకి వచ్చే అభిమానులని ఆపితే కానీ ఆ ఆత్మీయ ప్రవాహం ఆగలేదు. ఇప్పుడు ఇంకొక వక్త మాట్లాడటానికి మైకు వద్దకి వచ్చాడు.

కె. వి. ప్రసాద్ సుబ్బలక్ష్మి మృదంగం వాద్యకళాకారుడు, సుబ్బలక్ష్మికి మంచినీళ్లు తీసుకొచ్చాడు, సుబ్బలక్ష్మి గ్లాసుని ఎత్తిపోసుకొని తాగి అదే గ్లాసుని సదాశివంకి ఇచ్చింది, సదాశివం కూడా మంచినీళ్లు తాగాడు. సుబ్బలక్ష్మి అభిమానులు దండలతో ఇక్కడికి కూడా దండెత్తుతున్నారు. వక్త ఇప్పటికి ఐదునిమిషాలు మాట్లాడాడు. సదాశివం భార్య తలమీద ఉన్న పూలదండల దారాలను తీసివేస్తున్నాడు. వక్త ఇంకో ఐదునిమిషాలయినా మాట్లాడుతూనే ఉన్నాడు. కిక్కిరిసిపోయి ఉన్న ఆడిటోరియమ్‌లోని జనం పి. వి. ఆర్. కె. ప్రసాద్ చెప్పినట్లు కచేరీ కోసం వచ్చారు కానీ భాషణల కోసం రాలేదు. వారిలో అసహనం పెరిగిపోతోంది. ఇంకో రెండు నిమిషాలు ఓపిక పట్టారు. మొత్తం పన్నెండు నిమిషాలు మాట్లాడాడు వక్త. ఏ వక్త ఇప్పటిదాకా ఆ కార్యక్రమంలో మాట్లాడనంతసేపు. సదాశివం కూడా క్లుప్తంగా మాట్లాడి నాలుగు నిమిషాలలో ప్రసంగం ముగించాడు. తాను జైల్‌లో ఉన్నప్పుడు తనతోపాటు ఉన్న తెలుగు స్వాతంత్ర్య సమరయోధుల పేర్లు చెప్పాడు. గరిమెళ్ల సత్యనారాయణ పేరుచెప్పి, అతను పాడితే మేము ఆయన పాట వంతపాడే వాళ్లమని చెప్పి, 'మాకు వద్దు ఈ తెల్లదొరతనం' అనే పాటను రెండు పంక్తులు వినిపించాడు. అదికూడా భావయుక్తంగా. 'మాకొద్దు' అన్న దగ్గర నొక్కిమరీ పాడినప్పుడు జనం గట్టిగా చప్పట్లు కొట్టారు. సుబ్బలక్ష్మికి ఇచ్చిన నగదు పురస్కారం తిరువయ్యూరులో అతిథిగృహాలు కట్టడానికి విరాళమిస్తున్నట్లు ప్రకటించాడు. అందరికీ కృతజ్ఞతలు చెప్పి సెలవు తీసుకున్నాడు. క్లుప్తంగా చెప్పవలసిన విషయాలు మట్టుకే మాట్లాడి ముగించాడు. ఈ వక్త ఇప్పటిదాకా ఎవరూ మాట్లాడనంత అనర్గళంగా, విషయ పరిజ్ఞానంతో మాట్లాడుతున్నా సుబ్బలక్ష్మి కచేరీ కోసం వచ్చిన ప్రజలు ఇంక ఉండబట్టలేక ఆ వక్త మాట్లాడుతూ ఉండగానే చప్పట్లు కొట్టారు. ఇంక చాలు ముగించండి అన్నట్లు. సుబ్బలక్ష్మికి కూడా విషయం అర్థమయింది. 'అయ్యయ్యో' అంటూ తల



తిప్పుకుంటూ నవ్వుకుంది. అయినా వక్త ఆగలేదు. మళ్లీ కాసేపటికి చప్పట్లు కొట్టారు. మూడోసారి మళ్లీ చప్పట్లు కొట్టి మేము కచేరీ కోసం ఎదురు చూస్తున్నామని గుర్తుచేశారు. అయినా సరే ఆ వక్త సుదీర్ఘమైన తన ప్రసంగం పూర్తి చేసికానీ వదలలేదు. ఇక తొందర తొందరగా సుబ్బలక్ష్మి కచేరీ ఏర్పాట్లు చేశారు. అతిథులు కూర్చున్న వరుస అలానే ఉంచి, వారి ముందు వేదిక మీద కచేరీ ఏర్పాటు చేశారు. సదాశివం వెనుకనే కూర్చుండిపోయాడు. గుప్తా ఫౌండేషన్ పుణ్యమాంటూ బహుశా జీవితంలో మొదటిసారి సుబ్బలక్ష్మి కచేరీ చేస్తుంటే సుబ్బలక్ష్మి వెనక కూర్చున్నాడు సదాశివం. సుబ్బలక్ష్మి అప్పుడప్పుడు అనుకుంటూ ఉంటుంది. 'ముందున్న రసజ్ఞులకంటే వాళ్లకంటే ముందు కూర్చున్న మామని మెప్పిస్తానో లేదో అనే భయమే ఎక్కువ నాకు' అని. ఈ సారికి ఆ భయం లేకుండా సదాశివం వెనక కూర్చున్నాడు. ఇప్పటిదాకా ఆడిటోరియంలోని ముందువరుసలో కూర్చున్న రాధా, గౌరి వేదికపైకి వచ్చారు.

అందరూ ఎంతగానో ఎదురుచూస్తున్న కచేరీ మొదలుపెట్టింది సుబ్బలక్ష్మి. ధ్యాన శ్లోకంతో కచేరీ మొదలుపెట్టింది.

ఏలూరువాసులు అప్పటిదాకా చూసిన సుబ్బలక్ష్మి వేరు, ఇప్పుడు చూస్తున్న సుబ్బలక్ష్మి వేరు. అంతకు ముందుదాకా అడుగులో అడుగువేస్తూ నడుస్తూ, జాగ్రత్తగా కుర్చీలోంచి లేస్తూ, మెల్లగా కూర్చుంటూన్న డెబ్బైనాలుగేండ్ల అబల కనిపించింది. కచేరీకి కూర్చున్న ఇప్పుడు, ఆ రూపులో అమాంతంగా మార్పువచ్చింది. తన చుట్టూ ఉన్న వారిపై ఆధిపత్యంతో, తన సంగీత సామ్రాజ్యంలో సామ్రాజ్ఞిలా కూర్చుంది.

మొదటి పాట అన్నమయ్య కృతి 'నమోనమో రఘుకుల నాయకా' ఈ పాటలో చివర స్వరప్రస్తారాలతో అలరించింది. రెండవ పాట భద్రాచల రామదాసు కీర్తన 'ఎన్నగాను రామభజన' కామవర్ధని రాగం రాగాలాపనతో మొదలుపెట్టింది. ఈ పాట సుబ్బలక్ష్మి నోటినుంచే వినాలి. 'రామ రామ రామ' అని పాడిందంటే ఆ భద్రాద్రి రాముడు రామచిలుకలాగా వచ్చి ఎక్కడోఅక్కడ వాలి ఉంటాడు. మూడోపాట అన్నమయ్య పాట 'ఎంతమాత్రమున' తర్వాత కూడా అన్నమయ్య కృతి, 'దీనుడ నేను దేవుడ నీవు'. ఐదవ పాట శ్యామశాస్త్రి కృతి, 'దేవీ బ్రోవ సమయమిదే', ఆరవ పాట త్యాగరాజ కృతి 'మనసులోని మర్మము తెలుసుకో', చివరిగా ఏడవపాట మహావైద్యనాథ్ శివన్ 'మేళకర్త రాగమాలిక'.... పొడుగాటి ఈ సంస్కృతపు పాట అక్కడివారికి అర్థంకాకపోయినా పాడుతుంది సుబ్బలక్ష్మి కాబట్టి భావం పూర్తిగా అర్థమయింది. ఇక మిగతా పాటలలో సుబ్బలక్ష్మి సాక్షాత్తు ఆ కృతికర్తే. అన్నమయ్య కృతి పాడితే అన్నమయ్యే, రామదాసు కృతి పాడితే రామదాసే, త్యాగరాజ కృతి పాడితే అపర త్యాగయ్యే, శ్యామశాస్త్రి కృతి పాడితే శ్యామశాస్త్రే.. ఆ కృతి కర్తలు పాడివుండినంత ఆర్ద్రంగా పాడుతుంది.

దాదాపు గంటపైన ఏలూరు ప్రజలను తన గానామృతంలో ఓలలాడించింది. గుప్తా ఫౌండేషన్‌వారు సుబ్బలక్ష్మిని ఏలూరుకి తీసుకువచ్చి ఏలూరు ప్రజలకు ఎనలేని ఉపకారం చేశారు. సుబ్బలక్ష్మి తెలుగువారి ఆత్మీయతతో మద్రాసు వెళ్లింది.

ఈసారి ఒరిస్సా ప్రభుత్వం సుబ్బలక్ష్మిని సన్మానించాలనుకొని వారి ప్రతిష్ఠాత్మకమైన 'కోణార్క్ సమ్మాన్'ని సుబ్బలక్ష్మికి ప్రకటించింది.

సుబ్బలక్ష్మి చిన్నతనంనుంచీ మంచి పేరున్న గాయని కాబట్టి చిన్నప్పటి నుంచీ వివిధ ప్రాంతాలకి వెళ్లి వస్తూ ఉంది. పెళ్లయిన తర్వాత ఆ ప్రయాణాలు ఎన్నో రెట్లు ఎక్కువయ్యాయి. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా సుబ్బలక్ష్మి ప్రతి ప్రయాణం తర్వాత నీళ్ల మార్పువల్ల ఏదో ఒక అసౌకర్యం కలుగుతుంది. ఎక్కువగా గొంతు తేడా చేస్తుంది. ఈసారి ఎన్ని మందులు వేసుకున్నా గొంతునొప్పి తగ్గలేదు. ఇంటికి వచ్చిన కొంతమంది వైద్యులు చూసి, టాన్సిల్స్ బాగా పెద్దవయ్యాయి, వాటిని తీసివేయాల్సిందే అన్నారు.

సదాశివం వెంటనే సుబ్బలక్ష్మిని తీసుకొని వారు ఎప్పుడూ వెళ్లే వైద్యుడు దగ్గరకి వెళ్లారు. సుబ్బలక్ష్మిని పరీక్షించి, "నిజమే, టాన్సిల్స్ బాగా పెద్దవయ్యాయి. ముందు కొన్ని మందులు ఇచ్చి చూస్తాను" అని మందులు ఇచ్చాడు. కాని సుబ్బలక్ష్మికి రెండు వారాలయినా గొంతు నొప్పి తగ్గలేదు. సదాశివం డాక్టర్ సత్యనారాయణను ఇంటికి పిలిపించుకున్నాడు. "ఆపరేషన్ చేస్తేనే మంచిదేమో" అని అన్నాడు డాక్టర్‌తో.

"ఆపరేషనా?" రోజుకి ఇరవై టాన్సిల్స్ ఆపరేషన్‌లు అవలీలగా చేసేసే డాక్టర్ సత్యనారాయణ ఆపరేషన్ అంటే ఏమిటీ అన్నట్లు అడిగాడు.

"నేను ఆలోచించి చెప్తానులెండి" అంటూ తొందరగా వెళ్లిపోయాడు.

నాలుగు రోజులయినా ఆ వైద్యుడు దగ్గర నుంచి ఎలాంటి కబురు లేదు. త్వరలో ఒక ప్రయాణం చేయవలసి ఉంది. ఇక లాభం లేదనుకొని సదాశివం సుబ్బలక్ష్మిని తీసుకొని డాక్టర్ సత్యనారాయణ హాస్పిటల్‌కే వచ్చాడు.

"ఏమి ఆలోచించారు, సుబ్బలక్ష్మికి నొప్పి బాగా ఉంది. త్వరలోనే విశాఖపట్నం వెళ్లాలి. ఆపరేషన్ చేస్తేనే బాగుంటుందనుకున్నాను" అని అన్నాడు.

డాక్టర్ సత్యనారాయణ మీనమేషాలు లెక్కపెడుతున్నాడు. చాలాసేపటి తర్వాత ఇక తప్పదనుకొని, "క్షమించాలి. నేను సుబ్బలక్ష్మి గారి గొంతు మీద కత్తి పెట్టలేను, పెట్టను. అపచారం" అంటూ ససేమిరా ఆపరేషన్ చేయనన్నాడు.

"మరి ఎలా...."









ఏలూరు విచ్చేసిన సుబ్బలక్ష్మి, సదాశివం



ఏలూరులో గుప్తా ఫౌండేషన్‌వారి సన్మానం స్వీకరిస్తున్న సుబ్బలక్ష్మి, సదాశివం
గుప్తా ఫౌండేషన్ వ్యవస్థాపకులు శ్రీ మోహన్‌గుప్తా, శ్రీమతి మల్లీశ్వరి




సుబ్బులక్ష్మికి గుప్తా ఫౌండేషన్ వారి ప్రశంసా పత్రం బహూకరణ




ఏలూరులో సుబ్బులక్ష్మి కచేరి



"ఆమెకు ఆ గొంతు ఇచ్చిన భగవంతుడే చూసుకుంటాడు" అని ముక్తాయింపు ఇచ్చాడు.

అతను అన్నట్లే కొన్ని రోజుల్లో సుబ్బులక్ష్మి గొంతునొప్పి మంత్రము వేసినట్లుగా తగ్గిపోయింది. ఏ తీరుగా చూసినా సుబ్బులక్ష్మి గొంతు అమోఘమయిన గొంతు. ఎంత పై స్థాయిలో పాడినా ఆ గొంతులో కీచు రాదు, వణకదు. పాట ఆపిన తర్వాత కూడా గుడి గంటల శబ్దంలా ఇంకాసేపు వినిపిస్తూనే ఉంటుంది. సుబ్బులక్ష్మి గొంతు దగ్గరగా ఎంత స్పష్టంగా వినిపిస్తుందో, దూరంగా ఉన్నవారికి కూడా అంతే స్పష్టంగా వినిపిస్తుంది. ఒకసారి కరెంటుపోయి మైకు పనిచేయకపోతే సుబ్బులక్ష్మి పాట కొనసాగిస్తే వందలమంది ఉన్న హాలులో చివరిదాకా వినిపించింది. ఇంకా ఇంకా వినాలినిపించే తియ్యని గొంతు. సుబ్బులక్ష్మి భక్తులు, ఆమె గత జన్మలలో మధుర మీనాక్షిని తేనెతో అభిషేకం చేసినందువల్ల ఆమెకు ఈ తీయని గొంతు వచ్చిందని నమ్ముతారు. వైద్యులు ఆమె స్వరతంత్రులు ఒక నిర్ణీతమైన పద్ధతిలో ఉన్నాయి కాబట్టి ఆమె గొంతు అంత తియ్యగా ఉన్నదన్నారు. అందుకే డాక్టర్ సత్యనారాయణ ఆమె గొంతుమీద కత్తిపెట్టి ఆ స్వరతంత్రులను కదిపి, సుబ్బులక్ష్మి అభిమానుల శత్రువు కాదలచుకోలేదు.

𝄞 𝄞

ఇక కచేరీల పరంపర మొదలయ్యింది. శివానంద అనాథ శరణాలయం లబ్ధికి కచేరీ చేయటానికి వచ్చింది. గౌరి ఇప్పుడు 'ది హిందూ' పేపర్లో విలేఖరిగా పనిచేస్తుంది. రాధకి ఆరోగ్యం సరిగా లేనందున సుబ్బులక్ష్మికి తోడుగా కచేరీలకి వస్తుంది. ఈ కచేరీకి కూడా వచ్చింది. గౌరి స్నేహితురాలయిన ఇంకొక పత్రికా విలేఖరి గౌరిని బ్రతిమిలాడుతుంది. "గౌరి, నాకొక్కసారి సుబ్బులక్ష్మిగారితో ఇంటర్వ్యూ ఇప్పించవా ప్లీజ్..."

"నేనే ఇప్పటిదాకా తీసుకోలేదు. మా తాత ఒప్పుకోడు."

"నా కోసం మీ తాతగారికి చెప్పవా."

"ఆయన ఒప్పుకోడు."

అయినా పట్టువిడవలేదు గౌరి స్నేహితురాలు అరుణ. గౌరి ఆ పోరు భరించలేక సదాశివంని అడిగింది. ససేమిరా అన్నాడు సదాశివం.

"చెప్పాకదా, తాత ఒప్పుకోడు అని" చెప్పింది గౌరి. ఇక కచేరీ మొదలయింది. ఎంతో నిరాశపడింది అరుణ. ముందు వరుసలో కూర్చొని ఏడుస్తోంది. కచేరీ అయిన తర్వాత ఆత్మ వచ్చి "అమ్మ మిమ్మల్ని రేపు ఫోన్‌చేసి రమ్మన్నారు" అంటూ ఫోన్ నంబర్ ఇచ్చాడు.

ఆశ్చర్యపోయింది అరుణ. ఆ తరువాతి రోజు అత్మ రమ్మన్న సమయానికి సుబ్బలక్ష్మి ఇంటికి వెళ్లింది.

అరుణని చూడగానే, "నిన్న నువ్వు నా ముందు కూర్చుని ఏడుస్తూ ఉంటే నేను కచేరీ చేయలేకపోయాను. నాకు చాలా బాధవేసింది, తర్వాత మామతో మాట్లాడి నీకు కబురుపెట్టాను" అని చేతిలో చేయివేసి చెప్పింది. అరుణ సుబ్బలక్ష్మికి ఇతరుల పట్ల ఉన్న ప్రేమ. శ్రద్ధ చూసి ఆశ్చర్యానందాలకి లోనయింది. కూర్చోబెట్టుకుని, చాలాసేపు మాట్లాడింది. మాట్లాడినంతసేపు అరుణ చేయి సుబ్బలక్ష్మి చేతిలోనే ఉంది.

1991 మే 21న రాజీవ్‌గాంధీ హత్యచేయబడ్డాడు. రాజీవ్‌గాంధీ అకాల మరణం సుబ్బలక్ష్మికి తీవ్రమైన ఆవేదన కలిగించింది. "వాళ్లమ్మ కోప్పడితే నా వెనుక వచ్చి దాక్కునేవాడు" అంటూ, రాజీవ్‌గాంధీ చిన్నప్పటినుంచి అతనితో తనకువున్న ఆత్మీయతను గుర్తుచేసుకుంటూ బాధపడింది.

𝄞 𝄞

ముప్పై సన్మానాలు, అరవై కచేరీలలాగా సాగిపోతుంది సుబ్బలక్ష్మి జీవితం. రోటరీ క్లబ్ మద్రాస్ వెస్ట్ వారు, 'పాల్ హారిస్ ఫెల్లోషిప్' అవార్డు సుబ్బలక్ష్మి దంపతులకి ఇవ్వ నిర్ణయించామని, ఇంటికి వచ్చి తెలియచేశారు.

సుబ్బలక్ష్మి కల్కి బంగ్లా వదిలి ఈ ఇంటికి వచ్చి పదిహేను సంవత్సరాలు దాటింది. దీపం వెంటే కాంతి అన్నట్లు, సుబ్బలక్ష్మి ఎక్కడుంటే అక్కడికి, అభిమానులు వస్తూనే ఉన్నారు. వారిలో టాటాలు, బిర్లాలు, మహారాజులు, సాధారణ ప్రజలు, మంత్రులు, అధికారులు, అన్ని రంగాల నుంచి ఉన్నారు. ఈ సమయంలో రాజకీయ నాయకులు కూడా సుబ్బలక్ష్మి ఇంటికి రావటం మొదలుపెట్టారు. తమిళనాడుకి చెందిన భారతీయ జనతా పార్టీ నాయకుడు సుబ్రహ్మణ్యస్వామి సుబ్బలక్ష్మి తమ పార్టీలో ఏమన్నా చేరతారేమోనని ప్రయత్నించాడు. అలాగే అద్వాని, వాజ్‌పేయి కూడా సుబ్బలక్ష్మిని తన ఇంటిలో కలిశారు.

1992, మార్చి 28న నారద గానసభలో సుబ్బలక్ష్మి దంపతులు 'పాల్‌హారిస్ ఫెల్లోషిప్' స్వీకరించటానికి వచ్చారు. సదాశివానికి, ఒక స్వాతంత్ర్య సమరయోధుడిగా, కల్కి పత్రిక సృష్టికర్తగా, నిస్వార్థ కర్మయోగిగా ఈ అవార్డు ఇవ్వబడుతుంది. రోటరీ క్లబ్ వాళ్లు ప్రతిష్ఠాత్మకంగా చేస్తున్న ఈ కార్యక్రమంలో సుబ్బలక్ష్మి దంపతుల మీద ఒక మంచి పుస్తకం కూడా తీసుకువచ్చారు. కార్యక్రమం అంతా చక్కగా జరిగిపోతుంది. రోటరీ క్లబ్ ప్రెసిడెంట్ కె.బి. సింగ్ మాట్లాడుతూ, "ఇప్పుడు అందరికీ ఒక పెద్ద ఆశ్చర్యం గొలిపే విషయం చెప్తాను" అని ప్రకటించాడు. ఏంటీ, దేనిగురించి అని అందరూ



ఆశ్చర్యపోతున్నారు నారద గాన సభలో ఉన్న రసజ్ఞులు. ఒక గ్రామఫోన్ రికార్డు ప్లేయర్‌ని వేదిక మీదకి తీసుకువచ్చారు. గ్రామఫోను రికార్డులు షోకేస్‌లో పెట్టే వస్తువులయ్యాయి ఈపాటికి. 1980లలో టేప్‌రికార్డర్లు వచ్చి పెద్ద పెట్టెలాగా ఉండే, ఖరీదు ఎక్కువైన గ్రామఫోన్ రికార్డులని వెనక్కి నెట్టేశాయి. ఇప్పుడు సి.డి.లు కూడా మెల్లగా విపణిలోకి వస్తున్నాయి. రసజ్ఞులు అందరూ సుబ్బలక్ష్మి పాట ఏమన్నా వేస్తారేమో దానిమీద..... దాంట్లో ఆశ్చర్యమేముంది అనుకుంటున్నారు. కె.బి. సింగ్ వచ్చి ప్లేట్ పెట్టి, "దీనిలో ఉన్న విషయం సుబ్బలక్ష్మి గారికి కూడా ఆశ్చర్యంగొలుపుతుంది" అని చెప్పి ఇంకా ఉత్కంఠ రేపాడు. ప్లేటులో పాట మొదలయింది.

'మరకత వడివం సెంకదిర్ వేలా... వాగై వాడాతే.....'

కిందకి తల వంచి ఉన్న సుబ్బలక్ష్మి ఆ పాట విని ఒక్కసారిగా గ్రామఫోన్‌వైపు తల తిప్పింది, ఆశ్చర్య ఆనందాలలో ఉక్కిరిబిక్కిరి అయింది. తను పదేళ్ల పిల్లగా ఉన్నప్పుడు అమ్మ పట్టుపట్టి గ్రామఫోన్ కంపెనీవాళ్లు తన చిట్టితల్లి పాట రికార్డు చేసేలా చూసింది. దాదాపు అరవైఏళ్ల తర్వాత తన పాట, తన మొదటి గ్రామఫోను పాట మళ్లీ వింటుంది. ఇది ఎలా దొరికింది అన్నట్లు కె.బి. సింగ్ వైపు చూసింది. "నేను ఎమ్.ఎస్. గారి గ్రామఫోన్ రికార్డులన్నీ సేకరిస్తూ ఉన్నాను, ఒక పాత కొట్లో ఈ అమూల్యమయిన రత్నం దొరికింది. ఆ కొట్టువారికి ఈ ప్లేట్ విలువ తెలియదు, అలా కొన్ని వందల ప్లేట్ల మధ్యనే ఉండిపోయింది, ఈ రోజుకి చేరాల్సిన చోటుకి చేరింది" అని చెప్పి ఆ ప్లేటుని సుబ్బలక్ష్మికి బహూకరించాడు.

కారులో సుబ్బలక్ష్మి ఆ ప్లేటుని తన చేతుల్లోకి తీసుకుంది. ప్లేటుని స్పృశిస్తూ మదురై వెళ్లిపోయింది. మదురైలో అమ్మతో మళ్లీ రైలు ఎక్కింది. దారిలో రాజం పిన్ని పొదుగాటి చెరుకుగడ కొంది. అది కిటికీలోంచి నిలువుగా లోపలికి రాలేదు, అడ్డంగా రాలేదు. అమ్మ రికార్డింగు అధికారులతో ఎంతో జాగ్రత్తగా వ్యవహరించి, తన చేత ఒక పాట రికార్డు చేసుకునేలా చేసింది. పాట అయిన తర్వాత అమ్మ మోములోని తృప్తి, ఆనందం ఇంకా గుర్తే సుబ్బలక్ష్మికి. రాజం పిన్ని రెండు బుగ్గలు ఎంగిలి ఎంగిలి చేసింది. మద్రాస్‌లో మొదలుపెట్టి మదురైలో ఇల్లు చేరేవరకూ తన గురించి దండోరా వేసుకుంటూ వచ్చింది. అమ్మ తనను ఇంకా పాటలు రికార్డు చేయించాలనుకునేది. అమ్మ కొన్ని చేయించింది. తర్వాత అమ్మ దగ్గరుండి చేయించకపోయినా చేస్తూనే ఉంది. అయినా అమ్మ దగ్గరుండి రికార్డు చేయించిన ఈ మొదటి ప్లేటు సుబ్బలక్ష్మికి ప్రాణం. ఇప్పుడు ఈ పాటకంటే, పాట చుట్టూ ఉన్న జ్ఞాపకాలు ఈ ముసలి గుండెకు కొత్త బలాన్ని ఇచ్చాయి.

𝄞 𝄞

"హ్యాపీ బర్త్‌డే ఎమ్మెస్ మామా!" అంటూ రాము సదాశివంకు పుష్పగుచ్ఛం ఇచ్చాడు.

నవ్వుతూ పుష్పగుచ్ఛం తీసుకొని, "ఒరేయ్ ఈ యాభైఏళ్లలో నేను ఒక్కసారి కూడా సుబ్బలక్ష్మి సదాశివం, అని ఎక్కడా చెప్పలేదు, వ్రాయలేదురా, నువ్వు పుట్టినప్పటినుంచీ నన్ను 'ఎమ్.ఎస్. మామా' అని పిలుస్తున్నావు."

"అన్నయ్యా వాడు కలకత్తాలో మిమ్మల్ని చూసినప్పటి నుంచి అంతే. ఎవరూ చెప్పలేదు. వాడే అలా పిలవటం మొదలుపెట్టాడు" అంది రాము తల్లి అయిన నారాయణి. నారాయణి సుబ్బలక్ష్మికి ఆప్తురాలు. కలకత్తాలో సావిత్రి సినిమా చిత్రీకరణకు వెళ్లినప్పటి నుంచీ పరిచయం.

"ఎమ్మెస్ మామా! ఆత్మనాథన్ ఏడీ?"

"అవును ఆత్మనాథన్ ఈ రోజు ఇక్కడ లేకుండా ఎక్కడికి వెళ్లాడు?" అక్కడున్నవారంతా ఆశ్చర్యంగా అడిగారు. సదాశివం పుట్టిన రోజు కనుక ఎంతో మంది వచ్చి సదాశివంకి అభినందనలు తెలియజేస్తున్నారు. ఇంతమంది వస్తూ పోతూ ఉంటే ఆత్మనాథన్ లేకపోవడం వెలితిగా ఉంది అందరికీ, సదాశివంకే వెలితిగా ఉంది.

"మీ అందరికీ ఆత్మనాథన్, నాకు నా ఆత్మ. వస్తాడు, ఇంకాసేపట్లో వస్తాడు. ఈ ఇంట్లో ఇదే నా ఆఖరి పుట్టినరోజు, నా తరువాతి పుట్టిన రోజు నేను నా సొంత ఇంటిలో చేసుకుంటాను. ఆత్మ అక్కడకు వెళ్లాడు వస్తాడు" అని అందరితో చెప్పాడు సదాశివం. ఆశ్చర్యంగా, కనీస అవసరాలు తప్ప ఎలాంటి ఆడంబరాల జోలికి పోని సదాశివంకి సొంత ఇల్లు ఏర్పాటు చేసుకోవాలని, కల్కి బంగ్లా నుంచి వచ్చేసిన దగ్గర నుంచి గట్టిగా ఉంది, ప్రయత్నం చేయగా చేయగా సొంత ఇల్లు ఈ నాటికి సాకారమవుతుంది. 1902లో పుట్టిన సదాశివం 1992లో 90వ పుట్టినరోజు. స్నేహితులు, బంధువుల సమక్షంలో ఉల్లాసంగా జరిగింది. ఇప్పుడు సుబ్బలక్ష్మికి 76 ఏళ్లు.



సికింద్రాబాద్ రైలుస్టేషన్‌లో 'కళాసాగరం' సెక్రటరీ రాజగోపాల్ హైదరాబాద్, మద్రాస్ ఎక్స్‌ప్రెస్ కోసం ఎదురు చూస్తున్నాడు. రైలు రాగానే ఎ.సి. కంపార్ట్‌మెంట్ దగ్గరకు వెళ్లి, చేతిలో దండతో తయారుగా ఉన్నాడు. అందరూ దిగిన తర్వాత సుబ్బలక్ష్మి మెల్లగా ఇద్దరి సహాయంతో దిగింది. చూడటానికి ఎంతో నీరసంగా ఉంది. రాజగోపాల్ తెచ్చిన దండని వేయటానికి కూడా భయపడ్డాడు. అసలా దండను మోయగలదా లేదా అనే అనుమానం వచ్చింది. దండని పక్కనబెట్టి, "సదాశివంగారూ, ఏమిటీ? ఎమ్.ఎస్. గారికి బాగోలేదా?"



"బాగోలేదు రాజగోపాల్, నిన్న సెలైన్ కూడా ఎక్కించాము."

రాజగోపాల్‌కి రేపటి సాయంత్రం కచేరీ గురించి బెంగపట్టుకుంది. కచేరీ చేయగలిగినదానిలా లేదు సుబ్బలక్ష్మి.

హైదరాబాద్ వస్తే ఎప్పుడూ ఉండే మారేడ్‌పల్లిలోని స్నేహితుల ఇంటికి చేరుకున్నారు. ఆ ఇంటావిడ, "ఈ పరిస్థితుల్లో సుబ్బలక్ష్మిని ఇక్కడకు తీసుకు రాకపోతే ఏమవుతుంది? ఇంత ఇబ్బంది పెట్టడం ఎందుకు?" అని సదాశివంని గట్టిగా అడిగింది. సదాశివం మౌనంగా ఉన్నాడు. సదాశివం మాట ఇచ్చిన తర్వాత అది నిలబెట్టుకోవాలి అనే తత్వం కలవాడు. ఆ రోజు పూర్తిగా విశ్రాంతి తీసుకొంది సుబ్బలక్ష్మి. తెల్లవారేసరికి కాస్త మెరుగుపడింది ఆరోగ్యం. ఒకరు విడి పూలు తీసుకొచ్చి ఇచ్చారు. సుబ్బలక్ష్మి తానే పూలు కట్టుకుంటానంది.

ఇంటావిడ దారపు ఉండ తీసుకొచ్చి సుబ్బలక్ష్మికి ఇచ్చింది. సుబ్బలక్ష్మి ఆ దారపు ఉండను ముట్టుకోను కూడా లేదు.

"ఆంధ్రలో ఎంగిలెక్కువ. దారాన్ని నోటితోనే కొరుకుతూ ఉంటారు, వద్దు ఇది" అని చెప్పి, పెరట్లోకి వెళ్లి అరటిచెట్టు మొదలులోనుంచి పీచు లాక్కొని వచ్చి పూలు కట్టుకుంది.

రాజగోపాల్ భయపడుతూనే ఉన్నాడు. సుబ్బలక్ష్మి కచేరీ చేయగలుగుతుందో లేదో అని. 'కళాసాగరం' ఏర్పాటు చేసి పాతిక సంవత్సరాలయ్యింది. ఈ సందర్భంగా పెద్ద ఎత్తున కచేరీ ఏర్పాటు చేశాడు. అతని భయాన్ని పటాపంచలు చేస్తూ ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కరరెడ్డి, వందలమంది రసజ్ఞుల సమక్షంలో మూడుగంటలసేపు బ్రహ్మాండమైన కచేరీ చేసింది.

"కచేరీకి కూర్చున్నానంటే కీళ్లనొప్పులు, కాళ్లనొప్పులు, ఇంకేవి నాకు గుర్తు రావు" అని చెప్పింది కచేరీ విజయవంతమైనందుకు ఆనందిస్తున్న రాజగోపాల్‌తో.



కొత్త సంవత్సరంలో రెండవ నెలలోనే సుబ్బలక్ష్మి, సదాశివం వారి కొత్త ఇంటిలోకి, సొంత ఇంటిలోకి మారారు. కొట్టూరుపురంలోని ఈ ఇంటికి సదాశివం పేరులోని 'శివం', సుబ్బలక్ష్మి పేరులోని 'శుభం' తీసుకొని 'శివమ్ – శుభమ్' అని పేరుపెట్టుకున్నారు.

కొత్త ఇంటిలోకి రాగానే సదాశివంకి కొత్త పోరు మొదలయింది. "తాతా! తాతా! ప్లీజ్ తాతా, ఒప్పుకో తాతా, నా మొదటి పుస్తకం తాతా" అంటూ గౌరి చెవిలో ఒకటే రొద. "ముందు బామ్మ ఇంటర్వ్యూ ఇస్తే ఆ తర్వాత మిగతావారితో తీసుకుంటా.. వాళ్లంతా

ఎక్కడెక్కడో ఉన్నారు. మెల్లగా వాళ్లని కూడా కలవాలి .... ముందు బామ్మ పని కానివ్వు తాతా" అని చాలా రోజుల నుంచి బ్రతిమిలాడుతుంది. గౌరి ఒక పుస్తకం వ్రాయతలపెట్టింది. భారతదేశానికి చెందిన ఆరుగురు ప్రముఖ కళాకారుల బాల్యం గురించి వారు చెప్పినవి చెప్పినట్లు పుస్తకంలో ముద్రించే ఆలోచన చేసింది. వారు సుబ్బులక్ష్మి, ఎమ్.ఎఫ్. హుస్సేన్, ఆర్.కె. లక్ష్మణ్, కేలూచరణ్ మహాపాత్ర, అమ్‌జద్ అలీఖాన్, విజయ్ తెందూల్కర్. మామూలుగా వారి గురించి వ్రాయటం అయితే వెంటనే సరేననేవాడేమో, కానీ బాల్యం గురించి అంటుంది. సుబ్బులక్ష్మి గతానికి ఎప్పుడో గట్టి తెర వేశాడు. ఆ గతం తోడుతాననంటుంది గౌరి. పోరు పడలేక ఒప్పుకున్నాడు. "కాని నేను చూసిన తర్వాతే నువ్వు దాన్ని ప్రింటింగ్‌కి ఇస్తావు" అనే షరతు పెట్టాడు. ఎగిరి గంతేసి సరేనంది గౌరి.

సుబ్బులక్ష్మి దగ్గరకు వచ్చింది. "బామ్మా, చెప్పు, నీ చిన్నతనం గురించి అన్నీ చెప్పు. తాత అనుమతి ఇచ్చాడు, నేను వ్రాసిందొకసారి చూస్తానన్నాడంతే. చెప్పు బామ్మ నీ చిన్నతనం గురించి అన్నీ చెప్పు, నా పుస్తకంలో వ్రాసేస్తాను."

"ఏమైనా వ్రాస్తావా?" అడిగింది సుబ్బులక్ష్మి.

"నువ్వు ఏమి చెప్పినా వ్రాస్తాను."

"మా నాన్న గురించి వ్రాస్తావా?" యాభైఏళ్లలో మొదటిసారిగా 'నాన్నా' అని పైకి చెప్పుకుంది సుబ్బులక్ష్మి.

దేవదాసి కుటుంబాలలో పిల్లలను నవమాసాలు మోసి కనిన తల్లి ఎవరో రూఢిగా తెలుసు కానీ, ఆ తల్లే, నా పిల్లలకు ఇతనే తండ్రి అని చెప్పినా, 'నాకు అనుమానమే' అంటుంది లోకం. ఆ పిల్లలకు ఇంకొకరితో పోలిక చూపి, 'నీ పిల్లలకు అతడు తండ్రెందుకు కాకూడదు' అంటుంది. సుబ్బులక్ష్మి పరిస్థితి కూడా ఇంతే. కానీ సుబ్బులక్ష్మికి తెలుసు తన తండ్రి ఎవరో. కానీ లోకం పోకడ వలన, సదాశివం నియంతృత్వం, కాఠిన్యంవల్ల తన తండ్రి పేరు తన మనస్సులోనే ఉంచుకుంది. యాభైఏళ్లు తండ్రి పేరు తన మనస్సులోనే ఉంచుకొని, పైకి చెప్పకుండా ఆ ఒత్తిడిని భరించింది. మద్రాసు మ్యూజిక్ అకాడమీ అధ్యక్ష ప్రసంగంలో కూడా తల్లి పేరే చెప్పింది కానీ తండ్రి పేరు చెప్పలేదు. సదాశివం 1966లో అచ్చువేసిన పుస్తకంలో కూడా తండ్రి పేరు ప్రస్తావన లేదు. తండ్రి పేరే కాదు సదాశివం ప్రాపకంలో తల్లి పేరు కూడా మితంగా వాడాల్సిందే. ఇక ఒత్తిడి భరించలేకపోయిందేమో గుండె నిండా ఉన్న తండ్రి జ్ఞాపకాలు ఇక గుండెలో దాగనన్నాయి.

"మా నాన్న పేరు సుబ్రహ్మణ్యం అయ్యర్, ఆయన న్యాయవాది. మా ఇంటికి కాస్త దూరంలో ఆయన ఇల్లు ఉండేది. ఆయనకు మేము కాకుండా వేరే పిల్లలు కూడా



ఉన్నారు" ఇలా చెప్పుకుంటూ పోతోంది. ఆ మాటలలో నాన్నపట్ల ప్రేమేకానీ, కించిత్ కూడా అలక లేదు.

"ఆ పిల్లల్ని కాకుండా ఆయన నన్నే ముద్దుచేస్తుంటే నాకెంతో సంతోషమేసేది. నా పాట అంటే అమ్మకంటే నాన్నే ఎక్కువ గర్వపడేవారు. 'నా చిన్నిమారాణి' అని నన్ను పిలిచేది ఆయన ఒక్కరే. నాకు సంగీతం తెలిసిన కుర్రవాడినే తీసుకొచ్చి పెళ్లి చేస్తానని అనేవారు. ఒకసారి తంబూరా వాయించేవాడిని తీసుకురావాలనేవారు, ఇంకోసారి కనిపించినప్పుడు వయోలిన్‌వాడిని చేసుకుంటావా అని అడిగేవారు. నన్ను తెగ నవ్వించేవారు."

"రామనవమి ఉత్సవాల్లో మా నాన్న రాముడి రథంలో నన్ను కూర్చోబెట్టుకునేవారు."

అలా తన తండ్రి గురించి తనలో దాగి ఉన్న ఊసులు ఒక్కసారిగా బయటకు చెప్పుకొని సేదతీరింది. "కానీ నాకు పదేళ్లప్పుడే ఆయన చనిపోయారు. ఆయన చాలా గొప్ప వ్యక్తి, అందరితో ప్రేమగా ఉండేవారు. రామభక్తుడు" అంటూ ముగించింది. గౌరి వ్రాసుకోవడం మర్చిపోయింది. ఆర్తితో చెప్తున్న సుబ్బులక్ష్మి వైపు చూస్తూ ఉండిపోయింది. టేపురికార్డులోని రికార్డు చేస్తున్న క్యాసెట్టు ఆగిపోయి టక్కుమని చేసిన శబ్దానికి ఈ లోకంలోకి వచ్చింది. కళ్లజోడు వెనుక నిండుగా చెమ్మగిల్లిన సుబ్బులక్ష్మి కళ్లను చూసింది.

గౌరి పుస్తకం 'పాస్ట్ ఫార్వర్డ్' త్వరలోనే అచ్చయింది. దాంతో అందరికీ సుబ్బులక్ష్మి తండ్రి ఎవరో తెలిసింది. ఎమ్.ఎమ్. ఇస్మైల్ అనే తమిళ పండితుడు, కంబ రామాయణాన్ని సుబ్బులక్ష్మి రికార్డు చేయటానికి సుబ్బులక్ష్మికి సహాయం చేసినతను, సుబ్బులక్ష్మికి ఇంకొక రికార్డు విడుదల వేడుకలో ఒక ఆశ్చర్యకరమైన బహుమతి ఇవ్వనున్నాడు.

ఆ రికార్డు విడుదల కార్యక్రమంలో ఎమ్.ఎమ్. ఇస్మైల్ కాగితాలలో చుట్టివున్న పెద్ద పటాన్ని ఒకటి బహూకరించి, దాన్ని విప్పమన్నారు. బహుశా దేవుడి పటము అయి ఉండవచ్చు అనుకొని సుబ్బులక్ష్మి విప్పింది. ఆ పటములోని మనిషిని చూసి ఒక్కసారిగా కళ్లు ద్రవించాయి, గుండె వేగంగా కొట్టుకుంది. తన గుండె, కళ్లు గుర్తుపట్టాయి, వెంటనే గుర్తుపట్టాయి, తను పదేళ్ల వయసుదాకా చూసిన రూపాన్ని వెంటనే గుర్తుపట్టాయి. ఆ పటంలో ఉన్న మనిషి తన తండ్రి, సుబ్రహ్మణ్య అయ్యర్.

ఆ పటాన్ని తెచ్చుకొని తన ఇంటిలో అమ్మ షణ్ముగవడివు పటం పక్కనే పెట్టుకుంది. డెబ్బైఆరేళ్ల వయస్సులో అమ్మకి, నాన్నకి ఒకే చోట తన ఇంటిలో గోడమీద కాస్త చోటు ఇచ్చుకోగలిగింది.

ఎవరైనా సుబ్రహ్మణ్యం అయ్యర్ పటం చూసి, "మీలో మీ నాన్నగారి పోలికలు ఉన్నాయి" అని చెప్తే , ఇక సుబ్బమ్మ సంతోషమే సంతోషం.

𝄞𝄞

"నువ్వు కూడా రా మాతో ఫోటో దిగుదువు. ఆత్మకి కెమెరా ఇవ్వు తీస్తాడు" ఎప్పటినుంచో సుబ్బలక్ష్మి ఫోటోలు తీస్తున్న కమలని పిలిచింది సుబ్బలక్ష్మి.

కమల ఆత్మకి కెమెరా ఇచ్చి సుబ్బలక్ష్మి పక్కన కూర్చొని ఫోటో దిగింది.

కంచి పరమాచార్య మణి మంటపం నిర్మాణానికి నిధులు సేకరించడానికి సుబ్బలక్ష్మి బెంగుళూరు వచ్చింది. ఆత్మనాథన్ కూతురు గాయత్రి మెట్టినింట్లో విడిది.

కమల మెల్లగా సదాశివం పక్కకు చేరింది. "సదాశివం గారూ, మీరు సరేనంటే మీ ఇద్దరిమీదా ఒక పుస్తకం వ్రాస్తాను. నాకు జీవిత చరిత్రలు వ్రాయటమంటే చాలా ఇష్టం, అందులోనూ మీ ఇద్దరి చరిత్ర ఇంకా ఇష్టం" అని అర్జీ పెట్టుకుంది.

"మీకు ఇష్టం కావచ్చు, కానీ మాకు చాలా నష్టం" వెంటనే చెప్పాడు సదాశివం. ఆ తర్వాత మళ్ళీ, "మేము ఇద్దరం చనిపోయిన తర్వాత మీ ఇష్టం వచ్చినట్లు వ్రాసుకోండి" అని చెప్పాడు. కమల నిరాశ చెందింది. ఏ నిగూఢత్వం తెరపైకి తీసుకొద్దామని అనుకుందో అది పసిగట్టి సదాశివం వారించాడు.

సుబ్బలక్ష్మి గతానికి తెరదించినట్లు సదాశివం తన జీవితంలో ఒక గతానికి కూడా గట్టి తెర దించాడు. ఆ తెర వెనుక తన మొదటి భార్య కథ ఉంది. ఆమె ఎలా, ఎందుకు చనిపోయిందో ఉంది.

సదాశివం సుబ్బలక్ష్మిని ఎందుకు పెళ్లిచేసుకున్నాడు అంటే చెట్టిలు, అలాంటివారి నుంచి సుబ్బలక్ష్మిని కాపాడటానికి అని వ్రాయిస్తాడు. మరి మొదటి భార్య ఉందిగా, ఆమెను ఏమి చేశాడు అంటే, 'ఆమె అంటే మొదటినుంచి ఎడమొహం, పెడమొహంగా ఉండేవాడు. ఒకసారి మామూలుగా పుట్టింటికి వెళ్తే, అక్కడ ప్రమాదవశాత్తు మంద్రగబ్బ కరిస్తే చనిపోయింది' అనేదే బయటకు తెలిసిన సంగతి. కానీ ఇంకొక స్త్రీ మీద వ్యామోహంతో మొదటి భార్యను పూర్తిగా అశ్రద్ధ చేసినందుకు, ఆమె కృంగిపోయి, ఆత్మహత్య చేసుకుందని ఎక్కడా ఏ పత్రికలో కూడా ప్రచురించబడకుండా జాగ్రత్తపడ్డాడు సదాశివం. ఇప్పుడు కూడా తన రహస్యాన్ని కాపాడుకుంటూ వస్తున్నాడు.

𝄞𝄞𝄞𝄞

కంచి పరమాచార్య సమాధి పొందడానికి సిద్ధంగా ఉన్నారని తెలిసి ఆఘమేఘాల మీద మద్రాసు చేరుకున్నారు. కంచి పరమాచార్యులు నిండు శత వసంతాలు ఈ భూమి





సుబ్బలక్ష్మి తండ్రి సుబ్రహ్మణ్యం అయ్యర్

మీరు జీవించి, ఆధ్యాత్మిక జీవనశైలి ఎలా ఉండాలో చూపించారు. నిజమైన జ్ఞానం కోసం శ్రమించే వారికి మనసు, స్వభావాలు ఎలా నిరాడంబరంగా ఉంటాయో ప్రపంచానికి చూపారు. అలాంటివారు సుబ్బలక్ష్మిని గుర్తించి, ఆమెను బృందావనంలో తులసిగా అభివర్ణించి, ఆమె భక్తిని ఆమోదించటం నిజంగా సుబ్బలక్ష్మి భాగ్యమే. తమను ఎల్లప్పుడూ కనిపెట్టుకుంటూ వచ్చిన కంచి పరమాచార్య ఈ మానుష శరీరాన్ని వదిలివేస్తున్న వేళ సుబ్బలక్ష్మికి ఎంతో బాధ. రోజులతరబడి ధ్యానంలో గడిపింది. కంచి పరమాచార్యలాంటి స్వామిని, ఐహిక సుఖాలలో ఓలలాడే ఇతర స్వాములను ఒకే గాటన కట్టటం సుబ్బలక్ష్మి అమాయక మనస్సుకే చెల్లింది.

ఈ బాధలోనే ఉండగా దర్శకుడు ఎల్లిస్ డంగన్ నలభై సంవత్సరాల తర్వాత భారతదేశం వచ్చాడు. పందొమ్మిదివందల ముప్పైలు, నలభైలు, యాభైలలో పద్నాలుగు తమిళ సినిమాలకు దర్శకత్వం వహించి, ఎమ్.జి.ఆర్.కి పెద్ద స్టార్ హోదా ఇచ్చి తమిళ సినీ ప్రపంచంలో నిలబెట్టిన డంగన్‌ను తమిళ సినిమా రంగం మర్చిపోకుండా, డంగన్‌ను సన్మానించి, తమ గౌరవాన్ని తెలుపుకోవటానికి మద్రాస్‌కు ఆహ్వానించారు. "మీరు తప్పకుండా రావాలి. తమిళ సినిమా అంతా అక్కడుంటుంది" ఆ కార్యక్రమ నిర్వాహకులు సదాశివంని ఆహ్వానించారు. "రాలేమేమో..... వస్తున్నామని అని ప్రముఖంగా చెప్పొద్దు" అని చెప్పి పంపాడు సదాశివం.

"ఇప్పుడు డంగన్‌కు ఎంత వయస్సు ఉండి ఉంటుంది మామా...."

"నాకంటే పదేళ్లచిన్న. ఎనభైరెండు ఉంటాయి."

"మనం అమెరికాలో రెండుసార్లు చూసినప్పుడు బాగానే ఉన్నాడు. ఇప్పుడు మనలాగా ముసలివాడయుంటాడు మామా" అంది సుబ్బలక్ష్మి.

సుబ్బలక్ష్మి, సదాశివం కాసేపు నిశ్శబ్దంగా ఉన్నారు. ఇద్దరూ కలసి 'శకుంతల', 'మీరా' చిత్రాల కాలానికి వెళ్లారు. సదాశివం ఎత్తుకు పైఎత్తులు వేస్తూ 'శకుంతల' సినిమా సాకారం చేశాడు. ఎలాంటి ఆస్తిపాస్తులూ లేని మామూలు వ్యక్తి ఒక సినిమా తీసి, బాగా ప్రజాదరణ పొందేలా చూశాడు, ఫైనాన్సియర్లయిన రాయల్ టాకీస్ వారితో కోర్టు కేసులయ్యాయి. 'మీరా' సినిమా సమయానికి ఇంకా రాటుదేలాడు.

డంగన్ ఎంతో కష్టపడ్డాడు సుబ్బలక్ష్మి మూడు సినిమాలకి. సుబ్బలక్ష్మితో నటింప చేయడానికి అన్నింటికంటే ఎక్కువ కష్టపడ్డాడు. సదాశివానికి అన్నింటికంటే నచ్చినదేమిటంటే డంగన్‌కి సదాశివం ఎంత చెపితే అంత. సదాశివం తన పనిలో ఎంత జోక్యం చేసుకున్నా ఏమీ అనేవాడు కాదు. అందుకు బాగా నచ్చాడు డంగన్. అన్నింటికి మించి, తన దర్శకత్వంతో సుబ్బలక్ష్మికి ఎనలేని పేరు తెచ్చాడు. సినిమాలతో, సదాశివానికి సరైన సమయానికి డబ్బు తెచ్చాడు.





1944లో 'మీరా' చిత్రీకరణ సమయంలో సదాశివం, సుబ్బలక్ష్మి, డంగన్




యాభైఏళ్ల తర్వాత, 1994లో తమిళ సినీ
పరిశ్రమ వారి సన్మాన సభలో సుబ్బలక్ష్మి, సదాశివం, డంగన్

సుబ్బులక్ష్మి సదాశివం నవ్వుతూ ఒకరివైపు ఒకరు చూసుకున్నారు. "మనం వెళ్లాలి, మన డంగన్" అన్నాడు సదాశివం.

కొట్టూరుపురం క్రొత్త ఇంటిలోని ముందు గదిలో ఉండే సోఫా, కుర్చీలలో రెండు కుర్చీలు ప్రత్యేకంగా కనిపిస్తాయి. అందులో ఒకటి సదాశివందని చెప్పకనే చెబుతుంది. సుబ్బులక్ష్మి పొరపాటున కూడా ఆ కుర్చీలో కూర్చోదు. కాఫీలు తాగుతూ ఎంతోసేపు మాట్లాడుకుంటూ కూర్చున్నారు అక్కడ. సుబ్బులక్ష్మి ఇప్పటికీ తన చిన్నతనంలో శొంఠి కాఫీలాగా పలుచగా చేయబడిన కాఫీ తాగుతుంది, సదాశివం కాఫీ చిక్కగా తియ్యగా ఉంటుంది. సుబ్బులక్ష్మికి షుగర్ వ్యాధి ఉంది కాబట్టి సుబ్బులక్ష్మి కాఫీలో పంచదార చాలా తక్కువగా ఉంటుంది. అలా గంటపైన మాట్లాడుకుంటూ ఉన్నారు. సుబ్బులక్ష్మి సదాశివం విసిరే చలోక్తులకు నవ్వుతూనే ఉంటుంది. అన్నీ క్షమించేసింది సుబ్బులక్ష్మి. సదాశివం కోపిష్టి, అహంకార వైనాలన్నీ క్షమించేసింది. ఏవీ తనతో పాటు మోసుకురావటం లేదు. అన్నీ మర్చిపోయి, సదాశివం మీద తీర్పు ఆ భగవంతుడికే వదిలేసింది. అలా మాట్లాడుకుంటూ ఉండగా విశాలం రెండవసారి కాఫీలు తీసుకువచ్చింది. సదాశివం తన కాఫీ సగం తాగి, సగం మిగిల్చి, "కుంజమ్మా, ఇదిగో రా, తీసుకో తాగు" అంటూ తాను సగం తాగిన కాఫీ ఇచ్చాడు. సుబ్బులక్ష్మి తన పంచదార లేని కాఫీ తాగలేక, చిన్న పిల్లలాగ తెగ సంబరపడిపోతూ ఆ కాఫీ గ్లాసు తీసుకొని తాగింది. ఇక ఆత్మ ఆ రోజు ఏమి కార్యక్రమాలు ఉన్నాయో చెప్పటానికి వచ్చాడు. ఈ సంవత్సరంలో ఒప్పుకున్న నాలుగే నాలుగు లబ్ధి కచేరీలలో రెండు కంచి పరమాచార్య మణిమంటపం కోసమే. సుబ్బులక్ష్మి ఇప్పటివరకు 240 లబ్ధి కచేరీలు చేసి అరవైలక్షలు విరాళంగా ఇచ్చింది. ఇప్పుడిక తమ శక్తినంతా మణిమంటపానికే ధారపోయ నిశ్చయించుకున్నారు.

§§

జీవితాన్ని కాచి వడబోసిన అనుభవజ్ఞుడైన పెద్దమనిషి ఒకరు, "ఎమ్మెస్ కళ్లల్లో బాధ కనిపిస్తూ ఉంటుంది" అని చెప్తూ ఉంటాడు.

ఇప్పుడు ఈ ఆసుపత్రి అత్యవసర విభాగపు మంచం మీద ఉన్న రాధను చూస్తూ సుబ్బులక్ష్మి కళ్లు బాధతో కన్నీరు మున్నీరవుతున్నాయి.

సుబ్బులక్ష్మి పాటవిన్నవాళ్లకి మందులకి నయం కాని రోగం నయమయింది. కానీ సుబ్బులక్ష్మికి ఆ వయసుకి ఉండాల్సిన రోగాలన్నీ ఉన్నాయి. సుబ్బులక్ష్మి కనకధారా స్తోత్రం విని, అప్పులు తీరి, ధనయోగం పట్టింది ఒకరికి. కానీ ఆ స్తోత్రం పాడిన సుబ్బులక్ష్మి పరిస్థితి పూర్తిగా వేరు. కమ్మని పాటలతో భగవంతుడినే ఓలలాడించి, భక్తులకు సులువైన ముక్తి మార్గం చూపించి సేదతీర్చిన సుబ్బులక్ష్మికి అడుగడుగునా బాధలే. రాధ పక్షవాతంతో ఒకవైపు చచ్చుపడిపోయి, నిస్సహాయంగా మంచం మీద తననను చూస్తూ ఉంటే సుబ్బులక్ష్మికి గుండె పగిలినంత బాధ. మళ్లీ రాధ పక్కనే చేరింది సుబ్బులక్ష్మి. కచేరీలు మర్చిపోయింది.

సుబ్బులక్ష్మికి, సదాశివంకి, రాధకి, దెబ్బ మీద దెబ్బ. రాధ చాలా పట్టుదల కలిగిన మనిషి. మొదటిసారి అనారోగ్యం నుంచి కోలుకొని త్వరత్వరగా అమ్మపక్కన పాటకు చేరింది. ఈసారి, దురదృష్ట వశాత్తు పక్షవాతం బారిన పడింది. కుడికాలు, కుడిచేయి చచ్చుబడ్డాయి. భగవంతుడు ఎంతటి పరీక్ష పెట్టినా దూసుకుని నెట్టుకువచ్చే తత్వంగలది రాధ. తనకోసం, తన తల్లిదండ్రుల కోసం కష్టాలని దిగమింగి, చక్రాల కుర్చీ సహాయంతోనూ , అంతకంటే మించి కుటుంబ సభ్యుల సహాయంతోనూ ముందుకు సాగిపోతుంది. సదాశివం గుండెకు తూట్లుపడ్డాయి. తొంభైమూడేళ్ల వయసులో కూతురికి వచ్చిన కష్టం క్రుంగతీసింది. సుబ్బులక్ష్మికి రాధ ఆత్మ, రాధ విషయంలో సుబ్బులక్ష్మికి ఎంతో బాధ, రాధ కూతురి విషయంలో చాలా బాధ సుబ్బులక్ష్మికి. అయినాసరే, సరిపెట్టుకొని నెట్టుకొస్తూ ఉంటే అరవైయొక్కేళ్ల రాధని ఇలా చూస్తుంటే సుబ్బులక్ష్మికి కడుపు తరుక్కుపోతుంది. ఇంకొకరయితే పూజలు కట్టిపడేసేవారు. కానీ సుబ్బులక్ష్మి మరింతగా భగవంతుడుని వేడుకుంటుంది.

ఒక సంవత్సరానికిగానీ అందరూ కోలేకోలేదు. వెంటనే సుబ్బులక్ష్మి ఎప్పటినుంచో అనుకుంటున్న వృద్ధాశ్రమం కోసం నిధులు సేకరించటానికి కచేరీ చేసింది. ఆ తర్వాత మణిమంటపం కోసం ఇంకొక కచేరీ చేసింది. ఇదే సుబ్బులక్ష్మి చివరి లబ్ధి కచేరి.

§§

సెప్టెంబర్ 14, 1996న సదాశివం పుట్టినరోజు. "నాకు పదిహేడుమంది తోబుట్టువులు. ఇప్పుడు ఎవరూ లేరు. ఒక్కొక్కరూ పోతూపోతూ వారి మిగిలిన వయసుని నన్ను బ్రతకమని నాకు వ్రాసిచ్చి వెళ్లారు. అందుకనే నేను ఇన్ని సంవత్సరాలు బ్రతుకుతున్నాను" అంటూ తన పుట్టినరోజున అభినందనలు తెలుపటానికి వచ్చినవాళ్లకి చెపుతున్నాడు సదాశివం.

"కానీ, రాజాజీ బ్రతికింది తొంభైనాలుగేళ్లే నాకు రాజాజీ వయసుకు మించి బ్రతకట[illegible] ఇష్టంలేదు" అని గంభీరంగా తన ఆలోచన బయటపెట్టాడు. రాజాజీ నిజశిష్యుడు సదాశివం గురువుకంటే ఎక్కువ రోజులు బ్రతకటం కూడా ఇష్టంలేదు.

సుబ్బులక్ష్మి సెప్టెంబర్ 16, 1996న తన ఎనభైయవ పుట్టినరోజు జరుపుకోనుం[illegible] ఆ రోజుకి రెండురోజులు ముందు సదాశివం తిథుల ప్రకారం తొంభైనాలుగేళ్లు పూ[illegible] చేసుకున్నాడు. ఈ సందర్భంలో 'శ్రుతి', మద్రాసు నుంచి వెలువడే లలిత కళల పత్రి[illegible] సుబ్బులక్ష్మి ఇంటర్వ్యూ తమ పత్రికలో అచ్చువేయ నిర్ణయించుకుంది. మామూలుగా పత్రిక విలేఖరులని కాకుండా 'శ్రుతి' వారు, మణి కృష్ణస్వామి అనే ఒక సంగీతజ్ఞురా[illegible]



రాధతో సుబ్బులక్ష్మి, సదాశివం



సుబ్బులక్ష్మిని ఇంటర్వ్యూ చేయటానికి పంపారు. మణి కృష్ణస్వామి సంగీత కళానిధి బిరుదాంకితురాలు కూడా. మణి ప్రశ్నలు, సుబ్బులక్ష్మి సమాధానాలు ఇలా సాగాయి:

**శ్రుతి: శ్రుతి పత్రిక మీ పుట్టిన రోజున శుభాకాంక్షలు తెలియజేస్తుంది.**

ఎమ్మెస్: మాకు శుభాకాంక్షలు తెలియజేసినందుకు, శ్రుతి పత్రికకు, పాఠకులకు కృతజ్ఞతలు. మీకు తెలుసుకదా, మామకి కూడా నిన్ననే తొంభైనాలుగేళ్లు నిండాయి.

**శ్రుతి: మీకు మీ మొదటి కచేరీ గుర్తుందా?**

ఎమ్మెస్: నాకు పదేళ్లప్పుడు మా కుటుంబానికి స్నేహితులైన ఒక సౌరాష్ట్రీయుల పెళ్లిలో పాడాను. ఒకప్రక్క బిడియపడుతూనే పెద్దపెద్ద దీపాల కాంతిలో నేను ప్రత్యేక ఆకర్షణగా ఉండడం చాలా సంతోషమేసింది.

**శ్రుతి: మిమ్మల్ని ప్రభావితం చేసిన గొప్ప విద్వాంసులు ఎవరు?**

ఎమ్మెస్: మొట్టమొదటి వ్యక్తి మా అమ్మే. తరువాత దక్షిణామూర్తి పిళ్ళై వంటి వారు కూడా నన్ను చిన్నతనంలోనే ప్రభావితం చేశారు.

**శ్రుతి: ఒక కళాకారుడు వారి కళలో వృత్తిరీత్యా ఎదగటానికి కావలసిన అర్హతలేమిటి?**

ఎమ్మెస్: అణుకువ. ఏ వయసులోనైనా నేర్చుకునే తత్వం.

**శ్రుతి: వేటికి దూరంగా ఉండాలి కళాకారుడు.**

ఎమ్మెస్: సమకాలీనులతో గొడవలకి.

**శ్రుతి: మీ సంగీత ప్రస్థానంలో సదాశివం మామ పాత్ర గురించి చెప్తారా?**

ఎమ్మెస్: నేను ఆయన దగ్గరకు వచ్చిన దగ్గర నుంచి, నాకు అంతా ఆయనే.

సుబ్బులక్ష్మి ఈ మాట అనగానే, ప్రక్కనే ఉన్న సదాశివం, "నాకు సంఘంలో ఉన్న పెద్దపెద్ద పరిచయాలవల్ల సుబ్బులక్ష్మికి ఇంత పేరొచ్చిందనుకుంటారు చాలామంది. ఇది ముమ్మాటికి తప్పు. నేను ఆమె విద్వత్తుకు ఒక రూపం ఇచ్చేవరకే నన్ను నేను పరిమితం చేసుకున్నాను. కేవలం ఆమె యొక్క కళ, వ్యక్తిత్వం ఇంకా ఆమె చేసే కఠోరమైన సాధనవల్ల కుంజమ్మ గొప్ప పేరు తెచ్చుకుంది. ఈ రోజుకి కూడా, ఈ ఎనభైయో ఏట కూడా ఒక విద్యార్థిలాగా రోజుకు కనీసం మూడు గంటలు సాధన చేస్తుంది" అని చెప్పాడు.

**శ్రుతి: మీకు సహకారం అందించిన గొప్ప ప్రక్క వాయిద్యకార్ల గురించి చెప్తారా.....**

ఎమ్మెస్: గొప్ప వయోలిన్ విద్వాంసుడు మైసూరు టి. చౌడయ్య, తిరువలంగాడు సుందరేశ అయ్యర్, ఇంకా మృదంగం విద్వాంసులు టి.కె. మూర్తిలాంటి వారు నాకు సహకారం అందించారు. ఒకసారి ఇంట్లో జరిగిన ఒక చిన్న కచేరీకి పాలక్కాడ్ మణి అయ్యర్ మృదంగం వాయించారు. ఇంకొకసారి, అనుకున్న వయోలిన్ విద్వాంసుడు

రాకపోతే చెంబై నాకు వయోలిన్ వాయించారు. ఇప్పుడు చిన్నవాళ్లు శ్రీరామ్ కుమార్, కె.వి. ప్రసాద్ సహకారం అందిస్తున్నారు. వీళ్లందరూ కూడా మంచి కళాకారులు. ఎవరూ కూడా నన్ను వేదిక మీద, ఆ తర్వాత కూడా ఇబ్బంది పెట్టలేదు. నాకు వారితో మంచి జ్ఞాపకాలే ఉన్నాయి.

**శ్రుతి: ఈ తరం గాయకులు, ముఖ్యంగా చిన్నవాళ్లు ప్రతిభావంతులే కానీ, వీరు గొప్ప విద్వాంసుల పాటలు వింటూ ఉంటే, వాళ్లకి అది చాలా ఉపయోగపడుతుందను కుంటారా....**

ఎమ్మెస్: పాత రోజుల్లాగా ఇప్పుడు ఎవరినీ ఈ పని చేయి అని చెప్పలేము. ఇప్పుడు ఈ యువ గాయకులకు మనకు ఈ వయసులో తెలిసినదానికంటే, అన్నింటిలో ఎక్కువే తెలుసు. వారు వింటూనే ఉంటారు అనుకుంటున్నాను నేను. వారు విని ఆ విద్వాంసుల బాణీ, వారి లక్షణాలు తెలుసుకుంటే మంచిది. వారు ఎలా సంప్రదాయాన్ని, లక్షణాలని చెదరనీయకుండా ఎలా వారి గాత్రాన్ని అభివృద్ధి చేసుకున్నారో తెలుసుకుంటే బాగుంటుంది.

**శ్రుతి: ఈ తరం సంగీతజ్ఞులకు మీరిచ్చే సందేశం ఏమిటి? ముఖ్యంగా మహిళా కళాకారులకి?**

ఎమ్మెస్: వాళ్లెంత చిన్నవారయినా, వారికి సందేశం ఇచ్చేంత స్థాయి నాకు లేదనుకుంటున్నాను. కానీ వయసురీత్యా చాలా పెద్దదాన్ని కాబట్టి మన మహిళా కళాకారులకి ఒక మాట చెప్పదలచుకున్నాను, వారు వారి రంగంలో ఎంత గొప్పవారైనా కానివ్వండి, భారతీయ స్త్రీత్వము విడిచిపెట్టకూడదు. ఇక అణుకువ, కష్టపడటంవంటి వాటికి మించినవి ఏవీ లేవు.

**శ్రుతి: చివరిగా నన్ను మీరు, మామ ఆశీర్వదించాలి.**

ఎమ్మెస్: శ్రీ బాలాజీ యొక్క అనుగ్రహం మీ ఇద్దరి మీద ఉంటుంది. దానికి తోడు మా శుభాశీస్సులు కూడా మీ ఇద్దరిమీదా ఉంటాయి.

ఆ తర్వాత రెండు రోజులకు సుబ్బలక్ష్మి పుట్టినరోజు. రెట్టింపు అభిమానులు వచ్చారు అభినందనలు తెలుపటానికి. సుబ్బలక్ష్మి ఎనభైఏళ్ళు పూర్తి చేసుకుంది. బాదం హల్వా కొంచెంకొంచెం తింటూ, "నా ఇష్టమైన తీపి వంటకం" అనుకుంది. చక్కెర వ్యాధివల్ల ఎప్పుడు కావాలంటే అప్పుడు తినలేదు సుబ్బలక్ష్మి ఈ బాదం హల్వాని.

*1996!!* మద్రాసు నగరం చెన్నై గా మారిపోయింది. సదాశివం కూడా మారిపోయాడు. యాభైఆరేళ్ల క్రితం తను తీసుకున్న ఇంటర్వ్యూ తప్ప మళ్లీ సుబ్బలక్ష్మి ఒంటరిగా ఒక్క ఇంటర్వ్యూ కూడా ఇవ్వకుండా చేశాడు. మళ్లీ ఇప్పుడు యాభైఆరేళ్ల తర్వాత సుబ్బలక్ష్మి, సదాశివం పక్కనే లేకుండా ఇంటర్వ్యూ ఇవ్వనుంది.



ఒక ప్రముఖ తమిళ పత్రిక తన విలేఖరి వాసంతి ద్వారా సుబ్బలక్ష్మి ఇంటర్వ్యూ కోసం సదాశివంను సంప్రదించింది. సరేనన్నాడు సదాశివం.

"మీరు పక్కన ఉండొద్దు. సుబ్బలక్ష్మి గారిని, నన్ను ఒంటరిగా వదలండి."

ఇలాంటి అభ్యర్థనలు సదాశివం పదేపదే వినడం, ఖరాఖండిగా వల్లకాదని చెప్పటం జరుగుతూనే ఉన్నాయి. ఈ విలేఖరి పట్టువీడలేదు.

ఆ తరువాతి రోజే వాసంతి సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చింది.

సదాశివం పక్కనే ఉన్నాడు. కాసేపు వుండి వెళ్లిపోతాడేమో అనుకుంది వాసంతి. పలకరింపులు, కాఫీలు అయ్యాయి. సదాశివం కదల్లేదు.

ఇక తప్పదన్నట్లు ఇంటర్వ్యూ మొదలుపెట్టింది. తను వ్రాసుకొచ్చిన ప్రశ్నలు సంధిస్తూ వుంది. సుబ్బలక్ష్మి సమాధానాలు చెప్తూ ఉంది. సదాశివం కూడా చెప్తూ ఉన్నాడు. 'సోలో పెర్ఫార్మెన్స్' అనుకున్నది 'జుగల్‌బందీ' అయిపోయింది. ఇదొక విషయం అయితే, వాసంతి ఇంకొక విషయం కూడా గ్రహించింది. సదాశివం ప్రక్కనే ఉండటంవల్ల సుబ్బలక్ష్మి మనస్సులోని మాట చెప్పలేకపోతుందని గ్రహించింది.

వాసంతి సదాశివంవైపు తిరిగి, "ఈ ఒక్కసారికి సుబ్బలక్ష్మిగారిని మాట్లాడనివ్వండి... దయచేసి మీరు ప్రక్కన ఉండకండి..." ప్రాధేయపడింది వాసంతి.

"నేను ప్రశ్నలతో ఇబ్బంది పెట్టను. నేను రాసుకొచ్చిన ప్రశ్నలే అడుగుతాను. మా ఇద్దరినే ఉండనీయండి ఈ గదిలో. మీకు సుబ్బలక్ష్మిగారి సమాధానాలు కూడా చూపిస్తాను....."

వయస్సు ప్రభావమో లేక వాసంతి మాట ప్రాబల్యమో సదాశివం తన పద్ధతి మార్చుకున్నాడు. ఆ ఇద్దరి ఆడవాళ్లను ముందు గదిలో వదిలి తాను లోపలికి వెళ్లిపోయాడు.

ఇక ఆ గదిలో సుబ్బలక్ష్మి, వాసంతి మిగిలారు. మొట్టమొదటిసారిగా ఒక ప్రముఖ పత్రిక పాత్రికేయురాలు తన భార్యను ఒంటరిగా ఇంటర్వ్యూ తీసుకోవటానికి అనుమతి ఇచ్చాడు.

సుబ్బలక్ష్మి మొదటి ఇంటర్వ్యూ అప్పుడు తల్లి పక్కన ఉంది. ఇప్పుడు ఎవరూ లేరు. అయినా పర్వాలేదు శాంతంగా, నిశ్చలంగా ప్రశ్నలకై ఎదురు చూస్తుంది.

**పత్రికావిలేఖరి: ఇన్ని సంవత్సరాల సంగీత జీవిత గమనాన్ని ఒక్కసారి వెనక్కు తిరిగి చూసుకుంటే మీకు ఏమనిపిస్తుంది?**

ఎమ్మెస్: *ఇప్పుడు చాలా మారిపోయింది. నా చిన్నప్పుడు మా నాన్న శ్రీరామనవమి పండగకి ఇంట్లో పాడేవారు. ఆయనొక న్యాయవాది. పేరు సుబ్రహ్మణ్యం అయ్యర్.*



శ్రుతి పత్రిక కోసం సుబ్బులక్ష్మిని ఇంటర్వ్యూ చేస్తున్న మణి కృష్ణస్వామి





అప్పటి గొప్పగొప్ప గాయకులంతా వచ్చి ఆ పూజలో పాడేవారు. ఆ పూజలు, ఆ పాటలు నాకు చాలా నచ్చేవి. అప్పుడు ఆడవాళ్ల అందరి ముందు అసలు పాడేవాళ్ల కాదు. మా అమ్మ వీణ వాయించేది. నేను పాడటం అంటే ఇష్టపడేదాన్ని.

వెనక్కు తిరిగి చూసుకోమంటే, వెనక్కు తిరిగింది, అమ్మ నాన్న తప్ప ఎవరూ కనిపించలేదు.

పత్రికావిలేఖరి: మీరు గాయకురాలు అవుదామనుకున్నారా?

ఎమ్మెస్: *లేదు, ఎప్పుడూ అనుకోలేదు. పెళ్లి చేసుకొని పిల్లల్ని చూసుకుంటూ ఉండిపోదామనుకున్నాను. మామ పాడమని చెప్తేనే, పాడుతున్నాను.*

సుబ్బులక్ష్మి పెళ్లి చేసుకొని పిల్లల్నే చూసుకుందామని నిజంగానే అనుకుంది కానీ, పాట నరనరాల్లో ఉండి, ఇరవైఏండ్ల దాకా పాడి, ఉన్నపళంగా పాడటం ఆపేస్తే సుబ్బులక్ష్మి మానసిక పరిస్థితి క్షీణించేది. హిందుస్థానీ గాయకురాలు బేగం అక్తర్ ఒక ధనవంతుడిని పెళ్లి చేసుకున్నాక, ఆమె నలుగురిలో పాడటం ఇష్టంలేక, ఆమె భర్త కచేరీలను, పాటను కట్టడి చేశాడు. అంతే, మెల్లగా బేగం అక్తర్ ఆరోగ్యం క్షీణించసాగింది. లోలోన క్రుంగిపోసాగింది. కారణం గ్రహించిన భర్త, మళ్ళీ ఆమె కచేరీలు చేయటానికి అనుమతిచ్చాడు. అప్పటి నుంచి ఆమె ఆరోగ్యం మెరుగుపడింది. సుబ్బులక్ష్మి పాడకుండా ఉండి ఉంటే, తనకు తెలియకుండానే సుబ్బులక్ష్మి పరిస్థితి కూడా ఇలా తయారయ్యేది.

పత్రికావిలేఖరి: మీ భర్త తోడ్పాటుతోనే మీరింతవారయ్యారని భావిస్తున్నారా?

ఎమ్మెస్: *అందులో అనుమానమే లేదు.*

సదాశివం వల్ల సుబ్బులక్ష్మి పైకొచ్చిందా, సుబ్బులక్ష్మి వల్ల సదాశివం పరపతి పెరిగిందా, ఈ రెంటిలో ఏది నిజం అంటే....

"తంబీ! సుబ్బులక్ష్మి సినిమాల్లో నటించి డబ్బు సంపాదిస్తేనే, సదాశివంకి కల్కి పత్రిక, కల్కి బంగ్లా వచ్చాయి."

"ఇల్లై అణ్ణా, సదాశివమే లేకపోతే సుబ్బులక్ష్మి అసలు సినిమా నటే అయ్యేది కాదు."

"తంబీ! సుబ్బులక్ష్మే లేకపోతే సదాశివం నెహ్రూ, గాంధీ ప్రక్కన కాదు, ఆ కచేరీల గేటు దగ్గర ఉండేవాడు."

"ఇల్లై అణ్ణా, సదాశివమే లేకపోతే సుబ్బులక్ష్మి గాంధీ, నెహ్రూల ముందు కచేరీలే ఇచ్చేది కాదు?"

"తంబీ! సుబ్బులక్ష్మే లేకపోతే సదాశివం కచేరీలకి ఈ దేశం బయటికి వెళ్లేవాడేకాదు."

"ఇల్లై అణ్ణా, సదాశివమే లేకపోతే సుబ్బులక్ష్మి ఇంటి గడపకూడా దాటేదికాదు."

గుర్తు చేసుకుంటా కోసం చేసుకుంటా అన్న ప్రశ్నకి సమాధానంలాగా ఈ సమాధానం కూడా సాగిపోతున్నట్లే ఉంటుంది అనుకుంటాను.

పత్రికావిలేఖరి: మీ వ్యవహారాలలో తలదూరుస్తూ ఉంటే మీకు కోపం రాదా?

ఎమ్మెస్: లేదు. అది నా అదృష్టం. ఎలా చెప్పాలి మీకు... (కొంచెం సేపు ఆలోచిస్తుంది) నాకు ఎవరిమీదా కోపం రాదు.

పత్రికావిలేఖరి: మీ భర్త పూర్తి పెత్తనం వల్ల వచ్చే సమస్యలను మీరెలా ఎదుర్కొంటారు?

ఎమ్మెస్: నాకెలాంటి సమస్యలేమీ లేవు. ఆయన ఎప్పుడు ఏది చెప్పినా నాకది సరైనదనిపిస్తుంది.

పెళ్లైన తర్వాత నేనెప్పుడూ ఒంటరిగా ఎక్కడికీ వెళ్లలేదు. నేను ఒక్కదాన్నే ఆయన అనుమతి లేకుండా ఫోటోలు కూడా తీయించుకోలేదు. నేను ఎప్పుడూ పెద్దవాళ్ల మాటలు వింటూ పెరిగాను. నేను పెద్దగా చదువుకోలేదు. నేను ఆడపిల్లగా ఇంట్లో ఉన్నప్పుడు చదువులన్నీ కొంచెం అప్పటికప్పుడే వదిలేశాను. ఆ తర్వాత మా అమ్మ పెళ్లి నిర్ణయించింది. పెళ్లైన తర్వాత ఆయనతో సహా అన్నీ ఆయనే చూసుకుంటారు.

పత్రికావిలేఖరి: మిమ్మల్ని పాడనీయకుండా కట్టడి చేసివుంటే మీరు బాధపడి ఉండేవాళ్లా?

ఎమ్మెస్: లేదు. నేను పెళ్లి చేసుకుని, పిల్లల్ని చూసుకోవటంతోనే తృప్తి పడేదాన్ని. మామ పాడమంటేనే పాడేదాన్ని. మామ చేయమంటేనే నేను 'నారద' సినిమాలో నారదుడి వేషం వేశాను. ఆ సినిమాకి నాకు యాభైవేలు ఇచ్చారు. ఆ డబ్బుతో మామ 'కల్కి' పత్రిక మొదలుపెట్టారు. 'సావిత్రి' సినిమా చిత్రీకరణ అప్పుడు కలకత్తాలో నేను పాటల రికార్డింగు చేస్తున్నప్పుడు, సైగల్, కానన్ బాలా, సప్పాల్ ఇలాంటి గొప్పవారంతా వచ్చి నా పాటలు వినేవారు. వాళ్లంతా నాకు మంచి స్నేహితులయ్యారు.

పత్రికావిలేఖరి: అందరూ మీలా ఉండరు కదా..... కొంతమంది స్త్రీలను వారి భర్తలు ఆంక్షలు విధిస్తూ ఇబ్బంది పెడుతుంటారు.

ఎమ్మెస్: అవును. కాలం మారుతుంది. ఇప్పటి స్త్రీలు పాత తరం వాళ్లలాగా ఉండరు. పట్టువిడుపులు ఉండాలి. ఇప్పుడు నేను సంతోషంగా లేనా...?

పట్టువిడుపులు..... ఈ విషయంలో సుబ్బలక్ష్మి చాలా తెలివిగా వ్యవహరించింది. సదాశివంతో పెళ్లి అవగానే, సదాశివం ఆధిపత్యం కింద అతని భార్యగా తన పరిస్థితి ఏమిటీ అని బేరీజు వేసుకొంది. తనకు కావలసిందేంటో దాన్నే గుర్తుపెట్టుకుంది. తనకు సంగీతం కావాలి, సంగీతం నేర్చుకోవాలి, ఇంకా పాడాలి. అంతే. వీటికోసం ఇక ఏవీ



పట్టించుకోలేదు. చెరిగి పట్టుదలగా పోలేదు. మెల్లగా సదాశివం ఆంక్షలలో తన పదునుదిరి పోతుపోయింది. తన గలగల మాటలు, నవ్వులు, అన్నీ మెల్లగా పలచబడింది. పాట, పాట పాట... బుర్రలో ఇది తప్ప ఇంకేమీ పట్టనట్టుంది. ఇంకేమీ కావాలన్నా సుబ్బలక్ష్మికి దక్కవు.

పత్రికావిలేఖరి: స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ హక్కులు మీద మీ అభిప్రాయం ఏమిటి?

ఎమ్మెస్: ఈ ప్రశ్నకి నేనెప్పుడూ నా అభిప్రాయాలు చెప్పను (చాలాసేపు మౌనంగా ఉంది. ఏదో ఆలోచిస్తున్నట్లు, కాసేపటి తర్వాత) ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటం చాలా కష్టం. ఒక్కొక్క స్త్రీకి ఒక్కొక్క పరిస్థితి ఉంటుంది. ఎవరికి వారు వారికున్న కష్టాలు, బాధలనుబట్టి, వారి సమస్యలను పరిష్కరించుకోవాలి (ఇక్కడ కాసేపు ఆగి, చుట్టూ చూసింది సుబ్బలక్ష్మి తలుపులు వేసే ఉన్నాయో లేదో ఎవరైనా ఉన్నారేమోనని చూసుకుంది. మెల్లగా చెప్పింది). నేను యుక్తవయసులో ఉన్నప్పుడు మా ఇంటికి వచ్చే మగవాళ్లు నన్నెప్పుడెప్పుడు వాళ్ల వశం చేసుకుందామానే దృష్టితో చూసేవాళ్లు. నేను వణికిపోయేదాన్ని. అందుకని నాకు ఎప్పుడెప్పుడు పెళ్లి చేసేసుకుందామా అని అనిపించేది. భగవంతుని దయవల్ల అలానే జరిగింది.

పత్రికావిలేఖరి: మీరు పెళ్లి చేసుకోవటానికి ఎవరైనా సరే ఫరవాలేదనుకున్నారా? మీ సుఖం గురించి ఆలోచించలేదా?

ఎమ్మెస్: సుఖమో, దుఃఖమో.... పెళ్లైతే చేసేసుకుంటే ముందు నేను భద్రంగా ఉంటాను కదా.

అంతే, ఆ భద్రతను వెతుక్కుంటూ అన్నింటికి తెగించి మదురై నుంచి మద్రాసు వచ్చేసింది.

పత్రికావిలేఖరి: సంగీతం యొక్క పరమార్థం ఏమిటి?

ఎమ్మెస్: నా అనుభూతినిబట్టి సంగీతం జ్ఞానసాగరం. మిగతావారు ఏమనుకుంటారో తెలియదు కాని నాకు మాత్రం సంగీతం ఒక సముద్రం. ఇంట్లో సాధన చేస్తున్నప్పుడు ఎన్నో ఆలోచనలు వస్తాయి. ఇలా పాడితే బాగుంటుంది, అలా పాడితే బాగుంటుంది అని. కానీ కచేరీలో అనుకున్నవాటిలో కొన్నే పాడగలుగుతాము. కచేరీ చేయటానికి కూర్చున్న ప్రతిసారీ నాకు భయంవేసేది. రసజ్ఞులకు ఒక మంచి కచేరీ ఇచ్చే బాధ్యత నాపై ఉంది. ఇస్తానో లేదోనని నాకు ఎప్పుడూ భయమే కలిగేది. ఈ తరం గాయకులైతే ధైర్యంగా పాడుతున్నారు.

పత్రికావిలేఖరి: మీరు రోజూ సాధన చేస్తారా?

ఎమ్మెస్: అవును. రోజూ చేస్తాను. రోజుకి మూడు గంటలు చేస్తాను.

పత్రికావిలేఖరి: మీ జీవితంలో అత్యంత ఆనందమైన సంఘటన ఏది?

ఎమ్మెస్: నేను మొదటిసారిగా కంచి పరమాచార్యులవారిని దర్శించుకున్నప్పుడు, కంచి పరమాచార్యులవారు నన్ను ఐక్యరాజ్య సమితి కచేరీకి వెళ్తున్నప్పుడు దీవించి పంపినప్పుడు నాకు చాలా సంతోషమేసింది. అమెరికాలో చాలా కచేరీలు చేసిన తర్వాత చివరిలో ఐక్యరాజ్య సమితి కచేరి. సరిగ్గా ఈ కచేరీ ముందు నా గొంతు బొంగురుపోయి, ఒక్క మాట కూడా బయటకు రావటంలేదు. ఏమి చేయాలో తెలియక ఇక కంచి పరమాచార్యులవారి ఫోటో ముందు ప్రార్థిస్తూ ఉన్నాను (ఇలా చెబుతున్నప్పుడు సుబ్బులక్ష్మి ఉద్విగ్నురాలయింది. ఆర్ద్రతతో చెప్పింది).

కచేరీ చేయటానికి వస్తుంటే నా కాళ్లు వణికాయి, అక్కడంతా తెల్లవాళ్లు, భారతీయులు చాలా తక్కువ. మన దేశం పరువు తీస్తానేమోనని భయమేసింది. కాని క్రింద కూర్చొని ఓం' అని అన్నప్పుడు అసలు నా గొంతుకి ఏమీ అవనట్లు గొంతు స్పష్టంగా వినిపించింది. అంతా ఆ పరమాచార్యులవారి దీవెనల మాహాత్మ్యం.

**పత్రికావిలేఖరి: మిమ్మల్ని చాలా బాధపెట్టిన విషయం ఏది?**

ఎమ్మెస్: నెహ్రూ కుటుంబం మాకు బాగా సన్నిహితం. నెహ్రూ ఎప్పుడూ మామని 'అల్లుడూ' అని పిలిచేవారు. ఆ కుటుంబానికి ఏ కష్టం వచ్చిన అది నాకు కూడా కష్టమే.

**పత్రికావిలేఖరి: మిమ్మల్ని ఉత్తేజపరిచే విషయం ఏమిటి?**

ఎమ్మెస్: సంగీతమే! పాట పాడుతుంటే నేను చాలా ఉద్విగ్నమవుతాను. పాటను అర్థం చేసుకొని, భావాన్ని గ్రహించి పాడితే, శ్రోతలు వెంటనే నీవైపు మళ్లుతారని మామ మొదటినుంచీ చెప్పేవారు. నేను తమిళం, తెలుగు, హిందీ, మలయాళం, కన్నడం, సంస్కృతం భాషలలో పాడతాను. ఆ భాషలలో పాటలకి అర్థం తెలుసుకున్న తర్వాతే పాడతాను. అది నా నిబంధన. అలా భావంతో పాడేప్పుడు నా గొంతు ఆర్తితో పూడుకుపోతుంది. ఇలా చాలాసార్లయింది. మీరా సినిమాలో అయితే నిజంగా మీరా అయ్యాను. చివరి పాట పాడుతూ స్పృహ తప్పాను.

**పత్రికావిలేఖరి: మీలో మీకు ఇష్టంలేని విషయం ఏమైనా ఉన్నదా?**

ఎమ్మెస్: కచేరీ బాగా చేస్తానా లేదా అని తెగ భయపడిపోతుంటాను. ఇంట్లో పిల్లలకి బాగోపోతే చాలాచాలా బాధపడతాను, భయపడతాను. చాలా ఎక్కువే భయపడతాను, నా స్వభావమే అంత.

**పత్రికావిలేఖరి: మీరు అందంగా ఉంటారని మీకు తెలుసా?**

ఎమ్మెస్: (కాస్త సిగ్గుపడుతూ, నవ్వుతూ) లేదు. కానీ ఎవరైనా అందమైన వాళ్లు కనిపిస్తే, వాళ్లను తేరిపారా చూస్తాను.



**పత్రికావిలేఖరి: మీరు ఏమి తినటానికి ఇష్టపడతారు?**

ఎమ్మెస్: నేను అన్నీ తింటాను. పెద్దగా పట్టింపులు లేవు. నేను బాగా కారంగా ఉండే వంటకాలు తింటాను. అందరూ అడుగుతూ ఉంటారు, ఇంత కారంగా తింటుంటే మీ గొంతు అంత తియ్యగా ఎలా ఉంటుంది అని. ఇప్పుడు కాస్త జాగ్రత్తగా తింటున్నాను. నేను బాగా వంట చేయగలను కూడా. ఇప్పుడు ఆకలికి ఆగలేను. ఒకసారి చికాగోలో కచేరీ చాలా గంటలు చేసిన తర్వాత అభిమానులు ఆటోగ్రాఫుల కోసం చుట్టుముట్టారు. భోజనానికి ఆలస్యమవుతుంది, చాలాసేపు ఆటోగ్రాఫులు ఇస్తూ కళ్లు తిరిగి, పడిపోయినంత పని అయింది.

**పత్రికావిలేఖరి: సంగీతం కాకుండా మీకు ఇంకా ఏమైనా ఇష్టమైన వ్యాపకాలు ఉన్నాయా?**

ఎమ్మెస్: లేవు. ఎప్పుడైనా టి.వి. చూస్తాను, మంచి సినిమా వస్తే చూస్తాను.

**పత్రికావిలేఖరి: మీకు రాజకీయాల మీద ఆసక్తి లేదా?**

ఎమ్మెస్: అస్సల్లేదు.

**పత్రికావిలేఖరి: ఇప్పటి రాజకీయ పరిస్థితి మీద మీ అభిప్రాయం ఏమిటి?**

ఎమ్మెస్: నేను ఈ విషయం మీద మాట్లాడను.

**పత్రికావిలేఖరి: జయలలిత గురించి మీ అభిప్రాయం?**

ఎమ్మెస్: ఈ విషయం గురించి కూడా నేను మాట్లాడను (కాసేపు ఆగి, నవ్వుతూ) తను చాలా తెలివైనది, బాగా చదువుకున్నది. తప్పకుండా పైకొస్తుంది.

**పత్రికావిలేఖరి: రాజాజీ గారి గురించి మీ అభిప్రాయం?**

ఎమ్మెస్: రాజాజీ నాకు తండ్రిలాంటివారు.

**పత్రికావిలేఖరి: మిమ్మల్ని బాధపెట్టే విషయాలేమన్నా ఉన్నాయా?**

ఎమ్మెస్: అందరూ బాగుండాలనేదే నా కోరిక. ఇప్పుడు టి.వి. చూడండి. ఎంత చెడ్డ విషయాలు చూడాల్సొస్తుందో. అప్పుడు రాజాజీ, నెహ్రూ రాజకీయంగా గొడవపడితే నాకు చాలా బాధవేసింది.

**పత్రికావిలేఖరి: మీకు హిందుస్థానీ సంగీతం వచ్చా?**

ఎమ్మెస్: వచ్చు.

**పత్రికావిలేఖరి: మిమ్మల్ని ఏ విషయం బాధిస్తుంది?**

ఎమ్మెస్: పేదరికం. రోడ్లపక్కన, రైల్వే ప్లాట్‌ఫారమ్ ప్రక్కన, దొరికింది తింటూ

*ఉండేవాళ్లని మాత్రం నాకు చాలా బాధిస్తుంది. మనకు స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళయినా, ఎంతో చేయగలిగినా ఏమీ చేయలేకపోయాం. నేను మహా అయితే ఒక లబ్ధి కచేరీ చేయగలను అలాంటి వారికోసం. మా ఇంటిలో పనిచేసేవారందరికీ కడుపు నిండా భోజనం పెడతాను.*

**పత్రికావిలేఖరి: మీకు డబ్బు ఎంత ముఖ్యం?**

*ఎమ్మెస్: తినడానికి, ఉండటానికి సరిపోను ఉంటే చాలు.*

**పత్రికావిలేఖరి: మీకు ఎన్నో పురస్కారాలు, గొప్ప పేరు వచ్చాయి. వాటి గురించి మీరు ఏమంటారు?**

*ఎమ్మెస్: అవన్నీ ఈశ్వర సంకల్పంవల్ల, మామ ప్రేమవల్ల సాధ్యమయ్యాయి.*

**పత్రికావిలేఖరి: మీకు మరణమంటే భయమా?**

*ఎమ్మెస్: లేనే లేదు. నేను ఇప్పుడు ఒక రికార్డింగు చేస్తున్నాను. ఆ రికార్డు మీద వచ్చే ఆదాయం ఒక సంస్థకు వెళ్లాలి. అందుకని ఆ రికార్డు పని అయిన తర్వాత భగవంతుడు నన్ను తీసుకెళ్లినా ఫర్వాలేదు. కానీ ఒక్క కోరిక. నేను సుమంగళిగా వెళ్లిపోవాలని నా కోరిక. నాకు నా భర్తే అంతా. ఆయన తర్వాత నేను బ్రతకలేను.*

❀❀

సుబ్బలక్ష్మికి అమ్మంటే ఎంతో ప్రేమ, ఆరాధన. అలాగే అమ్మవారన్నా కూడా ఎంతో ప్రీతి, భక్తి. మదురైకి ఎవరు వెళ్తున్నా అమ్మ దగ్గరకు వెళ్లి, అమ్మ బాగోగులు కనుక్కొని వచ్చి తనకు చెప్పమని చెప్పేది. అలాగే మీనాక్షి అమ్మవారిని తప్పనిసరిగా దర్శించుకోమని చెప్పేది. మీనాక్షి అమ్మవారు, తన అమ్మ తర్వాత అమ్మ. మీనాక్షమ్మ తనకు కమ్మని గొంతు ఇచ్చినందుకు, ఆ అమ్మవారి రుణం కాస్తయినా తీర్చుకుంది. ఇన్నేళ్లకు, మీనాక్షి సుప్రభాతం రికార్డు చేసే అవకాశం వచ్చింది. మీనాక్షి సుప్రభాతం లో సుబ్బలక్ష్మి గొంతు వయసు మళ్లిన గొంతు అని తెలుస్తుంది. కడలిలో కలవబోతున్న నదీమ తల్లిలా, ఎనభై సంవత్సరాల సంగీత ప్రవంతిని వెంట తీసుకొస్తున్న మందగమనంతో, గంభీరంగా ఉంది సుబ్బలక్ష్మి గొంతు.

శ్రీవేంకటేశ్వర సుప్రభాతం, ఆ తర్వాత కాశీ, రామేశ్వర సుప్రభాతాలు, కామాక్షి సుప్రభాతం. తర్వాత ఇప్పుడు మీనాక్షి సుప్రభాతంతో సుబ్బలక్ష్మి , 'సుప్రభాతాల సుబ్బలక్ష్మి' అయ్యింది. ఈ రికార్డులో మీనాక్షి సుప్రభాతం పాడినా, ఆదిశంకరాచార్యులవారి మీనాక్షి పంచరత్నం పాడినా, కర్ణాటక సంగీత రత్నత్రయంలోని ముత్తుస్వామి దీక్షితుల 'మామవ మీనాక్షి' అని పాడినా తన ఎనభైఏళ్ల పాండిత్యాన్ని, అమ్మవారిపట్ల తనకున్న ఆరాధననీ అమ్మవారికి సమర్పించుకుంది. ఎట్టకేలకు తన ప్రజ్ఞ ఎక్కడ మొదలయిందో,



ఎవరి దీవెనలతో మొదలయిందో అక్కడే, ఆ అమ్మ పాదాల వద్దే తన ప్రజ్ఞను అర్పించుకుంది. ఇదే సుబ్బలక్ష్మి చివరి రికార్డు.

1989లో స్థాపించబడిన స్వరలయ సంస్థ తమ 1997 కు సంబంధించిన స్వరలయ పురస్కారం సుబ్బలక్ష్మికి ఇవ్వ నిశ్చయించుకుంది. ఆ వార్తతో ఢిల్లీ నుంచి మద్రాసు చేరుకున్నారు సంస్థ ప్రతినిధులు.

వ్యవస్థాపకుడైన కేరళ రాజకీయ నేత ఎమ్.ఎ. బేబి సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చాడు. సదాశివంని పలకరించి, కూర్చున్నాడు. కమ్యూనిస్ట్ అయిన బేబి సదాశివంని చూస్తున్నాడు. ఖద్దరు బట్టలతో తన గాంధేయవాదం తెలుపుతున్నాడు. కనీస అవసరాలతోనే ఉన్న ఇల్లు అతని ఆలోచనలు తెలుపుతుంది. నుదుటిమీద తీరుగా తీర్చిదిద్దిన శివనామాలు అతని భక్తిని తెలుపుతున్నాయి. సదాశివం, ఒక స్వాతంత్ర్య యోధుడిగా, నిస్వార్థ దేశ సేవకుడిగా, అందరికీ ఆదర్శప్రాయుడు. ఈ తరం రాజకీయ నాయకులకి ఇంకా ఆదర్శప్రాయుడు. ప్రజల సొమ్మును, ప్రభుత్వం సొమ్మును ఎన్నెన్ని రకాలుగా స్వాహా చేద్దామా అనే కపటాలోచనలు చేసేవారు సదాశివంను చూసి నేర్చుకోవలసింది ఎంతో ఉంది. రాజాజీ అత్యంత సన్నిహితుడై ఉండి కూడా ఎలాంటి పదవిని కానీ, గౌరవాలు కానీ ఆశించలేదు. ఆఖరుకు ప్రభుత్వం స్వాతంత్ర్య యోధులకి ఇచ్చే పించను కూడా సదాశివం తీసుకోవటానికి నిరాకరించాడు. అలాంటి విలువలున్న మనిషిని మనసులోనే అభినందించుకుంటూ సుబ్బలక్ష్మి కోసం ఎదురు చూస్తున్నాడు బేబి. సుబ్బలక్ష్మి ముందు గదిలోకి వచ్చింది. ఆమె రాకతో గది మెల్లగా ప్రకాశవంతమవుతుంది. తేజోరూపమైన ఆమె మోము ప్రకాశం వ్యాప్తిజేస్తుంది. ఈ వర్చస్సు ఆమెకు తన సంగీతం ఇచ్చింది. సంగీతంలో శ్రమించి, సంగీతంలోనే సేదతీరి, సంగీతమే తలపు, వలపై, ప్రయాణమూ సంగీతమై, ఆ సంగీతమే పరమావధియై సిద్ధి పొందిన సాధ్వీలాగా ఆమె తనువు తేజరిల్లుతుంది. సుబ్బలక్ష్మి వచ్చి సదాశివం పక్కన సోఫాలో కూర్చొంది.

'పార్వతీపరమేశ్వరులు' అనుకున్నాడు కమ్యూనిస్టు బేబి.

"మా పురస్కార ప్రదానోత్సవాలన్నీ ఢిల్లీలోనే జరిపాం. కానీ మీ ఇద్దరి కోసం మద్రాసులోనే నిర్వహించదలచుకున్నాం" అని చెప్పాడు. జూన్ ఇరవైతొమ్మిదిన సాయంత్రం మద్రాసు మ్యూజిక్ అకాడమీలో అని వివరంగా చెప్పాడు బేబి. ఆ రోజున సుబ్బలక్ష్మి ఇంటికి పక్కవాద్య కళాకారులందరూ వచ్చారు. అందరూ కలసి కచేరీకి ఇక్కడ నుంచి బయలుదేరతారు. మొదటినుంచీ సదాశివం పద్ధతి ఇదే. ఎవరైనా నేరుగా కచేరీ దగ్గరకే వస్తానంటే, "వచ్చి కచేరీ వినండి, నేను వేరేవాళ్లని చూసుకుంటాను" అని నిక్కచ్చిగా చెప్పేస్తాడు. బయలుదేరటానికి అంతా సిద్ధమయ్యారు. సుబ్బలక్ష్మి సదాశివం కాళ్లకు

నమస్కారం చేసుకుంది. మొదటి నుంచీ సుబ్బలక్ష్మి పద్ధతి కూడా ఇదే. సదాశివం దీవించాడు, చివరి సారిగా. అందరూ మద్రాస్ మ్యూజిక్ అకాడమీకి చేరుకున్నారు.

1997, జూన్ 29, మద్రాస్ మ్యూజిక్ అకాడమి.

పంతొమ్మిదేళ్ల తర్వాత ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి మద్రాస్ మ్యూజిక్ అకాడమీలో కచేరీ ఇవ్వబోతుంది. స్వరలయ సంస్థ, మద్రాసు శ్రోతల అభ్యర్థనమేర కచేరీ చేయనుంది. క్రిక్కిరిసిపోయున్న మద్రాస్ మ్యూజిక్ అకాడమీ ఆడిటోరియంలో సభాకార్యక్రమాలు మొదలయ్యాయి. స్వర లయ సంస్థ వారు పురస్కారం ప్రదానం చేసి, సుబ్బలక్ష్మికి లక్షరూపాయల నగదు బహుమతి అందించారు. సుబ్బలక్ష్మి ఆ డబ్బుని సదాశివం చేతిలో పెట్టింది. సదాశివం యథావిధిగా అక్కడికక్కడే ఆ డబ్బు ఎవరికి ఇవ్వబడుతుందో చెప్పాడు. కంచి పరమాచార్య మణి మంటపానికి ఆ లక్షరూపాయలను అర్పిస్తున్నట్లు ప్రకటించాడు. ఆ తర్వాత జరగనున్న కచేరీకి టిక్కెట్టు రూపంలో వచ్చిన ఆదాయాన్ని కూడా మణి మంటప నిర్మాణ నిధికే మళ్లించనున్నట్లు ప్రకటించాడు. మద్రాస్ మ్యూజిక్ అకాడమీ ఆడిటోరియమ్ వేదిక మీద తెర దించబడింది. తెర వెనుక కచేరీకి వేదికను సిద్ధం చేస్తున్నారు.

గత యాభైఏడేళ్ల నుంచి చేస్తున్నట్లే ఈ రోజు కూడా సదాశివం ముందు వరుసలో సరిగ్గా సుబ్బలక్ష్మి ముందు ఉండేటట్లు కూర్చున్నాడు. సదాశివంకి ఒకప్రక్క సుబ్బలక్ష్మి గురువు సెమ్మంగుడి, ఇంకో ప్రక్క పూర్వపు కాశ్మీర్ యువరాజు కరణ్‌సింగ్, ఆ ప్రక్కన మాజీ రాష్ట్రపతి వెంకట్రామన్ కూర్చున్నారు. తెర వెనుక అంతా సిద్ధమయింది. గౌరి సాయం పట్టగా జాగ్రత్తగా మెట్లెక్కి, మెల్లగా తన స్థానంలో కూర్చుంది. ఇప్పుడిక ఎలాంటి కీళ్లనొప్పులూ గుర్తురావటంలేదు. ఈ కచేరీ బాగా చేస్తానా లేదా అనే ఆందోళనతప్ప.

తెర మెల్లగా పైకి వెళ్లిపోయింది. బచ్చలి రంగు చీరకు ఆకుపచ్చ రంగు అంచు కంచిపట్టు చీరతో లక్ష్మీసరస్వతుల మధ్య సదాశివుని ఢమరుకమై కూర్చుంది సుబ్బలక్ష్మి. తల మీద ఒకవైపు నల్లని చారలతో, ఇంకోవైపు వెండి వెలుగుతో, ఇంకా పూర్తిగా నెరవని జుట్టుని కొప్పుకట్టి, కొప్పుకి మల్లెచెండు చుట్టి, నుదుటిమీద పంచవన్నెల బొట్లు పంచాకారాలలో పెట్టి, చీర కొంగు భుజాల చుట్టూ నిండుగా కప్పి, ఎమ్.ఎస్. కూర్చుంది.

అలా సుబ్బలక్ష్మి కూర్చోగానే కెమెరాలు సుబ్బలక్ష్మి ఫోటోలు తీసుకోవటానికి పోటీపడ్డాయి. సుబ్బలక్ష్మి మీద కెమెరా ఫ్లాషులు ఎడతెరిపి లేకుండా పడుతూనే ఉన్నాయి. ఆ ఫ్లాష్ మిరుమిట్లలో సుబ్బలక్ష్మి ఆకాశంలో ధ్రువతారగా కనిపిస్తోంది. కెమెరా ఫ్లాష్‌లు తగ్గుముఖం పట్టిన తర్వాత కచేరీ మొదలుపెట్టటానికి సిద్ధంగా ఉంది సుబ్బలక్ష్మి. కచేరీ మొదలుపెట్టాలంటే యాభైఏడేళ్లనుంచి ఏం చేస్తూ వచ్చిందో అదే చేసింది ఇప్పుడు కూడా. అనుమతి కోసం సదాశివంవైపు చూసింది. ఆఖరి కుర్చీ వరకు నిండిపోయున్న ఆడిటోరియం సుబ్బలక్ష్మి కచేరీ కోసం ఆత్రుతగా ఎదురు చూస్తుంది,



సదాశివం అనుమతి ఇవ్వందే సుబ్బలక్ష్మి కచేరీ మొదలుపెట్టదు. ఆ అధికారం సదాశివంది. ఆ అధికారం ఇచ్చిన గంభీరత్వంతో సదాశివం మెల్లగా తల ఊపాడు. సుబ్బలక్ష్మికి సంకేతం అందింది. కచేరీ మొదలుపెట్టింది. 'హర్ మాస్టర్స్ వాయిస్' (her masters voice) గొంతు విప్పింది. సదాశివుని ఢమరుకం మ్రోగింది. ఇక్కడ నుంచి ఇక ఎవ్వరూ కనిపించరు. తన పెరుమాళ్ తప్ప. శ్రోతలు శుద్ధమైన, స్వచ్ఛమైన కర్ణాటక సంగీతానికి, భక్తిరసాస్వాదనకు హృదయ ద్వారాలు తెరచి తయారుగా ఉన్నారు.

"తంబీ, ఇక తన పూజగదిలోకి వెళ్లిపోతుంది చూడు."

"ఇల్లై అణ్ణా..... మనల్ని కూడా తీసుకెళ్తుంది చూడు."

ధ్యానశ్లోకంతో కచేరీ మొదలుపెట్టింది, మొదటి పాట ముత్తుస్వామి దీక్షితుని కృతి, 'వాతాపి గణపతిం', రెండవ పాట త్యాగరాజ కృతి, 'బంటు రీతి కొలువివ్వవయ్యా....' ఆ తర్వాత యోగనరసింహం కృతి, మైసూర్ మహరాజ కృతి తర్వాత, ఐదవ పాట మళ్లీ త్యాగరాజుని 'మనసులోని మర్మము తెలుసుకో....', ఆరవ పాట సుబ్బలక్ష్మి సెక్రటరి ఆత్మనాథన్ కృతి, 'చంద్రశేఖర కృపావిధే...' ఆత్మ పాటకు తన గొంతునిచ్చి ఆత్మనాథన్ సేవలకు బదులిచ్చింది సుబ్బలక్ష్మి. ఆ తర్వాత రెండు పాటలు భజనలు. ఒకటి కబీర్‌దాస్, రెండవది మీరా భజన. ఆ తర్వాత కన్నడంలో కర్ణాటక సంగీత పితామహుడు పురందర దాస కృతి, తర్వాత 'కందు కందు' అనే మలయాళం పాట, పదకొండవ పాట ద్విజేంద్రరాయ్ బెంగాలి పాట. పన్నెండవ పాట ఆదిశంకరాచార్య విరచిత 'భజగోవిందం' తర్వాత పాట రాజాజీ 'కురై ఒంద్రుమ్ ఇల్లై', మళ్లీ పధ్నాలగవ పాటగా ఆదిశంకరుని 'నాగేంద్ర హారాయ', చివరిగా కంచి పరమాచార్య 'మైత్రీమ్ భజత' పాడింది. మొత్తం పదిహేను పాటలతో గంటన్నర పైన కచేరీ చేసింది. రెండు తెలుగు పాటలు, ఏడు సంస్కృత పాటలు, ఒక తమిళ పాట, ఒక మలయాళం, ఒక బెంగాలి, కన్నడ, రెండు హిందీ భజనలతో ఎమ్.ఎస్. కచేరీ కూర్చాడు సదాశివం. ఈ పాటలు కర్ణాటక సంగీత క్లిష్ట పద్ధతుల చిక్కులు విప్పే పని లేకుండా, అన్నీ తేలికైన పాటలు... కానీ భావగర్భంతో నిండినవి. 'బంటు రీతి కొలువీయవయ్యా....' అనే పాటలో వాళ్ల నాన్న పాటలో లాగా, తనని కూడా రామబంటుగా చేసుకోమనే ప్రార్థన కనిపించింది. 'క్రోధ్ న ఛోడా, ఝూట్ న ఛోడా, రామ్ జప్ క్యో ఛోడా....' (కోపాన్ని వదలలేదు, అబద్ధాలని వదలలేదు, రామజపం ఎందుకు వదిలావు?) అనే పాట విన్నప్పుడు సదాశివంతో సహా అందరూ ఆత్మపరీక్ష చేసుకున్నారు. 'భజగోవిందం'లో జీవిత సత్యాలు మరొక్కసారి గుర్తుచేసింది. 'మైత్రీమ్ భజత' అంటూ స్నేహభావంతో ఉండమని చెప్పింది. ప్రతి పాటలో తనతోపాటే శ్రోతలని కూడా తీసుకువెళ్లింది. ఆడిటోరియంలో ఎవరూ కూడా తాళం వేయటంలేదు. సుబ్బలక్ష్మి భావయుక్తంగా, పాటలోని మాటలో లీనమయి, భావం విప్పి చెపుతుంటే అందరూ అర్థమైనట్లు తల ఆడిస్తున్నారు.

'మనసులోని మర్మము తెలుసుకో' అనే పాటలో రాముడిని తన చేయి వదలవద్దని బ్రతిమిలాడింది.

'కురై ఒంద్రుమ్ ఇల్లై' అనే పాట పాడుతూ 'నాకు ఎలాంటి కొరతలు లేవు తండ్రీ' అని చెప్పుకుంది.

ఈ కచేరీలో సుబ్బలక్ష్మి పాడిన పాట, 'కందు కందు ఇరిక్కుమ్ జనన్నాలై' అనే మలయాళం పాటలోని అర్థం,

ఈ రోజున కనిపిస్తున్న మనిషిని, దేవుడు రేపు తీసుకెళ్తాడు..

నువ్వు లెక్కపెట్టుకుంటుండగానే నీ రోజులు

దగ్గర పడతాయి..... ఆ రోజు రానే వస్తుంది....

మనము కలిసి పుట్టలేదు..... కలిసి మరణించం కూడా...

మరి ఇక ఈ కోరికలెందుకు....

ఈ కచేరీలో సదాశివంకు ఇష్టం కాబట్టి చిరతలు కూడా పట్టుకుంది. కానీ పాట భావంతోపాటు, రాగ తాళ లయలతో చేతులు కదుపుతూ ఎక్కువగా చిరతలు వాయించలేకపోయింది. కచేరీ పూర్తయ్యేసరికి శ్రోతలు హృదయాలన్నీ 'నీ పాట విన్నాక మాకింకేమీ కోరికలు లేవు తల్లీ' అంటూ స్పందించాయి.

కచేరీ ముగిసింది. మెల్లగా తెర క్రిందకు దిగి, రసజ్ఞుల హృదయరాజ్ఞి తెరమరుగైంది. తెర వెనుక సుబ్బలక్ష్మికి కీళ్లనొప్పులు ఇప్పుడు గుర్తొచ్చాయి. ఆత్మ సాయం పట్టగా మెల్లగా లేచి నుంచుంటుంది. మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి తన చిట్టచివరి కచేరీ చేసింది.

కచేరీ అయిన వెంటనే ప్రముఖులతో మాత్రమే సుబ్బలక్ష్మి చేత మాట్లాడించి, వెంటనే కారెక్కించి ఇంటికి తీసుకువచ్చాడు సదాశివం. ఎప్పుడూ కూడా సుబ్బలక్ష్మిని ప్రజలకి దగ్గరగా ఉంచడు.

ఇంటికి వచ్చిన తర్వాత సుబ్బలక్ష్మికి కీళ్లనొప్పులు ఇంకా బాధనిపిస్తున్నాయి.

"మామా, భరించలేకపోతున్నా" అంది సదాశివంతో. "రాధ బాధకన్నానా మన బాధలు" చక్రాల కుర్చీకి పరిమితమైన రాధను ఉద్దేశిస్తూ అన్నాడు సదాశివం. సుబ్బలక్ష్మి ఇక నొప్పి సంగతి మర్చిపోయి రాధ గురించి దేవుడుని ప్రార్థించుకుంటోంది.



1997 సెప్టెంబర్ 2 న సదాశివం పుట్టినరోజు. తొంభైఐదేళ్లు నిండాయి.

"ఎమ్.ఎస్. మామా సెంచరీకి ఇంకా ఐదేళ్లే. కానివ్వు వదలొద్దు" అంటూ అభినందిస్తున్నాడు రాము.



"రాజాజీ కంటే ఎక్కువ ఒక్కరోజు కూడా వద్దనుకున్నాను. కానీ ఒక సంవత్సరం ఎక్కువే బ్రతికాను. సరే, ఇక నీ ఇష్టమే కాని...." అన్నాడు సదాశివం. ప్రక్కనే ఉన్న సుబ్బలక్ష్మి తనలో తాను ప్రార్థనలు చేసుకుంటుంది. రాధ, గౌరి చూసి, తల అడ్డంగా తిప్పుకుంటూ, సుబ్బలక్ష్మి దేని గురించి ఆలోచిస్తుందో తెలుసుగనక ఒకరికొకరు వారికి అర్థమయ్యే చూపులతో చూసుకున్నారు.

అదేరోజు నంగనల్లూర్ ఆంజనేయస్వామి గుడికి దర్శనానికి వెళ్లారు. సుబ్బలక్ష్మి కాసేపు గుడిలో కూర్చొని కొన్ని పాటలు పాడుకుంది. గుడికి వస్తున్న భక్తులు చుట్టూ కూర్చొని వింటున్నారు.

క్షణం తీరిక లేకుండా గడిపిన రోజులు కొన్ని సంవత్సరాల క్రితమే ముగిశాయి. గత ఐదారు సంవత్సరాల నుంచి కొన్ని ముఖ్యమైన లబ్ధి కచేరీలు, ముఖ్యమనుకున్న పురస్కారాలను స్వీకరించేందుకు ప్రయాణాలుతప్ప అదే పనిగా కచేరీలు, పురస్కార స్వీకరణలు చేసే పనులు మానుకున్నారు.

1996లో రాధ మళ్లీ అనారోగ్యంపాలైన దగ్గర నుంచి అతి ముఖ్యమయినవి తప్ప దాదాపు అన్ని ప్రయాణాలు మానుకున్నారు.

ఇప్పుడిక ఇంట్లో తీరిగ్గా వుంటూ, పెళ్లిళ్లకి, పేరంటాలకి హాజరవుతూ, సుబ్బలక్ష్మిని చూడాలనుకొని వచ్చేవారితో మాట్లాడుతూ, ఇన్నేళ్లకు సుబ్బలక్ష్మి, సదాశివం ఇంటిపట్టునే ఉంటున్నారు. ఇద్దరి ఆరోగ్యాలు అంతంత మాత్రంగానే ఉన్నాయి.

సుబ్బలక్ష్మి కచేరీలు తగ్గించుకున్నా, పురస్కారాల కార్యక్రమాలు, ఇతర కార్యక్రమాలు తగ్గించుకున్నా పెళ్లిళ్లకు మాత్రం సుబ్బలక్ష్మి తప్పనిసరి. బాగా పరిచయస్తులు సుబ్బలక్ష్మి దంపతులను వారి ఇండ్లలో పెళ్లిళ్లకు ఆహ్వానిస్తారు. వారిలో కొంతమందికి సుబ్బలక్ష్మి వారి ఇంట పెళ్లికి రావటం అందరికీ గొప్పగా చెప్పుకునే విషయం. కొంతమందికి మాత్రం సుబ్బలక్ష్మి శుభలక్ష్మి. ఆమె ఆశీర్వాదం కంటే గొప్పదేమీ లేదనుకుంటారు. అలాంటి వారే ప్రఖ్యాత గాయకులు శ్రీపతి పండితారాధ్యుల బాలసుబ్రహ్మణ్యం. వీరు తమ కూతురి వివాహానికి సుబ్బలక్ష్మిని ఆహ్వానించారు. సుముహూర్తానికి వధూవరులని ఆశీర్వదించే ఘడియలకు, బాలసుబ్రహ్మణ్యం పెళ్లికి విచ్చేసిన ముఖ్యమంత్రులను, గవర్నర్లను, వ్యాపారవేత్తలను, ప్రముఖ నటులను అందరినీ ఆపి , ముందుగా సుబ్బలక్ష్మి దంపతుల చేత నవదంపతులకు ఆశీర్వాదం ఇప్పించారు. సుబ్బలక్ష్మి పరమసాత్వికురాలిగా, పతివ్రతగా, భక్తురాలిగా ప్రజలలో అంతటి విలువ సంపాదించుకుంది.

సెప్టెంబర్ 16, 1997 సుబ్బలక్ష్మి ఎనభైఒకటవ పుట్టినరోజు. అభిమానులు పెద్దఎత్తున వచ్చి అభినందనలు తెలిపి వెళుతున్నారు. హడావుడి కాస్త సద్దుమణిగిన తరువాత 'శ్రుతి' పత్రిక సంపాదకుడు, వ్యవస్థాపకుడు అయిన పట్టాభిరామన్, 'శ్రుతి'

పత్రిక, ఉపసంపాదకురాలు జానకి, సుబ్బులక్ష్మితో మాట్లాడటానికి సమావేశమయ్యారు.

"అమ్మా, ఈ రోజున మన సంగీతంలో, నృత్యకళల్లో దైవత్వం అనేది ఏదీ లేదు, ఇంకే విశిష్టత లేదు' భక్తి వ్యాపారమయ్యింది" ఆవేశంగా చెప్తున్నాడు పట్టాభిరామన్.

"మీకు ఇంతకు ముందే చెప్పినట్లు 'శ్రుతి ఫౌండేషన్' 'సముద్రి' ద్వారా మన కళలను ఈ జాడ్యాల నుంచి విముక్తి చేసేందుకు గట్టి ప్రయత్నం చేస్తాం. 'సముద్రి' అంటే SAMUDRI 'సుబ్బులక్ష్మి సదాశివం మ్యూజిక్ అండ్ డ్యాన్స్ రిసోర్స్ ఇన్స్టిట్యూషన్' మీరు పెద్ద మనసుతో మీ పేర్లు పెట్టటానికి అనుమతిస్తే, సంస్థ పేరు వినగానే దాని విలువ ఏమిటో తెలుస్తుంది."

నిజమే, ఇప్పుడు సుబ్బులక్ష్మి ఒక బ్రాండ్. యాభైఏళ్ల నుంచి సదాశివం జాగ్రత్తగా పెంచి, పోషించిన బ్రాండ్. ఆ కృషి, సుబ్బులక్ష్మి సమర్థత ఫలితం ఈ రోజు సుబ్బులక్ష్మి కర్ణాటక సంగీత మేరునగ ధీర, భక్తి సంగీతపు చిరునామా, భారతీయ స్త్రీత్వం మూర్తీభవించిన నారీమణి, నిరాడంబరత్వానికి మారుపేరు. అలాంటి గొప్ప విలువలకి ప్రతీక ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి. సుబ్బులక్ష్మి పేరుని ఇంకొకరు ఒక ప్రయోజనానికి వాడుతున్నారంటే అది అన్ని విధాలా ఆలోచించవలసిన విషయం. సుబ్బులక్ష్మి పేరుని ఇవ్వటమంటే సుబ్బులక్ష్మి విలువల్ని కూడా వారి చేతిలో పెట్టినట్లే. ఆ విలువలకి ఆ సంస్థ కట్టుబడి ఉండాలి. సుబ్బులక్ష్మి పేరుపెట్టుకొని, కానిపనులు చేసి, ఇప్పటిదాకా ఎంతో జాగ్రత్తగా తెచ్చుకున్న పేరుని కాలరాయకూడదు. సదాశివం ఇవన్నీ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"అమ్మా, మీరేమంటారు" వినయంగా అడిగాడు పట్టాభిరామన్. సుబ్బులక్ష్మి భర్తవైపు తిరిగింది.

"నేను, కుంజమ్మ మళ్లీ ఆలోచించి కబురుపెడ్తాము రామన్‌గారు" ఇంకా వ్యవధి కావాలన్నాడు సదాశివం.

"ఎన్ని రోజులయినా ఫర్వాలేదు. నేను మళ్లీ వచ్చి సముద్రి కార్యకలాపాల గురించి చెప్తాను" అని సెలవు తీసుకున్నారు పట్టాభిరామన్, జానకి.

నవంబర్ 1997.... పట్టాభిరామన్, జానకి సదాశివం కోసం మళ్లీ ప్రయత్నించారు.

"మామకి జ్వరంగా ఉంది. ఈ వారం కలవలేరు" ఆత్మ ఫోన్‌లో చెప్పాడు.

రెండు వారాల తర్వాత మళ్లీ చేశాడు పట్టాభిరామన్. "మామకి జ్వరం తగ్గలేదు" అని చెప్పాడు ఆత్మ.

సదాశివంని పలుకరిద్దాం, ఆరోగ్యం ఎలా ఉందో అనే ఉద్దేశ్యంతో పట్టాభిరామన్ ఇంటికి వచ్చాడు.



"మీ సముద్రిలో సుబ్బులక్ష్మి పేరు, నా పేరు ఉండనివ్వండి. మీరు చెప్పిన దాని గురించి ఆలోచిస్తూనే ఉన్నాను. మా ఆశీస్సులు ఎప్పుడూ మీతో ఉంటాయి" పట్టాభిరామన్‌ని చూడగానే చెప్పాడు సదాశివం.

"చాలా సంతోషం" కృతజ్ఞతా భావంతో అన్నాడు పట్టాభిరామన్. అప్పుడే సుబ్బులక్ష్మి కూడా వచ్చింది. సదాశివం తన నిర్ణయం పట్టాభిరామన్‌కి తెలిపినట్లు చెప్పాడు.

"ఇక మీ సముద్రం ఈదేశాను, ఇంక మణిమంటపం పని ఒక్కటే నాకు" అంటూ ఊపిరి పీల్చుకోవటానికి కష్టపడుతున్నాడు. "అత్మా! ఆసుపత్రికి వెళ్లాల్సిందే. మామ చాలా కష్టపడుతున్నారు" ఆత్మని తొందరపెట్టాడు రామన్.

సదాశివంకి కూడా బాగా కష్టంగానే ఉంది.

"కుంజమ్మా, ఇలా వెళ్లి అలా వస్తాను. నువ్వేమీ భయపడకు" అంటూ ఆసుపత్రికి బయలుదేరాడు. సుబ్బులక్ష్మి సదాశివంను సాగనంపి పూజగదిలోకి వెళ్లింది.

వైద్యులు పరీక్షలు చేసి సదాశివానికి న్యూమోనియా అని నిర్ధారించారు. సుబ్బులక్ష్మి ఆసుపత్రికి వచ్చింది. రెండు రోజుల్లో నయం చేసి పంపిస్తామని ధైర్యం చెప్పారు వైద్యులు. రెండోరోజు కూడా ఆసుపత్రిలో గడిచింది సదాశివానికి, సుబ్బులక్ష్మికి. రాత్రికి ఇంటికి వచ్చేసింది సుబ్బులక్ష్మి. ఆత్మ సదాశివంతోనే ఉంటున్నాడు. మూడవరోజు, తొమ్మిది గంటలకల్లా విజయ కాఫీ, టిఫిన్ తీసుకొని ఆసుపత్రికి వచ్చింది.

"నాన్నా! ఎలా ఉంది" అని అడిగింది.

"బాగుందమ్మా" అన్నాడు సదాశివం.

"ఆత్మా! ఈశ్వర నామాలు పెట్టు నాకు" చెప్పాడు సదాశివం. పడుకునే ఉన్న సదాశివం నుదుటిమీద ఈశ్వర నామాలు దిద్దాడు ఆత్మ.

ఆ తర్వాత మెల్లగా లేచి కాఫీ తాగటానికి ప్రయత్నించాడు. అతి కష్టం మీద నాలుగు గుక్కలు త్రాగగలిగాడు. ఇక వద్దని సైగచేసి మెల్లగా పడుకుండిపోయాడు. సదాశివం నేరుగా చూస్తున్నట్లుగా ఉందిగానీ, కళ్లు దారి మళ్లాయి. పరలోకంలోకి చూస్తున్నాయి. ఈ మార్పుని విజయ గమనించలేదు కానీ ఆత్మ పసిగట్టాడు. వెంటనే "ఇప్పుడే వస్తాను, కనిపెట్టుకుండు" అని సైగచేసి ఫోన్ దగ్గరకు పరిగెత్తుకొచ్చాడు.

సుబ్బులక్ష్మి ఇంట్లో ఫోన్ మ్రోగింది. "విశాలం అమ్మను తీసుకొని ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా రండి. మామకి ఏమీ బాగోలేదు" అని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

"సరే, సరే" అంది విశాలం ఆదుర్దాగా.

ఆత్మ మళ్లీ గదిలోకి వెళ్లాడు. ఈసారి వైద్యులని వెంటతీసుకెళ్లాడు. వారు పరీక్షలు చేస్తున్నారు. సదాశివం ఎదురు చూపుల్లో ఉన్నాడు.

విజయకు ఇంకొకసారి జాగ్రత్త చెప్పి మళ్లీ ఇంటికి ఫోన్ చేశాడు. సుబ్బలక్ష్మి బయలుదేరింది. ఆసుపత్రి గేటు దగ్గరకొచ్చి సుబ్బలక్ష్మి కోసం ఎదురు చూస్తున్నాడు. నిమిషం నిమిషం గడియారం చూసుకుంటున్నాడు, ఇప్పుడెక్కడిదాకా వచ్చివుంటారు, ఇంకెంత దూరం వుంది అని ఆందోళన పడుతున్నాడు.

ఎంతలేదన్నా కొట్టూరుపురం నుంచి ఇక్కడకు అరగంట పడుతుంది. తను ఫోన్ చేసి పదినిమిషాలయ్యింది. అప్పుడు ప్రొద్దున తొమ్మిది నలభై, ఇప్పుడు తొమ్మిది యాభై. ఆత్రుతగా పచార్లు కొడుతూ రోడ్డువైపే చూస్తున్నాడు ఆత్మ. ఆసుపత్రిలోని గడియారం మెల్లగా పది గంటల గంట మోగించింది. ఆత్మ ఆదుర్దా పదింతలయింది. పదిపది.... సుబ్బలక్ష్మి కారు వచ్చింది. పరిగెత్తుకుంటూ వచ్చి సుబ్బలక్ష్మి చేయి పట్టుకొని, "అమ్మా తొందరగా నడవాలి" అని అన్నాడు.

సుబ్బలక్ష్మి వణుకుతున్న గొంతుతో, "ఎలా ఉంది మామకు" అని అడిగింది.

"మీకోసమే చూస్తున్నారు. రండి, తొందరగా" అంటూ లాక్కెళ్లినంత పనిచేశాడు.

సుబ్బలక్ష్మి సదాశివం గదిలోకి వచ్చింది.సదాశివం ప్రక్కన కూర్చుంది.

"నాన్నా, అమ్మ వచ్చింది చూడు" అంది విజయ. పరలోకం పిలుస్తూ ఉన్నా తన కుంజమ్మ కోసం ఒక్కసారికి వెనకడుగు వేశాడు సదాశివం. తన ఎదురు చూపులు ఫలించాయి. సమయానికి తన కుంజమ్మ తన దగ్గరకు వచ్చేసింది. నవ్వుతూ తన కుంజమ్మవైపు చూశాడు, కుంజమ్మ మామ చేతిని తన చేతుల్లోకి తీసుకుంది. సదాశివం కుంజమ్మవైపు చూస్తూనే ఉన్నాడు. తన కుంజమ్మ, తన బలహీనత ఈ కుంజమ్మ, తన బలం ఈ కుంజమ్మ, తన పేరుప్రతిష్ఠ ఈ కుంజమ్మ. కుంజమ్మ మామనే చూస్తోంది. తన మామ, అతను లేకపోతే అనామకురాలిగా మిగిలిపోయివుండే మదురై కుంజమ్మ.

సుబ్బలక్ష్మి ఇంకా మామను చూసుకుంటూనే ఉంది. మామ కూడా రెప్పార్పకుండా తనవైపే చూస్తున్నాడు, తను వచ్చి నాలుగైదు నిమిషాలయింది. తను రాగానే సదాశివం తనవైపు మళ్లీ, నవ్వి తన చేతులు పట్టుకున్నాడు.

ఇప్పుడూ అలానే ఉన్నాడు. తనవైపు తిరిగి, చేతులు పట్టుకొని. కానీ ఈ నాలుగైదు నిమిషాల లోపు తన కుంజమ్మని తనివితీరా చూసుకొని, ఇద్దరమూ కలసి మరణించలేము కానీ, నువ్వు నాతో కలిసి ఉన్నప్పుడు నేను వెళ్తాను అన్నట్లు ఈ నాలుగైదు నిమిషాలలోపే సదాశివం, తన కుంజమ్మను వదిలి వెళ్లిపోయాడు. 'ఎప్పుడు' అన్నది ఎవ్వరికీ తెలియలేదు. అంత చల్లగా వెళ్లిపోయాడు. కుంజమ్మను వదిలి ఎక్కడికీ వెళ్లని సదాశివం ఒక్కడే పరలోకానికి వెళ్లిపోయాడు. గదిలో ఉన్నవారికి మెల్లగా తెలుస్తుంది. అందరూ సుబ్బలక్ష్మిని భయంభయంగా చూస్తున్నారు, గుసగుసలాడుకుంటున్నారు. సుబ్బలక్ష్మి ఒక్కొక్కరి మొహాలు మార్చి మార్చి చూసి, మామను చూసుకుంది. ఇప్పుడు మామ కళ్లు మూసుకొని



ఉన్నాయి. ఇంకా తన చేతులని పెనవేసుకొని ఉన్న మామ చేతిని వెర్రి చూపులు చూసింది. సుబ్బలక్ష్మికి గుండె లోతుల్లోంచి కన్నీరు ఉబికొస్తోంది.

శ్రీ సదాశివ అమితం మవూరు
నీ సరీ సమానమెవ్వరు... నీవేకదా... ప్రభుసద్గురు...
ఆత్మలోనన నెలకొనియున్నావు
ఆనందన ఘనమూనవ్వు
సాత్వికమూ ఘనమూర్తి నీవు
సకల లోకము జేజేలవ్వు....
నీ సరీ సమానమెవ్వరూ...
నీవే కదా...

*కృతికర్త: తెలియదు, రాగం – కళ్యాణి*

సదాశివం అంతిమ సంస్కారాలు, ఆ తరువాత జరగవలసిన కార్యక్రమాలు అన్నీ సవ్యంగా జరిగాయి. ఇవి జరిగి పక్షం రోజులపైన అయినా సుబ్బలక్ష్మి కన్నీటి ప్రవాహం ఆగలేదు. కుమిలికుమిలి ఏడుస్తుంది. మామకంటే తను ముందు వెళ్లిపోదామనుకుంది. అలా జరగనివ్వలేదు దేవుడు. కనీసం కాస్త వ్యవధైనా లేకుండా, మామ తనకి వీడ్కోలు చెప్పే వీలు కూడా లేకుండా తీసుకువెళ్లాడు ఆ భగవంతుడు. యాభైఏడేళ్ల ప్రతి విషయానికీ సదాశివం మీద ఆధారపడిన ఆమె మనస్సు అతని కోసమే వెతుకుతోంది. ఇంటిలోని ప్రతి వస్తువు సదాశివం ఉనికిని గుర్తుచేస్తుంది. అతని కుర్చీ, గోడకు నిండుగా ఉన్న ఫోటోలలో ఉన్న అతని రూపు, తనకి వచ్చిన పురస్కారాల జ్ఞాపికలలో అతని శ్రమ, అన్నీ సుబ్బలక్ష్మిని ఇంకా క్షోభించేలా చేస్తున్నాయి. కుటుంబ సభ్యులు సుబ్బలక్ష్మిని ఆపే ప్రయత్నాలు చేయలేదు. బాధంతా బయటకు వచ్చేదాకా ఏడవనిస్తున్నారు. కొంతమంది స్నేహితులు ఏడవద్దు, బాధపడొద్దు అని చెప్పారు. వీరు థియోసోఫికల్ సొసైటీ సభ్యులు. "కుంజక్కా, మామ చనిపోయారు ఇక ఆయనకు నీకు రుణం తీరిపోయిందని నువ్వు బాధపడొద్దు. మామ ఒక గొప్ప స్థితికి వెళ్లారు. మరణం ఆయనను ఆధ్యాత్మికంగా ఉన్నతమైన స్థాయికి తీసుకువెళ్తుంది. నువ్వు అందుకు సంతోషించాలి కానీ ఇలా ఏడవకూడదు."

సుబ్బలక్ష్మి ఆలోచనలో పడింది. "సుందరీ! నువ్వొక్కదానివే నన్ను ఏడవద్దని చెప్పావు."

"కుంజక్కా ఇవిగో మా థియోసఫి పుస్తకాలు. వీటిలో 'మరణం తర్వాత' అనే పుస్తకం ఉంది. చదువుకుంటూ ఉండు" అని ధైర్యం చెప్పి వెళ్లారు.



1976లో 'కల్కి' బంగ్లాలో ప్రముఖ ఛాయాగ్రాహకుడు డెర్రి మూర్ తీసిన చిత్రంలో సుబ్బులక్ష్మి , సదాశివం



త్వరలోనే సుబ్బులక్ష్మి కోలుకుంది. థియోసఫీ పుస్తకాలు తిరగేసినందుకు కాదు. సుబ్బులక్ష్మికి ఆ శక్తి వుంది తనలో. 'మామ ముందు, నేను తర్వాత' అంటూ సమాధానపడింది. అదే సుబ్బులక్ష్మి సదాశివంకంటే ముందే కాలంచేసి ఉంటే అప్పటిదాకా సింహంలాగా బ్రతికిన సదాశివం సుబ్బులక్ష్మి లేమిలో జీవితేచ్ఛ లేనివాడిలాగా కాలం వెళ్లదీసేవాడు.

సుబ్బులక్ష్మి, తన తల్లి మరణించినప్పుడు, అన్న మరణించినప్పుడు ఈ రోజులకంటే క్లిష్టమైన మానసిక పరిస్థితిని ఎదుర్కొని, నిగ్రహించుకొని, ఆ వ్యథ నుంచి తేరుకుంది. ఇప్పుడు కూడా తన మనోబలమే తనకి రక్ష.

1998 జనవరి కల్లా సుబ్బులక్ష్మి ఇంట్లో సుబ్బులక్ష్మి, ఆత్మ, విశాలం తప్ప అందరూ ఎటువాళ్లటు వెళ్లిపోయారు. రాధ, విజయ, ఆనంది, తంగం, వారి పిల్లలు ఎవరి సంసారాలకు వాళ్లు వెళ్లిపోయారు. కానీ రోజుకు ఒక్కసారైనా సుబ్బులక్ష్మిని చూసి వెళుతున్నారు. ఎవరు వచ్చినా, సదాశివం పేరు ఎత్తినా, మళ్లీ శోకతప్తురాలవుతుంది సుబ్బులక్ష్మి.

వీరే కాకుండా స్నేహితులు, అభిమానులు వచ్చి పరామర్శించి వెళ్తున్నారు.

1998 జనవరి పద్నాలుగున, గోపాలకృష్ణ గాంధీ సుబ్బులక్ష్మికి ఫోను చేశాడు. ఇతను రాజాజీ, గాంధీజీ మనమడు. కల్కి ఇంటి పిల్లవాడు. ఇప్పుడు భారత రాష్ట్రపతికి సెక్రటరి.

"అమ్మా! బాగున్నారా" ఫోన్‌లో అడిగాడు గోపాల్.

"గోపాల్..." అంటూ బాధపడసాగింది సుబ్బులక్ష్మి.

"అమ్మా, మీరు బాధపడకండి. మీకొక శుభవార్త. పైన ఉన్న మామ కూడా సంతోషపడతారు వింటే. ఇప్పుడు మీతో మన రాష్ట్రపతి నారాయణన్‌గారు మాట్లాడతారు" అంటూ ఫోన్ భారత రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్‌కి ఇచ్చాడు.

ఫోన్‌లో భారత రాష్ట్రపతి , "అమ్మా! మిమ్మల్ని భారతరత్న బిరుదుకు ఎంపిక చేశామని చెప్పటానికి నాకు చాలా సంతోషంగా ఉంది. నాకే కాదు, భారతదేశమే పులకించిపోతుంది మీకు ఈ సత్కారం అందచేస్తున్నందుకు" అంటూ మాట్లాడుతున్నారు భారత రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్.

సుబ్బులక్ష్మికి ఒక పురస్కారం ఇస్తున్నట్లు అర్థమయిందంతే. అది ఏ పురస్కారం, ఎంత గొప్ప పురస్కారం ఏమీ తెలియలేదు. మర్యాదపూర్వకంగా ధన్యవాదాలు తెలిపి, ఫోన్ పెట్టేసింది.

"అత్మా, భారతరత్న పురస్కారం అని ఏదో అంటున్నారు.... చూడు.." అంది ఫోన్ పెట్టిన తర్వాత.

వెంటనే ఆత్మ మళ్లీ గోపాలకృష్ణ గాంధీకి ఫోన్ చేసి, వివరాలన్నీ కనుక్కున్నాడు. ఆత్మ సంతోషానికి హద్దులు లేకుండాపోయాయి.

"అమ్మా! మీకు భారతరత్న పురస్కారం ఇవ్వబోతున్నారు. దేశంలోనే అది పెద్ద పురస్కారం, దీనికి మించిన పురస్కారం లేదు."

సుబ్బులక్ష్మికి మెల్లగా అర్థమయింది. మామతో కలిసి చివరిసారిగా తన పుట్టినరోజు జరుపుకుంటున్నప్పుడు ఒకరు ఒక ప్రముఖ పత్రిక తీసుకొచ్చి చూపారు. అందులో ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మికి గానీ లత మంగేష్కర్‌కి గానీ ఈసారి భారతరత్న పురస్కారమివ్వాలనే వ్యాసాన్ని మామకు చూపించారు. సదాశివం అక్కడికక్కడే ఆ వ్యాసం మొత్తం చదివి, "కుంజమ్మకే ఎక్కువ అర్హతలున్నాయి" అని ప్రకటించాడు.

"మామ ఆశీర్వాదం" అంది సుబ్బులక్ష్మి అప్పటి సంఘటనను గుర్తుచేసుకుంటూ.

"అత్తా! రాధకు చెప్పు ముందు" అంటూ తొందరపెట్టింది. అప్పుడందరూ మళ్లీ సుబ్బులక్ష్మి చుట్టూ చేరారు. ఈసారి అమితానందంతో, "అమ్మా, అసలు నీకు భారతరత్న అంటే ఎంత గొప్ప పురస్కారమో తెలుసా... ఈ దేశానికే నువ్వు రత్నానివి ఇప్పుడు" అంటున్నారు ఇంట్లోని ప్రతి ఒక్కరు. అందరి ఉత్సాహం ఇది ఒక గొప్ప పురస్కారం, మహాగొప్ప గౌరవం అని తెలుపుతున్నా సుబ్బులక్ష్మి మాత్రం తన మామ లేకుండా ఆ పురస్కారం ఎంత గొప్పదైనా సంతోషించలేకపోతుంది.

"మామ ఉంటే ఎంతో సంతోషించేవారు. ఆయన లేనప్పుడు వచ్చింది, నాకు మాత్రం ఎందుకు ఇప్పుడిది?" అంటూ బాధపడుతోంది.

యాభైమూడు రోజుల ముందు, కేవలం ఒక నెలన్నర ముందు ఈ వార్త ప్రకటించి వుంటే సదాశివం విని, పట్టరాని సంతోషంతో, తృప్తితో ఆనంద బాష్పాలు కార్చేవాడు. తన కుంజమ్మను, తను మలచిన కుంజమ్మను భారతరత్నంగా దేశం గుర్తించటం అంటే అది మామూలు గౌరవం కాదని అతనికి తెలుసు.

కాసేపట్లో టివి చానళ్లలో పదేపదే వస్తున్న ఈ వార్తను చూసి, తర్వాత రోజు పేపర్లలో ప్రముఖంగా ప్రచురించిన వార్తను చూసి, ఇంటికి వస్తున్న అభిమానులని చూసి, సుబ్బులక్ష్మికి మెల్లగా ఈ పురస్కారం యొక్క స్థాయి అర్థమవుతుంది. అయినా భారతరత్న పురస్కారం తన బాధను ఇంకా పెంచుతుంది. "మామ ఉన్నప్పుడు ఇచ్చి ఉంటే బాగుండేది" అనే అనుకుంటుంది.

విలేఖర్ల ముందుకు రావటానికి ఎంతమాత్రమూ ఇష్టపడలేదు. 'నన్ను భారతరత్న పురస్కారానికి ఎంచుకున్నందుకు భారత రాష్ట్రపతికి నా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. మా అమ్మ ఆశీస్సులు. పైన వున్న నా భర్త సంతోషిస్తారు.



వినయంగా ఈ పురస్కారాన్ని స్వీకరిస్తున్నాను' అనే రెండు వాక్యాలు టైపు చేయించి, సుబ్బులక్ష్మి సంతకంతో విలేఖర్లకి విడుదల చేశాడు ఆత్మ.

ప్రొటోకాల్ పాటిస్తూ మొదటిగా తమిళనాడు ముఖ్యమంత్రి కరుణానిధి సుబ్బులక్ష్మిని అభినందించటానికి ఇంటికి వచ్చాడు. "పొంగల్ పిండివంటలకంటే తీపైనది ఈ కబురు" అని అన్నాడు.

తమిళ సినీ హీరో, ఆ తర్వాత తమిళనాడు ముఖ్యమంత్రి అయిన యమ్.జి. రామచంద్రన్‌కు భారతరత్న ప్రకటించినప్పుడు తమిళనాడులోనే నిరసనలు వినిపించాయి. కాస్త చిన్నగానయినా కామరాజ్, రాజాజీ విషయంలో కూడా నిరసన ధ్వనులు వినిపించాయి. కానీ సుబ్బులక్ష్మి విషయంలో మాత్రం ఆసేతు హిమాచలం ఆనందంగా స్వాగతించింది.

వారివారి స్థాయిని బట్టి, వారివారి పరపతిని బట్టి, విలేఖరులు సుబ్బులక్ష్మిని కలుసుకోగలుగుతున్నారు. ఈ సమయంలో సుబ్బులక్ష్మి ఎవరినీ కలవాలనుకోవటంలేదు. భర్త వియోగం నుంచి ఇంకా తేరుకోలేదు. ఇలాంటి పరిస్థితులలో ఇండియాటుడే విలేఖరి వాసంతి కలవగలిగింది సుబ్బులక్ష్మిని. సుబ్బులక్ష్మిని ఒంటరిగా ఇంటర్వ్యూ చేయగలిగిన ఏకైక విలేఖరి. మళ్లీ ఒంటరిగానున్న సుబ్బులక్ష్మి ముందు కూర్చుంది. అంతకు ముందు సుబ్బులక్ష్మి ఒంటరిగా ఉన్నా వెయ్యి ఏనుగుల బలం వెనక ఉన్నట్లు కూర్చుంది తన ముందు. ఇప్పుడూ ఒంటరిగా బేలగా ఒంట్లో ఓపిక లేనట్లు ఉంది.

సుబ్బులక్ష్మిని చూస్తూ మౌనంగానే పరామర్శిస్తుంది వాసంతి. వాసంతి సుబ్బులక్ష్మిని చూస్తూ తనతో పోయినసారి జరిపిన సంభాషణలు గుర్తుతెచ్చుకుంది. అప్పటి ఇంటర్వ్యూలో ప్రచురించబడిన ప్రశ్నోత్తరాలే కాదు, వాటికి మించి చాలా అర్థమయ్యాయి వాసంతికి. ఆ సంభాషణలకు కొనసాగింపుగా సుబ్బులక్ష్మి, "మామ నన్ను రాచనాగులాగా కాపాడుకొచ్చారు" అని అంది. అందుకు సుబ్బులక్ష్మి సదాశివంకి ఎంత ఋణగ్రస్తురాలో అర్థమవుతుంది ఆ మాటలో. సుబ్బులక్ష్మికి తన అభిమానం మొదటి ప్రాథమ్యం.

ఇక వాసంతి వెళ్తూవెళ్తూ జాగ్రత్తలు చెప్తుంటే, "పాడాలి, నేను పాట మళ్లీ పాడాలి. ఈ రోజుదాకా ఇంకా పాడలేదు. పాట నాకు తపస్సులాంటిది, పాడాలి" అని చెప్పింది. ఈ మాటతో పాట తనకి ఊపిరిలాంటిదని చెప్పింది.

❦ ❦

'భారతరత్న' పురస్కారం స్వీకరించటానికి మార్చి ఒకటి ఢిల్లీ రావలసిందిగా ప్రభుత్వం ఆహ్వానించింది. బయటకు రావటానికి ఇంకా ఇష్టపడకపోయినా, మర్యాద పాటిస్తూ సుబ్బులక్ష్మి ఢిల్లీ వచ్చింది. మొదటిసారిగా నుదుటిమీద కుంకుమ బొట్టు లేకుండా

కనిపించింది. మొహంలో తేజస్సు అలానే ఉంది. రెండు రకాల విబూదులు నుదుటి మీద రాసుకుంది. వజ్రాల దుద్దులు తీసి, మామూలు పోగులు పెట్టుకుంది. రెండు ముక్కుపుడకలలో ఎడమవైపు పుడక తీసివేసింది.

విశిష్ట అతిథులతో నిండియున్న రాష్ట్రపతి దర్బార్ హాలులో, ఆత్మ సాయం పట్టగా మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ భారత రాష్ట్రపతి వైపు నడుస్తోంది. 81సంవత్సరాల నిండైన జీవితం యొక్క అడుగులు, తొలిఅడుగు సంగీతం వైపు, ఇప్పటిదాకా మలి అడుగు సంగీతం వైపే, మధ్యలో అడుగుల నడతంతా సంస్కారం, సౌశీల్యం, వినయం, విధేయత, సహనం, భక్తి, దాతృత్వంతో నిండినదే. ఆమె ఇప్పుడు వేస్తున్న ఒక్కొక్క అడుగు ఆమె అలవర్చుకున్న ఒక్కొక్క గొప్పదనాన్ని తెలుపుతుంది. ఆమె జీవితం అందరికీ మార్గదర్శకంగా నిలుస్తుంటే, భారత రత్న పురస్కారం తనకు బహూకరించక ముందే భారత రత్నంగా శోభిల్లుతూ రాష్ట్రపతి ముందు నుంచుంది మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి. నవ్వుతూ రాష్ట్రపతికి నమస్కరించింది. రాష్ట్రపతి అమితానందంతో, టి.వి.లలో చూస్తూ హర్షిస్తున్న యావత్ భారతదేశం తరుపున సుబ్బులక్ష్మి మెడలో భారతరత్న పతకాన్ని ధరింప జేశారు. ఆ పతకానికే కళ వచ్చింది. దేశ చరిత్రలో అతి కొద్దిసార్లే ఆ భారతరత్న పురస్కారం ఎవరిని అలంకరించి తాను భాసిల్లిందో అలాంటి అరుదైన ఘటన ఇది. ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి ప్రజల హృదయాలలో ఎప్పటి నుంచో రత్నం, వజ్రం, ఇప్పుడు అధికారికంగా భారతరత్న. మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి భారత ప్రభుత్వం నుంచి తన చివరి పురస్కారం అందుకుంది. భారత ప్రభుత్వం మళ్లీ ఇద్దామన్నా తన దగ్గర ఇక ఏ పురస్కారము మిగలలేదు.

ఢిల్లీ నుంచి ఇంటికి వచ్చింది ఈ భారతరత్నం. ఇంటికి రాగానే తను మొదట చేసిన పని తన భారతరత్న పురస్కారాన్ని తీసి, సదాశివం ఫోటోముందు పెట్టడం. సదాశివం తనతోపాటు దర్బార్ హాలులో ఉండి ఉంటే... భారతరత్న ఇచ్చీ ఇవ్వగానే తీసుకొచ్చి సదాశివం చేతిలోపెట్టి, కాళ్లకు నమస్కారం చేసుకునేది. ఇప్పుడు భారతరత్న పతకం, పత్రం సదాశివం ఫోటోముందు పెట్టి నమస్కరించుకుంది.

సుబ్బులక్ష్మి మెల్లగా, సదాశివం లేని జీవితానికి అలవాటు పడుతూవుంది. పూవుకు తావిలా, మాటకు అర్థంలా తనని అంటిపెట్టుకున్న మామ లేని ఒంటరితనం కష్టంగా ఉంది. అయినా యథావిధిగా ప్రొద్దున్నే ఐదుగంటలకు లేచి, స్నానపానాదులు ముగించుకుని, పూజ చేసుకొని ఆ తర్వాత సంగీత సాధన చేసుకుంటుంది.

సుబ్బులక్ష్మి ఒంటరితనంతో బాధపడుతుందని తెలుసు. అందుకే పిల్లలు, మనుమ సంతానం అందరూ రోజూ సుబ్బులక్ష్మికి కనిపిస్తున్నారు. నవరాత్రి ఉత్సవాలు వచ్చాయి. ప్రతి నవరాత్రికి ఆలయాల్లోకానీ, సభల్లోకాని సుబ్బులక్ష్మి తప్పకుండా కచేరీ చేస్తుంది.





రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ నుంచి
భారతరత్న పురస్కారాన్ని స్వీకరిస్తున్న సుబ్బులక్ష్మి



రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ నుంచి
భారతరత్న పురస్కారాన్ని స్వీకరిస్తున్న సుబ్బలక్ష్మి





రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ నుంచి
భారతరత్న పురస్కారాన్ని స్వీకరిస్తున్న సుబ్బలక్ష్మి



రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ నుంచి
భారతరత్న పురస్కారాన్ని స్వీకరిస్తున్న సుబ్బలక్ష్మి





దర్బార్ హాల్‌లో భారతరత్నం మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి

ఈసారి సుబ్బలక్ష్మి ముందే కచేరీలు చేసే ఏర్పాటు చేశారు ఆత్మ తదితరులు. యువకళాకారులు సుధ, పట్టమ్మ మనుమరాలు నిత్యశ్రీ, ప్రియా అక్కచెల్లెళ్లు, సౌమ్య, టి.ఎమ్.కృష్ణ, సంజయ్, ఇలా రోజుకొకరు చొప్పున సుబ్బలక్ష్మి ముందు కచేరీలు చేసి సుబ్బలక్ష్మిని ఆనందింప చేశారు.

సుబ్బలక్ష్మి సంగీతంలో వాళ్ల బలాన్ని, బలహీనతల్ని ఇట్టే పసిగట్టేస్తుంది. బాగా పాడినచోట బాహాటంగా మెచ్చుకుంటుంది. తప్పు పాడిన చోట, దగ్గరకు పిలుచుకొని "నీకొకటి చెప్పనా.... మార్చుకుంటావా" అంటూ మెల్లగా బుజ్జగిస్తూ, ఆ తప్పు గురించి చెప్తుంది.

"ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి ఇక కచేరీలు చేయబోదు." ఇది సుబ్బలక్ష్మి పత్రికలకు ఇచ్చిన ప్రకటన కాదు. తన పిల్లలు, బంధువులు, సెక్రటరీ ఆత్మ కలసి చర్చించి, తీసుకున్న నిర్ణయం కాదు. ఎనిమిదేళ్ల వయస్సు నుంచి ఎనభైఒక్కేళ్ల వయసుదాకా ఎక్కిన వేదికకి దిగిన వేదికకి తెరిపిలేకుండా వేదికలు ఎక్కీ ఎక్కీ, కచేరీలు చేసీ చేసీ, సుబ్బలక్ష్మి అలసిపోయింది. అలుపు తన శరీరానికే, పాటపాడే మనస్సుకు కాదు. చివరి పదేండ్లల్లో, తనకు కాళ్ల జాలు వున్నా కీళ్ల నొప్పులు ఉన్నా, దేనికీ చలించకుండా మూడు నాలుగు గంటల పైబడి కచేరీలు చేస్తూనే ఉంది. ఇప్పుడిక విశ్రాంతి.



మద్రాసు ప్రజలకి సుబ్బలక్ష్మి సంవత్సరానికి ఒక్కసారైనా కనిపించకపోతే వారికి చాలా వెలితి. అందుకని సుబ్బలక్ష్మిని శతాభిషేకం పేరున మళ్లీ ప్రజల మధ్యకు తీసుకువచ్చే ప్రయత్నం చేపట్టారు మద్రాసు ప్రజలు. శతాభిషేకం ఎనభైవ పుట్టినరోజున జరుపుతారు. ఇప్పుడు సుబ్బలక్ష్మికి ఎనభై మూడేళ్లు దాటుతున్నాయి. అయినా ఫర్వాలేదు చేయవచ్చని, పురోహితుని పుక్కిటి పురాణం వినిపించారు సుబ్బలక్ష్మికి. ఈ ప్రయత్నంలో ముఖ్యపాత్ర శంకర నేత్రాలయ సంస్థవారిది. సుబ్బలక్ష్మి భారతీయ విద్యాభవన్, రామకృష్ణా మిషన్ సంస్థల తర్వాత కాస్త ఆలస్యంగానైనా శంకర నేత్రాలయ వారికి తన పాటల ద్వారా చేతనైనంత ఉపకారం చేయాలని తపనపడింది. తనని ఈ నాలుగు గోడల మధ్య కాకుండా, బైట ప్రపంచంలోకి తీసుకువచ్చి తనకు కాస్త మార్పు కలుగజేయాలనే వారి తపన చూసి ఒప్పుకుంది. ఈ కార్యక్రమంలో సుబ్బలక్ష్మి పట్ల తమ ప్రేమని తెలుపుతూ 'మాణిక్య వీణ మహిమ' అనే హరికథను ప్రదర్శించనున్నారు.

మళ్లీ నవరాత్రులు వచ్చాయి. ఈసారి ఆత్మకి పెద్దగా శ్రమ లేకుండా యువ కళాకారులు పోటీపడ్డారు సుబ్బలక్ష్మి ముందు కచేరీ చేయడానికి. ఈ నవరాత్రులు సుస్వరాల సుబ్బలక్ష్మికి సంగీత విందు. మదురైలో మీనాక్షి అమ్మవారికి నవరాత్రులూ కచేరీలు వినిపించిన సుబ్బలక్ష్మికి ఇక అందరూ సంగీతం వినిపించి సేదతీర్చనున్నారు.



అభిమానంతో, ఆరాధనతో వచ్చేవారితో కాలక్షేపం చేస్తూ రోజులు గడచిపోతున్నాయి సుబ్బలక్ష్మికి. మెల్లగా ఎనభైమూడవ పుట్టినరోజు దగ్గరలోకి వచ్చింది.

సెప్టెంబర్ పదహారు 1999. సుబ్బలక్ష్మికి ఎనభైమూడేళ్లు నిండాయి. ఇంటికి ఎంతోమంది వచ్చి అభినందనలు తెలిపారు. ఆ సాయంత్రం శంకర నేత్రాలయవారు తలపెట్టిన శతాభిషేకం కార్యక్రమానికి విచ్చేసింది, మద్రాసు రసజ్ఞులు ఎంతో సంతోషించారు. వారికి సుబ్బలక్ష్మి పాడకపోయినా పర్వాలేదు, ఆ తేజోమూర్తి కనిపిస్తే చాలు. ప్రదర్శించనున్న 'మాణిక్య వీణ మహిమ' హరికథకు భాగవతారిణి రేవతి శంకరన్. ఈ హరికథకి మూలం కల్కి బంగ్లాకి సుబ్బలక్ష్మి అభిమాని ఒకరు పంపిన లేఖ. ముప్పైరెండు సంవత్సరాల క్రితం ఒక వీరాభిమాని సుబ్బలక్ష్మిని కారణ జన్మురాలిగా వక్కాణించి, భూమి మీద ఉన్న అపస్వరాలని పారద్రోలటానికి భువిలో అవతరించిన సాక్షాత్తు పార్వతీదేవిలాగా అభివర్ణించాడు. ఇదే ఇతివృత్తంతో పార్వతీదేవి సుబ్బలక్ష్మిలాగా వీణ షణ్ముగవడివుకు జన్మించటం, ఆ తర్వాత సంగీతంలో ఒకొక్క పాట పాడుతూ ఆ పాటమీద తన ముద్ర వదిలి తరువాత పాటకు వెళ్తూ తాను వచ్చిన దైవకార్యం సుబ్బలక్ష్మి నెరవేరుస్తూ ఉంటుంది ఈ హరికథలో.

తన సహవాద్య కళాకారులు వాయిస్తున్నా, మృదంగం కళాకారుడు తని ఆవర్తనం వాయిస్తున్నా, ఎలా రాగ తాళాలు అనుసరిస్తూ తల ఆడిస్తూ తన అంగీకారం, మెచ్చుకోలు తెలుపుతుందో అలాగే ఈ హరికథ భాగవతారిణి పాడుతున్న పాటలని కూడా తల ఆడిస్తూ ఆలకించింది. తన తల్లి గురించి, తోబుట్టువుల గురించి చెప్పినప్పుడు మొహం విప్పారింది, సదాశివం ప్రస్తావన వచ్చినప్పుడు మొహం రంగు మారింది. భాగవతురాలి ఛలోక్తులకు మనసారా నవ్వుకుంది. తనను పొగుడుతున్నప్పుడు వినయంగా నమస్కరించింది. పక్కవాళ్లతో మాటామంతీ జరిపింది. గంటన్నరసేపు హరికథా కాలక్షేపం చేసింది. అసలు సిసలైన సుబ్బలక్ష్మిలా, తను మాట్లాడాలంటే ఒకరి అనుమతి కోసం చూడకుండా, తను నవ్వాలంటే ఒక సైగ కోసం చూసే పనిలేకుండా సుబ్బలక్ష్మి రెక్కలు చాచుకున్న సుబ్బలక్ష్మి అయింది.

మనుధర్మశాస్త్రం ప్రకారం చిన్నతనంలో స్త్రీ తండ్రి రక్షణ క్రింద, యవ్వనంలో భర్త సంరక్షణలో, వైధవ్యంలో కొడుకు పోషణ క్రింద ఉండాలన్నట్లు, ఈ స్త్రీ రత్నం కొడుకులాంటి ఆత్మనాథన్ పోషణ క్రిందకు వచ్చింది.



సుబ్బలక్ష్మి ముందు ఒక యువకుడు పురందర దాసు కృతి పాడుతున్నాడు. సుబ్బలక్ష్మి తన్మయురాలయింది. ఆ పాట తర్వాత "ఇంకొక పాట పాడుతావా.." అని

అడిగింది. ఆ యువకుడు ఒక త్యాగరాజ కృతి మొదలుపెట్టాడు. ఈ పాటకు సుబ్బలక్ష్మి కరిగిపోయింది. ఆ యువకుడు ఆ పాట పాడిన తీరుకు ఆనందబాష్పాలు కార్చింది.

"ఎవరి దగ్గర నేర్చుకున్నావు?" అని ఆ యువకుడిని అతని గురువు గురించి వాకబు చేసింది.

ఆ యువకుడు వినయంగా, "అమ్మా, మీ పాటలు క్యాసెట్లలో విని నేర్చుకున్నాను" అని చెప్పాడు. ఆ యువకుడ్ని మెచ్చుకుంటూ, తన పాట విని నేర్చుకున్నందుకు ఆనందించింది.

"ఆత్మార్థ సంగీతమే అసలైన సంగీతం. పాడేవాళ్లు తమ పాటని ప్రేమించాలి, పాడుతూ ఆనందించాలి, అప్పుడే వినేవారు ఆనందిస్తారు" అంటూ తన సంగీత రహస్యం చెప్పింది. సుబ్బలక్ష్మి పాటను ప్రజలు ఎందుకు అంతగా ఇష్టపడతారో చెప్పకనే చెప్పింది.

శ్రీ లలితకళా అకాడమీ (మైసూర్) సెక్రటరి, కర్ణాటక సాంస్కృతిక శాఖ మంత్రి శ్రీమతి రాణీ, పాటలు పాడి వినిపించిన యువకుడు రామకృష్ణతో సుబ్బలక్ష్మి ఉత్సాహంగా మాట్లాడుతూవుంది.

"మీరు కార్యక్రమం తొందరగా పూర్తి చేయాలి, అమ్మ ఇక విశ్రాంతి తీసుకోవాలి" అంటూ తొందరపెట్టాడు ఆత్మ.

అంత తొందర ఎవరికీ లేదు, సుబ్బలక్ష్మికి లేదు, వచ్చినవారికి అంతకంటే లేదు. అయినా ఆత్మ ఊరుకోడు. తొందర పెడుతూనే ఉన్నాడు. శ్రీ లలితకళా అకాడమీవారు తమ 'లలిత కళారత్న' పురస్కారాన్ని శ్రీమతి రాణి చేతుల మీదుగా సుబ్బలక్ష్మికి ప్రదానం చేసి, తొందరగా బయటపడ్డారు.

ఇప్పుడు 'శివమ్-శుభమ్'లో చీమ చిటుక్కుమనాలన్నా ఆత్మ అనుమతి కావలసిందే. సుబ్బలక్ష్మి ఎప్పటిలానే అన్నిటికీ సర్దుకుపోతుంది కానీ పైకి ఏమీ అనదు. సుబ్బలక్ష్మి ఎంత తినాలని ఆత్మ అనుకుంటాడో అంతే సుబ్బలక్ష్మి ముందు ఉంటుంది. ఎవరినైతే లోపలికి రానిస్తాడో వారితోనే సుబ్బలక్ష్మికి కాలక్షేపం.

సుబ్బలక్ష్మి ఎనభైనాలుగేళ్లు పూర్తి చేసుకుంది. తన ఎనభైఐదవ ఏటన ఒక సమీప బంధువు చనిపోతే వచ్చింది. అక్కడకు వచ్చిన పని అయి ఇంటికి దారిలో ఉండగా, కారులో ఉన్నవాళ్లని సుబ్బలక్ష్మి అడిగింది, "మనం ఎక్కడికెళ్లి వస్తున్నాము?" కారులో ఉన్న ఆత్మ, విజయ నివ్వెరపోయారు. సుబ్బలక్ష్మిని అనుమానంగా, భయంగా చూస్తున్నారు.

"అమ్మా, ఏంటీ అలా అడుగుతున్నావు? మనం తంగం ఇంటికి వచ్చాం" అంటూ విజయ గుర్తులు చెప్తుంది. సుబ్బలక్ష్మి తీవ్రంగా ప్రయత్నించింది కానీ ఒక అరగంట ముందు జరిగిన విషయం ప్రస్తుతానికి పూర్తిగా మర్చిపోయింది. విజయ చాలా కంగారు పడింది.



సుబ్బలక్ష్మి తో ఆత్మనాథన్



తిరుప్పుగళ్, తిరుప్పావై తేవారం నుంచి, ఆదిశంకరుల స్తుతుల నుంచి, కర్ణాటక సంగీత త్రిమూర్తుల పరంపరల నుంచి, కర్ణాటక సంగీత రత్నత్రయం నుంచి, అన్నమయ్య కీర్తనలు, మీరాబాయి భజనలు, కబీర్, తుకారామ్, తులసీదాస్ భజనలు, రవీంద్రనాథ్ టాగోర్ సంగీతం, ఇలా నాలు సన్నిందుమంది వాగ్గేయకారుల పాటలు తెలుగేతర భాషలకు పైగా, మాటమాటకు అర్థం నేర్చుకొని, పాట కంఠస్థం చేసుకొని, పుస్తకం ఎక్కడా స్టేజిలో కూడా తెరిచిపెట్టకుండా కచేరీ చేస్తూ ఎప్పుడో ఒకసారి తప్పు పాట ఎప్పుడూ మరిచిపోని సుబ్బులక్ష్మికి మతిమరుపు వచ్చింది. అన్ని పాటలు గుర్తుపెట్టుకున్న వ్యక్తికి, ప్రైవేట్‌లో, ఎప్పుడు ఏమి మర్చిపోతుందో ఎవరికీ తెలియదు. మాట్లాడుతూ మాట్లాడుతూ అంతకు ముందే అనుకున్న విషయం మర్చిపోతుంది. ఈ ప్రభావంలో ఉన్నప్పుడు ఇక పాత విషయాలు కూడా మర్చిపోతుంది.

ఈ జబ్బు ప్రభావంలో ఉన్నప్పుడు ఒకసారి, కాంతిమతి గురించి ఒక ఉత్తరం వచ్చింది. కాంతిమతి శక్తివేల్ మొదటి భార్య. ఇప్పుడు పేదరికంలో మగ్గుతోందని సాయం చేయమని సుబ్బులక్ష్మిని వేడుకుంటూ వచ్చిన ఉత్తరం. సుబ్బులక్ష్మికి కాంతిమతి పేరు చెప్పారు. గుర్తులు చెప్పారు. సుబ్బులక్ష్మి గుర్తుపట్టలేకపోయింది. ఆ తర్వాత మళ్లీ చెప్పగా వెంటనే గుర్తుపట్టింది. అత్త వెయ్యిరూపాయలు పంపాడు కాంతిమతికి. కాంతిమతికి కోపం వచ్చింది. కేవలం వెయ్యి రూపాయలే పంపిందని. వెంటనే తమిళ పత్రికలకి, ముఖ్యంగా స్త్రీవాద పత్రికలకి, 'కాంతి క్రింద నీడ' అంటూ ఒక ఉత్తరం వేసింది. దాని సారాంశం లక్షల రూపాయల దానధర్మాలు చేసే సుబ్బులక్ష్మి తన సొంత వదిన దీనావస్థలో ఉంటే కేవలం వెయ్యిరూపాయలు ఇచ్చిందని. కానీ, సుబ్బులక్ష్మి ఇచ్చిన ఈ వెయ్యి రూపాయలు సుబ్బులక్ష్మి ఆదాయంతో పోల్చి చూస్తే అక్షరాలా లక్షరూపాయలు ఇచ్చినట్లే. తనకు నెలకు వచ్చే ఆదాయంలో సగం ఇచ్చినట్లు.

𝄞𝄞𝄞𝄞

సుబ్బులక్ష్మి కచేరీలు చేయకపోయినా సుబ్బులక్ష్మికి వచ్చే పురస్కార సత్కారాలు ఆగటంలేదు. ఈసారి బెంగుళూరులోని శ్రీరామ సేవ మండలి వారు పెద్ద పటాటోపంతో వచ్చారు. ఎస్.వి. నారాయణస్వామి రావు స్మృతి పురస్కారం అందచేయటానికి. కస్తూరి రంగన్, ఇస్రో ఛైర్మన్, టి.టి. వాసు మ్యూజిక్ అకాడమీ ప్రెసిడెంట్, కర్ణాటక రాష్ట్ర సమాచార శాఖా మంత్రి, ఇతర ప్రముఖులు సుబ్బులక్ష్మి ఇంటికి చేరుకున్నారు. అక్కడ సమావేశమయిన కొద్దిమంది అతిథులకు, విలేఖరులకు, సుబ్బులక్ష్మికి ఈ పురస్కారం ఎందుకు అందజేస్తున్నారో వివరించారు ఒకరి తర్వాత ఒకరు.

కస్తూరి రంగన్ మాట్లాడుతూ, "మా కుటుంబంలో నాలుగు తరాలు సుబ్బులక్ష్మి సంగీతంలో సేదతీరాయి. నాకు ఇక్కడకు వచ్చి ఎమ్మెస్ గారిని దర్శించుకోవటం ఒక



గుడికి వచ్చి దేవుడిని దర్శించుకున్నంత" అంటూ సుబ్బులక్ష్మి పాటలు మధురిమలలో ఓలలాడే ప్రతి ఒక్కరికుండే తలపు ఆయన వ్యక్తం చేశారు.

కర్ణాటక రాష్ట్ర మంత్రి మాట్లాడుతూ సుబ్బులక్ష్మి యొక్క విజయాలను మరొక్కసారి అందరికీ గుర్తుచేశారు.

అందరి భాషణలు అయిన తర్వాతనే అత్త సుబ్బులక్ష్మిని బయటకు తీసుకువచ్చారు. రామ సేవా మండలి ప్రతినిధి సుబ్బులక్ష్మికి ప్రదానం చేయబోయే ప్రశంసా పత్రాన్ని చదవటం మొదలుపెట్టాడు, "....మీరు అసమాన్యమయినవారు. మీరు మీ కచేరీల ద్వారా కోట్ల రూపాయలు సంపాదించి, ఆ డబ్బును పూర్తిగా మంచి కార్యక్రమాలకు దానం చేసిన త్యాగమూర్తి." అలా ప్రశంసా పత్రం చదివి, పురస్కార జ్ఞాపికతోపాటు యాభైవేల రూపాయల నగదు బహుమతి కూడా ప్రదానం చేశారు. ఆ తర్వాత సుబ్బులక్ష్మి మాట్లాడుతూ, "ఈ సత్కారాలన్నీ మామకే చెందుతాయి. ఆయన ఏమి చేయమంటే అదే చేశాను నేను. అందరూ సుఖశాంతులతో బ్రతకాలి. సంగీతం వింటూ ఉండాలి" అని చెప్పింది. వెంటనే అత్త లోపలికి తీసుకువెళ్లాడు. బయటకి వచ్చి, నగదు బహుమతిని కంచిలోని మహాలక్ష్మి మాతృభూతేశ్వర్ ట్రస్ట్‌కి ఇవ్వమన్నట్లు సుబ్బులక్ష్మి మాటగా తెలిపాడు.

𝄞𝄞𝄞𝄞

సుబ్బులక్ష్మికి ఇప్పుడు ఇంకొక ఇష్టమయిన వ్యాపకం తన పిల్లల ఇండ్లకి, మనుమ సంతానం ఇండ్లకు వెళ్లి వారితో గడపటం. విజయ ఇంటికి కారులో బయలుదేరింది. ఈసారి ఏదో పనిపడి తోడుగా అత్త రాలేదు. డ్రైవర్ ఒక్కడితోనే బయలుదేరింది. సుబ్బులక్ష్మి కారు చిన్న మారుతి జెన్. కొట్టూర్‌పురం మెయిన్‌రోడ్ మీదుగా సుబ్బులక్ష్మి కారు వెళు తోంది. వెనుక కూర్చొని ఉన్న సుబ్బులక్ష్మిని రోడ్డుమీద వెళ్తున్న ఎంతోమంది గుర్తుపట్టి, నవ్వుతూ పలకరిస్తున్నారు. కొంతమంది వారివారి వాహనాన్ని ఒక చేత్తో పట్టుకొని, ఒక చేత్తో సుబ్బులక్ష్మికి నమస్కరిస్తున్నారు. నిజమైన ప్రేమతో ప్రతి ఒక్కరికి ప్రతినమస్కారం చెప్పింది సుబ్బులక్ష్మి. తన శ్రోతలు, సంగీత జ్ఞానం ఉన్న రసజ్ఞులు, వారు ఎవరైనా సరే. సామాన్యులైనా, టాటా బిర్లాలయినా, రాజాధిరాజులైనా అందరిపట్లా కృతజ్ఞతాభావం తన పాట విన్నందుకు. సుబ్బులక్ష్మిని దారి పొడుగునా గుర్తుపట్టి నమస్కరిస్తున్నారు స్కూటరు మీదనున్న ఒక్క వ్యక్తి మాత్రం సుబ్బులక్ష్మిని విడువకుండా పక్కనే వస్తున్నాడు "మురుగన్, ఇతని కోసం కాసేపు పక్కన ఆగుదామా.... మన వెనకే వస్తున్నాడు, నా మాట్లాడాలేమో..." అని తన డ్రైవర్‌తో అంది సుబ్బులక్ష్మి.

"వామ్మో, నేనావను అమ్మా. ఆపానంటే అత్మ నా ఉద్యోగం తీసేస్తాడు. అతనే వెళ్లిపోతాడులేమ్మా" అన్నాడు మురుగన్. కానీ చాలా దూరందాకా ఆ స్కూటరతను సుబ్బులక్ష్మి కారు వెనక వస్తూనే ఉన్నాడు.

"అమ్మా....." పిలిచాడు కారు డ్రైవర్.

"ఏమిటి మురుగన్..."

"అమ్మా, నేను మీతో ఒక ఫోటో తీయించుకుంటానమ్మా....."

"తీయించుకో కానీ, అత్మ లేనప్పుడు తీయించుకో.. వుంటే అరుస్తాడు" అంది సుబ్బులక్ష్మి.

సరిపోయింది. దొందూ దొందే. సుబ్బులక్ష్మి విజయ ఇంటికి చేరుకుంది. ఆ స్కూటర్ మీద ఉన్న మనిషి సుబ్బులక్ష్మి కారుని అనుసరిస్తూ ఇక్కడి దాకా వచ్చేశాడు. సుబ్బులక్ష్మి ఆగింది అతని కోసం. వచ్చి సాష్టాంగ నమస్కారం చేసుకున్నాడు. సాక్షాత్తు దేవతామూర్తిని చూసినంత పులకించిపోయాడు.

𝄞𝄞𝄞𝄞

2002 సుబ్బులక్ష్మికి ప్రత్యేకమైన సంవత్సరం. సదాశివం ఉండి వుంటే నూరేళ్లు పూర్తి చేసుకునేవాడు. సదాశివం స్నేహితులు, బంధువులు సదాశివం వందేళ్ల ఉత్సవానికి శ్రీకారం చుట్టారు. సుబ్బులక్ష్మికి చాలా సంతోషం. ఇంకా సంతోషమైన వార్త ఏమిటంటే కల్కి పత్రిక అరవై సంవత్సరాలు పూర్తి చేసుకుంది. ఈ సందర్భాన 1980ల నుంచి మళ్లీ కల్కి పత్రిక నడిపే బాధ్యత తీసుకున్న, కల్కి కృష్ణమూర్తిగారి అబ్బాయి, విజయ భర్త ఐన రాజేంద్రన్ ఒక ప్రత్యేక సంచిక కూడా ప్రచురించనున్నాడు. మాజీ రాష్ట్రపతి వెంకట్రామన్ సదాశివం శతజయంతి ఉత్సవ బాధ్యతలు తన భుజాన వేసుకున్నారు. సెప్టెంబర్ నాలుగు, 2002 న మద్రాసులోని భారతీయ విద్యాభవన్ ఆడిటోరియంలో సదాశివం శతజయంతి ఉత్సవాల్లో సుబ్బులక్ష్మి పాల్గొంది. ఈ సందర్భాన హెచ్.ఎమ్.వి. కంపెనీవారు సుబ్బులక్ష్మిపాటల సి.డి.ని విడుదల చేశారు. 'శుభమ్–శివమ్' అనే పేరుతో 'సదాశివంకు సుబ్బులక్ష్మి యొక్క నివేదనము' అనే శీర్షికతో ఆరు తమిళ పాటలు ఉన్న సి.డి.ని విడుదల చేశారు. ఈ పాటలన్నీ అంతకు ముందు రికార్డు చేయబడినవే. ఆరు పాటల్లో నాలుగు పాటలు అత్మ రాసినవే. ఈ కార్యక్రమంలో హెచ్.ఎమ్.వి. కంపెనీ వారు సుబ్బులక్ష్మి సి.డి.లు ప్రత్యేక తగ్గింపుతో అమ్మకానికి పెట్టారు.

గ్రామఫోను కంపెనీ భారతదేశంలో 1900 సంవత్సరంలో అడుగుపెట్టి, 1901 మొదట్లో ఉత్తర భారతదేశంలో హిందుస్థానీ సంగీతం రికార్డు చేయటం మొదలుపెట్టి,





మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి

మెల్లగా దక్షిణ భారతదేశానికి వచ్చింది. 1916, సరిగ్గా సుబ్బలక్ష్మి పుట్టిన సంవత్సరం హెచ్.ఎమ్.వి. లేబుల్‌ను ప్రవేశపెట్టింది. 1926లో సుబ్బలక్ష్మి మొదటి రికార్డు పదేళ్ల వయస్సున్నప్పుడు 'మరకతవడివం' అనే పాట, ఇంకో పాట గ్రామఫోన్ కంపెనీవారి 'ట్విన్' లేబుల్ మీద రికార్డు చేసింది. అప్పటి నుంచి నిర్విరామంగా హెచ్.ఎమ్.వి. వారికి మాత్రమే తన పాటలు రికార్డు చేస్తూ వారికి ఆదాయం సమకూర్చింది. కానీ వారికి తన పాటల రికార్డింగ్ వల్ల మేలు జరుగుతుందా లేదా అనే అనుమానం ఉండేది సుబ్బలక్ష్మికి. ఒకసారి ఎప్పుడో హెచ్.ఎమ్.వి. సౌండ్ ఇంజనీర్ రఘుని అడిగింది, "నా రికార్డులవల్ల హెచ్.ఎమ్.వి. వారు నష్టపోవటంలేదు కదా..." అని. ఆమె అమాయకత్వానికి నవ్వుకుంటూ "లేదమ్మా, మీ రికార్డులవల్ల మేమెప్పుడూ నష్టపోలేదు" అని చెప్పాడు రఘు.

సదాశివం పుట్టినరోజు తర్వాత రెండు వారాలకి సుబ్బలక్ష్మి పుట్టినరోజు. తను బాదం హల్వా తినే ఒకే ఒక్క రోజు. ఆత్మ హయాంలో తీపి మరీ కరువైపోయింది. సదాశివం ఉన్నా కాఫీ గ్లాసులో నాలుగు గుక్కలు మిగిల్చి ఇచ్చేవాడు. తన బాదం హల్వా కోసం ఆత్రుతగా ఎదురు చూస్తుంది. శ్రీ కృష్ణా నేతి మిఠాయిల యజమాని మురళి సుబ్బలక్ష్మికి ఇష్టమైన నేతి ఆపం, బాదం హల్వా తీసుకొచ్చి సుబ్బలక్ష్మికి తినిపించి అభినందనలు తెలిపాడు.

సుబ్బలక్ష్మికి అభిమానులు వెల్లువగా వచ్చి అభినందనలు తెలియజేస్తున్నారు.

𝄞𝄞𝄞𝄞

సుబ్బలక్ష్మి ఎక్కువ ఇంట్లోనే గడుపుతుంది. పరిచయస్తులు వస్తూనే ఉంటారు. సామాన్యులకు మాత్రం సుబ్బలక్ష్మి దర్శనం కాస్త కష్టమే. అసమాన్యులని సుబ్బలక్ష్మే పిలిపించుకుంటుంది తన దగ్గరకు. దినపత్రికలలో కల్యాణం అనే వ్యక్తి గురించి తెలుసుకుంది. తనకంటే పైవాడిలా కనిపించాడు, సంపాదించిన ప్రతి పైసా పరులకోసమే పంచిపెట్టాడు. ఆత్మకు చెప్పి అతనిని పిలిచి మరీ అభినందించింది.

అప్పుడప్పుడు కాస్త మార్పుగా శ్రీ కృష్ణ నేతి మిఠాయి సంస్థ అధిపతి, ఆయన మిఠాయి కొట్టుకు తీసుకువెళ్తుంటాడు, సుబ్బలక్ష్మి తన కొట్టులో కాలుపెడితే శుభమని అతని నమ్మకం.

శివమ్-శుభమ్‌లో ఫోన్ మ్రోగింది.

ఆత్మ ఫోన్ తీశాడు. అవతల నుంచి ఒక ప్రముఖ వ్యక్తి సుబ్బలక్ష్మిని కలవాలనుకున్నట్లు చెప్పాడు.






సదాశివం శతజయంతి సందర్భంగా విడుదల చేసిన సి.డి



కల్యాణసుందరంతో సుబ్బలక్ష్మి



స్నేహితురాలు రేవతీజైన్‌తో సుబ్బలక్ష్మి

"క్షమించండి, ఎవరినీ రానివ్వటంలేదు, అమ్మకు ఇన్‌ఫెక్షన్స్ సోకుతాయని ఎవరినీ అనుమతించటంలేదు."

అవతల వ్యక్తి పట్టు వీడలేదు.

"లేదండీ, ఎంతటివారినయనా సరే, రానీయటంలేదు. మొన్న ముఖ్యమంత్రి జయలలిత వస్తానన్నారు. ఆమె వెనక ఒక పటాలం అంతా ఉంటుందని వద్దని చెప్పాను" అని చెప్పాడు ఆత్మ. ఇక లాభం లేదనుకొని తన ప్రయత్నం మానుకున్నాడు ఆ ప్రముఖుడు. ఆత్మ అతి జాగ్రత్తగా వ్యవహరిస్తూ సుబ్బలక్ష్మి చుట్టూ అభేద్యమైన కవచాన్ని పెట్టాడు. రాధ, విజయ, తంగం లాంటి వారు వచ్చినా వారు మళ్లీ స్నానం చేయనిది సుబ్బలక్ష్మి గదిలోకి అనుమతించడు.

సుబ్బలక్ష్మిని చూడాలని వచ్చే 'భక్తులకు' మాత్రం తీరని నిరాశే.

సుబ్బలక్ష్మిని తన పాటికి తనని వదిలేస్తే, చక్కగా అందరితో మాట్లాడుతూ, తనకి నచ్చినవి తింటూ, ఆంక్షలు లేని చివరి రోజులు గడిపేది. ఎవరినీ నొప్పించని స్వభావం కలిగిన సుబ్బలక్ష్మి అలానే రోజులు వెళ్లదీసింది.

ఎక్కువమంది వయసు మళ్లినవారి జీవితాల్లో జరిగేది, అస్సలు జరగకూడదు అని అనుకునే ఘటన సుబ్బలక్ష్మి జీవితంలో కూడా జరిగిపోయింది. సుబ్బలక్ష్మి స్నానాల గదిలో జారిపడింది. వెంటనే సెయింట్ ఇసాబెల్ ఆసుపత్రిలో చేరి చికిత్స పొందుతూ ఉంది. పదిహేను రోజులకి, ఆసుపత్రి నుంచి రేపు వస్తుంది అనగా ఈ రోజు అక్కడ నర్సులు, "అమ్మా, మీరు మాకొక పాట పాడాల్సిందే" అని పట్టుపట్టారు.

సుబ్బలక్ష్మి 'కంజదళాయతాక్షి కామాక్షీ" అనే ముత్తుస్వామి దీక్షితుని పాట పాడటం మొదలుపెట్టింది. ఆసుపత్రి గౌనులో, ఆసుపత్రి బెడ్డు మీద కాళ్లు చాపుకొని పాడుతుంది సుబ్బలక్ష్మి. చక్కగా పాడుకుంటూ పాట చిట్టచివరికి వచ్చేసరికి చిట్ట స్వరాలు గుర్తుకు రావటంలేదు. పక్కనే వున్న విజయ కూతురు సీతవైపు చూసింది. సీత నాలుక్కరుచుకుంది.

"రేపు ఈ పాట పూర్తిగా నేర్చుకుని రా. రేపు ఇద్దరం పాడుదాం" అని గట్టిగా చెప్పింది సీతకు.

ఆ తర్వాత రోజు సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చేసరికి, ఒక 'వాకర్', చక్రాల కుర్చీ తయారుగా ఉన్నాయి. ఈ వాకర్‌కంటే సుబ్బలక్ష్మికి ఇంకా గట్టి ఆధారం, పేరు పెట్టటానికి

వీలు లేని, ఎప్పుడూ వెంట వుండే ఆధారం విశాలం. విశాలం ఇప్పుడు సుబ్బులక్ష్మికి నీడ అయింది. ప్రతి కదలికలో సుబ్బులక్ష్మిని జాగ్రత్తగా చూసుకుంటుంది.

ꕥꕥꕥꕥ

మద్రాసు మ్యూజిక్ అకాడమీ 2002-2003 వార్షిక సంగీత సమారోహ ప్రారంభోత్సవ సభ టి.టి. కృష్ణమాచారి ఆడిటోరియంలో మొదలయింది. మద్రాసు మ్యూజిక్ అకాడమీ ప్రారంభమై డెబ్భైనాలుగు సంవత్సరాలయింది. ఈ డెబ్భైనాలుగు సంవత్సరాలలో మద్రాసు మ్యూజిక్ అకాడమీకి చేసిన సేవకు, సంగీతానికి చేసిన సేవకుగాను సుబ్బులక్ష్మికి జీవితకాల సాఫల్య పురస్కారాన్ని ప్రకటించింది. సుబ్బులక్ష్మి బాగా నడవలేకపోవటంవల్ల ఆ సభాకార్యక్రమానికి రాలేనని తెలియజేసింది. ఈసారి ఈ సంగీత సమారోహాన్ని ప్రారంభించటానికి భారత రాష్ట్రపతి శ్రీ అబ్దుల్ కలామ్ విచ్చేశారు. లాంఛనంగా మ్యూజిక్ అకాడమీ కార్యక్రమాలు ముగిసిన తర్వాత రాష్ట్రపతి అబ్దుల్ కలామ్, మ్యూజిక్ అకాడమీ సభ్యులతో సుబ్బులక్ష్మి ఇంటికి వచ్చి ఆ పురస్కారాన్ని సుబ్బులక్ష్మికి అందజేశారు. "నాకు ముగ్గురు అమ్మలంటే ఇష్టం. ఒకరు నాకు జన్మనిచ్చిన మా అమ్మ, ఇంకొకరు మదర్ థెరిస్సా, ఇంకొకరు ఈ సంగీత సరస్వతమ్మ" అంటూ సుబ్బులక్ష్మి పాదాలకు మ్రొక్కారు భారతదేశ రాష్ట్రపతి అబ్దుల్ కలామ్.

పెద్ద వయసువారికి తుంటి ఎముక విరిగితే వారి ఆరోగ్యం అక్కడ నుంచి మెల్లగా క్షీణించటం మొదలుపెడుతుందంటారు. సుబ్బులక్ష్మి విషయంలో కూడా ఇదే జరిగింది. తను అడుగుతీసి అడుగు వేయాలన్నా ఒకరి సాయం కావలసి వస్తుంది. ఎవరు వున్నా లేకున్నా విశాలం మాత్రం సుబ్బులక్ష్మికి కుడిచేయి. దగ్గరుండి ప్రేమగా చూసుకుంటోంది.

ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మి! ఎమ్.ఎస్!! ఎమ్మెస్!!! కర్ణాటక సంగీతానికి, భక్తిగీతాలకు, మారుపేరు. తన కోకిల కంఠంతో నాలుగు తరాలను తరింపచేసిన ధన్యజీవి. సుబ్బులక్ష్మి లబ్ధి కచేరీల గురించి రాసుకుంటూ పోతే నాలుగు ఠావులు అటూఇటూ నిండిపోతాయి. ఈ కచేరీల ద్వారా సుబ్బులక్ష్మి అందచేసిన డబ్బులు ఈ రోజు విలువ ప్రకారం అక్షరాలా రెండు కోట్లు. ఈ డబ్బులో సగం తను తీసుకునో లేకపోతే ఇంకా రెండు కోట్లు సంపాదించిపెట్టే కచేరీలు చేసుకోవటమో సుబ్బులక్ష్మికి పెద్ద పనేం కాదు, కానీ సుబ్బులక్ష్మి అలాంటి ఆలోచనలు చేయలేదు. లబ్ధి కచేరీలు కాకుండా మామూలు కచేరీల లెక్కేలేదు. ఆ కచేరీలకు వచ్చే సంగీతాభిమానులు 'ఈ రోజు సుబ్బులక్ష్మి ఏ రాగ ప్రస్తారం చేస్తుందో, ఏ తాళ పల్లవుల పని పడుతుందో చూద్దామని రారు, హాయిగా భావరసంలో





సుబ్బులక్ష్మితో విశాలం



మమేకమైపోవటానికి వస్తారు. సుబ్బలక్ష్మికి తన కచేరీ పదేపదే రాగ, తాళ, లయ విన్యాసాలు చూపే చోటు కాదు, తన విద్వత్తును కనబరచే వేదిక కాదు. తనకు ఇచ్చిన పాటలను భావయుక్తంగా పాడుకుంటూ వెళ్తుంది. ఒకే రాగంలో ఉన్న రెండు త్యాగరాజ కృతులు సుబ్బలక్ష్మి పాడితే ఆ రెండు పాటలు ఒకే రాగం అంటే నమ్మశక్యంగా ఉండదు. ఆ పాటల్లో భావమే సుస్పష్టంగా అర్థమయ్యి పాట వ్యాకరణాలు వెనక్కు వెళతాయి. పాట భావానికి పెద్దపీట వేసి, తన పలుకుని భావానికి అనుగుణంగా మార్చుకున్న తొలి గాయకురాలు సుబ్బలక్ష్మి. సుబ్బలక్ష్మి పాటలోని భావమంతా భక్తి భావమే. అది పాట కోసం తెచ్చిపెట్టుకున్న భావం కాదు. చిన్ననాడే అమ్మ నాన్నల నుంచి అబ్బిన గుణం. భక్తి భావం తోడైయున్న తర్వాత బంగారానికి తావి అద్దినట్లు సుబ్బలక్ష్మి కమ్మని గొంతు పాటకు తోడైంది. ఆ గొంతుని స్వప్రయోజనాలకి కాకుండా పరోపకారానికి ఉపయోగించినందుకు ప్రజలు సుబ్బలక్ష్మికి ఎన్నో విధాలుగా తమ కృతజ్ఞతను తెలుపుతూనే ఉన్నారు. భారత ప్రభుత్వం తన దగ్గర ఉన్న పురస్కారాలన్నింటినీ దులిపి ఇచ్చేసింది. కర్నాటక సంగీత సభలు తమ సంగీత కళానిధులను, సంగీత రత్నాలను, సంగీత కళాశిఖామణులను, సంగీత విద్వన్మణులను సుబ్బలక్ష్మికి ప్రదానం చేసుకున్నాయి, విశ్వవిద్యాలయాలు తమ డాక్టరేట్‌లను పోటీపడి సుబ్బలక్ష్మికి ఇచ్చాయి. సుబ్బలక్ష్మిని గుర్తించటంలో విదేశీయులూ తక్కువేమీ చేయలేదు. ఆసియా నోబెల్ ప్రైజ్‌గా పరిగణించబడే రామన్ మెగసెసె అవార్డుతో సంత్కరించారు. ఫిలిప్పీన్స్ ప్రభుత్వం ఈ పురస్కారం సుబ్బలక్ష్మికి తన సంగీత విద్వత్తుకు ఇవ్వలేదు, సంగీతాన్ని ఊతంగా తీసుకొని చేసిన ప్రజాసేవకి ఇచ్చారు. పారిస్‌లోని అంతర్జాతీయ సంగీత సమాఖ్య సుబ్బలక్ష్మిని తన సభ్యురాలిగా చేర్చుకుంది. అయినా సుబ్బలక్ష్మి అభిమానులకి తనివి తీరలేదు. సుబ్బలక్ష్మి ఉంటున్న కొట్టూరుపురంలో స్థిరనివాసం ఏర్పరచుకున్న కాలనీ వాసులందరూ క్షుణ్ణంగా చర్చించుకొని, భారతీయ జనతాపార్టీ మహిళా నాయకులతో చర్చించి అందరూ కలసి ఒకరోజున సుబ్బలక్ష్మి ఇంటికి వచ్చారు.

"అమ్మా, మీవల్ల కొట్టూరుపురంకి ఎంతో పేరొచ్చింది, ఈ కొట్టూరుపురం మెయిన్‌రోడ్‌కి మీ పేరు పెడదామనుకుంటున్నాము. గాంధీ రోడ్‌లాగా, రాజాజీ రోడ్‌లాగా, అన్నా రోడ్ లాగా."

"ఇంకా ముసిరి సుబ్రహ్మణ్యమ్ రోడ్‌లాగా, మహారాజపురం సంతానం రోడ్డులాగా" అంటూ సంగీతజ్ఞుల పేరుమీద ఇప్పటికే ఉన్న రోడ్ల పేర్లను కూడా ఉదహరించారు వచ్చిన వారిలో ఒకరు. సుబ్బలక్ష్మి సమాధానమివ్వటానికి ఎక్కువసేపు తీసుకోలేదు. "వద్దు, నా పేరు వద్దు, మీ ప్రేమ, ఆప్యాయతలు చాలు" అని వారించింది.



"లేదు, మీరు ఈ కాలనీలో ఉన్నారని ప్రపంచానికంతా తెలియాలి, దయచేసి మీ పేరుపెట్టే అనుమతి ఇవ్వండి" అని మళ్లీ వేడుకున్నారు సుబ్బలక్ష్మిని.

"వద్దు, నా పేరు వద్దు, నేను చనిపోయిన తర్వాత కూడా మీరు నా పేరు పెట్టొద్దు" అని గట్టిగా చెప్పింది.

ఇంకో మాట కూడా చెప్పింది, "ఈ కాలనీలో నాకంటే ఎక్కువ సంవత్సరాల నుండి పట్టమ్మ ఉంటుంది. ఆమె అంగీకరిస్తే ఆమె పేరు పెట్టండి. నేను సంతోషిస్తా" అని.

నిరాశగా వెనుతిరిగారు మహిళలు. సుబ్బలక్ష్మి ప్రజలను నిరాశపరచిన ఒకే ఒక సందర్భం ఇది.

ఇలా ప్రజలు అభిమానాన్ని ఏదో ఒక రూపేణ తెలియపరుస్తూ ఉంటుంటే, ఇప్పుడు ఇంకొక వర్గం యొక్క కేంద్ర బిందువయింది సుబ్బలక్ష్మి. తన సుదీర్ఘమైన జీవిత ప్రస్థానంలో అమోఘమైన కర్ణాటక సంగీత సేవ, ప్రజాసేవ, పేరుప్రతిష్ఠలు, కీర్తియశస్సులు, విదేశీ పర్యటనలు, జాతీయ అంతర్జాతీయ బిరుదులు, పురస్కారాలు, మహారాజులతో, ప్రముఖులతో, అత్యంత ధనవంతులతో పరిచయాలు, అరకొర మాత్రమే తెలిసివున్న వ్యక్తిగత విషయాలు ఇంకా ఇంకా తెలుసుకోవాలని కుతూహలం రేపటం, వెరసి సుబ్బలక్ష్మి పుస్తక ప్రచురణ కర్తలకు కథావస్తువైంది.

రెండు ప్రముఖ ప్రచురణ సంస్థలు సుబ్బలక్ష్మి గురించి పుస్తకాలు వ్రాయటానికి పూనుకున్నాయి. ఒక సంస్థ ప్రముఖ భరతనాట్యం నర్తకి లక్ష్మి విశ్వనాథన్‌కు పుస్తకం వ్రాసే బాధ్యత అప్పగిస్తే, ఇంకొక సంస్థ అంతర్జాతీయ స్థాయి విలేఖరి, సంపాదకులు, రచయిత అయిన టి.జె.ఎస్. జార్జ్‌ను సంప్రదించింది. లక్ష్మి చిన్నప్పటి నుంచి చాలా బాగా తెలుసు సుబ్బలక్ష్మికి. పుస్తకం పని మొదలు పెట్టిన దగ్గర నుంచి లక్ష్మి సుబ్బలక్ష్మి దగ్గరకు వస్తూనే ఉంది. ఇక టి.జె.ఎస్. జార్జ్ చాలా అనుభవజ్ఞుడు, విస్తృతమైన పరిచయాలు కలవాడు, సొంతంగా పరిశోధన మొదలుపెట్టాడు.

లక్ష్మి మామూలుగా ఈ రోజు కూడా సుబ్బలక్ష్మితో మాట్లాడటానికి ఇంటికి వచ్చింది.

"మామీ! పుస్తకం ద్వారా మీరు ఏమయినా చెప్పండి మీ అభిమానులకి."

"తప్పకుండా చెప్తాను, నేను చెప్పినట్లు వ్రాయి. తల్లులకు నా వినతి ఏమిటంటే, వారు తమ పిల్లలకు చిన్నతనం నుంచీ సంగీతం నేర్పించాలి, అలా చేస్తే తరువాతి తరంలో కూడా సంగీతం వృద్ధి చెందుతుంది. తద్వారా భక్తి పెరుగుతుంది. ఇందు మూలంగా ప్రజలు మంచి జీవితాలు గడుపుతారు."

సుబ్బులక్ష్మి చెప్పింది చెప్పినట్లు వ్రాసుకుంది లక్ష్మి.

ఇంకా పుస్తకం కోసం చాలా సమాచారం అడిగి తెలుసుకుంటుంది. ఆ రోజుకి చివరి ప్రశ్న ఇంకొకటి అడిగింది. "మామీ! మీకు ఎన్నో పురస్కారాలొచ్చాయి. ప్రపంచవ్యాప్తంగా మీ పాటకి, మీ గొంతుకి గొప్ప పేరుంది. వీటన్నింటిలో మీకు అన్నింటికంటే ఎక్కువ తృప్తినిచ్చిన పురస్కారమేది, సంఘటన ఏది?"

సుబ్బులక్ష్మి తన ఘనమైన సంగీత జీవితాన్ని తలచుకుంటూ తల ఆడిస్తూ, "భగవంతుడు ఒక్కో మనిషికి ఒక్కొక్క నైపుణ్యం ఇస్తాడు, నాకు గొంతు, పాట ఇచ్చాడు. భగవంతుడు ఇచ్చిన వాటిని ఉపయోగించుకోవటంలో పెద్ద గొప్పేమీ లేదు. నాకు తెలిసి నా గొప్పతనం ఏమిటంటే, నేను తెలిసి తెలిసి ఎవరికీ ఏ అపకారం చేయలేదు. ఎవరి గురించి చెడుగా మాట్లాడలేదు. ఇదే నేను సాధించిన గొప్ప పురస్కారం."

లక్ష్మి అంతే చూస్తుండిపోయింది. సదాశివం వెనకే ఉండి అతను చెప్పిందే పలికే సుబ్బులక్ష్మి ఇంత నిర్దిష్టమైన మాట మాట్లాడుతుంటే చూస్తూ ఉండిపోయింది. తన జీవిత చరమాంకంలో తను ఎంతో గొప్పగా భావించే 'సంగీత కళానిధి'ని తన త్యాగాలను గుర్తించి ఇచ్చిన 'రామన్ మెగసెసె' పురస్కారాన్ని కూడా పక్కకుపెట్టి, తన మనసుకే అతి పెద్ద గౌరవం ఇచ్చుకుంది.

"మామీ మళ్లీ వస్తాను. ఇక తొందరలోనే పుస్తకం ముద్రణకి వెళ్లిపోతుంది" అంటూ లక్ష్మి లేచింది.

"పైన మామ ఉన్నారు, ఒకసారి కనిపించి వెళ్లు" అంది సుబ్బులక్ష్మి. లక్ష్మి సుబ్బులక్ష్మి చేయి పట్టుకొని నిమురుతూ, "అలాగే మామీ. మామను చూసే వెళ్తాను" అంటూ పక్కనే కూర్చుండిపోయింది. సుబ్బులక్ష్మికి మళ్లీ మతిమరుపు తెరలు వచ్చింది.

తప్పవు, ఎంతటివారికైనా ఈ చివరి రోజుల అవస్థలు తప్పవు.

లక్ష్మి మళ్లీ లేచింది, వెళ్తుండగా, "లక్ష్మీ...మదురైకి వెళ్లు" అంది. ఈసారి మతిమరుపు ప్రభావం కాదు పూర్తిగా మైమరపు.

కాస్త మతిమరపు, ఎక్కువసేపు మైమరపు, అలసిన శరీరం, తేజరిల్లుతున్న మోము వెరసి ఎనభైఏడవ పుట్టినరోజు జరుపుకుంది సుబ్బులక్ష్మి.

𝄞𝄞𝄞𝄞

"అమ్మా! సెమ్మంగుడి మామ చనిపోయాడు. మీరు రాగలరా చూడ్డానికి" అడిగాడు ఆత్మ. సెమ్మంగుడి తన గురువు. కల్కి బంగ్లా ఆస్థాన గురువు. మీరా భజనలు నేర్పటానికి



ఒకరు వచ్చినా, రవీంద్ర సంగీతం నేర్పటానికి దిలీప్‌కుమార్ రాయ్ వచ్చినా, హిందుస్థానీ సంగీతానికి ఇంకొక గురువు వచ్చినా, సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ సుబ్బులక్ష్మికి తన ఆస్థాన గురువు. సుబ్బులక్ష్మి తన సంగీత విద్వత్తుతో గురువునే అబ్బురపరచిన సందర్భాలు ఉన్నాయి.

సదాశివం సుబ్బులక్ష్మి సంగీతంలో గాంభీర్యము, లోతు, గాఢత్వము చేర్చాల్సిందిగా సెమ్మంగుడిని కోరి, సుబ్బులక్ష్మికి గురువును చేశాడు. సంగీత పరంగా, కచేరీల పరంగా ఎలాంటి సమస్య వచ్చినా మొదట సంప్రదించింది సెమ్మంగుడినే. తన తల్లికి కూడా పరిచయమున్న సెమ్మంగుడి, తనను కంచి పరమాచార్యకు పరిచయం చేసిన సెమ్మంగుడి, తన తల్లి చనిపోయినప్పుడు తను మదురై వెళ్లగలిగేటట్లు మహోపకారం చేసినవారు, తన సంగీత విద్వత్తుకు మెరుగులు దిద్దిన గురువుకు తన చివరి నమస్కారాలు తెలియజేయటానికి బయలుదేరింది.

లక్ష్మి విశ్వనాథన్ సుబ్బులక్ష్మి మీద తను వ్రాసిన పుస్తకం అచ్చువేసిన మొదటి ప్రతిని సుబ్బులక్ష్మి దగ్గరకు తీసుకువచ్చింది. సుబ్బులక్ష్మి ఆనందంగా ఆ పుస్తకాన్ని తీసుకుంది. అమితాసక్తితో ఆ కాఫీ టేబుల్ పుస్తకాన్ని చూసింది.

"లక్ష్మీ! నా మీద ఇప్పటివరకూ ఎవరూ ఇలాంటి పుస్తకం చేయలేదు. చాలా సంతోషంగా ఉంది" అంటూ ఆనందపడిపోయింది సుబ్బులక్ష్మి.

"మురళీచేత మొత్తం చదివించుకొని వింటాను" అని చెప్పింది లక్ష్మితో.

త్వరలోనే టి.జె.ఎస్. జార్జి పుస్తకం కూడా అచ్చయింది. జార్జ్ తన పుస్తకంలో, ఇప్పటి దాకా కేవలం సుబ్బులక్ష్మికి, సదాశివంకి, సుబ్బులక్ష్మి చిన్నప్పటి నుంచి తన చుట్టూ మసలిన వారికి తప్ప ఇంకెవరికీ తెలియని అనేక విషయాలు బహిర్గత పరచి సంచలనం సృష్టించాడు. ఆత్మ చేతికి ఆ పుస్తకం చేరింది. సుబ్బులక్ష్మితో ఆవేశంగా అన్నాడు, "అమ్మా! ఇతను చూడు ఏం రాశాడో! మీకూ జి.ఎన్.బాలసుబ్రహ్మణ్యంకి ప్రేమ వ్యవహారం ఉన్నట్లు రాశాడు! ఇలా రాయొచ్చా! ఏం చేద్దాం?"

సుబ్బులక్ష్మి స్థిమితంగా వింది. "నిజమే గదా మరి! నిజమే వ్రాశాడు" అని అంది

అదిరిపోయాడు ఆత్మ. సుబ్బులక్ష్మి బాధపడితే, ఓదార్చుదామనుకున్నాడు, సుబ్బుల 'అది కానిపని అని' అభ్యంతరం చెప్తే, జార్జ్‌కి ఒక ఉత్తరం వ్రాసేద్దామనుకున్నాడు క సుబ్బులక్ష్మి 'నిజమే కదా... ఇక దాన్ని వదిలేయొచ్చు' అన్నట్లు చెప్పిన మాటకు శిలైపోయాడు.

"అత్తా..."

"ఏమమ్మా..."

"నా గురించి నేనే ఒక పుస్తకం రాయాలని ఉంది అత్మా.." అత్మ ఆశ్చర్యంగా చూశాడు సుబ్బలక్ష్మివైపు.

సుబ్బలక్ష్మి సంగీతమయమైన జీవితం ఒక ఎత్తైతే, వ్యక్తిగతమైన జీవితం ఇంకో ఎత్తు. సంగీతంలో సుబ్బలక్ష్మి విజయాలు లెక్కకు మించినవి అయితే, ఆమె వ్యక్తిత్వం రాజగోపురం అంత ఉన్నతమైనది. ఈ రెండు లక్షణాలు నిండుగా వున్న సుబ్బలక్ష్మి జీవితం మధుర మీనాక్షి గుడి గోపురంలా ప్రకాశించిన జీవితం. సుబ్బలక్ష్మే గనుక తన జీవిత చరిత్ర ప్రామాణికంగా తన మనసు విప్పి చెప్పేది. తన ఊరి గురించి, తన కుటుంబం గురించి, తన సంగీతం గురించి తనివితీరా చెప్పుకునేది. కానీ కాలాతీతమైపోయింది. ఆమెకు భగవంతుడు అంత గడువు, ఓపిక ఇవ్వలేదు.

మార్గళిలో మద్రాసు సంగీత సభల సమారోహాలని చూసుకొని ఆ తర్వాత తిరువయ్యారులో త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు చూసుకొని వెనక్కు తిరిగివస్తూ ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మిని దర్శించుకొని వెళ్లటం సంగీత ప్రియులకు ఆనవాయితీ. కానీ ఇప్పుడు ఆమె దర్శనం ఎంతో కష్టమవుతుంది. ఆరోగ్యం ఏమాత్రం బాగుండటంలేదు. ఎక్కువసేపు పడుకునే ఉంటుంది. తెలిసినవారు తెలియనివారు ఏదోక సిఫార్సుతో ఆమెను ఒక్కసారి చూసే అదృష్టం కోసం తపనపడుతున్నారు. అత్మను ప్రాధేయపడి ఒక బృందం రాగలిగింది. సుబ్బలక్ష్మి మంచం మీదే గోడకానుకుని కూర్చుని ఉంది. అత్మ ఈ బృంద సభ్యులని సుబ్బలక్ష్మి గదిలోకి తోడ్కొని వచ్చాడు. ముగ్గురూ సుబ్బలక్ష్మి పాదాలను తాకి నమస్కారం చేసుకున్నారు.

వారిని చక్కని నవ్వుతో ఆహ్వానించింది. ఎక్కడి నుంచి వచ్చారు ఎవరు మీరు అనే మాటలకు, "మేము తెలుగువారం" అని ఇంకా చెప్తుండగానే "తెలుగువారా, నాకు తెలుగువారంటే ఎంతో ఇష్టం" అంది సుబ్బలక్ష్మి. చిన్నప్పటి నుంచి తెలుగు పాటలు పాడి, పాడి సుబ్బలక్ష్మి తెలుగు భాషపట్ల, తెలుగువారిపట్ల అభిమానం పెంచుకుంది.

వచ్చినవారు ఇంకా చెప్పుకున్నారు వారి గురించి, "మా తాతగారు మునుగంటి వెంకట్రావు పంతులు, వారు ఓలేటి వేంకటేశ్వర్లుగారికి గురువు."

"ఓలేటి గారా, చాలా గొప్ప సంగీతజ్ఞులు, చాలా అరుదైన సంగీతజ్ఞులు" అంటూ వెంటనే సంగీత చూడామణి ఓలేటి వేంకటేశ్వర్లుగారిని గుర్తుతెచ్చుకొని ఆయన గురించి చెప్పుకొచ్చింది.



అలా మాట్లాడుతుండగా అత్మ సైగచేశాడు. వచ్చినవారికి అర్థమయింది. మళ్లీ పాదాలవద్ద నమస్కారం చేసుకొని, చక్కగా దర్శన భాగ్యం కలిగినందుకు తృప్తిగా బయటకు వచ్చేశారు. సుబ్బలక్ష్మి మెల్లగా మంచం మీదకి జారుకుంది.

అత్మ అనుమతించాలేగానీ సుబ్బలక్ష్మి ఇంటి ముందు తిరుపతి దేవుడు ముందు బారులు తీరినట్లు బారులు తీరేందుకు జనం తయారుగా ఉన్నారు. కానీ అలాంటి అదృష్టానికి కాలం మించిపోయింది. సుబ్బలక్ష్మి ఆరోగ్యం రోజురోజుకి ఆందోళన పరుస్తుంది. కంచి పరమాచార్యులవారిని తలుచుకుంటూ ఆ రోజు కోసం ఎదురు చూస్తూవుంది.

ఒక రోజు పక్కనే ఉండి పరిచర్యలు చేస్తున్న విశాలంతో, "విశాలం, ఇవిగో నా గాజులు తీసుకో" అంటూ చేతికి ఉన్న నాలుగు గాజులూ తీసి ఇచ్చింది.

"అమ్మా, ఎందుకు?" అంది విశాలం ఆందోళనగా. "నేను పోయిన తర్వాత నీకు ఎవరైనా ఏమయినా ఇస్తారో ఇవ్వరో అందుకే ఇప్పుడివి తీసుకో, నాకు తృప్తిగా ఉంటుంది" అంది సుబ్బలక్ష్మి.

విశాలం సుబ్బలక్ష్మి గాజులని సుబ్బలక్ష్మి చేతులకి మళ్లీ తొడుగుతూ, "నాకసలొద్దు అమ్మా, అయినా ఇప్పుడుగానీ నేను ఈ గాజులు తీసుకున్నానంటే, మీకు తెలియకుండా నేనే తీసేసుకొని,మీరు ఇచ్చారని చెప్తున్నానని అనుకుంటారందరూ..." అని చెప్తూ సుబ్బలక్ష్మికి నాలుగు బంగారు గాజులు చేతులకి తొడిగింది. విశాలం నెలకు ఇంత అని డబ్బు తీసుకొని ఎరుగదు. సుబ్బలక్ష్మి ఇంట్లో ఒక ముఖ్యమైన మనిషిగా ఉండిపోయింది. సుబ్బలక్ష్మి సదాశివంని పార్వతీ పరమేశ్వరుల్లాగా ఎంచి సేవ చేసుకుంటోంది.

𝄞𝄞𝄞𝄞

"పదినిమిషాలే ఎక్కువసేపు ఉండొద్దు. అమ్మను ఎక్కువగా మాట్లాడించొద్దు....." ఎప్పటిలానే నియమావళి చెప్తున్నాడు అత్మ ఫోన్‌లో. సుబ్బలక్ష్మిని కలవటానికి అత్మను అనుమతి కోరుతున్న ప్రముఖ మృదంగం విద్వాంసుడిని.

ఆ విద్వాంసుడు ఇంటికి వచ్చాడు. సుబ్బలక్ష్మి మెల్లగా విశాలం సహాయంతో ముందు గదిలోకి వచ్చి కూర్చుంది. ఆ కళాకారుడిని చక్కగా గుర్తుపట్టి మాట్లాడుతూ ఉంది. అకస్మాత్తుగా, "విశాలం నాకు కచేరీకి వేళవుతుంది, తొందరగా లక్ష్మీసరస్వతులను జాగ్రత్తగా కారులోపెట్టు, బయలుదేరదాం" అంటూ లేచి హడావుడిగా అటూ, ఇటూ తిరుగుతుంది.

"అత్తా! బయలుదేరు. మురుగన్! కారు తీయి. అందరూ ఎదురు చూస్తూ ఉంటారు. ఆలస్యమవుతుంది" అంటూ తర్వాత ఏంచేయాలో పాలుపోక వ్యాకులతతో అటూ ఇటూ తిరుగుతూనే ఉంది. లక్ష్మి, సరస్వతి తంబూరలు చెరొక మూలనుండి చూస్తున్నాయి. అందరూ నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయారు. సుబ్బులక్ష్మి హడావుడి చేసి చేసి తన కుర్చీలో కూర్చుండిపోయింది. మద్రాసులో సంగీత సభల కచేరీల ఉత్సవ కాలం నడుస్తుంది. గత అరవై ఏండ్ల నుంచి మద్రాసులోని సభలు డిసెంబర్ నెల మధ్యలో నుంచి జనవరి మొదటి వారందాకా విరివిగా రోజుకు రెండు మూడు కచేరీల చొప్పున ఈ ఇరవై రోజులు జరుగుతాయి. మద్రాసులో ఈ సంగీత సభల కచేరీల కార్యక్రమాలు మొదలైన దగ్గర నుంచీ సుబ్బులక్ష్మి పాల్గొంటూనే ఉంది. అసలు వాళ్ల అమ్మ, తను మద్రాసు వచ్చిందే ఈ సభల కోసం. తన జీవితమంతా ఈ కచేరీల కాలపట్టిక ప్రకారం సాగిపోయింది. ఇప్పుడు సుబ్బులక్ష్మికి ఆరోగ్యం సరిగా లేకున్నా, మనస్సు తెలివిగా కొంతసేపు, భ్రాంతిగా కొంతసేపు ఊగిసలాడుతున్నా తన హృదయంలోని ఘంటిక ఈ కచేరీల కాలంలో కచేరీలను కలవరింపజేస్తోంది.

సుబ్బులక్ష్మికి ఆరోగ్యం మరింతగా సన్నగిల్లుతోంది. ఇది తెలిసినవారంతా దర్శనం చేసుకొని వెళ్తున్నారు. ట్రావన్‌కోర్ రాజకుటుంబీకులు వచ్చి దర్శించి, తరించి వెళ్లారు.

2004 జూన్‌లో ఢిల్లీ ప్రభుత్వం సుబ్బులక్ష్మికి జీవితకాల సాఫల్య పురస్కారం ప్రకటించి, పదకొండు లక్షలు బహుమతిగా అందజేస్తే, ఆ డబ్బుని కంచి పరమాచార్య మణిమంటపానికి ధారాదత్తం చేసింది. తన ఇంటిని కూడా ఆత్మకు ఇచ్చేసింది. ఇక ఏ కోరికా లేదు, ఏ బాధ్యతా లేదు, ఏ చింతా లేదు. శరీరం రోజురోజుకీ కుంచించుకుపోతుండగా, మనసు లోలోనకు అంతర్ముఖం అవుతోంది.

"విశాలం! ప్రక్క ఇంట్లో ఎవరైనా పాట పాడుతున్నారా? నాకు పాట వినిపిస్తోంది."

"లేదమ్మా, నాకు ఏమీ వినిపించటంలేదే...."

"లేదు విశాలం, నాకు వినిపిస్తోంది. తంబూర కూడా బాగా శ్రుతి చేసి ఉంది. ఎవరో బాగా పాడుతున్నారు."

" అలాగా, మీకు వినిపిస్తుందా? సరే నేను వెళ్లి చూసొస్తాను. మీరు పడుకోండి" అని విశాలం సుబ్బులక్ష్మిని నిద్రపుచ్చుతుంది.

సంగీతం! సంగీతం!! సుబ్బులక్ష్మి లోకం సంగీతం!!! మాటలతోపాటే పాట నేర్చుకుంది, మాటలకంటే ఎక్కువ పాట తన నాలుకమీద నాట్యమాడింది. ఈ అచేతన స్థితిలో కూడా మనస్సు పాటే వింటుంది.



2004 ద్వితీయార్థం నుంచీ సుబ్బులక్ష్మి పూర్తిగా మంచానికే పరిమిత మైపోయింది. సుబ్బులక్ష్మి తరచుగా స్పృహ కోల్పోతూవుంది. స్పృహలో ఉన్నా తన గురించిగానీ, తన చుట్టూ ఉన్న వాతావరణం గురించి గానీ తెలివి ఉండటంలేదు. దీనికి తోడు శ్వాస పీల్చుకోవటానికి ఇబ్బంది పడుతుంది. ఆరు నెలలనుంచీ ఆరోగ్యం రోజురోజుకి క్షీణిస్తున్నట్లే ఉంది కానీ నిలకడ లేదు. చివరకు ఇక ఆసుపత్రిలో చేర్చి అక్కడ వైద్యుల పర్యవేక్షణ అత్యవసరమనిపించింది. వెంటనే, నవంబరు ముప్ఫైన సెయింట్ ఇసాబెల్ ఆసుపత్రిలో చేర్చారు. వైద్యులు పరీక్ష చేసి వెంటనే చికిత్స మొదలుపెట్టారు.

తర్వాత రోజు డిసెంబర్ ఒకటో తారీఖున దినపత్రికలు సుబ్బులక్ష్మి ఆరోగ్య సమస్యలతో ఆసుపత్రిలో చేరిందని ప్రచురించాయి. ఆ వార్త చదివిన ప్రతి ఒక్కరూ: 'అబ్బా.. ఏమీ కాదు కదా' అని మనసారా అనుకున్నారు. చికిత్సకు వెంటనే స్పందించింది సుబ్బులక్ష్మి. తర్వాత రోజు కోలుకొని తన పాత నర్సులని గుర్తుపట్టి వారి బాగోగులని అడిగి తెలుసుకుంది. కోలుకుంటోందని కూడా పత్రికలు ప్రచురించాయి. 'హమ్మయ్య' అనుకున్నారు ప్రజలు. ఆ నర్సుల అదృష్టం కొద్దీ ఓపిగ్గా ఉంది ఆ రోజు.

ఆ తరువాతి రోజు నుంచి మళ్లీ మొదటికి వచ్చింది. గాజుబొమ్మ అయ్యి మంచము మీద పడుకుంది. సన్నగా కండలేని ఆ శరీరంతో పడుకొని, పడుకొని, ఎముకలు నొప్పిపెడుతున్నాయి. ఆ బాధ ఇంకా ఇతర బాధలు సుబ్బులక్ష్మి మూలుగులో తెలుస్తున్నాయి. సుబ్బులక్ష్మి బాధలు చూడలేక సుబ్బులక్ష్మి బంధువులకు గంటలు యుగాలుగా గడుస్తున్నాయి. విజయ కూతురు సీత, "రెండు సంవత్సరాలనుంచి బాధలు పడుతూనే వుంది, ఆరు నెలలనుంచి మరీనూ..ఇక నిష్కృతినివ్వు తండ్రీ" అని భగవంతుడుని వేడుకుంది. సుబ్బులక్ష్మి మాత్రం బాధలు భరిస్తూ.. ఈ లోకంతో సంబంధం లేకుండా ఆసుపత్రి మంచం మీద ఎదురు చూస్తోంది.

**పరితాపము కని ఆడిన**
**పలుకుల మరిచితివో నా (పరి)**
**సరిలేని సీతతో**
**సరయు మధ్యంబున నా (పరి)**
**వరమగు బంగారు వాడను**
**మెరయుచు పది పూటలపై**
**కరుణించెదననుచు**
**శ్రీగనుల త్యాగరాజుని**

త్యాగరాజు కృతి, రాగం– మనోహరి, తాళం–రూపకం

[illegible]

సుబ్బులక్ష్మి కూడా స్వప్నలోకంలో ఇలా లోపలికి వెళుతుంది. ఈ ప్రపంచము నుంచి దూరంగా తన మనసులోనికి, తన హృదయంలోనికి వెళుతుంది. అక్కడ ఏముంది? ఏది చూసినా అదే ఆనందముతో ఇలాటికి పలుకుతుంది.

"అమ్మా, నాన్నా, అన్నా"

అనుభూతి మంచం మీద ఈ లోకంతో పూర్తిగా వేరుపడి, సుబ్బులక్ష్మి అనేది ఒక హృదయమున్నా, ఆ హృదయంలో ఉన్నదేదో చెప్తుంది.

"అమ్మా, నాన్నా, అన్నా"

సుబ్బులక్ష్మి హృదయంలో ఉన్నది తన అమ్మ, నాన్న, అన్న...

సుబ్బులక్ష్మి చుట్టూ ఉన్న బంధువులు ఆశ్చర్యపోతున్నారు. ఆ హృదయంలో తన మామ లేడు, మామ పిల్లలూ లేరు.

సుబ్బులక్ష్మి అమ్మను, నాన్నను, అన్నను కలవరిస్తూ తన మనస్సై వెళ్ళింది.

షణ్ముగవడివు కొంచెం శక్తినేదో తీసుకొని మీనాక్షి అమ్మవారి గుడికి వచ్చింది. అమ్మవారి ముందు నమస్కరించింది. గుడిగంట గంగున మ్రోగింది. కడుపులోని బిడ్డ కదిలింది. కడుపుమీద చేయి వేసుకొని బిడ్డని తడుముకుంది. వసంతరాయ మండపంలో నడుస్తూ ఉండగా, అటుకు దేవదాసీలు ఎదురువచ్చారు.

"షణ్ముగం! ఈసారన్నా అమ్మాయిని కను, నాట్యరాలిని కను" అంటూ చెప్పి దాటివెళ్ళిపోయారు.

షణ్ముగవడివు నాలుగు నెలల గర్భవతి. ప్రస్తుతానికి తన పనులన్నీ యథావిధిగా చేసుకుంటూనే ఉంది. గుడి నుంచి వచ్చిన తర్వాత వీణ సాధన మొదలుపెట్టింది. లోపలి బిడ్డ శ్రద్ధగా వింటోంది. ఆ తర్వాత సంగీత పాఠాలు నేర్చుకునేందుకు పిల్లలు వచ్చారు. వారికి నేర్పుతున్నప్పుడు కూడా లోపలి బిడ్డ వింటోంది. ఆ తర్వాత ఇంటి పనులు మొదలయ్యాయి. మధ్యాహ్నం వేళ స్నేహితురాళ్ళు ఇంటికి వచ్చారు.

"షణ్ముగం, ఎలా ఉంటుంది నీకు?" అడిగింది రంగ.



"షణ్ముగం, ఈసారి అమ్మాయి పుడితే మాకిచ్చేయి. అభినయం నేర్పి అమ్మవారి సేవలో ఉంచుతాం మాతోపాటు" అంది మరకతం.

"మీకు ఎందుకు నాకిస్తే నేను పాటలు నేర్పుతా, నాకివ్వు షణ్ముగం" అంది మీనాక్షి.

"అమ్మాయే పుట్టాలిగానీ పాటలు ఆటలు షణ్ముగం నేర్పుకోలేదా? అయినా అమ్మాయేంటి వదిలించుకోవటానికి, వద్దనుకోవటానికి?" దేవదాసీల లోకం పోకడ చెప్పింది అమ్మాళు.

అందరి మాటలకు చిరునవ్వే షణ్ముగవడివు సమాధానం.

నెలలు నిండుతున్నా షణ్ముగవడివు తన సంగీత సాధన మానలేదు. తన ఒక్కదాని కోసమే కాదు, లోపలి బిడ్డ కోసం కూడా, షణ్ముగవడివు జపతపాలు, పురాణాలు చదువుకుంది. గర్భస్థ శిశువు బయట శబ్దాలు ఆలకిస్తారని తెలుసు.

తొమ్మిదో నెలన ఆఖరిసారిగా గుడికి వచ్చింది. గర్భంలోని బిడ్డ తండ్రి తన కోసమే అన్నట్లు చూస్తున్నాడు. క్రీగంటన చూసుకుంటూ వెళ్ళిపోయాడు. సాయంత్రం ఒక మనిషితో డబ్బు పంపాడు.

భాద్రపదంలో ఒక ఉదయం 8.48 నిమిషాలకు ఆడపిల్లను ప్రసవించింది షణ్ముగవడివు.

బయట ఉన్న ఆచారి, సమయం సరిగ్గా రాసుకున్నాడు. వెంటనే పంచాంగాలు తిరగేశాడు.

"1916, భాద్రపదం, 16 ఉదయం 8.48 నిమిషాలు, భరణీ నక్షత్రం. తులాలగ్నం. క్షేమంగా ఉంది. సుందరం! ఇంకేం, నీ మేనకోడలు భరణిలో పుట్టింది. భరణిలో పుట్టినవారు ధరణిని ఏలుతారు. మరే ఢోకా లేదు. ఇక నేను వెళ్లొస్తాను" అంటూ వెళ్లిపోయాడు.

షణ్ముగవడివు పక్కన పాపను చూసుకొని మురిసిపోయింది.

తన తాహతు తగ్గట్టుగా ఉయ్యాల వేడుక చేసుకుంది. పాప మూడోనెలలో 'ఊ' కొడుతుంది. షణ్ముగవడివు పాటపాడి ఆపితే 'ఇంకా పాడు' అన్నట్లు 'ఊ' కొడుతుంది. ఆరవనెలలో నామకరణ వేడుక చేస్తోంది. తమిళుల ఇలవేల్పు సుబ్రమణ్యస్వామివారి మీద భక్తితో, పాపకు 'సుబ్బులక్ష్మి' అని నామకరణం చేశారు. మొదట షణ్ముగవడివు మేనమామ, ఆ తర్వాత పాప మేనమామ, పాప చెవిలో పేరు చెప్పారు. బంధువులు, స్నేహితులు పాప చెవిలో పేరు చెప్పారు.

ఆ తర్వాత ఉయ్యాల పాటలు మొదలుపెట్టారు. "మీరు నన్ను ఎప్పుడూ పాడనివ్వరు, నేను ఇప్పుడు పాడాల్సిందే" అంది రాజం.

"వద్దే, పాప దడుచుకుంటుంది" అంది రంగ.

"అయితే నేను తంబూర వేస్తా" అంటూ వెళ్లి వీణ తీసుకుంది రాజం.

"నీ తెలివి తెల్లార అది వీణే" అరిచింది మీనాక్షి.

కూతురికి ఎప్పుడెప్పుడు సంగీతం నేర్పుతానా అని తహతహలాడింది తల్లి. బిడ్డకు లాలింపు కూడా సంగీతమే. బిడ్డ అడుగులు కూడా అలానే ఉన్నాయి. క్రింద వదిలితే చాలు, దోగాడుతూ వెళ్లి వీణని మీటుతుంది. నడక వచ్చినప్పుడు కూడా ఆ నడక సంగీతంవైపే, మాట పాటే, పాపకు నాలుగో ఏటి నుంచి తన కచేరీలలో పక్కన కూర్చోబెట్టుకోవటం మొదలుపెట్టింది షణ్ముగవడివు. తను నేర్పుతున్న సంగీత ఓనమాలు చక్కగా వల్లివేస్తోంది. సంగీత జ్ఞానంతో తన కూతురిని మీనాక్షీ అమ్మవారు కనికరించారని త్వరలోనే తెలుసుకుంది షణ్ముగవడివు. పాపకు ఆరవ ఏట సంగీత గురువుని చూసింది.

కలిమి లేకున్నా పాపది చీకు చింత లేని బాల్యం. ఇంటి ముందు గుర్రబ్బళ్లు ఉండబోవుగానీ, నాన్న శ్రీరామనవమికి రథం ఎక్కిస్తే, తనకంటే గొప్పవారు లేదనుకుంటుంది. తన ఇల్లు మూడుగదుల చిన్న ఇల్లయినా మీనాక్షి అమ్మవారి ఆలయంలోకి వచ్చిందంటే ఆ ఆలయం అంతా తనదే.

అమ్మ, నాన్న, అన్న, చెల్లి, మధుర మీనాక్షి, సంగీతం. ఇవే పాపలోకం.

ఆసుపత్రి మంచం మీద మళ్లీ, "అమ్మా, నాన్నా, అన్నా" అని కలవరించింది సుబ్బలక్ష్మి. తన బంగారు ఓడ సిద్ధమయింది. సుబ్బలక్ష్మి బయలుదేరింది. దూరం పోతున్నకొద్దీ గుండె, నాడి వేగం తగ్గుతూ ఉన్నాయి. బాగా తగ్గి సుబ్బలక్ష్మి కోమాలోకి వెళ్లింది.

సుబ్బలక్ష్మి తనకోసం వేచియున్న బంగారు ఓడ ఎక్కి వెళ్లిపోయింది. 88 ఏళ్ల సుదీర్ఘమయిన ప్రయాణం, 2004 డిసెంబర్ 11న, రాత్రి 11.30 నిమిషాలకు ముగిసింది. 88 ఉగాదులలో యుగాంతం వరకు నిలిచిపోయే యశస్సుని గడించింది.

ఆ రాత్రికే ఆసుపత్రి తరఫున చేయవలసిన లాంఛనాలు పూర్తి చేశారు కుటుంబ సభ్యులు. అప్పటికే తెలుసుకున్న అభిమానులు అర్ధరాత్రి అయినా ఆసుపత్రికి చేరుకున్నారు. కన్నీటితో, బాధతో చివరిసారిగా చూసుకొని వెళ్తున్నారు. తెల్లవారక ముందే కంచి పరమాచార్య బహూకరించిన శాలువా కప్పి, అభిమానులకి కడసారి దర్శన భాగ్యం



కలగచేయటానికి, సుబ్బలక్ష్మి పార్థివ శరీరాన్ని ఇంటి ముందు చిన్న వరండాలో అద్దాల పెట్టెలో ఉంచారు కుటుంబ సభ్యులు. తెల్లవారగానే ఆకాశం సన్నని జల్లు కురిపించింది. పైన దేవతల నివాళి అది. అవనిలోన అభిమానులందరూ వస్తున్నారు. "అమ్మా నువ్వు ఇంకొన్ని రోజులు మాతో ఉండి ఉంటే బాగుండేది" అని అనుకుంటున్నారు. భారత రాష్ట్రపతి అబ్దుల్ కలామ్ ఢిల్లీ నుంచి మధ్యాహ్నంకల్లా వచ్చేశారు. ప్రొద్దున నాలుగున్నర నుంచి సాయంత్రం నాలుగున్నర వరకూ ప్రజలు బారులుతీరి చివరిసారిగా చూసుకొని బరువైన హృదయాలతో వెళ్తున్నారు.

మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి, ఎప్పటిలానే ప్రశాంతమైన మోముతో శాశ్వత నిద్రలో ఉంది. పదమూడవ రామన్ మెగసెసె విజేతగానో, ముప్పైమూడవ భారతరత్నగానో, ముప్పైతొమ్మిదవ సంగీత కళానిధిగానో ప్రజలు ఈ సుబ్బులక్ష్మిని గుర్తుపెట్టుకోరు. వారి సొంత మనిషిగా, భగవదన్వేషణలో, సంగీత లక్ష్య సిద్ధి సాధనలో సుబ్బులక్ష్మి తోడుంటే బాగుంటుందనే నమ్మకంతో, ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆమె గొంతు మీటే స్వతంత్ర్యం ఇచ్చిన తమ మనిషిగా గుర్తుపెట్టుకుంటారు.

వేల సంఖ్యలో తనవారందరూ వెంటరాగా, ఈ భారతరత్నం భారత ప్రభుత్వ అధికార లాంఛనాలతో ఆఖరి ప్రయాణం కట్టింది. దారి పొడుగునా ప్రజలు , సంపూర్ణ శరణాగతి చేసిన సంగీత సామ్రాజ్ఞికి ప్రణమిల్లుతున్నారు.

మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి నిజమైన దాసి, నిజమైన దేవదాసి. తన జాతి ధర్మం పాటిస్తూ , పాటతో దేవదేవతలకు సేదతీర్చిన దేవదాసి.

ఆ సందెవేళలో అస్తమిస్తున్న సూర్యుడు సైతం కాసేపు ఆగి చూస్తున్నాడు. సుబ్బలక్ష్మి పవిత్రాత్మను అంటిపెట్టుకున్న శరీరం అగ్నికి ఆహుతి అవుతూ పంచభూతాలతో కలవనుంది.

చుట్టూ వున్నవారి గొంతులు ఆమె పాట వింటున్నప్పుడిలా పూడుకుపోయాయి.

మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి జీవితంలోని సుఖదుఃఖాలను, ఎత్తుపల్లాలను కలిమిలేములను, పొగడ్తలను, విమర్శలను ఒకేలా ఎంచి, పాటల పూదోటలో తపస్సుచేసి, ఆ తపోఫలాలని తనకంటే ఎక్కువగా ఎదుటివారికి పంచి ఇచ్చిన తపస్విని.

అదిగో, పూర్తిగా కనుమరుగైంది. అమ్మను ప్రేమగా పంపి, వెలితిగా వున్న హృదయాలతో వెనుతిరిగారు ప్రజలు. వారిలో ఒకరు, "తంబీ, అమ్మ చేత పాటలు పాడించుకోవటానికి తీసుకెళ్లారు దేవుళ్లు. ఇప్పుడుదా అక్కడికే వెళ్లింది."

"ఇక్కడే అక్కా, అమ్మ ముందు వాళ్ల అమ్మ దగ్గరకు వెళ్తుంది. ఆ తర్వాతే ఎక్కడికైనా."

"సరి సరి తంబీ అక్కడికే వెళ్లనీ."

వెళ్లిపోయింది మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి తన తల్లి షణ్ముగవడివు దగ్గరకు వెళ్లిపోయింది. ఎప్పటికీ వాడని పాటల పూదోటని మన కోసం వదలి వెళ్లిపోయింది. ఎప్పటికీ మరువలేని ఆమె జ్ఞాపకాలని మనకోసం ఉంచి వెళ్లిపోయింది.

నిన్ను కాంచిన వారి అదృష్టమే అదృష్టము.

నీతో మసలిన వారి పుణ్యమే పుణ్యము.

నీ పాట వినే భాగ్యం కలిగిన వారి భాగ్యమే భాగ్యము.

కుఱై ఒన్ఱుమ్ ఇల్లై మఱైమూర్తి కణ్ణా.

తల్లీ ఇక మాకు ఏ కోరికలూ లేవు.

నీ పాటలు విన్నందుకు, ఎప్పటికీ వినే భాగ్యం కలిగినందుకు ఇక మాకు ఎలాంటి కోరికలూ లేవు. నీవు ఎక్కడ ఉన్నా సుఖ సంతోషాలతో వర్ధిల్లు.

𝄞 𝄞 𝄞 𝄞





మదురై షణ్ముగవడివు సుబ్బులక్ష్మి



అమ్మ దగ్గర రాధ

నివాళులు అర్పిస్తున్న అప్పటి రాష్ట్రపతి అబ్దుల్ కలామ్





తన భక్తురాలికి తనచెంత శాశ్వత స్థానం
తిరుపతిలో సుబ్బలక్ష్మి విగ్రహం

తిరుపతిలో, తిరుపతి అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ వారు ప్రతిష్ఠించిన ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి విగ్రహానికి నివాళి అర్పిస్తున్న ఎమ్.ఎస్. ముని మనమరాళ్లు సౌందర్య, ఐశ్వర్య శ్రీనివాసన్, అభిమానులు

